శ్రీరస్తు.

# ఆముక్తమాల్యద

ఆంధ్రవ్యాఖ్యాన సహితము.



ఇది

వావిళ్ల, రామస్వామిశాస్త్రులు అండ్ సన్సువారిచే

ఆది సరస్వతీనిలయ ముద్రాక్షరశాలయందు

ముద్రింపించి ప్రకటింపఁబడియె.

తండియార్పేట, చన్నపట్నం.

(మూఁడవకూర్పు.)

1907.

శ్రీరస్తు.

# ఆముక్తమాల్యద - సవ్యాఖ్యానము.

## ప్రథమాశ్వాసము.

ఉ. శ్రీకమనీయ హార మణిఁ జెన్నగు దానును గౌస్తుభంబునం
దా కమలావధూటియు నుదారతఁ దోఁపఁ బరస్పరాత్మలం
దాకలితంబులైన తమయాకృతు లచ్ఛతఁ బైకిఁ దోఁప
నస్తోకతనందుఁదోఁచె నన శోభిలు వేంకటభర్తఁ గొల్చెదన్. ౧.

టీక. శ్రీకమనీయహారమణిన్ — శ్రీ = లక్ష్మియొక్క, కమనీయ = మనోహరంబగు, హార = హారమందలి, మణిన్ = రతనమునందు, చెన్నగు = ఒప్పుచున్నట్టి, తానును = వేంకటభర్తయును, కౌస్తుభంబునందున్ = కౌస్తుభమణియందు, ఆకమలావధూటియును = ఆలక్ష్మీదేవియును, ఉదారతన్ = అతిశయమౌటచేత, తోఁపన్ = ప్రతిబింబింపఁగా, పరస్పరాత్మలందున్ = ఒకరొకరిమనంబులందు, ఆకలితంబులైన = ప్రేమాతిశయముచేనిలిచిన, తమ = తమయిద్దఱియొక్క, ఆకృతులు = ఆకారములు, అచ్ఛతన్ = శరీరస్వచ్ఛతచేతను, పైకిఁదోఁపన్ = బహిఃప్రకాశములుగాఁగా, అస్తోకతన్ = ఆధిక్యముచేత, అందున్ = ఆరత్నములందు, తోఁచెన్ = కానవచ్చెను. అనన్ = అనునట్లుగ, శోభిలు = లక్ష్మితోఁ బ్రకాశింపుచున్న, వేంకటభర్తన్ = వేంకటేశుని, కొల్చెదన్ = సేవించెదను.

తా. లక్ష్మీదేవియొక్క సుందరమగు హారమణియందు వేంకటేశుండును, నతని కౌస్తుభమందాలక్ష్మియునుం బ్రతిబింబింపఁగాఁ బరస్పరమనంబులందుఁ బ్రేమాతిశయముచేత నిలిచియున్న తమ యిద్దఱి యాకారములును శరీరము స్వచ్ఛమౌటచేత బహిఃప్రకాశములై యారత్నములందుఁగానవచ్చెనన్నట్లు విలసిల్లుచున్న వేంకటేశుని సేవించెదననుట. ఇందు శ్రీమహావిష్ణువు లక్ష్మియు నొండొరుల వక్షస్స్థలములందలి నాయకరత్నములందుఁ బ్రతిఫలించినట్లు వర్ణించుటవలన నీప్రబంధమందు వక్ష్యమాణమైన యాముక్తమాల్యదారంగనాయకపరిణయసముచితపరస్పరాభిముఖావస్థితి వ్యంగ్యమర్యాదచేతఁ దోఁచుచున్నది. (ఈపద్యమందు శ్రీపతి లక్ష్మీదేవుల నిద్దఱను వర్ణించి పద్యాంతమందు వేంకటేశునిమాత్రమే గ్రహించుటకు నభిప్రాయము.) 'యతో హరి స్తతో లక్ష్మీ' యనియు, 'విష్ణోరేషానపా

యినీ'యనియు, 'వాగర్థావివసంపృక్తౌ'యనియు, 'శ్రియందేవీంనిత్యానపాయినీ'మనియు 'అనన్యారాఘవేణాహం భాస్కరేణప్రభాయథా'యనియు, 'అర్థోవా ఏష ఆత్మనోయత్పత్నీ'యనుశ్రుతియు నివిమొదలగు ప్రమాణముల యర్థమును బర్యాలోచింపఁగా భగవంతుని దేహమును విడిచి లక్ష్మియుండదని తెలియవచ్చుచున్నది. ప్రబంధముల మొదటఁ బ్రాయికముగ మగణసిద్ధ్యర్థముఁ శార్దూలవిక్రీడితవృత్తము ప్రయోగించుట తఱుచుగాఁ గలిగియున్న నీగ్రంథకర్త యుత్పలమాలావృత్తము ప్రయోగించుటవలన నాముక్తమాల్యద యుత్పలమాలాసమర్పణము చేయుటచేత భగవన్ముఖోల్లాసముకలిగిన కథ రచింపఁ గలవాఁడై తాను నుత్పలమాలికావృత్తరూపమైన వాక్కుసుమదామమును సమర్పించె నని తోఁచుచున్నది.

మఱియు,

'తే.గీ. వేదముల కెల్ల నోంకార మాది యైన, కరణిఁ గృతులకు నెల్ల శ్రీకార మాది, గానఁ గవివరు లెల్లను దానిఁ దక్క, నితర వర్ణంబు లిడరు సత్కృతుల మొదల'నన్నట్లు. మహాకవి యగు నీగ్రంథకర్తచే శ్రీశబ్దమీసత్కృతి మొదలం బ్రయోగింపంబడినది; కాన వర్ణగణాదిశుద్ధులునుగలవు. 'దేవతావాచకాశ్శబ్దాయేచభద్రాదివాచకాః । తేసర్వేనైవనిన్ద్యాస్స్యుర్లిపితోగణతోపివా' యనునది ప్రమాణ మిదియునుంగాక దీనియందు విశిష్టదేవతానమస్కారరూపమంగళమును జేయంబడినది. 'ఆశీర్నమస్క్రియావస్తునిర్దేశోవాపితన్ముఖ' మనునది ప్రమాణము.

మ. సిరి నొక్కప్పుడు గన్గొంగి హరి దన్జేర న్బ్రహర్షించు ను
ర్వరకు న్వంచనఁ గూడఁగాఁ గలుగు భాస్వచ్చంద్రశాలాపరం
పరలయ్యె న్బటుపైన యెవ్వని ఫణాపఙ్క్తుల్ భజింతు న్నిరం
తరముం దాంతుని నయ్యనంతుని నతీతబ్రహ్మకల్పాంతునిన్. ౨.

టీక. పటుపైనయెవ్వనిఫణాపఙ్క్తులు:—పటుపైన = విశాలములగు, ఎవ్వని = యే శేషునియొక్క, ఫణాపఙ్క్తులు = పడగలబంతులు, హరి = స్వామి, ఒక్కప్పుడు = ఒకసమయమున, సిరిన్ = లక్ష్మిని, కన్గొంగి = కికురించి, తన్ = తన్ను, చేరన్ = కదియఁగా, ప్రహర్షించు = కడుఁబ్రీతినొందుచున్న, ఉర్వరకున్ = భూమికి ॥ ని. ॥ 'ఉర్వరాసర్వసస్యాఢ్యా,' యని యమరము. వంచనన్ = వంచనచేత, కూడఁగాన్ = పొందఁగా, (గుప్తక్రీడఁజేయునిమిత్తమనుట) (వేడుకగూడఁగానన్న పాఠమున సంతోషముతోఁబొందననుట), కలుగు = సిద్ధించినట్టి, భాస్వత్ = ప్రకాశించుచున్న, చంద్రశాలా = ఉప్పరిగలయొక్క, పరంపరలు = గుంపులు, అయ్యెన్ = ఆయెనో. దాంతున్ = ఇంద్రియనిగ్రహముగలయాతనియు, అతీత = అతిక్రమింపఁబడిన, బ్రహ్మక

త్యాంతునిన్ = బ్రహ్మప్రళయములుగల, అయ్యనంతునిన్ = ఆశేషుని, నిరంతరమున్ = ఎల్లప్పుడును, భజింతున్ = కొల్చెదను॥ ని॥ 'చంద్రశాలాశిరోగృహమ్,' యనియు, 'శేషోనంత,' యనియు నమరము.

తా. ఎల్లప్పుడుఁ దన్నెడబాయకుండెడి లక్ష్మిని స్వామి యొకసమయమున మఱుఁగు పఱిచి కదియఁగా నా శ్రీహరితో గుప్తక్రీడ సేయఁదలఁచిన భూదేవికి నెవ్వనియొక్క విశాలంబులైన పడగలు మేడలచాళ్లాయెనో, నిత్యుఁడై యింద్రియనిగ్రహముగల వాఁడైన యాశేషుని నిరంతరము సేవించెదననుట.

సీ. ఖ నటత్పయోబ్ధి వీక్ష్య రసాతలాన్యోన్య పిండీకృ తాంగ భీతాండజములు
ధృత కులాయార్థ ఖండిత సమి ల్లవ రూప చరణాంతికభ్రమ త్తరుసరములు
ఘన గుహా ఘటిత ఝూంకరణ లోకైక ద్వి దుందుభీకృత మేరు మందరములు
చటుల ఝుంపాతర స్స్వ నగరీ విపరీత పాతితాశాకోణ పరిబృఢములు
ప్రబలతర బాడబీకృ తెరమ్మదములు, భాస్వరేరమ్మదీకృత బాడబములు
పతగ సమాశ్రిత్పతత్త్ర ప్రభంజనములు, వృజినతూలౌఘములఁ దూల విసరు గాత. 3.

టీక. ఖ = ఆకసమందు, నటత్ = ఆడుచున్న, పయః = ఉదకముగల, అబ్ధి = సముద్రములయందు, వీక్ష్య = చూడఁదగిన, రసాతల = పాతాళమందు, అన్యోన్య = ఒకటితోనొకటి, పిండీకృత = ముద్దలుగాఁజేయఁబడిన, అంగ = అవయవములుగలవై, భీత = భయపెట్టబడిన, అండజములు = సర్పములుగలవియు, (అనఁగా గరుడుని ఱెక్కలగాలిసోకుటచేత సముద్రమునందలినీళ్లాకాశమునకెగసిపోఁగాఁ బాతాళద్వారము బట్టబయలై కనుపడఁగా నచట పాములు తమకుఁ బక్షిరాట్టు నిత్యశత్రుఁడౌటచేత భయపడి యొండొరులఁ గఱచికొని ముద్దలుగానణఁగియుండెననుట) ధృత=ధరియింపబడిన, కులాయార్థ=గూఁటికొఱకు॥ ని॥ 'కులాయోనీడమ స్త్రియామ్,' అని యమరము. ఖండిత= విఱువఁబడిన, సమిత్ = సమిధలయొక్క, లవ = లేశములయొక్క, రూప = ఆకారములుగల, చరణ = గరుడునిపాదములకు, అంతిక = సమీపమందు, భ్రమత్ = తిరుగుచున్న, తరుసరములు = పెనుమ్రాఁకులుగలవియును, అనఁగా ఱెక్కలగాలిచేత గొప్పమ్రాఁకులు పెల్లగిలి యతనిపాదములవెంబడి సుడిగొనిపోఁగా గరుత్మంతుఁడు పక్షియగుటంజేసి గూఁటినిమిత్తమై కాళ్లనితికికొనిపోవు సన్నకట్టియలవలెఁగనబడె ననుట.) ఘన = గొప్పలైన, గుహా = గుహలయందు, ఘటిత = చేర్పఁబడిన, ఝూంకరణ = ఝూంకారముచేత, లోక = లోకములకు, ఏక = ముఖ్యముగా, ద్విదుందుభీకృత = రెండుభేరులుగాఁజేయఁబడిన, మేరుమందరములు = మేరుమందరపర్వతములుగలవియును, (అనఁగా ఱెక్కలవాయువులు పర్వతగుహలలోఁ జొచ్చఁగా నప్పు

డాపర్వతములు మారుమొరయ లోకములకెల్ల వినునట్లు శబ్దించు రెండుమందుభులో యని తోఁచుచున్నవనుట.) చటుల = చంచలమగు, ఘుంపా = సుడియుటయొక్క, తరః = వేగముచేతను, స్వ = తమయొక్క, నగరీ = పట్టణములనుండి, విపరీత = వ్యత్యస్తమగునట్లు, పాతిత = త్రోయఁబడిన, ఆశాకోణ = దిక్కోణములయొక్క, పరిబృఢములు = ప్రభువులుగలవియు, (గాడ్పులు వేగముగావిసరుటచేతను దిక్కులయొక్కయు మూలలయొక్కయుఁ బాలకులు తమతమపట్టణములయందు నిలుచుటకు వలనుగాక త్రోపువడి మఱియొకదిక్కునకు వేఱువేఱఁబఱచిరనుట.) ప్రబలతర = మిక్కిలి ప్రబలములగు, బాడబీకృత = బడబాగ్నులుగాఁజేయబడిన, ఇరమ్మదములు = మెఱుపులుగలవియు,(మేఘములతోడ మెఱుపులను మింటనుండి సముద్రములలోనఁ గూలఁ ద్రోయుననుట.) భాస్వర = ప్రజ్వలించుచున్న, ఇరమ్మదీకృత=మెఱుపులుగాఁజేయఁబడిన, బాడబములు = బడబాగ్నులుగలవియు, (సముద్రములయందలి బడబాగ్నులను మింటికెగయఁజిమ్ముననుట.) ఇట్టిదైన, పతగసమ్రాట్-పతగ=పక్షులకు, సమ్రాట్ = ప్రభువగుగరుత్మంతునియొక్క, పతత్ర = ఱెక్కలవలని, ప్రభంజనములు = వాయువులు, వృజిన = పాపములనియెడి, తూల = దూదిపింజెలయొక్క, ఓఘములన్ = గుంపులను, తూలన్ = తూలిపోవునట్లు, విసరుఁగాత = వీచుఁగావుతన్. (అట్టి మహాబలము గల గరుత్మంతుని ఱెక్కల వలని గాడ్పులు నాపాపము లనియెడు దూదిపింజెలను జెదరిపోవునట్లు వీచుఁగాక యని గ్రంథకర్త ప్రార్థన సేయుచున్నాఁడు).

ఉ. పూని ముకుందు నాజ్ఞఁ గను బొమ్మనె కొంచి యజాండ భాండము
ల్వానను మీఁదఁ బోవనడవ న్గొనెఁ దన్నన నగ్రనిశ్చల
త్వానుచలత్వనిష్ఠలె సమస్త జగంబుల జాడ్యచేతన
ల్గా నుతికెక్కు సైన్యపతి కాంచనవేత్రము నాశ్రయించెదన్. ౪.

టీక. ముకుందునాజ్ఞన్ = నారాయణునియాజ్ఞను, కనుబొమ్మనె = భ్రూసంజ్ఞచేతనే, కొంచి = గ్రహించి, పూని = ప్రయత్నపడి, అజాండభాండముల్-అజాండ= బ్రహ్మాండములనియెడు, భాండముల్ = కుండలను, వానను = రూపుగలవిగాఁజేయుటకొఱకును, మీఁదన్ = ప్రళయమందు, పోవనడవన్ = పోవునట్లడచుటకొఱకును, తన్నన్ = తన్ను, (అనఁగా వేత్రముననుట.) కొనెననన్ = గ్రహియించెననఁగా, అగ్రనిశ్చలత్వానుచలత్వనిష్ఠలె-అగ్ర = తనచివరయొక్క, నిశ్చలత్వ = కదలకుండుటయొక్కయు, అనుచలత్వ = కదలుటయొక్కయు, నిష్ఠలె = నియమములే, సమస్తజగంబుల = ఎల్లజగత్తులయొక్క, జాడ్యచేతనల్-జాడ్య=లయమొందుటయు, చేతనల్ = తెలివొందుటయును, కాన్ = కాఁగా, నుతికెక్కు = స్తుతింపఁబడుచున్న,

సైన్యపతి = సేనానాయకునియొక్క, (అనఁగా విష్వక్సేనునియొక్క) కాంచనవేత్రము = బంగారుబెత్తమును, ఆశ్రయించెదన్ = భజించెదను.

తా. విష్వక్సేనుఁడు భగవత్కార్య ధూర్వహుఁడు గనుక భగవదభిప్రాయానుగుణముగ లీలావిభూతి యగు ప్రపంచమునకు స్థితిసంహారములఁ గావింపఁ బూనఁగాఁ గులాలదండము ఘటాదులకుఁ గారణమైనట్లే విష్వక్సేనుని వేత్రము బ్రహ్మాండములకుఁ గారణమైనదనియు నా వేత్రాగ్రహము గదలనియపుడు లోకవ్యాపారము లేదనియుఁ గదలినప్పుడు లోకవ్యాపారము గలదనియును భావము.

మ. హరి పూరింపఁ దదాస్య మారుత సుగంధాకృష్టమై నాభిపం
కరుహక్రోడమిళిందబృంద మెదురెక్కం దుష్క్రియాపంక సం
కర దైత్యాసు పరంపరం గముచు రేఖం బొల్చు రాకా నిశా
కర గౌర ద్యుతి పాంచజన్య మొసఁగుం గళ్యాణ సాకల్యమున్. ౫

టీక. హరి = నారాయణుఁడు, పూరింపన్ = ఒత్తఁగాన్, తదాస్యమారుతసుగంధాకృష్టమై—తత్ = ఆహరియొక్క, ఆస్య = ముఖమందలి, మారుత = వాయువుయొక్క, సుగంధ = మంచిపరిమళముచేతను, ఆకృష్టమై = ఆకర్షింపఁబడినదై, నాభిపంకరుహక్రోడమిళిందబృందము—నాభి = బొడ్డుటియందలి, పంకరుహ = కమలముయొక్క, క్రోడ = మధ్యమందలి, (నవాక్రోడం భుజాంతరమనియున్నను లక్షణచేత నిచట క్రోడశబ్దమునకు మధ్యప్రదేశమర్థము.) మిళింద = తుమ్మెదలయొక్క, బృందము = సమూహము, ఎదురెక్కన్ = ముఖమారుతమునకెదురురాఁగా, దుష్క్రియాపంకసంకరదైత్యాసుపరంపరన్—దుష్క్రియా = దుష్కార్యములవలని, పంక = పాపములతోడ, సంకర = కూడుకొన్న, దైత్య = రాక్షసులయొక్క, అసు = ప్రాణములయొక్క, పరంపరన్ = పఙ్క్తిని, కముచు = ఆకర్షించెడు, రేఖన్ = రీతిచేతను, పొల్చు = ఒప్పుచున్న, రాకానిశాకరగౌరద్యుతి—రాకా = నిండుపున్నమపాఁటి, నిశాకర = చందురునివలెను, గౌర=ధవళమగు, ద్యుతి = కాంతిగల, పాంచజన్యము = హరిశంఖము, కల్యాణసాకల్యమున్—కల్యాణ = మంగళములయొక్క, సాకల్యమున్ = సమృద్ధిని, ఒసఁగున్ = ఇచ్చును.

తా. శ్రీపతి పాంచజన్యమును బూరించునప్పుడాహరి ముఖవాయువు దివ్య సుగంధము గలిగి వాసించుటవలన నాభికమలమందున్న తుమ్మెదల గుంపచ్చోటు వదలి యక్కమలవాసనకంటె మిగుల సొగయఁజేయు మొగము తావికెగయుచున్నప్పుడు శత్రుజనంబుల హృదయ విదారణంబగు నాదంబునకుం బాదగు శంఖంబు దుష్టులగు రక్కసుల మలీమసంబులగు నసువులఁ బీల్చుచున్నదో యన్నట్లుండెనని భావము.

మ. ప్రతతోర్ధ్వాధరభాగ పీఠ యుగళీ భాస్వత్త్సరు స్తంభ సం
స్థితిఁ దీంద్రించెడు జాళువా మొసలివా దీప్తార్చిగా కజ్జలా
న్వితధూమాసిత రేఖ పైయలుగుగా విజ్ఞాన దీపాంకురా
కృతి నందం బగు నందకం బఘ లతా శ్రేణిచ్ఛిదం జేయుతన్. ౬

టీక. ప్రతత = విస్తీర్ణములగు, ఊర్ధ్వాధరభాగ=మీఁదిక్రిందిప్రదేశములయందలి, పీఠ = పీఠములయొక్క, యుగళీ = ద్వంద్వమునందు, భాస్వత్ = ప్రకాశించెడి, త్సరు = పిడికిటిపట్టనియెడు, స్తంభ = కంబమందు, సంస్థితిన్ = ఉనికి చేతను, తీంద్రించెడు = వెలుంగుచున్న, జాళువా = స్వర్ణమయమైన, మొసలివా = మకరవక్త్రమను, ఖడ్గాంగవిశేషము. దీప్తార్చిగా—దీప్త = ప్రజ్వరిల్లుచున్న, అర్చిగా = జ్వాలగాఁగా (అర్చిర్హేతిశ్శిఖా స్త్రియా మని యమరము.) పైయలుగు = మొన, కజ్జలాన్వితధూమాసితరేఖగా—కజ్జల = కాటుకతోడను, అన్విత = కూడికొనిన, ధూమ = పొగయొక్క, అసిత = నల్లనైన, రేఖగా = గీటుగాఁగా, (ఇచ్చటనర్థక్రమంబున నన్వయము.) విజ్ఞానదీపాంకురాకృతిన్—విజ్ఞానదీప = జ్ఞానదీపముయొక్క, అంకుర = మొలకయొక్క, ఆకృతిన్ = ఆకారములచేతను, అందంబగు = సుందరమైన, నందకంబు = విష్ణుఖడ్గము, అఘలతాశ్రేణిచ్ఛిదన్—అఘ = పాపములనియెడు, లతా = తీఁగలయొక్క, శ్రేణి = పఙ్క్తులయొక్క, ఛిదన్ = ఛేదనమును, చేయుతన్ = చేయుగాఁత.

తా. నందక మను విజ్ఞానదీపమునకుఁ బరుజు దీపస్తంభమనియును, బంగారుమొసలివాయి దీపకళిక యనియును, నలుగుదీపపుఁ గోడి యనియును భావము.

ఉ. యాదవ సార్వభౌమ భయదాయత బాహునియుక్తిఁ జేసి యం
దే దనుజేంద్ర సాళ్వపుర హేమమణీవరణంబు సంగతం
బై దివి నాత్మ కంకణములం దొక కంకణమయ్యె నట్టి కౌ
మోదకి మోదకీలిత సముజ్జ్వల కల్పకమాల్యఁ గొల్చెదన్. ౭

టీక. యాదవ = యదువంశజులకు, సార్వభౌమ = రాజైనకృష్ణునియొక్క, భయద = భయంకరమైన, ఆయత = పొడవైన, బాహు = భుజముయొక్క, నియుక్తిఁజేసి = పనుచుటచేత, (బాహువుచేఁ బ్రయోగింపబడుటవలన నని యర్థము.) ఎందేని = ఏయాకాశమందు సంచరించుచున్న గదయందు, (ఇచట నపిశబ్దార్థకంబగు నేని శబ్దము వికారమునకు వైకల్పికలోపంబనియెఱుంగునది.) దనుజేంద్ర = రాక్షసవరుండైన, సాళ్వ = సాళ్వుఁడనువానియొక్క, పుర = పట్టణముయొక్క, హేమ = స్వర్ణమయమును, మణీ = రత్నమయమునగు, వరణంబు = కోట, (ప్రాకారోవరణస్సాల

దానింజేసితివి నాకుఁ బిడికెడు కాను గొప్పను విశేషించి గుణమునున్నది కాఁబట్టి స
న్నును జక్కని దానిం జేసి రక్షింపుమని శరప్రయోగ సమయమందు సవ్రమమై యావిల్లు
మ్రొక్కుచున్నదన్నట్లుండె నని తాత్పర్యము.

చ. అడరు గళాస్రధారలు మహాముఖ వాంత సుధాంబుధారలు
న్నొడవగు వహ్నికీలములు పొంగునుగాఁ బెఱ దైత్య కోటికి
న్బెడిదపుఁ గిన్కతో నెసరు వెట్టిన పెద్ద పసంటి వోలె నె
క్కుడు వెస రాహు మస్తకము గొన్న సుదర్శన దేవుఁ గొల్చెదన్. ౯.

టీక. అడరు = ప్రస్ఫుటమగుచున్న, గళ = కంఠముయొక్క, అస్రధారలు = రక్తధారలు, మహాముఖ = వెడదనోరివలన, వాంత = వెడలఁగ్రక్కఁబడిన, సుధాంబుధారలున్ = అమృతోదకధారలును, పొడవగు = దీర్ఘములగు, వహ్నికీలములు = అగ్నిజ్వాలలు, పొంగునుగాన్ = ఎసటిపొంగునుగాఁగా, పెఱ=ఇతరమయిన, దైత్యకోటికిన్ = రాక్షససమూహమునకు, బెడిదపుఁగిన్కతోన్ = తీక్ష్ణకోపముతో, ఎసరువెట్టినపెద్దపసంటివోలెన్ = ఎసరెక్కించినపెద్దకుండవలె, ఎక్కుడువెస = అధికవేగముచేతను, రాహుమస్తకమున్ = రాహువనురాక్షసునిశిరమును, కొన్న = గ్రహించిన, సుదర్శనదేవున్ = విష్ణుచక్రమనుదేవుని, కొల్చెదన్ = సేవించెదన్.

తా. తొల్లి రాహు వను రాక్షసుఁడు మాయచేత దేవతావేషధారియై యమృతము గుడుచునప్పుడు విష్ణుదేవుండెఱింగి తన సుదర్శనముచే వానిశిరంబుఁద్రుంచినప్పుడు కంఠమునుండి వెడలెడు రక్తధారలడుగునమండెడుమంటలుగాను నమృతమును మ్రింగకమునుపే తునిసెను. గావున నాయమృతము మఱల నోటఁ గ్రక్కుచుండ నదియె కుండపయి పొంగుగాఁగానంబడుచుండెను గాన నప్పుడాశిరస్సు ప్రొయ్యిమీఁద నెసరుపెట్టిన పెద్దపంటివలెనుండె నని భావము.

మ. అల పన్నిద్దఱు సూరులందును సముద్యల్లీలఁ గాపున్న వె
గ్గలపుం దాపముఁ బాపనా నిజమనఃకంజాతసంజాతపు
ష్కలమాధ్వీకఝురిన్మురారి సొగియంగాఁ జొక్కి ధన్యాత్ము లౌ
నిల పన్నిద్దఱుసూరులం దలఁతు మోక్షేచ్ఛామతిం దివ్యులన్. ౧౦.

టీక. అలపన్నిద్దఱుసూరులందును = ఆ ప్రసిద్ధులగు ద్వాదశాదిత్యులయందును, (సూర్యమండలము నారాయణస్థానమని శ్రుతిప్రసిద్ధము.) సముద్యల్లీలన్ = ఒప్పుచున్న విలాసముచేతను, కాపున్న వెగ్గలపుందాపమున్ = నివసించుటచేనైనయధికతాపమును, పాపనాన్ = పోఁగొట్టుటకొఱకనునట్లుగా, నిజ = స్వకీయములగు, మనః = మనస్సులనియెడు, కంజాత=కమలములయందు, సంజాత = పుట్టినట్టియు, పుష్కల=సమృద్ధ

మగు, మాధ్వీక = మకరందముయొక్క, ఝరిన్ = ప్రవాహముచేతను, మురారి = హరి, సొగియంగాన్ = సుఖింపఁగా, చొక్కి = ఆనందించి, ధన్యాత్ములౌ = కృతార్థులయిన, ఇలపన్నిద్దఱసూరులన్ = భూమియందలి పన్నిద్దరైన యాళువారులను, దివ్యులన్ = దేవతామూర్తులగువారిని, మోక్షేచ్ఛాపమతిన్ = మోక్షాభిలాషముగలమనస్సుచేతను, తలఁతున్ = సంస్మరించెదన్.

తా. నారాయణుఁడు సూర్యమండల మధ్యవర్తియగుటం జేసి యాసూర్యసంబంధమగు తాపమును బోఁగొట్టుకొనుటకై భూమియందుఁ బన్నిద్దఱాళువారులై యవతరించిన మహాత్ముల మనఃపద్మములయందుఁ జేరి వసించి సుఖించె ననియును, పన్నిద్దఱాళువారులు ద్వాదశాదిత్యులకంటెఁ బరిశుద్ధులయి తమ యంతరంగములయందు నారాయణు నిలుపుకొని యాస్వామి శరీరతాపము నడంచి సుఖపెట్టి తా మానందించువా రనియును భావము. ఫలోత్ప్రేక్ష.

వ. అని యిష్ట దేవతాప్రార్థనంబుఁ జేసి మున్నే కళింగదేశ విజిగీషా మనీషం దండెత్తిపోయి విజయవాటిం గొన్ని వాసరంబు లుండి శ్రీకాకుళనికేతనుండగు నాంధ్రమధుమథను సేవింపం బోయి హరివాస రోపవాసం బచ్చటఁ గావింప నప్పుణ్యరాత్రి చతుర్థ యామంబున. ౧౧.

టీక. అని = ఇట్లుప్రియదేవతాప్రార్థనముఁజేసి, మున్నే = పూర్వమే, కళింగదేశ = కళింగమను దేశముయొక్క, విజిగీషా = విజయముఁజేయవలయుననునిచ్ఛగల, మనీషన్ = బుద్ధిచేతను, దండెత్తిపోయి = దండయాత్రదరలి, విజయవాటిన్ = బెజవాడయందు, కొన్నివాసరంబులుండి = కతిపయదినంబులునివసించి, శ్రీకాకుళనికేతనుండగు = శ్రీకాకుళమనియెడుపుణ్యక్షేత్రము గృహముగాఁగల, ఆంధ్రమధుమథనుని = తెలుఁగువల్లభరాయఁడను పేరుగల హరిని, సేవింపఁబోయి = భజింపనేగి, హరివాసరోపవాసంబు = ఏకాదశీవ్రతోపవాసము, అచ్చటన్ = ఆశ్రీకాకుళమందు, కావింపన్ = చేయఁగా, అప్పుణ్యరాత్రిచతుర్థయామంబున = ఆపుణ్యరాత్రియొక్క నాలుగవజామునందు.

తా. సులభము.

సీ. నీలమేఘముడాలు డీలు సేయఁగఁజాలు మెఱుఁగుఁ జామన చాయ మేని తోడ
నరవిందముల కచ్చు లడఁగించు జిగి హెచ్చు నాయతంబగు కన్ను దోయి తోడఁ
బులుఁగురాయని చట్టుపల పన్నె నొఱఁబట్టు హొంబట్టు జిలుఁగు రంటెంబు తోడ
నుదయార్కబింబంబు నొఱపు విడంబంబు దొరలంగ నాడు కౌస్తుభము తోడ

దమ్మి కేలుండఁ బెఱ కేల దండ యిచ్చు, లేమ లుడిపెడు లేఁజూపు లేమ తోడఁ
దొల్కు దయఁ దెల్పు చిఱునవ్వుతోడఁ గలఁ ద దంధ్ర జలజాక్షుఁ డిట్లని యానతిచ్చె.

టీక. నీలమేఘము డాలు = నల్లని మేఘముల కాంతిని, డీలుసేయఁగన్ = బలహీనముఁ జేయుటకు, చాలు = సమర్థమగు, మెఱుఁగుఁజామనచాయ = స్నిగ్ధమైనిగనిగలాడు చామనచాయగల, మేనితోడ = శరీరముతోడను, అరవిందముల = తామరపువ్వులయొక్క, కచ్చులు = గర్వములను, అడఁగించు = తక్కువచేయు, జిగిన్ = కాంతిచేతను, హెచ్చు = అతిశయించుచున్న, ఆయతంబగు = నిడువాలికయగు, కన్నుఁదోయితోడ = నయనయుగళముతోడను, పులుఁగురాయని చట్టుపలవన్నెన్ = పక్షీంద్రుఁడనుగరుత్మంతుని ఱెక్కలవర్ణమును, ఒఱఁబట్టు = ఒఱయికఁ జేసెడు, హొంబట్టు = బంగారుపట్టుగలిగిన, జిలుఁగు = సన్నపునేతగల, ఠంటెంబుతోడ = వస్త్రముతోడను, ఉదయార్కబింబంబు = బాలసూర్యబింబముయొక్క, ఒఱపు = ఒప్పిదముయొక్క, విడంబంబు = సామ్యమును, తొరలంగనాడు = తూలనాడెడు, కౌస్తుభము తోడ = కౌస్తుభమనియెడురత్నముతోడను, తమ్మికేలుండన్ = పద్మముఁబట్టినహస్తము ఉంటఁగా, పెఱకేల = ఇతరహస్తముచేతను, దండయిచ్చు = కైదండయిచ్చెడు, లేమ లుడిపెడు = దారిద్ర్యధ్వంసకమగు, లేఁజూపు = లేతచూపుగల, లేమతోడ = తరుణియగులక్ష్మీదేవితోడను, తొల్కు = తరంగితమగు, దయన్ = కృపను, తెలుపు = ఎఱిగించెడు, చిఱునవ్వుతోడ = మందస్మితముతోడను, కలన్ = స్వప్నమునందు, ఆంధ్రజలజాక్షుఁడు = అల్ల తెలుఁగువల్లభరాయఁడు, ఇట్లని = వక్ష్యమాణప్రకారముగా, ఆనతిచ్చె = సెలవొసంగెన్.

తా. గ్రంథకర్త నిద్రించుచుండఁగా స్వప్నమందు నల్లని శరీరచ్ఛాయ గలిగి, తామర రేకులం దిరస్కరించెడు కన్నులుఁ గలిగి, యురంబునం గౌస్తుభ మాణిక్యంబు గలిగి, తన పార్శ్వమందు నిలిచి లక్ష్మీదేవి యొక చేతఁ గమలంబును, రెండవ చేతఁ దన హస్తంబునం గీలించి యుండఁ జిఱు నగవుల యందే తనసం గల దయ దెలియు చుండ నా యాంధ్ర వల్లభస్వామి కనుపడి పలికె నని భావము.

సీ. పలికితి వుత్ప్రేక్షోపమల జాతి పెంపెక్క రనిశ తావన మదాలస చరిత్ర
భావ ధ్వని వ్యంగ్య సేవధి గాఁగఁ జెప్పితివి సత్యావధూ ప్రీణనంబు
శ్రుతి పురాణోపసంహిత లేర్చి కూర్చితి సకల కథా సార సంగ్రహంబు
శ్రోత్రఘనచ్ఛటలు విచ్చుగ రచించితి సూక్తి నైపుణీ జ్ఞాన చింతామణికృతి
ఖ్యాతియు రసమంజరీ ముఖ్య మధుర కావ్య రచన మెప్పించి కొంటి గీర్వాణ భాష

నేను, మును = తొల్త, తాల్చిన = ధరించిన, మాల్యమిచ్చు = దండను సమర్పించిన, ఆ
ప్పిన్నది = ఆచిన్నది, (చూడికుడుత్తనాంచారనుట). రంగమందు = శ్రీరంగమందు, ఆ
యిన = చేసికొనిన, పెండిలి = వివాహమును, చెప్పుము = రచింపుము. మున్ను = పూ
ర్వమందు, ననదండ = పుష్పమాలికను, ఒక్కమగవాఁడిడఁ = ఒక్కపురుషుఁడీఁగా,
ఏవఁ = అసహ్యతచేతను, కొంటిమి = గ్రహించితిమి. నేను దెలుంగురాయఁడఁ =
నేను దెలుఁగువల్లభరాయఁడను. కన్నడరాయ = ఓకర్ణాటరాజా, ప్రియాపరిభుక్తభా
క్కథఁ – ప్రియా = ప్రియురాలిచేతను, పరిభుక్త = లెస్సయనుభవింపఁబడిన మాల్య
మును, భాక్ = పొందిన రంగమన్నారుస్వామియొక్క, కథఁ = కథచేతను, అక్కొ
దువఁ = అట్టితక్కువను, కప్పుము = ఆచ్ఛాదింపుము.

తా. శ్రీరంగనాయకార్చావతారములలో నేయర్చావతారము వహించిన
నిన్ను నా గ్రంథమునందుఁ గూర్తునంటివేని వినుము. నేనును పూలదండలను దొలుతఁ
దానే ధరించి పిమ్మట యవి నాకు సమర్పించిన చిన్నది యగు చూడికుడుత్తనాంచారని
యెడు పొలఁతియు శ్రీరంగమందుఁ బెండ్లాడిన కథను జెప్పుమనియును, పూర్వము కృ
ష్ణావతారమందు నొక పురుషుఁ డగు మాలాకారుఁ డొసంగిన పుష్పమాలికను మే మిష్టము
లేక గ్రహించియున్నాము గావున నట్టి కొఱంత దీఱునట్లు ప్రియురాలు మున్ను దా నను
భవించి పిదప నొసంగఁగాఁ బ్రీతిచేత గ్రహించి యా దండను బూనుకొన్న వాఁడగు
రంగమన్నారుల కథఁ జెప్పుమనియును, దానివలనఁగాని పురుషదత్త మాల్యధారణమను
కొచ్చెము వదలదనియును భావము. మతాంతరమందు మగవాఁడన్న యెడ విష్ణుచిత్తుండని
యన్వయించి తత్సమర్పిత మాల్య మిష్టములేక గ్రహింపఁబడినట్లును, అక్కొఱంతను ప్రి
యాపరిభుక్తభాక్కథచేత నాచ్ఛాదింపుమనిన ట్లూహించినవిధంబునం గానఁబడుచున్నది.

ఆ. తెలుఁగ దేల నన్న దేశంబు దెలుఁ గేను
దెలుఁగు వల్లభుండఁ దెలుఁ గొకండ
యెల్ల నృపులు గొలువ నెఱుఁగ వే బాసాడి
దేశ భాషలందుఁ దెలుఁగు లెస్స. ౧౫.

టీక. తెలుఁగదేలనన్న = తెనుఁగుకావ్యమేలనంటివేని, దేశంబు = తెలుఁగు,
ఏను = నేను, తెలుఁగువల్లభుండను = తెలుఁగురాయఁడను, తెలుఁగొక్కటియే, (అనఁ
గా నది వింతగాదనుట). ఎల్లనృపులుగొలువఁ = సకలరాజన్యులు సేవింపఁగా, బా
సాడి = నీవు సంభాషించి, యెఱుఁగవే = కావ్యార్థమువలన సకలదేశభాషల నెఱుఁగుమ
వనుట. దేశభాషలందుఁ దెలుఁగు లెస్స.

తా. సులభము.

కం. అంకిత మోయనక నీ కల, వేంకటపతి యిష్టమైన వేల్పగుటఁ దదీ
యాంకితము సేయు మొక్కటి, సంకేతము కాక తఁడ రసన్నేఁ గానే. ౧౪.

టీక. అంకితమోయనక — ఎవ్వరికిని నంకితము నొసంగుదునని, నీకు, అలవేంకటపతి=ఆవేంకటరమణుఁడు, ఇష్టమైనవేల్పగుటన్ = ఇష్టదేవతగావున, తదీయాంకితము = ఆవేంకటరమణసంబంధియగునంకితమే, చేయుము = ఒసఁగుము. (అట్లు చేసిన నీ కేమిలాభమని శంకింపఁగా నాశంకను బరిహరించుచున్నాఁడు). ఒక్కటిసంకేతముకాక = ప్రత్యేకనామభేదమే కాక, రసన్ = భూమియందు, అతఁడు = ఆవేంకటేశ్వరుఁడే, నేఁగానే = నేనుగానాయనుట.

తా. సులభము.

తే. పాత్ర మిటు సేయ నీ కుత్తరోత్తరాభి
వృద్ధి యని పోవ మేల్కని వెలుగు తోడి
భక్తిఁ దద్రమాగోపురప్రణతిఁ జేసి
వేఁగుటయుఁ గల్యకరణీయ విధులు దీర్చి. ౧౫.

టీక. పాత్రము = పుస్తకము, (ప్రబంధమనుట). ఇటు = ఈప్రకారముగా, చేయన్ — చేయఁగా, నీకుత్తరోత్తరాభివృద్ధి = నీకానాటికంటె నానాటికభివృద్ధి, అని = అగునని, పోవన్ = వెంచేయఁగా, మేల్కని = నేనునిద్రలేచి, వెలుగుతోడి = ఐశ్వర్యముతోఁగూడిన, భక్తిన్ = భక్తిచేతను, తద్రమాగోపురప్రణతిన్ = ఆయాంధ్రనాయకస్వామియొక్కదేవాలయగోపురప్రణామము నాచరించి, వేఁగుటయున్ = ప్రభాతముగాఁగానే, కల్య = ప్రత్యూషకాలమునందు, కరణీయ = చేయఁదగిన, విధులు = సంధ్యావందనాదివిధులను, తీర్చి = నెరవేర్చికొని.

తా. సులభము.

వ. నిండోలగం బుండి దండనాథ సామంత సందోహంబులం బంపి యేకాంత మం
దిరంబున కరిగి వివిధ వేదాగమ విదులగు విద్వజ్జనంబులఁ గాన్పించికొని నమ
స్కరించి యా శుభ స్వప్నంబు వినిపించిన వారాలించి వారు సవిస్మయ స్వాం
తు లయి దేవా దేవ దేవుండు విజయంబుఁ జేసిన యీ స్వప్నంబు నీకు శోభన
పరంపరలం దెలుపుచున్నయది యెట్లనినఁ బ్రథమమున నీశుఁ స్వప్న సాక్షా
త్కారం బితోధిక భక్తియు, నతండు ప్రబంధ నిబంధనంబుఁ గావింపు మనుట
యితోధిక గాఢ సారస్వతోద్బోధనంబును, నతని దేవీ సమాగమం బితోధి
కాఖండభాండాగారసమృద్ధియు, నతని యాసతి దేవి విడప శలత్వదం బితో

ధికా ద్వితీయ సితచ్ఛత్రతయు, నతం డశేష నృప సేవం దత్తద్భాష తెలుంగి వే యనుట యితోధిక సమస్త సామంత సమాజ సమాకర్షణంబును, బ్రియోప భోగ పరిశిష్ట భోగం బింపనుట యితోధిక బహు శ్రేయసీ ప్రాప్తియు, నీకుఁ గృతి సెప్ప నుత్తరోత్తరాభివృద్ధి యగు ననుట యితోధికాపత్య పరమాయు రవాప్తియు నగు నఖర్వ మహిమాతి ధూర్వహుండగు దుర్వాసు వంశంబునం బుట్టి నట్టి నీ కిట్టి శోభనంబు లే మద్భుతంబు లవధరింపుము. ౧౫.

టీక. నిండు = పరిపూర్ణమగు, ఓలగంబుండి = సభయందుండి, (ఇచ్చట సప్తమ్యర్థమందుఁ బ్రథమ). దండనాథ = సేనానాయకులయొక్కయు, సామంత = సామంతరాజన్యులయొక్క, సందోహంబులన్ = సమూహములను, పెందలకడన = శీఘ్రముగనే, మందిరంబులకనిపి = ఉనికిపట్లకుంజనసెలవొసంగి, వివిధ = పలుతెఱంగులగు, వేద = వేదములను, ఆగమ = పాంచరాత్రాద్యాగమములను, విదులగు=ఎఱింగిన, విద్వజ్జనంబులన్ = విద్వాంసులను, కొల్పించికొని = దర్శనముచేయించుకొని, నమస్కరించి= మ్రొక్కి, అశుభస్వప్నంబు = తాఁగన్నకలను, వినిపించినన్ = వినఁజెప్పిన, వారు = ఆవిద్వాంసులు, హర్షించి = సంతసిల్లి, సవిస్మయ = ఆశ్చర్యముతోఁగూడిన, స్వాంతులై = చిత్తములుకలవారై, దేవా = ఓరాజా, విద్వద్వాక్యమందురాజసంబోధన. దేవదేవుండు = దేవతలకుదేవుఁడయిన నారాయణుఁడు, విజయంబుఁజేసిన = విచ్చేసిన, ఆస్వప్నంబనేకశోభనపరంపరలందెలుపుచున్నయది = ఆకల పెక్కుశుభపరంపరల కాస్పదంబైయున్నది. ఎట్లనిన, ప్రథమము = మొదట, అప్పద్మేక్షణ = ఆకమలాక్షునియొక్క, స్వప్నసాక్షాత్కారము = స్వప్నప్రత్యక్షదర్శనము, ఇతోధికభక్తియు = ఇంతకంటెనధికభక్తియు, 'దృశ్యతే భగవాన్ యస్య స్వప్నే సర్వ శుభావహః। తస్మిన్నేవ దృఢాభక్తి ర్జాయతే తస్య సంతతమ్॥' (అని స్వప్న మందు భగవత్సాక్షాత్కారము భక్తి సాంతత్యకారక మని ప్రసిద్ధము). అతండు = ఆదేవుఁడు, ప్రబంధ నిబంధనంబున్ = గ్రంథసందర్భమును, కావింపుమనుట = చేయుమనుట. ఇతోధిక = ఇంతకతిశయమగు, అగాధ = గంభీరమగు, సారస్వత = విద్యయొక్క, ఉద్బోధనంబును = జ్ఞానమును, అతనిదేవీసమాగమంబు = అవిష్ణుపత్నిరాక, ఇతోధిక = ఇంతకు మిక్కిలియగు, అఖండ = ఎడతెగని, భాండాగార = బొక్కసపుటిండ్లయొక్క, సమృద్ధియు = సంపూర్ణత్వమును, అతని = అవిష్ణునియొక్క, అసతిచేతి = అలక్ష్మి చేతనున్న, విశద శతచ్ఛదంబు:—విశద = శుభ్రమగు, శతచ్ఛదంబు = శతపత్రము, (పుండరీకమనుట). ఇతోధిక = ఇంతకంటెనెక్కుడగు, అద్వితీయ = ఏకమైన, సితచ్ఛత్రతయు = శ్వేతఛత్రముగలుగుటయును, అతఁడు = ఆదేవుఁడు, అశేషనృప = సకలరాజులయొక్క, సేవన్ = భజించుటచేతను, తత్తద్భాషలు = ఆయాదేశభాషలను,

ఎఱుంగవేయనుట = తెలిసికొనవాయనుట. ఇతోధిక = ఇంతకంటెనధికములగు, సమస్త సామంత = ఎల్లసమానరాజులయొక్క, సమాజ = సమూహముయొక్క, సమాకర్షణంబును = రాఁబట్టుటయును, ప్రియా = ప్రియురాలియొక్క, ఉపభోగ = అనుభవమునుండి, పరిశిష్ట = శేషించిన (మాల్యమనుట) వస్తువుయొక్క, భోగము = అనుభవము, ఇంపనుట = ఇష్టమనుట. ఇతోధిక = ఇంతకంటెనధికములగు, బహు=పలువురగు, ప్రేయసీ = ప్రియస్త్రీలయొక్క, ప్రాప్తియు = లాభమును, కృతిఁజెప్పను త్తరోత్తరాభివృద్ధియగుననుట = ప్రబంధ నిర్మాణమును జేసిన నీకు నొకనాఁటికంటె నొకనాఁటికి శ్రేయస్సగుననుట. ఇతోధికాపత్యపరమాయురవాప్తియు = ఇంత కంటె నధికమగు సంతానము సంపూర్ణ మగు నాయువు లభించుటయు, అగుఁగాక = కలుగును. అని శోభన పరంపరలఁ దెలుపుచున్న దని పూర్వముతో నన్వయము. అఖర్వ = కుఱుచగాని, 'ఖర్వోహ్రస్వశ్చవామనః,' అని అమరము. మహిమ = మహత్త్వముచేతను, అతిధూర్వహుండగు = మిక్కిలిధురంధరుఁడైన, దుర్వాసు = దుర్వాసుఁడనుపురుషుని యొక్క, వంశంబునఁగాక = కులమునందు, పుట్టినట్టి = జనించినయట్టి, నీకుఁగాక = నీకు, ఇట్టిశోభనంబులు = ఏతాదృశశుభంబులు, ఏమద్భుతంబులు = ఏమాశ్చర్యకరములు, (అద్భుతంబులుకావనుట). అవధరింపుము = చిత్తగింపుము.

తా. సులభము.

సీ. కలశపాథోరాశి గర్భవీచిమతల్లి కడుపార నెవ్వానిఁ గన్న తల్లి
యనలాక్షు ఘనజటావనవాటి కెవ్వాఁడు వన్నెఁ బెట్టు ననార్తవంపుఁ బువ్వు
సకలదైవత బుభుక్షాస్ఫూర్తి కెవ్వాని పుట్టుకాముని లేని మెట్టపంట
కటికిచీఁకటి దిండి కరముల గిలిగింత నెవ్వాఁడు దొగకన్నె నవ్వఁ జేయు
నతఁడు వొగడొందు మధుకైటభారి మఱఁది
కళలనెలవగు వాఁడు జుక్కలకు ఱేఁడు
మిసిమి పరసీమ వలరాజు మేనమామ
వేవెలుంగుల దొరజోఁడు శేవెలుంగు. ౧౯.

టీక. కలశపాథోరాశి=క్షీరసముద్రముయొక్క, (దేవాసురులకు మథించు నెడఁ గలశప్రాయమగుటఁ జేసి కలశపాథోరాశి యనఁబడినది). గర్భ = లోపలి, వీచిమతల్లి = తరంగశ్రేష్ఠము, కడుపారఁగాక = గర్భము పరిపూర్ణ మగునట్లు, ఎవ్వానిఁగాక = చంద్రుని, కన్నతల్లి=ప్రసవించినజననియో (అనఁగా జంద్రుఁడు క్షీరసముద్రమందుఁ బుట్టిన వాఁడు గనుక నచ్చటి తరంగమునకు మాతృత్వము తోఁచుచున్న దనుట). ఎవ్వాఁడు = ఏచంద్రుఁడు, అనలాక్షు = ఫాలాక్షుఁడగుశివునియొక్క, ఘన=దట్టమైన,

జటా = జడయనెడు, వనవాటికి = వనప్రదేశమునకు, వన్నెఁబెట్టు = శృంగారించెడు, అవార్తసంపు = ఋతుసంబంధి కాని, పువ్వు = పుష్పమో (అనఁగా శివుఁడు శిరస్సున ధరించినాఁడనుట). ఎవ్వానిపుట్టుక = ఏచంద్రునిజన్మము, సకలదైవత = ఎల్లవేల్పుల యొక్క, బుభుక్షా = పేరాఁకటియొక్క, స్ఫూర్తికి = స్ఫురణకు, అమనిలేని = నుతి పింపకాలములేని, మెట్టపంట = దేవమాతృకభూఫలమో, ('ప్రథమాంపిబతేవహ్నిః' అను వెంపలయినప్రమాణము ననుసరించి యనుట). ఎవ్వాఁడు = ఏచంద్రుఁడు, కటికి = కఠినమగు, చీఁకటి = అంధతమసము, తిండి = భక్షణముఁగాఁగల, కరముల = కిరణ ములయొక్క, గిలిగింతన్ = చక్కిలిగింతచేతను, తొగకన్నెన్ = కలువతీఁగయని యొక్క కన్యకను, నవ్వన్ = నవ్వునట్లు, చెనకున్ = స్పృశించునో, మధుకైటభారి మఱఁది = మధుకైటభులను రాక్షసులకు శత్రువగు విష్ణునకుమఱఁదియు, కళల = షోడశ కళలయొక్క, వెలవగువాఁడు = స్థానమైనవాఁడు, చుక్కలఱేఁడు = నక్షత్రనాథుఁడు, మిసిమిపరసీమ:—మిసిమి = కాంతికి, పరసీమ = ఎక్కుడగు పొలిమేఱయైనవాఁడు, వలరాజుమేనమామ = మన్మథునికిమాతులుఁడగువాఁడు, వేవెలుంగులదొర = సహస్ర కిరణములుగలదొరయగుసూర్యునియొక్క, జోడు = ఉద్దియగువాఁడు, రేవెలుంగు = రాత్రియందుఁ బ్రకాశించెడువాఁడగు, అతఁడు = ఆచంద్రుఁడు, పొగడొందున్ = నుతింపఁబడును.

తా. కృష్ణదేవరాయల వంశంబునకు మూలంబగు చంద్రుఁడు పాలసముద్రంబునం బుట్టినాఁడనియును, శివుని జటాజూట మలంకరించి నాఁడనియును, సమస్త దేవతలకు, దున్నక, చల్లక, కోయక, నూర్పక, కాలనిర్ణయములేక, ఆఁకటి కొదిగెడు సుకర మగు నాహారమైన వాఁడనియు, (మహోపకారియనుట). తనకిరణములచేతఁ గలువతీఁగ యను కన్యకను నవ్వఁ జేయు ననుట వలన మహారసికుఁ డనియును, విష్ణునకు మఱఁది యనుట వలన మిక్కిలి యాభిజాత్యము గల వాఁ డనియును, కళానిధి యనుట వలనఁ గాంతిమంతుఁ డనియును, చుక్కలఱేఁ డనుట వలన రాజ్యపరిపాలన శీలుఁ డని యును, మిసిమిపరసీమ, వలరాజుమేనమామ, యనుట వలన లావణ్య సౌందర్యాది గుణ ములు గల వాఁ డనియును, సూర్యసఖుఁడనుటవలనఁ బ్రతాపగుణము గలవాఁడనియును, రే వెలుం గనుట వలన స్వయంప్రకాశుం డనియును భావము.

తే. ఆ సుధాధామ విభవ మహాంబు రాశి
కుబ్బు మీఱంగ నందనుం డుదయ మయ్యె
వేద వేదాంగ శాస్త్రార్థ విశద వాస
నాత్త ధిషణాఘనుం సత్తముం డైన బుధుఁడు. ౨౦.

టీక. ఆ = ఆల్ల, సుధాధామ = చంద్రునియొక్క, విభవ = సంపదయనెడు మహాంబురాశికి=మహాసముద్రమునకు, ఉబ్బుమీఱంగ=సంతోషమతిశయించునట్లుగా నందనుండు = కుమారుఁడగు, వేద = వేదములయొక్కయు, వేదాంగ = వేదముఁ కవయవములగుశిక్షాదులయొక్కయు, శాస్త్ర=మీమాంసాదిశాస్త్రములయొక్కయు, అర్థ = అర్థములయొక్క, విశద = స్వచ్ఛమగు, వాసనా = సంస్కారముచేతను, ఆప్త = పొందఁబడిన, ధిషణా = బుద్ధియొక్క, ధురంధరుఁడైన = భారవాహియగు, బుధుఁడు = బుధగ్రహము, ఉదయమయ్యెన్ = జనించెను.

తా. బుధుఁడు చంద్రునకుఁ దనయుఁడై సమస్తవేదశాస్త్రముల యర్థంబులు తెల్లఁగా దెలిసికొనియె ననుట.

కం. వానికిఁ బురూరవుఁడు ప్ర, జ్ఞానిధి జనియించె సింహసదృశుఁడు తద్భూ
జానికి నాయువు తనయుం, డానృపతికిఁ దనయుఁడై యయాతి జనించెన్. ౨౧.

టీక. వానికి = ఆబుధునకు, ప్రజ్ఞానిధి = మతిమంతుఁడు, సింహసదృశుఁడు = సింహసమానవిక్రముఁడగు, పురూరవుఁడు=పురూరవుఁడనుచక్రవర్తి, జనియించెన్ = ఉదయించెను. తద్భూజానికి = ఆపురూరవశ్చక్రవర్తికి, తనయుండు = సుతుఁడు, ఆయువు = ఆయువను పేరుగలరాజు, ఆనృపతికి = ఆయాయువనురాజునకు, యయాతి= యయాతియనుమహారాజు, తనయుఁడై = నందనుఁడై, జనించెన్ = జన్మమొందెను.

తా. బుధునకుఁ బురూరవుండును, బురూరవునకు నాయువును, నాయువునకు యయాతియు సుతులై పొడమి రని భావము.

కం. ఆతనికి యదు తుర్వసు లను, సుతు లుద్భవ మంది రహిత సూదనులు కళా
న్వితమతులు వారిలో వి, శ్రుతకీర్తి వహించె దుర్వసుఁడు గుణనిధియై. ౨౨.

టీక. ఆతనికి = ఆయయాతిమహారాజునకు, యదుతుర్వసులనుసుతులు=యదువు, తుర్వసుఁడు అను తనయులు, అహితసూదనులు:—అహిత=శత్రువులను, సూదనులు= మర్దించువారును, కళాన్వితమతులు:—కళా = విద్యలతోడను, అన్విత=కూడుకొన్న, మతులు = బుద్ధిగలవారు, ఉద్భవమందిరి = పుట్టిరి. వారిలోన్ = ఆయదుతుర్వసుల లోను, తుర్వసుఁడు, గుణనిధియై = సుగుణనిధానమై, విశ్రుతకీర్తి వహించెన్ = ప్రశస్తయశస్సును బొందెను.

తా. ఆయయాతికి యదుతుర్వసులను నిద్దఱు తనయులు గలిగిరనియును, వారిలో తుర్వసుఁడు కీర్తిమంతుఁ డాయె నని భావము.

తే. వాని వంశంబు తుళువాన్వవాయ మయ్యె
నందుఁ బెక్కండ్రు నృపు లుదయంబు నొంది
నిఖిల భువనాభిపూర్ణ నిర్ణిద్రకీర్తి
నధికు లైరి తదీయాన్వయమునఁ బుట్టి. ౨౩.

టీక. వాని = ఆతుర్వసునియొక్క, వంశంబు = కులము, తుళువాన్వవాయము యెన్ = తుళువకులమయ్యెను. అందు = ఆకులమందు, పెక్కండ్రు = అనేకులగు, నృపులు = రాజులు, ఉదయంబునొంది = జనించి, నిఖిల = సమస్తములగు, భువన = లోకములందు, అభిపూర్ణ = నిండింపఁబడిన, నిర్ణిద్ర = ప్రకాశించెడు, కీర్తిన్ = కీర్తి చేతను, అధికులైరి = ఆధిక్యమునువహించిరి. తదీయాన్వయమున:—తదీయ = ఆరాజుల సంబంధియగు, అన్వయమునన్ = వంశంబునందు, పుట్టి = జననమంది. ఇది ముందరి పద్యమున కన్వయము.

తా. సులభము.

మహాస్రగ్ధర. ఘనుఁడై తిమ్మక్షితీశాగ్రణి శఠ కమఠ గ్రావ సంఘాత వాతా
శనరాడాశాంతదంతి స్థవిర కిరుల జంఝాటము ల్మాన్పి యిమ్మే
దిని దోర్దం డైక పీఠి స్థిరము పఱిచి కీర్తి ద్యుతు ల్రోదసిం బ
ర్వ నరాతు ల్నమ్రులై పార్శ్వములఁ గొలువఁ దీవ్రప్రతాపంబుఁ జూపెన్.

టీక. తిమ్మక్షితీశాగ్రణి = తిమ్మభూపాలశ్రేష్ఠుఁడు, ఘనుఁడై = అధికుఁడై, శఠ = గూఢవిప్రియకారియగు, కమఠ = కూర్మముయొక్కయు, గ్రావ = పర్వతములయొక్క, సంఘాత = సమూహముయొక్కయు, వాతాశనరాట్:—వాత = వాయువే, అశన = ఆహారముగాఁగలసర్పములయొక్క, రాట్ = రాజైనశేషునియొక్కయు, ఆశాంత దంతి:—ఆశాంత = దిగంతములయందలి, దంతి = గజములయొక్కయు, స్థవిర = వృద్ధయిన, కిరి = ఆదివరాహముయొక్క, (శఠశబ్దము మొదలుగాఁ గిరిశబ్దమువఱకు ద్వంద్వసమాస మగుటవలన నంతమందలి కిరిశబ్దము బహువచనాంతమైనది). జంఝాటముల్ = జంజాటములను, మాన్పి = వదలించి, ఇమ్మేదినిన్ = ఈభూమిని, దోర్దండైక పీఠిన్:—దోర్దండ = తనభుజాదండమనియెడు, ఏక = ముఖ్యమగు, పీఠిన్ = పీఠమందు, థిరముపఱిచి = స్థిరముగానిలిపి, కీర్తిద్యుతుల్ = యశఃకాంతులు, రోదసిన్ = భూమ్యాకాశములందు, పర్వన్ = వ్యాపింపఁగా, అరాతులు = శత్రువులు, నమ్రులై = తగ్గినవారై, పార్శ్వములఁగొలువన్ = చెంతలఁజేరి సేవింపఁగా, తీవ్రప్రతాపంబున్ = తీక్ష్ణమగుశౌర్యమును, చూపెన్ = కనుపఱిచెను.

తా. ఆవంశమునందుఁ బుట్టి ఘనుడయిన తిమ్మలదేవరాయఁడు మున్ను భూమిని భ

రించుచున్న యాదికూర్మ, సప్తకులపర్వత, శేష, దిగ్గజాది వరాహమ్ములయందు వరుస గాఁ గలిగిన కఠినత్వకాఠిన్యవాతాతనత్వదూరనివాసిత్వస్పృష్టత్వములను దోషములఁ జూచి యట్టి కమఠాచలతోడి తోడుసు భూమికి లేకుండఁ దానే తన భుజంబున ధరియించి శత్రువులు నమ్రులై తన్ను సేవించుచుండఁ దన కీర్తిప్రతాపములు భూమ్యంతరిక్షంబుల యందు వ్యాపింపఁ జేసి భూమి కధిక సౌఖ్యము గలుగఁ జేసె నని భావము.

కం. వితరణ ఖని యత్తిమ్మ, క్షితిపగ్రామణికి దేవకీదేవికి నం
చితమూర్తి యీశ్వరప్రభుఁ, డతి పుణ్యుఁడు పుట్టె సజ్జనావన పరుఁడై.

టీక. వితరణఖని = దానవిధియగు, అత్తిమ్మక్షితిపగ్రామణికిన్ = ఆల్ల తిమ్మభూపాలశ్రేష్ఠునకు, దేవకీదేవికి = దేవకీదేవి యను నతని భార్యకును, అంచితమూర్తి = శృంగారాకారముగల, అతిపుణ్యుఁడు = మిక్కిలిపుణ్యముగల, ఈశ్వరప్రభుఁడు = ఈశ్వరదేవరాయఁడు, సజ్జనావనపరుఁడై = సాధుజనసంరక్షణాసక్తిగలవాఁడై, పుట్టెన్ = జనించెన్.

తా. తిమ్మభూపాలునకును దేవకీదేవమ్మకు నీశ్వరదేవరాయలు పుట్టె నని భావము.

చ. బల మద మత్త దుష్ట పుర భంజనుఁడై పరిపాలి తార్యుఁడై
యిల పయిఁ దొంటి యీశ్వరుఁడె యీశ్వరుఁడై జనియింప రూపఱెన్
జలరుహనేత్రలం దొఱఁగి శైల వనంబుల భీత చిత్తులై
మెలఁగెడు శత్రు భూవరులు మేనులఁ దాల్చిన మన్మథాంకముల్. ౨౦.

టీక. బల = బలముచేతను, మద = గర్వముచేతను, మత్త = మదించిన, దుష్ట = దురాత్ములైనశత్రువులయొక్కయు, రాక్షసులయొక్కయు, పుర = పట్టణములను త్రిపురములను, భంజనుఁడై = భంగపఱుచువాఁడై, పరిపాలిత=సంరక్షణము చేయఁబడిన, ఆర్యుఁడై = పెద్దలుగలవాఁడై, పార్వతిగలవాఁడై, తొంటియీశ్వరుఁడే = మొదటి యీశ్వరుఁడే, (అనఁగా శివుఁడే), ఇలపయిన్ = భూమిమీఁదను, ఈశ్వరుఁడై = ఈశ్వరరాజై, జనియింపన్ = పుట్టఁగా, జలరుహనేత్రలన్ = స్త్రీలను, తొఱఁగి = విడిచి, శైలవనంబులన్ = పర్వతారణ్యములయందు, భీతచిత్తులై = భయపడినమనస్సు గలవారై, మెలఁగెడు = సంచరించెడు, శత్రుభూవరులు = శత్రురాజులు, మేనులన్ = దేహములందు, తాల్చిన = ధరించిన, మన్మథాంకములు = మదనలాంఛనములు, రూపఱెన్ = రూపుమాసెను.

తా. అనఁగా నీశ్వరరాజు శత్రువు లతని దాడికి నిలువం జాలక ప్రియురాండ్రైన స్త్రీలను విడిచి కొండల యందు నడవుల యందును భయము పడుచుఁ దిరు

గు నపుడు వారి దేహములందలి మన్మథ చిహ్నములు మాసె ననియు నీశ్వర సందర్శనముచే మన్మథచిహ్నములు మాయుట యుక్త మనియు భావము. ఇందలి విశేషణములు శివపరములుగాను, రాజపరములుగా నన్వయించుట వలన శ్లేషాలంకారము.

సీ. నిజ భుజాశ్రిత ధారుణీ వజ్ర కవచంబు దుష్ట భుజంగాహితుండికుండు
వనజేక్షణా మనో ధనపశ్యతోహరుఁ డరి హంస సంస దభ్రాగమంబు
మార్గణ గణ పిక మధు మాస దివసంబు గుణరత్న రోహణ క్షోణిధరము
బాంధవ సందోహ పద్మవనీ హేళి కారుణ్యరస నిమ్నగా కళత్రుఁ
డన జగంబుల మిగులఁ బ్రఖ్యాతిఁ గాంచె, ధరణీధవ దత్త వివిధోపధా విధా స
మార్జితశ్రీ వినిర్జిత నిర్జరాల, యేశ్వరుఁడు తిమ్మ భూపతి యీశ్వరుండు. ౨౭.

టీక. నిజ = స్వకీయమగు, భుజ = బాహువును, ఆశ్రిత = ఆశ్రయించిన, ధారుణీ = భూమికి, వజ్రకవచంబు = మగఱాలమైపుటువయినవాఁడును, దుష్ట = దుర్మార్గులనియెడు, భుజంగ = సర్పములకు, అహితుండికుండు = పాములంబట్టెడువాఁడును, వనజేక్షణా = కమలలోచనలగుస్త్రీలయొక్క, మనః = మనస్సులనియెడు, ధన = ధనములకు, పశ్యతోహరుఁడు = ప్రత్యక్షచోరుఁడు, అరి = శత్రువులనియెడు, హంస = అంచలయొక్క, సంసత్ = సమూహమునకు, అభ్రాగమంబు:—అభ్ర = మేఘములయొక్క, ఆగమంబు = కాలము, (వర్షర్తువనుట). మార్గణ = యాచకులయొక్క, గణ = గుంపులనియెడు, పిక = కోయిలలకు, మధుమాస = వసంతమాసముయొక్క, దివసంబు = దినమువంటివాఁడు, గుణరత్నరోహణక్షోణిధరము:—గుణ = గుణములనియెడు, రత్న = మణులకు, రోహణక్షోణిధరము = రోహణపర్వతమైనవాఁడు, బాంధవసందోహ = బంధుసమూహమనెడి, పద్మవనీ = కమలవనమునకు, హేళి = సూర్యుఁడైనవాఁడు, కారుణ్యరస = కరుణయనునుదకమునకు, నిమ్నగాకళత్రుఁడు = నదీభర్తయగుసముద్రుఁడు, అనన్ = అనఁగా, ధరణీధవ = రాజులచేత, దత్త = ఈఁబడిన, వివిధ = పలుతెగలగు, ఉపదా = కానుకలయొక్క, విధా = ప్రకారముచేత, సమార్జిత = సంపాదింపఁబడిన, శ్రీ = సంపదచేత, వినిర్జిత = జయింపఁబడిన, నిర్జరాలయ = స్వర్గమునకు, ఈశ్వరుఁడు = ప్రభువగునింద్రుఁడుగల, తిమ్మభూపతియీశ్వరుండు = తిమ్మభూపాలపుత్రుఁడగు నీశ్వరదేవరాయఁడు, జగంబులన్ = జగత్తులయందు, మిగులన్ = అతిశయించునట్లు, ప్రఖ్యాతిఁగాంచెన్ = కీర్తిఁబొందెన్.

తా. తిరుమల దేవరాయల కుమారుఁడగు నీశ్వర దేవరాయఁడు రాజుల వలని కప్పంబులచే నధిక సంపద గల వాఁడయి తనయైశ్వర్యముచే నింద్రుని జయించుచుఁ దీని భుజము నాశ్రయించిన భూమికి వజ్ర కవచంబన దుష్టజనులను బాములను బాముల

మైన తన కీర్తి దిగంతములయందు వ్యాపించుచుండఁ గాఁ, బాపము లడఁగి పోవునట్లు భూమిని బాలించె నని భావము.

సీ. అంభోధి వసన విశ్వంభరా వలయంబుఁ దన బాహుపురి మరకతముఁ జేసె
గకుబంత నిఖిల రాణ్ణికరంబుఁ జరణ మంజీరంబు సాల భంజికలఁ జేసె
మహనీయ నిజ వినిర్మల యశస్సరసికి గగనంబుఁ గలహంసకంబుఁ జేసె
నశ్రాంత విశ్రాణ నాసార లక్ష్మికిఁ గవికదంబముఁ జాతకములఁ జేసె
నతి శిత కృపాణ కృత్త మత్తారి వీర, మండలేశ సకుండల మకుట నూత్న
మస్త మాల్య పరంపరామండనార్చి, తేశ్వ రుండగు నారసింహేశ్వరుండు. ౩౦.

టీక. అతిశిత = మిక్కిలివాఁడియగు, కృపాణ = ఖడ్గముచేతను, కృత్త = న ఱకఁబడిన, మత్త = మదించిన, అరివీర = శత్రువీరులగు, మండలేశ = రాజుల యొక్క, సకుండలమకుట = కుండలకిరీటములతోఁగూఁడిన, నూత్న = నూతనముల యిన, మస్త = శిరస్సులనియెడు, మాల్య = విరిసరములయొక్క, పరంపరా = స మూహముచేతనుగలిగిన, మండన = అలంకారముచేతను, అర్చిత = పూజింపఁబడిన, ఈశ్వరుండు = సర్వేశ్వరుఁడుగలిగినవాడు, అగు=అయినట్టి, నారసింహేశ్వరుండు = నరసింహదేవరాయఁడు, అంభోధి = సముద్రము, వసన = వస్త్రముగాఁగల, విశ్వం భరా = భూమియొక్క, వలయంబున్ = వర్తులాకారమును, తన = తనయొక్క, బాహుపురి = కేయూరమందు, మరతకముఁజేసెన్ = మరకతమణినిఁజేసెను. క కుప్ = దిక్కులయొక్క, అంత = చెంగులయందలి, నిఖిల = సమస్తమయిన, రాట్ = రాజులయొక్క, నికరంబున్ = సమూహమును, చరణమంజీరంబు:—చ రణ = పాదముయొక్క, మంజీరంబు = గండపెండెరముయొక్క, సాలభంజికలఁ జేసెన్ = ప్రతిమలఁజేసెన్, మహనీయ = అధికమైయున్న, నిజ = స్వకీయమయిన, వినిర్మల = మిక్కిలిశుభ్రమగు, యశః = కీర్తియనియెడు, సరసికి = సరస్సునకు, గగ నంబున్ = ఆకాశమును, కలహంసకంబుఁజేసెన్ = హంసవిశేషమునుఁజేసెను. అ శ్రాంత = విడుమరలేని, విశ్రాణన = వితరణమనియెడు, ఆసార = ధారాంసపాత ముయొక్క, లక్ష్మికి = సమృద్ధికి, కవికదంబమున్ = కవీశ్వరసమూహమును, చాతక ములఁజేసెన్ = చాతకపక్షులనుజేసెను.

తా. నరసింహరాయలు యుద్ధరంగమందు బహిరంగముగా నెదిరించిన శత్రువీ రుల తలలు మకుట కుండలంబుల తోడం గూడఁ దన ఖడ్గంబున ఖండించి, అట్టి శిరం బులన విరుల సరములచేఁ, గఱకంఠుఁడు కపాలమాలాధరుఁడు గనుక నతని నలంకరిం చుచుఁ జతుస్సముద్రముద్రితభూవలయంబు ననాయాసంబుగ వహించి పాలించుచు స

మస్త దేశాధీశ్వరులచే మొక్కులు గైకొనుచు భూమ్యంతరిక్షంబులయందుఁ దన యశంబు నించి యెల్లప్పు డెడతెగని దానంబులచేతఁ గవీశ్వరులకుఁ దృప్తి సేయుచుండెనని భావము.

తే.గీ. ఆ నృసింహప్రభుఁడు దిప్పాంబ వలన
నాగమాంబిక వలన నందనులఁ గాంచె
వీర నరసింహరాయ భూ విభుని నచ్యు
తాయతాంశజు శ్రీకృష్ణరాయ నిన్ను. ౩౧.

టీక. ఆనృసింహప్రభుఁడు = ఆనరసింహదేవరాయఁడు, తిప్పాంబవలనన్=తిప్పమ్మవలన, వీరనరసింహరాయభూవిభుని=వీరనరసింహరాయలను, నాగమాంబికవలనన్ = నాగమ్మవలన, అచ్యుతాయతాంశజు:—అచ్యుత = శ్రీకృష్ణునియొక్క, ఆయత = పూర్ణమగు, అంశ = కళచేతను, జు = పుట్టినట్టి, నిన్నున్=నిన్నును, నందనులన్=పుత్త్రులనుగాను, కాంచెన్=పడసెన్, శ్రీకృష్ణరాయ=కృష్ణదేవరాయా యని సంబోధనము.

తా. ఆ నరసింహరాయలకు భార్యలగు తిప్పమ్మ, నాగమ్మ యను వారిలోఁ దిప్పమ్మకు వీరనృసింహరాయలును, నాగమ్మకు కృష్ణాంశ సంభూతుఁడగు కృష్ణదేవరాయలును సుతులై కలిగిరని భావము.

కం. వీర నృసింహుఁడు నిజ భుజ, దారుణ కరవాల పరుష ధారాహత వీ
రారియగుచు నేకాతప, వారణముగ నేలె ధర నవారణ మహిమన్. ౩౨.

టీక. వీరనృసింహుఁడు = వీరనరసింహరాయఁడు, నిజ = స్వకీయమగు, భుజ = భుజమందు, దారుణ = భయంకరమైన, కరవాల = ఖడ్గముయొక్క, పరుష = కఠోరమగు, ధార = అంచుచేతను, హత = సంహరింపఁబడిన, వీర = వీరులైన, అరియగుచు = శత్రువులుగలవాఁడగుచు, అవారణమహిమన్:—అవారణ = అప్రతిహతమైన, మహిమన్ = మహత్త్వముచేతను, ధరన్ = భూమిని, ఏకాతపవారణముగన్ = ఏకచ్ఛత్రముగలుగునట్లుగా, ఏలెన్ = పాలించెను.

తా. వీరనృసింహరాయఁడు తనఖడ్గముచేత నెదురించిన వీర రిపుల నడఁకి యడ్డము లేని విజృంభణముచేత నేకఛత్రాధిపతియై భూమిఁ బాలించె నని భావము.

కం. ఆ విభు ననంతరంబ ధ, రావలయముఁ బూని తీవు రహిమైఁ దిరుమ
ల్దేవియును నన్నపూర్ణా, దేవియుఁ గమలాబ్జముఖులు దేవేరులుఁగాన్. ౩౩.

టీక. ఆవిభు = ఆవీరనృసింహరాయలయొక్క, అనంతరంబ = తరువాతను, (ఇ

చ్చటుపష్ఠీవిభ. క్తికిను మారగమను). ఈవు=నీవు, తిరుమద్దేవియు=తిరుమలయమ్మయు, అన్న పూర్ణాదేవి యుఁక = అన్నపూర్ణమ్మయు, కమలాబ్జముఖులు=కమలమునంటి చంద్రునివంటి ముఖముగలవారు. దేవేరులుగాఁగ=పట్టపుదేవులుగాఁగా, ధరావలయమున్=భూవలయమును, రహిమైన్ = ఒప్పిదముచేతను, పూనితివి = వహించితివి.

తా. జ్యేష్ఠుఁడగు నారసింహరాయలపిమ్మటఁ గృష్ణదేవరాయలు భూభారమును వహించె ననియును, దిరుమద్దేవి, యన్నపూర్ణాదేవి, యతనికిఁ బట్టపు దేవులనియును భావము.

సీ. తొల్లఁగెను ధూమకేతుక్షోభ జనులకు నతివృష్టి దోష భయంబు వాసెఁ
గంటక రాగమభీతి గడచె నుద్ధత భూమి భృత్కటకం బెల్ల నెత్తునడియె
మూసె నఘనుస్మార్త మనుభూములంయును నెల మూఁడు వానలు నిండఁ గురిసె
నాబాల గోపాల మఖిల సజ్జనము నానందమగు మన్కి నతిశయిల్లె
ప్రజల కెల్లను గడు రామరాజ్య మయ్యెఁ
జారు సత్వాఢ్యయీశ్వర నారసింహ
భూ విభుని కృష్ణరాయ యభ్యుదయ మొంది
పెంపుతో నీవు ధాత్రిఁ బాలింపఁగాను. ౨౪.

టీక. చారుసత్వాఢ్య:—చారు = ఒప్పిదమగు, సత్వ = సాత్వికగుణమునకును, బలమునకును, ఆఢ్య = ఘనుఁడవైనవాఁడా, ఈశ్వరనారసింహభూవిభుని = ఈశ్వరరాయలపుత్రుఁడగు నారసింహరాయల లనయుఁడవగు, కృష్ణరాయ = కృష్ణదేవరాయ, నీవు, అభ్యుదయమొంది = శ్రేయస్సునుజెంది, ధాత్రిన్ = భూమిని, పాలింపఁగాను = పాలించుచుండఁగా, (భావలక్షణసప్తమి), జనులకు = ప్రజలకు, ధూమకేతు = తోఁకచుక్కవల్లనైన, క్షోభ = దుర్భిక్షము, తొల్లఁగెను = లేదాయెను. అతివృష్టిదోషభయంబువాసెన్ = అధికవర్షదోషమువలనవెఱపునశించెను. కంటక = క్షుద్రవైరిరాజులయొక్క, ఆగమ = రాకవలని, భీతి భయము, కడచెన్ = అతిక్రమించెను. ఉద్ధత = గర్వించిన, భూమిభృత్ = రాజులయొక్క, కటకంబెల్ల = రాజ్యమెల్లను, నెత్తువడియెన్ = బలహీనమయ్యెను. అఘ = పాపములయొక్క, స్మార్త = అధ్యయము. మూసెన్ = రూపుసెడియెను. మనుభూములంయును=నిర్జలభూములయందును, నెలమూడువానలు=నెలకుమూఁడేసివానలు, నిండన్ = పరిపూర్ణమగునట్లు, కురిసెన్ = వర్షించెను. (మనుభూములంయును అన్న సముచ్చాయక్రమలిసారస్యమువలన జలసమృద్ధములంను నైతము పండినమలకొక్క వర్షముగురియుననుట). ఆబాలగోపాలము = బాలురు, గోపాలురు మొదలుగా, అఖిల = సమస్తములగు, సత్ = సజ్జనులయొక్క, ప్రజ

మును = సమూహమును, ఆనందమగు = సంతోషముగల, మన్కి౯ = బ్రదుకుచేతను, అతిశయిల్లె౯ = అధికమయ్యెను. ప్రజలకెల్లను = సమస్తజనులకును, కడు = మిక్కిలి, రామరాజ్యమయ్యె౯ = బాలమరణాదిపీడలులేని దశరథరామరాజ్యమువలె నయ్యెను.

తా. కృష్ణదేవరాయలు శ్రీయస్సు గలిగి రాజ్య మేలుచుండఁగా, భూమిపై జనులకు దుర్భిక్షభయమును, అతివృష్టిభయంబు ననావృష్టిభయంబు మొదలగు నీతిబాధలు లేవనియును, దగినకాలములయందుఁ గావలసిన వానలు గురియుచుండెననియును, పరరాజులు దాడి సేయరనియును, బాలురు వృద్ధులు గోపకులు మొదలుగా నెల్లవారలు నిరంతర సంతోషంబుఁ గాంతురనియును, బాల మరణాది దోషంబులు లేక రామరాజ్యమై యుండె నని భావము.

క. తునియలు దొమ్మిది యంటఁ బదు, నెనమండ్రంట మోచువా రనేకప కిటి కూ
ర్మ నగాహులేఁటిలావరు, లని తావక బాహు వొకఁడ యవని భరించె౯. ౩౫.

టీక. తునియలు = భూఖండములు, తొమ్మిదియంట = నవసంఖ్యాకంబులఁట. మోఁచువారు = వహించెడువారు, పదునెనమండ్రంట = అష్టాదశసంఖ్యాకులఁట. అనేకప = రెంటఁబానముజేసెడిదిగ్గజము లెనిమిదియును, కిటి = వరాహ మొక్కండును, కూర్మ = ఆదికూర్మ మొక్కండును, నగ = కదలనికులపర్వతంబులేఁడును, అహులు = శేషుఁడొక్కండును, (ద్వంద్వాంతమునబహువచనము). వీరు, ఏఁటిలావరులని = ఏపాఁటి బలవంతులని, తావక = నీసంబంధియగు, బాహువొకఁడ = భుజ మొక్కఁడే, అవని౯ = భూమిని, భరించె౯ = పూనెను.

తా. కృష్ణదేవరాయలభుజము మున్ను భూ భారమును వహించి యున్న వారగు, గజ, వరాహ, కమఠ, కులపర్వత, శేషులను లెక్కించి పదునెనమండ్రని యెఱింగి భూభాగములు లెక్కించి భరతఖండాది నవఖండంబులని తెలిసి యొక్కొక్క ఖండం బిద్ద ఱిద్దఱు వహించుచున్నట్లూహించి వార లెట్టిబలవంతులని యెగ్గించి యట్టి తొమ్మిది ఖండంబులు గలభూమండలంబంతయుఁ దానే వహించె నని భావము.

ఈ పద్యంబునందలి యంట శబ్దద్వయంబనంగీకారార్థకంబై యున్నది.

సీ. తొలుదొల్త నుదయాద్రి శిలఁ దాఁకి తీండ్రించు నసి లోహమున వెచ్చనై జనించె
మఱి కొంత పీఁడెక్కి మాఱొక్కని నలిసైల యలక సహస్రాంశుఁ డంటి తాఁజె
నట సాఁగి జమ్మిలోయుఁబడి వేఁగి దహించె, గోనఁ బిట్టేర్చ్ఁ గొట్టానఁ దవిలెఁ
గనకగిరి స్ఫూర్తిఁ గఱఁచె గొలఁదిఁ గ్రాఁచె నవల సాహట్యూర రవులు కొనియె

మాఁడెములు గ్రేల్చె నొడ్డాణి మసి యొనర్చెఁ
గటకపురిఁ గాల్చె గజరాజు గలఁగి పఱవ
దోఁక చిచ్చన నౌర నీదురవగాహ
ఖేల దుగ్రప్రతాపాగ్ని కృష్ణరాయ. ౩౭.

టీక. కృష్ణరాయ = కృష్ణరాయభూపాలా, నీ = నీయొక్క, దురవగాహ=ప్రవేశింపశక్యముగానియట్లు, ఖేలత్ = క్రీడించుచున్న, ఉగ్ర = తీక్ష్ణమగు, ప్రతాప = ప్రతాపమనియెడి, అగ్ని = నిప్పు, తోఁకచిచ్చన = దీర్ఘవహ్నిజ్వాలయోయన్నట్లు, తొలుదొల్తన్ = ప్రప్రథమమందు, ఉదయాద్రిశిలన్ = ఉదయగిరిదుర్గమనియెడు చెకముకిరాతిని, తాఁకి = స్పృశించి, తీండ్రించు = జ్వలించెడు, అసి = ఖడ్గమనియెడు, లోహమునన్ = అగ్నిజననకారణమగునయఃపత్త్రికయందు, వెచ్చనై = వేఁడిమిగలదియై, జనించెన్ = అంకురించెను. (శిఖిముఖిశిలయును లోహపత్త్రికయు నొరసినప్పుడు నిప్పు పుట్టుననుట). మఱి = పిమ్మట, కొండవీఁడు = కొండవీటిదుర్గమును, ఎక్కి = ఆరోహించి, మాఱ్కొని = ప్రతిఘటించి, నలియైన = నలఁగియున్న, అల = ప్రసిద్ధుండగు, కసవాపాత్రున్ = కసవాపాత్రుఁడనువానిని, (నలియైన = నలఁగిన, కసవాపాత్రున్ = కసవాపాత్రుఁడనుకసవును), అంటి = తాఁకి, తాఁజెన్ = పొగసెను. (ఆనిప్పు నలఁగినకసవుపైఁ బడినప్పుడు తాఁజుననుట). అట = అచ్చట, సాఁగి = వెడలి, జమ్మిలోయఁబడి = జమ్మిలోయయనుప్రదేశముప్రవేశించి, (జమ్మిచెట్లుగలబొటియలోఁబడియును), వేఁగి = వేఁగినాడు. దహించెన్ = కాల్చెను. వేఁగి = ప్రకాశించి, (కాల్చెననుట). కోనన్ = కోనసీమను, బిట్టు = కఠినముగాఁగ, ఏర్చి = కాల్చి, కొట్టానఁదగిలె = ఘోట్టాణమనుదేశమందంటుకొనియెను. (జమ్మిచెట్లుగాల్చి యా యగ్ని కొట్టమునఁగా శాలగావునఁ దాని నంటికొనెననుట). కనకగిరి=కనకదుర్గముయొక్క, స్ఫూర్తి = ఆధిక్యమును, కఱఁచె = కఱఁగఁజేసెన్ . (అగ్నివలన బంగారముగఱఁగుననుట). గౌతమిఁగ్రాఁచెన్ = గోదావరినిదపింపఁజేసెను. (అగ్నివలన జలంబులు దప్తములగుననుట). అవలన్ = అనంతరమందు, అపొట్నూరన్ = పొట్నూరు అను ప్రదేశమందు, రవులుకొనియెన్ = ప్రజ్వలించెను. (అగ్నిపొట్టుమీఁదఁబడినప్పుడు రగులుకొనుననుట). మాడెములుఁ గ్రేల్చెన్ = మాడెములనియెడుమన్నెప్రదేశములుఁ గాల్చెన్, ఒడ్డాణి = ఓఢ్రదేశమును, మసియొనర్చెన్ = భస్మసాత్కృతముఁగావించెను. కటకపురిన్ = కటకమనుపట్టణమును, గజరాజు = గజపతి, కలఁగి=కలఁతపడి, పఱవన్ = పలాయితుఁడుగాఁగా, కాల్చెన్ = దహించెను. కటకపురిన్ = పురివంటిగిరినితంబమును, గజరాజ = పర్వతమందలిగజశ్రేష్ఠము, పఱవన్ = మంటఁజూచిపఱుగులిడునట్లు, కాల్చెన్ = ధగ్ధంజేసెను.

తా. కృష్ణదేవరాయల ప్రతాపము ప్రథమమం దుదయగిరిదుర్గ మాక్రమించి పిమ్మటఁ గొండవీటిదుర్గము మీఁది కేఁగి కసవాపాత్రుని సంహరించి అచ్చట వెడలి జమ్మిలోయ మీఁద నేఁగి వేఁగి దేశము నాక్రమించి కోన సీమఁ గైకొని కొట్టము నుగ్రహించి కనక దుర్గమును బాడు జేసి గోదావరిని దపింపించి పొట్నూర వ్యాపించి మన్నెపు దేశము లాక్రమించి యోఢ్రదేశము జయించి గజపతి భయంపడి పఱచునట్లు కటకపురి నాక్రమించె ననియును, ఆ ప్రతాప మగ్నివలె నుండెననుటవలన నయ్యగ్ని యుదయగిరి యను చెకముకి శిలఁ దాఁకి క త్తి యనెడు చెకముకి క త్తియందుఁ దొలుతఁ బుట్టి కొండవీఁడను కొండయొక్క నలియైన కసవాపాత్రుఁడను కసవునంటికొని జమ్మిచెట్ల మీఁద వేఁగిచెట్లమీఁదఁ బడి దహించి కొట్ట మంటుకొని కనక దుర్గమను కనకమును గఱఁగఁ జేసి గోదావరిలోని యుదకములు గ్రాఁగఁ జేసి పొట్నూరను పొట్టు మీఁదఁ బ్రజ్వరిల్లి యావల కటకపురి యను కొండ దరియందుఁ జేరి యచ్చట నివసించుచున్న యేనుంగు పారి పోవు నట్లా ప్రదేశము దహించె నని యచ్చ టచ్చట నుండెడు శబ్దముల వలన రూపకాలంకారమును, ధ్వన్యలంకారమును, దోఁచుచున్నది.

ఉ. చిత్రము కృష్ణరాయనృపశేఖర నీదగు ధాటి కోడి స
ర్వత్ర నిలింప కామినుల వాడకుఁ గాఁపులు వోదు రుత్కళ
క్షత్రియపాత్రులెల్లఁ గసుగందని మేనులఁ దొంటిపెద్ద లే
సూత్రముఁ బన్ని నారో బలసూదను వీఁటికిఁగొండవీటికిన్.                    ౩౨.

టీక. కృష్ణరాయనృపశేఖర = ఓకృష్ణరాయభూపాలశ్రేష్ఠుఁడా, నీదగు = నీ సంబంధియగు, ధాటికి = ఔద్ధత్యముచేత, (ఇది విభక్తివ్యత్యయము). ఓడి = హతులైరి. సర్వత్ర = అన్నిదేశములరాజులు, నిలింపకామినులవాడకు=అప్సరస్త్రీలవాడకు, కాఁపులువోదురు = కాఁపురాలేఁగుదురు. నీదగు = నీసంబంధియగు, ధాటికి = దాడి వెట్టుటకు, ఓడి = భయంపడి, ఉత్కళ = ఓఢ్రదేశమందలి, క్షత్రియపాత్రులెల్ల = పాత్రనామధేయులగు రాజులందఱును, కసుగందని=లేఁతఱికము సెడనియట్టి, (కసువు చేతఁగందని యని మఱియొకయర్థము). మేనులన్ = శరీరములచేతను, నిలింపకామినుల = దేవతాస్త్రీలయొక్క, వాడకు = పట్టణమునకు, కాఁపులువోదురు=కాఁపురము వేఁగుదురు. తొంటిపెద్దలు = పూర్వపుఁబెద్దలు, బలసూదనువీఁటికిన్ = ఇంద్రపట్టణమగుస్వర్గమునకును, కొండవీటికిన్ = కొండవీడనుపట్టణమునకు, ఏసూత్రమున్ = ఎట్టి సూత్రమును, పన్నినారో = కల్పించినవారో, చిత్రము = ఆశ్చర్యము.

తా. కృష్ణరాయనృపశేఖరా నీవు దాడి వెడలి నప్పుడుత్కళదేశపు రాజులు భయపడి గతిచిట్లని శరీరములతోడన దేవతాస్త్రీలున్నపట్టణమునకు గాపురములు వోయెదరు; స్వర్గమునకును, గొండవీఁటికినిఁ బూర్వపుఁబెద్దలేమిసూత్రముఁబన్నిరోకదా!

ఇది చిత్రమనఁగా లోకములో రణరంగమందె మరణించి శత్రు శరముల వలని యాప గాయముల తోడి శరీరము లిచ్చట విడిచిన వారికే వీరస్వర్గము గలుగుఁ గాక పిఱికితనంబున బ్రతికిన వారికి స్వర్గ సౌఖ్య మెట్లబ్బును, సశరీర స్వర్గ మెట్లు గల్గు ననే శంక రాఁగా గృష్ణదేవరాయల దాడి విన్న మాత్రముననే ఉత్కలదేశస్థులగు రాజులు పూరి గఱచి గాయ పడని దేహముతోఁ గొండవీడు వదలి రాజమహేంద్రవరమునకు సమీపమందలికి రాచస్త్రీలపల్లకులఁగాపులుగాఁ బోదు రని భావము. కసువు గొఱికిన వారిని గొట్టఁగూడదని యుద్ధధర్మము. నిలింపశబ్దము, 'స్యాన్నిలింపః కిరాతశ్చ' యనియు, 'నిలింపా దేవశబరాః' అనియున్న నిఘంటువులవలన దేవతార్థకమును, కిరాతార్థకమువుటం జేసి యాశబ్దము మీఁదను బలసూదను వీఁడను శబ్దము మీఁదను శ్లేష కలిగి యిట్టి యర్థము వచ్చునట్లు చమత్కరింపఁబడియెను. ఇట బలసూదను వీఁడనఁగా నమశారామ మని కొందఱందురు.

ఉ. కూరిమిఁ గృష్ణరాయ నృప కుంజర చేరెఁ గళింగ రాజ్య ల
క్ష్మీ రమణీ లలామ నిను మిన్నులు ముట్టిన మోహనాలతోఁ
గారణ మెట్ల లక్ష్మి గసు గందని వేడుకఁ గృష్ణరాయ నిం
జేరన కాక వావి సెడఁ జెందునె సోదరుఁ డైన రుద్రునిన్. ౩౮.

టీక. కృష్ణరాయనృపకుంజర = కృష్ణరాయభూపాలశ్రేష్ఠుఁడా, కళింగరాజ్యలక్ష్మీరమణీలలామ = కళింగదేశరాజ్యలక్ష్మియనెడు పాలఁతిమిన్న, కూరిమిన్ = ప్రేమచేతను, మిన్నులుముట్టిన = ఆకాశమంటిన, మోహనాలతోన్ = ఏనుఁగులతో, (కళింగపతి నిజపుత్రిగనుక నని భావము. మోహనా లనఁగాఁ గోట యందలి శత్రునిరసన సాధనము లని కొంద ఱందురు. ఆపక్షమున వానిఁ బెరికి తెచ్చి నాఁ డని భావము). మోహనాలతోన్ = మోహములతో, నినుఁజేరెన్ = నిన్నుఁబొందెన్, కారణమెట్ల = ఏ క్రమమున నే హేతువు, లక్ష్మి = శ్రీదేవి, కృష్ణరాయనిన్ = శ్రీకృష్ణదేవుని, కసుగందని = వాడిపోవని, వేడుకన్ = ప్రీతిచేతను, చేరనకాక = పొందనేకాని, సోదరుఁడైన = సహోదరుఁడగు, రుద్రునిన్ = రుద్రదేవుని, వావిసెడన్ = వరుస చెడిపోవునట్లు, చెందునె = చెందునా, చెందదనుట.

తా. కృష్ణరాయా! కళింగరాజ్యలక్ష్మి యతిప్రేమచేతను నిన్నే చేరెను గాని ప్రతాపరుద్రునిఁ జేరక పోయె నేలననఁగా నా కళింగ రాజ్య లక్ష్మి లక్ష్మి యను నామమును వహించుటం జేసి తనకుఁ బ్రియుఁడగు కృష్ణ నామము వహించి నిన్నే చేరెనే గాని తనకు సోదరుఁ డగు రుద్రుని నామము వహించిన ప్రతాపరుద్రునిఁ బొందదని భావము. లక్ష్మీదేవికి రుద్రదేవుఁడు సోదరుఁడౌట యాగమప్రసిద్ధము.

సీ. కచ సక్త ఫణి కంచుకము మౌళి వీరకేదారంపుఁ బాగ చందంబు నొందఁ
గలయ నంగమున మర్కటకీట కృతమైన మగ్గంబు నేత్ర సంపద వహింప
ధ్వాంత గహ్వర శిలా తాడితాళిక చిక్కణాస్ర పంకము చంద్రమై పొసంగ
తను భృశ శ్రాంత వేష్టన లగ్న బర్హిబర్హణంబు ముచ్చన్నె చుంగై చెలంగ
నిద్ర మేల్కాంచి సెలయేట నీడఁ గాంచి, గోప వేషంబు సెడి తొంటి భూప వేష
మగుట యవ్వన మహిమఁగా నలికి యచటు, విడుచు గజరాజు నీధాటి వింధ్యవాటి.

టీక. కచ = జుట్టునందు, సక్త = తగులుకొన్న, ఫణికంచుకము = పాఁకుపబుసమున, మౌళి = శిరస్సునందు, వీరకేదారంపు = వీరకేదారమనియెడి పేరుగల, పాగ = ఉష్ణీషముయొక్క, చందంబున్ = రీతిని, ఒందన్ = పొందఁగా, కలయన్ = కలియునట్లు, (అంతటననుట). అంగమునన్ = శరీరమునందు, మర్కటకీట = సాలెపురుగు చేతను॥ ని॥ లూతాస్త్రీతంతువాయోర్ణనాభమర్కటకాస్సమాః ॥ కృత = చేయఁబడిన, మగ్గంబు = తంతురచన, నేత్ర = వలిపెంపుఁజలువయొక్క, సంపద = సంపత్తును, వహింపన్ = తాల్పఁగాను॥ ని॥ స్యాజ్జటాంశుకయోర్నేత్రమ్ ॥ ధ్వాంతగహ్వర=చీఁకటి గుహయందలి, శిలా = ఱాతిచేతను, తాడిత = పొడువఁబడిన, అళిక=నొసటియందలి॥ ని॥ లలాటమళికంగోధిః॥ చిక్కణ = చట్టమయిన, అస్ర=రక్తముయొక్క, పంకము= బురద, చంద్రమై = చెందిరమై, (సిందూరమైయనుట). పొసంగన్=ఒప్పుచుండఁగా, తను = శరీరముయొక్క, భృశ = అధికమగు, శ్రాంత = బడలికచేతనైన, వేష్టన = పొర్లాడుటచేతను, లగ్న = కఱచుకొన్న, బర్హిబర్హణంబు = నెమ్మిపురి, ముచ్చన్నె చుంగై = మూఁడువర్ణము లనఁగా నీల రక్త పీతవర్ణములు గల యుత్తరీయపుఁజెఱఁగై, చెలంగన్ = ప్రకాశించుచుండఁగా, నిద్రమేల్కాంచి = నిద్దరమేల్కని, సెలయేట= కొండవాఁకయందు, నీడఁగాంచి = నీడఁజూచుకొని, గోపవేషంబు = తానుధరించిన గొల్లనివేషము, చెడి = పోయి, తొంటి = పూర్వముదనకున్న, భూపవేషము = రాజవేషము, అగుట = సంభవించుట, అవ్వనమహిమఁగాన్=ఆవనసంబంధియయినమహిమ చేతనుగాను, (శంకించియనుట). అలికి = భయపడి, గజరాజు = గజపతి, నీధాటిన్ = నీదాడిచేతను, వింధ్యవాటి = వింధ్యపర్వతప్రాంతమందు, అచటు = తానున్న యా ప్రదేశమును, విడుచున్ = వదలును.

తా. నీవు దాడి వెడలి నప్పుడు గజపతి భయపడి కళింగదేశము విడిచి వింధ్య పర్వతమునకు పలస పోయి యచ్చట పసులఁ గాచు వాని రూపముతో నొక యరణ్యములోని చీఁకటి గుహలోఁ బ్రవేశించి వడివడిగాఁ బోవుచుండ నా గుహలో నున్న యొక్క ఱాయి నొసలు దాఁకె. దాని వలనఁ గ్రొత్త నెత్తురు రాలికి పేరుకొనియెను. దత్ప్రదేశమందు నే యాయాసముచేత నిదురించి మేలుకొని యాసమీపమునఁ బ్రవ

హించెడు సెలయేటి నీటిలో నీడఁ జూచుకొని తాను నిద్రఁ బోవుచుండఁగా నా గుహలో నుండెడు పాపకుబుసము జుట్టునకుఁ గలుచు కొనెను గావున నది యశేఁడు గానక భయభ్రాంతి చేత నుష్ణీషమనియును, తాను నిద్రించు నప్పుడు తన్గుహలో నొక్క సాలెపురుగు తన మీఁద మగ్గంపు నేత నేయఁగా నదిరవ సెల్లా యనియునుఁ మున్ను చెప్పఁ బడిన నొసటి గాయము సిందూరపుఁ దిలక మనియును, ఆగుహలో, దాను మిక్కిలి బడలిక చేతఁ బొర్లాడుటం జేసి చెమర్చి యున్న తన శరీర మెల్ల నంటి కొన్న నెమలిపింఛము చిత్రవస్త్ర మనియును, భ్రమాత్మకజ్ఞానమును బొంది తాను గుహలోఁ బ్రవేశించు నప్పుడు వహించి యున్న గోపాల వేషము రూపు చెడి తొల్లిఁటి భూపాల వేషము వచ్చెనే యిది యీవన మాహాత్మ్యముచేతఁ గాఁబోలు నని తలఁచి యా వేషముతో నచ్చట నివసించుటకు నీ వలని భయముచే నిచ్చగింపక యావలఁ బడలు నని భావము.

చ. అభిరతిఁ గృష్ణరాయ విజయాంకములీవు లిఖించితాళ సం
నిభముగఁ బొట్టునూరికడ నిల్పిన కంబము సింహభూధర
ప్రభుతిరుణాళ్లకుం డిగు సురప్రకరంబు గళింగమేదినీ
విభు నపకీర్తి కజ్జలము వేమఱుఁ బెట్టి పఠించు నిచ్చలున్. ౮౦.

టీక. కృష్ణరాయ = కృష్ణదేవరాయా, విజయాంకములు:—విజయ = జయించుట యొక్క, అంకములు = రేఖలు, ఈవు = నీవు, లిఖించి = వ్రాసి, పొట్టునూరికడ = పొట్నూరిసమీపమునందు, తాళసన్నిభముగ = త్రాటిచెట్టుపొడవునకుసమానమగునట్లు, నిల్పిన = నాటించిన, కంబము = స్తంభము, సింహభూధరప్రభు = సింహాచలస్వామి యొక్క, తిరుణాళ్లకున్ = బ్రహ్మోత్సవమునకు, డిగు = దిగివచ్చెడు, సురప్రకరంబు = దేవసమూహము, కళింగమేదినీవిభు=కళింగదేశాధీశ్వరుండగుగజపతియొక్క, అపకీర్తి= అపయశస్సనెడు, కజ్జలము = కాటుకనీరు, వేమఱున్ = పలుమాఱును, పెట్టి=కప్పు వేసి, నిచ్చలున్ = నిత్యమును, అభిరతిన్ = ఆసక్తిచేతను, పఠించున్=చదువును.

తా. నీవు విజయాక్షరమును వ్రాయించి పొట్నూరియొద్ద నాటించిన జయస్తంభము నందలి యక్షరములు లెస్స యగపడమిం జేసి గజపతి యపకీర్తియనెడు నల్లని కప్పు వేసి దేవతలు సింహాచల స్వామి తిరుణాళ్లకు వచ్చినప్పు డెల్ల మిక్కిలి యాసక్తి చేతఁ జదువుదు రని భావము.

సీ. సనకాది దివిజ మస్కరి ఫాల గోపీ చందన పుండ్రవల్లిక ల్నాకి నాకి
పెలల్చి హాహాహూహువుల దండియల తంత్రి ద్రెవ్వ సింగిణ్ణిలుగాఁ దివిచి తివిచి

సప్తర్షికృత వియన్ఝర వాలుకాలింగ సమితి ముచ్చెల కాళ్లఁ జమరి చమరి
రంభాప్రధానాప్సరఃపృథూరోజకుంభంబు లెచ్చటఁ గన్నఁ బట్టి పట్టి
తిరుగు హరిపురి సురతరు సురల మరిగి, బహుళ హాళిహాళీ భరిత కల్బరిగనగర
సగర పుర వర పరిబృఢ జవన యవన, పృతన భవదసి ననిఁ దెగి కృష్ణరాయ. ౪౧.

టీక. కృష్ణరాయ = కృష్ణదేవరాయా, బహుళ = దట్టమైన, హాళిహాళి = హలాహలిచేతను, భరిత = నింపఁబడిన, కల్బరిగనగర = కల్బరిగపట్టణముయొక్కయు, సగరపురవర:—సగర = సగరునియొక్క, పురవర = పట్టణశ్రేష్ఠ మగు నయోధ్యయొక్కయు, పరిబృఢ = దొరలయిన, జవన = వేగముగల, యవన = తురకలయొక్క, పృతన = సైన్యము, అనిన్ = యుద్ధమునందు, భవదసిన్:—భవత్ =నీయొక్క, అసిన్ = ఖడ్గముచేతను, తెగి = ఖండింపఁబడి మృతినొంది, హరి = దేవేంద్రునియొక్క, పురి= పట్టణమగు స్వర్గమందు, సురతరు = కల్పవృక్షములయందలి, సుర్ల = మద్యములను, మరిగి = అలవాటుఁజేసికొని, సనకాది = సనకసనందనాదులగు, దివిజమస్కరి = దేవమునులయొక్క॥ ని॥ భిక్షుఃపరివ్రాట్కర్మందీపారాశర్యపిమస్కరీ ॥ ఫాల = లలాటములయందలి, గోపిచందన = మృద్విశేషముయొక్క, పుండ్రవల్లికల్ = తీఁగెలవంటి యూర్ధ్వపుండ్రములను, నాకినాకి = (అభీక్ష్ణ్యమందుద్విరుక్తి). హాహాహూహూవుల = హాహాహూహూవులనెడుదేవగాయకులయొక్క, దండియలు = వీణలను, సెలసి=గుంజుకొని, తంత్రి = తంతువులు, తెగిప్వ = తెగిపోవునట్లు, సింగిణులుగాన్ =ధనుస్సులనువలె, తివిచితివిచి = ఆకర్షించియాకర్షించి, సప్తర్షి = సప్తమహర్షులచేతను, కృత = చేయఁబడిన, వియన్ఝర = ఆకాశగంగయందలి, వాలుకాలింగ = సైకతలింగముల యొక్క, సమితిన్ = సమూహమును, ముచ్చెలకాళ్లన్ = ముచ్చెలుదొడిగియున్న కాళ్లచేతను, చమరిచమరి = తాచితాచి, రంభాప్రధాన = రంభమొదలుగాఁగల, అప్సరః = అచ్చరలయొక్క, పృథు = పెద్దవియగు, ఉరోజకుంభంబులు=కుండలవంటి గుబ్బలను, ఎచ్చటఁగన్నన్ = ఎక్కడఁజూచినను, పట్టిపట్టి = పట్టుకొనిపట్టుకొని, తిరుగున్ = సంచరించును.

తా. కృష్ణరాయా అధిక కోలాహలధ్వనిగల కల్బరిగపట్టణముయొక్కయు, నయోధ్యయొక్కయు నాథులగు తురకల సేనాజనులు యుద్ధమునందు నీ ఖడ్గప్రహారముచేత మృతులై స్వర్గమందుఁ జేరియును దొల్లి వారు భూమిపై నున్నప్పటివలెనే యచ్చటను గల్ప వృక్ష మద్యములు పానము సేయుచును దేవ మునుల గోపి చందన పుండ్రములు నాకుచును మొఱవఁదనముచేత గంధర్వుల వీణలు దామ లాఁగికొని విండ్లు వంచినట్లు వంచుచును, సప్తమహాము నులాకాశ గంగాతీరములఁ జేయుచున్న సైకత లింగముల మాపు మాపుచును, రంభ మొదలగు నచ్చరల గబ్బి గుబ్బలఁ బట్టి పిసుకు

చుచు బాహ్యప్రకృతివాసన వదలక తిరుగు చున్నా రని భావము.

మ. అలుకన్ ఘోటక ఘట్టికా ఖురపుటీ హల్య న్ఖురాసాని పు
చ్ఛలు వోఁ దున్ని చలచ్చమూ గజ మదా సార ప్లుత న్గీర్తి పు
ష్కల సస్యంబిడి యేక ధాటి భళిరా కట్టించి తౌ దృష్టి కే
దులఖా నోగ్ర కపాల మర్థప హరి ద్భూ జాంగల శ్రేణికన్. ౭౨.

టీక. అలుకన్ = కోపముచేతను, ఘోటక = గుఱ్ఱములయొక్క, ఘట్టికా = దండుయొక్క, ఖురపుటీ = డొప్పలవంటిగిట్టలనియెడు, హల్యన్ = నాగళ్ల గుంపుచేతను, ఖురాసాని = ఖురాసానిదేశస్థులగు మ్లేచ్ఛులనియెడు, పుచ్ఛలు = పుచ్చ నెల్లు, (ఖురాసానిపుచ్ఛలనఁగాఁదురుకలకభీష్టములైనయాదేశపుపుచ్చచెట్లనియును జెప్పవచ్చును) పోఁదున్ని = చెడఁదున్ని, చలత్ = నడుచుచున్న, చమూ = సేనయందలి, గజ = యేనుఁగులయొక్క, మదాసార = మదధారాసంపాతమనియెడుధారావర్షముచేత, ప్లుతన్ = తడుపుటచేతనయినపదనుచేతను, కీర్తి = యశస్సనియెడు, పుష్కల = సమృద్ధమగు, సస్యంబు = పైరును, ఇడి = ఉనిచి, ఏక = ముఖ్యమగు, ధాటిన్ = దాడిచేతను, దృష్టికి = వెఱబొమ్మకొఱకు, ఏదులఖాన=ఏదులఖానుఁడను మ్లేచ్ఛునియొక్క, ఉగ్ర = భయంకరమగు, కపాలము = పుఱ్ఱెను, అర్థప = కుబేరునియొక్క, హరిత్ = దిక్కుయొక్క, భూ = భూమియందలి, జాంగల = మెట్టచేలయొక్క, శ్రేణికన్ = పఙ్క్తియందు, కట్టించితౌన్ = భళిరా, కట్టించితివి = మెచ్చఁదగున్.

తా. నీవుత్తరదేశమందు గుఱ్ఱపు దండుతో వెడలి ఖురాసానులను మ్లేచ్ఛుల నశింపఁజేసి యచ్చట నీకీర్తి నిలిపి యేదులఖానుఁడను పేరుగల మ్లేచ్ఛుని తల నఱికి వ్రేలఁగట్టించితివి గావున నది యాదేశమందలి మొలవ వేయఁబడిన నీకీర్తి యనెడు పైరుగల మెట్ట చేలకు దృష్టి పరిహారార్థముగా నెత్తించిన తలకాయ పుఱ్ఱెయ వలె నుండె నని భావము.

చ. సుమతి పునఃపునారచిత షోడశ దాన పరంపరా వసం
తముల ననంత విత్తము ననంత ననంత మహాగ్రహార బృం
దములు నొసంగు నిన్నొఱసి తారవ రాకకథా నిలింప భూ
జములు వహించు దుర్యశము షట్పద కోకిల కైతవంబునన్. ౭౩.

టీక. సుమతి = మంచిమనస్సుచేతను, పునఃపునః = మాటిమాటికిని, రచిత = చేయఁబడిన షోడశ, ధర్మశాస్త్రపేపూర్వస్యదీర్ఘోఽః, అను శాస్త్రముచేత సంధి. షోడశదాన = పదియాఱుదానములయొక్క, పరంపరా = సమూహమనియెడు, వసంతముల = వసంతకాలములయందును, అనంత = పారములేని, విత్తమున్ = ధనమును,

ను, మసృణ = స్నిగ్ధమగు, గురు = విశాలమగు, వక్షునకున్ = వక్షస్స్థలముగలవానికిని, జంభారి = దేవేంద్రుఁడే, ముఖ = మొదలగువారికి, అధ్యక్షునకున్ = నాథుఁడగువానికిని, అంభోజ = కమలములవంటి, అక్షునకు = నేత్రములుగలవానికి, సామి = అర్ధభాగము, హర్యక్షునకున్ = సింహమగువానికి, (సామిత్వర్ధేయనియమరము) (నరసింహాకృతికలిగినవాఁడనుట).

తా. సులభము.

కం. మర్దితకాళియఫణికిం, గపర్దభృదజబింబితాచ్ఛపదనఖఘృణికిన్
దోర్దండశార్ఙ్గకిణికఘ, కర్దమదినమణికిదనుజకరివరసృణికిన్. ౪౭.

టీక. మర్దిత = మర్దింపఁబడిన, కాళియ = కాళీయుఁడను పేరుగల, ఫణికి = సర్పముగలవానికి, (కాళీయుఁడను నాగేంద్రుని శిరస్సుమీఁద(గృష్ణుఁడు తాండవము సలిపెననుట), కపర్దభృత్, కపర్ద = జటాజూటమును, భృత్ = ధరించిన శివుని చేతను, అః = బ్రహ్మదేవుని చేతను, బింబిత = ప్రతిఫలింపఁబడిన, అచ్ఛ = పరిశుద్ధములగు, పద = పాదములయొక్క, నఖ = గోళ్లయొక్క, ఘృణికిన్ = కాంతులుగలవానికి, (పంచాస్యచతురాస్యులు విష్ణుని పాదములకు నమస్కరింతురనుట), దోర్దండ = దండమువంటిభుజమందలి, శార్ఙ్గ = శార్ఙ్గమను పేరుగల ధనస్సుయొక్క, కిణికిన్ = కాయలుగలవానికి (శార్ఙ్గకోదండమునొరయుటవలనఁ గాయలు గాచిన బాహువుగలవాఁడనుట) అఘ = పాపములనెడు, కర్దమ = బురదకు, దినమణికి = సూర్యుఁడగువానికి, (అనగా సూర్యుఁడు బురదనెండించినట్లు పాపములశోషింపఁ జేయువానికనుట), దనుజ = రక్కసులనియెడు, కరివర = గజశ్రేష్ఠములకు, సృణికిన్ = అంకుశమగువానికిన్.

తా. సులభము.

కం. గుహపుష్కరిణీతటఘన, గహనగుహాఖేటవంచకపుళిందునకున్
ద్రుహిణాండతుందునకయా, వహదీర్ఘాపాంగకరుణావాస్స్యందునకున్. ౪౮.

టీక. గుహపుష్కరిణీ = కుమారపుష్కరిణియొక్క, తట = దరియందు, ఘన = దట్టమగు, గహనగుహా = గుహవంటివనమందు, ఆఖేట = వేటయందు, వంచకపుళిందునకున్ = మాయచెందువాఁడగువానికిని, ద్రుహిణాండ = బ్రహ్మాండములు, తుందునకు = కడుపునందుఁగలవానికి, అయ = శుభములను, ఆవహ = ఆవహింపఁజేసెడు, దీర్ఘ = వాలికలగు, అపాంగ = కడగన్నులయందు, కరుణావాః = దయారసముయొక్క, స్యందునకున్ = జాలుగలవానికిని, (నేత్రాంచములయందుఁగరుణారసము వొరలుచున్నవాఁడనుట).

తా. సులభము.

కం. బంధురరథాంగధారా, గంధవహాప్తజ్వలచ్ఛిఖాపటలపున
స్సంధుక్షణఘృతరాహుప, లాంధోఽసృక్స్రుతికి వేంకటాచలపతికిన్. ౪౯.

టీక. బంధుర = ఘనమైన, రథాంగ = చక్రముయొక్క, ధారా = అంచుయొక్క, గంధవహాప్త = వాయుసఖుఁడగునగ్నిహోత్రముయొక్క, జ్వలత్ = మండుచున్న, శిఖా = జ్వాలలయొక్క, పటల = సమూహముయొక్క, పునస్సంధుక్షణ = పునస్సంధానకర్తయందు, ఘృత = ఆజ్యమైన, రాహు = రాహువనెడు, పలాంధః — పలం = మాంసమే, అంధః = అశనముగాఁగల రాక్షసునియొక్క, అసృక్ = రక్తముయొక్క, స్రుతికిన్ = స్రావముగల, వేంకటాచలపతికిన్ = వేంకటాచలరమణునకు, ఈ వేంకటాచలపతికి ననువిశేష్యమునకు, బూర్వోక్తములగు షష్ఠ్యంతశబ్దములు విశేషణములు.

తా. సుదర్శనచక్ర ధారాగ్నియందు రాక్షసులను హోమము చేయుట కాయగ్నియొక్క పునస్సంధాన కర్మమునందు రాహువుయొక్క కంఠరక్త స్రావ మాజ్యమై యుండెనని భావము.

వ. నా విన్నవింపం బూను నాముక్తమాల్యదా మహాప్రబంధంబునకుఁ
గథాక్రమం బెట్టి దనిన. ౫౦.

టీక. ఆముక్త = అనుభవించివిడువఁబడిన, మాల్య = విరులసరాల్లను, దా = ఇచ్చిన మాడికుడుత్తనాంచారను నాయిక కథ కలిగిన యీ ప్రబంధమునకుఁ గథాప్రారంభ మనుట.

తా. సులభము.

మ. లలితోద్యాన పరంపరా పిక శుకాలాప ప్రతిధ్వానము
ల్వలభీ నీల హరిన్మణీ పిక శుక స్వాసభ్రమంబూన్ప మి
న్నులతోఁ రాయు సువర్ణ సౌధముల నెంతుం జూపఁ జెన్నొందు శ్రీ
విల్లిపుత్తూరు సెలంగుఁ బాండ్య నగరోర్వీరత్న సీమంతమై. ౫౧.

టీక. శ్రీవిల్లిపుత్తూరు = శ్రీవిల్లిపుత్తూరను పట్టణము, పాండ్య = పాండ్యదేశము, నగర = పట్టణముగుమధురయొక్క, ఉర్వీ = భూమికి, రత్నసీమంతమై = మాణిక్యపుఁ బాపటబొట్టై, లలిత = ఒప్పుచున్న, ఉద్యాన = ఎలతోటలయొక్క, పరంపరా = గుంపులయందలి, పిక = కోయిలలయొక్కయు, శుక = చిలుకలయొ

డుగుబు = గృహములు, అనేకములు = పెక్కులు, పురంబునన్ = శ్రీవిల్లిబుత్తూరియందు, ఉల్లసిల్లున్ = ప్రకాశించును.

తా. శ్రీవిల్లిబుత్తూరియందలి గృహములు తమపైనఁ దామరమొగ్గలవలె మలఁచియున్న కెంపుల కలశములనెడు నెఱమంటి శిరస్త్రాణములు గలిగి బంగారుచేతఁ జేయబడిన యోడుబిళ్లలనెడు కవచముఁ దొడిగి స్వర్గమందలి ఇంద్రుని మేడయగు వైజయంతముతో యుద్ధము చేయుటకు సిద్ధపడి నిలిచి యున్నట్లుండు ననిభావము. యుద్ధసన్నద్ధులగు వీరులు తలలకుఁగట్టుకొని కవచములు దొడిగికొనుట ప్రసిద్ధము.

సీ. పాథోధిజలయుక్తిఁ బ్రాఁచి పట్టిన దిశా కరులనాఁదగుమరకతపుఁగరులు
కరుల తొండము సిక్కఁగబళించిమ్రింగిన హరులనాఁ దొండ మొప్పగు పదక్ష
హరులు దాపిన తాపలమర నేనుఁగు వోయి నీరార్చ నపరంజి నీటి వ్రాఁత
శ్రీలు లత్పార్శ్వ చిత్రిత శంఖచక్రములౌ రత్నంపుఁ దిన్నెలఁ బ్రతిఫలింపఁ
బెఱ పురాళి గృహశ్రీల పెండ్లియాడ, భవనరాజులు గట్టిన బాసికమనఁ
దనరు మణి తోరణములతో ద్వార వితతిఁ, బరఁగు వీధులు పురసూత్ర పట్టినట్లు. ౨౩.

టీక. పాథోధి = సముద్రముయొక్క, జల = జలముయొక్క, యుక్తిన్ = సంయోగముచేతను, ప్రాఁచిపట్టిన = పాఁచిపట్టిన, దిశాకరులనాన్ = దిగ్గజములనఁగా, తగు = తగునట్టి, మరకతపుఁగరులు = పచ్చలయేనుంగులును, కరులతొండముసిక్కన్ = ఏనుంగులతుండముమాత్రము మిగులునట్లు, కబళించి = ఆహరించి, మ్రింగిన = మ్రింగినట్టి, హరులనాన్ = సింహములనునట్లు, తొండమొప్పగు = తొండముచేఁబ్రకాశించుచున్న, పదక్ష = ఆమరకతవికారములగు, హరులు = సింహములును, తాపిన = చెక్కిన, తాపలు = సోపానములు, అమరన్ = అమరుచుండఁగా, ఏనుఁగుదోయి = గజద్వంద్వము, నీరార్చ = స్నానముచేయించెడు, అపరంజినీటి = బంగారునీటియొక్క, వ్రాఁత = చిత్తరువుయొక్క, శ్రీలు = లక్ష్మీప్రతిమలు, తత్పార్శ్వ = ఆప్రతిమల యుభయపార్శ్వములయందు, చిత్రిత = చింపఁబడిన, శంఖచక్రముల్ = శంఖచక్రములును, రత్నంపుఁదిన్నెలన్ = రత్నమయములగువేదులయందు, ప్రతిఫలింపన్ = ప్రతిబింబింపఁగా, పెఱ = ఇతరములగు, పురాళి = పట్టణసమూహముయొక్క, గృహశ్రీల = గృహసంపదలనియెడు స్త్రీలను, పెండ్లియాడన్ = వివాహమగుటకు, భవనరాజులు = తత్పురగృహములను రాజులు, కట్టిన = కట్టుకొన్న, బాసికమనన్ = పట్టబంధమనునట్లుగా, తనరు = ప్రకాశించున్న, మణితోరణములతోన్ = మాణిక్యతోరణములతోఁ గూడిన, ద్వారవితతిన్ = ద్వారసమూహముచేతను, వీధులు, పురిన్ = శ్రీవిల్లిబు

పురిన్=శ్రీవిల్లిబుత్తూరియందు, గిఱవుంచెనాన్=కుదువయుంచెననునట్లు, చెలంగున్= ప్రకాశించును.

తా. శ్రీవిల్లిబుత్తూరిలో నుండెడు గృహములు రత్నమయములైనవి గావున నా గృహములకు వినియోగము కాఁగా మిగిలిన రత్నములను గాపాడెద నని రత్నాకరుండగు సముద్రుండు పూటపడి యారత్నములు తీసి కొనియందుల కైతన సంతానమగు కల్పవృక్షములను పెద్దభార్యయగు గంగను దత్పట్టణమునందుఁ గుదువ యుంచెనో యన్నట్లు సంతత మెడతెగని యెఱ్ఱని బొంతలముల తోడి నారికేళపు మ్రాఁకులును వజ్రములచేత గట్టింపఁబడిన రాజమార్గము ప్రకాశించును. నారికేళములు గల్పవృక్షములం బలెను మార్గము తెల్లనికాంతి గలిగి యుండుటం జేసి గంగానదియుం బోలె వెలుంగుచున్న కతంబున నట్లుత్ప్రేక్షింపం బడియెను.

క. కోరకిత నారికేళక్ష్మారుహములు రత్నకుట్టిమంబులఁ దోచున్ ద్వార
ము, లయత్న కృత శృంగారంబుగ నలికి ముగ్గు ఘటియించి రనన్. ౫౫

టీక. ద్వారములు = వాకిళ్లు, కోరకిత = సంజాతకోరకములుగల, నారికేళక్ష్మారుహములు = టెంకాయమ్రాఁకులు, రత్నకుట్టిమంబులన్ = రత్నములచేఁగట్టింపఁబడిన భూములయందు, అయత్నకృత = యత్నముచేతఁ జేయబడని, శృంగారంబుగన్=శృంగారముగలుగునట్లు, అలికి = గోమయలిప్తముఁజేసి, ముగ్గుఘటియించిరనన్=రంగవల్లి కయుంచిరనునట్లు, తోఁచున్ = ప్రతిబింబించును.

తా. శ్రీవిల్లిబుత్తూరిలో వాకిళ్ల ముందఱ రత్నమయములైన భూములయందు మొగ్గలు పచ్చని యాకులు గల నారికేళములు ప్రతిఫలింపఁగా నా యిండ్లవారు యత్నముచేత సింగారింపకయే శృంగారము గలుగునట్లు ఆకుల నీడ యలికినట్లును మొగ్గల నీడ ముగ్గుబెట్టినట్లుండెనని భావము.

మ. శయ పూగాంబుజముల్ స్ఫుటింప దడఁబడం జన్దోయి లేఁగౌను పై
దయఁదప్ప న్పసపాడి పాగడపుఁ బావం బొప్పఁ జెంగల్వడి
గ్గియనీ రచ్యుత మజ్జనార్థము గటిం గీలించి దివ్యప్రబం
ధయుగాస్యల్ద్రవిడాంగన ల్నడుతు రుద్యానంబులన్ ద్రోవలన్. ౫౬

టీక. చెంగల్వడిగ్గియన్ = ఎఱ్ఱకలువపూలుగలకొలనియందు, పసపాడి = హరిద్రాలేపపూర్వకముగా స్నానముఁజేసి, అచ్యుత = శ్రీపతియొక్క, మజ్జనార్థము = అభిషేకముకొఱకు, నీరు=తీర్థము, కటిన్ = ఒరొండియందు, కీలించి = ఉనిచికొని, శయ = హస్తములవలి, పూగాంబుజముల్ = పూజకొఱకైనకమలములు, స్ఫుటిన్ =

తీర్థప్రబింబ యందు, తడఁబడన్ = తొట్రుపడుచుండఁగా, చందోయి = కుచద్వంద్వము, శోగౌనుపై = లేఁతనడుముమీఁద, దయదప్పన్ = కృపాహీనమగుచుండఁగా, దివ్యప్రబంధ = ద్రావిడప్రబంధముతోడ, యుక్ = కూడికొన్న, ఆస్యల్ = వక్త్రములుగల, ద్రవిడాంగనల్ = ద్రావిడస్త్రీలు, ఉద్యానంబు = ఎలదోఁటయొక్క, లోత్రోవలన్ = అంతర్మార్గములయందు, పాగిడపుఁబాదంబు = పాగడములనియెడుభూషణముధరించిన పాదము, ఒప్పన్ = ఒప్పుచుండఁగా, నడుతురు = వత్తురు.

తా. విల్లుబుత్తూరియందలి ద్రవిడస్త్రీలుద్యానంబులలోని చెంగలునలుగల కొలఁకులలోఁబసపుతోడ స్నానము జేసి స్వామి తిరుమంజనము నిమిత్తము తీర్థంపు బిందె యాదేశాచార రీతిగా ఒంటి యందు ధరించి తమ హస్తములయందు నాళములు గలిగి పూజార్థము లైన కమలములు తత్కటములయందుఁ దొట్రిల్లుచుండఁగుచ భారము చేత నులేఁతనడుము లసియాడుచుండ దివ్య ప్రబంధానుసంధానముఁ చేయుచు నుద్యానంబులలోపలి త్రోవలయందుఁ బాగడాలుధరించిన పాదములు గదల నడుచుచుందు రని భావము.

మ. కలయ న్నీలపుటంపుఁ దల్లియొలు దాఁకం దేటనీ రొప్పర
థ్యలకూపంబుల మీలఁ జూచి వలభివ్యాసంగితుంగద్రుశా
ఖలలో నాడి గబాలన క్కకుముకుల్ క్రుంకై పడు న్లేచు ము
చ్చిలి గేహేందిర ద్రావిడీ పరిచితిం జెండాడు చదంబునన్. ౫౭.

టీక. గేహేందిర = గృహలక్ష్మి, ద్రావిడీ = ద్రవిడస్త్రీలయొక్క, పరిచితిన్ = పరిచయముచేతను, ముచ్చిలి = వంచించి, (యెవ్వరికినిగనుపింపక యనుట.) చెండాడు = కందుకక్రీడసలిపెడు, చందంబునన్ = రీతిచేతను, లకుముకుల్ = పక్షివిశేషములు, కలయన్ = నిండునట్లుగా, నీలపుటంపు = నీలమణివికారమగు, తల్లియొలు దాఁకన్ = బొడ్డుటాలదనుకను, (పైనుండెడుపెద్దయొలుయనుట). తేటనీరు = నిర్మలోదకము, ఒప్పు = ఒప్పుచున్న, రథ్యలకూపంబుల = వీథులచాపులయందలి, మీలన్ = మీనములను, చూచి = ఈక్షించి, వలభి = చూరులయందు, వ్యాసంగి = కూడియున్న, తుంగ = పొడవులగు, ద్రు = వృక్షములయొక్క, శాఖలలోన్ = కొమ్మలలలోను, ఆడి = సంచరించి, గబాలనన్ = గబాలనుశబ్దముగలుగునట్లు, క్రుంకై = సందడించి, పడున్ = దుముకును, లేచున్ = మఱలనుద్గమించును.

తా. వీథులలోని యొలుల్ల బావులలో దల్లియొలులనఁ బైకుబికి యున్న తేట నీటిలోఁ గనఁబడుచున్న చేఁపలను జూచియుంటె చూరున్న వెలసి వ్యాపించియున్న

పెద్దపెద్ద తరు శాఖలయందు వ్రేలాడించి యా బావులలో దముకుచు లేచుచున్న లకుముకిపిట్టలు ద్రవిడస్త్రీ పరిచయము గలిగిన గృహలక్ష్మి తన శరీరము గానఁబడకుండ రహస్యముగాఁ జెంబు గొట్టుచుండఁగా నట్టి పుట్ట చెంబ్లవలె నుండెనని తాత్పర్యము. లకుముకులు చేఁపల బట్టి కొనుటకు నీట దుముకుట ప్రశస్తము.

మహాస్రగ్ధర. స్వనిలింపావాసదత్త్వాశనదతల మిథస్తారతమ్యంబు లీ రెం
డును దీనుల్గాంచు లమ్మాడ్పులన యడుగం దోఁచు నుద్యద్రతోన్మే
షన సిద్ధద్వంద్వ బృందాలయ తటబిల కల్యాణమంథాద్రులో నా
వనజాక్షస్యందనద్వంద్వము లిఖితనరావాప్త దాంపత్య మొప్పున్. ౫౭.

టీక. లిఖిత=చిత్రింపఁబడిన, నర = మనుష్యప్రతిముల చేతను, అవాప్త = పొందఁబడిన, దాంపత్యము=మిథునములుగల, వనజాక్షస్యందనద్వంద్వము(వనజాక్షీచ-వనజాక్షశ్చ-వనజాక్షౌ-వనజాక్షయోస్స్యందనే-తయోర్ద్వంద్వం-పుమాన్ స్త్రియాయను సూత్రమువలన స్త్రీవాచకమగు వనజాక్షీశబ్దములు ప్తమైపురుష వాచకమగు వనజాక్షశబ్దమాత్రము శేషించుటంజేసి యట్టి రూపంబు వచ్చెంగావున),వనజాక్ష = శ్రీశ్రీపతులయొక్క, స్యందన= తేరులయొక్క, ద్వంద్వము=జోడు,స్వనిలింపావాసదత్త్వాశనదతల:—స్వ=తమయొక్క, నిలింప = దేవతలకొఱకు, ఆవాస=నివాసముయొక్క, దత్వ=ఇచ్చుటయొక్కయు, అశన = ఆహారముయొక్క, దతల=యిచ్చుటయొక్కయు, (ద్వంద్వాంతమున బహుత్వము). మిథః = ఒండొంటియొక్క, తారతమ్యంబులు = తక్కువెక్కువలు, ఈ రెండును=ఈయశనవాసములు, దీనుల్గాంచు=రక్తులుపొందుచున్న, అమ్మాడ్పులన=అమాడుగులనే (అమాడుగులయందు నివాసభుక్తిదానములు విస్తరించికలవనుట).(మతియుక్వచిద్గకారోవ యనుసూత్రము కలిమిం జేసి మాడుగులు మాడుపులనియును గలవు). అడుగన్=వేడుకొనుటకు, తోఁచు=కానఁబడుచున్న, ఉద్యత్=ఒప్పుచున్న, రత=సురతమందలి, ఉన్మేశన=కూటములుగల, సిద్ధ=సిద్ధులను దేవయోనుల యొక్క, ద్వంద్వ=మిథునములయొక్క, బృంద=సమూహములకు, ఆలయ=నివాసస్థానములగు, తటదరులును, బిల=గుహలుగల, కల్యాణమంథాద్రులో=హేమాద్రిమందరాద్రులో, (మేరుమందర పర్వతములో యనుట.) కల్యాణమనబంగారము=మంథమనఁగవ్వము గాన నాకల్యాణమంథశబ్దములద్రిశబ్దముతోడ సంబంధించి ద్వంద్వాంతమందు బహువచనమగుచున్నది.) నాన్=అనునట్లుగాను, ఒప్పున్=ప్రకాశించును.

తా. మానవదంపతుల రూపములు గాఁ జెక్కఁబడిన బొమ్మలు గల శ్రీశ్రీపతుల రెండు తేరులు—దేవతలకు నివాసమిచ్చిన మేరు పర్వతమును నాహారమగు నమృత మిచ్చిన మందర పర్వతమును దమతమ పుణ్య తారతమ్యముల నడిగి తెలిసికొనవలయునని

న్నట్టి శ్రీవిల్లిపుత్తూరిలో దీనులకు నివాసంబులును నాహారంబు లిచ్చెడు నాగృహము లుఁ జేరి తమ దరులయందును గుహలయందును సురతలయందు ననురక్తులగు సిద్ధ స్థానములతోడ నున్నవోయన్నట్లు ప్రకాశించుచున్నదని భావము. తేరులమీఁది బొమ్మఁ లిద్ధదంపతులంబోలెనున్నవి. ఈపద్యమునందు దీనుఁగాంచున ననుచోట మిన్నుఁగాంచున యుఁగొందఱు సమన్వయము నచ్చట నాకాశము నంటుచున్న యమ్మాడువులని యన్వయింతురు

సీ. సవలయధ్వనిగాఁగ సాలివ్రేయు నదల్పు యతి నైన గుండె ఝల్లనఁగలంప
నుడిసిన మొగమెత్తి చూడకుండు పరాకు కుసుమబాణుని నైనఁ గువిటుఁ జేయ
శ్రీకార్య పరులఁ గాంచిన లేచి మ్రొక్కు నంజలికి నింద్రుండు నక్కొలువుఁ గోర
హరి గృహావసర శంఖాకర్ణనముఁద్రిప్పఁ గడగంటి జిగి ప్రజఁ గాఁడిపాఱ
కవఱు లుంకించి వ్రేయఁ గొప్పవియ నవలి,కరమున నమర్పఁ బైఁటలోఁ మరుని జటువు
బిల్లక్రియఁ బట్టుకించలఁ బిగువుఁ జన్ను, నిక్కఁ దిన్నెలఁ బాత్రము ల్నెత్తమాడు. ౫౯.

టీక. సవలయధ్వనిగాఁగ = కంకణధ్వనికలుగునట్లుగాను, సాలివ్రేయు = పాచికవ్రేసెడు, అదల్పు = అదలించుట, యతినైన = సన్యాసినైనను, గుండెఝల్లనన్ = హృదయముజలపరింపఁగా, కలంపన్ = కలుషముఁజేయుచుండఁగా, (ఇచ్చటసారెవ్రేయునదల్పనికొందఱుమనుచుగాక యదియేకారయుతరేఫాంతశబ్దమయ్యెనేనిదాని బహువచనముసారెలనినిల్వావలయునట్లుగాక మహాభారతంబుననడ్డసాళ్లనియు నడ్డసాళులని యుఁబ్రయోగంబుకలిమింజేసి యిచ్చటనికారయుతలకారాంతశబ్దముగా నుండుటయేసమీచీనంబు) నుడిసినన్ = ఎదురైనప్పుడు, మొగమెత్తి = ముఖముపైకెత్తి, చూడకుండు = వీక్షింపకుండెడు, పరాకు = గరువచందము, కుసుమబాణునినైనన్ = పూవిలుతునైనను, కువిటుఁజేయన్ = నీచవిటునిఁజేయఁగా, శ్రీకార్యపరులన్ = భగవత్కైంకర్యపరులను, కాంచిన = చూడఁగానే, లేచి = ప్రత్యుత్థానముఁజేసి, మ్రొక్కు = మ్రొక్కెడు, అంజలి = దోసిలికై, ఇంద్రుఁడున్ = దేవేంద్రుఁడును, అక్కొలువున్ = ఆభగవత్కైంకర్యమును, కోరన్ = అపేక్షింపగా, హరిగృహావసర:— హరి = స్వామియొక్క, గృహ = ఆలయమునందలి, అవసర = ఆయాసములయొక్క, శంఖ = శంఖనాదముయొక్క, ఆకర్ణన = వినుటను, త్రిప్పు = మరల్పెడు, కడగంటి = నేత్రాంతములయొక్క, జిగి = బెడఁగు, ప్రజన్ = చూచెడువారిని, కాఁడిపాఱన్ = ఊచ్చిపోవఁగా, (అంతవాఁడియనుట.) కవఱులు = అడ్డసాళ్లు, ఉంకించి = కుప్పించి, వ్రేయన్ = వ్రేయఁగా, కొప్పవియన్ = తుఱుమువదలఁగా, అవలికరమునన్ = రెండవహస్తముచేతను, అమర్పన్ = సవరింపఁగా, పైఁటలోన్ = పైయెదలోపలను, మరుని = స్మరునియొక్క, జటువుబిల్లక్రియన్ = తోమ్మకిందనునిలిచికొనుచుట్టుదిండువలెను, పట్టు

కంచలన్ = పట్టురవికయందు, బిగువుఁజన్నుఁ = బటువుగుబ్బ, నిక్కన్ = నిట్టవో డనఁగా, పాత్రములు = వేశ్యాంగనలు, తిన్నెలన్ = వేదికలయందు, నెత్తము = ద్యూతమును, ఆడున్ = క్రీడించును.

తా. ఆశ్రీవిల్లిబుత్తూరియందు నరుఁగుల మీఁద వేశ్యకాంతలు యతీశ్వరుని హృద్యమైన గలంగునట్లు విలాసము గలిగి యదలించి కంకణములు కదలి ధ్వని సేయునట్లు పాచిక వేయుచును, మఱియు నెట్టివారెదటికి వచ్చినను మొగ మెత్తి చూడక పరాకుఁ జేయుచు గరువము గలిగియును స్వామి యాలయము కైంకర్యముఁ చేసెడు వారిఁ జూచినమాత్రముననే లేచి మ్రొక్కుచుండఁగా నట్టి మ్రొక్కు తనకుఁ గలుగ వలయునని దేవేంద్రుఁడును స్వర్గమందలి యప్సరోగణముల కొలువుగల ప్రభుత్వము నైన మాని యాదేవాలయమందుఁ దా నొక్క సేవకుఁడై యుండవలయు నని కోరుచుండఁగా నట్టి సౌందర్యము గలిగి యప్పుడప్పుడు స్వామి యాలయమందలి కొలువుల సమయములలోని శంఖనాదములు వినఁగానే బెదరిబెదరి చూచుచునుఁ బాచికలూనికఁజేసి దొరలిం పఁగాఁ గొప్పు వీడఁగా నాటయందలి త్వరపాటుచేతను రెండవ చేత నాకొప్పు సవరించుటకుఁ జేయెత్తినప్పుడు పైటలోనే పట్టు రవికలో నిక్క వాడిచెడు బటువు గుబ్బ కానరాఁగా నిట్టి విలాసములు గలిగి పగడ సాలాడుదురని భావము.

సీ. వీడెంపుఁ బలుకెంపు విరిసి వెన్నెల గాయ వరిగింజ నొకటఁ బల్వరుసఁదోమ
నోఁజసి యొత్తిన మఱుఁ గొందక మేన నిగ్గులు దేర పస పూడి జలక మాడ
ముసుక గాకుండఁ బైయెదలోనఁ గేలార్చి కలయ వెంటను జంటఁగలప మలఁద
రతిరయచ్ఛిన్న సూత్రమునఁ జిక్కక ముత్తెములు వ్రాలఁ గఱగతికలు వహింప
నొలసినను నెట్టిసరసునైనఁ గులముఁదెలియఁ, బ్రభుత సెడి పల్లవుఁడు వేడ వడిన నేఁద
నృపతి వెలియంతిపురముగా నెన్న మెలఁగ, బాసఁ గృతిఁజెప్పనలఁతు లప్పద్మముఖులు.

టీక. వీడెంపుఁబలుకెంపు = తాంబూలసంబంధియగునరుణకాంతి, విరిసి = విచ్చిపోయి, వెన్నెలగాయ = శుభ్రవర్ణమేర్పడఁగా, వరిగింజనొకటన్ = ఒక్కశాలిబీజముచేతనే, పల్వరుసన్ = దంతపఙ్క్తిని, తోమన్ = ధావనముఁజేయుటకును, ఓఁజసియొత్తినన్ = ఊచియద్దినను, మఱుంగొందక = తెలివలుపనంటక, మేనన్ = శరీరమందే, నిగ్గులుదేరన్ = మిసిమిగనుపించునట్లు, పసపూడి = పసపుఁబూసికొని, జలకమాడన్ = స్నానముఁజేయుటకును, ముసుకగాకుండన్ = ముసుగుఁదనములేకుండ, పైయెదలోన = పైటలోనే, కేలార్చి = హస్తమాడించి, కలయ = వ్యాపించునట్లు, వెంటను = వెంబడిగాను, చంటన్ = కుచములయందు, కలపమలఁదన్ = కదంబముఁబూయుటకును, రతిరయ = పురుషాయితసురతవేగముచేతను, ఛిన్న = త్రెస్సిన, సూత్ర

మున = త్రాటియందును, చిక్కక = చిక్కుపడక, ముత్తెములు వ్రాలఁగన్ = ముత్యములు రాలుచుండఁగా, గఱగఱికలు = సౌకర్యములను, వహింపన్ = తాల్చుటకును, వలసినను = సమీపించినను, ఎట్టివారునైనన్ = ఎంతధనరూపాదులుగలవానినైనను, కులముఁదెలియన్ = వర్ణమడిగి తెలుసుకొనుటకును, ప్రభుతసెడి = ప్రాభవములేక, పల్లవుఁడు = తనముదుపటివిటకాఁడు, పేదవడినన్ = దరిద్రుఁడైనను, ఏఁదన్ = పోషించుటకును, నృపతివెలియంతిపురముగాన్ = నరపాలునియొక్క బహిర్గతమైనపురియొక్క యంతఃపురమనఁగాను, ఎన్నన్ = గణింపఁగాను, మెలఁగన్ = సంచరించుటకును, బాసన్ = ప్రతిభాషయందును, కృతిఁజెప్పన్ = ప్రబంధనిర్మాణముఁజేయుటకును, అప్సర్సముఖులు = ఆవారవనితలు, నలఁతులు = సామర్థ్యముగలవారు, నలఁతుల నుపదముపల్వురుసఁదోమననునది మొదలుగాఁగృతిఁజెప్పనను దానివఱకు నెనిమిదిపనులకును న్వయించుచున్నది.

తా. విడియము పెక్కుమారులు నములుటం జేసి మిక్కిలి కెంపెక్కిన తమదంతముల యందలి యరుణిమ విరిసి తెల్లనగు నట్లా వారవనితలొక్క పరిశెంజచేతనే దంతధావనముఁజేయుదు రనియును, స్నానముఁ జేయునప్పుడు పూసి కొన్న పసపు పరీక్షకైనను దెల్లని వస్త్రముతో తాచినను వస్త్రము నంటక వారి మేనులందే నిగనిగలాడుననియును, వారు చనుగవ బయల్పడనీక పైఁటలోనే కాశ్మీరకస్తూరీ కర్పూరములు మొదలగు వాసనలు గల కదంబము మిక్కిలి పలుచనఁగాఁబూసి కొందు రనియును, సురతమందు తమహారముల ముత్తియంబులు తెగిన సూత్రంబుననుండక పఱువెత్తునంత వడిగా నుపరతిఁజేయుదు రనియును, ఎట్టిసొబగుఁడైన నెట్టిధనికుఁడైనఁదమ్ము వలచె నేని యతని కులము దెలియక కేవల ద్రవ్యాపేక్ష చేతనే యతనితోఁ గూడరనియును, మున్ను దమతోడఁ జెలిమి చేసిన విటుఁడు ధనహీనుఁడయ్యె నేని యతని నాదరించి ప్రోతురనియును, రాజాంతఃపుర స్త్రీజనమునకుఁ గలిగినంత పరువుగలిగి సంచరింతు రనియును, మిగుల విద్యావంతులు గావునఁ గావ్య రచనఁ జేయుటకైనను నేర్పుఁగలవారని భావము.

ఉ. అంచిత హార వల్లి వలయాభరణంబుల తక్కఁ ద్రోయుఁజి
లంచుఁ బసిండి యేణమద మంగముఁ జేర్చుట తక్కఁ గ్రోయుఁజి
ల్గించు జవాది ధూపితమయిందుట తక్క విదిర్చుఁ బూవుఁజె
ప్పించు జెలంగ తక్క నగు యౌవత మొత్తునటంచు నన్యమున్. ౭౦.

టీ. యౌవతము = యువతిసమూహము, అంచిత = సొగసగు, హారవల్లి = వల్లికలవంటిముక్తాహారముల చేతఁజేసిన, వలయాభరణంబుల = వలయభూషణములే, తక్క న్ –

కాక, పసిండి = బంగారము, చిల్మంచు = చిలుముపట్టుననుచు, త్రోయుచున్ = పరిహరించును. ఏణమదము = కస్తూరి, అంగముఁజేర్చుటతక్కన్ = శరీరమందునలఁదుటయే కాక, జవాది = సంకుమదమును, జిడ్డంచున్ = చమురుతోడిపలినమని, త్రోయున్ = ప్రవగించును. ధూపితమునుంపుటతక్కన్ = శిరోజములకగరుసాంబ్రాణిమొదలగువస్తువులధూమధూపముఁబొందుటయేకాక, పువ్వున్ = పుష్పమును, చెమ్మంచున్ = తడియనుచు, విదిర్చున్ = విసర్జించును. జిలుంగదక్కన్ = సన్నఁపుఁజీరయేకాక, అన్యమున్ = పెఱసరిగచీరనైనను, ఒత్తునటంచున్ = ఒత్తుకొనునని, నగున్ = పరిహాసించును.

తా. ఆపురిజనరాండ్రు మిగుల సుకుమార శరీరములు గలవారగుటం జేసి రంగగు బంగరు కన్న మిన్న యగు వన్నియగల తమ నెమ్మేనుల ముత్తియంబుల సొమ్ములు ధరింతురే కాక పసిడి సొమ్ములు చిలుము పట్టు నని త్రోసి వేతురు. పునుంగు జిడ్డు గలదని దానిఁ బూసికొనుట వదలి కస్తూరియే పూయుదురనియును, తుఱుములయందు విరులఁ దురిమిన నవి చెమ్మగిల్లు నని వాని విడిచి ధూపధూపములచేత నే వెండ్రుకలకు వాసన లెక్కింతురనియును, సరిగ మొదలగు వానిచే నెక్కుడు వెలగల వలువల నేని యవి యొఱుగ నొత్తుననీ దానిఁ పరిహసించి జిలుంగు వలువలే కట్టుదు రనియును నిట్టి నాగరికంబు గల వారని భావము.

ఉ. వేవిన మేడపై వలభి వేణికఁజంట వహించి విప్పఁగాఁ
బూవులు గోటమీఁటుతఱిఁబోయెడు తేఁటుల మ్రోఁత కామికిం
కావహమౌఁ గృతాభ్యసన లౌటను దంతపు మెట్ల వెంబడిం
జేవడి వీణ మీఁటుటలుఁ జిక్కుడలించుటలు న్సరింబడన్. ౭౨

టీ. వేవిన = ప్రభాతముకాఁగానే, (“క్వచిద్గకారోవః” అనుసూత్రమును బట్టి వేగిన యను శబ్దము వేవినయనియునుం గలదు.) మేడపై = సౌధాగ్రముమీఁదను, వలభిన్ = లోపయందు, వేణికన్ = జడను, చంటన్ = కుచమందు, వహించి = ధరించి, విప్పఁగాన్ = ఉద్గ్రథనముఁజేయుటగొఱకు, పూవులు = పుష్పములను, గోటమీఁటుతఱిన్ = నఖముచేతవిదిర్చుసమయమునందు, పోయెడు = విచ్చిచనుచున్న, తేఁటులమ్రోఁత = భ్రమరముల ధ్వని. కృతాభ్యసనలౌటను:— కృత = చేయఁబడిన, అభ్యసనలౌటను = అభ్యాసముగలవారౌటచేతను, దంతపుమెట్లవెంబడిన్ = వీణకువేసియున్న దంతపుమెట్ల వెంబడిఁగా, చేవడి = హస్తలాఘవముచేతను, వీణమీఁటుటలున్ = వీణవాయించుటలును, చిక్కుడలించుటలున్ = శిరోజములచిక్కుఁదీయుటలును, సరింబడన్ = సదృశ

ములగుచుండఁగా, కామిశంకావహాః:—కామి = కాముకులకు, శంకావహాః = సంశయాస్పదమగును. (ఈపద్యమునందువారస్త్రీలనియధ్యాహారముఁజేసికొనవలయును).

తా. ఆపట్టణమందు వారస్త్రీలు తెల్లవారఁగానే మేడ మీఁదఁజూరువెంబడి గూర్చుండి తమ వేనలి కుచోపరిభాగము మీఁదధరించియా జడవిప్పుచు నందలి పుష్పములు గోట విదిలించునప్పుడు పరిమళార్థమయి ముసరికొని మరల విచ్చి పోవుతుమ్మెదలు గానఁజేయుచుండఁగా నా ఝుంకారము విని వీథిఁబడిఁ బోవుచున్న కాముకులు నిలిచి యాస్త్రీలు చేతులు వడివడిగా నాడించుట వీణవాయించి నట్లుండఁగాఁ బుష్పములు దంతపు మెట్లవలెనుండఁగా జడ వీణవలెనుండఁగా నా స్త్రీలువీణాభ్యాసము గలవారగుట వలన నప్పుడు జడ విప్పుట వీణవాయించుటకా అని సంశయింతు రని భావము. సందేహాలంకారము.

క. అళివచఃకార్పణ్యం, బా లేమల చెవులు సోఁకదధమాన్వయ జీ
ర్ణాలావణ్యులపిలుపున, కైలాభముఁ దెలిపెనేనియవి శ్రీలగుటన్. ౬౭.

టీక. అళివచఃకార్పణ్యంబు:—అళీ = చెలికత్తెలయొక్క, వచః = వాక్కులయొక్క, కార్పణ్యంబు = లేమిడి, అధమాన్వయ = తక్కువజాతియొక్కయు, జీర్ణ = ముసలివాండ్రయొక్కయు, అలావణ్యుల = సౌందర్యహీనులయొక్కయు, (ద్వంద్వాంతమునబహువచనము) పిలుపునకై = పిల్చుటకొఱకు, లాభముఁదెలిపెనేని = ఆదాయమెఱింగించెనేనియు, అవి = ఆస్త్రీలచెవులు, శ్రీలగుటన్ = లక్ష్మీస్వరూపములగుటచేతను (శ్రీకారములఁబోలినవనుట) ఆలేమల = తరుణులగునా స్త్రీలయొక్క, చెవులుసోఁకదు = చెవిఁజొరదు.

తా. జవ్వనము గలయా వార కాంతల దాఁపుననుండు చెలులుకొందఱు పురుషులఁదాల్చువారై యాపురుషులు మిక్కిలి ధనమిచ్చెదరని చెప్పిన నవ్వారకాంతలు పురుషులు తక్కువకులము వారయినను ముసలి వారైనను సొగసు లేని వారైనను వారిని దెలియఁజేయు చెలుల పలుకులు వినరనియును సామాన్యలు కేవల విత్తాపేక్ష గలవారైన నచ్చటి వారలు తమ కులీనులై యౌవనము గలిగి సుందరులైన పురుషుల నేకాని కూడరని భావము.

చ. ద్రవిడ కుటుంబినుల్ పసపు దాచిన రత్నపుఁ దాపక్రింద నం
బువు దెరవారఁగా నిమర వోయి గరుత్తతి పచ్చఁబారిన
న్భవనసరోమరాళములు ఘర్మమయచ్ఛద గుచ్ఛవిస్ఫుర
ద్దివిజధునీ మరాళ పితతి భ్రమఁ బూన్చెఁ బురిన్ భ్రమించుచున్. ౬౮.

టి. భవనసరోమరాళములు:—భవన=గృహసంబంధులగు, సరః=కొలఁకులయందలి, మరాళములు = హంసలు, ద్రవిడకుటుంబినుల్ = ద్రావిడస్త్రీలు, పసపుఁజాచిన = పసపుఁజాదినట్టి, రత్నపుఁదాఁపక్రింద = రత్నసోపానముక్రింద, అంబువు దెరవారఁగా = ఉదకము తరంగితమగుచుండఁగా, నిదురవోయి=నిద్రించి, గరుత్తతి:—గరుత్ = ఱెక్కలయొక్క, తతి = గుంపు, పచ్చఁబాఱినన్ = హరిద్రావర్ణముగలదికాఁగా, పురిన్ = శ్రీవిల్లిబుత్తూరను, భ్రమించుచున్ = తిరుగుచును, భర్మమయ = స్వర్ణమయములగు, ఛద = ఱెక్కలయొక్క, గుచ్ఛ = గుత్తులచేతను, విస్ఫురత్ = ప్రకాశించుచున్న, దివిజధునీమరాళి:—దివిజధునీ = ఆకాశగంగయందలి, మరాళి = హంసలయొక్క, వితతి = సమూహముయొక్క, భ్రమన్ = భ్రాంతిని, పూన్చున్ = వహింపఁజేయును.

తా. ద్రావిడస్త్రీలు గృహముల వెనుకనుండెడు కొలనిలోఁ బసపాడి స్నానము సేయునప్పుడు రత్న సోపానము క్రింద హంసలు నిద్రఁబోవుచుండఁగా నాపసపు నీరు ఱెక్కల కంటికొని పచ్చబడియెఁగావున నాహంస లేపట్టణమందుఁ దిరుగఁగా బంగారు ఱెక్కలుగల స్వర్గమందలి హంసలని చూపఱభ్రమింపించుననియు నచ్చటికొలఁకుల సోపానములు మణిమయము లనియును భావము.

మ. తలఁబక్షచ్ఛటఁగ్రుక్కి బాఁతువులు కేదారంపుఁ గుల్యాంతర
స్థలి నిద్రింపఁగఁ జూచియారెకు లుషస్నాతప్రయాతద్విజా
వలి పిండీకృతశాటుల న్సవిఁ దదావాసంబుఁ జేర్పంగ రే
వులడిగ్గన్వెసఁబాఱు వానిఁగని నవ్వున్శాలిగోప్యోఘముల్. ౬౫

టీ. బాఁతువులు = బాఁతులనియెడుజలపక్షులు, తలన్ = తమతలలను, (జాత్యేకవచనము) పక్షచ్ఛటన్ = ఱెక్కచాలునందు, క్రుక్కి = క్రుచ్చియని (క్రుచ్చియను పాఠముంగలదు) కేదారంపు = వరిమళ్లసంబంధులగు, కుల్యా = కాలువలయొక్క, అంతరస్థల = మధ్యప్రదేశమందు, నిద్రింపఁగన్ = నిద్రపోవుచుండఁగాను, చూచి = కాంచి, ఆరెకులు = ఊరికాఁపరులు, ఉషస్స్నాత = ప్రాతస్స్నానముఁజేసినట్టియు, ప్రయాత = చనినట్టి, ద్విజావలి = బ్రాహ్మణసమూహముచేతను, పిండీకృత = పిడుచలుగాఁజేయఁబడిన, శాటులన్=వస్త్రములనియెడు, సవిన్ = భ్రమచేతను. తదావాసంబున్:—తత్ = ఆబ్రాహ్మణులయొక్క, ఆవాసంబున్ = గృహములను, చేర్పంగ = చేర్చుటకొఱకు, రేవులన్ = రేవులయందు, డిగ్గన్ = దిగఁగా, వెసన్ = వేగముచేతను, పాఱు = పరుగెత్తెడు, వానిన్ = ఆబాఁతులను, కని=చూచి, శాలిగోప్యోఘముల్:—శాలిగోపీ = పైరుగాఁపరులగు స్త్రీలయొక్క, ఓఘములు = సమూహములు, నవ్వున్=హసించును.

తా. ఆపట్టణసమీపమునందు వరిమళ్లకు దిద్దిన కాలువలయందు బాఁతులు తమ స్వభావముచేతఁ దలలు రెక్కలలోఁ దూర్చికొని నిద్రించుచుండఁగాఁ దలపాగలు వానిఁజూచి యుషఃకాలమందు స్నానార్థమై యాకాలువలకు వచ్చిన బ్రాహ్మణులు తమ వస్త్రములను బిండియిచ్చుటకుంచిపెట్టి పోయిరని తలంచి వాని మడుల వారివారి గృహములలో నొప్పగించుటకై రేవులలో దిగఁగాఁ నేయాపక్షులు పఱచుటఁ జూచి యచ్చటఁ జైయులను గాఁపాడుచున్న గణితలు తలఁగులను బరిహసింతురని భావము.

మ. సొరిదిం జేర్చిన తీఁగెమల్లియలు ఖర్జూరంబులుం బుష్పమం
జరులున్ మామిడిగుత్తులుం గుసుమముల్ సంపెంగలుం బచ్చగ
న్నెరులున్ బాశెలుఁ గల్గి రాజనము కాంతిం దారు ముల్లూపి చే
లరుదారన్నగుఁ బువ్వుఁదోఁటల బలాకానీకదంభంబునన్. ౬౬.

టీ. చేలు = కేదారములు, (బహువచనేషుత్రచిన్నులోపశ్చ యనునన్నయ ఛన్నీయ సూత్రమువలనఁ జేనుశబ్దబహువచనమారూపమయ్యెన్) సొరిదిన్ = వరుసగాఁగ, చేర్చిన = విత్తినట్టి, తీఁగెమల్లియలు = అల్లుమల్లెలును, ఖర్జూరంబులు = ఖర్జూరపుఁజెట్లును, పుష్పమంజరులున్ = పువ్వులగుత్తులును, మామిడిగుత్తులున్ = రసాలగుచ్ఛములును, కుసుమముల్ = పుష్పములును, సంపెంగలున్ = చంపకములును, పచ్చగన్నెరులున్ = పచ్చపూలకరవీరములును, బాశెలు = బాశెలనుపుష్పవిశేషములుం గలిగిన, పువ్వుఁదోఁటలన్ = పుష్పోద్యానములను, (తీఁగెమల్లియలు, ఖర్జూరంబులున్, పుష్పమంజరులున్, మామిడిగుత్తులున్, కుసుమముల్, సంపెంగలున్, పచ్చగన్నెరులున్, బాశెలుఅను పేరుగలధాన్యవిశేషములు), కల్గి = తమయందుఁ గలిగి, రాజనము = రాజనము పేరుగలశాలివిశేషముయొక్క, కాంతిన్ = ప్రకాశముచేతను, తారు = అర్థకారకబహువచనము (చేలనుట), ముల్లూపి = ముల్లునూని, (రాజనములకుముల్లుగలిగియుండుట సహజము. త్రాచునఁబాఁచునప్పుడు భాగముగూర్చునప్పుడు ముల్లుప్రాలునుగాన దమతమసామ్యవిమర్శయందుఁ దామే పొచ్చెమయ్యెననుట). బలాకానీక:— బలాకా = బెగ్గురుపిట్టలయొక్క, అనీక = సమూహమునియొక్క, దంభంబునన్ = నెపముచేతను, అరుదారన్ = ఆశ్చర్యమగునట్లు, నవ్వున్ = ప్రహసించును. (ముల్లూపియనుచోట) ప్రథమైకవచనమాత్రేదేవికృతానాంతాదయోపికథ్యంతే యనుసూత్రమాంకరము).

తా. అప్పటి వరిచేలు పువ్వుఁదోటలయందుఁ గలతీఁగెమల్లియలు మొదలుగా బాశెలను పదము వఱకుఁ జెప్పఁబడిన పేరులుగలధాన్యవిశేషములు దమయందుఁ గలిగి తోటలయందుఁ గలుగని రాజనము విశేషముగాఁ గలిగి యారాజనమునఁ గలముల్లునియొక్క

టీ. కలుగుండ్లతోడ = ఱాతిగుండ్లతోడ, ఈడ్వడు = సమానములగు, పెనుఁడ్లు = పెద్దఫలములు, అడుగునన్ = భూమిలోనే, పండి = ఫలించి, వ్రీలి = బ్రద్దలై = బురదవలై, మధు = రసము, పుట్టఁగన్ = కల్గఁగా, గ్రావన్ = పానము సేయుకొఱకు, తేంట్లు = భృంగములు, (ఇచ్చటఁ దేఁటియనుశబ్దమునకుబహువచనప దంబునర్థముపరముగాఁగా దేఁటులనిరూపమువచ్చెంగావున-రోలోడలటాముదితాంతస్య వాలుక్స్నలోలోక్ష్వయనుసాంధ్రిశబ్దచింతామణిసూత్రమును బట్టియలతేఁటిశబ్దాంతమం టిటికన్నకారముకల్పములుగాలుప్తంబగుటంజేసి తేఁట్లనినిలువవలసి యుండినను తేంట్ల సూక్ష్మబిందుయుతముగా బహుప్రయోగముల కలిమిం జేసియును, “శాస్త్రప్రయోగవహా శ్శాస్త్రంబలవదుచ్యతే। అనిష్పన్నే పదే తేన ప్రయోగాశ్రయణంహితమ్” అను వికృ తివివేక సూత్రము కలిమి బలిమిం జేసియును నిల్లే బోంట్లు మొదలగు శబ్దములు గనంబడు చుండుటం జేసియును దేంట్లని యుండుటే సాధువుగాఁదోఁచుచున్నది. మల్లడి గొని = పెనఁగొని, చుట్టిరాన్ = చుట్టికొనిరాఁగాను, భిన్న = పగలినట్టి, కట = చెక్కులయందలి, పాంసుల = పరాగితమైన, భూరిమదాంబు = అధికమదజలముయొక్క, సేచన = తడుపుగలట్టియు, అజడ = కదలుచున్న, దృఢ = గట్టి, శృంఖలా = సంకెలతోడను, యుత = కూడికొన్న, వసంతమదద్విరదాధిపాకృతిన్, వసంత = వసంతునియొక్క, మదద్విరదాధిప = మత్తశేనుఁగుమిన్నలయొక్క, ఆకృతిన్ = ఆకారముచేతను, పనసలన్ = పనసచెట్లయందు, పొలుచున్ = ప్రకాశించును.

తా. వేరుపనస పండ్లు భూమిలోనే పండి పగులఁగా నారసము పగిలిన భూమిలో నుండి పైకివచ్చి బురదకాఁగా నవ్వాసనకుఁదుమ్మెదలు పెనగొని చుట్టుకొనఁగా నాపం డ్లే వసంతుని మత్తశేనుంగుల వలె నున్న వనియును, మదాతిశయము వలన భిన్నములైన చెక్కుల వలన దొఱఁగెడు మద దారలతోఁ గలసిన దుమ్ముతోడి బురుదవలె నాఫల రసము న్నదనియును కదలు చున్న యినుప సంకెలి వలెఁ జుట్టుకొన్న తుమ్మెద లున్నవని భావము.

ఉ. చాల దళంబుగాఁ బృథుల, చమ్పక కీలనఁ బొల్పు బొంకుఁ దో
మాలె లనంగఁ బండి మహీ, మండలిఁ జీఱుచు వ్రాలి గంధ మూ
ర్చాలసయైన భృంగ తతి, నాఁడుద కప్పమరన్నలావళు
ల్వ్రీలి గెల ల్సుగంధ కద, ళీ వన పఙ్క్తుల నొప్పునప్పురిన్. ౭౯.

టీ. అప్పురిన్ = ఆపట్టణమందు. సుగంధకదళీవనపఙ్క్తులన్. సుగంధకదళీ = సుగంధములను పేరుగలయనఁటిచెట్లయొక్క, వన = తోటలయొక్క, పఙ్క్తులన్ = గుంపులయందు, గెలల్ = గుచ్ఛములు, చాలన్ = మిక్కిలియు, దళంబుగాన్ =

కరి మస్తకేక్షు శంఖ వరాహో జ్జ్వలదంష్ట్రి శుక్తిజాతంబులు ముత్తెము లొప్పువర్ణముల వి విధములై॥ అని చెప్పఁబడిన రత్న శాస్త్ర పద్ధతిచేతఁ జెఱకులయందు ముత్యములుండుట ప్రసిద్ధము.

తా. ఆపట్టణమందుఁ జెఱకు తోఁటలలోనే తమల పాకు తీఁగెలును బోక ప్రాఁకులు నాటయున్నవని యును ఆచెఱకు పాలచ్చటనే పండు చున్నా రనియును పోకల మట్టలప్పటప్పటికిఁ బరిపక్వము లై చెఱకుల మీఁదఁబడఁగా నందలి ముత్తెములు చెదరి ప్రాయ్యిలోఁ బడి సున్నమగుచున్న దనియును అట్లు సున్న మగుటకుఁ బోక చెట్లనియెడు పురుషుల కంఠములను దమలపుఁదీగెయను పొలఁతి యుల్లు కొనుటయనియెడు కవుఁగిలింతఁజేసి మన కిద్దఱకు ననురాగము కల్గుటకు నీసున్నముమందని తెలుపఁగా దానివలన నాపోకచెట్లే సున్నముఁజేయుచున్న వనియును ఆకు పోకలకు సున్న మెఱుపు తెచ్చునది యనియును భావము.

చ. అలరఁ బురంబునం దొగల, నంతర దామరఁ బ్రాఁచిఁ గప్పురఁపుఁ
పలపులు మీఱలోఁ పలుఁద, వాలుగ మొత్తము వోరనీరుగో
ళ్ళు కళకళ యంచుఁ గ్రుంక మెడ, గుంపుల వంపులు దోఁప మావి తోఁ
పుల విరులన్బయి న్నడువఁ, బొల్చు పురాతన తీర్థ కుండముల్. ౭౧.

టీ. పురంబునన్ = అప్పట్టణమందు, తొగల = కలువలచేతను, అంతరదామరన్ = జలవల్లిచేతను, ప్రాఁచి = శైవాలముచేతను, కప్రఁపున్ వలపులు = కర్పూరవాసనలు, మీఱన్ = అతిశయింపఁగా, లోన్ = లోపలను, పలుద = నత్రువలగు, వాలుగమొత్తము = వాలుగచేఁపలగుంపు = పోరన్ = కలపింపఁగా, నీరుగోళ్లు = జలకుక్కుటములు. (సలోప్యయను సూత్రమును బట్టినీరుకోడి యనుశబ్దము బహువచనమందు నీరూప మును వచ్చును.) కళకళయంచు = కళకళధ్వనిఁజేయుచు, గ్రుంకు = మునుఁగుసట్టి, మెడగుంపుల = కంఠసమూహములయొక్క, వంపులు = నమ్రీకరణములు, తోఁపన్ = కానరాఁగా, మావితోఁపులన్ = మామిడితోఁపులయందు, విరులన్ = పుష్పములచేతను, పయిన్ = ఉపరిభాగమందు, నడువఁబొల్చు = నడుచుటకుఁ దలనగు, పురాతనతీర్థకుండముల్ = ప్రాఁతనీటిగుండములు, అలరున్ = ఒప్పును.

తా. ఆపట్టణమందు మామిడితోఁపులలోని ప్రాఁత బావులందు సనియును బావులయందుఁ గలువలు మొదలయిన వాని వాసనలు కర్పూర వాసనల వలెనుండు నని యును లోపల వాలుగచేపలు చెరలాడు ననియు నీరుకోళ్లు మునుఁగుచు లేచుచుండు ననియుఁ బైనినిండిన పూలచేత నవి బావులని తెలియరాక నడిచి పోవచ్చునని పించు ననియును భావము.

శా. సాయంకాలములం దదీశ మురజి, త్సద్మస్వనద్దుందుభి
స్స్ఫాయత్కాహళికా ప్రతిస్వనతదోఃపఙ్కుంజగర్భంబుల
న్మ్రోయుం గేళివనిం గులాయ గమనప్రోత్తిష్ఠ దన్తస్సర
స్థ్సాయి శ్వేత గరుద్గరుత్పటపటాత్కారంబుఁ గ్రేంకారముల్. ౭౨.

టీ. సాయంకాలములన్ = సూర్యాస్తమయకాలములయందు, కేళివనిన్ = లీలోద్యానమందు, కులాయగమన-కులాయ = గూఁడులనుగూర్చి, గమన = పోవుటకొఱకు, ప్రోత్తిష్ఠత్ = లేచుచున్న, అంతస్సరః = కొలఁకులలోన. స్థాయి = ఉన్నట్టి, శ్వేతగరుత్ = హంసలయొక్క, గరుత్ = ఱెక్కలవలనఁబుట్టిన, పటపటాత్కారంబును = పటపటాత్కృతియును, క్రేంకారముల్ = కంఠక్రేంకృతియును, తదీశ- తత్ = ఆశ్రీవిల్లిబుత్తూరికి, ఈశ = స్వామియగు, మురజిత్ = మన్నారుకృష్ణునియొక్క, సద్మ = కోవెలయందు, స్వనత్ = మ్రోయుచున్న, దుందుభి = భేరులయొక్కయు, స్ఫాయత్ = వృద్ధియగు, కాహళికా = బూరుగలయొక్కయు, ప్రతిస్వనత = ప్రతిధ్వనులగుట, తోఁపన్ = తోఁచునట్లు, కుంజగర్భంబులన్ = పొదరిండ్లలోపలను, మ్రోయున్ = ధ్వనిఁజేయును.

తా. సాయంకాలములయందు విల్లిబుత్తూరియందుండు నుద్యానవనములలో సరస్సులయందు హంసలు విహరించుట చాలించి గూండ్లకుఁ బోవుటకు లేచునప్పుడు వాని ఱెక్కల వలనఁ బుట్టిన ధ్వనులును గంఠధ్వనులును వినఁబడఁగా నప్పుడే యా పట్టణమందు స్వామి యగు మన్నారు కృష్ణుని కోవెల సంధ్యాకాలువులో మ్రోసెడు భేరుల ధ్వనులును గాహళముల ధ్వనులును వ్యాపించి పొదరిండ్లలోఁ బ్రతిధ్వను లిచ్చుచున్నట్లు దోఁచు నప్పుడు పటపటాత్కారము భేరీప్రతిధ్వనిగాను క్రేంకారము కాహళ ప్రతిధ్వనిగాను దోఁచుననిభావము.

మ. పాలయుం గాడ్పులు దఙ్మహాలయవదంభోజాక్షవక్షస్తుల
స్యలఘుస్రఙ్మకరందబిందువులఁ బన్న్యారంపుఁ బున్నెంపుఁ గం
పులఁ దాపత్రయ మీఁటి పీట నటనప్రోద్యోగసజ్జీభవ
ల్లలనాపర్జిత కైశిక క్షరిత కల్హారాళి నల్లార్చుచున్. ౭౩.

టీ. పీటన్ = అప్పట్టణమందు. ఉదఙ్మహాలయవత్ - ఉదక్ = ఉత్తరదిశయందలి, మహత్ = గొప్పదియగు, ఆలయవత్ = కోవెలగలిగిన. అంభోజాక్షు = మన్నారుకృష్ణునియొక్క, వక్షః = అఱ్ఱునందలి, తులసీ = తులసీదళములచేతనైన, అలఘు = గొప్పలగు, స్రిక్ = మాలికలయందలి, మకరందబిందువులన్ = మరందకణముల

చేతను, పణ్యారంపు = అపూపసంబంధులగు, పుణ్యంపు=పవిత్రములగు, కంపులన్ = వాసనలచేతను, తాపత్రయిన్ = ఆధ్యాత్మికాధిభౌతికాధిదైవికములనుతాపత్రయము ను, మీఁటి=పోవిడిచి, వటన=నాగవాసమనెడు, ప్రోద్యోగ = ఉద్యోగమునకు, సజ్జీభవత్=అయితమగుచున్న, లలనా = వారకాంతలచేతను, అపర్జిత = విడువఁబడిన, కైశిక = కొప్పులవలన,క్షరిత = జాఱఁబడిన,కల్హారాళిన్ = చెంగలువపూలచాలును, అల్లార్చుచున్ = మెల్లనఁగదలించుచు, గాడ్పులు = వాయువులు, పొలయున్ = వీఁచును. ఈపద్యమందు దక్షహాలయ పదంభోజాక్ష శబ్దముద్రవిడభాషయందు—నడబెరుం గోయిలుడయయని యా మన్నారుకృష్ణుని కేర్పడి యున్న దాని వలనఁగలిగినది. కంపుల ను పదముసుగంధమనుటకు చింత్యము.

తా. ఆపట్టణమందు వాయువులు మన్నారు కృష్ణుని వక్షస్థలమందలి తులసీవనమా లికల మకరంద బిందువుల మీఁద వీఁచుటంజేసి యా శైత్యంబును బరిమళంబును స్వా మి కోవెలయందలి యపూపములపైఁగా వీఁచుటం జేసి పుణ్యసౌరభంబును అందలి యా టకత్తెల కొప్పుల చెంగలువల నల్లనల్లనఁ గదల్చుచు మాంద్యంబును నందలి సౌరభంబు ను గలిగి సంచరించు ననిభావము.

చ. మలయపు గాలిరేలు వనమాలి విమాన పతాక ఘల్లుమం
చులియఁబసిండి మువ్వ గమి,యొక్కొక మాటు గదల్ప నుల్కి-మి
న్నలము తదీయ హేమ వర,ణాంచల చమ్పక శాఖలంబఁబ
క్షులు రొద సేయ వేగె నని,కూడుమరల్కలు దేరి దంపతుల్. ౨౪.

టీ. మలయపుగాలి = మలయమారుతము, రేలు = రాత్రులయందు, వనమాలి = స్వామియొక్క, విమానపతాక- విమాన = కోవెలయందలి, పతాకన్ =ధ్వజమందు, పసిండిమువ్వగమిన్=బంగారుచిఱుగంటలగుంపు, ఘల్లుమంచులియన్=ఘల్లుమనిధ్వనిసే యునట్లు, ఒక్కొకమాటు=ఒక్కొకసారి, కదల్పన్=కదలింపఁగా,మిన్నలము=ఆ కసమునంటెడు, తదీయ = ఆకోవెలసంబంధియగు, హేమవరణ = బంగారుప్రాకార ముయొక్క, అంచల = అంచులనున్న, చమ్పకశాఖలందు = సంపెంగకొమ్మలయందు, పక్షులు = పులుఁగులు, ఉల్కి = అదరుపాటుఁజెంది, రొదసేయన్ = కలకలఁబలు కఁగా, దంపతులు = ఆపట్టణమందలిస్త్రీపురుషులు, వేఁగెనని = తెల్లవారెననుకొని, అల్కలుదేరి = ప్రణయకోపములనుమాని, కూడుదురు = సంభోగింతురు.

తా. ఆపట్టణమందు స్వామి కోవెలధ్వజస్తంభమందున్న బంగారు మువ్వలు రాత్రుల యందు మలయమారుతమువలనకదలి ఘల్లుమని యొక్కొక్కసారి చప్పుడు కాఁగా

నాఁకోవెల బంగారు ప్రాకారము వెంబడి నున్న సంపెంగ కొమ్మలయందు నిద్రించుచు న్న పక్షులదరి ధ్వనిఁ జేయఁగా విని పక్షులు గూయుచున్నవి తెల్లవార వచ్చెనని భ్రమించి ప్రణయ కలహములు వహించియున్న దంపతులు కోపములుమాని యప్పుడ రమింతు రని భావము.

చ. కలమపుటెండుగ ల్ద్రవిడకన్యలు ముంగిటఁ గాచి యుండి త
జ్జలరుహనాభ గేహ రురుశాబము సారెకు బొక్కులాడఁగొం
డెలపయికమ్మ గ్రామ్యతరుణీతతి డించిన పేఁపగంపలం
దలమగుచున్న చెంగలువ, దండలఁదోలుదు రప్పురంబునన్. ౭౫.

టీ. అప్పురంబునన్ = అవిల్లిబుత్తూరను, ద్రవిడకన్యలు = ద్రావిడకన్యకలు, కలమపుటెండుగల్ = రాజనపువడ్లుపోసినయెండుగలను, ముంగిటన్ = గృహపురోభాగమందు, కాచియుండి = కనిపెట్టియుండి, తజ్జలరుహనాభ. తత్ = ఆపట్టణమందలి, జలరుహనాభ = స్వామియొక్క, గేహ = కోవెలయొక్క, రురుశాబము = ఇఱ్ఱిపిల్ల, సారెకు = మాటిమాటికిని, బొక్కులాడన్ = ఆయెండఁబోసినవడ్లుదినుచుండఁగా, కొండలపైకి = తమకొండెసిగలమీఁదికిగా, అమ్మన్ = విక్రయించుటకై, గ్రామ్యతరుణీతతి = పల్లెస్త్రీలసమూహము, డించిన = అక్కడదించుకొనియున్న, పేఁపగంపలన్ = పేములచేనల్లినగంపలయందు, దలమగుచున్న = నిండియున్న, చెంగలువదండలన్ = ఎఱ్ఱకలువదండలచేత, తోలుదురు = పోఁజోపుదురు.

తా. అవిల్లిబుత్తూరియందు ద్రవిడకన్యలు ముంగిళ్ల నెండఁబోసియున్నవడ్లకుఁగావలియుండఁగానచ్చటిస్వామికోవెలలోని పెంపుడు జింకపిల్లయావడ్లుమాటిమాటికి బొక్కుచుండఁగానాపిల్లను వేఱుమఱియొక దానిచేఁగొట్టిన నొచ్చుననియెడు నానృశంస్యముచేతను దమకొండెసిగలపైకిగాఁదెచ్చివిక్రయార్థ మచ్చటదించుకొని యున్న గ్రామ్యస్త్రీ పేఁపలగంపలలోని కలువదండలచేతనే తోలుదు రనిభావము.

సీ. ఎదు రేగి సాష్టాంగ మెరఁగి పాద్యంబిచ్చి, నారికేళ కటాసనములనునిచి
నునుబోఁక పొత్తిఁగుట్టిన దొప్పగమితోడ,రంభావిశాల పర్ణములు వఱచి
శాల్యన్నసూపాజ్య కుల్యాబహువ్యంజ, న క్షీరదధులర్పణంబుఁజేసి
వార్చిన పిదప సంవాహన మంఘ్రుల,కొనరిచి తాంబూల మొసఁగి కుశల
మడిగి పోయెద మన్న దవ్వనిచి సిరికిఁ,దగిన సత్కృతిఁ జేసి ఖేదమునమగిడి
యర్చఁ గావింతు రెపుడు నిట్లాత్రిషు లైన,భాగవతులకు నప్పురి భాగవతులు. ౭౬.

టీ. అప్పురిన్ = ఆపట్టణమందలి, భాగవతులు = భగవత్సంబంధులు, అతిథులైన = అభ్యాగతులైన, భాగవతులకున్ = భగవద్భక్తులకు, ఎదురేగి = ఎదురుగాబోయి, సాష్టాంగము = కరపాదఫాలవక్షోభుజములనియెడియష్టావయవములతోగూడునట్లు, ఎఱఁగి = ప్రణమిల్లి (శ్లో॥ వైష్ణవం వైష్ణవో దృష్ట్వా దండవత్ప్రణమేద్భువి, యన్నట్లు సంపూర్ణప్రణామముఁజేసియనుట) పాద్యంబిచ్చి = పాదప్రక్షాళనముఁజేసి, నారికేళకిటాసనములన్ = నారికేడపుటాకులచేనల్లినచాఁపలయందు, ఉనిచి = కూర్చుండఁబెట్టి, స్నానాద్యనుష్ఠానములు మున్నె తీర్చికొనివచ్చినారుగాన, నునుబోకపాత్రిన్. నును = మృదువగు, పోకపాత్రిన్ = పోకమట్టచేత, కుట్టిన = కూర్చిన, దొప్పగమితోడన్ = దొన్నెలగుంపుతోఁగూడ, రంభావిశాలపర్ణములు = వెడందయరఁటియాకులు, పఱచి = విస్తీర్ణముఁజేసి, శాల్యన్న = వరియన్నమును, సూప = ప్రప్పును, ఆజ్యకుల్యా = నేతికాలువలును, బహువ్యంజన = పెక్కుపరికరములును, క్షీరదధులు = పాలుపెరుగులును, అర్పణంబుఁజేసి = వారికిసమర్పించిన భోజనానంతరము. వార్చినపిదప (హస్తప్రక్షాళన పాదప్రక్షాళనములవెనుక నాచమనము జేసిన యనంతరమందు) అంఘ్రులకున్ = వారిపాదములకు, సంవాహనము = మర్దనము, ఒనరించి = చేసి (పాదములఁబిసికియనుట.) తాంబూలమొసఁగి = విడెమిచ్చి, కుశలమడిగి = వారప్పటికి సేద దేరి యుండఁగాఁ గుశలప్రశ్నఁజేసి, పోయెద మన్నన్ = వారే పోయెద మని చెప్పి రేని, వీరుబలాత్కారముగా నిల్పుటకు స్వాతంత్ర్యములేనివారుగావున వెంబడించి, దవ్వనిచి = దూరముగననిచి, సిరిక్రిఁదగిన = తమకలిమికిఁదగిన, సత్కృతిఁజేసి = సత్కారముఁజేసి. (సంభావనయిచ్చియనుట) ఖేదమునన్ = ఎడఁబాసినదుఃఖముచేతను, మగిడి = తిరిగి, ఎప్డును = ఎప్పుడు, ఎల్లయిట్లు = ఈచెప్పినట్లు, అర్చఁగావింతురు = పూజసేయుదురు.

తా. సులభము ఇచట భాగవతు లతిథులంబూజించి రనుటవిష్ణుచిత్తుఁ డీరీతిని భాగవతు లంబూజించు నని సూచించుచున్నది.

శా. అందుండుం ద్వయసద్మపద్మవదనుం, డద్వంద్వుఁ డశ్రాంతయో
గానందూబద్ధమధుద్విషద్విరదుఁడు, న్వర్థాభిధానుం డురు
చ్ఛందోబృంద తదంత వాగపతనా సంజాత తజ్జన్యని
ష్పంద ప్రీత సుసంవిదాలయుఁడు విష్ణుచిత్తుండనన్. ౪౭.

టీ. ద్వయసద్మపద్మవదనుండు. ద్వయ = ద్వయమను శ్రీవైష్ణవమంత్రమునకు, సద్మ = గృహమైనట్టియు, పద్మ = కమలమువంటి, వదనుండు = ముఖముగలయట్టియు. అద్వంద్వుఁడు, ఇత్యాద్వంద్వ = సుఖదుఃఖములులేనియట్టియు, అశ్రాంత = ఎడతెగని, యోగ = ధ్యా

సమయోగమనెడు, అందూ = సంకెళ్లచేత, బద్ధ = కట్టంబడిన, మధు ద్విషత్ = మధుసూదనుండనియెడు, ద్విరదుండు = ఏనుంగు గలయట్టియు, ఉరుచ్ఛందో బృంద, ఉరు = బహు విధములయిన, ఛందః = వేదములయొక్క, బృంద = సమూహము యొక్కయు, తదంత, తత్ = ఆవేదములయొక్క, అంత = అంతములగు నుపనిషత్తులయొక్క, వాక్ = వాక్యములయొక్క, అపఠనా = చదువమిచేతనే, సంజాత = పుట్టినట్టియు, తజ్జన్య = ఆవేదవేదాంత జన్యమగునట్టియు, నిష్పంద = చలింపనియట్టి, ద్వైత = చిదచిదీశ్వర భేదకమైన, సుసంవిత్ = మంచిజ్ఞానమునకు, ఆలయుండు = గృహమగునట్టి, విష్ణుచిత్తుండనక్ = విష్ణునందుంజిత్తము గలవాండనఁగా, అన్వర్థాభిధానుండు = సార్థకనామధేయుండగు పరమయోగి, నిష్ఠక్ = సదాచార సంపత్తిచేతను, అందుక్ = ఆశ్రీవిల్లిబుత్తూరియందు, ఉండుక్ = నివసించును.

తా. ఆ శ్రీవిల్లిబుత్తూరియందు నిరంతరము ద్వయానుసంధానముఁ జేయుచు సుఖదుఃఖములు శీతోష్ణములు సరిగాఁదలంచుచుఁ దన నిరంతర యోగముచేత శ్రీపతిని వశపఱచుకొని వేదవేదాంతములు చదువకయే వానివలనఁ గలుగవలసిన నిశ్చల ద్వైతజ్ఞానమునకుఁ దాను నివాసభూమియై విష్ణుచిత్తుండను సార్థకనామధేయము గల యొకమహాయోగి నిష్ఠఁగలిగియుండునని భావము, (ద్వయ తిరుమంత్ర చరమ శ్లోకములు వైష్ణవ సాంప్రదాయికములు).

వ. అమ్మహీసురవరుండు ప్రకృతికంటెఁ బరుండగు దన్నును దనకంటెఁబరుండగు పరమేశ్వరుం బరమేశ్వరప్రసాద బహుజనసకృత సుకృతఫలరూపయగు నాచార్యకృపగు ప్రధానంబు నిధానంబుఁ దెలిపినగతిం దెలుప నాత్మీయ తదీయ శేషశేషిత్వ సంబంధంబనాద్యంబుగాఁ దెలిసి యీ తెలివిగలిగి యఖర్వనిర్వృతిం గాంచి సుఖించు పరమయోగికి బహుక్లేశదంబులగు చదువులం బనియేమి యీ వివేకంబు లేనివాని హేతువాదంబు ధాతువాదంబు కాణాదంబు పాణినాదంబు కాపిలంబు చాపలంబు మీమాంసహింసవ్యాకరణంబు శరణంబటుగాక చదువదొరకొనిన నరునకుఁగాలంబు నాలంబువిఘ్నంబు లఖిలోద్యమఘ్నంబులందులకు సామగ్రి గిట్టకిటన గొంకెయుంగనగు మదంబుపుటపుటనమదముట్టుం జదివెనేనియు సముత్పన్న విజ్ఞానుండై త్రైగుణ్యవిషయంబులగువాని నానీతధాన్యుండు నిష్ఫలంబైన పలాలంబును నాలబ్ధమధుండు సిక్థకంబును విడుచువడువున విడువవలయుఁగావున శాంతిదాంతి పరతంబరమైకాంతిసైన నాకుమొదలనివి యధిగమింపం దుద విసర్జింపనేమి ప్రయోజనంబు వాదిభంజనంబు రాజరంజనంబును జేయుచుఁ బునర్జననంబులకు విసువనిజనంబులకుఁ గానిమ్ము, మాదృశులకుఁ దదీయఖ్యాతియూతిలాభంబుక్షోభంబు పూజనంబు వ్యోజనంబని వితర్కించి యుర్వరఁ బూర్వాం

బున సౌవీరభూరమణునకు గౌరవంబంగీకరించి బోధించి ముక్తి కనిచిన భరతభూమిసురవతంసంబునుబోలె దుర్విభావ్యబోధుండై పరమపదంబునను భాగవతుల కస్వాధీకృతంబులగు బహుభద్రమహోత్సవంబులు భరియించి భగవత్పరిచర్య సేయుట యె పరమపురుషార్థంబగుటయెఱిగి యచటిరథచరణపాణిమాలికాకరణ కైంకర్యంబున కంకురితకౌతూహలుండై చేయుచుండె మఱియును. ౭౮.

టీక. అన్మహీసురవరుండు = ఆవిష్ణుచిత్తుఁడు, ప్రకృతికంటెన్ = ఇరువదినాల్గుతత్త్వములుగలయచిత్తుకంటె, పరుండగు = వేఱైన, తన్నును = జీవునినను టొ, తనకంటెఁబరుండగు పరమేశ్వరున్ = బ్రహ్మమును, "అనగా శ్లో. ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి। భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా", అను తెఱంగునఁ దనకంతర్యామియగు పరమేశ్వరుని ననుట. పరమేశ్వరప్రసాద = భగవదనుగ్రహము వలననైన, బహుజనన = పెక్కుజన్మముల యందలి, సుకృత = పుణ్యములకు, ఫలరూపయగు = ఫలస్వరూపమగు, ఆచార్యకృప = గురుకారుణ్యము (ఇది కర్తృపదము), గు ప్రదానంబు = పూర్వజన్మమందుఁ జేసిన యేకాంతదానము. నిధానంబుఁ దెలిపినగతిన్ = సద్యోజన్మమందు నిక్షేపమును దెలిపిన తెఱంగున, తెలుపన్ = తెలుపఁగా, (అనఁగా సకలవేదశాస్త్రపురాణేతిహాసములకు సారభూతమైన చిదచిదీశ్వర తత్త్వత్రయజ్ఞానమును బహుజన్మకృత సుకృతలబ్ధమైన యాచార్యకృప తేటపఱిచినదనుట. శ్రు. "ఆచార్యదేవో భవ" యని తైత్తిరీయశ్రుతియందును, "ఆచార్యవాన్ పురుషో వేద" యని ఛాందోగ్యమందును, "యస్య దేవే పరా భక్తిర్యథా దేవే తథా గురౌ। తస్యైతే కథితా హ్యర్థాః ప్రకాశంతే మహాత్మనః" అని కఠవల్లియందును, శ్లో. "దేవతాయా గురోశ్చైవ మంత్రస్యాపి ప్రకీర్తనాత్। ఐహికాముష్మికా సిద్ధిర్ద్విజస్యాస్తి న సంశయః" అని పురాణసముచ్చయమందును, శ్లో. "యస్మాద్దేవో జగన్నాథః కృత్వా మర్త్యమయీం తనుమ్। మగ్నానుద్ధరతే లోకాన్ కారుణ్యాచ్ఛాస్త్రపాణినా। తస్మాద్భక్తిర్గురౌ కార్యా సంసారభయభీరుభిః," అని పాంచరాత్రమందలి జయాఖ్య సంహితయందును, "చక్షుర్గమ్యం గురుం త్యక్త్వా శాస్త్రగమ్యం తు యస్స్మరేత్। హస్తస్థముదకం త్యక్త్వా ఘనస్థం సోఽభివాంఛతి। సులభం తు గురుం త్యక్త్వా దుర్లభం య ఉపాసతే। బద్ధం త్యక్త్వా ధనం మూఢో గుప్తమన్వేషతి క్షితౌ" అనునీ మొదలగు ప్రమాణములచేత నాచార్యకృపయే ప్రధానమని యెఱుఁగదగినది, ఆత్మీయ = తనసంబంధమగు, తదీయ = ఆపరమేశ్వరసంబంధమగు, శేష = శేషిత్వ సంబంధంబు, భృత్యత్వ = స్వామిత్వసంబంధము, అనాద్యంబుగాఁ దెలిసి = అనాదిసిద్ధమని యెఱిఁగి, ఇత్తెలివిగలిగి = ఈజ్ఞానముగలిగి, అఖర్వ = అఖండమగు, నిర్వృతిం గాంచి = సుఖమును జెంది, సుఖించు = సొగసెడు, పరమయోగికి = మహాయోగీశ్వరునకు,

శ్లో. "శాస్త్రజ్ఞానం బహుక్లేశం బుద్ధేశ్చలనకారణ" మ్మన్నట్లు, బహుక్లేశదంబులగు = బహుప్రయాస కరములగు, చదువులం బనియేమి = చదువులచే నేమి యని, ఈవివేకంబు లేనివాని = ఈజ్ఞానము లేనివానియొక్క, హేతువాదంబు = కారణ వాదము, ధాతువాదంబు = లోహాదిమారణక్రియ, కాణాదంబు = తర్క శాస్త్రము, ప్రాణాదంబు = ప్రాణహరము, కాపిలంబు = సాంఖ్యమతము, చాపలంబు= సర్వేశ్వరనిరీశ్వరభావభేదములచేత బుద్ధి చాంచల్య కరము, మీమాంస = అగ్నిష్టోమాది కర్మకాండ విషయము, హింస = పరప్రాణాపహారిణి, వ్యాకరణంబు = శబ్దశాస్త్రము, అశరణంబు = రక్షించునది గాదు, చదువ దొరకొనినన్ = పఠించుటకుపక్రమించెనేని, కాలంబు చాలంబు = కాలము చాలదనియు, అననుకూల మనియును. విఘ్నంబులు = అంతరాయములు, సకలోద్యమఘ్నంబులు = సర్వకార్యనాశకంబులు, అందులకు=శాస్త్రాభ్యాసమునకు, సామగ్రి = సాధనసంపత్తి, కెటకిటన = మిక్కిలి కొంచెము, కొంతెఱుంగనగు మదంబు పుటుపుటన = కొంత దెలియఁగానే గర్వంబు పుటువుటన పొడమును, పలాలంబు = ఊకపొట్టు, సిక్థకంబు = మైనము, ఈతి = ఈతిబాధ, ఉద్వేజనంబు = భయంకరము, గౌరవంబు = గురుత్వమును, రథచరణపాణి=చక్రపాణియగు మన్నారుకృష్ణుని, కడమ సులభము. తా. సులభము.

కం. న్యాయార్జిత విత్తంబున, నా యోగీశ్వరుఁడు వెట్టు • నన్నం బాప్రా,
లేయ పటీరాచల మ, ధ్యాయాతాయాత వైష్ణ • వావలికెల్లన్. ౭౯.

టీక. ఆయోగీశ్వరుఁడు = ఆవిష్ణుచిత్తుఁడు, న్యాయార్జిత విత్తంబునన్ = న్యాయార్జిత ధనముచేతను, ఆప్రాలేయ పటీరాచల మధ్యాయాతాయాత వైష్ణవావలికెల్లన్ = హిమాచల మలయాచలముల మధ్యమార్గస్థులై వచ్చుచుం బోవుచుండెడు వైష్ణవ సముదాయమున కెల్లను, అన్నంబు పెట్టున్. "సరణిః పద్ధతి పద్యా" యని యమరుఁడు. తా. సులభము.

చ. గగనము నీరుబుగ్గ కెనగా • జడివట్టిన నాళ్లభార్యకన్
న్బొగ సొరకుండ నారికెడపుం • బాటియఁ దవులించి వండన
య్యగపలముంచి పెట్టఁగలమాన్నము • నొల్చినప్రప్పు నాలుగే
న్బొగిపిన కూరలున్వడియములున్వరు • గుల్పెరుగు న్ఘృతప్లుతిన్. ౮౦.

టీక. కర్తృపద మధ్యాహార్యము. ఆయోగీశ్వరుండు. గగనము= ఆకాశము, నీరుబుగ్గకున్ = జలబుద్బుదమునకు, ఎనగాన్ = సదృశముగా, జడివట్టిననాళ్లన్ = వర్షముపట్టినదినములయందు, భార్యక=తనయిల్లాలు, కన్నున్=నేత్రమును, పొగసొరకుండన్ = ధూమము ప్రవేశింపకుండ, నారికెడపుంబాటియలు = నీరువెడలించియెండించిన యెడనీటి టెంకాయ బొండ్లములు, తవులించి = ప్రొయ్యిలోనంటించి, వం

డగ్ = పాకముఁజేయఁగా, అయ్యగపలన్ = ఆటెంకాయ చిప్ప యబకలచేత నే, కలమాన్నమున్ = వరియన్నమును, ఒల్చినప్రప్పు = ఒల్పుప్రప్పును, నాలు గేన్వాగిపిన కూరలున్ = నాలుగైదుపొరటిన కూరలును, వడియములు=వడియాలును, వరుగులు= శుష్కశాకములును, పెరుగున్ = దధియును, ఘృతప్లుతిన్ = ఆజ్యసిక్తమగునట్లుగాను, మంచిపెట్టును = ఘృతప్లుతిశధికిఁ బూర్వమున్వయించునది. తా. సులభము.

చ. తెలినులివెచ్చయోగిరముఁదియ్యని ♦ చారులుఁ దిమ్మనంబులు,
న్బలుచని యంబళుల్చెరకు ♦ పాలెడనీళ్లు రసావళుల్ఫలం,
బులును సుగంధిశీతజలము ♦ ల్వడఁబిందెలు నీరుజల్లయు,
న్వెలయఁగఁ బెట్టుభోజనము ♦ వేసవిఁజందన చర్చమున్నగన్. ౭౧.

టీక. వేసవిన్ = గ్రీష్మర్తువందు, చందనచర్చ = చందనాలంకారము, మున్నగన్ = మొదలుగాఁగా,(ముందఱ చందనమిచ్చియనుట), తెలినులివెచ్చయోగిరము = తెల్లనైమందోష్ణమగు నన్నంబును, తియ్యనిచారులు = తియ్యఁజారులును, తిమ్మనంబులున్ = తిమ్మనములను రసాయన విశేషములును, పలుచని యంబళులు.(అంబలిశబ్దబహువచనమంబళులనియునుంగలదు), చెఱకుపాలు = ఇక్షురసములు, ఎడనీళ్లు = లేఁతటెంకాయనీళ్లును, రసావళులు = షడ్రసనమూహములు, ఫలంబులును= కదళిరసాలాదిఫలములును, సుగంధిశీతజలములు= వట్టివేళ్లుమొదలగువానివలన బరిమళించుచల్లనగు నుదకములును, వడఁబిందెలు = ఊరవేసిన లేఁతమామిడి పిందియలు, నీరుఁజల్లయున్ = నీరుమజ్జిగయును, వెలయంగన్ = ప్రసిద్ధమగునట్లు, భోజనముఁబెట్టున్ = ఆహారమొసంగును. తా. సుగమము.

మ. పునుఁగుందావిన వోదనంబు ♦ మిరియంపుంబొళ్లతోఁ జట్టిచు,
య్యను నాదాఱనికూరగుంపు ♦ ముకుమందైన యేర్చునాళంజిగు,
ర్కొనుపచ్చళ్లును బాయసాన్నములు ♦ నూరుంగాయలున్ జేసును,
క్కనునేయుంజిఱువాలవెల్లువుగ ♦ నాహారంవిడు న్శీతునన్. ౭౨.

టీక. శీతునన్ = శీతకాలమందు, పునుఁగుం దావిన వోదనంబు, పునుఁగుందావి=పునుఁగుదావులనుపేరుగల కలమ విశేషసంబంధియగు, నవ=నూతనమగు, ఓదనంబు = ఓగిరమును, (వేఁడివేఁడి యన్నమనుట- పునుఁగు రాజినములుష్ణప్రధానములని వైద్య శాస్త్రమందుఁ బ్రసిద్ధనుగనుక నాశీత కాలమునకుచితములు), మిరియంపుంబొళ్లతోన్ = మిరియముల పొడులతోడ, చట్టి = భాండ విశేషము, చుయ్యనునాద = చుయ్యనుచు మ్రోసెడు నాదము, ఆఱని = నశింపని, కూరగుంపు = శాకసమూహము, (మిరియాల పొడితోఁ గూడఁదిరుగఁ బోసిన నాదము వదలకము వేఁయనుట), ముకుమందైన = ముక్కులోవేసి కొనెడు నస్యమై, ఏర్చు = చుఱ చుఱ

మనిగెడు, ఆవన్ = ఆవాలపిండి చేతను, చిగుర్కొను = క్రుచ్చియెత్తిన, పచ్చళ్లును = ఊరఁబిండ్లును, పాయసాన్నములును = పాలువోసి చేసిన పరమాన్నములును, ఊరుఁగాయలును= ఊరుఁగాయలును, చేసుఱుక్కను నేయున్ = చేతిమీఁదఁబడఁగానే యుష్ణతగనుపించెడు ఘృతమును, చిఱువాలవెల్లువుగన్ = చిన్నపాల వెల్లువు గట్టునట్లు (చిఱుపాలనఁగా సగ మిగురఁగాఁచిన పాలని కొందఱందురు), ఆహారంబిడున్ = భోజనము వెట్టును, ఈపద్యంబునందు, "సుమ్మోతః" అనుసూత్ర బలము వలనఁ బునుఁగుండావి యనునెడఁ బూర్ణబిందుపును "సంస్కృతపదేన పరిమితమాంధ్రపదం కర్మధారయో భవతి" యను సూత్రము వలనను, "ఆంధ్రింపద్వర్ణపర్యంతం సంస్కృతేన సమస్యతే" యను నథర్వణోక్తివలనను బునుఁగుండావిన వాదనంబని కర్మధారయసమాసంబును బ్రయుక్తంబులయ్యెన్. తా. సుగమము.

చ. కదళిగభీరపుష్పపుటికాఘటఁ జేతుల నిప్పపిండిపైఁ,
గుదురుగ సిల్పి యోఁపుగతి గూనల నూనియ నించి త్రాటము,
న్నదికిన శాటి వ్రేలనది నొక్కటఁ గ్రుంకిడి వత్తురెందఱే,
వదలక యాతనింట శనివారమునన్ బరదేశి వైష్ణవుల్. ౮౩.

టీక. ఆతనింటన్ = ఆవిష్ణుచిత్తునింటను, (ఇచ్చట నిత్యసంధి), పరదేశివైష్ణవుల్ = అభ్యాగతులగు వైష్ణవులు, శనివారమునన్ = మందవాసరమునాడు, కదళీ = అరటియొక్క, గభీర = లోఁతగు, పుష్పపుటికె = పూదొన్నెలయొక్క, ఘటన్ = సమూహమును, చేతులన్ = హస్తములయందు, ఇప్పపిండిపైన్ = తలఁబులిమి కొనుటకునూఱిన మధూకపిష్టము మీఁదను, కుదురుగన్ = తొలఁగకుండునట్లు, సిల్చి = పాదుకొల్పి, ఓపుగతిన్ = చాలినరీతిగ, గూనిలనూనియ, గూనల = మహాభాండములలోని, నూనియ = తిలతైలమును, నించి = నిండించి, త్రాటన్ = దారమందు, మున్నదికిన = పూర్వధౌతమగు, శాటి = వస్త్రము, వ్రేలన్ = వ్రేలుచుండఁగా, నదిన్ = ఏటియందు, ఒక్కటన్ = ఒక్కసారిగా, క్రుంకిడి = స్నానముఁ జేసి, ఎందఱే = అనేకులగుట, వదలకవత్తురు = విడువక తిరిగివత్తురు.

తా. ఆవిష్ణుచిత్తునియింట శనివారము నాఁడనేకులగు పరదేశివైష్ణవులు తమతమ యభ్యంగన స్నానములకొఱకు నిప్పపిండినూఱి యాముద్ద చేతలోఁ బెట్టుకొని దానిమీఁద నరఁటిపూవు దొన్నెలు వెట్టుకొని వానిలోఁదమకుఁ గావలసినంతవఱకావిష్ణుచిత్తుని యింటిలో గూనలకుఁబోసి యున్ననూనెతామేపోసికొని స్నానానంతరము ధరించుకొనుటకై ధౌతవస్త్రములు త్రాడుగట్టితాఁకక యొకచేతఁబట్టుకొని నదికింబోయి యచ్చటనభ్యంగన స్నానముఁజేసి వత్తురని భావము.

శా. ఆనిష్ఠానిధిగేహసీమ నడురేయాలించినన్ మ్రోయుకెం,
తేనాగేంద్రశయాన పుణ్యకథలున్ దివ్యప్రబంధానుసం,

ధాసధ్వానము నాస్తికా శాకబహుళతా నాస్త్యుష్ణతా నాస్త్యపూ,
పో నాస్త్యోదనసౌష్ఠవంచ కృపయా భోక్తవ్యమస్మాటులుక్. ౭౮.

టీక. ఆనిస్త్రానిధి = అవిష్ణుచిత్తునియొక్క, గేహసీమని = గృహసీమయందు, నమరే = అర్ధరాత్రమందు, అలించనక్ = వినినను, ఎంతే = మిక్కిలియు, నాగేంద్రశయాన = శేషశాయియగు స్వామియొక్క, పుణ్యకథలక్ = పవిత్రకథలును, దివ్యప్రబంధ = ద్రావిడ ప్రబంధముయొక్క, అనుసంధాన = పారాయణముయొక్క, ధ్వానము = ధ్వనియును, శాకబహులతా = కూరలబాహుళ్యము, నాస్తి = లేదు, ఉష్ణతా = పదార్థములందువేఁడిమి, నాస్తి = లేదు, అపూపః = పక్వాన్నము, నాస్తి = లేదు, ఓదనసౌష్ఠవంచ, ఓదన = ఓగిరముయొక్క, సౌష్ఠవంచ = సౌకర్యమును, నాస్తి = లేదు, కృపయా = దయచేతను, భోక్తవ్యం = ఆరగింపదగినది, అస్మాటులుక్ = అనియెడువాక్యములను, ద్రౌయక్ = ధ్వనిసేయును, ఈపద్యమందుఁ గేవలసంస్కృతవాక్యములుండినను నవియెడుననుకరణముగలిగినదిగావున, (అనుకృతేస్త్రివాక్యంతు) అనుసూత్రబలమువలనఁ జెల్లును. భోక్తవ్యమనుచోట "అహమాదీనాంద్విత్వో" యనుసూత్రముంబట్టి ద్విత్వంబురావలయునైనను, "శ్లో. శబ్దానామం త్యభాగేషు యోనుస్వారః ప్రదృశ్యతే। తస్యాచిపరతోమస్యాత్సర్వత్రకవిసంమతే." "పదేతుతద్య దాద్యంతేవాద్విత్వం హారిసంమతేః" అనునథర్వణోక్తుల వలన ద్విత్వాభావమైయనుస్వారమునకు మకారమువచ్చెను. మూఁడవ పాదమందు నిత్యసమాస పదములఁ జేరిన నాస్తిపదమునకనునాసికయతి.

తా. ఆవిష్ణుచిత్తుని గృహమందుఁ బగటిపూటలయందేకాక అర్ధరాత్రమందు వినఁబోయినను శేషశాయిపుణ్యకథలఁ జెప్పుకొనువారి కంఠనాదములును దివ్యప్రబంధముల రవములను భోక్తలతో నావిష్ణుచిత్తుఁడు కూరలులేవు వేఁడిలేదు భక్ష్యములేవన్న సౌకర్యములేదు కృపచేతనే యారగింపవలయునని చెప్పెడి యుపచారవాక్యములను వినంబడునని భావము.

తే. గీ. ఇట్టెరగున నవ్వైష్ణవోత్తముండు, జాగరూకతఁ దైర్థికభాగవతుల,
కితరమెఱుఁగక యెవ్వరేనేమివేఁడి, రలయక విడిపెట్టి సంతుష్టి సలుపుచుండె.

టీక. ఆవైష్ణవోత్తముండు = ఆవిష్ణుచిత్తుఁడు, జాగరూకతక్ = హెచ్చరికచేతను, తైర్థికభాగవతులకు = తీర్థయాత్రాపరులగు భగవద్భక్తులకు, అలయక = ఆయాసమునొందక, ఎవ్వరేమివేడిరి = ఎవ్వరేమియేమి యడిగిరోవారికి, కడ మసులభము. తా. సుగమము.

శా. బాలార్కాంశు విజృంభితామల శరత్పద్మాతపద్మాతమా,
నీలాబ్జాంబవతీ శలూకాశ్రబల భిన్నీరేణు హేలాద్భుత ది,

ణూర = చాణూరమల్లునియొక్క, భంగ = సంహారమందు, ఉగ్ర = వాఁడిమిగల, బాహో = బాహువులుగలవాఁడా, కళా = కళాసంజ్ఞగల యల్పతమకాలమందు, కృత్త = వధింపఁబడిన, కంసా = కంసుఁడు గలవాఁడా, శిఖండ = నెమిలిపింఛము, అవతంసా = శిరోభూషణముగా గలవాఁడా, బాహాగళాయను పాఠమున గడియలవంటి భుజములు గలవాఁడా యనిఅర్థము, "తద్విష్కంభోర్గళంననా"యని యమరుఁడు, ఆపక్షమునఁగృత్తకంసాయనియేపైపదము. తా. సుగమము.

మ. ఇది కర్ణాటధరాధృతి స్థిరభుజాహేలాకలబ్ధేభరా,
డుదయోర్వీధర తత్పితృవ్యకృతన వ్యోపాయనోష్ణీష ర,
త్నదృగంచత్పద కృష్ణరాయ వసుధాధ్యక్షోదితాముక్తమా,
ల్యద నాశ్వాసను హృద్యపద్యముల నాద్యంబై మహింబొల్పగున్ ౪౯.

టీక. ఇది = ఈసందర్భము, కర్ణాటధరా = కర్ణాటభూమియొక్క, ధృతి = ధరించుటయందు, స్థిర = నిశ్చలమైన, భుజ = బాహువులయొక్క, హేలాక = విలాసముగలయట్టియు, లబ్ధ = పొందఁబడిన, ఇభరాట్ = గజపతియగురుద్రునియొక్క, ఉదయోర్వీధర = ఉదయగిరియందలి, తత్పితృవ్య, తత్ = ఆరుద్రునియొక్క, పితృవ్య = పినతండ్రియగు ప్రహరేశ్వరుని చేత, కృత = చేయఁబడిన, నవ్య = నూతనమగు, ఉపాయన = కానికయగు, ఉష్ణీష = కిరీటముయొక్క, రత్న = రత్నములయందలి, దృక్ = దృష్టిచేతను, అంచత్ = ఒప్పుచున్న, పద = పాదములుగల, కృష్ణరాయవసుధాధ్యక్ష = కృష్ణరాయలచేతను, ఉదిత = చెప్పబడిన, అముక్తమాల్యదన్ = ఆముక్తమాల్యద యనుగ్రంథమునందు, హృద్య = మనోజ్ఞములగు, పద్యములన్ = పద్యములచేతను, ఆశ్వాసము, ఆద్యంబై = ప్రథమమై, మహిన్ = భూమియందు, పొల్పగున్ = ఒప్పును.

తా. కృష్ణరాయలు గజపతిపినతండ్రియగు ప్రహరేశ్వరుఁడుదయగిరిదుర్గముమీఁదనుండఁగా నచ్చటికేగి యతనితలఁ ద్రొక్కికస్నానము సేయనని ప్రతిజ్ఞ జేసెగావున సేనలులగ్గలువట్టఁగా నాప్రహరేశ్వరుఁడు భయపడి తనతలకుఁబదులుగాఁ గిరీటము రాయలకుగానిక జేయుటవలన నదిచూచి త్రొక్కెనని భావము.

గద్య. ఇది శ్రీదక్షిణామూర్తి మంత్రోపాసనాసమాసాదితాఖండ సాహితీధురీణుండు నాత్రేయగోత్రపవిత్రుండును వావిళ్లవంశపయోరాశిరాకాసుధాకరుండునగు రామస్వామిశాస్త్రి చేత ననేకపూర్వవ్యాఖ్యానాభిప్రాయంబులఁ బర్యాలోచించి రచింపబడిన రుచిసమాఖ్యానంబగు నాముక్తమాల్యదావ్యాఖ్యానంబునం బ్రథమాశ్వాసము.

శ్రీ

శ్రీరామాయనమః.

శ్రీశారదాగురుగణపతిభ్యోనమః.

# ఆముక్తమాల్యద * సవ్యాఖ్యానము.

## ద్వితీయాశ్వాస ప్రారంభము.

కం. శ్రీనయనకువలయుగళా, నూనజ్యోత్స్నాయితస్మి◆తోజ్జ్వలముఖదై, త్యానీతసు
రశ్రీపున । రానయనక్రమణ వేంక◆టాచలరమణా॥ ౧॥

టీక. శ్రీ=లక్ష్మీదేవియొక్క, నయనకువల=కలువలవంటికన్నులయొక్క(* ॥ కువలంచాసితాంబుజె అని వైజయంతి,) యుగళ=రెంటికి, అనూన=అధికమైన, జ్యోత్స్నాయిత = వెన్నెలైన, స్మిత=చిఱునవ్వుచేతను, ఉజ్జ్వల = ప్రకాశించుచున్న, ముఖ = వదనముగలయట్టియు (అనఁగా స్వామియొక్క చిఱునగవుమహాలక్ష్మికన్నులకు సంతతవికాసహేతువై యున్నదనుట) దైత్య = రాక్షసులచేతను, ఆనీత = అపహరింపఁబడిన, సుర = దేవతలయొక్క, శ్రీ = సంపదయొక్క, పునరానయన = మఱలఁదెచ్చునట్టి (ఆనయనశబ్దమిచటధర్మిపరము) క్రమణ = పాదవిక్షేపముగలయట్టి, వేంకటాచలరమణా= వేంకటేశ్వరుఁడాయనిసంబోధన,

తాత్పర్యము.— గ్రంథకర్త యాశ్వాసాది యగుటంజేసి - మంగళాదీని మంగళమధ్యాని మంగళాంతానీత్యాది ప్రమాణవచనమును బట్టియిష్టదేవతా స్మరణాత్మకమంగళాచరణ పూర్వకముగా శ్రీవేంకటాచల పతినవధరింపుమని వచించుచున్నాఁడనుట.

వ. అవధరింపు మాసమయంబునఁ బాండ్యమండలంబున. ౨.

టీక ॥ సుగమము.

సీ. ఏవీటిసతులపా◆లిండ్లపై గంబూర, నవహా ములచిప్ప◆కవుఁచు మాన్ప
మలయజం బేవీటఁ◆దొలుచెక్కు డులిచి మే, డలకిడ్డ మిగుల భూ◆ములకు డిగ్గఁ
గలఁచు నేవీటసిం◆హళగజంబులగాలి, చైత్రవేళను దగ్గి◆శాగజంబుఁ

దాల్తు రేవీటిప్రా♦క్తనభూపనిర్మాల్య, మరకతంబులు పెఱ♦ధరణిపతులు
కపివర నియుక్తగిరిసదృ♦గ్గహననిలయ, గాత్రగాహితకనకము♦క్తాకవాట
గోపురావేదితోచ్చతా♦క్షోభ్యవప్ర, దనరు దక్షిణమధుర సాం♦ద్రద్రుమమధుర. 3

టీ. ఏవీటి = ఏపట్టణమందు, సతుల = స్త్రీలయొక్క, పాలిండ్లపై = స్తనముల మీఁద, గంబూర = అలఁదినకర్పూరము, నవ = నూతనములైన, హారముల = ముక్తాహారములయొక్క, చిప్పకవుఁచు = శుక్తిదుర్గంధమును, మాన్పుచు = పోఁగొట్టుచున్నదో (అనఁగా ముత్యపుచిప్పలుత్పత్తియయ్యెడి తామ్రపర్ణీనదికి సమీపమున నుండువారుగాన నప్పటికప్పుడు తెచ్చినకాఁచుపదలని ముత్యాలహారములు ధరింపుచున్నారని భావము) ఏవీటను, మలయజంబు = శ్రీగంధవృక్షములు. తోలుచెక్కుడులిచి = మొదటిచెక్కఁదీసి, మేడలకిడ్డను = మేడలకుఁబెట్టగాను, మిగులు = మిగిలినవి, భూములకుదిగ్గు = భూములకుదిగివచ్చునో (అనఁగా నాపట్టణమందలి మేడలన్నియునుత్తమ శ్రీగంధముల చేఁగట్ట జడియున్నవనుట) ఏవీటను, సింహళగజంబులగాలి = సింహళద్వీపమునందుఁ బుట్టినయేనుఁగులయొక్కవాయువు, చైత్రవేళను = వసంతకాలములయందు, ఉదగ్దిశ = ఉత్తరపుదిక్కునందున్న, గజంపు = ఏనుఁగు, కలఁచును = చెదరఁజేయునో (అనఁగా నాపట్టణమందలిగజంబులు సింహళమను ద్వీపంబునఁ బుట్టినపోటంజేసి సింహళశరీరవాసనవంటివాసనగలవియనుట) ఏవీటి, ప్రాక్తన = పూర్వికులగు, భూప = రాజుల యొక్క, నిర్మాల్య = ధరించికడవేసిన, మరకతంబులు = పచ్చలను, పెఱధరణీపతులు = ఇతరరాజులు, తాల్తురు = ధరియించుచుందురో (అనఁగానుత్తమరత్నంబుల కాపట్టణమునికిపట్టుగానుండెననుట) కపివర = సుగ్రీవునిచే, నియుక్త = నియోగింపఁబడినట్టి, గిరి = పర్వతములతోను, సదృక్ = సరిపోలునట్టి, గహననిలయ = కపులయొక్క, గాత్ర = శరీరముచేతను, గాహిత = ప్రవేశింపఁబడిన, కనకముక్తాకవాట = స్వర్ణయుతమైనముత్యాలతలుపులుగల, గోపుర = పురద్వారములచేతను, ఆవేదిత = తెలియఁజేయఁబడిన, ఉచ్చత = పొడవుచేతను. అక్షోభ్య = కొలుపుచ్చనశక్యంబైన, వప్ర = కోటగలయట్టియు (అనఁగా సుగ్రీవుఁడు సీతాన్వేషణార్థము గహనుమదాదులను దక్షిణపుదిక్కునకునంపుచుఁ దొలుతఁ దానుదెలిసినవాఁడు గనుక నాయాదిక్కులగల తావులఁ దెల్పుచును. (శ్లో॥ ముక్తాకవాటంపాండ్యానాంతత్రద్రక్ష్యథవానరాః ।) అని పల్కరించిన తెఱంగున నావానరులు కొండలంతలేసితమశరీరములతో నాపట్టణము వాకిళ్లలోఁ జొచ్చిరనుటవలన నావాకిళ్లకత్యున్నతత్వమును గోటకునక్షోభ్యత్వమును దెలిపినట్లాయెను) సాంద్ర = దట్టములైన, ద్రు = వృక్షములచేతను, మధుర = మనోహరమైనట్టి, దక్షిణమధుర = మధురాపట్టణము, తనరున్ = ఒప్పును, దక్షిణ మధురయనుటవలనను త్తరమునశొకమధురయున్నదనిభావము.

క. శమనరిపుత్రిపురభిదు, ద్యమవద్దోర్వర్జ్యవలయి ♦ తస్వర్ణగిరి,
భ్రమిదంబై కాంచనవ, ప్రము దీప్రం బగుచు నప్పు ♦ రంబున నొప్పున్. ౪.

టీ. శమనరిపు = శివునియొక్క, త్రిపురభిదా = త్రిపురములను భేదించుటయని యెడు, ఉద్యమవత్ = ఉద్యోగముగల, దోః = భుజమువలన, వర్జ్య = విడువఁదగినట్టియు, వలయిత = వలయముగాఁ జేయఁబడిన, స్వర్ణగిరి = మేరుపర్వతమనియెడు, భ్రమిదంబై = భ్రాంతినిచ్చునదియై, కాంచనవప్రము = బంగారుకోట, దీప్రంబగుచున్ = ప్రకాశమగుచు, అప్పురంబునన్ = ఆమధురాపట్టణమందు, ఒప్పున్ = తగియుండును.

తా. — త్రిపురములఁ గెలిచి యీశ్వరుఁడు కడవేసిన మేరుగిరి ధనుస్సను నటుల నామధురాపట్టణపు బంగారుకోటవలయాకారమై యుండెననుట. ౪

తే. గీ. సొరిదిఁ గనుపట్టి హేమర ♦ శ్ములు సెలంగఁ, బొడవుకతమున సూక్ష్మమై ♦ పొల్చుఁ జూడఁ,
బట్టణము కోటకొమ్మల ♦ పఙ్క్తి గగన, మండలశ్రీకి సంపంగి ♦ దండవోలె. ౫.

టీ. పట్టణముకోటకొమ్మలపఙ్క్తి, సొరిదిన్ = బాగుగాను, హేమరశ్ములు = సువర్ణప్రభలు, కనుపట్టి = కానుపించి, చెలంగన్ = విజృంభింపఁగాను, పొడవుకతమున = కోటపొడవైనందున = సూక్ష్మమై = కొమ్మలచాలుకొంచెముఁగా నున్నదియై, చూడన్ = చూడఁగాను, గగనమండలశ్రీకి = ఆకాశలక్ష్మికి, సంపంగిదండవోలె = సంపంగిదండవలెనే, పొల్చున్ = ప్రకాశించును.

తా. — మధురాపట్టణపు కోటమిగులఁ బొడవైనందుననతి సూక్ష్మముగఁ గనుపడు చున్నదై సువర్ణకాంతులు విజృంభించు వేళఁ జూడఁగా గోటకొమ్మలపఙ్క్తి యాకాశలక్ష్మి ధరించిన సంపంగిదండవలెనే ప్రకాశించెననుట.

మ. పరిఖం దత్పురకామినీజనము లం ♦ భఃకేళి సల్పంగఁ, దద్గురువక్షోరుహలిప్తసంకు
మదక * స్తూరీమిళచ్చందనా, గురుపంకంబుల సౌరభంబులఁ జుమీ ♦ కుంభీనసావాసని,
ర్జరకల్లోలిని కందు భోగవతినాఁ ♦ జన్సంజ్ఞ గల్గెన్ధరన్. ౬

పరిఖన్ = అగడ్తలోను, తత్పురకామినీజనములు = ఆమధురాపురస్త్రీలు, అంభఃకేళి = జలక్రీడను, సల్పంగన్ = చేయఁగాను, తత్ = ఆస్త్రీలయొక్క, గురు = గొప్పలైన, వక్షోరుహ = స్తనములయందు, లిప్త = పూయఁబడిన, సంకుమద = జవ్వాదితోడను, కస్తూరీ = కస్తూరితోడను, మిళత్ = కూడుకొనియున్న, చందన = శ్రీగంధముయొక్కయు, అగురు = అగరుగంధముయొక్కయు, పంకంబుల = బురదలయొక్క, సౌరభంబులన్ జుమీ = వాసనలచేతనే, కుంభీనసావాసనిర్జరకల్లోలినికిన్, కుంభీనస = సర్పములకు, ఆవాస = ఉనికిపట్టగు నాగలోకమందు, నిర్జరకల్లోలినికిన్ = దేవగంగకు, అందున్ = ఆపాతాళలోకమందును, భోగవతినాన్ = భోగవతియనఁగా,

చన్ = ఒప్పునట్టి, సంజ్ఞ = అన్వర్థనామము. తగన్ = తగునటుల, కల్గెన్ = కలిగెను. (శ్లో॥ నదీనగర్యోర్నాగానాంభోగవతియనిఖ్యమరుఁడు.)

తా.—ఆమధురాపురస్త్రీలు - కుచకుంభములకు నలఁదినపరిమళములు పాతాళమువఱకువ్యాపించి యున్నయగడ్తనీళ్ల జలక్రీడలాడు తరియందు నిండింపఁబడినదిగాన నాగంధానుభవముగల నాగలోకమందలి గంగకునకాకారణంబునంజేసి భోగవతియను నామముగల్గెనుట - ఇచటనిరుక్త్యలంకారము.(శ్లో॥ నిరుక్తిర్యోగతోనామ్నామన్యార్థత్వ ప్రకల్పనం) అనిలక్షణము.

తే. గీ. కాద్రవేయులు భూమియుఁ ♦ గైకొనంగ,నురగలోకంబు వెడలి త♦త్పరిఖనీట,
నెగసి తోడనె క్రుంకుదు ♦ ర్నిలువ లేక, తత్తటాబద్ధగారుత్మ♦తముల కులికి. ౭.

టీ. కాద్రవేయులు = సర్పములు, భూమియున్ = ధరిత్రియును, కైకొనంగన్ = ఆక్రమించుటకు, ఉరగలోకంబు = పాతాళలోకంబు, వెడలి = తర్లి, తత్పరిఖనీటన్, తత్ = ఆపురముయొక్క, పరిఘనీటన్ = అగడ్తనీటను, నెగసి = లంఘించి, తత్తటాబద్ధగారుత్మతములకు, తత్తట = ఆపరిఖదరులయందు, ఆబద్ధ = అంతటంజెక్కఁబడిన, గారుత్మతములకు = గరుడపచ్చలకు, ఉలికి= భయపడి, తోడనె= వెంబడిగానే, నిలువలేక = ఉండఁజాలక, క్రుంకుదురు=మునుగుదురు ( నెగసియను చోటనీటిలోనుండిభీముండు నెగయుదెంచెనని భారతప్రయోగమునుహలాదిగాఁగలదు.)

తా. సర్పములు భూమినిఁగూడ నాక్రమించుటకై నాగలోకమునువదలి యాయగడ్తనీటనెగసివచ్చి యందుఁగట్టంబడియున్న గరుడపచ్చలకువెఱచి నిలువంజాలక వెంటనెమునుంగుననఁగాఁ బాతాళమువఱకు నాయగడ్తవ్యాపించియున్నదనియు - సర్పములు గరుడునకాహారముగానఁ దన్మణిదర్శనమాత్రజన్యభయము చేవెఱచినదనియు - పరిఖములు గూడ రత్నఖచితమై యున్నవనియును తాత్పర్యము.

తే. గీ. తరుణశైవాలజలజప♦త్రములు వొదువ, మరకతచ్ఛాయ బొల్పుఁ ద♦త్పరిఖజలము,
కోట బంగరు సేయుట♦కొఱకు మున్న, బ్రహ్మ పిడిచిన మందాకు♦పస రనంగ.౮.

టీ. తరుణశైవాలజలజపత్రములు, తరుణశైవాల = లేఁతనాఁచుతీఁగలును, జలజపత్రములు = తామరాకులును, పొదువన్ = క్రమ్ముకొనఁగా, మరకతచ్ఛాయన్ = పచ్చరాలవన్నెచేతను, తత్పరిఖజలము = ఆయగడ్తనీళ్లు, మున్న = ఆపురనిర్మాణకాలమునందు, కోటన్ = ప్రాకారమును, బంగరుసేయుటకొఱకు = కనకమయముగాఁజేయుటకై, బ్రహ్మ = చతుర్ముఖుఁడు, పిడిచినమందాకుపసరనంగాన్ = పిండినమందాకుపసరోయనునటుల, పొల్పున్ = ఒప్పును.

తా. అనఁగా మధురాపట్టణపుకోట బ్రహ్మనిర్మితంబై స్వర్ణమయముగానున్నదని తాత్పర్యము.

చ. అడుగున నుండియు న్బదిల ♦ మై చద లంటెడుకోట నొప్పు ప్రో, ల్చెడనికడంక
దంచెనపుఁ ♦ జేతుల గంగను గాసెఁ దూఱఁగా, నడుమన యున్కిఁ జేసి యల ♦
నాకపురి న్సరికై పెనంగి లా, వెడలఁగఁ బట్టిక్రేవేయుటకు ♦ నెత్తె నన న్జను మల్ల
పోరునన్. ౯.

టీ. అడుగుననుండియున్ = దిగువనుండియున్న, పదిలమై = దృఢమైనదై, చదలు = ఆకసమును, అంటెడు = తాఁకుచున్నట్టి, కోటన్ = ప్రాకారముచేతన్, ఒప్పు = ప్రకాశించుచున్న, ప్రోలు = పట్టణము, చెడనికడంకన్ = పోలిపోనిబలిమి చేతను, దంచెనపుఁజేతులన్ = దంచెనములనియెడి చేతులచేతను, గంగను = గంగయని యెడు, కాసెన్ = దట్టికోకను, దూఱఁగా, ప్రవేశింపఁగా, నడుమన = మధ్యమునందే. ఉన్కిఁజేసి = ఉండుటచేతను, అలనాకపురిన్ = ఆస్వర్గమును, సరికై = దీటైయుండుటకై, పెనంగి = పెనఁగులాడి, లావు = బలిమి, ఎడలఁగన్ = పోవునట్లుగా, మల్లపోరునన్=మల్లయుద్ధమునందు, పట్టిక్రేవేయుటకు = చేతఁబట్టిక్రిందవైచుటకు, ఎత్తెన్ = ఎత్తెను, అనన్ = అనఁగా, చనున్ = ఒప్పును (గంగను కాసెనను చోట సంస్కృతశబ్దాంతమగునచ్చునకు వైకృతాచ్చుపరముగాఁగా. శ్లో. క్వచిత్సంస్కృతియోపిప్రాణో ప్యత్రచ్యుతోభవేత్తనుసథర్వణోక్తిప్రమాణము.)

అ. ఆకాశగంగ స్వర్గమునువలయాకారమై చుట్టికొనియుండునుగాన స్వర్గమును జెట్టికి గంగకాసెవలెనుండెననియు శత్రుభంజనార్థముగ వప్రాగ్రమందుంచిన దంచెనములనఁగానినప గొలుసులతోఁగూడిన పాషాణవిశేషములు చేతులవలె నిడుపుగానఁబురమను జెట్టికిదంచెనములు హస్తములవలెనుండెననియు నామధురాపురమను జెట్టిదనతో పాదృశ్యమునకు పెనఁగుచును నాయాకాశగంగ మధ్యప్రదేశమందేయుండుటవలన మల్లయుద్ధమునందుఁ గోటకొమ్మలనియెడి హస్తములచేత గంగయను కాసెకొసదూఱునటులఁ బట్టి బలిమిచెడునట్లుగా క్రిందవైచుటకు నెత్తెనోయనునటుల నొప్పుచుండెననఁగా నాకాశగంగవలెను గోటకొమ్మలున్నవనియు నప్పట్టణము స్వర్గముకంటె విశేషవస్తుసమృద్ధంబై నిఖిలసుఖప్రదమైయుండెనని యభిప్రాయము.

తే. గీ. ఉదుటుగుబ్బలు గలతల్పు ♦ టురము సూచి, గందపట్టెలు సూచి బం ♦ గారు సూచి,
వీటివాకిటిచోట నే ♦ విడువ కెపుడు, సుట్లఁ బెట్టుచు నుందురు ♦ సోమరవులు. ౧౦

టీ. సోమరవులు = చంద్రసూర్యులు, ఉదుటుగుబ్బలుగల, ఉదుటు = నిక్కఁబొడిచియున్న, గుబ్బలు = గుబ్బలను పేరంబరగినముఖులనియెడు స్తనములు, కల = కలి

గినట్టి, తల్పుటురము = కవాటమనియెడునురస్థ్సలము, చూచి = కనియును, గందపట్టె లునూచి = కవాటతిర్యగ్దారువిశేషములనియెడు గందపుగీఱలనుచూచి, బంగారునూచి = కవాటఖచితస్వర్ణమను స్వర్ణభూషముఁజూచి, వీటివాకిటిచోటనే = ఊరివాకిటిదగ్గఱనే, విడువక = వదలక, ఎప్పుడు = ఎల్లప్పుడు, చుట్లబెట్టుచునుందురు = చుట్టుకొనియుందురు.

తా. సోమరవులనువిటులు గొప్పలైనగుబ్బగోళ్లను స్తనములచేతను గందపట్టెలనియెడు మైపూఁతలచేతను కవాటమందలి బంగారపుతగుళ్లను స్వర్ణభూషణములచేత నామధురాపట్టణమొకస్త్రీవలెనుండఁగా దానిఁజూచి దానివాకిళ్లువిడువక చుట్టిచుట్టితిరుగుచుందురని భావము - దీనియందుశ్లేష.

మ. స్థిర సౌధాగ్రవిహారయావతరతిచ్ఛిన్నాచ్ఛహారస్ఫుర, ద్గురుముక్తావలిఁ జేటికి న్విరులతోఁగూడంగఁ ద్రోయన్నిజోదరలగ్నం బగుదాని నెమ్మొగు లధస్స్థంబై తటి
త్స్రాల్ప న్నాకర మభ్రింబని యంద్రు గా కుదధిఁ దక్కన్ బుట్టునే ముత్తెముల్.

టీ. నెమ్మొగులు = మేఘము, అధస్థ్సంబై = క్రిందనున్నదై, స్థిర = నిశ్చలమైన, సౌధాగ్ర = మేడచివరలయందు, విహార = సంచరించుచున్న, యావత = యువతిసమూహముయొక్క, రతి = సురతమునందు, ఛిన్న = తెగినట్టియు, అచ్ఛ = స్వచ్ఛమైనట్టి, హార = దండలయందు, స్ఫురత్ = ప్రకాశించునదియు, గురు = స్థూలములగు, ముక్తా = ముత్తెములయొక్క, ఆవళిన్ = పఙ్క్తిని, చేటికలు = పరిచారికలు, విరులతోఁగూడంగ = పువ్వులతోఁగూడను, త్రోయన్ = పడఁద్రోయఁగా, నిజోదరలగ్నంబగు, నిజ = మొగులయొక్క, ఉదర = గర్భమునందు, లగ్నంబగు = తగిలికొనినట్టి, దానిన్ = ఆముక్తికపఙ్క్తిని, తటిన్ = వానఁగురియువేళ, ఱాల్పన్ = వర్షింపఁగా, అభ్రింబు = మేఘము, ఆకరమని = ముత్యములకుజన్మస్థానమని, అంద్రుగాక = వచింపుదురేగాని, ఉదధిన్ = సముద్రమును, తక్కన్ = వినాగా, ముత్తెములు = మౌక్తికంబులు, పుట్టునే = జనియించునే, జనియింపవనుట.

తా. మేఘమండలాతీతంబులగు నప్పట్టణపు మేడలయందు యౌవనస్త్రీలు సురతక్రీడసలుపుతఱి త్రెస్సిరాలినముత్తియములఁ బరిచారికలు కసువుఁద్రోయువేళఁ బువ్వులతోఁగూడఁద్రోయఁగా మేఘములయందుఁ బడునుగాన వర్షాకాలమున భూమియందు నాముత్యములుండుటంజేసి మేఘములనుగూడ మణ్యాకరంబని చెప్పంబడుటయేకాక సముద్రభిన్నంబొకటియును మణిజన్మస్థానముగాను - దీనియందత్యుక్తి.

మ. ఘనసౌధాళి వియద్ధునీబలధి వీఁక న్నావలై నీడ దోఁప వెలంత ల్వణిగాళ్ళ్రి
వ్వరకు మాఱ్పన్గోలల నట్టియి, ద్భునిజద్వీపవిచిత్రపట్టవసనస్తోమంబు నాఁ బొ
ల్పుఁబె, ల్లనిలానోల్ల్యవిమర్శితన్నగరనాకానేకకేతుచ్ఛటల్. ౫౨.

టీ. ఘనసౌధాళి, ఘన = గొప్పలైన, సౌధాళి = మేడలసముదాయము, వియద్ధునీజలధిన్, వియద్ధునీ = ఆకాశగంగయునెడు, జలధిన్ = సముద్రమునందు, వీఁకన్ = స్పష్టముగాను, నావలై = ఓడలై, నీడ = మేడలనీడ, తోఁపన్ = కనుపింపఁగా, నెలంతల్ = ఆమేడలమీఁదనుండువనితలు, వణిగాకృతిన్ = వర్తకులవలె, సరసమార్పన్ = భాండప్రతిభాండముఁజేయుటకై, కోలలన్ = గడలచేత, కట్టి = బంధించి, ఇచ్చునిజద్వీపవిచిత్రపట్టవసనస్తోమంబు, ఇచ్చు = ఇచ్చునట్టి, నిజ = తమయొక్క, ద్వీప = దీవియందలి, విచిత్ర = వన్నెవన్నెలైన, పట్టవసన = పట్టువస్త్రములయొక్క, స్తోమంబు = సమూహము, నాన్ = అనునట్లు, అనిల = వాయువుచేత, అన్యోన్య = ఒకటితోనొకటి, విమర్శి = ఒఱయుచున్నట్టి, తన్నగర = ఆపురమునందలియు, నాక = స్వర్గమందలి, అనేక = అసంఖ్యాకములైన, కేతు = టెక్కెములయొక్క, ఘటలు = గుంపులు, పెల్లు = తఱుచుగా, పొల్చున్ = ప్రకాశించును.

తా. ఆకాశగంగయును సముద్రములో మేడలనీడ గనుపింపఁగా నోడలవలెనుండెననియు - అప్పుడా మేడలమీఁదనుండు స్త్రీలు బేరగాండ్రుఁబలె నుండిరనియు - గడలయందున్న టెక్కెములకుఁగట్టిన వసనంబులు గాలిచేఁగదలుటంజేసి యాస్త్రీలచేతఁ దమదీవియందలి పట్టుపటావళులు ద్వీపాంతరవాసులకు భాండప్రతిభాండరీతిచే విక్రయింపఁబడుచున్నవో యనునట్టుగఁ బ్రకాశించెనని తాత్పర్యము.

ఉ. సౌరణగండ్లఁ ద్రాఁ గొదమ • చుక్కలు పట్ట సతుల్ కవాటముల్, దేఁపుప మౌక్తికంబు
లని • చిల్లులు పుత్తురు దద్దటంబు మై పొల్పగువితానహారములయం దొకదారక వ్రేలి
ప్రొద్దు పోఁగా రతి వస్సి గాడ్పులకు • గా దెలువ న్ననువిచ్చు మేడలన్. ౧౩.

టీ. కొదమచుక్కలు = చిన్ననక్షత్రములు, సౌరణగండ్లన్ = గవాక్షములవలన, దాన్ = దాఁగా, పట్టన్ = అనక్షత్రములఁబట్టుటకొఱకు, సతులు = యువతులు, కవాటములు = తలుపులను, దేఁపుపన్ = మూయఁగాను, తమ్ము = ఆనక్షత్రములను, మౌక్తికంబులని = ముత్తెములని, చిల్లులుపుత్తురు = రంధ్రములు చేతురు, అటంచున్ = అట్లనుచు, పొల్పారువితానహారములయందున్, పొల్పారు = సుందరమైన, వితాన = మేలుకట్లయొక్క, హారములయందున్ = సరములయందు, ఒకదారక = ఒక్కదండవలె, వ్రేలి = వ్రేలాడి, ప్రొద్దు = దివసకాలము, పోఁగాన్ = గడపఁగా, రతిన్ = క్రీడచేత, వస్సి = అలసి, గాడ్పులకుఁగాన్ = వాయుసంచారముకొఱకు, తెలువన్ = తల్పుఁదెఱవఁగా, మేడలన్ = సౌధములయందు, విచ్చు = విడచి, చనున్ = చనుదెంచును,

తా. అనఁగా మేడలు నక్షత్రమండలమును ముట్టిపోయినవని భావము.

ఉ. ఆపురసౌధవీధి నధ♦రాధరభూములగర్జ మున్నగా, నాపయికి న్వినంబడని♦యట్లుగఁ గ్రాలుఘనాళిఁ దార్చి లీ,లాపరతన్ ఘటింపుదురు♦లాస్యము సేయఁగ మేఘరంజ న్నాలాపముఁజేసి పోషితక♦లాపిఁ గలాపికలాపకుంతలుల్.

టీ. కలాపికలాపకుంతలులు, కలాపి = నెమలియొక్క, కలాప= బర్హమువంటి, కుంతలులు= కురులుగలస్త్రీలు, ఆపురసౌధవీధిన్, ఆపుర=ఆపట్టణముయొక్క, సౌధ= మేడలయొక్క, వీధిన్ = పఙ్క్తియందు, అధరాధరభూములన్, అధరాధర=క్రింద క్రిందటి, భూములన్ = ప్రదేశములయందు, గర్జమున్నగాన్ = ఉఱుములు మొదలుగా, ఆపయికిన్ =ఆ మేడలమీఁదికి, వినంబడనియట్లుగన్ =వినరానియటుల, క్రాలు ఘనాళిన్, క్రాలు = ఒప్పుచున్నట్టి, ఘన = మొగులయొక్క, ఆళిన్ = సమూహమును, మేఘరంజినాలాపముఁజేసి = మేఘరంజియనురాగము నాలాపముఁజేసి, తార్చి= క్రిందనున్న మేఘములను మేడలపైకిరప్పించి, పోషితకలాపిన్, పోషిత = పెంపఁబడినట్టి, కలాపిన్ = నెమలిని, లీలాపరతన్ = విలాసాసక్తిచేతను, లాస్యము సేయఁగన్ = నృత్యమొనర్చునటుల, ఘటింపుదురు = సంఘటనచేయుదురు, అనఁగా నాపురమందలి యువతులు గాననృత్యాదులయందలి నిపుణలగుటంజేసి యా మేడలు మేఘమండలాతీతంబులైయున్నను తదనుగుణ రాగాలాపములచే మొగులఁబైకి రప్పించుచున్నారని యభిప్రాయము.

చ. అనిమిషపట్టణంబు పుర♦హర్మ్యపతాకలు మువ్వమ్రోఁతతోఁ,
దనగృహపఙ్క్తిపైఁ గలశ♦తామరసంబులఁ గప్పఁ గ్రిందనుం,
డును నిజలక్ష్మిచే సరిప♦ణుల్ మొఱయంగఁ దదీయలక్ష్మిశం,
కను మొగమెత్తి చూచుతఱిఁ♦గన్నులు కేళికి మూయఁగా బలెన్. ౧౫.

టీ. నిజలక్ష్మి = మధురాపురలక్ష్మి, చేసరిపణుల్ = తనచేతనున్న సరిపణగొలుసులు, మొఱయంగాన్ = మ్రోయఁగా, తదీయలక్ష్మి = అమరావతీపురలక్ష్మి, శంకను =ఈచప్పుడేమనుశంకచేతను, మొగమెత్తి = ముఖమును బైకెత్తి, చూచుతఱిన్ = వీక్షించుసమయమున, కన్నులు = నేత్రములను, కేళికిన్ = వినోదమునకు, మూయఁగా బలెన్ = మూయుచుండఁగాననునటుల, అనిమిషపట్టణంబు = అమరావతీపట్టంబు, పురహర్మ్యపతాకలు, పుర = మధురయొక్క, హర్మ్య = మేడలయందలి, పతాకలు = టెక్కెములు, మువ్వమ్రోఁతతోన్ = చిఱుగజ్జెలధ్వనితోఁగూడ, తనగృహపఙ్క్తిపైన్ = అమరావతిగృహపఙ్క్తియందలి, కలశతామరసంబులన్ = తామరమొగ్గలవంటికలశములను, కప్పన్ = మూయఁగా, క్రిందనుండును = మధురాపట్టణపు టెక్కెములకుదిగువనుండును.

నైపుణ్యముచేతను, నెయ్యపుంగురుంజువిదలు, నెయ్యపుꣳ = ప్రేమగలిగినట్టి, కురుంజువిదలు=కురుజులనియెడిచెలులు, తార్పꣳ = చేర్పఁగాను, రవియనుదివ్వెꣳ = సూర్యుఁడనుదీపమును, కేతువుచెఱంగునమూసి = పెక్కుపుగుడ్డయనెడుపైఁట చెఱఁగునఁగప్పి, ధృతోర్ధ్వయంత్రవారవిరళఘర్మయై, ధృత = ధరింపఁబడిన, ఊర్ధ్వ = ఉపరిప్రదేశమందున్న,యంత్ర = జలయంత్రములయొక్క, వాః = ఉదకములనియెడి, అవిరళ =ఎడతెగని, ఘర్మయై = చెమటగలదై, ( సాత్వికోదయమాయెననుట ) కలరవాల్పరవోక్తులꣳ, కలరవ = పావురములయొక్క, అల్పరవ = కొంచెపుధ్వనులనియెడు, ఉక్తులꣳ = పలుకులచేతను, వాంతధూపరాజివరనిశꣳ, వాంత = గవాక్షులనుండి వెడలెడు, ధూప = అగరుశ్రీగంధాదిధూపములయొక్క, రాజి = సమూహమనియెడు, వర = శ్రేష్ఠమైన, నిశꣳ = రాత్రియందు, విష్ణుపదమొత్తుꣳ = విష్ణుపదము, ఆకాశమనియెడువిష్ణుపాదమును, ఒత్తుꣳ = సంవాహనము సేయును.

తా.__ ఆపట్టణమందు ధ్వజపటములు సూర్యునిం గప్పఁగా - మదన చేతులలో గురుజులుమిన్నుముట్టఁగా - జలయంత్రములు స్రవింప ధూపధూమములు మెఱయఁగఁ బురలక్ష్మియాకాశమును స్పృశించెను - మఱియు - పురలక్ష్మి. విష్ణుపదమనియెడిపదద్వయస్వారస్యముచేత నర్థాంతరముఁదోఁచుచున్నది. నూతనస్త్రీకిఁజెలుల ప్రేరణముచేతఁ బెనిమిటినిఁబొందుట - దీపముమఱుగుపఱుచుటయు - స్వల్పధ్వనితోసంభాషించుటయు భోగగృహమందుధూపవాసనలునిండఁ బతిచరణము లొత్తుటయుస్వభావముగానఁ బురలక్ష్మియనుస్త్రీ - ధూపధూమములనియెడి రాత్రియందురత్యనుకూల సంభారముగలదియై విష్ణుపదమునొత్తుననుట - సమాసోక్త్యలంకారము. (శ్లో: సమాసోక్తిః పరిస్ఫూర్తిః ప్రస్తుతేప్రస్తుతస్యచేత్ ) అనిదానిలక్షణము.

చ. గిఱిగొనుగోపురాగ్రపరి ♦ కీలితపంకజరాగరశ్మిక,
టైఱ యగుచాయఁ బొల్చు దివ ♦ సేంద్రుఁడు నక్క నిమింటఁ బోవుచోꣳ,
మఱచి విధాతపాటలిమ ♦ మధ్యమసంధ్యకుఁ జేయ లేనియా,
కొఱఁతయుఁ దీర్చుకోఁ దొగరు ♦ కొల్పినకైవడిఁ బట్టణంబునꣳ. ౧౮

టీ. దివసేంద్రుఁడు = సూర్యుఁడు చక్కనిమింటఁబోవుచోꣳ = ఆకాశమధ్యమునఁబోవునపుడు, విధాత = చతుర్ముఖుఁడు, పాటలిమ = రక్తిమను, మధ్యమసంధ్యకు = మధ్యాహ్నమునకు, చేయలేని = నిర్మింపఁజాలని, ఆకొఱఁతయుꣳ = ఆకొదువను, తీర్చుకోꣳ = తీర్చుకొనుటకు, తొగరు = రక్తిమను, కొల్పిన = చేసిన, కైవడిꣳ = రీతిచేతను, గిఱిగొను = నిబిడమైన, గోపురాగ్ర = మేడలమీఁదను, పరికీలిత = చెక్కఁబడిన, పంకజరాగ = పద్మరాగమణులయొక్క, రశ్మి = కాంతులచే

తను, కట్టెఱియగుచాయన్ = మిగులనెఱ్ఱనైనకాంతిచేతను, పొల్చున్ = ఒప్పును, పట్టణంబునన్ = మధురయందనుట.

తా.— మధురాపురగోపురములకు సరిగానంతరిక్షమునఁ బోవుసూర్యుండు - సృష్టికాలమునబ్రహ్మ - ప్రాతస్సాయంకాలములకెఱ్ఱతిమగలుగఁజేసి - మధ్యాహ్నము నకుఁజేయనేఱకున్నకొఱఁతదీర్చికొనుటకురక్తిమనుగలుగఁజేసిన విధమునఁబురద్వారములయందుఁ జెక్కఁబడిన పద్మరాగమణుల ప్రభలచేమిగుల నెఱ్ఱనైన చాయచేత నొప్పెనని తా.

సీ. వెలఁది యీనీదండ ♦ వెలయెంత సాదండఁ, గను వెలఁ బెట్టనె ♦ వ్వనితరంబు,
కలువతావులు గాన ♦ మలికదంబక వేశి, కలువతావులు వాడ ♦ కయ కలుగునె,
కడివోదు నాకిమ్ము ♦ పడఁతి యీగేదంగి, నవకడివోమి నుం ♦ దతికిఁ జూడు,
జాతు లే వంబుజే ♦ క్షణ పద్మినులు సైతి, మును నున్నదియెడ జాతు ♦ లనికి యురదే,
యనుచుఁ దొలి నుడి నభిలాష ♦ లెనయ మూఁగ, పలుకుతోడనె నర్మగ ♦ ర్భంబు గాఁగ,
నుత్తరము పల్లవశ్రేణి ♦ కొసఁగు చలువ, లమ్ముదుగు పుష్పలావిక ♦ లప్పురమున. ౧౯.

టీ. వెలఁది = ఓయింతీ, ఈనీదండ = ఈనీయొక్కపుష్పమాలికకు, వెల = క్రయము, ఎంత = ఏమాత్రము, అనివిటుఁడడుగ నావెలఁదిచెప్పునుత్తరము, సాదండకును = నామాలికకునాసమీపముననిలుచుటకును. వెలఁబెట్టనెవ్వనితరంబు-మూల్యమింతయనినిర్ణయింపనెంతవానికైననువశంబే (వశము గాదనుట) అలికదంబకవేశి = భ్రమరసమూహమువంటిజడగలయోయింతీ, కలువతావులు గానను (తావులనఁగావాసనలకుస్థలమునకునుఁ పేరగుటంజేసి) కలువవంటివాసనలుగాన మేమియనియు, కలువలకు, తావులు, వాసస్థానములగుకొలంకులవంటినాభులుగానమేమియనియునుప్రశ్న, కలువతావులు = కలువవాసనలు, కలువస్థానసాదృశ్యముగలనాభులును, వాడకయె = వాఁడుఁజూపకయె, పరిచయములేకయే, కలుగునె = (సిద్ధింపవనుట) (కడియునఁగావాసన) పడఁతి = ఓస్త్రీ, కడివోదు = వాడుఁబారదు, కడిబోకయుండును, ఈగేదంగినను = ఈమొగలిరేకు, దానివంటిరహస్యప్రదేశమును, నాకిమ్ము, కడిపోమిమునుంపతికిఁజూడు = వాసనచెడకుండుటముందుధరించిచూడుము, తనలోఁగలసినచోబాసినప్పుడు కబళమునోటికిఁబోకయుండునది ముందరఁజూచెదవనుట, అంబుజేక్షణ = ఓపద్మాక్షి, జాతులేవి = జాజిపువ్వులేవి, జాతియేమనిప్రశ్న, పద్మినులుసైతము = తామరపువ్వులును - పద్మినీజాతిస్త్రీలును, రతిరహస్యమందుఁబద్మినిజాతిలక్షణము (శ్లో. కమలముకుళమృద్వీఫుల్లరాజీవగంధిస్సురతపయసియస్యాస్సౌరభం దివ్యమంగ। చకితమృగదృగాభే ప్రాంతరక్తేచనేత్రే స్తనయుగళమనర్ఘ్యశ్రీఫలశ్రీవిడంబి। ప్రజతిమృదుసలీలంరాజహంసీవతన్వీత్రి

వళిలలితమధ్యాహ్నంసవాణీసు వేషా । మృదుశుచిలఘుభుక్త్యా మానినీ గాఢలజ్జాధవళకుసుమవాసోవల్లభా పద్మినీస్యాత్)అని. ఉన్న యెడ=ఉన్న చోటను, జాతులునికి = జాతులుండుట, అరుదే = ఆశ్చర్యమా, (ఆశ్చర్యముగాదనుట) అనుచున్ = ఇట్లనిపచించుచు, తొలినుడిన్ = మొదటిమాట చేతను, అభిలాషలు = కోరికలు, ఎనయన్ = స్ఫుటమగునటుల, మూఁగి = క్రమ్ముకొని, పలుకుతోడనే = పచింపఁగానే, నర్మగర్భంబుగాఁగన్, నర్మ = శృంగారచేష్ట, గర్భంబుగాఁగన్ = అంతస్థమైయుండఁగను, ఉత్తరము = ప్రతివాక్యమును, పల్లవశ్రేణికిన్ = విటులసమూహమునకు, ఒసఁగుచున్ =ఇచ్చుచును, పుష్పలావికలు = పువ్వులఁగొనివిక్రయించెడిస్త్రీలు, అలరులు = పుష్పములను, ఆపురమునన్ = ఆపట్టణమందు, అమ్ముదురు = విక్రయింతురు.

తా — ఆమధురయందు విలాసవంతులగువిటులు - విహరించువేళ నీపద్యపాదచతుష్టయముల మొదటఁ జెప్పంబడియున్న తెఱఁగునఁదమయభిలాషలుస్ఫుటమగునటులఁ బ్రశ్నలఁజేయుచుఁ జుట్టుకొనిపలుకఁగా వెంటనేనర్మగర్భంబుగ నావిటులఁగూర్చిప్రత్యుత్తరములిచ్చుచురసిక శిఖామణులగు పుష్పలావికలుపువ్వులమ్ముదురని. తా.

చ. సరసులనర్మ మింపుల నొ ♦ సంగఁ గదంబపుదండఁ గట్టుచోఁ,
గరఁగుటఁ దెల్పుదృక్తరళ ♦ కాంతులు నుత్తర మిచ్చునంతరాం
తరముల నవ్వులు న్గలువ ♦ తండము మొల్లలు నంచు మిన్నుగ్రు,
చ్చి రహిని రిత్త నూలొసఁగి ♦ సిగ్గు వహింతురు పుష్పలావికల్. ౭౦.

టీ. సరసుల = రసికులగువిటులయొక్క, నర్మము = శృంగారము, ఇంపులన్ =ఇష్టములను, ఒసంగన్ = కలుగఁజేయుచుండ, కదంబపుదండఁగట్టుచోన్ = కదంబపుసరముఁగట్టెడు వేళ. కరఁగుటన్ = ఆవిటులసరసంపుబలుకులకుదమమనములు గరఁగుటను, తెల్పుదృక్తరళకాంతులు, తెల్పు = తెలియఁజేయుచున్నట్టి, దృక్ = నేత్రములయొక్క, తరళ = చంచలములగు, కాంతులు = ప్రభలు, ఉత్తరమిచ్చునంతరాంతరములన్, ఉత్తరము = ప్రత్యుత్తరమును, ఇచ్చు = ఒసఁగుచున్నట్టి. అంతరాంతరములన్ = నడుమ నడుమను, నవ్వులున్ = నవ్వెడు నవ్వులును, కలువతండము = ఉత్పలములు, మొల్లలు = మొల్లలును. అంచున్ = నిశ్చయించుకొని. మిన్నుగ్రుచ్చి = బయలుగూర్చి. రహిని = విలాసముగన్. రిత్తనూలొసఁగి = ఒట్టినూలుచేతికిచ్చి. పుష్పలావికలు=పుష్పము లమ్మువారలు. సిగ్గువహింతురు = లజ్జ పడుదురు॥ అ ॥ ఆమధురాపురమందుఁబుష్పములవిక్రయించుస్త్రీలుమిగులఁ జమత్కారులై యున్నను రసికశిఖామణులగు విటులు సరసోక్తులచేత నట్టిచాతుర్య యుక్తస్త్రీలనుగూడ మోహింపఁజేయుదురని ముఖ్యాభిప్రాయము.

౭౦.

సీ. పద్మాస్య పురి నను♦భవతకు నీవ యె, త్తులు వెట్టు ననఁగ రా♦వలసె నిటకుఁ,
దెలుపుమా జాముండు♦నలరింపఁ ఘటికాద్వ, యం బుండు నలరింపఁ♦కంబుకంఠి,
యే వేఁడుటకు నీవు♦ఋతు వేల చెప్పెద, వువిద మేమందాఁక♦నోర్వఁ గలమె,
చేరఁగా రాదె బా♦సికము గేల్ సోఁకిన, యంతనే చెడునె యే♦ణాయతాక్షి,
యనుచుఁ బరిభాషవోలెఁ ద♦మ్మాస దొరల, నాథ మోవిఁ జెరంగిడి♦యాఁగు నవ్వు,
కంట నిగుడ విరుల్ నాన్పు♦కరణిఁ జల్లు, సరసపుజలంబె జాణల♦మరులుకొల్పు. ౨౧.

టీక. పద్మాస్య = ఓపద్మముఖి, పురిన్ = ఈమధురలోన్, అనుభవతకున్ = అనుభవించుటకు, నీవ = నీవే, ఎత్తులు వెట్టుదు = పుష్పముల యెత్తులు వెట్టుదువనియును, క్రీడకొఱకు నెదురు వెచ్చము వెట్టుదువనియును (ఎత్తులనఁగఁ బ్రయత్నములని కొందఱందురు) అనఁగన్ = వచింపఁగా, ఇటకున్ = ఇచ్చటికే, రావలసెన్ = వచ్చుటకుఁ గారణంబాయెను, కంబుకంఠి = శంఖమువంటి మెడగలయోవనిత, జాముండు = యామము వఱకు వాసనచెడకుండు, అలరు = పుష్పము, ఇంపా = బాగైనదో, ఘటికాద్వయంబుండు = రెండుగడియలు వాసనచెడకుండు, అలరు = పుష్పము, ఇంపా = బాగైనదో, (అదియానందమునకు సాధనముగుటవలన) యామువు సురతానందమిష్టమో లేక రెండుగడియల సురతానందమిష్టమో, తెలుపుమా = తేటపఱుపుము, ఉవిద = ఓయింతీ, ఏ వేఁడుటకు = నేను వలయునని కోరినపుష్పమిచ్చుటకు, ఋతువు = ఋతుకాలము రావలయునని, ఏల = ఎందుకు, నీవు = నీవు, చెప్పెదవు = నుడివెదవు, మేమందాఁకన్ = ఏమదివఱకు, ఓర్వఁగలమె = ఓర్వఁగలమా, ఏము నీతోడిసంసర్గము గోరినఋతుస్నానముఁజేసినదివసముననయ్యెదునని చెప్పెదవు. మేమందాఁక నోర్వలేమనుట, ఏణాయతాక్షి, ఏణ = ఇఱ్ఱియొక్క, ఆయత = దీర్ఘములైన, అక్షి = కన్నులవంటి కన్నులుగలయోలలనా, చేరఁగా రాదె = దగ్గిరకుఁ జేరఁగూడదా, బాసికమనఁగా పుష్పమాలిక రచనావిశేషమునకు. ఊరుమూలమునకును నామముగావున, పుష్పమాలికయు = నీయూరుమూలమును, కేలుసోఁకినయంతనే = నాచేసోఁకినమాత్రముననే, చెడునే = చెడిపోవునా, అనుచున్ = ఏలస్పృశింపనియ్యవనుచును, పరిభాషవోలె = సంకేతపుమాటలాడినటుల, తమ్ముల్ = తముల్, ఆసదొరలన్ = అభిలాషవెడలునటుల, ఆన్ = పలుకఁగా, మోవిన్ = అధరోష్ఠమున, చెరంగిడి = పైఁటకొంగు మూసికొని, ఆఁగునవ్వు, ఆఁగు = నిలిపిన, నవ్వు = హాసము, కంటన్ = నేత్రములయందు, నిగుడన్ = వెడలి రాఁగా, విరులు = పుష్పములను, నాన్పు = తడుపునట్టి, కరణిన్ = రీతి చేతను, చల్లు సరసపుజలంబె, చల్లు = చల్లెడు, సరసపుజలంబె = రసయుక్తంబగు నుదకమే, జాణలన్ = విటులను, మరులుకొల్పు = మోహపడఁజేయును.

తా. సుగమము ౨౧.

సీ. ఇంద మంతరి దంత ♦ కుందాభఁ గూడి ని, శ్చలపుఁజూపులు మిన్న ♦ సంభ్రమింప,
వెలయొప్ప కవలఁబో♦విఱుచుమోవియుఁ గోప, మొదవెడుచూపు మో ♦ మోటఁ ద్రి
దిరిగినసస్మితో♦క్తియుఁజూపుటొయ్యార,ములు నగుఁ గా దను♦పలుకు లుడుప,[ప్పఁ
నవి గాని కావొ నీకను పరాసాపత్న్య సంపాదనంబుల ♦ నింపుఁ బెనుపఁ,
జతురవచనవిలాసాంగ ♦ సౌష్ఠవములఁ, బసిడిఁ దా నిచ్చినట్టియ♦ప్పణఁతి మఱువఁ,
బతికిఁ గైదువ లందిచ్చు ♦ రతివిధమున, విటుల కిత్తురుమఱి వారు ♦ విరులు పురిని.

టీక. ఇందము = ఇదిగో, అంతరి = అను వేళ, దంతకుందాభన్ = మొల్లలవంటిదంతములకాంతి, కూడి = చేరికొని, నిశ్చలపుఁజూపులు, నిశ్చలపు = కదలకుండునట్టి చూపులు = చూడ్కులు, మున్న = తొలుత నే, సంభ్రమింపన్ = తొట్రుపడఁగాను, వెల = క్రయము, ఒప్పక = సమ్మతింపక, అవలఁబోన్ = అవల మఱియొకయంగడికిఁబోఁగా, విఱుచుమోవియు = మడవఁబడిన యధరోష్ఠమును, కోపమొదవెడుచూపు = కోపమును గనుపఱచుచున్నదృష్టియును, మోమోటఁద్రిప్పన్ = మొగమాటమునఁద్రిప్పఁగా, తిరిగిన = అవిటులుమరలరాఁగా, సస్మితోక్తియున్ = చిఱునవ్వుతోఁగూడినమాటయును, చూపుటొయ్యారములును = గర్వపుజూపులును, అగుఁగాదను పలుకులు = ఔనుగాదన్నవాక్యములను, ఉడుపన్ = మాన్పఁగా, అవిగాని = ఆ మాలికలేగాని, ఆస్త్రీలేగాని, కావొనీకు = నీకిష్టములుగావా, అను = అనునట్టి, పరాసాపత్న్యసంపాదనంబులు, పరా = ఇతరస్త్రీలను, సాపత్న్య = తమతో సపత్నీభావమును, సంపాదనంబులు = సంపాదింపుచున్న పలుకులు, ఇంపున్ = ఇష్టమును, పెనుపన్ = వృద్ధిఁజేయఁగా,(ఆబిడపువ్వేగాని నాపువ్వు పనికిరాదాయని భావార్థము) చతురవచనవిలాసాంగసౌష్ఠవములన్, చతురవచన = చాతుర్యపుమాటలచేతను, విలాస = చేష్టలచేతను, అంగసౌష్ఠవములన్ = సౌందర్యముచేతను, పసిడి = పైకము, తానిచ్చినట్టి యప్పణఁతిన్ = తానిచ్చిన యాస్త్రీని, మఱువన్ = మఱచి పోఁగాను, పతికిన్ = పెనిమిటికి, కైదువలు = ఆయుధములు, అందిచ్చు రతివిధమున = చేతికందిచ్చునట్టి రతీదేవియొక్క రీతి చేతను, పురినిన్ = మధురయందు, వారు = పుష్పములమ్ము యువతులు, విరులు = పుష్పములను, ఇత్తురు = ఒసఁగుదురు ॥ అ ॥ మన్మథునికి రతీదేవి యాయుధములఁజేతికందిచ్చునటుల యామధురాపట్టణమందలి పుష్పలావికలు విలాసచాతుర్య సౌందర్యములచే మోహింపఁజేయుచు విటులకుఁ బుష్పము లమ్ముదురని యభిప్రాయము.

౨౩.

చ. చల మగుచంద్రఖండములు ♦ దారలు సాంకవ మొప్పపాణిపా ।
టల మగుదంతపుంగరవ ♦ డంబు శశాంకుఁడు గుంటమైనచీ ।

రలజిగి కెంపుగా బయిటి ♦ రథ్యల నొప్పుదు రిందుకాంతవే ।
దులపయి సంధ్యయే బహుతఁ ♦ దోఁచె నన న్పురి గట్టివాల్సతుల్ ॥ ౨౩.

టీ॥ దళమగుచంద్రఖండములు, దళమగు = సాంద్రమైన, చంద్రఖండములు = కర్పూరంపుఁదునుకలు, తారలు = చుక్కలు, సాంకవము = పునుఁగు చేతను, ఇచటఁ దృతీయార్థమందు ప్రథమ, ఒప్పు = ప్రకాశించుచున్న, పాణి = హస్తము చేతను, పాటలమగు = తెలుపు ఎఱుపువర్ణముగల, దంతపుంగర వపంబు = దంతపుఁ గరాటము. శశాంకుఁడు = చంద్రుఁడు, కుంకుమైనచీరలజిగి = చెందిరమంటిన కోకలకాంతి, కెంపుగా = ఎఱుపుగాఁగా, ఇందుకాంతవేదులపయిన్ = చంద్రకాంతపుఁ దిన్నెలమీఁదను, సంధ్యయే = సంధ్యాకాలమే, బహుతన్ = బహుత్వముచేతను, తోఁచెనన్ = కానఁబడియెననునటుల, పురిన్ = పట్టణమందలి, బైటిరథ్యలన్ = వెలపటివీధులయందు, గట్టివాల్సతులు = పరిమళద్రవ్యములమ్మెడు స్త్రీలు, ఒప్పుదురు = ప్రకాశించుచుందురు.

తా.—ఆపట్టణమందుఁ బరిమళద్రవ్యములమ్ముచున్న స్త్రీలు, బైటివీధులయందున్న చంద్రకాంతమణిమయమగు వేదికలపైఁ దమచేతనుండు పునుఁగుచే నిండింపఁబడి హస్తకాంతిచే నెఱ్ఱనైన దంతపుబరణిచంద్రుఁడుగాను - ఆకరాటమందున్న కప్రపుఁదునుకలు చుక్కలుగాను - కుంకుమచేఁదుడువఁబడిన చీరలకాంతి ఎఱ్ఱనగుచుండఁగా సంధ్యాకాలలక్షణ మొప్పుచుండెనుగాన ననేక రూపంబులఁబొందిన సంధ్యయోయనునటులఁ బ్రకాశించుచు నుందురని తాత్పర్యము. ( గట్టివాల్సతులు ॥ అనుపదము భారత ప్రసిద్ధము ). ౨౩

సీ. ఉపరిస్థజనవార♦ణోక్తికిఁ జెవిఁ దార్చి, యమ్మొగంబై బయ♦ల్చిమ్మి చిమ్మి,
గవని వెన్నెలయ మి♦న్నవియ దట్టించుతో, త్రధరు బందపుదాంట్లఁ♦దఱిమి తఱిమి,
చలువచే ద్వారవే♦దు లెఱింగి నిల్చి త, జ్జనజిఘృక్షుకుఁ గేలు♦సాఁచి సాఁచి,
డిండిమంబుల దుబ్బి♦గండాల్పదానమే, ఉలుగఁ ఉద్వహు తాల♦బువ్వి బువ్వి,
వేణుశాఖులకు పీడు♦వెడలి వెడలి, పరపథగజ్యానికిఁ బోక♦తిరిగి తిరిగి,
దృక్పుటలు వైరులకుఁ బంపు♦కృత్యల నవ, గానుగతిఁ జేసి ప్రబలెఁ గరు♦లగ్గలికలన్.

టీ. కరులు = ఏనుఁగులు, ఉపరిస్థ = పైనుండెడు, జన = మావటీలయొక్క, వారణోక్తికిన్, వారణ = నివారణార్థమైన, ఉక్తికిన్ = అదలింపునకు, చెవిఁదార్చి = చెవియొగ్గి, అమ్మొగంబై = అదిక్కుముఖమై, బయలు = ఆకాశమును, చిమ్మి చిమ్మి, మిన్నవియన్ = ఆకాశము బ్రద్దలయ్యెడునట్లు, దట్టించుతోత్రధరున్, దట్టించు = ధ్వనిఁజేయుచున్న, తోత్రధరున్ = తోత్రధరించినవానిన్, గవనివెన్నెలయ = ఊరి

వాకిలివీఁపుఁదాఁకఁగా, బందపుదాంట్లన్ = కుప్పగంతులచేతను, తటిమితటిమి, చలువచే = చల్లగానుండుటచేత, ద్వారవేదులు = వాకిటనున్న తిన్నెలను, ఎఱింగి = తెలిసికొని, నిల్చి = తజ్జనజిఘృక్షకున్, తత్ = ఆవేదికలయందలి, జన = జనములయొక్క, జిఘృక్షకున్ = పట్టవలయునను నిచ్ఛచేత, కేలు = తొండము. సాఁచిసాఁచి, డిండిమంబులకు = ముందఱఁబోవువాడు వాయించెడు డిండిమ వాద్యధ్వనులకు, ఉబ్బి = ఎక్కువై, గండాల్పదానము, గండ = గండస్థలమందలి. అల్ప = కొంచెమగు, దానము = మదోదకము, ఏఱులుగన్ = ఏఱులై పాఱఁగను. తద్వహున్ = ఆడిండిమవాద్యములఁజేతఁబట్టియున్నవాని, ఱాలన్ = శిలలచేతను, ఉవ్వి ఉవ్వి, వేణుకోష్ఠములకున్ పెద్దవెదురుకోలపెట్లకు, పీడు = పురమును, వెడలి = వెడలి, పరపథగజధ్వనికిన్, పరపథ = ఇతరమార్గములయందలి, గజధ్వనికిన్ = ఏనుఁగులబృంహితములకు, పోకతిరిగి = తిరిగి, దృక్పుటలు = దొప్పలవంటికన్నులు, వైరులకున్ = శత్రువులకు, పంపు = పంపునట్టి, కృత్యలనన్ = శక్తులోయనునట్లు, వెలిన్ = వెలపటను వశానుగతిన్, వశా = ఆఁడయేనుఁగులయొక్క, అనుగతిన్ = అనుసరించు మార్గమున॥ ని॥ (కరిణీధేనుకావశాయని యమరుఁడు) అగ్గలికలన్ = ఉద్దండాల చేతను, చేరున్ = పట్టణముఁ బ్రవేశించును

తా.—ఆపురమందలి మదపుటేనుఁగులు మావుటీలయదలింపులు విని యాముఖములగబయలు చిమ్ముచు-ఊరివాకిటియొద్దనుండెడి యఱుగులమీఁదనున్న జనులఁ బట్టుటకై తొండములు సాఁచుచుఁదమ్ముఁగట్టిగదండించుచునీటెఁబట్టి క్రిందనున్నవానిఁ దఱుముచు ఖామముందఱ డిండిమవాద్యధ్వనిఁ జేయుచున్నవానిని మదోదకము హెచ్చుటంజేసితాల వెనువ్వుమను - పెద్దవెదురు పెట్లకుఁ బురంబు వెడలివచ్చి యీవలావలవినంబడు గజబృంహితములలక్ష్యపెట్టక-శత్రురాజులమీఁదికిఁ బ్రయోగించినశక్తులోయనునటుల నుండెడు దొన్నెలవంటికన్నులుగలవై, ఆఁడయేనుఁగులు పోవుమార్గముఁబట్టి యతి ప్రయాసచేత మఱలఁబట్టణముఁ జేరునని తాత్పర్యము. ౨౮.

ఉ. పైననిశంబుఁ జల్లుకొను ♦ పాంసువుపై ఖగతుండఖండితా,
లానమహామహీరుహఫ ♦ లచ్యుతబీజము లుత్థితపత్త్రాం,
భోనిబిడాప్లుతి న్మొలువఁ ♦ బొల్చునగమ్యతఁ దూలుచు న్సరో,
ద్యానముల న్మదేభములు ♦ ప్రాణము తోడినగంబులో యనన్. ౨౯.

టీ. పైన్ = దేహముమీఁదను, అనిశంబు = నిత్యమును, చల్లుకొనుపాంసువుపైన్, చల్లుకొను = చల్లుకొనునట్టి, పాంసువుపైన్ = పరాగముమీఁదను, ఖగ = పక్షులయొక్క, తుండ = చంచూపుటములచేతను, ఖండిత = పగల్పఁబడిన, ఆలాన =

కట్టుకంబములైన, మహత్ =పొడవులైన, మహీరుహ=వృక్షములయొక్క, ఫల=పండ్లవల్లను, చ్యుత=జాఱిన, బీజములు=విత్తనములు, ఉత్క్షిపత్ = పైఁజిమ్ముకొనియెడి, కర=తొండములయందలి, అంభః=జలములయొక్క, నిబిడ=దట్టమగు, అప్లుతిన్ = తడుపుటచేత, మొలువన్ = చెట్లుపుట్టఁగా, అగమ్యతన్ =పట్టనశక్యంబగునటుల, తూలుచున్ = ఊఁగుచును, మదేభములు = మదపుటేనుఁగులు, పురోద్యానమునన్, పుర=పట్టణమందలి, ఉద్యానములన్ =శృంగారవనములయందు, ప్రాణముతోడి నగంబులోయనన్ =ప్రాణములుగలపర్వతములోయనునటుల, పొల్చున్ = ఒప్పును.

తా. ఏనుఁగులను దుమ్ము పైఁజల్లుకొనుటకైజముగాన నట్లు నిండింపఁబడియున్న మంటిపై గజములఁగట్టువృక్షములమీఁదనున్న పక్షులుఫలములఁబగల్చిరాల్పఁగా బడిన బీజములు తొండముచేఁ బైఁజల్లుకొను నుదకమువలన మిగులనాన్పఁబడి యంకురింపఁగాఁ బట్టనశక్యంబులై యూఁగుచుఁ బురోద్యానములయందుఁ జైతన్యయుక్తంబులగు పర్వతములోయనునటుల సంచరించుచుండునని తాత్పర్యము. ౨౫.

శా॥ మౌనిక్రోధవిధూతపత్రముల మాఁకుల్మాతో సపత్రుల్గదా,
కా నిం డంచును గేకరాక్షిరుచిమొల్కల్ప్రక్కల న్వ్యాద్ధతూ,
ణానల్పాహిపకల్పకాండతతులం దారంబురిం బొల్చు నా,
జానేయంబులు ఫేనపాస మిడి కైజాహారల్లార్చుచున్. ౨౬.

టీ. మౌని = ఒకానొకమునియొక్క, క్రోధ = కోపముచేతను, విధూత=పోఁగొట్టఁబడిన, పత్రములవౌ = ఱెక్కలుగలవారమైనట్టియునఁగా ( ఱెక్కలులేని వారమనుట) (సి. గరుత్పక్షచ్ఛదాః పత్రమనియమరుఁడు.) మాతోన్ =ఇక్కమాతోడను, సపత్రుల్గదా = వీరు ఱెక్కలుగలవారుగదా. కానిండంచును = తలఁ[illegible]దివట్లు, కేకరాక్షిరుచిమొల్కలు, కేకరాక్షి = కడకన్నులయొక్క, రుచి = కాంతులయొక్క, మొల్కలు=అంకురములు, ప్రక్కలన్ = పార్శ్వములయందు, [illegible] = పెంపొందఁగూడిన, తూణ=పొదులయందు, అనల్ప=విస్తారమైన, అహిప=సర్పరాజములతో, కల్ప = తుల్యములగు, కాండ = బాణములయొక్క, తతులన్ = సమూహములయందు, దారన్ = ప్రసరింపఁగా, ఫేనపాసమిడి=నురుఁగమనవ్వుగల్గ, కైజాహారల్లార్చుచున్ = కైజా వేసినముఖములనూఁచికొనుచు. (కైజా అనఁగాఁ గళ్లెముపైకట్టిడిగట్టుట) ఆజానేయంబులు = జాతిగుఱ్ఱములు. (ఆజానేయాః కులీనాస్యుః అనియమరుఁడు.) పురిన్ = పట్టణమందు, పొల్చున్ = ఒప్పును.

తా. ఆపట్టణమందలి [illegible] జాతిగుఱ్ఱములు గళ్లెములచే బిగింపఁబడిన ముఖము లల్లార్చుచుఁ బ్రక్కలఁ [illegible] ఱెక్కలుపోయినవి

మీఁద జొక్కలున్నవి, ఉండినపుండనిండు. త్రొక్కకొనినదు తమరగండని ప్రక్కలఁ గట్టియున్న పాదులలోనుండెడి సర్పతుల్యంబులగు బాణములఁబిలుచుచున్నవో యనునట్టుల నొప్పుచుండునని తాత్పర్యము. ౨౬.

చ॥ చలమున సింగిణీతఱకసంబులు గట్టక మాన రంపపె,
న్నెలగతి మాగతి న్వెనుకఁజిక్కక మానదు తప్పి దారి వె,
న్నొలసినఁ దారు వెన్నెఱుఁగకుండుట నొచ్చెము సాదికోటికం,
చలమినచింతఁ ద్రవ్వికొను నంఘ్రి తుద న్పురిలోనివాహముల్. ౨౭.

టీ. పురిలోనివాహముల్ = ఆపట్టణమందలి యుత్తమాశ్వములు, చలమునన్ = ఈసుచేతను, సింగిణీతఱకసంబులు=శార్ఙ్గతూణీరంబులను,కట్టకమానరు=బంధింపకవిడువరు. అంపపెన్నెలగతి, అంప=బాణములయొక్క, పెను = అమితమైన, సెల = గుంపుయొక్క, గతి = గమనము, మాగతిన్ = మా వేగమునకు, వెనుకఁజిక్కక మానదు = వెనుకఁజిక్కకయుండదు (ఆబాణంబు లెదిగిరాలేవనుట) తప్పిదారి=ఒకవేళను, వెన్నొలసిన=వీపుదాఁకినను, తారువెన్నెఱుఁగకయుండుటన్=తాము వెన్నెఱుంగకయుండుటచేత, మాఱుపనియొకపాతము, సాదికోటికిన్=రౌతులకు (ని, అశ్వారోహస్తుసాదిన యనినిఘంటువు) ఒచ్చెము = తక్కువ, అంచున్ = అనుచును. అలమినచింతన్ = కప్పుకొన్నచింతచేతను, అంఘ్రితుదన్ = కాలిగొరిసలచేత, త్రవ్వికొనున్ = భూమినిఁ ద్రవ్వుచుండును.

తా. గుఱ్ఱములకుఁగాలి గొరిసెలచేత నేలత్రవ్వుటస్వభావముగావున నాపట్టణమందలి యశ్వములుక్రియలొనర్పుచుండ రోషంబులుగలరౌతులు శార్ఙ్గతూణీరంబులఁగట్టి శత్రువులపై శరములఁబ్రయోగింప నాశరములగమనముదమవేగమునకు వెనుకఁ జిక్కును గాన వీపెఱుఁగని సాదులను వెన్నునఁదగులుననియెడి యొచ్చెమువచ్చెగదా యనుచింతతో నేలత్రవ్వుచున్నవియనునట్టుల నుండునని తాత్పర్యము. లోకమునందు శోకచింత గలిగినయెడ మనుజులలో నేలఁద్రవ్వుట ప్రసిద్ధంబు. ౨౮.

ఉ. అంజ సమానవాయుగణమంతయు ఖంజతఁ జిక్క నజ్జవో,
ష్మం జనియించుచిక్కనిసమానపుణ్యయువులో నొకంటుగ,
ల్మిం జనియించు దుర్యలుళమేల్కని శేషనవేళ వాజు లూ,
ర్పం జెసుమాణిబంధమునుకరంబుల కాళిమపేరఁ గారొక్కనున్, ౨౯.

టీ. అంజన్ = ఒకయంగములోపలనే, సమాన = సరియైన, వాయుగణమంతయు = వాయుసమూహంబెల్లను, ఖంజతన్ = వేగములేమిచేత, చిక్కన్ = పట్టుపడఁగా, అజ్జవోష్మన్ = ఆవేగపువేఁడిమివలన, జనియించు = పుట్టుచున్నట్టిమా, చి

క్కాని = స్వాధీనముగానియట్టియు, సమానవు=సమానంబనియెడి, వాయువు= గాడ్పు, లోన్ = దేహములోపల, ఒకండు=ఒక్కఁడు, కల్మిన్=ఉండుటవలన, జనియించు= సరియైనదియొకటియుండెననిపుట్టిన, దుర్యశము=అపకీర్తి, మేల్కాని = తెలివి, లేహన వేళన్ = గుఱ్ఱములు కవణముదినుసమయమున, వాజులు=గుఱ్ఱములు (ని. వాజివాహార్వగంధర్వహయసైంధవసప్తయయనియమరుఁడు) ఊర్పన్ = ఆఘ్రాణింపఁగా, చెడు= చెడిపోవుచున్నట్టి, మాణిబంధముకురంబుల = అద్దములవంటి సైంధవలవణపుఁబిళ్లలయొక్క, కాళిమ = నైల్యమనియెడి, పేరన్ = వ్యాజముచేత, కారొక్కనున్ = నల్లనగును.

తా. ఆచటనుండు నశ్వములలేహన వేళలయందుంపఁబడిన సైంధవ లవణపుఁజెక్కల నాగుఱ్ఱములాఘ్రాణింపఁగా దానియందేర్పడిన నైల్యము సమానవాయువుల నెల్ల గెలిచి సమాదిమనుపేరుఁగలిగి తమనాభి స్థానమందున్న వాయువుకు గెలువనైతిమనునపకీర్తిజనియించెనో యనునటులనుండెనఁగా వాయువేగములనతిక్రమించెడి వేగముగలయశ్వములనితాత్పర్యము. ౭౪.

మ. ఇలఁ బాదద్వయి రాయ నబ్బొసఁగు నెంతే పారుచో నంకవ,
న్నెలు రెండై లఘిమం దకీర్తి యిడుమున్నే యెక్కుచో నిందు నెం,
దులచే మాదు మటంచు సాదు లలయన్ రూపోచ్చము ల్వాజు లం,
దలరున్ బాహ్లికపారశీకశకధారారట్టఘోట్టాణముల్. ౭౫.

టీక. ఎందే = ఎక్కడనైనను, పారున్ = పరుగిడునపుడు, పాదద్వయి= తమమీఁదనారోహణముజేసియున్న వారియొక్క రెండుపాదములను, ఇలన్ = భూమియందు, రాయన్ = ఒఱయఁగా, అబ్బ = భీతియును, ఒసఁగున్ = ఆయారోహకులకు నిచ్చును, మున్నే = తొలుతనే, ఎక్కునోన్ = ఎక్కునపుడు, అంకవన్నెలు రెండై = రెండంకవన్నెలచేతఁగాని యెక్కుటకసాధ్యంబై, లఘిమందు = లఘుత్వమందు, అకీర్తియిడున్ = అపకీర్తినిచ్చును, ఇందున్ = ఈ రెంటియందు, ఎందులకే మాదుము = దేనికి నెటులఁజేయుదుము, అటంచున్ = అట్లని, సాదులు = గుఱ్ఱపురౌతులు, అలయన్ = వేసటపడఁగా, రూపోచ్చముల్ = రూపములచేత గొప్పను వహించియున్నట్టి, బాహ్లిక = పారశీక = శక = ధారా = ఆరట్ట = ఘోట్టాణములు = ఈదేశములయందు జనించిన, వాజులు = జాత్యశ్వములు, అందున్ = ఆపట్టణమందు, అలరున్ = ఒప్పును.

తా. —ఆపట్టణమందున్న యశ్వములు బాహ్లికాదిదేశ సంభవములగుటంజేసి మిగులఁ బొడవైనవిగాన రెండంకవన్నెలతోఁగాని యెక్కఁగూడకపోవుటయు - పరు

గిడెడి సమయమునసాగి నేలకు వంగునపుడు కుఱుచలౌటవలనరాతులపాదములు నేలతాచుకొనకుండఁగా నీ యపకీర్తులకేమి సేయువారమని గుఱ్ఱపురాతులు నిత్యము చింతాపరులైయుండ నశ్వములచే నాపట్టణము ప్రకాశించునని తాత్పర్యము - వేగవంతంబులగునుత్తమాశ్వంబులు పరుగిడునప్పుడెల్లను నేలకు వంగుటయు - మరల హెచ్చుటయు - గొప్పగుఱ్ఱములకు రెండేసి యంకవన్నెలు వేయుటయును లోకసిద్ధము.

సీ॥ ముడివిప్పనడుగుద◆మ్ములపైనె బ్రాలుపె, న్నెఱులు దేంట్లగుటసం◆దియముగలదె,
కనఁ గెంతవానిలోఁ◆గొనుట నాదర్శంబు, నెమ్మొగంబగుటసం◆దియముగలదె,
ఇఱిగౌను మింటిపై◆ మెఱయుటఁ జక్రద్వితయి చన్నులగుటసం◆దియముగలదె,
పొలుసుదోర్లఁగఁ జూచు◆కలికిచూపులమీలు, తెలిగన్నులగుటసం◆దియముగలదె,
పొలసిననె తావిబుగులుకో◆నలరుఁదీఁగ, తిన్ననిశరీరమగుటసం◆దియముగలదె,
యనఁగఁ జెలువొందిసురతపై◆యాత్యనిధులు, పణ్యయువతులుపొలుతురప్పట్టణమున.

టీక. ముడివిప్పఁ = కొప్పువిప్పఁగా, అడుగుదమ్ములపైనె = పాదములనుకమలముల పైన బ్రాలు = బ్రాలెడి, పెన్నెఱులు = పెద్దవెంట్రుకలు, తేంట్లగుటఁ = తుమ్మెదలగుటయందు, సందియముగలదె = సందేహముగలదా (నిస్సందేహమనుట, తఱుచుగాఁగమలములమీఁద వ్రాలునవితుమ్మెదలుగాననిట్లు వర్ణింపఁబడియె) కనఁ = చూడఁగానే, ఎంతవానిఁ = ఎట్టిగొప్పమనుష్యునిని, లోఁగొనుటఁ = తనలోనిమిడిచికొనుటవలన, నెమ్మొగంబు = ముఖము, ఆదర్శంబు = అద్దము, అగుటఁ = అగుటయందు, సందియముగలదె (ఎంతటిధీరుఁడైనను - పురుషుండాస్త్రీలముఖ సౌందర్యముఁ జూచినవారికి వశ్యుఁడగుననుట) ఇఱిగౌను = సూక్ష్మమైన నడుమనియెడి, మింటిపైఁ = ఆకాశముపై, మెఱయుటఁ = ప్రకాశించుటచేత, చన్నులు = స్తనములు, చక్రద్వితయి = జక్కవదోయి, ఔటఁ = ఔటయందు, సందియముగలదె ( మధ్యప్రదేశమాకాశమువలె శూన్యముగ నుండుటవలన నందుపైనుండునది చక్రద్వితయియనియూహింపఁబడియె ) ( పొలుసన మత్స్యగంధమునకు, కౌటిల్యమునకును పేరు ) పొలుసు దోర్లఁగఁ = మత్స్యగంధము, కౌటిల్యమును, పొర్లునటుల, చూచుకలికిచూపులఁ = చూచునటువంటిసొగసైనదృష్టుల చేతను, సొగసుగాఁగనఁబడుటచేతను, మీలు = మీనములు, కన్నులౌటఁ = నేత్రములౌటయందు, సందియముగలదె (తమయందుఁ బొలుసుండుటవలన మీనములుగన్నులౌటకు సందేహము లేదనుట) పొలసిననె = సుడిసినప్పుడే, తావి = సుగంధము, బుగులుకోను = గమ్మనఁగా, తిన్ననిశరీరము, అలరుఁదీఁగ = పూఁదీఁగ = అగుటసందియముగలదె(పరిమళించునవి పూఁదీఁగగాన సుగంధముండుటవలననదియని యుత్ప్రేక్షింపఁబడియె) అనఁగఁ = అనునట్లు, చెలువొంది = ఒప్పి, సురత = రతియందు

వైయాత్య = ప్రౌఢత్వమునకు. నిధులు = స్థానములగు, పణ్యయువతులు = ప్రాయపువేశ్యలు, ఆపట్టణమునన్ = ఆమధురయందు, పొలుతురు = ఒప్పుచుందురు.

తా.—సుగమము.

మ. ప్రతతప్రాంతపిశంగకుంకుమజటా◆పాళీకురంగీమదా,
సితవీణాళికలస్వనంబులెసఁగం◆జెన్నారుకర్పూరపుం,
జతతుల్కంటికి నారదత్వమునమిం◆చన్గామినీకామిసం,
తతికేలాయెడ తెవ్వఁగంతుకలహో◆న్మాదంబులాప్రోలునన్. ౨౫

టీక. ప్రతత = విస్తారమైనట్టియు, ప్రాంత = సమీపమున (కాంతిప్రసరించుటచేతననుట) పిశంగ = పచ్చనైన, కుంకుమజటాపాళీ = కుంకుమపురాసులనుజడల సమూహములును, కురంగీమదాసితవీణా = కస్తూరియనునల్లనైన వీణెయును, అళికలస్వనంబులు = తుమ్మెదలఝూంకారముననవ్యక్తవీణావాదములును, ఎసఁగన్ = కూడఁగా. చెన్నారు = ఒప్పుచున్నట్టి, కర్పూరపుంజతతులు = కప్పురపురాసులు, కంటికిన్ = కన్నులకు, నారదత్వమునన్ = నారదభావముచేతను, మించన్ = అతిశయింపఁగా, కామినీ కామిసంతతికిన్ = కాముకులగు స్త్రీపురుషులసమూహమునకు, కంతుకలహోన్మాదంబులు = మన్మథయుద్ధమనియెడియున్మాదములు (సురతములనుట) ఆప్రోలునన్ = ఆపురమున, ఏలా = ఏమిటికి, ఎడ తెవ్వన్ = ఎడబడును.

తా.—ఆమధురయందుఁ దమసమీపముఁ గర్పూరకాంతులు ప్రసరించుటవలనఁ గొంచెము పచ్చనై జడల కాంతివలెనున్న కుంకుమరాసులును - వీణెవలెనల్లనైయున్న కస్తూరియు - అవ్యక్తమధురమైనతుమ్మెదల ఝూంకారములునుగూడి యుండఁ ప్రకాశించుచున్నట్టి - కప్పురపురాసులు నారదభావముచేతఁ గంటికగుపడఁగా నారదుఁడు కలహప్రియుఁడు గానఁదద్ధర్మముగల కర్పూరపురాసులుండఁగనా కాముకులగు స్త్రీపురుషులకు మన్మథయుద్ధమేల మానుననఁగాఁ దాదృశకర్పూరపు రాసులఁ జూడఁగాఁ గామోద్రేకమున మోహితులై నిత్యము సురత క్రీడలయం దాసక్తులై యుందురనితాత్పర్యము.

తే-గీ. నింగిటు త్రిశంకుకతనమా◆తంగ వాటి, యయ్యెనిఁక నుండఁదగదని◆యవనికరిగి
నట్టినక్షత్రతారాగ్ర◆హాలియనఁగఁ, గాంతనవరత్నరాసులం◆గళ్లఁ బొలుచున్.

టీక. ఇటు = ఈ ప్రకారము, నింగి = ఆకసము, త్రిశంకుకతన = త్రిశంకుఁడు ప్రవేశించుటచేతను, మాతంగవాటియయ్యెన్ = వెలివాడయాయెను॥ ని ॥(మాతంగోగ జనీచయోః అనివైజయంతి) - ఇఁక నుండఁదగదని = ఇఁకమీఁదనుండఁ గూడదనుచు, అవనికి = భూమికి, అరిగినట్టి = వ్రాలినట్టి, నక్షత్ర = నక్షత్రములు, తారా = అశ్వి న్యాదీతరతారలు, గ్రహ = సూర్యాదిగ్రహములు = వీనియొక్క, ఆళియనన్ =

సమూహమనుటుల, కాంత = రమ్యములైన నవరత్నరాసులు - అంగళ్లన్ = పణ్య గృహములయందు, పొలుచున్ = ఒప్పును.

తా.—ఆమధురాపట్టణమందలి యంగళ్లయందున్న నవరత్నరాసులు ఆకాశము త్రిశంకుచే నాక్రమింపఁ బడినదిగానఁ జండాలవాటియయ్యె నింకనుండఁగూడదని యభిప్రాయముగలవై భూమికివచ్చియున్న సూర్యాదిగ్రహాశ్వన్యాది నక్షత్రములన విఖ్యాత నామములగు జ్యోతులు నోయనునటుల వెలుంగుచుండునని తాత్పర్యము. నక్షత్రతారలను భేదము రఘువంశమందు. శ్లో. నక్షత్రతారాగ్రహసంకులాపియనియున్నది.

—* చాతుర్వర్ణ్యవర్ణనము. *—

చ. చిరసముపాశ్రితాగ్ని తడిఁ◆జెందినశించునటంచునోకృతా,
ధ్వరతఁదదగ్ని మైనునికి◆దాననొకంగముదాఁచుచేతనో,
పురధరణీసురుల్నిగమ◆భూధరముల్జపయజ్ఞశీలురౌ,
హరిధనదేశులైనవలహస్తముసాఁపరువారిధారకున్, ౨౪.

టీ. చిరసముశ్రితాగ్ని, చిర = బహుకాలమునుండి, సముపాశ్రిత = ఆశ్రయించియున్న, అగ్ని = వైశ్వానరుఁడు, తడిఁజెంది = తేమఁదాకి, నశించును = చల్లారును, అటంచునో = ఆప్రకారమనియో, కృతాధ్వరతన్, కృత = చేయఁబడిన, అధ్వరతన్ = జన్నముగలవారౌటచేత, తదగ్ని = ఆయగ్ని, మైన్ = దేహమందు, ఉనికిన్ = ఉండుటచేతను, దానన్ = దానియందు, ఒకంగము = ఒక్కయవయవమును, దాఁచుచేతనో = దాయుటచేతనో, పురధరణీసురులు, పుర = పట్టణమందలి, ధరణీసురులు = బ్రాహ్మణులు, నిగమభూధరములు = వేదపర్వతములు, జపయజ్ఞశీలురు = జపయజ్ఞపరులై, ఆ హరిధనదేశులైనన్ = ఆయింద్రకుబేరాదులు, వారిచ్చెదనన్నప్పటికివి, వారిధారకున్ = దానార్థమగునుదకధారకు, వలహస్తము = దక్షిణహస్తము, చాఁపరు = చాఁచెడువారుగారు.

తా.—బ్రాహ్మణులదక్షిణహస్తంబున నగ్నియుండుట నిగమసిద్ధంబుగావున నాయగ్ని దానోదకముచేతఁ జల్లారుననియు - లేక యెల్లరు సోమయాజులగుటచేఁదమయందగ్ని యుండునుగాన దానియొక యంగమును దాఁచవలయుననియు యాపట్టణమున వసించుచున్న బ్రాహ్మణులు దేవేంద్రాదులవంటి వారిదానోకమునైనను - గ్రహింపకయుండురనఁగాఁ బ్రతిగ్రహపరాఙ్ముఖులై వేదాధ్యయనజపయజ్ఞపరులగుచు - నొప్పుచుందురని తాత్పర్యము.

చ. ఉరువడిఁబోరికైకవచ◆మొల్లరుమంత్రములందుఁ దక్కను,
స్థిరనిజశక్తినైదుపది◆నేయరుదత్తినఁదక్కమంటికై,

పోరలరధీశుఁడీక మల♦బుద్ధిఖళూరికఁ దక్క వజ్రదోః,
పరిఘవశీకృతాన్యనర♦పాలకుప్పురి రాకుమారకుల్ ౨౫.

టీ. అప్పురిన్ — ఆనగరయందలి, వజ్రదోఃపరిఘవశీకృతాన్యనరపాలకులు, వజ్ర=వజ్రాయుధతుల్యమైన, దోః = భుజమందలి, పరిఘ = పరిఘయనునాయుధవిశేషముచేతను, వశీకృత = స్వాధీనులుగాఁజేయఁబడిన, అన్య = ఇతరులైన, నరపాలకులు= మనుజపతులుగల, రాకుమారకులు = రాచకొమరులు, మంత్రములందు = జపకాలంబుననుచ్చరించెడు మహామంత్రములయందు, తక్కన్ = వినాగా, ఉరువడిన్ = బలముగా, పోరికై = యుద్ధముఁజేయుటకై, కవచమొల్లరు = కవచముఁదొడుగరు, సుస్థిరభుజశక్తిన్, సుస్థిర = దృఢమగు, భుజశక్తిన్ = బాహుబలముచేతను, దత్తిఁదక్కన్= దానకాలమందుఁదక్క, ఐదుపదిసేయరు=రెండుచేతులుఁజోడింపరు, ఖళూరికఁదక్కన్= గరడీలయందువినాగా. ని. (ఖళూరీఖురళీసమెయనిగరడీపర్యాయము,) అమలబుద్ధిన్= సద్బుద్ధిగలవారుగాన, అధీశుఁడు = ఏలుచున్నప్రభువు. ఈక= ఇయ్యకయే, మంటికై= ఎఱ్ఱమంటికై, భూమికొఱకు, పోరలరు=పోట్లాడరు.

తా. మిగుల బలశాలులగు నప్పట్టణమందలి రాచకొమారులు కవచముదొడుగక యే యుద్ధముఁజేయుదురనియు మంత్రజపానుష్ఠానపరులుగాన నుపాసనాకాలమందే కవచాదులు పఠింతురనియు దృఢమైననిజశక్తిగలవారుగాన దానకాలమున నైదిచ్చుచోఁబదిగానిచ్చునట్టి దానశీలురనియు పరులకుబద్ధాంజలులైయుండరనియు సాముఁజేయుటయందతి సమర్థులనియు విమలమతులుగాన రాజుపిలుపించియిచ్చువఱకు భూములనపేక్షింపక యుందురనియును తాత్పర్యము. ౨౫:

శా. దంభాపేతవితీర్ణితోయలు ర♦థ్యందొట్టిహట్టస్థిత,
స్తంభంబుల్చిగురించుచున్నవి యన♦న్ధర్మైకనిత్యార్జన,
న్సంభూతంబగుపైఁడికోటికొకటై♦నానాఁటికిన్హెచ్చుచ,
య్యంభోదావళిఁగప్పు కేతువులపై♦శ్యశ్రేణిపొల్చున్పురిన్, ౨౬.

టీ. దంభాపేతవితీర్ణితోయములు, దంభ=దంభముచవలన, అపేత = విడువఁబడిన, వితీర్ణిన్ = దానసంబంధులగు,తోయములు = ఉదకములు, రథ్యందొట్టి = వీథులకెగదొట్టి, హట్ట = అంగళ్లయందు, స్థిత = ఉన్నట్టి. స్తంభంబులు = కంబములు, చిగురించుచున్నవి=సంజాతపల్లవములగుచున్నవి, అనన్ = అనునటుల, ధర్మైకనిత్యార్జనన్, ధర్మ=ధర్మముచేతనే, ఏక = ముఖ్యముగాను, నిత్య=ఎల్లప్పుడును, ఆర్జనన్ = సంపాదించుటచేత, సంభూతంబగుపైఁడి = లభ్యపడినట్టి ద్రవ్యముయొక్క, కోటికొకటై = కోటికొక్కపడగయైయనుట, నానాటికిన్ = దినదినమునకు, హెచ్చు

చున్ = వృద్ధిఁబొందుచును, ఆయ్యంభోదావళిన్ = ఆమేఘపఙ్క్తిని, కప్పన్ = కప్పుచున్నట్టి, కేతువులన్ = టెక్కెములచేతను, వైశ్యశ్రేణి = కోమట్లగుంపు, పురిన్ = పట్టణమందు, పొల్చున్ = ఒప్పును.

తా. ఆపట్టణమందుఁ దాము పారమార్థికముగ నిచ్చుదానజలంబులు వీథులయందుఁదొట్టియుండ దానిచేతనంగళ్లకంబములు చిగురించుచున్నవియనునటుల ధర్మమువదలకయార్జించినద్రవ్యము కోటికిఁబడగెత్తి నానాఁటికి హెచ్చుచుండ మేఘబృందములఁ గప్పునట్టి టెక్కెములచేతఁ గోమట్లగుంపులొప్పుచుండునని తాత్పర్యము. ౭౬.

తే-గీ. నృపులపదహల రేఖల♦కెల్లమాభు, జాగ్రహల రేఖలే మూల♦మనుచుఁగోటి,
కొండలుగధాన్యరాసులు♦పండవీట, సుజనభజనైక విఖ్యాతి♦శూద్రజాతి. ౭౭.

టీ. నృపులపదహలరేఖలకెల్లన్, నృపుల = భూపతులయొక్క, పద = పాదములయందలి, హలరేఖలకెల్లన్ = హలాకారరేఖలకెల్లను, మాభుజాగ్రహలరేఖలే = మాభుజములమీఁదనున్న తాగేళ్లరేఖలే. మూలమనుచున్ = మొదలనుచు, కోటికొండలుగన్ = కొండలుకోట్లుగాను, ధాన్యరాసులు, పండన్ = ఫలింపఁగా, (పండించుకొనుచుననుట) వీటన్ = పట్టణమునందు, సుజన = సత్పురుషులయొక్క, భజన = సేవ, ఏక = ముఖ్యమైన, విఖ్యాతి = కీర్తిగాఁగల, శూద్రజాతి = శూద్రకులము, పొలుచున్ = ఒప్పును, ఈపొలుచునను పదము పూర్వపద్యమునుండి యధ్యాహార్యము.

తా.—ఆపురముననున్న కాపులు తాము నాగేలుపట్టిదున్నుటచేతఁగదా రాచతికమనుచు దున్ని కొండలుకోట్లుగ నానావిధధాన్యములఁ బండించికొని సత్పురుషులకు సేవఁజేయుచు సుఖంబుననుండుదురని తాత్పర్యము.

చ. ఉమియఁగదన్ననవ్వనన♦నొచ్చెముగాంచినకొన్నిమ్రాఁకులా,
ప్రమదలనప్పగింపుమని♦రంజితుసేఁతలుగన్నచెట్లకుం,
దమకళిశృంఖలన్పెనచి♦నమ్మకచుట్టెఁబురంబుఁగంతుసై,
న్యముఁగొనినావెలిన్ శుకపి♦కాదులఁగేళివనాళిపొల్పగున్. ౭౮.

టీ. పుష్పింపఁజేసెడి పదిక్రియలు దోహదమనంబడును - అందు-ఉమియఁగన్ = ఉమియఁగాను, తన్నన్ = తన్నఁగాను, నవ్వన్ = నవ్వఁగాను, అనన్ = పల్కరింపఁగాను, ఒచ్చెముఁగాంచిన = అవమానముఁబొందిన, కొన్నిమ్రాఁకులు = కొన్నివృక్షములు, ఆప్రమదలన్ = ఆయవమానపఱిచిన స్త్రీలను, ఒప్పగింపుమని = తమకునొప్పింపుమని, రంజిలుసేఁతలుగన్నచెట్లకున్ = తగనచేష్టలుగల వృక్షములకు, (తక్కిన దోహదములుగల మ్రాఁకులకుననుట) తమకున్ = తమకును, అళిశృంఖలన్ = తుమ్మెదలను సంకిలిని, పెనచి = తగిలించి, నమ్మక = అప్పటికిని నమ్మకముచాలక, కంతుసైన్యము =

మన్మథబలము, కొని = తీసికొనివచ్చి, పట్టణంబు = పురమును. చుట్టెఁ = ముట్టడి వేసెను, నాఁ = నట్లుగా, వెలిఁ = వెలపటను, శుకపికాదులఁ = చిలుకలు-కోయిలలు, మొదలగుపక్షిజాతులచేతను, కేళివనాళి = శృంగారవనములపఙ్క్తి, పొల్పుగఁ = సుందరమగును॥ శ్లో॥ (తరుగుల్మలతాదీనామకాలే కుశలైః కృతమ్ । పుష్పాద్యుత్పాదకం ద్రవ్యం దోహదం స్యాత్తు తత్క్రియా । ఆలింగనాత్కురవకస్తిలకో వీక్షణేన చ । కరస్పర్శనమాకందో ముఖరాగేణ చంపకః । సల్లాపతః కర్ణికారస్సిందువారో ముఖానిలాత్ । గీతాత్ప్రియాళుర్నిత రాం నమేరుర్హాసితేన చ) అని దోహదశాస్త్రమందున్నది.

తా.—దశదోహదములుగలవృక్షములను - తమమైదలుచుట్టుకొని తిరుగుటవలన సంకెళ్లుగాఁ గాఁదొలఁగ నీయక మన్మథబలముఁ గూర్చికొనివచ్చియుమి సుంట మొదలగు వవమానంబులు చేసినస్త్రీలనుదమకుఁ బట్టియిమ్మని యవమానపడిన చెట్లుతక్కిన చెట్లను ముట్టడివేసెనోయనునటులఁ జిలుకలు కోయిలలుతోటులుకొని శృంగారపు తోటలుపురమునుకొని సుందరముగనుండునని తాత్పర్యము.

సీ. మదగంధతారతమ్యము యామ్యకరికిఁద, త్పురులపంగనబలెఁ గటములొత్తసి,
సురతశ్రమజమాటఁ జూపోపకయుబలెఁ, గామినీమృదుగండ ఘర్మముడిపి,
పరిమళవాహెచ్చఁ బ్రాణమీబలెఁ జించు, మృగనాభిచర్మభస్త్రికలుమాటి,
హితసపన్నగభేదులనిబలెగృహవిటంకపుఁ గలాపులనొయ్యఁ గఱులునిమిరి,
వీటిసామగ్రిఁ గనుఁగొన వేగపడక, నడవఁదనదిక్కుపుష్పదంతద్విపంబు,
సెక్కనోయనజడగతి నెపుమఁబోలయు, నందుఁజందనశిఖరిమందానిలుండు. ౭౯.

టీ. మద = మదముయొక్క, గంధ = వాసనయొక్క, తారతమ్యము = ఎక్కువతక్కువ, యామ్య = యమదిక్సంబంధియైన, కరికిఁ = వామనమనుగజమునకు, తత్పురులకు = ఆపట్టణపుటేనుఁగులకును, కనబలెఁ = చూచుటకొఱకుబలె, కటము లు = గండస్థలములను, ఒఱసి = రాచికొని, సురత = రతియందలి, శ్రమ = బడలికచేతను, జ = పుట్టినది, ఊటఁ = ఐనందునవలన, చూపోపకయుబలెఁ = చూడలేకవలె, కామినీ = స్త్రీలయొక్క, మృదు = లేతలైన, గండ = చెక్కిళ్ళయందలి, ఘర్మ = చెమటను, ఉడిపి = పోఁగొట్టి, పరిమళ = సుగంధమును, వాహ = వహించెడి, ఇచ్చఁ = కాంక్షచేతను, ప్రాణమీబలె = ప్రాణమిచ్చుటకొఱకుబలె, చించు = చినిగినట్టి, మృగ = కురంగములయొక్క, నాభి = బొడ్డుయొక్క, చర్మభస్త్రికలు = చర్మపుఁదిత్తులను, దూఱి = ప్రవేశించి, అహిత = తనకుశత్రువులైన, పన్నగ = పాములను, భేదులనిబలె = భేదించెడునవియన్నట్టువలె, గృహ = గృహములందలి, విటంక = కొణిగలమీఁదనున్న, కలాపుల = నెమళ్ళను, ఒయ్యఁ = తిన్నఁగాను, గఱులు =

చెక్కులను, నిమిరి = తోడని, వీటి = పురముయొక్క, సామగ్రి = పరిపూర్ణతను, కనుంగొనక = చూచుటకొఱకు, వేగపడక = త్వరపడక, నడవక = సంచరింప తనదిక్కు = వాయవ్యపుదిక్కునను న్న, పుష్పదంతద్విపంబు = పుష్పదంతమను నేనుంగును. ఎక్కనోయనక = ఆరోహణముం జేసెనోయనునటుల, జడగతిక = మందగమనముచేతను, ఎప్పుడుక = నిత్యమును, చందనశిఖరి = చందనపర్వతమందలి, మందానిలుండు = తిన్ననిగాలి, అందుక = ఆపురమునందు, పొలయుక=విసరును.

తా.—యమునిదిక్కునందలి యేనుంగునకుంబురగజంబులకును మదగంధ తారతమ్యముంజూతమనునటులయేన్గులుంగుల గండస్థలములనొఱసి యందున్న పరిమళంబులంగ్రహించి రతిశ్రమవలనంబుట్టిన చెమటనార్చునట్లుస్త్రీలచెక్కుల్పు ప్రసరించితద్గంధముల సంగ్రహించికొనిచించిన బొడ్డుగలిగిపడియున్న కస్తూరీమృగములకుంబాణములంగల్పించు దానివలెవానిబొడ్డుచర్మపుందిత్తులలోం జొచ్చియీసుగంధమును దీసికొనిగృహముల యందున్న నెమళ్లుదమకు శత్రువులగు పాములనక్షింమనవియని యాపూతచేతదువ్వెనో యనునటులవాని చెక్కల నిమిరిపట్టణపు సకలసమృద్ధిం జూడనిచ్ఛగలదై వేగిరపడక మెల్లంగాందనదిక్కునను న్న పుష్పదంతమను గజము నెక్కి సంచరించుచున్నదోయనునటుల నాపట్టణమందుమంద మారుతముగమ్మునవాసించుచు విసరుచుండునని తాత్పర్యము.

—* రాజవర్ణనము *—

సీ. ద్వివ్వయోపాయధీ♦విద్వద్వతంసంబు, షాడ్గుణ్యచాతురీ♦చక్రవర్తి,
క్రీడాచలీకృత♦శ్రీఖండగిరిరాజు, కనకాద్రిముద్రణ♦గ్రంథకర్త,
యందూనిబద్ధాబ్ద♦బృందవేదండాళి, వననిధిస్తంభిసా♦ఘనికరఘువు,
తామ్రపర్ణ్యమలపా♦థఃకేళిహంసంబు, లంకేశమైత్రీప్రి♦యంకరుండు,
స్వస్తికృద్వాస్తవస్తుత్య♦గస్తిముఖుఁడు, మకుటమోటనశతకోటి♦మంత్రభృత్య,
భూతభూతాత్తశాంభవీ♦భూమిరుండు, వత్సరంబేలుఁబాండ్యమ♦త్స్యధ్వజుండు.

టీ. ద్వివ్వయ = నాలుగైన, ఉపాయ = సామ - దాన - భేద - దండములని యెడి యుపాయములయొక్క॥ని॥ (సామదానభేదదండావిత్యుపాయ చతుష్టయమని) యమరుండు ధీ = బుద్ధియందు, విద్వద్వతంసంబు = పండితశ్రేష్ఠుఁడు, షాడ్గుణ్య = సంధి - విగ్రహ - యాన - ఆసన - ద్వైధీభావ - సమాశ్రయములనియెడి షడ్గుణముల యొక్క, చాతుర్య = నిపుణతయందు, చక్రవర్తి = సార్వభౌముఁడు ॥ ని ॥ ((సంధిర్నావిగ్రహోయానమాసనంద్వైధమాశ్రయః షడ్గుణాః అని) యమరుఁడు॥ వ్యా ॥ షడ్గుణాఏవ షాడ్గుణ్యమని) చాతుర్వర్ణ్యం - త్రైలోక్యమన్నట్లుం స్వార్థమందు ష్యఞ్ప్రత్యయము ॥ క్రీడాచలీకృత = విలాసార్థమైన పర్వతముంగాఁ జేయఁబడిన, శ్రీఖండగిరిరాజు =మలయపర్వతముగలవాఁడు, కనకాద్రి = మేరుపర్వతమును, ముద్రణ = ముద్రించుట

యందు, గ్రంథకర్త = తనగెలుపు లిఖించినవాఁడు ॥ శ్లో॥ (శ్రీపీఠాంధ్రశ మాక్రమ్యపాండ్యః పరమధార్మికః। ప్రాప్య మేరుగిరింతస్మిన్ లిలేఖవిజయాన్ స్వకాన్) అనిహాలాస్యమందునతని గెలుపులు మేరుపర్వతమున వ్రాసిన కథవర్ణింపఁబడియున్నది, అందూ = శృంఖలలచేతను, నిబద్ధ = బంధింపఁబడిన, అబ్దబృంద = మేఘసమూహమువంటి, వేదండాళి = గజసమాజముగలవాఁడును, వనధి = సముద్రముయొక్క, స్తంభన = కట్టుటయందు, ఆధునికరఘువు = నూతనరాఘవుఁడు (అధునాభవః ఆధునికః,)అని కాలవాచకమునీఁదఠక్ ప్రత్యయము - (ఏతర్హిసంప్రతీదానీ మధునాయనియమరుఁడు ) తామ్రపర్ణి = తామ్రపర్ణియనునదియొక్క, అమల = నిర్మలమగు, పాథః = ఉదకమందలి. కేళి = క్రీడించుటకు, హంసంబు = హంసప్రాయుఁడు, లంకేశ = విభీషణునితో, మైత్రీ = చెలిమియందు, ప్రియంకరుఁడు = ఇష్టముఁజేయువాఁడు. స్వస్తికృత్ = ఆశీర్వదించెడి, వాస్తవ = సత్యమైన, స్తుతి = స్తోత్రముగల, అగస్తి = అగస్త్యుఁడుగలవాఁడును, ( వస్తునఇయంవాస్తవీ - వాస్తవీస్తుతిర్యస్య వాస్తవస్తుతిః అని వ్యుత్పత్తి ) (అగస్త్యశబ్దమున గస్తిశబ్దమునుంగలదు) మఘవ = దేవేంద్రునియొక్క, మకుట = కిరీటమును, మోటన=మొట్టునట్టి, శతకోటి = నూఱుకోట్లు లెక్కగల, మంత్ర = మంత్రశక్తిచేతను, భృత్యభూత=కింకరులయిన, భూత=భూతములుగలిగి, ఆత్త=పొందఁబడిన, శాంభవీ = రుద్రసంబంధయగు, భూమికుండు = వేషాంతరముగలవాఁడునునైన, పాండ్యమత్స్యధ్వజుండు = మత్స్యధ్వజుఁడను పాండ్యదేశపురాజు, తత్పురంబు = ఆమధురాపట్టణమును, ఏలున్ = పరిపాలించును.

తా.—పాండ్యదేశమునేలెడి మత్స్యధ్వజుఁడను రాజు మేరుపర్వతమందుఁ దనగెలుపుకథలను వ్రాసినవాఁడై వాసవుని నెత్తి మొట్టినవాఁడై-నూఱుకోట్ల సంఖ్యలుగలిగియున్న భూతములను మంత్రశక్తిచే వశపఱచుకొనుటవలన నవితన్ను సేవింపుచుండ రెండవరుద్రునిఁబలెనుండువాఁడై - సామాద్యుపాయములయందును - సంధివిగ్రహాది షాడ్గుణ్యవిచారణయందును నకుశలుఁడై - విలాసకాలంబులయందు మలయపర్వతముననే విహరించుచు నసంఖ్యాతంబులగు నేనుంగులుగలవాఁడై. సముద్రబంధనముఁజేసినవాఁడై = శుద్ధోదకములుగల తామ్రపర్ణియందుఁ గ్రీడించువాఁడై - విభీషణునితోఁజెలిమిఁజేసి యతనికిష్టములఁదీర్చువాఁడై- నిత్యమగస్త్యాశీర్వాదముఁ బొందుచు నాపట్టణమును బాలించుచుండునని తాత్పర్యము.

ఉ॥ ఇందుకులావతంసమతఁ డేతఱి నేతరిగాఁడరింబ్రజ,<br>
ల్కుందఁగఁగొనండొరుంబొరుత లన్వినుపించనమాట డెందమున్,<br>
జెన్నముదంబువక్క చెడఁ జేయఁడొరున్వినతాస్యుఁడౌనుతిం,<br>
పందనుఁబందనుంగొలఁతి వల్కఁడుశూరతఁదానమిచ్చియున్. ౩౧.

టీ. ఇందుకులావతంసము = చంద్రవంశభూషణుండగు, అతఁడు = ఆమత్స్యధ్వజుఁడను రాజు. ఏతఱిన్ = ఎప్పటికిని, ఏతఱిగాఁడు = నీతితప్పువాఁడుగాఁడు, అఱిన్ = పన్నును, ప్రజలు = మనుష్యులు, కంవన్ = నలుగువట్టుగ, కొనండు = గ్రహింపఁడు, ఒరయండు = పరుఁడు, ఒరుతలన్ = మరియొకనిమీఁదను. వినుపించిన = విన్నవించిన, మాట = కొండెపుమాట, డెందమున్ = హృదయమును చెందన్ = పొందఁగా, ముదంబుఁదక్కి = సంతసమువిడిచి, ఒరున్ = పరుని, చెడఁజేయఁడు = చెఱుపఁడు, తనున్ = తన్ను, నుతింపన్ = ప్రజలుస్తోత్రముఁజేయఁగా, వినతాస్యుఁడౌన్ = ముఖమువంచువాఁడౌను, (అనఁగా నీరాజుధీరోదాత్తనాయకుఁడుగనుక॥ శ్లో॥ (శౌర్యశ్రీప్రవణప్రశంసిషు నమద్ భూర్లజ్జతే వందిషు) అని ప్రతాపరుద్రీయమందలి ధీరోదాత్తోదాహరణమును॥ శ్లో ॥ (మహతాం కుంజరాణాంచ పురఃస్తోత్రం నహిప్రియమని) మత్స్యభావకథనమునుండు రీతిగా నాత్మప్రశంసయందు నిష్టములేనివాఁడనుట. శూరతదానమిచ్చియున్, శూరతన్ = శౌర్యముచేత, దానమిచ్చియున్ = దానమొసఁగియును, పందన్ = సోమరియగువానిని, కొఱతపల్కఁడు = తక్కువమాటసెప్పఁడు.

తా.—ఆపురమునేలెడి మత్స్యధ్వజుఁడను రాజు ప్రజలనొప్పించి పన్నుదీయక కొండెపు మాటలు విని జనులబాధపెట్టక - తన్ను ప్రజలు స్తోత్రముఁ జేసినను బ్బక - పరాక్రమముచేత గర్వపడి పందలఁ దక్కువమాటలాడక చంద్రవంశమునకుభూషణప్రాయుఁడై సుగుణములచే నొప్పుచు నెప్పటికిని నీతితప్పక యుండెనని తాత్పర్యము.

సీ. పాటీరగిరివన◆వాటిఁ గ్రీడించియు, నహిభయం బెఱుఁగఁడా◆వంతయైన,
నత్యంతమితభాష◆నవికత్థనుండయ్యుఁ, బరులఁ గేరడమున◆భంగపఱుచు,
ప్రీతిఁదాఁ దామ్రప◆ర్ణికినాథుఁడయ్యును, సద్గోష్ఠి వేనవం◆జనత మెలఁగు,
మహనీయమహిమఁదా◆మసగాస్పదుండగుచు, లావణ్యకలనను◆ల్లాసమొందు,
విషధిలహరిభిదోత్ప్లుత◆త్సృపతజటిల, వలదురుక్రమతిమినర◆వాలపతన,
తులితపరబలకరిశిర◆స్థ్సలసముత్థ, బహుళముక్తావిముక్తాసి◆పాతుఁడతఁడు. ౩౨.

టీ. పాటీరగిరి = మలయపర్వతమందలి, వనవాటిన్ = వనవీథిని, క్రీడించియున్ = క్రీడసల్పుచును, ఆవంతయైనన్ = ఆవగింజంతయైన, అహిభయంబు = సర్పభయంబును, ఎఱుఁగడు (శ్రీచందనాదులయందు సర్పములున్నను తద్భయం బెట్లెఱుంగఁడని విరోధముగలుగఁగనిత్యము క్రీడాపరుఁడైయున్నను స్వపక్షభయం బెఱుంగఁడని పరిహారము ॥ ని ॥ (మహీభుజామహిభయంస్వపక్షప్రభవంభయమని) యమరుఁడు, అత్యంత = మిక్కిలియు, మితభాషన్ = అల్పభాషచేత, అవికత్థనుండయ్యున్ = ప్రల్లదములాడనివాఁడయ్యును, కేరడమునన్ = పరిహాసముచేత, పరులన్ = అన్యులను, భంగప

ఉచమున్ = అవమానపఱచుటను (అల్పభాషికిఁ గేరడమేమని విరోధముగల్గఁగ - కేరడ దేశమునందలి శత్రువులభంగపఱచుటని పరిహారము కేరడమనుచోట శడలక భేదము - (విపదయానంతరో రాజా శత్రువనురీతినిఁ గేరళ దేశపురాజి తనికి శత్రువు) ప్రీతిన్ = ప్రేమచేతను, తామ్రపర్ణికిన్ = తామ్రపర్ణియను నాఁడ యేనుంగునకు, నాథుఁడయ్యును = ప్రభువయ్యును, సద్గోష్ఠిచేన్ = సత్సహవాసము చేత, అనంజనతన్ = (అంజనోనభవతీత్యనంజనః - తస్యభావః - అనంజన తా) అనువ్యుత్పత్తిచేతను అంజనమను దిగ్గజముగాక, మెలఁగున్ (తామ్రపర్ణియను పేరుగల దిక్కరిణికిఁ బెనిమిటియై యుండియు - అంజనమను దిగ్గజమెట్లుగాకపోయెనని విరోధముజనింపఁగా - తామ్రపర్ణియను పేరఁ బాండ్యదేశమందుఁ బ్రసిద్ధినొందిననదికిఁ ప్రభువై సద్గోష్ఠిచేత, అపగతం అంజనం పాపం యస్యసః - తస్యభావః, అనంజనతయను వ్యుత్పత్తిచేత - పాపరహితుఁడుగానుండెనని పరిహారము) మహనీయ = ఒప్పుచున్నట్టి, మహిమన్ = సామర్థ్యముచేతను, తాన్ = తాను, మధురాస్పదుండయ్యును = తియ్యఁదనమునకు స్థానముగానుండియును, లావణ్యకలనన్ = లవణభావసంగతిచేతను, ఉల్లాసమొందును. (మధురాస్పదుఁడైనవాఁడు లవణభావసంగతిచేత నెట్లుల్లాసమొందునని విరోధముపుట్టఁగా మధురాపట్టణమందుండి అవయవకాంతి విశేషప్రాప్తిచేతనుల్లాసమొందునని పరిహారము) శ్లో॥ (ముక్తాఫలేషుతారళ్యంమనోజ్ఞందృశ్యతేయ గా। తద్వద్గాత్రేషులోకానాంలావణ్యందృశ్యతేబుధైః) అనిలావణ్యలక్షణము - పెద్దగీట్లనాలుగింటనువిరోధాభాసాలంకారము. శ్లో॥ (ఆభాసత్వేవిరోధస్యవిరోధాభాస ఇష్యతేయని) దానిలక్షణము॥ విపధి=సముద్రముయొక్క, లహరి = ప్రవాహముయొక్క, భిదా = భేదించుటచేత, ఉత్పతత్ = ఎగురుచున్న, పృషత = బిందువులయందు, జటిల = ముప్పిరిగా, వలత్ = చుట్టుకొనియున్నట్టియు, ఉరు = విస్తారమగు, క్రమ = సంచారముగల, తిమి = పెద్దచేపయొక్క, వర = శ్రేష్ఠమైన, వాల = తోఁకయొక్క, పతన= పతనముతోడను, తులిత=తుల్యమైన, పరబల = శత్రుబలములయందలి, కరి= ఏనుఁగులయొక్క, శిరస్థల =కుంభస్థలములవలన, సముత్థ = ఎగిరినట్టి, ముక్తా = ముత్యములయందు, అవిముక్త= విడువఁబడని, అసి=ఖడ్గముయొక్క, పాతుఁడు = పతనముగలవాఁడు,అతఁడు = ఆమత్స్యధ్వజుఁడనురాజు.

తా. — పరబలము సముద్రమువలెనే నుంగులకుంభస్థలములు గఱుల్లవలెముత్యములుజలబిందువులవలె ఖడ్గము తిమివాలమువలెనుండెనని యంతటనుపమాలంకారము.

శా. దానత్యాగపరత్రమైతోలుపత్రంబంబుధారన్నదా,
నానందభ్రితకీర్తి నాంసివమమింటంగౌత్తనాసేలనా,

నానీరార్ద్రపతత్రయుగ్మవడిమిం◆టంబాఱుతజ్జాతికే,
లానిల్పున్గతియన్యపక్షిగతిఁబ◆త్త్రైకప్రదేశాప్లుతిన్. ౩౩.

టీక. దానత్యాగపతత్రమై = దానమననుదక ధారాపూర్వకముగ నిచ్చునది - త్యాగమనఁగా నుదకస్పర్శలేకయిచ్చునది, పతత్త్రమై = దానత్యాగములు రెండును రెండు ఱెక్కలు గాఁగలదై, తత్ = ఆరాజుయొక్క, సిత = తెల్లనైన, కీర్తి = యశమనియెడి, హంసి = ఆఁడయంచ, తొలుపతత్రంబు = మొదటిఱెక్క, (పత త్రంచతనూరుహామనియమరుఁడు) అంబుధారన్ = ఉదకధారచేత, సదా = ఎల్లప్పుడు, నానన్ = నానఁగా, మింటన్ = ఆకసమందు, చనున్ = పోవును, క్రొత్తనా నేల = ఇదిక్రొత్తయనవేటికి, నానానీరార్ద్రపతత్రయుగ్మ్యన్, నానా = సకలమయిన, నీర = ఉదకములచేతను, ఆర్ద్ర = తడుపఁబడిన, పతత్రయుగ్మ్యన్ = ఱెక్కలుగలదైనను, వడిన్ = వేగముచేతను, మింటన్ = ఆకాశమందు, పాఱు = తిరుగుస్వభావముగల, తజ్జాతికిన్ = ఆహంసజాతికి, అన్యపక్షిగతిన్ = ఇతరపక్షివలె, పత్త్రైకప్రదేశాప్లుతిన్, పత్త్ర = ఱెక్కలయొక్క, ఏకప్రదేశ = ఒకప్రక్క, ఆప్లుతిన్ = తడియుటచేతను, గతి = గమనము, ఏలా = ఏమిటికి, నిల్చున్ = విరమించును.

తా.— అనఁగా రెండుఱెక్కలు దడిసినను హంసగమనమునకు విరోధమనియుండ దితరజాతిపక్షులయిన యెడనార్ద్రములగు ఱెక్కలతో నెగసిపోవంజాలవనియు నారాజు యొక్క కీర్తిదానత్యాగములను ఱెక్కలు గలహంసీస్వరూపమై - తడిసిన మొదటిఱెక్క తోనే యాకాశమునందును వ్యాపించి సంచరించుచున్నదనియును తాత్పర్యము.

సీ. శుకకదంబము గొలు◆సులచేత బద్ధమై, వారాంగనాగార◆కారఁబడఁగ,
గిరికానికాయంబు◆లరిశూన్యబహుపుర, హర్మ్యవాటికలఁ జెం◆డాడుచుండ,
క్రందుగానితరేత◆రంబు రాయిడిసేయు, రాజులుదనసూపు◆రముననొదుగ,
నెగడునవావృష్టి◆నిజబలేభస్పర్ధి, సమదాన్యకరటిగం◆డములఁజేర,
దానవేళలనతివృష్టి◆తనదుహస్త, గతముగాఁగఁ బ్రతాపాగ్ని◆గ్రాఁగిపోవు,
కంటకులయందుశలభత◆గలయనడఁగ, నేలు నాపాండ్యుఁడు మహిని◆రీతిగాఁగ. ౩౪.

టీక శుకకదంబము = చిలుకలగుంపు, గొలుసులచేతన్ = శృంఖలలచేతను, బద్ధమై = కట్టఁబడినదై, వారాంగనా = వేశ్యస్త్రీలయొక్క, అగార = గృహములని యెడు, కారన్ = చెరసాలయందు, పడఁగన్ = ప్రవేశింపఁగా, గిరికానికాయంబు = చిట్టెలుకలగుంపు, అరి = శత్రురాజుపఱగిడినందున, శూన్య = పాడుపడియున్న, బహుపుర = అనేకపట్టణములయందలి, హర్మ్యవాటికలన్ = మేడలవరుసలయందు, చెండాడుచుండ = గంతులువేయుచుండఁగా, క్రందుగాన్ = సందడిగా, ఇతరేతరం

బు = తమలోఁదాము, కాయిడి = జగడము, చేయు=ఒనరించుమనట్టి, రాజులు = పుడమిఱేండ్లు, తన = తనయొక్క, నూపురమునన్ = పాదకటకమందే, ఒదుగన్ = అణఁగియుండఁగ, పాదాక్రాంతులైతనుఁగొలుచు చుండఁగాననుట, నెగడు= మిక్కుటమైన, అనావృష్టి = వర్షము లేకపోవుట, నిజ=స్వకీయమైన, బల = సేనలయందలి, ఇభ = ఏనుంగులతోఁడను, స్పర్థి = కలహించిన, సమద = మదముతోఁగూడిన, అన్యకరటి = ఇతరగజములయొక్క, గండములన్ = చెక్కిళ్లయందు, చేరన్= ప్రవేశింపఁగా, అతివృష్టి = అతివర్షము, దానవేళలన్ =దానముఁజేయుసమయములను, తనదు = తనయొక్క, హస్తగతముగాఁగ = హస్తము బ్రివేశింప, శలభత = శలభదోషము. ప్రతాపాగ్నిన్, ప్రతాప = తనప్రతాపమనియెడి, అగ్నిన్ = అగ్గియందు, క్రాఁగిపోవు = మాడిపోవుచున్న, కంటకులయందున్ = క్షుద్రశత్రువులయందు, కలయన్ = కలియునటుల, అడఁగన్ = అణఁగిపోఁగా, ఆపాండ్యుఁడు = ఆపాండ్యరాజు, మహిన్ = భూమిని, నిరీతిఁగాఁగన్ = ఈతిపట్కరహితముఁగా, ఏలున్ = పాలించును.

తా. — శ్లో॥ అతివృష్టిరనావృష్టిర్మూషకాశ్శలభాశ్శుకాః । అత్యాసన్నాశ్చరాజానష్షడేతా ఈతయస్స్మృతాః॥ అనునట్టిషడ్బాధలనుస్వరాష్ట్రమున లేకుండునట్లు- నిత రక్షలములనిల్పియాపాండ్యభూపతి రాజ్యపరిపాలనముఁజేసెనని తాత్పర్యము.

వ. అమ్మహీవల్లభుండివ్విధంబున సామ్రాజ్యవైభవంబులనుభవించుచుండఁ గొంతకాలంబున. ౩౫

టీక. అమ్మహీవల్లభుండు = ఆభూపాలుఁడు, ఇవ్విధంబునన్ = ఈరీతిని, సామ్రాజ్యవైభవంబులు = సామ్రాజ్యసుఖంబులను, అనుభవించుచుండన్, కొంతకాలంబున = కొన్నిదినంబులకు.

తా. — సుగమము.

—* గ్రీష్మర్తువర్ణనము. *—

తే గీ. పాటలవసుంధరారుహ♦భాగధేయ, మాతతమరీచికాంబువ♦ర్షాగమంబు,
ధరణిఁబొడసూపెనంతని♦దాఘసమయ,ముదుటుతోఁ శాల్మలీఫల♦విదళనంబు. ౩౬.

టీక. అంతన్ = అంతలోను, పాటలవసుంధరారుహభాగధేయము, పాటలవసుంధరారుహ = పాదిరిచెట్లకు, భాగధేయము = భాగ్యరూపమైనట్టియు, ఆతతమరీచికాంబువర్షాగమంబు, ఆతత = విస్తారమగు, మరీచికా = ఎండమావులనియెడి ॥ ని ॥ (మృగతృష్ణామరీచికాయని) యమరుఁడు, అంబు = ఉదకమునకు, వర్షాగమంబు = వర్షాకాలమైనట్టియు, శాల్మలీఫలవిదళనంబు, శాల్మలీ = బూరుగచెట్ల

యొక్క ఫల = ఫలములను, విదళనంబు = పగులఁగొట్టునట్టి, నిదాఘసమయము = గ్రీష్మర్తువు, ఉదుటుతోన్ = ఉద్ధతితోడను, ధరణిన్ = భూమియందు, పొడసూపెన్ = కనఁబడెను.

తా. పాదిరిచెట్లను బుష్పింపఁజేయుచు నెండమావులఁ గలుగఁజేయుచును బూరుగకాయలఁ బగలగొట్టునట్టి గ్రీష్మర్తువుద్ధతిచేత భూమియందుఁ గనుపించెనని తా.

సీ. నిర్ఝరప్రబలవే◆ణికలింకఁజట్రాలఁ, జేరినప్రాఁచిపె◆న్బీటలెగయ,
నెఱుకులుపడియనీ◆రిపురఁగువ్వలఁబట్ట, బోయునీరాడాడ◆బొలము నెఱసె,
సురగాలిదవదగ్ధ◆తరుపర్ణతతి రేఁపఁ, బావురాలని డేఁగ◆పదుపు మూఁగె,
నిద్రితద్రుచ్ఛాయ◆నిలువక జరుగ వెం, బడిగనధ్వగపఙ్క్తి◆పొడలు వెట్టె,
క్షేత్రపాలుఁ డుదికిన◆చీరలాఱు, చాకిరేవులగములయ్యె◆సకలదిశలు,
దెలుపుగాఁ దోఁచె నెండమా◆వులబయళ్లు, గండెవివియెండవనదిఙ్ము◆ఖములు రాఁజె.

టీ. నిర్ఝరప్రబలవేణికలు, నిర్ఝర = సెలయేళ్లయొక్క, ప్రబల = విస్తారమైన, వేణికలు = ప్రవాహములు, ఇంకన్ = ఇనికిపోఁగా, చట్రాలన్ = చట్టుబాల యందు, చేరిన = పేముకొన్నట్టి, ప్రాఁచి, పెన్బీటలెగయన్ = పెద్దబీటికలెగయుఁగా, ఎఱుకులు = ఎఱుకువాండ్రు, పడియ = పసియలయందలి, నీరు = ఉదకము, ఇవురన్ = ఇగిరిపోఁగా, గువ్వలఁబట్టన్ = పిట్టలఁబట్టుటకు, పోయు = పోయుచున్న, నీరు = ఉదకము, ఆడాడన్ = అక్కడక్కడ, పొలమునన్ = భూమియందు, నెఱసెన్ = వ్యాపించెను, సురగాలి = సుడిగాడ్పు, దవదగ్ధతరుపర్ణతతిన్, దవ = కారుచిచ్చుచేతను, దగ్ధ = కాలినట్టి, తరు = వ్రూఁకులయొక్క, పర్ణతతిన్ = ఆకులగుంపులను, రేఁపన్ = ఎగరఁగొట్టఁగా, పావురాలని = కపోతములనుకొని, డేఁగపదుపు = శ్యేనసమూహము, మూఁగెన్ = అడ్డముగమూఁగెను, నిద్రిత = తామునిదురఁబోయిన, ద్రు = వృక్షములయొక్క, ఛాయ = నీడ, నిలువక = నిలిచియుండక, జరుగన్ = ఆవలఁబోఁగా, వెంబడిగన్ = వెంటనే, అధ్వగ = పాంథులయొక్క, పఙ్క్తి = సమూహము, పొడలువెట్టెన్ = పొర్లుదండములు వెట్టెను, సకలదిశలు = అన్నిదిక్కులును, క్షేత్రపాలునకు = భైరవునకు (త్వం భైరవ సమాగమ్య పుణ్యక్షేత్రాణి పాలయ, క్షేత్రపాల ఇతి శ్రీమన్ త్రిషులోకేషు విశ్రుతయని స్కాందమనను న్నదిగనుక క్షేత్రపాలుఁడనఁగా భైరవుఁడు) ఉదికిన = ధౌతముఁజేసిన, చీరలు = వస్త్రములు, ఆఱు = ఆఱఁగట్టినట్టి, చాకిరేవులగములయ్యె = చాకిరేవులాయెను. ఎండమావులన్ = ఎండమావులచేతను, బయళ్లు = బహిఃప్రదేశములు, తెలుపుగఁదోఁచెన్ = తెలుపులైతోఁచెను, ఎండన్ = ఎండచేతను, ఇవి = ఈదిఙ్ముఖములు, కందెన్ = వాడెను, అనన్ = అనగా, దిఙ్ముఖములు = దిక్కులమొగములు. రాఁజెన్ = ధూమితములయ్యెను.

తా. గ్రీష్మర్తుప్రవేశింపఁగానే సెలయేటులప్రవాహములింకెనుగానఁ జక్రాతియందుఁజేరియున్న ప్రాఁచిపెన్నీటలెగసెను. ఎఱుకువాండ్రుంబిట్టలఁబట్టుటకుఁబోవగాఁ బడిమలయందు నీరినికియున్నందున వారిచేతఁబోయంబడిన యుదకము పొలములయందు గనుపించును సుడిగాడ్పు లెండుటాకులెగరునటులవీఁచుచుండ డేగలుచూచి యవిపావురములని యెదురుమాఱుచుండును ద్రోవనడుచువారు వేఁడిమిచేత వృక్షములక్రిందఁ బరుండి నిద్రించుచుండ నావృక్షములనీడప్రొద్దుతోఁగూడ జరుగునపుడు వెంటనేపార్లాడుదురు నలుదిక్కులనెండమావులువ్యాపించియుండనవి భైరవుఁడు దిగంబరుఁడుగనుక నతనికుదికి యూరవేయించినచీరలో యనునటులఁ దెల్లనైయుండునని తాత్పర్యము.

చ॥ సరియగు నిట్టివెట్టలను సర్వమునం చటమీఁదిసృష్టికై,
శరధిప దిఙ్మరుజ్జ్వలిత చండతరాతప వహ్ని నారఁగాఁ,
గరువులజుండు వీనిపయిఁ గట్టెననన్గనుపట్టె వెచ్చల,
న్గరి కిరికాసరాంగములఁ గప్పిన బొంపులు నంటి యారగన్. ౩౭.

టీ. వెచ్చలన్ = ఉడుకులచేతను, కరికిరికాసరాంగములన్, కరి = ఏనుఁగులయొక్క, కిరి = వరాహములయొక్కయు, కాసర = ఎనుబోతులయొక్క (ని. వాహద్విషత్కాసరసైరిభాయనియమరము,) అంగములన్ = దేహములను, కప్పినబొంపులు= అచ్ఛాదించినపంకంబులు, అంటి — పేరుకొని, ఆరఁగన్ = ఎండఁగా, ఇట్టివెట్టలను= ఇట్టివేసవియందు, సర్వమున్ = సకలమును, సరియగున్ = నష్టమగును, అంచు = అనికొని, అటమీఁదిసృష్టికై = భావిసృజనకై, అజుఁడు = బ్రహ్మ, శరధిప=సముద్రములకధిపతియగువరుణునియొక్క, దిక్ =దిశయైనపడమటిదిక్కుయొక్క, మరుత్ = వాయువుచేతను, జ్వలిత = ప్రజ్వలింపఁజేయఁబడిన, చండతర = మిక్కిలియుంబ్రచండమైన, ఆతపవహ్నిన్ = ఆతపమనునగ్నిచేతను, ఆరఁగన్ = ఎండునటుల, వీనిపై = ఈకాసరాదులపై, కరువులు = మూసలు, కట్టెననన్ =కట్టెనోయనునటుల, కనుపట్టెన్= కానవచ్చెను.

తా. వేఁడిమిచేత నేనుంగులు వరాహములు ఎనుబోతులు వీనిదేహములయందు చేరికొనియున్న బురదలెండఁగా నిట్టివేసవియందుఁ గాసరాదులునష్టమగునని పైసృష్టికై చిచ్చువంటి పడమటిగాడ్పున నాఱుచుండఁ జతుర్ముఖుండు వీనిపై కరువులుగట్టెనో యనునటులఁ గనుపడుచుండునని తాత్పర్యము. ౩౮.

మ॥ దవధూమంపుఁదమంబులోఁదమరస ద్రవ్యంబుఁ బంకేజబాం,
ధవభానుప్రతతుల్హరింపఁగుయి వెట్టన్వెల్లశూన్యోరుకూ,
పవితానంబనఁజూడఁజూడఁబుడమి న్బాటిల్లిపైవిప్పులై,
యవసంబంచులనాడగానెగసె వాత్యాళిన్రజశ్చక్రముల్. ౩౯.

టీక. దవధూమంపుఁదమబులోన్, దవ = గ్రీష్మసంబంధియగుకార్చిచ్చుయొక్క (వ్ని. దవోవనహుతాశనయనియమరుఁడు.) ధూమంపు = పొగలనియెడి, తమంబులోన్ = చీకటియందు, పంకేజబాంధవభానుప్రతతులు = సూర్యకిరణసమూహములు, తమరసద్రవ్యంబు, తమ = తమయొక్క, (అనఁగా బావులయొక్కయనుట) రస = ఉదకములనియెడు, ద్రవ్యంబు = ధనమును, హరింపన్ = గ్రహింపఁగా, కుయివెట్టన్ = మొఱవెట్టుటకు, (కుయివెంటనను పాఠమున జాడ వెంటననియర్థము) వెళ్లుశూన్యోరుకూపవితానంబు, వెళ్లు = వెళ్లిపోవుచున్నట్టి, శూన్య = పాడైన, ఉరు = బహుళంబులగు, కూపవితానంబులు = నూతులగుంపులు, (క్రతువిస్తారయోర స్త్రీవితానమనియమరుఁడు) అనన్ = అనఁగా, వాత్యాళిన్ = వాయుసమూహముచేత (వాతానాంసమూహోవాత్యాయని పాశాదికముగనుక సమూహార్థమందు యప్రత్యయము,) పైవిప్పులై = విరివిగలవై, యవసంబు = కసువు, అంచులన్ = కొసలను, అడఁగాన్ = చుట్టితిరుగఁగా, చూడఁజూడన్ = వీక్షించుచుండఁగా, పుడమిన్ = భూమియందు, పాటిల్లి = విస్తరిల్లి, రజశ్చక్రములు = చక్రాకారపుఁబరాగములు, ఎగసెన్ = ఎగిరెను.

తా. సూర్యకిరణంబులు దమయొక్కరసములనియెడి ద్రవ్యంబులను హరింపఁగా మొఱవెట్టుటకు వెళ్లుచున్న పాడుబావులగుంపులోయనుపట్టుల సుడిగాలి దుమ్ముకసవులతో నెగసి చక్రాకారముగఁదిరుగుచుండునని తాత్పర్యము ౩౯.

చ. పడమరవెట్టనయ్యుడుకుఁ బ్రాశనమొల్లక కూటిపేదలై,
బడలికనూడునచ్చిలువప్రగ్గములన్ రవియాజ్ఞ మాటికి,
మ్మడియిడఁ బిచ్చుగుంటురథమున్నిలుపన్ బ్రయణంబు సాఁగమి,
జడనువహించెనాఁగ దివసంబులు దీర్ఘములయ్యె నత్తఱిన్. ౪౦

టీక. పడమర = పశ్చిమదిక్కుయొక్క, వెట్టన్ = వేఁడిమిచేత, అయ్యుడుకుఁబ్రాశనము = అయుడుకుటన్నమును (అనఁగా వేఁడిగాలిననుట) ఒల్లక = తిననొల్లక, కూటిపేదలై = కూటికినోఁచనివై, బడలికన్ = ఆయాసముచేతను, ఊడు = వీడిపోవుచున్న, అచ్చిలువప్రగ్గములన్ = ఆపాములనియెడుప్రగ్గములను, రవియాజ్ఞన్ = సూర్యునియాజ్ఞచేతను, మాటికిన్ = ప్రతిపదమున, ముడియిడన్ = ముళ్లువేయుటకు, పిచ్చుగుంటు = అనూరుఁడు, రథమున్ = అరదమును, నిలుపన్ = నిలుపఁగా, ప్రయాణంబు = ప్రయాణము, సాఁగమిన్ = సాఁగకుండుటచేత, జడనువహించెన్ = జాడ్యమును బొందెను, నాఁగన్ = అనఁగా, అత్తఱిన్ = ఆగ్రీష్మకాలమందు, దివసంబులు = వాసరములు, దీర్ఘములయ్యెన్ = పొడవులాయెను.

తా. గ్రీష్మకాలంబున నహస్సువృద్ధినొందుటకుఁ గారణమును జెప్పుచున్నాఁడు. పడమటిగాలి వేఁడియగుటవలన నాయుష్ణమొల్లక యన్నముతినియావిడైయున్నందువలన

తా. ఉదకపానము జేయుటకై పథికులచేత నదులయందుఁ జేయంబడిన సంపూర్ణములగు చెలమలచాళ్లు తమయందు సూర్యప్రభాంకురములు ప్రతిఫలింపఁగా నిజనాథుఁడగు సముద్రునితో గ్రీష్మకాలమందుఁ గలియకుండుట యను విరహము చేజనియించిన వేఁడిమికి శమనముఁ జేయుకొఱకు నదులనియెడు స్త్రీలు స్వశరీరములందు నిండాలుగా ధరియించిన ముత్యపుదండలో యనునటులఁ బ్రకాశించుచుండునని తాత్పర్యము. ౪౨.

మ॥ అతివృష్టిన్మునువార్ధిఁ గూర్చునెడ కాఁడౌటం దముం గూర్చన,
న్మతిలంచంబుగ హేమటంకములు మింటంబొల్చు పర్జన్యదే,
వతకీనెత్తినకేలనాఁబొలిచె నిర్వారిస్రవంతిన్పయ,
శ్చ్యుతినమ్రచ్ఛదదృశ్యకర్ణికములై యున్నాళనాళీకముల్. ౪౩.

టీక. అతివృష్టిన్ = అతిశయంబగు వానలచేతను, మును = మునుపు, వార్ధిన్ = సముద్రుని, కూర్చు = పొందించునట్టి, ఎడకాఁడౌటన్ = కుంటెనకాఁడవుటచేతను, తమున్ = తమ్మును, కూర్చున్ = పొందించును, అన్ = అనునట్టి, మతిన్ = బుద్ధిచేతను, లంచంబుగ = ఉత్కోచముగ, హేమటంకములు = స్వర్ణటంకములు, మింటన్ = అంతరిక్షమున, పర్జన్యదేవతకు = పర్జన్యుఁడను దేవతకు, ఈన్ = ఇచ్చుటకు, ఎత్తినకేలనా = ఎత్తినహస్తమనఁగా, నిర్వారి = ఉదకములేని, స్రవంతిన్ = నదియందు, పయశ్చ్యుతి = నీళ్లుదలుగుటచేతను, నమ్ర = వంగిన, ఛద = ఆకులమీఁదను, దృశ్య = కనఁబడుచున్న, కర్ణికములై = మిద్దెలుగలవై, ఉన్నాళనాళీకములు, ఉత్ = ఉన్నతములైన, నాళ = కాఁడలుగల, నాళీకములు = కమలములు, పొలిచెన్ = ఒప్పెను.

తా. పూర్వమతిశయంబుగవర్షించి మేఘుఁడు సముద్రమునకు నదులకును సంధానముఁ జేసెగాన మరల నాలాగుంజేయుమని వేడి పర్జన్యునకులంచమిచ్చుటకై బంగారునాణెములఁ జేతులంబట్టి యెత్తినదో యనునటుల నుండునదులయందున్న నీరింకఁగాఁగాఁడలు హస్తములవలెను ఆకులు వ్రేళ్లవలెను మిద్దెలు వరాలవలె నొప్పుచుండునని తాత్పర్యము. ౪౩.

సీ. నులివాడుశాఁచువల్లులగొంతొగర్చితేఁ, బొలవల్చుగాలివేఁబోకయొదిగి,
కడకువెళ్లఁగనొక్కకడను డిల్లొత్తిక్కుచు, నులుచలఁజిలుతగుల్లలనములుచు,
నెంద్రికాలితికిన నెగసియొక్కించుక, తొలఁగిశితత్రోటిఁ దూఁటితినుచుఁ,
దడియింకునిలఁజేచు చుడివోసితప్పిగుం, పులనుజీలుగలనెండలుగడపుచుఁ,
దనగుబకపఙ్క్తు లకుజానుదఘ్నమయ్యెఁ, జెరువుగమియుడుములనరేల్దిరిగఁగుక్క,
తవికిభావులఁబడుటకుఁబసులయెరవు, టెఱలకుమొసల్లుమలుఁగుమినొప్పితియుఁదూటె,

టీ. నులివాఁడునాఁచు = కొంతవాడిననాఁచుతీఁగయొక్క, వల్పులన్ = బొబ్బరలచేత, గొంతొగర్చి = గొంతొగరించి, లేఁబొలవల్పుగాలిన్ = లేతమాంసపువాసనగలవాయువుచేత, వేఁబోక = శీఘ్రముగఁజనక, ఒదిగి = శరీరమువంచికొని, ఒక్కకడనుండి = ఒకచోటనుండి, కడకువెళ్లఁగన్ = తుదముట్టునట్లుగ, త్రొక్కుచున్, ఉలచలన్ = ఉలచలనుపేరుగలచేఁపలను, చిఱుతగుల్లలన్, చిఱుత = పిన్నలైన, గుల్లలన్ = నత్తగుల్లలను, నములుచు = భక్షించుచు, ఎండ్రి = ఎండ్రకాయ, కాలిఁకీన = తనకాలుపట్టుకొన్న, ఎగసి = ఒక్కించుకతొలఁగి, శితత్రోటిన్ = వాఁడిముక్కున, తూఁటి = పొడిచి, తినుచు = నములుచు (ని, చంచుస్త్రోటిరుభేస్త్రియామనియమరుఁడు,) తడియింకునిలన్ = తేమయింకునట్టిభూమియందు, చేమమడివోని = చేమకూరమడివంటి, తమ్మిగుంపులను = తామరగుంపులయందును, జీలుగలన్ = జీలుగచెట్లయందును, ఎండలుగడపుచు, తనరు = ఒప్పుచున్న, బకపఙ్క్తులకు = కొంగగుంపులకు, చెరువుగమి = చెరువులగుంపు, జానుదఘ్నమయ్యెన్ = మోకాలిబంటిదాయెను, ఉడుములన = ఉడుములవలెనే, మొసళ్లు = మకరములు, పసులయొరవు = పశువులయొరవుపెంటలలోని, ఎఱలకున్ = ఎఱ్ఱలకు, కుక్కవసికి = కుక్కలరాయిడికి, బావులఁబడుటకు = కూపములయందుఁబతనమగుటకు, రేలన్ = రాత్రులయందు, తిరిగెన్ = సంచరించెను, మలుఁగుమీన్ = మలుఁగనుపేరుగలచేఁప, బొఱియఁదూఱె = బొక్కలోదూఱెను.

తా. ఆగ్రీష్మవాసరంబులయందు నులివాఁడిననాఁచుఁదిని గొంతుకరొంగరెక్కలేఁతమాంసపువాసనగల గాలిచేత వేగిరఁబోక యొదిగికడముట్టఁద్రొక్కుకొనిపోయి యొకచోటనున్న యులుచలను నత్తగుల్లలను నమలితిని యెండ్రకాయ తనకాలుపట్టుకొనఁగా నెగసి కొంతదూరముననిల్చి ముక్కునఁబొడిచి దానింభక్షించి, చేమకూరమళ్లవలె దడియారిన తామరగుంపులక్రిందను జీలుగబెండుచెట్లక్రిందను నెండలకుదాఁగియున్న కొంగలకుఁజెరువులు జానుదఘ్నములాయెననియు - కుక్కలకువెఱచి మొసళ్లుబావులలోఁబడుటకుఁ బసరములయొరవులలోని యెఱ్ఱలకుఁగా సంచరించెననియును - మలుఁగుమీనుబొక్కలోఁబ్రవేశించెననియును తాత్పర్యము. ౪౪.

ఉ. మీటగుమీలనెల్లమునుమ్రింగిక్రమంబుననైనయెండపై,
న్నీటికవెంటఁదోఁచుతొగపేరుబడిన్గొడుపైచెలంగఁగాఁ,
దోటికఁగర్దమద్రవముతోనెనశించినబొమ్మడాయఁడా,
తూటకులంబులందినెబకోటకులంబుజలహ్రదంబులన్. ౪౫.

టీ. బకోటకులంబు = పెద్దకొంగలగుంపు (ని, బకోటస్తుమహాబకయని నిఘంటువు,) మీటగు = గొప్పలైన, మీలనెల్లన్ = చేఁపలనన్నిటిని, మునుమ్రింగి = ముందు

ద్రిమ్మంగి, క్రమంబునన్ = వరుసగా, ఐన = ఐనట్టి, ఎండపెన్బీటికవెంటన్ = ఎండచేత నైనపెద్దబీటికలచాలున, తోఁచు = కనుపించెడి, తొగవేరుబడిన్ = కలువవేరువెంటను, కొడుపై = కొడుపువలెనై, చెలఁగఁగాన్ = ఒప్పఁగా, త్రోటికన్ = ముక్కుచేతను, కర్దమద్రవముతోనె = బురదతడితోనే, నశించి = చనిపోయిన, బొమ్మిడాయల = బొమ్మిడాయలను పేరుగలచేఁపలయొక్కయు, డాతొక్కట = చేఁదుచేఁపలయొక్కయు, కులంబులన్ = గుంపులను (ని, బొమ్మిడాయసూన్యత్మమతోన్యడాతొక్కట స్త్రీక్తమత్స్యవిశేషయనివిశ్వము,) జలహ్రదంబులన్ = మడుగులయందు, తినెన్ = భక్షించెను, (క్రమంబున నాసెనను పాఠమున ఆసెనుద్రాగెననియర్థము - డాతొక్కటకులంబు లేజెననను పాఠమున జెనయనఁగా వంకరగుడ్డులలోనిరక్తవిశేషము.)

తా. పెద్దకొంగలగుంపు మడుగులయందుఁ దొలుతగొప్పచేఁపలనెల్లభక్షించి గ్రీష్మకాలము రాఁగా నీళ్లినికివపిమ్మట నేలపగులుటవలన బొరియలలోఁ గలువవేళ్లవెంటఁ గొడుపువలెనొప్పుచున్న బొమ్మిడాయలనియెడి పిన్నచేఁపలను బురదతోఁగూడ నెగిరినవగరుగల చేఁపలనుభక్షించెనని తాత్పర్యము. ౪౫.

శా. ప్రాతర్వేళలనట్టివెట్టసొగసై పాటిల్లెఁ గుంభోంభనో
ద్భూతాంబుధ్వనివాద్యమై మరుదధః పుంజీభవత్పాటల
వ్రాతామ్రేడితసిక్తభూసురభిళారామంబుకుల్యాబహు
స్రోతస్సంధులనంధుయంత్రనతికృత్ప్రోద్గీతగేయౌఘముల్. ౪౬

టీ. ప్రాతర్వేళలన్ = ప్రాతఃకాలములయందు, అట్టివెట్టన్ = అటువంటిగ్రీష్మమునందు, మరుత్ = వాయువుచేతను, అధః = చెట్లక్రిందను, పుంజీభవత్ = రాసులుగాఁబడిన, పాటలవ్రాత = కలిగొట్టుపువ్వులచేత, ఆమ్రేడిత = రెండుమూడువరసలు, సిక్త = తడుపఁబడిన, భూ = భూమియందు, సురభిళ = సౌరభ్యముగల, ఆరామంబు = ఉద్యానవనముయొక్క, కుల్యా = కాలువలయొక్క, బహు = అనేకములైన, స్రోతః = ప్రవాహములయొక్క, సంధులన్ = మధ్యప్రదేశములయందు, అంధు = బావులయొక్క, యంత్ర = ఏతములయొక్క, నతి = వంగుటను, కృత్ = చేయుచున్నజనులచేతను, ప్రోద్గీత = ఎత్తిపాడబడినట్టి, గేయ = గానములయొక్క, ఓఘములు = సమూహములు, కుంభ = ఘటములయొక్క, ఉంభన = మునుఁగుటచేతను, ఉద్భూత = పుట్టినట్టి, అంబుధ్వని = నీళ్లచప్పుడు, వాద్యమై = వాద్యధ్వనివలెనై, సొగసై = సొంపుగను, పాటిల్లెన్ = ఒప్పెను, (ని, ఆమ్రేడితంద్విస్త్రిరుక్తం, కుల్యాల్పాకృత్రిమాసరిత్, పుంస్యేవాంధుః ప్రహిఃకూపయనియునమరుఁడు.)

తా. వాయువుచేరాల్పఁబడిన కలిగొట్టుపువ్వులచేత రెండుమూఁడుమాఱులుతడుపఁబడినదైయున్న భూమియందుఁ బరిమళించుచున్నయుద్యానవనములయందలివృక్షముల

తనీళ్లుగట్టుటకై సేంతములు ద్రొక్కుచున్న వాండ్రు గానముఁజేయుచు ద్రొక్కునలముంచున వుడుబనియించి సనీళ్ల చప్పుడను తాళధ్వనిగలదియై సొగసుగానుండెనని తాత్పర్యము.

తే. గీ. మెండుమీఱిన పగటి పే♦రెండ దాఁకి, యొల్లఁబోయిన తేబొండు♦మల్లెపొదల,
తుదలఁ జప్పటిలై కడు♦నొడ్డలగుచుఁ, బొడమె మొగ్గలగములగ్గి♦బొబ్బలట్లు. ౪౭.

టీ. మెండుమీఱిన = దట్టమైన, పగటి = పవటియొక్క, పేరెండ = పెద్దయెండ, తాఁకి = స్పృశించి, ఒల్లఁబోయిన=మూర్ఛఁబోయిన, తేబొండుమల్లెపొదల= లేఁతబొండుమల్లెపొదలయొక్క, తుదలన్ = కొనలయందు, చప్పటిలై = అణఁగినవై, కడునొడ్డలగుచున్ = మిగులగొప్పలై, అగ్గిబొబ్బలట్లు = కాలినబొబ్బలవలెను, మొగ్గలగములు = మొగ్గలగుంపులు, పొడమెన్ = పుట్టెను.

తా. ఆవేసవియందు దట్టమైనపేరెండదాఁకి వాడినబొండుమల్లెలపొదల కొనల యందణఁగినవై - మిగులగొప్పలగుచు నగ్గిబొబ్బలవలె నామొగ్గలగుంపులుపుట్టెనని తాత్ప.

మ. సుడినాభిచ్ఛలనన్సరోజములు చ♦క్షుఃప్రక్రియన్వ్రాఁచ మ్రో,
మ్ముడిదంభంబునఁ జక్రఫేనపటలం♦బుల్చన్నులున్నవ్వఁగా,
నడరం జేసి నిదాఘభీతి సలిలం♦బాగామి బీజార్థమై,
కడవం బెట్టిన వారిదేవతలనాఁ♦గాంతాళి యొప్పన్ బ్రపన్. ౪౮.

టీ. సుడినాభిచ్ఛలనన్ = సుడి = నీళ్లసుడి, నాభిచ్ఛలనన్ = బొడ్డులనియెడివ్యాజముచేతను, సరోజములు = పద్మములు, చక్షుఃప్రక్రియన్ = నేత్రములరీతిచేతను, వ్రాఁచు = ప్రాఁచి, క్రొమ్ముడిదంభంబునన్ = కొప్పమవ్యాజముచేతను, చక్ర = చక్రవాకములయొక్కయు, ఫేన = నురుగుయొక్కయు, పటలంబులు = సమూహములు, క్రమముగా, చన్నులు=చనుదోయి, నవ్వఁగా=మందహాసముగా, అడరంజేసి= అమరునట్లుచేసి, నిదాఘభీతిన్ = గ్రీష్మమునలనిభయముచేతను, ఆగామి = ముందటికి, బీజార్థమై=విత్తనముకొఱకై, సలిలంబు = జలమును, కడవన్ = కుండలోన్, పెట్టిన = ఉనిచినట్టి, వారిదేవతలనాన్ = ఉదకాధిదేవతలోయనునటుల, ప్రపన్ = చలిపందిళ్లయందు, కాంతాళి = స్త్రీసమూహము, ఒప్పున్ = పొల్పగున్.

తా. జలదేవతాలక్షణములు స్త్రీలయవయవములకుఁ జెప్పంబడెనుగానఁ జలిపందిళ్లయందు నీళ్లుపోయుచున్నస్త్రీలు - గ్రీష్మమునందు సకలమునష్టముగాననిభయపడి - ముందటివిత్తనముకొఱకు నీళ్లఁ గడవలనుంచికొని తమయందుగలవస్తువులను నంగములుగాఁజేసికొనియుండెడివారిదేవతలోయనునటులఁ బ్రకాశించుచుందురని తాత్పర్యము.

సీ. సొగసుల్కుతుంగుచో♦ద్భిన్నజహ్నావిజల, సరణిమల్లిలతోడి♦బాలమొలయు,
పటిచన్నుకొనమూపు♦చ్చిలినదిమ్మను లెంత, కునముంచుగరిగకోఁ♦గులమునుంగ,
ధారలోఁద్రోయుక♦న్దబిందులవాసితో, త్వలపత్రపత్రనసం♦భ్రాంతినొసఁగ,

తెలిమోముపసమెచ్చి తలయూఁచుటెఱిఁగి మా, నకనవ్వు నేర్పు దండములఁ గఱప,
దెఱవలిటు నీరు వోయు పందిరియ చేరి, యవలఁ గొఱగాక పిచ్చుగుంటైయనంగుఁ,
డనువుఁగొనఁ జొచ్చెఁ గల్లగుట్టమర వారి, కర్ఘ్యగులు లాఁచియిడు విడియముల పేర.

టీ. సెగకు = గ్రీష్మమునకు, ఉల్కి = భయపడి, మఱుఁగుఁజొచ్చిన = స్త్రీల మఱుఁగుఁజొచ్చిన, జహ్నురవిజలసరణి = గంగాయమునలరీతిని, మల్లెలతోడిజడలు = గంగవలెమల్లెలుయమునవలెజడలు, మెఱయన్ = ఒప్పఁగా, వలిచన్ను = వస్త్రమువలనైన తమస్తనముల, కొమరు = సౌందర్యమును, మురిచ్చిలినది = హరించినది, ఇమ్ముమతెఱంగున = అదిమరలనిమ్మనుకరణి, ముంచు = మునుంగఁజేయునట్టి, గరిగ = కడుపుముంత, కౌఁగులమునుంగన్ = నీళ్లకౌఁగులలోమునుఁగఁగా, ధారలోన్ = పథికులకుఁబోయు నీటిధారలోన్, తోఁచు = ప్రతిఫలించిన, కన్దళుకులు = నేత్రప్రభలు, వాసిల = వాసింపుచున్న, ఉత్పల = కలువలయొక్క, పతన = పడుచున్నదని యెడి, సంభ్రాంతిన్ = భ్రమను, ఒసఁగన్ = కలుగఁజేయఁగ, తెలిమోముపస = ఆస్త్రీలముఖసౌందర్యమును నీరుఁద్రాగుచున్నవారుచూచి, మెచ్చి = ఆనందించి, తలయూఁచుటెఱిఁగి = వారియభిప్రాయముఁగని, మానక = నీరుపోయుటచాలింపక, నవ్వునేర్పు = నవ్వుచుచమత్కారము, దండములన్ = పథికులనమస్కారములను, కఱపన్ = కఱఁగింపఁగా, తెఱవలు = స్త్రీలు, ఇటు = ఇట్లు, నీరుపోయుపందిరియ చేరి = నీళ్లుపోయుచుండెడిపందిటఁబ్రవేశించి, అవలన్ = మఱియొకతావునకు, కొఱగాక = పనికిరాక, పిచ్చుగుంటై = బంగుడై, అనంగుఁడు = మన్మథుఁడు, కల్లగుట్టమర = అబద్ధముగనఁబడకుండ, వారికిన్ = ఆస్త్రీలకు, అర్ఘ్యగులు = తెఱవల్లు, లాఁచియిడు = ప్రీతితోనిచ్చునట్టి, విడియముల పేరన్ = తాంబూలములనువ్యాజముచేతను, అనువుగొనన్ = సుంకముఁదీసికొనుటకు, చొచ్చెన్ = ప్రవేశించెను.

తా. మల్లెపూదండలుగలకొప్పులు - గంగాయమునలు రెండును వెంబడిపెఱిచి స్త్రీలమఱుఁగుఁజొచ్చెనోయనునటుల నొప్పెననియు, నీళ్లకౌఁగులలో ముంచెడిముంతలు మాచక్కదనమును మీరుదొంగిలినారుగాన మరల నిమ్మనిచన్నులకడవలలోఁజొచ్చి బాధించునట్లుండెననియు నీళ్లుపోయఁగనాధారయందుఁ గనుపించుచున్న కన్నులకాంతులు పరిమళమునకుఁగాఁగట్టినకలువలో యనునట్లుండెననియు. పథికులాస్త్రీలముఖ సౌందర్యముఁజూచి తలయూఁచఁగా వాచారఁబట్టి నీళ్లుద్రాఁగుచుఁజాలుననియూఁచినట్లూహింపక మానక నీళ్లుపోయుచు నవ్వేడు నేపుఁ బథికులనమంబులఁగఱఁగింపఁగ స్త్రీలకుఁ బాంథులు మంచితనమునకైయిచ్చు విడియములుపిచ్చుకుంటై మఱియొకచోటికిఁ బోకపడియున్న మన్మథుఁడు తీసికొను సుంకమవలెనుండెననియును తాత్పర్యము. ౪౯.

చ. తోడిబడనమ్మయక్కయని తూలుచుదీనతదోయిలొగ్గుచు,
న్వడమతి తేరఁ దేరనల వాక్యము లెన్నక మోముగుబ్బలు,
న్గడకొనుకక్షదీధితులె గాదిగఁ గన్గొనుచిట్టకంపుఁ ద్రాఁ,
గుడుగనిసన్నలన్న గిరి కొందరు పాంథుఁ బ్రపాప్రపాలికల్. ౫౦.

టీక తోడిబడన్ = దాహాత్వరచేతనైన తొట్రుపాటుచేతను, తూలుచున్ = తూఁగాడుచు, అమ్మ, అక్క, అని = అనుచు, దీనతన్ = దైన్యముతో, దోయిలొగ్గుచున్ = దోసిలిపట్టుచు, వడమతి తేరన్ = నీళ్లు దాగుట చేనట్టివెట్ట దీరఁగా, అల వాక్యములు = మునుపన్న మాటలను, ఎన్నక = విచారింపక, మోముగుబ్బలన్ = ముఖములను స్తనములను, కడకొనుకక్షదీధితులన్, కడకొను = బయలొలసిన, కక్షదీధితులన్ = చంకల మెఱుపులను, ఎగాదిగన్ = పైనిఁ గ్రిందను, కన్గొను - చూచుచున్నట్టి, చిట్టకంపుఁ ద్రాఁగుడు = చేష్టలుగల త్రాఁగుటను, చిట్టకం, కపటమనియునర్థముగలదు, కని = చూచి, పాంథున్ = పథికుని, సన్నలన్ = సంజ్ఞచేతను, కొందఱు = కొందరైన, ప్రపాప్రపాలికలు = చలిపందిటియందు నీళ్ళుపోయుచున్న స్త్రీలు, నగిరి=నవ్విరి.

తా.—తోలుత నమ్మయక్కయనుచు దీన భావముతో వచ్చి దాహాత్వరచే తూలుచు నుదోసిళ్లయందు నీళ్ళుపోయఁగఁ ద్రాఁగి బడలిక దీరఁగాముసు పటిమాటల విచారింపక నీళ్ళు పోయు స్త్రీలయొక్క కన్నులు - మోములు - స్తనములు - చంకలు - వీని నెగాదిగఁ జూచి వికారముతోఁ ద్రాఁగుచున్న పథికునింగని యా స్త్రీలు సైగతో నవ్విరనియు - పాంథుఁడు కాముకుఁడనియు - తొట్రుపాటు చేతఁ దొలుత నమ్మయక్కయని వచించెననియును, తాత్పర్యము.

తే. గీ. ఎసఁగు కట్టావిక్రియ పావి రెగయఁ బగటి,
యెండయుడు కాఱుసుండ భూమండలమునఁ,
బొలిచె మాపటిపండు వెన్నెలచకోర,
పోతవితతికి జూపట్టు వోసినట్టు. ౫౧.

టీక. ఎసఁగు = పెనముమీఁదఁ బిండిఁ బోయఁగఁ జొట్టు నెగసినట్టి, కట్టావిక్రియన్ = కట్టవలె లేచెడి యావిరిపొగవలెను, ఆవిరెగయన్ = ఆవిరిగ్రుగురు చుండఁగా, పగటియెండ, ఉడుకారకుండన్ = చల్లారకుండఁగ, భూమండలమునన్ = కాలిన పెనము వంటి భూమండలమున, మాపటిపండు వెన్నెల = రాత్రిముదురు వెన్నెల, చకోరపోతవితతికిన్ = చకోరపుఁబిల్లలగుంపులకు, జూపట్టు = పలుచని దోసెలను, పోసినట్టు = పోసినట్టువలె, పొలిచెన్ = ఒప్పెను.

తా.—పెనముమీఁద బిండిఁబోయఁగ నైగసిన యావిరిపొగవంటి యావి రెగయఁగఁ బగటియెండయుడుకాఱకుండెను గానఁ గాలిన పెనమువలెనున్న భూమండలమునందు

రాత్రిముదురు వెన్నెల చకోరపుఁ బిల్లలగుంపులకుఁ బలుచని దోసెలను బోసినట్టుబలె నొప్పుచుండె నని తాత్పర్యము.

సీ. పవలెల్లదీర్ఘికాంబువు చల్లుపోరాడ, సొలసిమృణాళికోజ్జ్వలము లైన,
బాహువు లతమదుకూర్పరములకెదురుగా, మలఁచి మూపులఁ గరతలములు నిచి,
ప్రాల్మాలిమిగులనార్పమిఁ గమ్ముక్రొమ్ముడిఁ, దని మొగ్గవిరవాదిదండవిరియ,
ధౌతగంధామోదశీతల స్తనములు, వొందఁగౌఁగిళ్లతోఁ బోరగిల్లి,
నారికేళాసవపుఁదీపుటూరుపాలయ, వలిపెయొంటూల్లెతోనురస్థ్సలులకూర్కఁ,
బ్రియులవేఁకువఁదొడలెచ్చరించికలసి, రెలమిధన్యులుదటిపివెన్నెలబయళ్ల. ౫౨

టీక. పవలెల్లన్ = పవటివేళలవెల్లను, (క్వచిద్వకారోవయను సూత్రమునగవర్ణమునకువవర్ణము) దీర్ఘికా = డిగ్గియలయొక్క, అంబువు = నీళ్లచేతను, చల్లుపోరాడ= చల్లులాడఁగా, సొలసి = అలసి, మృణాళికా = తమ్మితూఁడులవలెను. ఉజ్జ్వలములైన =ప్రకాశించునట్టి, బాహువులు = భుజములు, తమదు = తమయొక్క, కూర్పరములకు =మోచేతులకు, ఎదురుగా, మలఁచి = మరలించి, మూపులన్ = భుజములపై, కరతలములు = అఱచేతులను, ఉనిచి = ఇడికొని, ప్రాల్మాలి = బద్ధగించి, మిగులన్ = మిక్కిలి, ఆర్పమిన్ = ఆర్పకుండుటచేత, కమ్ముక్రొమ్ముడిన్ =వ్యాపించుచున్న కొప్పునందు, తని=క్రొత్తలగు, మొగ్గ=మొగ్గలచేతఁగట్టిన, విరవాదిదండ=మల్లెపువ్వులదండ,విరియన్ = వికసింపఁగా, ధౌత = కడఁగఁబడిన, గంధామోద = చందనపువాసనగలిగి, శీతల = చల్లనైన, స్తన =చన్నులు, పొందన్ = స్పృశించినటుల, కౌఁగిళ్లతోన్ = ఆలింగనములతోడను, బోరగిల్లి, నారికేళాసవపు = నారికేళమద్యముయమగు, తీపుటూరుపాలయన్ = తీపుగలనిట్టూర్పువెడలఁగను, వలిపె = సన్నమైన, ఒంటూల్లెతో= ఏకవస్త్రముతోను, ఉరస్థలులఁగూర్క = రొమ్ములపైనిద్రించుచున్న, ప్రియులన్ =ఇష్టులగు స్వస్త్రీలను, వేఁకువన్ = వేఁకువ జాములయందు, తొడలు = ఊరువులను, ఎచ్చరించి =కదలించి, తటిపివెన్నెలబయళ్ళన్ = పండువెన్నెలగలబయళ్లను, ఎలమిన్ = సంతోషముచేత, ధన్యులు = భాగ్యవంతులు, కలసిరి = రమించిరి, తటిపివెన్నెలయనుపదము వశులక్షణచేతబండువెన్నెలయనునర్థముసిద్ధించును.

తా,—వేఁడిమిగలిగియుండుటచేతఁ బగళ్లెల్లనుజడబావులయందు జలక్రీడలుసేసి తూఁడులవలెఁ బ్రకాశించుచున్న హస్తములఁదమ మోచేతులకెదురుగ మరలించిభుజములపైఁజేతులనుంచికొని ప్రాల్మాలితడిబోవునట్లార్పఁబడమి వాసించుచున్న కొప్పునందున్న క్రొత్తలగువిరవాదిమొగ్గలువికసింపఁగ - కడుగఁబడిన శ్రీగంధపువాసనగలిగిచల్లనైన స్తనములుదాఁకుచుండునట్లాలింగనములతో బోరగిల్లి - పానము సేసినవారికేళాసవము చేతఁ

దీపుగలనిట్టూర్పు వెడలఁగసన్నమైన యొంటివస్త్రముతోఁ దమతొమ్ములపైనిద్రించుచున్నప్రియురాండ్రను వేఁసవజాములయందుఁ దోడలసంజ్ఞచేత లేపి పండువెన్నెలబయళ్లను వారితో భాగ్యవంతులగుపురుషులు రమించుచుందురని తాత్పర్యము.

చ॥ హృదయములెప్పుడున్గదియ♦కేతఁజెంచె వెడకౌఁగిలింపల,
గ్గదిరెదు మేలు కార్యములఁ♦గల్గకమాటలయందెకల్గుపె,
ద్దదురులువట్టిశైత్యములు♦చాలఘనంబయిమండువేసవి,
న్పొదలఁగనిల్చెదంపతుల♦పొందులనార్యులపొందుకైవడిన్. ౫౩.

టీక. మండువేసవిన్ = గ్రీష్మమందు, దంపతులపొందులు=సతీపతుల సంపర్కములు, అనార్యులపొందుకైవడిన్ = దుర్జనులకూటమివలె, హృదయములు = రొమ్ములు, ఎప్పుడున్ = ఎప్పటికిని, కదియక = సోఁకకయే (ఘర్మదముచేతననుట) తఱచు = మెండైన, వెడకౌఁగిలింతలన్ = వట్టికౌఁగింతలను, మనస్సంగములేకయనియర్థాంతరము. గదిరెడు = ప్రాప్తమైన, మేలుకార్యములన్ = రతిక్రియలయందు, కల్గక = లేక, మాటలయందె= ఒకప్రయోజనములేకమాటలనేపుణనందే, కల్గు=కలుగుచున్నట్టి, పెద్దదురులు = గొప్పచాతుర్యములు, పెద్దబిచ్చులని యర్థాంతరము. వట్టిశైత్యములు = వట్టిచల్లఁదనములు (క్రియలచేతలేవనుట) చాలఘనంబయి = మిగులగొప్పవై, పొదలఁగన్ = పొందునట్లుగా, నిల్చెన్ = ఉండెను.

తా. గ్రీష్మమందు సతీపతులుసంపర్కములు దుర్జనులకూటమింబలె నెప్పటికిని మనస్సంగములేక మెండైనవట్టికౌఁగిలింతలచేతనుప్రాప్తమైన రతిక్రియలయందులేకమాటలయందుఁగల్గుచాతుర్యములచేతను జల్లఁదనముచేతను మిగులగొప్పై పొందునట్లుండెను ననితాత్పర్యము. ౫౩.

ఉ. తీలగుకంతువెంబడినె♦తెమ్మెలలున్రవిదీప్తికల్కఁజా,
తాళముఁబట్టుచుండఁదను♦తావులుముచ్చిలఁబట్టియోషధీ,
పాలునకొప్పగించెనన♦బైసురభిశ్వసనంబునిరంచెఁగాం,
తాలసవక్త్రసీమవిటు♦లార్చునుశీరపుఁదాళవృంతముల్. ౫౪.

టీక. విటులు = పల్లవులు, కాంతా = స్త్రీలయొక్క, అలస = బడలినట్టి, వక్త్ర=ముఖముయొక్క, సీమన్ = ప్రదేశమునందు, ఆర్చున్ = విసరునట్టి, ఉశీరపుఁదాళవృంతములు = వట్టివేళ్లవిసనకఱ్ఱలు, తీలగు = బలహీనుఁడైనట్టి, కంతువెంబడిన = మన్మథునివెంటనే, తెమ్మెలలున్ = శీతవాయువులను, రవిదీప్తికల్క = సూర్యప్రతాపమునకువెఱచి, పాతాళముఁబట్టుచుండన్ = పాతాళలోకముఁజేరబోవుచుండఁగా, తమతావులు = తమవాసనలను, ముచ్చిలన్ = అపహరింపఁగా, పట్టి = పట్టుకొని, ఓష

ధీపాలునకు = చంద్రునికి, ఒప్పగించెననఁ = అప్పగించెననుసటుల, పైఁ = ముఖము మీఁద, సురభి = వాసించుచున్న, శ్వసనంబు = గాలిని, నించెఁ = నిండించెను.

తా- గ్రీష్మమందుబలహీనుఁడై వెళ్లుచున్న మన్మథుని వెంటఁ బాశాళీమునకుసూర్యదీప్తికివెఱచి వలసపోవుచున్న వాయువులను దమవాసనలదొంగిలికొనిపోవుచున్న వనిపట్టి తాపోపశమలుగనుకఁ దమకుఁ బ్రభువైనచంద్రునికి నొప్పగించెనోయనునటుల విటులు స్త్రీలముఖములయందలి చెమటారవిసరెడు వట్టివేళ్ల విసనకఱ్ఱలొప్పచుండెననియు- నప్పగించిన సురభిశ్వసన మలయమారుతము-స్త్రీలముఖములు చంద్రుడు-వాయువుదొంగలనియును భావము. ౫౪.

చ. సమసికథావశిష్టమగు♦చందనశైలసమీరణంబుఁగృ,
త్రిమగతినింద్రజాలమునఁ♦దేఁదొడఁగెన్భువిఁదాళవృంతజా,
లములదిమాయయాటకుఁద♦లంపదదీయమయూరపింఛికా,
భ్రమణమెసాక్షిగాదెనగ♦రంబునవట్టికడింది వేసవిన్. ౫౫.

టీక. సమసి = నష్టమై, కథావశిష్టమగు = కథామాత్రమందుమిగులునట్టి, చందనశైలసమీరణంబున్, చందనశైల = మలయపర్వతమునందలి, సమీరణంబున్ = మందమారుతమును, భువిన్ = భూమియందు, తాళవృంత=విసనకఱ్ఱలయొక్క, జాలములు= సమూహములు, ఇంద్రజాలమునన్ = ఇంద్రజాలవిద్యచేత, కృత్రిమగతిన్ = మాయచేతను (ని॥ వ్యజనంతాలవృంతకం । చక్రంజాతంచజాలకమనియునమరము) తేఁదొడఁగెన్ = తెచ్చుటకారంభించెను. అది=ఆవాయువులఁ గొచ్చునది, మాయయాటకున్ = కపటమాటకు, తలంపఁగన్ = విచారింపఁగా, తదీయ = ఆతాళవృంతసంబంధియైన, మయూరపింఛికాభ్రమణమె, మయూర = నెమలియొక్క, పింఛికా = పింఛముయొక్క, భ్రమణమె = తిరుగుటయె, నగరంబునన్ =పట్టణమునందు. అట్టి = అటువంటి, కడిందివేసవిన్ = కఠినమగుగ్రీష్మమందు, సాక్షిగాదె = గుఱుతుగాదా.

తా. మిగుల కఠినమగుగ్రీష్మమందుమలయమారుతము నష్టమైపోఁగామాయతో గారడివిద్యచేత విసనకఱ్ఱలు దెచ్చెననియు-నదిగారడమగుటకుఁ దాళవృంతముల చుట్టును కోనలయందున్న నెమలిపింఛికయె సాక్షియనియు - దాఁరనుపింపకయుండియుట్టివిద్యను జేసెననియును భావము-ఐంద్రజాలికునకు నెమలిపింఛము కావలయుననుట కుప్రయోగము (శ్లో॥ భ్రామయన్ బహీఁబర్హిణీమోహయన్ జంతుసంతతిః। విస్మాపయన్ సభాంకశ్చిదాయయావైంద్రజాలికః అని.)

తే-గీ. అట్టివేసవిబెడిదంబు♦వెట్టకతన, హస్తము నెమర్పసారెకులస్తకంబు,
దుకికిలఁగఁగా దెసవరింప♦వసముగాక, పుష్పబాణుని చెఱకువి♦ల్పాదమీఁబడిరొ.

టీక. అట్టివేసవిన్ = అట్టిగ్రీష్మమందు, బెడిదంపువెట్టకతన = కఠినమగు వెట్టచేతను, హస్తము = పాణి, చెమర్పన్ = చెమటఁబోయఁగా, సారెకు = పలుమాఱును, లస్తకంబు = ధనుమ్మధ్యము. (ని॥ లస్తకస్తుధనుమ్మధ్యమని నిఘంటువు) దుసికిలఁగఁగాదె = పిడికిటనుండకజాఱిపోవఁగదా, సవరింపన్ = చక్కఁజేయుటకు, వసముగాక = వశముగాక, పుష్పబాణుని = మన్మథునియొక్క, చెఱకువిల్ = ఇక్షుధనుస్సు, పుడమిన్ = భూమియందు, పడియెన్ = పతనమాయెను.

తా. అనఁగానదిభూమియందుఁ జెఱకుపండెనుకాలమనుట. ౫౬.

మ॥ తరుణుల్దల్లిరొయిఱన్గుచంబులును పంౘద చ్ఛైత్యముల్దీములై,
పెరరేపంజనుదెంచెఁగాకరవిదీప్తింగ్రుంకిపాతాళగ,
హ్వరముందూఱినవానినీయదుకుత్రాళ్లాతెచ్చునాదీర్ఘతత్,
చ్చిరకృష్టింగనునట్టిశైత్యములరించెన్నూతులందత్తతిన్. ౫౭.

టీక. తరుణులు = యువతులు, తల్లిరొయిఱన్ = నూతులపైఁగట్టియున్న పెద్దరొరమీఁదను, కుచంబులనుపన్ = నీళ్లుజేదునప్పుడు స్తనములానింపగా, తత్ = ఆకుచములయొక్క, శైత్యములు = చలువలు, దీములై = పాటిగువ్వలై, (పాటిగువ్వయనఁగా స్వజాతిపక్షులనాకర్షించుటకుఁబెంపఁబడినపక్షి. ఉదకశైత్యమునకాకర్షకంబులైయనుట) పెరరేపన్ = ప్రేరేపింపఁగా, చనుదెంచెఁగాక = శైత్యమువచ్చెఁగాక, అట్లుగాకుండనేని, రవిదీప్తిన్ = సూర్యప్రతాపముచేతను, క్రుంకి = అణఁగి, పాతాళగహ్వరమున్ = పాతాళబిలమును. (ని॥ దేవఖాతబిలెగుహా । గహ్వరమని యమరము.) దూఱినవానిన్ = చొచ్చినయుదకశైత్యములను, ఈయదుకుత్రాళ్లా = ఈముళ్లు వేసినత్రాడులా, తెచ్చున్ = తేఁగలవు, నాన్ = అనఁగా, దీర్ఘ = పొడవైన, తత్ = అత్రాళ్లయొక్క, చిర = తడవైన, కృష్టిన్ = చేఁదుటచేతను, కనునట్టి = పొందునట్టి, శైత్యములు = చల్లఁదనములు, అత్తతిన్ = అగ్రీష్మమున, నూతులందు = చేఁదుడుబావులయందు, అలరించెన్ = సంతోషపెట్టెను.

తా. శ్లో. కూపోదకంవటచ్ఛాయాతాంబూలంతరుణీకుచా । శీతకాలేభవేదుష్ణముష్ణకాలేతుశీతలమను న్యాయముంబట్టి బావులయందు నీళ్లుచేఁదెడితరుణులయొక్కకుచములు తల్లిరొయిమీఁదఁగనాకుచశైత్యములు పాటిగువ్వలై సూర్యకిరణములకువెఱచి పాతాళముదూఱికొనియున్న శైత్యమును రేపఁగాఁ జనుదెంచెగాని యీముళ్లువేసినత్రాళ్లతెచ్చునాయనునట్లు నూతులయందున్న నీళ్లచల్లఁదనమట్టి గ్రీష్మమునందు మిగులసంతోషముపెట్టెనని తాత్పర్యము, నూతులలోనీళ్లు పాతాళమునంటెనని భావము, ౫౭.

మ. ఘనిదానోగ్రనిదాఘవైఖరినయూష్మన్మల్లికల్యామినీ,
కనదానీలకచాగ్రవక్త్రకసాతియల్లాఁబొష్ఠఁగాఁబొటల,

ఘనతం దేనియసోనఁ గూర్చ నదియా♦గా నాళి యున్నిర్విషం,
బును దోఁ బుట్టువు లయ్యు వేర్పడఁ గుణం♦బుల్ చూపఁగాఁ జూడ మే. ౫౮

టీక. స్వ = తమకు, నిదాన = కారణమైనట్టి, నిదాఘవైఖరిన = వేసవివలెనె, మల్లికల్ = మల్లెలు, ఊష్మన్ = వేఁడిమిచేత, కామినీ = స్త్రీలయొక్క, కనత్ = ఒప్పుచున్నట్టి, ఆనీల = నవకముననల్లనైన, కచాగ్రపఙ్క్తుల్ = తలవెండ్రుకలకొసలను, నెఱియల్గా = పగిలిబ్రద్దలగునట్లుగా, పాపఁగాన్ = పాయఁజేయఁగా, పాటలల్ = కలిగొట్టుపుష్పములు, (పుష్పేక్లీబేపి పాటలాయనియమరుఁడు) ఘనతన్ = అధికమగునట్లుగా, తేనియసోనన్ = మధుస్రవముచేతను, కూర్చన్ = ఆకచాగ్రపుబ్రద్దలనుమరలఁగలిసియునట్లు చేయును. అదియాఁగా = ఒకఋతువునందుఁబుట్టినద్వివిధంబులగుపుష్పములకు విరుద్ధముగనుండురెండుగుణము లెట్లుగల్గుననఁగాయుక్తంబే, నాళియు = విషము, నిర్విషంబును = అమృతమును, తోఁబుట్టువులయ్యున్, గుణంబులు = నైజగుణంబులను, వేర్పడన్ = వేఱుపడునట్లు, చూపఁగా = అగపఱుపఁగను, చూడమె = చూడలేదా (చూచితిమనుట).

తా. గ్రీష్మమున మల్లెలు పాదిరిపువ్వులును మెండుగనుండుటవలన మల్లెలుధరియింపఁగా నవివిచ్చుటవలన స్త్రీలతలవెండ్రుకలువరుసలుగనియు పాదిరిపువ్వులధరియింపఁగా నందున్నతేనెసోనచేత విచ్చియున్నకచాగ్రములు మరలఁగదిసియుండుననియు-తోఁబుట్టువులైనను భిన్నగుణంబులుగల్గియున్న విషామృతములంబలెమల్లెలు పాదిరిపువ్వులునొకఋతువునందుఁబుట్టినవైనను భిన్నగుణంబులను ప్రకాశింపఁజేయుచుండెనని, తాత్పర్యము.

శా. తారుణ్యాతిగచూతనూత్నఫలయు♦క్తైలాభిసారస్వన,
ద్ధారాఘూపితశుష్యదంబుహృతమా♦త్స్యచ్ఛేదపాకోద్గతో,
ద్గారంపుంగనరార్చుభోగులకుసం♦ధ్యావేళలం గేళికాం,
తారాభ్యంతరవాలుకాస్థితహిమాం♦తర్నారికేళాంబువుల్. ౫౯

టీ. కేళికాంతార = శృంగారవనములయొక్క, అభ్యంతర = నడుమనున్న, వాలుకా = ఇసుకయందు, స్థిత = ఉంచఁబడిన, హిమాంతః = అంతశ్శీతముగల, నారికేళాంబువుల్ = టెంకాయనీళ్లు, తారుణ్య = తరుణత్వమును, అతిగ = అతిక్రమించిన, చూత = మామిడిచెట్లయొక్క, నూత్నఫల = దోరపండ్లతోడను, యుక్ = కూడినట్టి, తైల = నూనెయొక్క, అభిసార = తిరుగఁబోఁతచేతను, స్వనత్ = ధ్వనించుచున్నట్టి, ధారా = అవిచ్ఛిన్నముగ, ధూపిత = ధూగపఁబడినట్టి, శుష్యత్ = శోషించుచున్న, అంబు = ఉదకముగల ప్రదేశమువలన, హృత = తేఁబడినట్టి, మాత్స్య

=మత్స్యసంబంధియగు, ఛేద = శకలములయొక్క, పాక = జీర్ణకాలమందు, ఉద్గత= ఊర్ధ్వముగ వెల్లివచ్చునట్టి. ఉద్గారంబు = త్రేఁపులయొక్క, కనరు = కనరువాసనను. భోగులకు = భోగానుభవశాలులకు, సంధ్యావేళలన్ = సంధ్యాకాలములందు, అర్చున్ = అణఁచును.

తా.—అనఁగా నా గ్రీష్మకాలమందు భోగపరులయిన పురుషులు మామిడికాయలతో నంజు చన్నవారై వలనగమ్మునునట్లు దిరుగఁబోసినచేఁపలతో భోజనముఁజేసిన త్రేఁపులు విడువఁగనది కనరుగనుండును గావనా కనరుమట్టుపడుటకుఁగా శృంగారవనములయందలి యిసుకలో స్థాపించియుండుటవలన నతిశీతలములగు టెంకాయనీళ్లను సంధ్యాకాలములయందుఁ ద్రాగుచుందురని తాత్పర్యము

కం. గ్రామగ్రామంబున నొక, సామంతునకిడిన చలువ చప్పరములు త,
త్పైచ్ఛమేదినిఁ గుంపటిలోఁ, దామరలుం బోలె నట్టితఱి నొప్పారెన్. ౭౦.

టీ. గ్రామగ్రామంబునన్ = ఊరూరనున్న, ఒకసామంతునకున్ = ఒక్కొక్క దొరకుఁగా, ఇడిన = దట్టముగ వేసిన, చలువచప్పరములు = చలువపందిళ్లు, తపైచ్ఛ= మిండై, (తపైచ్ఛయను పాఠమందుఁ డనియుఁ జేయునవి యైయనియర్థము) అట్టితఱిన్ = ఆవేసవియందు, మేదినిన్ = పృథివియందు, కుంపటిలోన్ = కుంపటిలోనున్న, తామరలుం బోలె = కమలములవలెను, ఒప్పారెన్ = ఒప్పెను

తా.—ప్రతిగ్రామమునందుండెడి దొరలకుఁగా వేసినయనేకములగు చలువపందిళ్లు మిండై యా గ్రీష్మకాలమందు భూమిలోఁ గుంపటియందుఁ దామరలు మొలిచినరీతి నుండెనని తాత్పర్యము.

తే. గీ. తోటఁ బగలుండి మల్లెలు దుఱిమి కావు, లమర మాపైన నిక్షుయంత్రములకొయ్యఁ,
జేరు ప్రజ నొప్పె భావివృష్టికి నిగ్రుడ్లు, తో మధురిమేచ్ఛ డిగు నెఱ్ఱచీమలనఁగ. ౭౧.

టీ. తోటన్ = తోటయందు, పగలుండి = పగలెల్లనుండి, మాపైన = ప్రొద్దుగ్రుంకఁగా, మల్లెలు దుఱిమి = మల్లెపువ్వులు శిరంబున ముడుచుకొని, కావులమరన్ = చంద్రకావివస్త్రములు ధరియించి, ఇక్షుయంత్రములకు = చెఱకుగానిగెలసమీపమునకు, ఒయ్యఁ జేరు = మెల్లఁగఁ బ్రవేశించుచున్న, ప్రజ = జనము, భావివృష్టికిన్ = ముందు గాఁగలవర్షమునకు, గ్రుడ్లతోన్ = గ్రుడ్లు పొదివికొని, మధురిమేచ్ఛన్ = తీపుమీఁది కాంక్షచేతను, డిగు = దిగివచ్చునట్టి, ఎఱ్ఱచీమలనఁగ = రక్తపిపీలికలనునట్లు, ఒప్పెన్ = ఒప్పెను.

తా.—పగలెల్లను తోటలలోనుండి యస్తమింపఁగ మల్లెపువ్వులను శిరంబుల ధరియించుకొని చెఱకుగానిగెలసమీపములను మెల్లఁగఁ జేరుచున్న ప్రజలు జాడఁగా ముందువ

ర్షమునకు సూచకంబై గ్రుడ్డుతోఁగూడఁదీపువస్తువులమీఁదియాశచే లేదిగి వచ్చుచున్న యెఱ్ఱ చీమలోయనునటుల నొప్పుచుండెనని తాత్పర్యము.

—* ఈపద్యముతో గ్రీష్మవర్ణనసమాప్తము- ఇఁకఁగథాసరణి. *—

క. అప్పెను వేసవివిభవము, విప్పుగఁదన్నగరనికట♦వృషగిరిహరికిం,
దెప్పతిరునాళ్ళరాముద, మొప్పన్వరదేశవిప్రుఁ♦డొక్కఁడు భక్తిన్. ౬౨.

టీ. అప్పెను వేసవిన్ = ఆగ్రీష్మమందు, విభవము = వైభవము, విప్పుగన్ = విస్తరింపఁగాను, తన్నగర = ఆమధురయొక్క, నికట = సమీపమందలి, వృషగిరిహరికిన్ = అళఘరియందుండు సుందరబాహుస్వామికి, తెప్పతిరునాళ్ల = ఉడుపోత్సవము, రాన్ = రాఁగా, భక్తిన్ = ప్రియభక్తిచేతను, ముదమొప్పన్ = సంతసముపొల్పు నటుల, ఒక్కఁడు = ఏకాకియైనట్టి, పరదేశవిప్రుఁడు = పరదేశమందలి బ్రాహ్మణుఁడు.

తా.—సుగమము.

కం. సేవించిపోవుతతిమధు, రావిభవముఁజూడవచ్చి♦శ్రాంతి మెయిన్మా,
పావైఘనీటఁగృతసం, ధ్యావిధియైనృపపురోహి♦తావాసమునన్. ౬౩.

టీ. సేవించి = భజించి, పోవుతఱిన్ = పోవునపుడు, మధురావిభవము = మధురాపట్టణపుశృంగారమును, చూడవచ్చి = కన్గొనుటకువచ్చి, శ్రాంతిమెయిన్ = బడలికచేతను, మాపు = సాయంకాలమందు, ఆవైఘనీటన్ = ప్రసిద్ధంబులగునావైఘయమనదితీర్థంబులందు, కృత = చేయఁబడిన, సంధ్యావిధియై = సంధ్యానుష్ఠానముగలవాఁడై, నృపపురోహితావాసమునన్ = రాజపురోహితునిగృహముఁజేరియుండు.

తా.— ఆవిప్రుండు సుందరబాహుస్వామిని సేవించిపోవు సమయమున నామధురాపుర వైభవంబులఁజూడ నిచ్చగలవాఁడైవచ్చి బడలి సాయంకాలమందా ప్రసిద్ధంబులగు వైఘయను నదీతీర్థంబులయందు సంధ్యావందనాద్యనుష్ఠానములంబరి సమాప్తినొందించి రాజ పురోహితునియొక్కయిల్లుసొచ్చెనని యభిప్రాయము.

సీ. పరిపక్వసురభిరం♦భాఫలంబులతోడఁ♦దలమెక్కుపనసపెండొలలతోడ,
ఘృతపిండనిభకర్క♦రీఖండములతోడఁ♦బలుదెఱంగులమావిపండ్లతోడ,
గోస్తనీమృదుగుళు♦చ్ఛస్తోమములతోడఁ♦గప్పుదేరినవడ♦పప్పుతోడ,
సుమధురస్థూలదా♦డిమబీజములతోడఁ♦దనరారురసదాడి♦గనెలతోడఁ,
బానకంబితిధులకిడ్డఁ♦దానుగ్రోలి, యర్చనావత్తచందన♦చర్చఁదేలి,
విరులువిగఁదాల్చికర్పూర♦వీటిజబురు♦గొట్టుచుద్విజుండు వెన్నెల♦బట్టుగాయ. ౬౪.

టీక, పరిపక్వ = క్రమముగఁబక్వమై, సురభి = పరిమళించుచున్న, రంభాఫలంబులతోడ = అరఁటిపండ్లతోడ, తలమెక్కు = బలిసియున్న, పనసపెండొలలతోడ=

పనసతొనలతోడను, ఘృతపిండనిభ = నేతిముద్దలవంటి. కర్కారీఖండములతోడ = దోస పండ్ల బద్దలతోడను. (ని॥ ఉర్వారుః కర్కారీ స్త్రియామని యమరము) పలుదెఱంగుల = అనేకవిధములయిన, మావిండ్లతోడ = చూతఫలంబులతోడను, గోస్తనీ = ద్రాక్షయొక్క॥ (ని. మృద్వీకా గోస్తనీ ద్రాక్షాయని యమరము.) మృదు = కోమలంబులగు, గుళుచ్ఛ = గుత్తులయొక్క, స్తోమంబులతోడ = సమూహములతోడను, కప్పుదేరినవడపప్పుతోడ = పొట్టువదలినవడపప్పుతోడను, సుమధుర = మిక్కిలితియ్యందిపై, స్థూల = గొప్పలైయున్న, దాడిమబీజములతోడ = దానిమ్మవిత్తనములతోను, తనరారు = పొడవైన, (తనుపారు అను పాఠమునందు ప్రీతికరములైనయని యర్థము) రసదాడిగనెలతోడ = రసదాడిచెఱకుగడలతుంటలతోను, పానకంబు = పానకమును, అతిథులకు = అతిథులైన బ్రాహ్మణులకు, ఇడగ = ఆయింటిబ్రాహ్మణుండీయఁగా, తాను, గ్రోలి = పుచ్చుకొని, అర్చనా = పూజాకాలమందు, దత్త = ఇయ్యఁబడిన, చందన = శ్రీగంధముయొక్క, చర్చన్ = పూఁతచేత, తేలి = నిండి, విరులు = పుష్పంబులు, సిగన్ = శిఖయందు, తాల్చి = ధరియించి, కర్పూరవీటిజబురుగొట్టుచున్ = కర్పూరమతిశయించినవిడియముచేజబురుకొట్టుకొనుచు, వెన్నెలబెట్టుగాయ - మంచివెన్నెలగాయఁగా, ద్విజుఁడు = అపరదేశబ్రాహ్మణుండు.

తా.—పండిన యరఁటిపండ్లు బెద్దవిగానున్న పనసతొనలు దోసపండ్ల బద్దల నేకవిధములైన మామిడిపండ్లు ద్రాక్షగుత్తులు - తీపుగలదాడిమవిత్తులు - పొడవైనచెఱకుతుంటలు - వీనితోనాయింటిబ్రాహ్మణుండతిథులకుఁ బానకంబిచ్చునెడఁ దానును పానమునేసి తొలుతనిచ్చియున్న చందనమలఁదికొని పుష్పములశిగయందు ధరియించి కర్పూరయుక్తంబైనతాంబూలము వేయుచు మంచివెన్నెలయందాపరదేశబ్రాహ్మణుండుండగానని తాత్పర్యము.

తే. గీ. మాత్రసంచితలాడగా మార్గవేది, నొక్కఁడార్యలుగీతలొం డొకఁడుదాను,
భాషితంబులుగాఁ దోడి బ్రాహ్మణౌఘ, ముబుసుపోకకుఁ జదువఁ బఱున్న వేళ. ౭౫.

టీక. మాత్రసంచి = అసిమిసంచిని, తలాడగా = తలకడదిండ్లుగాఁబెట్టుకొని, మార్గవేదిన్ = త్రోవయందున్నయరుగుమీఁదను, ఒక్కఁడు = ఒకబ్రాహ్మణుండు, ఆర్యలు = ఆర్యావృత్తములను, ఒండొకఁడు = మఱియొక్కఁడు, గీతలు = గీతలనువృత్తములను, తాన్ = తాను, సుభాషితంబులుగా = నీతిశ్లోకంబులుగా, తోడిబ్రాహ్మణౌఘము = తనతోఁబరుండియున్నబ్రాహ్మణులు, ఉబుసుపోకకు = ప్రొద్దుపుచ్చుకొనుటకు, చదువన్ = పఠింపంగా, పఱున్నవేళన్ = పండియున్నసమయమున.

తా. —అసిమిసంచిఁదలకడ బిళ్ళంజేసికొని మార్గములోనున్న తిన్నెమీఁద వేశ్యా ద్వారాభ్యావృత్తములు మఱియొకందు గీతలును దానునీతిశ్లోకములుగాఁ దనతోఁగూడను న్న బ్రాహ్మణులు బ్రొద్దుఁబుచ్చుకొనుటకు పఠింపఁగాఁ బరుండియుండఁగానని తా.

సీ. పన్నీటితోఁ గదంబముఁ జేసిపూసిన, మృగనాభి పసరాచనగరు దెలుపఁ,
పాటలానిలములార్వఁగఁ దపారపుఁజుంగు,లలరుఁదావికిమూఁగునళులఁ జోఁప,
గర్ణడోలామౌక్తికచ్ఛాయలెగఁబ్రాఁకు, నురుహారరుచులఁ బ్రస్తరికిఁదన్న,
శశికాంతిచెంగావిదసిలిమించినకేలి, స్వర్ణత్సరువువాఁడివాలు మెఱయ,
మెలఁతయడపముఁ దేఁజరన్మేరువనఁగ, దలవరులుగొందఱొల్లసిముందఱఁజనంగ,
నర్థిఁ రథ్యాంతరాంతఃపురాంతరమున, భోగినీసంగతికి రాజు వోవుచుండి. ౬౬.

టీక. పన్నీటితోన్ = పన్నీటితోడను, కదంబముఁ జేసి, పరిమళద్రవ్యములన న్నిటిఁగలిపి, పూసిన = అలఁదినట్టి, మృగనాభి = కస్తూరియొక్క, పస = మేలిమి, రాచనగరు = రాజగృహమును, తెలుపన్ = కనుపఱుపఁగా, (కస్తూరిరాజులకుఁద క్క సామాన్యులకుఁజిక్కదనుట) పాటల = కలిగొట్టుపువ్వులయొక్క, అనిలములు = గాడ్పులు, ఆర్వఁగన్ = విసరఁగా, తసారపుఁజుంగులు = తలనుజుట్టియున్న వస్త్రపుఁ జుంగులు, అలరుఁదావికి = పుష్పవాసనలకు, మూఁగు = చుట్టుకొనునట్టి, అళులన్ = తుమ్మెదలను, జోఁపన్ = తోలఁగా, కర్ణ = శ్రోత్రములందు, డోలా = కదలుచున్న, మౌక్తిక = ముత్యములయొక్క, ఛాయలు = కాంతులు, ఎగఁబ్రాఁకు = పైకెగయు నట్టి, ఉరు = అధికమైన, హార = ముత్యాలదండలయొక్క, రుచులన్ = కాంతు లను, ప్రస్తరికి = వెనుకకు, తన్నన్ = కాలఁద్రోయఁగా, శశి = చంద్రునియొక్క, కాంతి = కాంతివంటికాంతిగల, చెంగావిదసిలి = చెంగావిదుమాలు, మించిన = మీ తిన, కేలి = చేతఁబట్టిన, స్వర్ణత్సరువు = బంగారుపరుఁజుగల, వాఁడివాలు, తీక్ష్ణఖడ్గ ము, మెఱయన్ = ప్రకాశింపఁగా, మెలఁత = ఒకస్త్రీ, అడపముఁ దేన్ = అడ పంబుఁ దేఁగా, చరన్మేరువు = సంచరించు మేరుపర్వతము, అనఁగన్ = అనునట్టుల, తల వరులు = తలారులు, కొందఱు = కాపుగానుండుకొందఱు, ఒల్లసి = కినిపెట్టి, ముందఱ = పురోభాగమునందు, చనఁగన్ = పోఁగా, అర్థిన్ = ఆసక్తిచేతను, రథ్యాంతరాం తఃపురాంతరమునకుఁ దక్కగ, [illegible] ఆంతమున, రథ్యాంతర = మార్గమధ్యమందలి, అంతఃపురాంతరమున = రెండవ యంతఃపురమువలెనున్న గృహమునందు, భోగినీసంగతికి = భోగస్త్రీనిభోగించుటకొఱకు, రాజు = పాండ్యుఁడు, పోవుచుండి = వెళ్లుచుండి

తా. —సులభము.

చ. వినియొ నెలల్చతుర్దవయిని వృష్టిదినాలికిరాత్రికైదివం,
బునజరకైవయుష్సనను బూని ఫలంబునకిప్పుడుద్యమం,

బను వుగఁ జేయఁగావలయు ♦ నంచుఁ బురోహితధర్మ మాత్మ గీ,
ల్కొనఁ నలవిప్రుఁ డా ద్విజుల ♦ లోనసుభాషితము న్పఠింపఁగన్. ౯౭.

టీక. వృష్టిదినాలికి = వర్షాకాలమైన నాలుగుమాసములకు, నెలల్ చతుర్ద్వయిని = తక్కిన యెనిమిది నెలలయందును, రాత్రికి, దివంబునన్ = పవటియందును, జరకైవయస్సునను, పూని = ఆరంభించి, పరంబునకు = పరలోకమునకు, ఇప్పుడు = ఈశరీరమందే, ఉద్యమంబు = ప్రయత్నము, అనువుగన్ = లెస్సగా, చేయఁగావలయున్ = చేయవలయును, అంచున్ = అనుచును, పురోహితధర్మము, పురః = ముందటికి, హిత = క్షేమకరంబైన, ధర్మము = న్యాయము, ఆత్మన్ = బుద్ధియందు, కీల్కొనన్ = నాటుకొనునట్లుగ, అలవిప్రుఁడు = ఆబ్రాహ్మణుఁడు, ద్విజులలోన్ = విప్రులలోపలను, సుభాషితమున్ = నీతిప్రతిపాదకశ్లోకములను, పఠింపన్ = చదువఁగా, వినియెన్ = విన్నవాఁడాయెను.

తా.—వర్షార్థమష్టౌ ప్రయతేత మాసాన్నిశార్థమర్థం దివసేయతేత | వార్ధక్యహేతోర్వయసా నవేనపరత్ర హేతో రిహజన్మనాచ ॥ అను శ్లోకార్థము చెప్పునది వర్షాకాలమైన నాలుగుమాసములకు వలయువస్తుసామగ్రులను మిగతయగు నెనిమిది మాసములయందును రాత్రికిఁ బవటియందును జరకు వయస్సునందును పరలోకమునకు వర్తమాన శరీరమందును చేయందగిన ప్రయత్నములను బాగుగఁ జేయవలయునని ముందటికి హితమగు న్యాయము నెఱుంగునట్లుగ నాబ్రాహ్మణుండు విప్రులనడుమనుండి నీతిశ్లోకములఁ బఠింపఁగా నుపాండ్యరాజు విని యెనని యభిప్రాయము.

నవ్యం విని తద్గ్రంథార్థము నె, మ్మనమున నూహించి తెలిసి ♦ మాన్పడి కడను,
ర్నా దన మోసమునకు భయపడి, జనపతి యటుచనక నిలిచి ♦ సంతాపమునన్. ౯౮.

టీక. విని, తద్గ్రంథార్థమున్ = అశ్లోకములయభిప్రాయమును, నెమ్మనమునన్ = నిండుమనస్సునందు, ఊహించి = ఆలోచించి, తెలిసి = ఎఱింగి, మాన్పడి = స్తబ్ధచిత్తుఁడై, కడను = చివఱను, తన = తనయొక్క, మోసమునకు, ప్రమాదమునకు, భయపడి = భీతిల్లి, జనపతి = రాజు, అటుచనక = భోగినీగృహమునకుఁబోక, సంతాపమునన్ = పరితాపము చేత, నిలిచి, పైపద్యములోక్రియ.

ఉ. ఎక్కడి రాజ్యవైభవము ♦ లెక్కడి భోగము లేటిసంభ్రమం,
బక్కట బుద్బుదప్రతిమ ♦ మైనశరీరము నమ్మి మోహతుం,
జిక్కఁగణింపకుంటి రయఁగ ♦ సంధులనిల్వ యిగాలు చేతిబల్,
ద్రొక్కు నన్నను ప్రభృతు ♦ లున్ దుదరో పఱకుండఁ జేర్చిరే. ౯౯

టీక. ఎక్కడిరాజ్యవైభవములు = రాజ్యమేమి శాశ్వతము, ఎక్కడిభోగములు = తనభోగమేమినిత్యము, ఏటిసంభ్రమంబు = ఎక్కడిసంతోషము, అక్కట = కట కట, బుద్బుదప్రతిమమైన = నీరుబుగ్గతోడఁగుల్యంబైన, శరీరమునమ్మి = దేహమునిత్యమనినమ్మి, మోక్షపుంజక్కి = మోక్షమార్గమును, గణింపక = లక్ష్యపెట్టక, ఉంటిఁ = ఉన్నవాఁడనైతిని. యుగసంధులన్ = ఒక్కొకయుగము ముగియువఱకును, నిల్చియున్ = ఉండియును, కాలుచేతి = యమునిచేతనైన, బల్ద్రొక్కులన్ = విశేషమగుత్రొక్కుళ్లచేత, అమ్మనుప్రభృతులున్ = ప్రసిద్ధులైనమన్వాదులును, తుదన్ = శరీరత్యాగకాలమందు, రూపఱక = రూపునష్టముగాకుండఁగ, ఉండనేర్చిరే = ఉండఁగలిగిరా.

తా.—ఆవిప్రుండుసెప్పిననీతిశ్లోకముల యభిప్రాయమును గ్రహించిమనంబునమిగులవిచారించి స్తబ్ధచిత్తుఁడై చివరకుఁదనకుంగలిగెడు ప్రమాదమునకు భీతిల్లియప్పాండ్యరాజుభోగినీగృహమునకుఁ బోకమార్గమందేనిలిచి పరితాపముచేత రాజ్యమేమి శాశ్వతము భోగమేమి నిత్యమెక్కడి సంతోషముకటకటా నీరుబుగ్గతోసమానంబగు నీశరీరమునమ్మి మోక్షమార్గము విచారింపనైతినొక్కొక యుగవత్సరములు భూమినిఁ బాలించినమన్వాదులుదమతమశరీరములను నిల్పఁగలిగిరాలేదుగదాయని విచారయుక్తుఁడై యుండెననితా.

కం. ఉన్నట్లయుండఁగాదరి, కిన్నరులనునావచేర్చు క్రియవెసఁదాఁబో,
కున్నట్లయుండికాలం, బున్నరులకువయసుఁబుచ్చి మోసముఁదెచ్చున్. ౭౦.

టీక. ఉన్నట్లయుండఁగా = ఉన్నదానింబలెనుండి, నావ = ఓడ ॥ సూ ॥ స్తోవావౌరైనావోయను సూత్రముచేత నౌశబ్దమునకీరూపంబువచ్చెను, దరికిన్ = తీరమునకు, నరులను = మనుష్యులను, చేర్చుక్రియన్ = చేర్చులాగున, తాన్ = తాను, వెసఁబోకున్నట్లయుండి = వేగిరముజరిగిపోకున్నట్లుగానుండి. కాలంబు = కాలము, నరులకు = మనుష్యులకు, వయసుఁబుచ్చి = ఆయువుఁబోఁగొట్టి ॥ సూ ॥ సాంతోదపయః ప్రభృతెస్లొస్నపోన్యే షాంచయను సూత్రము చేతద్విత్వాభావము, మోసముఁ దెచ్చున్ = మోసపుచ్చును.

తా.— నావయెక్కఁగానచటనే యున్నట్టుగనుపడుచుదరికి మనుష్యులఁజేర్చురీతిఁగాలంబునునరులవయసు దెలియకుండునట్లుగఁజేసి పోఁగొట్టికడపటికి మోసముఁదెచ్చునని తాత్పర్యము.

చ. సగరునలుంబురూరవుఁద్రి శంకునుతుమ్బురుకుత్సుఁగాతఁడౌ వీ,
ర్యగయుఁబృథుంభగీరథును హారిశ్చశిబింభరతుందిలీపునిన్.
భృగుకులుయరావనాశ్వశశ బిందుననంగునినంబరీషుఁబూ,
రుఁగురునిరంతిరాఘవుమ రుత్తునిఁగాలముగోలుపుచ్చదే. ౭౧.

టీక. షట్చక్రవర్తులగు, సగరుని-నలుని-పురూరవుని - త్రిశంకునిసుతుఁడగుహరిశ్చంద్రుని-పురుకుత్సుని-కార్తవీర్యుని-షోడశమహారాజులగు,గయుని-పృథుని-భగీరథుని-మహోత్రుని శిబిని-భరతుని-దిలీపుని-పరశురాముని-యౌవనాశ్వుని. (అనఁగామాంధాత) శశిబిందుని-అనంగునిన్-అంబరీషుని-పూరుని-కురుమహారాజును-రంతిదేవుని-రామునిన్ - మరుత్తుని, వీరలను, కాలముగోలుపుచ్చదే = కాలము మోసపుచ్చలేదా.

తా. సుగమము.

కం. కానఁదటిచ్చలమగు రా, జ్యానందము మఱిగి యింద్రి♦యారాముఁడనై,
పోనింతనుండి పరలో, కానందంబునకె యత్న♦మాపాదింతున్. ౭౨.

టీక. కానన్ = కావునను, తటిచ్చలమగు = మెఱుపువలెననిత్యమైన, రాజ్యానందము = రాజ్యసుఖము, మఱిగి = తగిలి, ఇంద్రియారాముఁడనై = ఇంద్రియపరవశుడనై, పోన్ = పోను, ఇంతనుండి = ఇదిమొదలు, పరలోకానందంబునకే = పరలోకసుఖమునకె, యత్నము = ప్రయత్నమును, ఆపాదింతున్ = ఒనరింతును.

తా. కాలముగడపటఁ జక్రవర్తులు మొదలగు వారినింగూడ మోసపుచ్చినదిగావున మెఱుపువలె నతిచంచలంబగు రాజ్యానందమపేక్షించి యింద్రియపరవశుఁడనైయుండక యిదిమొదలఁ పరలోకసుఖమునకు వలయు ప్రయత్న మొనరించెదనని తాత్పర్యము.

కం. వర్గత్రయపరత ముహు, స్స్వర్గక్ష్మామధ్యమాధ్వ♦జాంఘాలికతా,
దుర్గతియునొల్లమఱియప, వర్గదుఁడే వేల్పెఱింగి♦వాని భజింతున్. ౭౩.

టీక. వర్గత్రయపరతన్ = ధర్మార్థకామాసక్తిచేతను, ముహుః = పలుమాఱును, స్వర్గ = త్రివిష్టపముయొక్క, క్ష్మా = భూమియొక్క, మధ్యమ = మధ్యప్రదేశమందలి, అధ్వ = మార్గమునందు, జాంఘాలికతా = సత్వరగమనమనియెడు, దుర్గతిన్ = నరకమును, (నిరయోదుర్గతిస్త్రియామనియమరుఁడు) ఒల్లన్ = ఇష్టపడను, మఱి = మఱియేమన్నను, అపవర్గదుఁడు = మోక్షమునిచ్చువాఁడు, ఏవేల్పు = ఏదైవమో, ఎఱింగి = తెలిసి, వానిన్ = ఆదైవమును, భజింతున్ = సేవింతును.

తా. ధర్మార్థకామంబులనియెడి పురుషార్థత్రయాసక్తిచేతఁ బలుమాఱు స్వర్గమునుండి భూమికిభూమి నుండి స్వర్గమునకునుంబోవుచుండుమార్గమునందు సత్వరగమనమను నరకమొల్లను మఱియేమన్న నపవర్గప్రదుండగునట్టివాఁ డెవ్వఁడో వాని నెఱింగి సేవించుచున్నాఁడనని తాత్పర్యము.

కం. అనితలఁచి మెచ్చి యుర్వీ, పురినదుర్వీటీకరండ♦మున ముద్రితమై,
యునిచిన యొకముదుసార, తునిచేరప్పించి నగరు♦సొచ్చి నిశిచనన్. ౭౪.

టీక. అనితలఁచి = అట్లనియూహించి, మెచ్చి = తనకిట్టిజ్ఞానముఁ గలుగఁజేసినందుకై సంతసిల్లి, అవ్విప్రునకు = ఆబ్రాహ్మణునికి, వీటికరండమునన్ = వక్కలాకుల బరిణెయందు, (గదుఃకరండో గ్గుడో వరండశ్చకిణో ఘుణయని పుంలింగశేషమునందమరము) ముద్రితమై = ముద్రింపఁబడి, ఉనిచిన = ఉంచబడియున్న, ఒకముడుపు = వరాలముల్లెయొకటి, ఆగతూనిచే = ఆముల్లెపాలించువానిచేతన్, ఇప్పించి, నగరు = రాజగృహమును, చొచ్చి = ప్రవేశించి, నిశి = రాత్రి. చనన్ = వెళ్లఁగా.

తా. ఆపాండ్యరాజు పూర్వోక్తప్రకారంబుగనూహించి తనకిట్టిజ్ఞానముఁగలుగఁజేసిన యవ్విప్రువిషయమై యానందమొంది యతనికిఁ దాంబూలకరండంబున ముద్రింపఁబడియుంచియున్న వరాలముడుపొకటి యాధనరక్షకునిచేతనిప్పించి తాను నగరుప్రవేశించి తెల్లవారినపిమ్మటనని తాత్పర్యము. ౭౪.

కం. కొలువై బహుసమయంబుల, మెలఁగెడుకోవిదులఁ జూచి మీమాంశాస్త్రం,
బులలో నెవ్వఁడు మోక్షం, బెలయించునొ చూచి నిశ్చయింపుఁడటంచున్ ౭౫.

టీక. కొలువై = ఆస్థానమందుఁ గూర్చుండి, బహు = అనేకవిధంబులగు, సమయంబులన్ = సిద్ధాంతములయందు, (ని, సమయాశ్శపథాచార కాలసిద్ధాంతసంవిదయని నిఘంటువు.) మెలఁగెడు = సమర్థులైన, కోవిదులన్ = పండితులను, చూచి = వీక్షించి, మీమాంశాస్త్రంబులలోన్, ఎవ్వఁడు, మోక్షంబు = అపవర్గమును, ఎలయించునో = పొందించునో, చూచినిశ్చయింపుఁడు = పరిశీలనఁజేసి నిర్ణయింపుఁడు, అటంచున్ = ఆలాగని, వైపద్యములోక్రియ.

గీ. వాదమొనరించి గెలిచి తత్వంబు దెలుపు, వానికని బీరపువ్వులఁ బోనిటంక,
సాలవాటులు నించి యాస్థానిఁ గట్టఁ, గాలసర్పముగతి వ్రేలు జాలెఁ జూచి. ౭౬.

టీక. వాదమొనరించి = ప్రసంగము సేసి, గెలిచి = జయముఁ బొంది, తత్త్వంబుఁ దెలుపువానికని = ఇదియ సత్యంబని కనుపఱుచువానికనుచు, బీరపువ్వులఁ బోని = బీరపువ్వులవంటి, టంకసాలవాటులు = క్రొత్తముద్రలు వేసినమాడలను, నించి = నిండఁ బోసి, ఆస్థానిన్ = సభయందు (ని॥ ఆస్థానీక్లిబమాస్థానమనియమరము) కట్టన్ = కట్టఁగా, కాలసర్పముగతిన్ = కృష్ణసర్పమువలె, వ్రేలుజాలెన్ = వ్రేలాడుచున్న జాలెను, చూచి = వీక్షించి.

తా. ఆస్థానమందాపాండ్యరాజు గూర్చుండియున్నవాఁడై యనేకశాస్త్రసిద్ధాంతములు దెలిసికొనియున్న పండితోత్తములరావించి వారినింజూచి మీమాంశాస్త్రములయందుఁ జక్కఁగా విచారించి మోక్షప్రదుండైన దేవుఁ డెవ్వఁడో తెలుపఁగింపవలయుననుచు బ్రసంగమొనరించి గెలిచి తత్త్వముం దెలిపినవానికి నిప్పించెదనని మాడలచే నింపఁబడిన జాలెను దెప్పించి సభయందుఁ గట్టింప నావరాలజాలెనుజూచి యప్పండితులని, తాత్పర్యము.

కం. హరునొకఁడనను మనొకఁడన, హరినొకఁడన శిఖినొకఁడన♦నర్కునొకఁడన,
న్గరిముఖునొకఁడన రజనీ, శ్వరునొకఁడన నజునొకఁడన♦వాదైనతతిన్. ౨౬.

టీక. ఒకఁడు = ఒకవిద్వాంసుఁడు, హరునన్ = శివుఁడు మోక్షప్రదుఁడనఁగా, ఒకఁడు = మఱియొకఁడు, ఉమనన్ = శక్తి మోక్షప్రదాత్రియనఁగా, ఒకఁడు = ఒక్కఁడు, హరిన్ = ఇంద్రుని, ఒకఁడు = ఒక్కఁడు, శిఖిన్ = అగ్నిని, ఒకఁడు = ఇంకొకఁడు, అర్కున్ = సూర్యుని, ఒకఁడు కరిముఖున్ = విఘ్నేశ్వరుని, ఒకఁడు, అజున్ = బ్రహ్మను, వీరలు మోక్షప్రదాతలనన్, వాదు = ప్రసంగము, ఐనతతిన్ = ఐనసమయమునందు.

తా. సుగమము.

తే-గీ. విల్లిపుత్తూరిలోనల్ల♦విష్ణుచిత్తుఁ, డతులతులసీసుగంధమా♦ల్యమును మూల,
మంత్రమున నర్కు సేయుచో♦మన్ననారు, దారమధురోక్తి నిట్లని♦యానతిచ్చె. ౨౭.

టీక. విల్లిపుత్తూరిలోన్ = శ్రీవిల్లిపుత్తూరియందు, అల్లవిష్ణుచిత్తుఁడు = ఆవిష్ణుచిత్తుండు, అతుల = శ్రేష్ఠమైన, తులసీ = తులసిచేతను, సుగంధ = పరిమళించుచున్న, మాల్యమును = పుష్పమాలికను, మూలమంత్రమునన్ = శ్రీమదష్టాక్షరియను మహామంత్రముచేత, అర్కు సేయుచోన్ = వక్షస్స్థలమందు సమర్పింపఁగా, మన్ననారు = మన్నారుస్వామి, ఉదార = గంభీరమైన, మధురోక్తిన్ = తియ్యనిమాటలచేతను, ఇట్లని = ఇవ్విధముగ, ఆనతిచ్చెన్ = సెలవిచ్చెను,

తా. శ్రీవిల్లిపుత్తూరులోనున్న యావిష్ణుచిత్తుం డుత్తమంబగు తులసీదళములచేఁ బరిమళించుచున్న పుష్పమాలికనష్టాక్షరియను మహామంత్రంబగు మూలమంత్రమును జపించుచు వక్షస్స్థలంబున సమర్పింపంగ నాసమయంబున మన్నారుస్వామి గంభీరమైన తియ్యనిమాటలచేతనిట్లని యానతిచ్చెనని, తాత్పర్యము. ౨౭.

ఉ. నేఁడు మహామతీ మధుర♦నీవు రయంబునఁ జొచ్చి యందుఁ బాం,
డ్యుఁడు దివాణమున్నెఱయ♦నించినఁ బ్రేలెడు దుర్మదాంధుల,
న్వోఁడిమి మాన్పి మన్మహిమ♦ముం బ్రకటించి హరింపు శుల్కము,
న్వాఁడు మురాసి నా విహము♦వైష్ణవుఁ గా నొనరింపు సత్కృతిన్. ౨౮.

టీక. మహామతీ = మహాజ్ఞానముగలవిష్ణుచిత్తుఁడా. నేఁడు = ఈప్రొద్దు, ఈవు = నీవు, మధురన్ = మధురాపురమును, చొచ్చి = ప్రవేశించి, అందు = ఆమధురయందు, పాండ్యుఁడు = పాండ్యరాజు (ఇది దేశోక్తి) దివాణమున్ = ఆస్థానమున్, నెఱయన్ = నిండునట్లుగా, నించినన్ = నింపఁగా, ప్రేలెడు = నానావిధంబులుగఁ బలుకుచున్న, దుర్మదాంధులన్ = దుర్మదముచేత నంధులైనవారిని, పోఁడిమి మాన్పి = గర్వమణంచి,

మన్మహిమన్ = నాయొక్క మాహాత్మ్యమును, ప్రకటించి = ప్రసిద్ధిఁ జేసి, శుల్కమున్ = విద్యాశుల్కమును, హరింపు = గ్రహింపుమా, వాఁడును = ఆపాండ్యుఁడును, ఇహము = ఈలోకమును, రోసినాఁడు = అసహ్యపడినాఁడు, సత్కృపన్ = దయచేత, వైష్ణవుఁగాన్ = విష్ణుభక్తునిఁగా, ఒనరింపుము = చేయుము.

తా. మహాబుద్ధిశాలివగు విష్ణుచిత్తుఁడాయని స్వామివారు సంబోధించి నేటిదినము ననతివేగముతో మధురకేతెంచి యందున్న పాండ్యరాజు దివాణమునిండఁ గూర్చుండిన నానావిధములగ బలుకుచున్న దుర్మదాంధులయొక్క కైపుమాన్పి నామహిమలనుగొంతఁ దెలిపి విద్యాశుల్కమును గ్రహించి యీలోకమును రోసియున్నవాఁడుగాన నప్పాండ్యునిం గృపచేత వైష్ణవుంగావింపుమని మన్నారుస్వామి విష్ణుచిత్తునితో సెలవిచ్చెనని, తా.

తే-గీ. అనినవడవడవడఁకి సా◆ష్టాంగ మెఱఁగి, సమ్మదాశ్రులుపులకలు◆ముమ్మరముగ,
వినయవినమితగాత్రుఁడై◆విప్రవరుఁడు, వెన్నునకుభక్తినిట్లని◆విన్నవించె. ౮౦.

టీక. అనిన = అనఁగా, విష్ణుచిత్తుండు, వడవడవడఁకి = గడగడఁ గంపించి, సాష్టాంగమెఱఁగి = సాష్టాంగప్రణామముఁ జేసి, సమ్మదాశ్రులు = ఆనందాశ్రులు, పులకలు = పులకాంకురములు, ముమ్మరముగన్ = అతిశయింపఁగా, వినయవినమితగాత్రుఁడై = వినయముచేతవంపఁబడినదేహముగలవాఁడై, విప్రవరుఁడు = బ్రాహ్మణోత్తముండగువిష్ణుచిత్తుఁడు, వెన్నునకున్ = విష్ణునకు, భక్తిన్ = భక్తిచేతను, ఇట్లని = ఈవిధముగా, విన్నవించెన్ = విన్నపముసేసెను.

తా. మన్నారుస్వామియీరీతి నాజ్ఞాపింపఁగా భయమునొంది విష్ణుచిత్తుండు సాష్టాంగనమస్కారముం జేసి యానందబాష్పములుఁ బులకాంకురములును విస్తరిల్లఁగా వినయముచేత నమ్రుఁడై విష్ణునకు వక్ష్యమాణక్రమంబుగభక్తిచేత విన్నవించెనని తాత్పర్యము

శా॥ స్వామీనన్నితఃపురాపఠితశా◆స్త్రగ్రంథజాత్యంధునా,
రామక్ష్మాఖనక్రియాఖరఖని◆త్రగ్రాహితోద్యత్కిణ,
స్తోమాస్నిగ్ధకరున్భవద్భవనదా◆సున్వాదిగాఁబంపుటో,
భూమీభృత్సభనోటమైనయశం◆బున్మీకురాకుండునే. ౮౧.

టీక. స్వామీ = రక్షకుఁడా, ఇతఃపురా = ఇంతకుమున్ను, అపఠిత = చదువంబడని, శాస్త్రగ్రంథ = శాస్త్రగ్రంథములయందు, జాత్యంధున్ = పుట్టుగ్రుడ్డువాఁడైనట్టియు, ఆరామ = ఉద్యానవనముయొక్క, క్ష్మా = భూమియొక్క, ఖననక్రియా = త్రవ్వుటకొఱకు, ఖర = తీక్ష్ణమైన, ఖనిత్ర = గుద్దలియొక్క, గ్రాహిత = గ్రహించుటచేతనైన, ఉద్యత్ = ప్రకాశించుచున్న, కిణస్తోమ = కాయలసమూహముచేతను, అస్నిగ్ధ = బిరుసైన, కరున్ = హస్తములుగలయట్టియు, భవత్ = మీయొక్క, భవనదాసున్ =

గృహసేవకుఁడనైనట్టి, నన్నున్ = ఇట్టినన్, వాదిఁగాన్ = ప్రసంగించువానిఁగాఁ జేసి. పంపుచోన్ = అనిపినయపుడు, భూమీభృత్సభన్ = ఆపాండ్యరాజుయొక్క సభయందు, ఓటమైనన్ = ఓటమియైనను, అయశంబున్ = అపకీర్తి, మీకురాకుండునే = వచ్చుననుట.

తా. - ఇంతకుమున్ను శాస్త్రముం జదువక జ్ఞానమునందుఁ బుట్టుగుడ్డినైనట్టియు - పూలతోట నేలఁద్రవ్వుటకుఁ గాగుద్దలింబట్టుట చేతఁగాయలుగాచి బిరుసైనహస్తములు గలయట్టియు - మీకోవిలకుదాసుఁడనైనట్టి నన్నువాదమున కనిపితిరేని యారాజసభయందు గెల్పులేక యోటమువచ్చినయెడ దేవరకెయపకీర్తివచ్చును గదాయనివిష్ణుచిత్తుండువిన్నవించెనని. తాత్పర్యము

మ. గృహసమ్మార్జనమోజలాహరణమో ♦ శృంగారపల్యంకికా,
వహనంబోవనమాలికాకరణమో ♦ వాల్లభ్యలభ్యధ్వజ,
గ్రహణంబోవ్యజనాతపత్రధృతియో ♦ ప్రాగ్దీపికారోపమో,
నృహరీవాదములేలలేరెయితరు ♦ ల్నీలీలకుంబాత్రముల్. ౬౨.

టీక. నృహరీ = నృసింహస్వామి, గృహసమ్మార్జనమో = మీ కోవిలయందుఁ బరిమార్జనముఁ జేయుటో. జలాహరణమో = తీర్థంబుఁదెచ్చుటో, శృంగార పల్యంకికావహనంబో = విలాసార్థము దేవరవారారోహణముఁజేసిన పల్లకిమోచుటయో, వనమాలికాకరణమో = తులసిదండలుగట్టి సమర్పించుటయో, వాల్లభ్య = ప్రభుత్వమునకు, లభ్య = పొందఁదగిన, ధ్వజగ్రహణంబో = టెక్కెములు మోచుటమో, వ్యజనాతపత్రధృతియో = విసనకఱ్ఱ - గొడుగు - వీనిం బట్టుటయో, ప్రాక్ = ముందఱను, దీపికారోపమో = దీపముఁబెట్టుటయో ( ద్రాగ్దీపికారోపమోయని పాఠాంతరము ) వాదములేల = వేఱవాదులేల, ఇతరుల్ = అన్యులు, నీలీలకున్ = నీవిలాసమునకు, పాత్రముల్ = తగినవారు, లేరే = లేరా, ఉన్నారనుట ( క్వచిదర్థవిశేషేతు క్లీబే పృథయరూపతాయను నధర్వణోక్తిచేతఁ బాత్రముల నియమహద్రూపము ).

తా,—సుగమము.

తే-గీ. అనినఁదద్భక్తికిదమెచ్చి ♦ యచ్యుతుండు,
మొలకనగవొప్పశ్రీదేవి ♦ మోమునూచి,
వాదితనిచేత గెలిపింతు ♦ నాదుమహిమ,
యువిదకనుమనిప్రాభవం ♦ బొప్పఁబలికె. ౬౩.

టీక.—అనిన్ = అనఁగా, తద్భక్తికి = ఆవిష్ణుచిత్తునిభక్తికి, ఎదమెచ్చి = మనంబునమెచ్చి, అచ్యుతుండు = శ్రీహరి, మొలకనగవొప్ప = చిఱునవ్వంకురింపఁగా,

శ్రీదేవి = లక్ష్మియొక్క, మోముసూచి = ముఖమువీక్షించి, వాదు = వాదము, ఇతనిచేత గెలిపింతుఁ = అనాఘ్రాతశాస్త్రగంధుఁడైన యీవిష్ణుచిత్తుని చేత గెలుపింతును, నాదుమహిమ = నాసంబంధియగు సామర్థ్యమును, ఊవిద = ఓయాంవతీ, కనుమని = చూడుమని, ప్రాభవము= ప్రభుత్వము, ఒప్పఁ = పొల్పగునట్లుగ, పల్కెఁ =మఱియు నొక్కవాక్యమానతిచ్చెను.

తా.—ఇట్లనఁగా నావిష్ణుచిత్తుని భక్తికి మెచ్చి మన్నారుస్వామి చిఱునవ్వు వెదలుచుండ శ్రీదేవిముఖముసూచి యితనిచేతనే వాదము గెలిపించెదనా సామర్థ్యముంజూడుమని ప్రభుత్వ మొప్పునటుల మఱియొకవాక్య మానతిచ్చెనని తాత్పర్యము.

కం. నీయిచ్చయెమిన్నకపో,
వోయిమునిప్రవరనిన్ను ♦ మెప్పింతునుభూ,
నాయకసభనిందులకై,
నీయత్నమువలవదవల ♦ నేనున్నాఁడఁ. ౨౪

టీక.—మునిప్రవర = మునిశ్రేష్ఠుఁడా, నీయిచ్చయె = నీయిష్టమా, మిన్నక= ఊరక. పోవోయి = చనుము, భూనాయక సభఁ, భూనాయక = పాండ్యునియొక్క, సభఁ = సభయందు, నిన్నుఁ = నిన్ను, మెప్పింతుఁ = సభికులు శ్లాఘించునట్లు చేయుదును, ఇందులకై = ఈకార్యమునకై, నీయత్నము = నీప్రయత్నము, వలవదు =అక్కరలేదు, అవలఁ = అవలనడుచుకార్యవిషయమై, నేనున్నాఁడఁ.

తా.—ముని శ్రేష్ఠుఁడవగు నోయి విష్ణుచిత్తుఁడా నీయిష్టప్రకారమా యూరకవెళ్లు మపాండ్యరాజుయొక్క సభయందునీకు మెప్పుగలుగఁజేసెద నిందులకై నీవేమియుంజేయవల దచ్చటికార్యముల నెఱవేర్చుటకై నేనున్నాఁడనని స్వామి యానతిచ్చెనని తాత్పర్యము.

ఆ-వె. అనినమాఱువలుకి ♦ నలికియయ్యాళువా,
రియ్యకొనియెఁబోవ ♦ నింతలోనఁ,
బద్మనయనుఁడతని ♦ పయనంబుఁదూగింపు,
మనుచునంబితోడ ♦ నానతిచ్చె. ౨౫

టీ. అనినఁ = అనఁగా, మాఱువలుకఁ = ప్రత్యుత్తరమిచ్చుటకు, అలికి = వెఱచి, అయ్యాళువారు = అప్పెరియాళ్వారు, పోవఁ = స్వామిసన్నిధినుండియాజ్ఞవహించివెళ్ళుటకు, ఇయ్యకొనియెఁ = సమ్మతించెను, అంతలోనఁ = అసమయమున, పద్మనయనుఁడు = మన్నారుస్వామి, అతనిపయనంబు = అవిష్ణుచిత్తుని ప్రయా

ణము, తూఁగింపుము = సాగింపుము, అనుచున్ = ఇట్లనుచు, నంబితోడన్ = అర్చకునితో, అనతిచ్చెన్ = ఆజ్ఞాపించెను.

తా.—సుగమము

కం. అనతిఁబడి శ్రీభండా,
రానన్సంబడమునందు ♦ ప్రాఁతందలము,
స్థానికుఁడొసంగి పనుపం,
గానానతిబడిననిమిత ♦ కాండ్రువహింపన్. ౭౭.

టీ. అనతిఁబడి = స్వామియాజ్ఞను బొంది, స్థానికుఁడు = పారుపత్తి, శ్రీభండారానన్ = శ్రీభాండాగారమునుండి, సంబడము = బత్తెపుసంబళము, తనదు = తనసంబంధియైన, ప్రాఁతందలమున్ = పురాతనమైన యందలమును, ఒసంగి = ఇచ్చి, పనుపన్ = అనుపఁగా, అనతిబడిన = సెలవువెంటనే, నిమితకాండ్రు = మోఁతకాండ్రు, వహింపన్ = మోయఁగా,

తా.—ఆకోవెలపారుపత్తి స్వామియానతిచ్చిన తెఱంగున భాండాగారమునుండి బత్తెపుసంబళము దీసిచ్చి పురాతనమగునందలము నొసఁగిపంపఁగా సెలవొందినమోఁతకాండ్రు మోయుచుండఁగానని తాత్పర్యము.

కం. లావుగలయట్టిగుజ్జుపుఁ,
జావడములమీఁదమాత్ర ♦ సంచులుదూఁల,
న్రెవల నేకాంగులు రా,
వేవిధములవరిసెలవని ♦ విభునకుఁగొనుచున్. ౭౮.

టీక. లావుగలయట్టి = బలిసియున్నట్టి, గుజ్జుపుఁజావడములమీఁదన్ = గుజ్జుపుఁదట్టువులమీఁద, మాత్రసంచులు = ఆసిమిసంచులు, తూలన్ = వ్రేలాడుచుండఁగా, ఏకాంగులు = కోవెలయధికారులగు నేకాంగులు, ( ఏకాంగులనఁగా పుత్రమిత్రకళత్రాదులం బరిత్యజించి భగవత్కైంకర్యమే పరమప్రయోజనమని కావివస్త్రములుగట్టుకొని భగవత్కైంకర్యార్థము శరీరమును ప్రాణము నర్థమును తృణముగాఁజూచు విరక్తులు ) కేవలన్ = ఇరుప్రక్కల, రాన్ = రాఁగా, వేవిధములవరిసెలు = అనేకవిధములుగాఁజేయంబడిన యతిరసములు, అవనివిభునకున్ = భూపతికి, కొనుచున్ = పట్టించికొని.

తా.—మిగులబలిసియున్న గుజ్జుపుఁదట్టువులమీఁద నసిమిసంచులు వ్రేలాడుచుండఁగోవెల యధికారులు భయపార్శ్వంబులఁ జనుదేర ననేకప్రకారంబులగు భగవత్ప్రసాదంబులయిన యతిరసంబులు రాజునకిచ్చుటకుఁగాఁబట్టించికొనియని తాత్పర్యము

సీ. భక్తిఁ ద్రోవకు సాధ్వి ♦ పరికరంబులు వెట్టి, కట్టినపారివిశం ♦ గాయగములు,
నెసటిపోఁతలు గాఁగ ♦ నేర్చి నించిన చిరం, తనపుశాలి క్షేమ ♦ తండులములు,
వడిఁబెట్టి లో జీర ♦ గుడము సాఁబాలూన్పఁ, జెలఁగు సంబారంపుఁ ♦ జింతపండు,
పెల్లులోహండి కా ♦ విళ్ల కొమ్ముల వ్రేలు, గిడ్డిమొత్తము నేతి ♦ లడ్డిగలును,
బెరుగు వడియంబులును బచ్చి ♦ నరుగు బేడ, లురుతరాచ్యుతపూజోప ♦ కరణ పేటి,
కలును సాత్తినసాత్తని ♦ కులము బలసి, విధినిషేధము లెఱిఁగి తే ♦ మధురకరిగ. ౭౬

టీక. సాధ్వి = అవిష్ణుచిత్తుని భార్య, భక్తిన్ = భక్తిచేతను, త్రోవకున్ = మార్గమునకు, పరికరంబులు వెట్టి = పరికరంబులు నిచ్చి, కట్టిన = మూటఁగట్టిన, పారివిశంగాయగములు = పారివిశంగాయల పణ్యారములును, ఎసటిపోఁతలు గాఁగన్ = ఇసుక లేకుండునట్లుగా, ఏర్చి = ఏఱి, నించిన = నింపించిన, చిరంతనపు = ప్రాఁతలైన, శాలి క్షేమతండులములు, లోన్ = లోపల, వడిఁబెట్టి = శోధించి (నలుచులు లేకుండునట్లేరుట) జీర = జీలకఱ్ఱను. గుడము = బెల్లమును, సాఁబాలు = సరిపాలుగా, ఊన్పన్ = ఉంచఁగా, చెలఁగు = ఒప్పుచున్న, సంబారంపుఁజింతపండు, పెల్లు = మెండైన, లోహండి కావిళ్ల = లోపల హండీలుగల కావిళ్లయొక్క, కొమ్ములన్ = అగ్రములందు, వ్రేలు = వ్రేలాడుచున్నట్టి, గిడ్డిమొత్తము = ఆవుల సంబంధియైన, నేతిలడ్డిగలును = నెయ్యిపోసినలడ్డిగలును (లడ్డిగలనఁగా మూతి కూచిగనుండుపిడతలు) పెరుగువడియంబులును, పచ్చి నరుగు = వేయింపని నరుగులు, బేడలు = ఒలుపు పప్పు, ఉరుతర = గొప్పలైన, అచ్యుత = శ్రీవిష్ణునియొక్క, పూజోపకరణ పేటికలును = అర్చనోపయోగివస్తుపూరితములగు పెట్టెలును, సాత్తిన = శ్రీవైష్ణవులయొక్కయు, సాత్తని = సాతానులయొక్క, కులము = సమూహము (సాత్తినవారనఁగా ద్రావిడప్రబంధమధికరించియు భగవత్సన్నిధియందు సమర్పితముఁ జేసిన బ్రాహ్మణోత్తములైన శ్రీవైష్ణవులు - సాత్తనివారనఁగా ద్రావిడప్రబంధమధికరించియు భగవత్సన్నిధియందు సమర్పితముఁ జేయనధికారము చాలని యితరవర్ణ వైష్ణవులు) విధినిషేధము లెఱిఁగి తేన్ = ఎవ్వరెవ్వరేమేమియుం దెచ్చుటకర్హులో వారలా యా వస్తువులం దెచ్చుచుండఁగా, ఆవిష్ణుచిత్తుఁడు, మధురకరిగ = మధురాపురంబునకుఁ జనెను.

తా.—ఆ పెరియాళ్వారియొక్క భార్య పతివ్రతాశిరోమణియగుటం జేసి మిగుల భక్తితోఁ గూడిన దైయతని త్రోవకుఁ బరికరంబు లుంచి మూటఁగట్టిన పారివిశంగాయలు మిక్కిలియుం బరిశోధింపఁబడిన క్షేమతండులములు - సంబారంపుఁజింతపండు - హండి కావిళ్ల కొనలయందు వ్రేలాడుచుండెడి యావునేతిచే నింపఁబడిన కూచిమూతిపిడతలును - పెరుగు వడియంబులు - నరుగులు - చాయపప్పు - శ్రీవిష్ణుపూజోపయోగిపరికరణ బృందపూరి

తంబులగు పేటికలును - వీని శ్రీవైష్ణవులు - సాతానులు స్వస్వయోగ్యతానురూపంబుగ వెంటఁదెచ్చుచుండ నావిష్ణుచిత్తుండు మధురానగరమునకు వెళ్లెనని తాత్పర్యము.

చ. యమనియమాదిలభ్య ద్రుహిణాదిజరన్మరుదిభ్య సంసృతి,
శ్రమహర నామకీర్తన మురప్రవికర్తన పాతకావలీ,
దమన రమాంగనాకమన తామరసాయతనేత్ర భక్తహృ,
ద్భ్రమతృణదాత్ర భూయువతిరంజన వర్ణజితాభ్రఖంజనా. ౭౯

టీక. యమనియమాదిలభ్య = యమ, నియమ - ఆసన - ప్రాణాయామ - ప్రత్యాహార - ధ్యాన - ధారణ - సమాధులనియెడు నష్టాంగయోగములచేఁ బొందఁదగినవాఁడా, ద్రుహిణ = బ్రహ్మ, ఆది = మొదలగు, జరత్ = వృద్ధులైన, మరుత్ = దేవతలకు, ఇభ్య = ప్రభువైనవాఁడా. (ని, ధాతాబ్జయోనిద్రుహిణః। ఇభ్యఆఢ్యోధనీస్వామీ। మరుతౌపవనామరౌ। యనియు నమరుఁడు) సంసృతి = జన్మమరణాదిరూపసంసారమందలి, శ్రమ = ఆయాసమును, హర = హరించునట్టి, నామకీర్తన = నామసంకీర్తనముగలవాఁడా, మురప్రవికర్తన = మురాసురునిఖండించినవాఁడా, పాతకావళీదమన = పాపములహరియించువాఁడా, రమాంగనాకమన = లక్ష్మీకాముక, (కమనః కామనోభికయనియు నమరుఁడు) తామరసనేత్ర = తామరరేకులవలె వెడల్పైనకన్నులుగలవాఁడా, భక్త = భక్తులయొక్క, హృత్ = మనంబులందలి, భ్రమ = భ్రమలనియెడు, తృణ = గడ్డికి, దాత్ర = లవిత్రమైనవాఁడా॥ (ని, దాత్రంలవిత్రమ నియమరుఁడు) భూయువతి = భూమియనుస్త్రీని, రంజన = సంతోషపెట్టువాఁడా, వర్ణ = దేహకాంతిచేతను, జిత = గెలువఁబడిన, అభ్ర = మేఘము, ఖంజన = కాటుకపిట్టయునుగలవాఁడా. (ని, ఖంజరీటస్తుఖంజనః। వర్ణోద్విజాదౌశుక్లాదౌ। అభ్రంమేఘోవారివాహయనియు నమరుఁడు). తా. — యమనియమాసన ప్రాణాయామ ప్రత్యాహారధ్యానధారణ సమాధులనియెడి యష్టాంగ యోగములచేత బొందసాధ్యమైనట్టియు చతుర్ముఖుఁడు మొదలగు బృందారకబృందంబులకుఁ బ్రభువైనట్టియు - జననమరణాదిరూపసంసారజన్య శ్రమనివారకంబైన నామకీర్తనముగలయట్టియు - మురాసురునివధియించినట్టియు లక్ష్మీదేవికిఁ గాముకుఁడైనట్టియు - తామరరేకులవలె విశాలంబులైన నేత్రంబులు గలయట్టియు - భక్తజనహృదయస్థితంబులగు భ్రమలనియెడిగడ్డికి లవిత్రమైనట్టియు -భూవల్లభుండైనట్టియు నిజదేహకాంతిచేత గెలువంబడిన మేఘఖంజనములయొక్క కాంతిగలయో శ్రీహరీయని గ్రంథకర్త గ్రంథమధ్యమందుఁ జేయందగిన మంగళంబొనరించుచున్నాఁడనుట

కం. దోర్ధూర్ధృతగుర్వరగో, వర్ధనరాధానురాగవర్ధనలీలా,
వార్ధుషికాయిషికాకృత, వార్ధరశ్రవసైకనేత్రవైకృతినిపుణా. ౮౦

టీక. దోః = భుజములయొక్క, ధూః = భారముచేతను, ధృత = ధరియింపఁబడినట్టి, దుర్ధర=అన్యులచేధరియింపశక్యముగాని, గోవర్ధన=గోవర్ధనపర్వతముగలవాఁడా, రాధా=రాధయొక్క, అనురాగ = ప్రీతిని, వర్ధన=వృద్ధిఁబొందించువాఁడా, లీలా = విలాసముచేతను, వార్ధుషికా = వడ్డిపుచ్చుకొనువాఁడా॥ (ని, వృద్ధ్యాజీవో వార్ధుషికయనియమరుఁడు) (వేంకటేశ్వరుఁడువడ్డికాసులవాఁడనుట, ఇషికాకృత = తృణముచేతఁజేయఁబడిన, వార్తిక్రవస = కాకిరూపుగలజయంతునియొక్క, ఏక = ఒక్కటైన = నేత్ర = కంటియొక్క, వైకృతి = భంగమునందు, నిపుణా = సమర్థుఁడా.

తా.— ఇతరులచే ధరియింపనశక్యంబైన గోవర్ధనపర్వతమును భుజముచేతధరియించినట్టియు - రాధకుఁదనయందుఁగల ప్రీతినభివృద్ధిఁ జేయుచున్నట్టియు - విలాసార్థముజనులచేవడ్డిఁబుచ్చుకొనునట్టియు-తృణముచేత కాకరూపమువహించినసీతాస్తనవిదారణముచేసినజయంతునియొకకంటి యొక్క వికారమును బొందించుటయందలి సమర్థుఁడవైనట్టియో శ్రియఃపతీయని పూర్వవత్కవి తాత్పర్యము.

మాలినీ. ద్రుహిణజముఖమౌనిస్తోమనిస్తంద్రభాస్వ
ద్దహరవిహరమాణా ♦ తామ్రపాదాంబుజాతా,
బహిరబహిరపార ♦ ప్రాణికోటిప్రపూర్ణా
మహిమవినుతవాణీ ♦ మాధురీవేద్యపర్ణా. ౯౧

టీక. ద్రుహిణ = బ్రహ్మవలన, జ = పుట్టిననారదుఁడు, ముఖ = మొదలగు, మౌనిస్తోమ = మునిబృందముయొక్క, నిస్తంద్ర = మఱుపులేని, భాస్వత్ = ప్రకాశించుచున్న, దహర = దహరాకాశమందు, విహరమాణ = విహరించుచున్న, ఆతామ్ర = అంతటనెఱ్ఱనై, పాదాంబుజాతా = కమలములవంటి పాదములుగలవాఁడా, బహిః = వెలపలను, అబహిః=లోపలను, అపార = పారములేని, ప్రాణికోటి = జంతుకోట్లయందు, ప్రపూర్ణా = సంపూర్ణుఁడైనవాఁడా, మహిమ = మహత్త్వముయొక్క, వినుతి = స్తోత్రరూపమైన, వాణీ = వాక్యములయొక్క, మాధురీ = మాధుర్యమును, వేది = తెలిసిన, అపర్ణా = పార్వతిగలవాఁడా.

తా — బ్రహ్మవలన జనియించిన నారదుఁడు మొదలగువాని సంఘముయొక్క నిశ్చలమై ప్రకాశించుచున్నదహరాకాశమందు సంచరించుచున్నట్టి మిగులనెఱ్ఱనైయున్నకమలములవంటి పదయుగళముగలవాఁడాయనియు - వెలపలనులోపలను పారములేకయసంఖ్యేయంబులగు జంతువులయందుఁబరిపూర్ణుఁడాయనియు- పార్వతీదేవిచేతఁ దెలియఁబడిన నిజమాహాత్మ్యముయొక్క స్తోత్రవాక్యమాధుర్యముగల లక్ష్మీనాయకాయనియును తాత్పర్యము.

మ. ఇదిభూమండనకొండవీటిధరణీ ♦ భృద్దుర్గపూర్వాద్రిభా,
స్వదిభేశాత్మజవీరభద్రజనజీ ♦ వగ్రాహరాహూయమా,
ణదృఢాంచద్భుజకృష్ణరాయమహిరా ♦ ణ్ణామాస్మదాముక్తమా,
ల్యదనాశ్వాసముహృద్యపద్యముద్వితీ ♦ యంబైమహింబొల్పగున్. ౯౨.

టీక. ఇది, భూమండన = భూదేవికిభూషణంబైన॥ (నిభూషణంస్యాదలంక్రియా । మండనంచయవియమరము,) కొండవీటిధరణీభృద్దుర్గ = కొండవీడను కొండదుర్గమునందు, పూర్వాద్రి = ఉదయగిరిదుర్గమునందును, భాస్వత్ = ప్రకాశించుచున్న, ఇభేశాత్మజ = గజపతికుమారుఁడైన, వీరభద్ర = వీరభద్రపాత్రునియొక్క, జన = ప్రజయొక్క, జీవగ్రాహ = ప్రాణముతో గ్రహించుటయందు, రాహూయమాణ = రాహువువలెనాచరించెడి, దృఢ = బలిష్ఠమైన, అంచత్ = ఒప్పుచున్న, భుజ = భుజములుగలయట్టి, కృష్ణరాయమహీరాణ్ణామ = కృష్ణరాయభూపతియను పేరుగల, అస్మత్ = నాయొక్క, ఆముక్తమాల్యదన్ = ఆముక్తమాల్యదయందు, హృద్యపద్యము = మనోహరపద్యములుగల, ఆశ్వాసము, ద్వితీయంబై = రెండవదియై, మహిన్ = భూమియందు, పొల్పగున్ = ఒప్పగును.

గద్య. ఇదిశ్రీదక్షిణామూర్తిమంత్రోపాసనా సమాసాదితాఖండ సాహితీ ధురీణుండు
నాత్రేయగోత్ర పవిత్రుండును వావిళ్లవంశ పయోరాశిరాకాసుధాకరుండునగు
రామస్వామి శాస్త్రిచేతననేక పూర్వ వ్యాఖ్యానాభిప్రాయం
బులఁ బర్యాలోచించి రచియింపఁబడిన రుచిసమా
ఖ్యానంబగు నాముక్తమాల్యదా
వ్యాఖ్యానంబునందు
ద్వితీయాశ్వాసము.



శ్రీరస్తు.

# ఆముక్తమాల్యద,

## సవ్యాఖ్యానము.

### తృతీయాశ్వాస ప్రారంభము.

---

క. శ్రీ క్షితి నీళా వర దను। జోక్ష ప్రాణహర దంష్ట్రికోత్కృత్త హిర
ణ్యాక్ష క్షపాచర కృపా। వీక్షాదృత బాహులేయ వేంకటరాయా. ౧.

టీక. శ్రీ=లక్ష్మికి, క్షితి=భూమికి, నీళా=నీళాదేవికిని, వర=నాథుఁడైన వాఁడా, దనుజోక్ష=వృషభరూపుఁడైన రాక్షసునియొక్క, ప్రాణ=ప్రాణములను, హర=హరియించినట్టివాఁడా, దంష్ట్రికా=కోఱచేతను, ఉత్కృత్త=ఖండింపఁబడిన, హిరణ్యాక్ష=హిరణ్యాక్షుఁడనునట్టి, క్షపాచర = నిశాచరుఁడుగలవాఁడా, కృపా=దయతోఁగూడిన, వీక్షా=కటాక్షముచేత, ఆదృత = ఆదరింపఁబడిన, బాహులేయ=కుమారస్వామిగలవాఁడవైన, వేంకటరాయా=వేంకటేశుఁడా.

వ. అవధరింపుము ట్లరిగి యవ్విష్ణుచిత్తుండు. ౨.

టీక. అవధరింపుము=చిత్తగింపుము, అట్లరిగి= అత్తెఱంగున వెడలి, అవ్విష్ణుచిత్తుండు.

తా. కమలాక్షితినీళాదేవులకు భర్తయైనట్టియు వృషభాసురుని జీవమును హరియించినట్టియు వరాహావతారమందుఁ దన దంష్ట్రికచేత ఖండింపఁబడిన హిరణ్యాక్షుఁడు గలయట్టియుఁ గృపా కటాక్షము చేతఁ గుమారస్వామి నాదరించినట్టి వేంకటరాయా చిత్తగింప వలయును నాతీరున వెడలిన వాఁడాయెను విష్ణుచిత్తుఁడని గ్రంథకర్త తన యిష్టదైవం బగు వేంకటేశుని సంబోధించి మంగళ మొనర్చెనని తాత్పర్యము.

శా. విద్యాంబుస్ఫీతివారి వాద మగుట న్విజ్ఞప్తి లేకుండఁ దా
నత్యూర్జస్వలుఁ డౌట భూపతియు సభ్యవ్రాతము న్వంకకైఁ
బ్రత్యుత్థానముఁ జేసి మ్రొక్కఁగ సభాభాగంబు సొత్తెంచి యా
స్వస్త్యర్థోజ్జ్వల రాజదత్త వరరత్నస్వర్ణపీఠస్థుఁడై. ౩.

టీక. నిత్యంబుగన్=ప్రతిదినమందును, వాదముగటన్=విద్వాంసులకుఁబరస్పరసంవాదముగలిగియుండుటచేత, ప్రతిహారి=ద్వారపాలకుఁడు, విజ్ఞప్తిలేక = ప్రభువునకు విన్నవింపకయె, అంపన్=అనుపఁగా, తాన్=తాను, (అనఁగా విష్ణుచిత్తుఁడనుట) అత్యూర్జస్వలుఁడు=మిగులఁదేజముగలవాఁడు, ఔటన్=ఔటచేత, భూపతియు=ప్రభువును, సభ్యవ్రాతముల్=పండితసమూహంబును, శంకమైన్=శంకచేత, ప్రత్యుత్థానముఁజేసి= లేచి, మ్రొక్కఁగన్=నమస్కారముసేయఁగా, సభాభాగంబు=సభాప్రదేశమును, చొత్తెంచి=చొచ్చి, ఔన్నత్య=పొడవౌటచేతను, ప్రోజ్జ్వల=ప్రకృష్టముగఁబ్రకాశించుచున్నట్టియు, రాజ=ఏలికచేతను, దత్త = ఇయ్యఁబడిన,వర=శ్రేష్ఠములగు, రత్న=రత్నములుదాపిన, స్వర్ణపీఠస్థుఁడై = బంగారుపీటయందుఁ గూర్చుండియున్నవాఁడై.

తా. నిత్యమును విద్వాంసులే తెంచి ప్రసంగించుట దెలిసి యున్నవాఁడు గాన ద్వారపాలకుండు రాజాజ్ఞఁ బొందకయే లోపలి కనుపఁగాఁ బ్రవేశించిన విష్ణుచిత్తుండు మిగులఁ దేజోవంతుఁడగుటం జేసి యా భూపాలుండును బండితులును మహాత్ముండను శంకచేత లేచి నమస్కరింప సభాప్రదేశము సొచ్చి రాజదత్తంబైన రత్నఖచిత సింహాసనమందుఁ గూర్చుండి యున్నవాఁడై యని తా.

క. అతిథ్యము గొని హరి తన చేతోగతి నొలయ రంతు సేయని విద్వ
ద్వ్రాతంబుఁ జూచి లాఘలమా తరవా యుడుగ మాటలాడుం డనుచున్.

టీక. ఆతిథ్యముగొని=అతిథిపూజనుగ్రహించి, తన=తనయొక్క, చేతోగతిన్=చిత్తవృత్తిని, హరి=శ్రీహరి, ఒలయన్ = విహరింపఁగా, రంతుసేయని= చప్పుడు సేయకున్న, విద్వద్వ్రాతంబున్ = పండితసమూహమును, చూచి=వీక్షించి, లాఘులమా=కొంచెత్తవారమా, తరవాయి=ఉపక్రమము, ఉడుగన్=నిలుపుటకు, మాటలాడుండు=ప్రసంగముఁ జేయుండు, అనుచున్.

తా. సుగమము.

తే. గీ. కతిపయోక్తులచే వారి ప్రతిభఁ దెలిసి
నగవు దళుకొత్త రాజు నెమ్మొగముఁ జూచి
యీవు మాధ్యస్థ్యమున నున్న నేను గొన్ని
నొడివెదము మాట లని త దనుజ్ఞ వడసి. ౫౧.

టీక. కతిపయోక్తులన్, కతిపయ=కొన్నియైన, ఉక్తులన్ = మాటలచేతనే, వారి= అసభ్యులయొక్క, ప్రతిభన్=బుద్ధిని, తెలిసి=ఎఱింగి, నగవు = నవ్వు, తళుకొత్తన్=అంకురింపఁగా, రాజు=రాజుయొక్క, నెమ్మొగము=ముఖమును, చూచి=కని,

రాఁగా, కలఁగక=తొట్రుపాటుపడక, అందఱన్=ఎల్లరను, తీర్చి = సమాధానపఱచి, నిలిపి = ఉంచి, అమ్మొదలివానికె = ఆ మొదలివిద్వాంసునకే, మగిడి=తిరిగి, మఱి=మఱియును, శ్రుతి=వేదములు, స్మృతి=ధర్మశాస్త్రములు, సూత్ర = వ్యాససూత్రములు, వీనియొక్క, సమాజమునకు=సమూహమునకు, ఐకకంఠ్యము=ఏకగ్రీవత, కల్పించి=చేసి, ఆత్మమతము=స్వమతము, జగమెఱుంగఁగన్= లోకమెఱుంగునట్లు, రాద్ధాంతముగన్=సిద్ధాంతముగా, ఒనర్చి=చేసి, విజితుఁగావించి=ఓడించి, దయన్ = కరుణచేతను, వానిన్=అతని, విడిచిపెట్టె.

తా. ఆవాదులలో నొక ప్రౌఢవాది కభిముఖుండై యతఁడు సెప్పిన యుక్తులను ముందనువాదముఁ జేసి యుపక్రమించి పిమ్మట నా యుక్తుల కన్ని దూషణంబులును దాను త్వరఁ బడక సభ్యులు మెచ్చు నటులఁ బల్కి యిరు ప్రక్కల నున్న వారు సెప్పుచున్న మాటల నెన్నక యొక్కొక యుక్తిచేత నిగ్రహస్థానము లొదవిన ననుగ్రహించి సభ్యులు దొమ్మిగా వచ్చి ప్రసంగింపఁ దాఁ దొట్రుపడక యందఱను సమాధానపఱిచి యుంచి యా మొదలి విద్వాంసునకే మరల వేద శాస్త్ర బ్రహ్మసూత్రములకు నేక వాక్యతఁ గల్పించి చెప్పి పిమ్మట స్వమతము సిద్ధాంతమని లోక మెఱుంగు నట్లుగఁ జేసి యోడించి దయ చేత వాని విడిచె యని తాత్ప.

క. నీ వేమంటివి రమ్మం। చావలి వానికిని మగిడి యట్లనె వానిం
గావించి యొకఁ డొకఁడు రాఁగా నా విప్రుఁడు వాద సరణి నందఱఁ గెలిచెన్.

టీక. నీవేమంటివి=తొలుతఁదొమ్మిగఁ బ్రసంగింపవచ్చినవారలలోనొక్కనిం జూచియీవుపల్కినదేమి, రమ్మంచు=రమ్మనియోడించి, ఆవలవానికిని = ఆవలనున్న మఱియొకనికిని, మగిడి=అభిముఖుండై, వానిన్=ఆవాదినిని, అట్లనె=మొదలివాదిని వలెనే, కావించి = చేసి, మఱియునీప్రకారముగన్, ఒకఁడొకఁడు = ఒకనివెంట నొకఁడుగా, రాన్=రాఁగాను, ఆవిప్రుఁడు=ఆవిష్ణుచిత్తుఁడు, వాదసరణిన్=వాద ముఖమున, అందఱన్=వాదుల నెల్లను, గెలిచెన్=జయించెను.

తా. మఱియొకని తట్టు తిరిగి నీ వేమంటివి రమ్మని ప్రసంగించి యోడఁ గొట్టి యావలి వాని కెదురై వానిని నోడఁ గొట్టి యీ రీతి నొక్కొకఁడుగ రాఁగా నా విప్రుఁడు ప్రసంగించి యందఱఁ బ్రసంగించు సమయమున నోడఁ గొట్టె నని తాత్పర్యము.

సీ. జగదుద్గతికిని బీజము ప్రధాన మన నీక్షత్యాది వీను నశబ్ద వాదిఁ
బోరి నీశుఁడే నని భోగమాత్రేత్యాద్యుదాహృతి సూచితన్ మాయా వివాది

ఫలియించుఁ గ్రియయ నా ఫలమత యిత్యాది సర్వేశుఁ గొనని యపూర్వవాది
శాస్త్రయోనిత్వాది సరణి నీశ్వరునిఁ దెల్పెడు ననుమానము న్పీలువాది

తే. గీ. నిత్యులం దెల్ల నిత్యుఁ డన్శ్రుత్యురూక్తి
క్షణిక సర్వజ్ఞతేశ సౌగత వివాది
ననుపపత్తేర్న యను సూత్ర మాది యైన
వాని నృపతీశుఁ బ్రత్యక్ష వాదిఁ గెలిచె. ౮.

టీక. జగదుద్గతికిని, జగత్ = జగంబులయొక్క, ఉద్గతికిని = ఉత్పత్తికి, బీజము=కారణము, ప్రధానము=ప్రకృతి, అనన్=ఇట్లనివాదింపఁగ, వీశున్=విగతేశుఁడనఁగానీశ్వరుండుజగత్కారణముగాదనునట్టి, అశబ్దవాదిన్=సాంఖ్యుని, ఈక్షత్యాదిసూత్రోక్తులచేతను, పొరిని=మిక్కిలియు, ఏను=నేను, ఈశుఁడు=ఈశ్వరుఁడు, అనన్=అనఁగా, మాయావివాదిన్=మాయకుఁగారణత్వముఁజెప్పుచున్నట్టి యద్వైతిని, భోగమాత్రేత్యాది = భోగమాత్ర అనునది మొదలుగాఁగలసూత్రముయొక్క, ఉదాహృతి=ఉదాహరణముయొక్క, స్మార్తిన్=స్మరించుటచేతను, క్రియయ=అగ్నిష్టోమాదిసత్క్రియయె, ఫలియించున్ = ఫలములనిచ్చున్, నా=అనివాదింపఁగా, సర్వేశుఁగొనని=సర్వేశ్వరునిఁగొనియాడనట్టి, అపూర్వవాదిన్=మీమాంసకుని, ఫలమతయిత్యాది=ఫలమతయను మొదలగుదానిచేతను, ఈశ్వరునిన్=జగదీశుని, అనుమానము=(క్షిత్యంకురాదికంసకర్తృకం కార్యత్వాద్ఘటవత్) అనునట్టియనుమానమె, తెల్పెడున్=ఈశ్వరసద్భావమందు ప్రమాణము, అన్=అనియెడు, పీలువాదిన్=పరమాణుకారణవాదిని, శాస్త్రయోనిత్వాది=శాస్త్రయోనిత్వాత్తనునది మొదలగు, సరణిన్=రీతిచేతను, నిత్యులందెల్లనిత్యుండు= నిత్యవస్తువులలోనిత్యుఁడీశ్వరుండు, అన్=అనునట్టి, శ్రుత్యురూక్తిన్, శ్రుతి=వేదముయొక్క, ఉరు=గొప్పయైన, ఉక్తిన్=వాక్యముచేత, క్షణికసర్వజ్ఞతేశ=క్షణికత్వసర్వజ్ఞత్వాదులీశ్వరలక్షణంబులనియెడు, సౌగతవివాదిన్=బౌద్ధునిని, ని. సౌగతశ్శూన్యవాదిని.యనియమరము. అనుపపత్తేర్నయను సూత్రము, ఆదియైనవానిన్=మొదలగువానిచేత, నృపతీశున్=నిగ్రహానుగ్రహసమర్థుఁడగురాజేయీశ్వరుండనునట్టి,ప్రత్యక్ష వాదిన్=ప్రత్యక్షమెసత్యమనివాదించువానిన్, (అనఁగాఁజార్వాకుఁడనుట), గెలిచెన్=సభయందుఁ గ్రమముగ నందఱి నోడించెను.

తా. పరిదృశ్యమానం బగు నీ జగత్తునకుఁ బ్రకృతి గారణం బని వాదించునట్టి యశబ్దవాదియగుసాంఖ్యుని ఈక్షత్యాది సూత్రములచేతను, నే నీశ్వరుఁ డని వాదించుచున్న యద్వైతిని భోగమాత్రేత్యాది సూత్రములచేతను, కర్మబ్రహ్మవాది యగు మీమాంసకుని ఫలమత ఇత్యాది సూత్రములచేతను, పీలుపాకవాదిని శాస్త్రయోనిత్వాది

సూత్రములచేతను, నిత్యత్వసర్వజ్ఞత్వాను లీశ్వరలక్షణం బనియెడు బోధని, నిత్యో నిత్యానా మను శ్రుతిచేత, నిగ్రహ సామర్థ్యము గలిగి కంటికి విషయుం డై యున్న రాజేశ్వరుం డను నట్టి ప్రత్యక్షవాదిని అనుపపత్తేర్న యను సూత్రముచేతను, నిత్తెఱఁగున నా విష్ణుచిత్తుఁడు సభయందు వాదించిన వారల నెల్లఁ గ్రమంబుగ నోడఁ గొట్టెనని తాత్పర్యము.

ఈ పద్యమందలి శ్రుతులకు సూత్రములకు నర్థము స్పష్టమగు నట్లు వివరింపఁ బడ లేదని యూహింప వలయు.

శా. విద్వద్వందితుఁ డాతఁ డిట్లు సుఖసంవిత్తత్త్వబోధైకచుం
చద్వైపాయనసూత్రసచ్ఛ్రుతుల నీశున్ మున్ నిరూపించి పైఁ
దద్విష్ణుత్వము దానికన్యదివిషద్వ్యావర్తనంబున్ విశి
ష్టాద్వైతంబును దేటగాఁ దెలుప మాటాడెన్ ప్రమాణంబులన్. ౯.

టీక. విద్వత్ = విద్వాంసులచేతను, వందితుఁడు = నమస్కరింపఁబడు, ఆతఁడు = ఆవిష్ణుచిత్తుండు, ఇట్లు = ఈరీతిగా, సుఖ = సుఖస్వరూపమును, సంవిత్ = జ్ఞానస్వరూపమునైన, తత్త్వ = పరబ్రహ్మయొక్క, బోధైకచుంచు = జ్ఞానమునకుముఖ్యసాధకంబైన, (తేనవిత్తశ్చుంచుప్చణపౌ అనిసూత్రము), ద్వైపాయనసూత్ర = వ్యాససూత్రములచేతను, సచ్ఛ్రుతులన్ = వేదములచేతను, ఈశున్ = సర్వేశ్వరుని, మున్ = మున్ను, నిరూపించి = తెల్పి, పైన్ = పిమ్మట, తత్ = ఆసర్వేశ్వరునికి, విష్ణుత్వమున్ = వ్యాపకత్వమును. (విష్ఌ వ్యాప్తౌ), దానికిన్ = ఆవిష్ణుత్వమునకు, అన్యదివిషద్వ్యావర్తనంబున్, అన్యదివిషత్ = ఇతరదేవతలకు, వ్యావర్తనంబున్ = లేకుండుటయును, విశిష్టాద్వైతంబును, తేటగా = ప్రత్యక్షముగా, తెలుపన్ = తెలుపుటకు, ప్రమాణంబులన్ = ప్రమాణముచేతను, మాటాడెన్ = సంభాషించెను.

తా. విద్వాంసులచే నమస్కరింపఁ బడు చున్న యా విష్ణుచిత్తుండు జ్ఞానస్వరూపమును, సుఖస్వరూపమునైన పరబ్రహ్మయొక్క బోధను బ్రకటింపఁ జేయు నట్టి బ్రహ్మసూత్రములచేతను వేదముచేతను నీశ్వరుని మున్నుగా నిరూపించి సిద్ధాంతము చేసి యాపిమ్మటనా యీశ్వరునికి వ్యాపకత్వమును దదితర దేవతలకు వ్యాప్యత్వమును విశిష్టాద్వైతంబును బ్రమాణములచేతఁ బ్రత్యక్ష మగు నటులఁ దెలుపుటకు సంభాషించె నని తా.

సీ. ఆది నారాయణుం డాయె నొక్కఁడె బ్రహ్మ లేఁడు మహేశుండు లేఁడు లేదు
రోదసి లేఁడు సూర్యుఁడు లేఁడు చంద్రుఁడు లేవు నక్షత్రము ల్లేవు నీళ్లు

లే దగ్ని యట్లుండ లీల నేకాకితచనదు పెక్కయ్యెద ననుచు నయ్యెఁ
జిదచిద్ద్వయంబు సొచ్చి యని ఛాందోగ్యంబు దెలిపెడు నంత రాదిత్య విద్య
నర్కులోఁ బుండరీ కాక్షుఁ డతఁడ యనుట
కక్షిణీయని యష్టదృక్త్రిదృగ్దశశ
తాక్షవిధిరుద్ర శక్రాదులందు నొకఁడు
కామి కాఁడ్రుతియే విలక్షణతఁ దెలిపె. ౧౧.

టీక. ఆదిన్ = సృష్ట్యాదియందు, నారాయణుండు = విష్ణువు, ఒకఁడె = ఒక్కఁడె, ఆయెన్ = బహురూపములాయెను. బ్రహ్మ = చతుర్ముఖుఁడు, లేఁడు. మహేశుఁడు = శివుఁడు, లేఁడు. రోదసి = భూమ్యంతరిక్షప్రదేశము, లేదు. సూర్యుఁడు, లేఁడు, చంద్రుఁడు, లేఁడు. నక్షత్రములు = చుక్కలు, లేవు. అగ్ని, లేదు. అట్లుండన్ = ఆరీతినుండగా, లీలన్ = విలాసముచేత, ఏకాకితన్ = ఒక్కఁడై యుండుట, చనదు = యుక్తముగాదు. పెక్కయ్యెదన్ = అనేకములయ్యెదన్, అనుచున్ = సంకల్పించి, చిదచిద్ద్వయంబుసొచ్చి, చిత్ = చిత్తు, అచిత్ = అచిత్తు, వీనియొక్క ద్వయంబు = రెంటిని, ( అనగా జీవులయందును జడములయందును ననుట ), చొచ్చి = ప్రవేశించి, అయ్యెన్ = తానుబహురూపంబులాయెను, అని = ఇట్లని, ఛాందోగ్యంబు = ఛాందోగ్యంబనునుపనిషత్తు, తెలిపెడున్ = బోధించుచున్నది. అంతరాదిత్యవిద్యన్ = అంతరాదిత్యవిద్యయందు, అర్కులోఁ బుండరీకాక్షుఁ డతఁడ యనుటకు = సూర్యునియందున్న పుండరీకాక్షుండు శ్రీమన్నారాయణుండే యనుటకు ॥శ్రు॥ కప్యాసం పుండరీకమేవమక్షిణీ యనిద్వివచనముచేతను, అష్టదృక్ = ఎనిమిదికన్నులుగలవాఁడైనట్టి, త్రిదృక్ = త్రిలోచనుఁడైనట్టి, దశశతాక్ష = సహస్రలోచనుఁడైనట్టి, విధి, రుద్ర, శక్రాదులందున్ = బ్రహ్మేశానేంద్రాదులందు, ఒకఁడు = ఒక్కఁడును, కామి = సూర్యమండలాంతవర్తి కాఁబోవుటను, శ్రుతియే, విలక్షణతన్ = వైలక్షణ్యమును, తెలిపెన్ = కనుపఱిచెను.

తా. సృష్ట్యాదియందు శ్రీమన్నారాయణుం డొక్కఁడె యుండుటం జేసి యేకాకిత విలాసమునకు యుక్తము గామి ననేక రూపంబులం బొందెద నని సంకల్పించి చిదచిద్ద్వయాత్మకం బైన ప్రపంచ మందుఁ దాను బ్రవేశించి బహు రూపము లాయె నని ఛాందోగ్యమను నుపనిషత్తు బోధించు చున్నదనియు నిదియునుంగాక యంతరాదిత్య విద్యయందు సూర్యునియందున్న పుండరీకాక్షుండు నారాయణుం

డనుటకు నత్వేతే యను ద్వివచనము ముఖ్యసాధకం బనియు బ్రహ్మ రుద్రేంద్రాదులం
లో నెవ్వఁడు గా దనుటగా శ్రుతియె వైలక్షణ్యమును దెలుపు చున్న దనియును
తాత్పర్యము.

మ. తుల లేకుండు స్వరూప రూప గుణ భూతు ల్దోఁచె నే తచ్ఛ్రుతి
న్దలమై లో వెలిఁ దానె యున్కిఁ దెలిపె న్నారాయణం బారుణం
బుల సామాన్య విశేష రీతి నిఖిలంబు న్శబ్ద జాలంబు ని
ర్మల నారాయణ శబ్ద మందునె తుద న్బర్యాప్త మయ్యె న్శ్రుతిన్. ౧౧.

టీక. తుల లేకుండు = సమానము లేనట్టి, స్వరూప= నారాయణుని యొక్క, దివ్యస్వరూపమును, రూప= దివ్యవిగ్రహమును, గుణ = అనంతకల్యాణగుణములును, భూతుల్=దివ్యైశ్వర్యంబును, ఏతచ్ఛ్రుతిన్ = ఈ వేదముచేత, తోఁచెన్ = కాన వచ్చెను, దలమై=తెలుచుగా, లో వెలిన్ = లోపలను బైటను, తానెయున్కిన్ = శ్రీమన్నారాయణుండె యున్నవాఁడని, తైత్తిరీయోపనిషత్తునందు). నారాయణంబు= నారాయణమను నైదవపన్నము, తెలిపెన్ = తెలుపుచున్నది. శ్రుతిన్ = వేదమం దలి, ఆరుణంబులన్ = ఆరుణములందు, సామాన్యవిశేషరీతిన్=సామాన్యవిశేషన్యాయముచేతను, నిఖిలంబున్=సకలమైన, శబ్దజాలంబు=శబ్దసమూహము, నిర్మలనారాయణశబ్దమందునె= నారాయణశబ్దములోపలనె, తుదన్=కడపట, పర్యాప్తమయ్యెన్ =పర్యవసన్నమాయెను.

తా. సాదృశ్యము లేనట్టి శ్రీ హరియొక్క దివ్య స్వరూప దివ్య విగ్రహానంత కల్యాణ గుణ దివ్యైశ్వర్యములు నీ శ్రుతియందు స్పష్ట మౌచున్న వనియు నారాయణుండె సర్వాంతర్బహిర్వ్యాపకుఁడై తెలుచుగా నున్న వాఁడని తైత్తరీయస్థ మైన నారాయణ మను నైదవ పన్నము దెలుపు చున్న దనియు నారుణంబులందు సామాన్య విశేష న్యాయముచేత బ్రహ్మేంద్రాది సకల శబ్దములును దుదను నారాయణ శబ్దమందె పర్యవసన్నము లాయె ననియును తాత్పర్యము.

కం. వా దపహతపాప్మాది। వ్యోదేవ యనంగఁ బరఁగు సూక్తుల మీఁదం
బా దగు నారాయణ పద। మే దేవాంతరము లేమి కీ శ్రుతిఁ దీర్చెన్. ౧౨.

టీక. ఈశ్రుతిన్ = ఈఛాందోగ్యశ్రుతులందు, అపహతపాప్మాదివ్యోదేవ యనంగన్ =॥శ్రు॥ అపహతపాప్మాదివ్యోదేవఏకో నారాయణః. అనునటుల, పరగు = ఒప్పుచున్న, సూక్తుల మీఁదన్ = వేదవాక్యముల మీఁదను, వాదగు=శుద్ధురైయున్నట్టి నారాయణపదము, ఏదేవాంతరము లేమికి= అంతకంటె వేఱొకదైవము లేకుండుటను, వాదు=వివాదమును, తీర్చెన్=పోఁగొట్టెను.

తా. అపహతపాప్మేత్యాది శ్రుతివాక్యములమీఁద కుదురై యున్న యీ నారాయణ పదమే శ్రీమన్నారాయణుని కంటెఁ బరంబుగ నే దైవమును లేదని నిస్సందేహ మగునట్టుల భ్రమాత్మక జ్ఞానజన్య వివాదమును దీర్చెనని తాత్పర్యము.

వ. తొల్లి జామదగ్ని భయంబునఁ బరిత్యక్త రాజ్యుండై వైరాగ్యంబున దివోదాసాత్మజుం డగు ప్రతర్దనుండు జనార్దను నెఱుంగక యపవర్గ కాంక్షఁ నింద్రు నారాధించిన నతండును సన్నిహితుండై మా ముపాస్వ యనుటయు మును గర్భమునందుండియు నఖండిత తపస్స్ఫురిత వామదేవుం డగు వామదేవుండును సూర్యోహం మనురహం కక్షీవానహమ్మని శరీరవాచక శబ్దంబు శరీర పర్యంతరంబు వోవుటం జేసి చిదచిచ్ఛరీరకుం డగు నప్పరమాత్ముం గూర్చి యనుసంధించెనని తెలిసి చేతనుండైన తా జగత్కారణంబు గామి విబుధులందెల్ల విజ్ఞాన వృద్ధుండగు నావృద్ధశ్రవుండును దకను సంధాన న్యాయంబున నుపదేశించెనని శ్రుతి సూత్రముఖంబుల నిగమాంత శాస్త్ర ఫక్కికాజాల వక్కాణింపంబడు నాత్మయు నవనియు ననల పవన గగన కాల మృత్యు ప్రభృత్యఖిల చిదచిత్ప్రపంచంబు లతని శరీరంబులని యన్నాదినినంబును నట్లగుట నశేష చిదచిచ్ఛరీరంబుల న్నారాయణ శరీరంబులే కదా యని ముముక్షువున కప్పుండరీకాక్షు దక్క నే వ్యక్తియైన నుపాసింపవచ్చునె విష్ణునకుఁ దత్తత్కాల విగ్రహంబులగుటం బ్రహ్మ రుద్రార్జున వ్యాస భాను భార్గవాది భజనంబు త్రైవర్గికునకుం గాక యపవర్గ కాంక్షులకయుక్తంబని స్మృతి చెప్పనదియునుంగాక యీశ్వరునకుఁ జేతనునకు నిత్యసంబంధంబు మాతా పితా భ్రాతా వాస శ్శరణం సుహృద్గతి ర్నారాయణ యని సమస్తంబునకు బరాయణంబుగా నతనిఁ బ్రతిపాదించు శ్రుత్యంతరంబు గల దట్టి పరమేశ్వరుం గనుటకుఁ దగిన యోగంబుఁ జెప్పెద ఖాండిక్యకేశిధ్వజ సంవాదంబు వినుమని యిట్లనియె. ౧౩.

టీక. తొల్లి = పూర్వకాలమందు, జామదగ్నిభయంబున = పరశురాముని వలని భయముచేత, పరిత్యక్తరాజ్యుండై = రాజ్యముఁ ద్యజించినవాఁడై, వైరాగ్యంబునన్ = వైరాగ్యముచేత, దివోదాసాత్మజుండగు = దివోదాసునకుఁ గుమారుడైన, ప్రతర్దనుండు = ప్రతర్దనుడనువాఁడు, జనార్దనున్ = శ్రీహరిని, ఎఱుంగక = తెలిసికొనక, అపవర్గకాంక్షన్ = మోక్షేచ్ఛచేతను, ఇంద్రున్ = పాకశాసనుని, ఆరాధించిన = ఉపాసన సేయఁగా, అతఁడు = ఆయింద్రుఁడు, సన్నిహితుండై = సమీపించినవాఁడై, మాముపాస్వ = నన్ను నారాధింపుము అనుటయు, (తొలుతఁ దన్ను నారాధించుచున్నవానితో నుఱుఁదన్నే యారాధింపుమనుట చేత నతనియంతర్యామి యగు నా

రాయణుని నుపాసన సేయుమన్నట్లర్థము సిద్ధించె నది యెట్లనిన), మున్న=పూర్వము. గర్భమునందుండియు = ఉదరమునందుండియె, అఖండిత = ఖండింపఁబడని, తపః జితపంబుచేతను, తులిత = సరిసేయఁబడిన, వామదేవుండగు = దుర్భరుఁడనుగలవాఁడైన ట్టి, వామదేవుండను = వామదేవుఁడనుజడదారి, సూర్యోఽహం = సూర్యుఁడను నేను, మనురహం = నేనుమనువు, కక్షీవానహం = అగ్ని నేను, అని = అనుచు, శరీరవాచకశబ్దంబు= శరీరవాచకంబైన యస్మచ్ఛబ్దంబు, శరీరిపర్యంతంబు= శరీరముగల జీవపర్యంతంబు, పోవుటం జేసి = పోవుటచేతను, చిదచిచ్ఛరీరకుండగు, చిత్ = జీవుఁడు, అచిత్ = శరీరము, శరీరకుండు = శరీరముగాఁగలవాఁడు, చిద్రూపాచిద్రూపదేహము గలవాఁడనఁగా సర్వశరీరకుండనుట. అగుటన్ = అగుటవలన, అప్పరమాత్మంగూర్చి= ఆపరవాసుదేవునింగూర్చి, అనుసంధించెను = చింతించెను, అని = అట్లని, తెలిపి = ఎఱింగించి, చేతనుండైనతాన్ = జీవుఁడైనతాను, జగత్కారణంబుగాని = ఆకాశాదిజగత్తునకు హేతువుగాకపోవుటను, విబుధులందెల్ల = దేవతలయందెల్లను, విజ్ఞానవృద్ధుండగు = విశేషజ్ఞానముచేతఁ బెద్దయైన, వృద్ధశ్రవుండు= దేవేంద్రుఁడు, తత్ = ఆయర్థముయొక్క, అనుసంధానధ్యాయంబునన్ = చింతనయను న్యాయముచేతను, ఉపదేశించెను = ఆరాజున కుపదేశము జేసెను, అని = అనుకొని, శ్రుతిసూత్రముఖంబుల = వేదములచేతను వ్యాససూత్రములచేతను, నిగమాంతశాస్త్రభక్తిన్ = వేదాంతశాస్త్ర వాక్యరీతులచేతను, మిగుల = విశేషముగ, వక్కాణింపఁబడున్ = వ్యాఖ్యానము సేయంబడుచున్నది, ఆత్మయు = జీవాత్మయును, అవనియు = భూమియును, అనల పవన గగన కాలమృత్యుప్రభృతి = అగ్నివాయ్వాకాశ కాలమృత్యువులు మొదలగు, చిదచిత్ప్రపంచంబులు = చిదచిత్తులయొక్క విస్తారము, అతని = అప్పరమాత్మునియొక్క, శరీరంబులని= దేహములని, అందెవినంబడు= అవేదమందె వినఁబడును, అట్లగుటన్ = ఆలాగగుటచేత, అశేష = సమస్తమైన, దివిషత్ = బ్రహ్మాది దేవతలయొక్క, శరీరంబులు = దేహములు, అన్నారాయణుని శరీరంబులే కావాయెని, ముముక్షువునకు = మోక్షేచ్ఛగలవానికి, అప్పుండరీకాక్షుఁడక్కన్ = ఆనారాయణుని వినాగా, ఏ వ్యక్తినైనను = ఏశరీరమునైనను, ఉపాసింపవచ్చునె = ఉపాసనచేయఁదగునా, విష్ణునకు = పరమాత్మునకు, తత్తత్కాల విగ్రహంబులగుటన్ = సమయోచిత దేహములౌటచేతను, బ్రహ్మ రుద్రార్జున వ్యాస భానుభార్గవ వీరులు, ఆది= మొదలగువారియొక్క, భజనంబు= ఉపాసన, త్రైవర్గికునకుంగాక= ధర్మార్థకామాపేక్ష గలవారలకేగాని, అపవర్గకాంక్షులకు = ముముక్షువులకు, అయుక్తంబని = తగదని, స్మృతి = ధర్మశాస్త్రము, చెప్పన్ = తెలుపుచున్నది, 'అదియునుంగాక, ఈశ్వరునకున్, చేతనునకు = జీవునకును, నిత్యసంబంధంబు, మాతా = తల్లి, పితా = తండ్రి,

భ్రాతా = తోఁబుట్టువు, ఆవాసః = అధిష్ఠానము, శరణం= రక్షకుఁడు, (నీ శరణం గృహరక్షిత్రోః యని యమరము), సుహృత్ =మిత్రుఁడు, గతిః=ప్రాప్యము, నారాయణః= నారాయణుండే, ఆని= అట్లని, (లోపోనను ఆదికే విసర్గస్యయను సూత్రముచేత విసర్గలోపము), సమస్తంబునకుఁ బరాయణంబుగాన్= నిఖిలమునకును బరమపదంబుగాన్, అతనిన్ = ఆనారాయణుని, ప్రతిపాదించు = తెలుపునట్టి, శ్రుత్యంతరంబులను = మఱియొకశ్రుతిగలవు, అట్టిపరమేశ్వరుంగనుటకు = తాదృశదేవునిందెలిసికొనుటకు, తగినయోగంబు సెప్పెద = అనుకూలమైనయోగమునువచించెదను, ఖాండిక్యకేశిధ్వజ సంవాదంబు, వినుమని = ఆకర్ణింపుమని, యిట్లనియె = వక్ష్యమాణక్రమంబుగఁ బలికెను.

తా. పూర్వ కాలంబునఁ బరశురామునకు వెఱచి వైరాగ్యము నొంది నట్టి దివోదాసాత్మజుం డైన ప్రతర్దనుం డను వాఁడు మోక్షేచ్ఛ గల వాఁ డై జనార్దనునిం గానక యింద్రు నారాధింప నతండు ప్రత్యక్షమై నన్నుపాసన సేయుమనఁగా మదంతర్యామినుపాసన సేయు మన్నట్టి యర్థ మూహింపఁ బడియె నెట్లన్నను మున్ను గర్భమునం దుండియుఁ దపంబునం దీశ్వరునితోఁ దుల్యుం డైన వామదేవుం డను ముని సూర్యుఁడు నేను జంద్రుఁడు నే నగ్నియు నే నను శరీర వాచక శబ్దము శరీరి పర్యంతము వోవుట చేత నుభయ శరీరకుం డైన పరమాత్ముం గూర్చి యనుసంధాన మొనర్చె నని తెలిపి జీవుఁ డైన తా నుపాస్యుం డను గాన నిజ్ఞానవృద్ధుం డగు నింద్రుఁడు దదనుసంధాన న్యాయంబున నుప దేశించె నని వేదవ్యాస సూత్ర వేదాంత శాస్త్రముల యందు వివరింపఁబడియె ననియు బ్రహ్మ శివుఁడు భూమి మొదలగు పంచ భూతములు కాల మృత్యు ప్రభృతి నిఖిలం బగు చిదచిద్రూప విస్తారంబు లతని శరీరంబు లనియు నైనను శుద్ధంబగు నారాయణ స్వరూపమును దక్క మఱి యొక స్వరూపమును భజింపఁ గూడ దనియు బ్రహ్మాదు లను ధర్మార్థ కాముకాంక్షు లుపాసన సేతురు గాని మోక్షార్థు లుపాసన సేయ రని స్మృతులు దెలుపు చున్న వనియు జీవేశ్వరులకు నిత్య సంబంధం బనియు మాతా పితా భ్రాతా వాస శ్శరణం సుహృద్గతి ర్నారాయణ యని నిఖిలంబు నా నారాయణుం డని తెలుపు నట్టి కొన్ని శ్రుతు లున్న వనియు నట్టి పరమేశ్వరుం గనుటకు సాధకం బైన యోగంబు గలదు చెప్పెద ఖాండిక్య కేశిధ్వజ సంవాదంబు విను మని యిట్లనియె నని తాత్పర్యము.

మ. జనకాఖ్యాఖిల రాజ ముఖ్య నిమి వంశంబందు ధర్మధ్వజుం
డను భూజాని మితధ్వజాఖ్య వసుధాధ్యక్షుం జగద్రక్షణా

వనజాతాక్షుఁ గృతధ్వజాఖ్యుఁ గనియెన్ వారిద్దఱున్ గర్మఠుం,
ఘన విజ్ఞానుఁ గ్రమంబునం గనిరి తత్ఖాండిక్యుఁ గేశిధ్వజున్. ౧౩.

టీక. జనకాఖ్యాఖిలరాజము, జనక = జనకుఁడను, ఆఖ్య = పేరుగల, అఖిలరాజము = సమస్తరాజులుగల, నిమివంశంబు = నిమియను రాజుయొక్క వంశము, ఒప్పన్ = తనరునట్లు, (అనఁగా నా నిమి వంశంబునఁ బుట్టిన రాజుల కెల్ల జనకులను నామము గల దనుట), అందు = ఆ నిమివంశమందు, ధర్మధ్వజుండను = ధర్మధ్వజుం డనునట్టి, భూపాలి = భూపతి, మితధ్వజాఖ్య = మితధ్వజుఁడనుపేరుగల, వసుధాధ్యక్షున్ = అవనీశుని, జగత్ = జగత్తుయొక్క, రక్షణా = పాలనయందు, వనజాతాక్షున్ = విష్ణువైనట్టి, కృతధ్వజాఖ్యున్ = కృతధ్వజుఁడనువానిని, కనియెన్, వారిద్దఱున్ = వారిరువురును, క్రమంబునన్ = వరుసగా, కర్మఠున్ = యాగాదికర్మశీలుఁడైనట్టి, ఖాండిక్యున్ = ఖాండిక్యుఁ డనువానిని, ఘనవిజ్ఞానున్, ఘన = అధికమగు, విజ్ఞానున్ = జ్ఞానముగల, (అనఁగా బ్రహ్మనిష్ఠుఁడనుట), కేశిధ్వజున్ = కేశిధ్వజుఁ డనువానిని, కనిరి.

తా. నిమి వంశమందుఁ బుట్టిన రాజుల కెల్లను జనకులను నామము గల దనియు ఆ నిమి వంశోత్పన్నుఁడై నట్టి ధర్మధ్వజుం డను రాజు మితధ్వజుం డను నట్టియుఁ గృతధ్వజుఁ డను నట్టి యిద్దఱు బుత్త్రులుగాఁ బడసె, ననియు వా రిరువురును గ్రమంబుగ ననఁగా మితధ్వజుఁడు ఖాండిక్యుఁ డను వానిని కృతధ్వజుఁడు బ్రహ్మనిష్ఠుం డగు కేశిధ్వజుఁ డను వానిని గని రనియును తాత్పర్యము.

క. వారిరువురు దమలోపల, వైరము గొని రాజ్యకాంక్ష విజిగీషువులై,
పోరాపోరిం బోరిరి, బారాసి దినంబు లవని ప్రజలు దలంకన్. ౧౪.

టీక. వారిరువురు = ఖాండిక్యకేశిధ్వజులు, తమలోపల, వైరముగొని = వైరముఁబెట్టికొని, రాజ్యకాంక్షన్ = రాజ్యాపేక్షచేతను, విజిగీషువులై = జయేచ్ఛఁగలవారలై, పోరాపోరిన్ = ఎడతెగక, బారాసిదినంబులు = పండ్రెండ్రుది వసములు, అవనిప్రజలు = భూమియందలిప్రజలు, తలంకన్ = భయపడఁగా, పోరిరి = జగడమాడిరి, (బారాసి దినములనఁగా ద్వాదశదినములని కొందఱందురు).

తా. పిమ్మట నా ఖాండిక్య కేశిధ్వజు లిరువురును దమలో విరోధపడి రాజ్యాపేక్ష చేత నొకని నొకఁడు జయింప నిచ్ఛఁగలవారలై భూమి యందున్న ప్రజలు భయపడునటులఁ బండ్రెండు దినములు ఘోరమగు యుద్ధ మొనర్చిరని తా.

చ. పసపలవేఁగ నిచ్చలును వాజులు దీర్చి యతండు నాతఁడున్,
నొప్పులుపడి వచ్చి యిరువు పతివేళ దమపిరిగాఁగ వీఁగుచుం,

ఫలంబులం గోరక, మృత్యువున్ = సంసారమనుమృత్యువును, గెల్వన్ = జయించుటకు, అవిద్యన్ = అజ్ఞానముచేత, పుట్టకుండన్ = మరలజన్మించకుండ, తుదన్ = కడపట, చావకుండన్వలెన్ = చావకుండవలెననుచును, యోగసిరిచేన్ = యోగాసక్తిచేతను, జ్ఞానాశ్రయుండై = జ్ఞానమునాశ్రయించినవాఁడై, మఖ = క్రతువులయొక్క, అనీకంబున్ = సమూహమును, రచియించుచు = ఒనరించుచు, అందు = ఆక్రతువులయందు, ఒకటికిన్ = ఒకజన్మమునకు, దీక్షించి = దీక్షగైకొని, తాన్ = తాను, ఉన్నచోన్ = ఉండఁగా.

తా. పిమ్మట నా ఖాండిక్యుని రాజ్య మంతయుఁ దన స్వాధీన మై యుండఁగఁ గర్మ ఫలంబుల నపేక్షింపక మృత్యువును గెలువ వలెననియు నజ్ఞానముచేత మరలఁ బుట్టక కడపటఁ జావు లేకుండవలెననియు నపేక్షించి యోగస్థితిచేతను జ్ఞానము నాశ్రయించి యసంఖ్యేయంబు లగు క్రతువులం జేయుచు నందొక క్రతువునకు దీక్ష వహించి యున్న సమయంబున నని తాత్పర్యము.

చ. పులు మఖశాలికానికట◆ భూముల మేయుచు నేటి వెంటఁ బె,
ల్లలమెడు నీఱముం దరసి◆ యామ్య పతాకన ఘుమఁధేను వా,
కెలవుల నాడు వాలభుజగిం గని◆ గోండ్రని యంగ లార్చుచు,
న్గళగత ఘంట మ్రోయ నుఱుకం◆ బిడుగుం బలె దాఁకె యుద్ధతిన్. ౧౮.

టీక. ఘుమఁధేనువు = యాగధేనువు, మఖశాలికానికటభూములన్ = యజ్ఞశాలా సమీపభూములయందు, పులు = కసవును, మేయుచున్, ఏటివెంటన్ = నదివెంబడి, పెల్లలమెడు = మిగులదట్టమైన, ఈఱమున్ = పొదరింటిని, (సూ॥ సస్యాత్తద్ధస్తోతః యని తద్ధశాంతఃకవిశేషణమున కచ్యుతమైనప్పుడు నకారాగమము రాఁగా నలమెడునీఱమని యాయెను), తరసి = అనుసరించి, యామ్య = యమసంబంధియైన, పతాకన్ = ధ్వజపటమనఁగా, ఆకెలవులనాడు = ఆపార్శ్వమునందుఁ గదలుచున్న, వాలభుజగిన్ = పామువంటితోఁకను, కని = చూచి, గోండ్రనియంగలార్చుచున్ = గోండ్రనిమిడుకుచును, గళగత = మెడనున్న, ఘంటమ్రోయన్ = గంటధ్వనియించుచుండన్, ఉఱుకన్ = పరువెత్తఁగా, పిడుగుంబలె = అశనివలె, తాఁకె = స్పృశించి, ఉద్ధతిన్ = వడిచేతను.

తా. యాగ ధేనువు యజ్ఞశాలాసమీప ప్రదేశములందుఁ గసవు మేయుచు నేటివెంట దట్టమగు పొదరింటి నానుకొని యమ సంబంధియైన ధ్వజ పట మను నటుల నా పార్శ్వమునం గదలుచున్న పాము వంటి పుచ్ఛము తోఁకను జూచి గోండ్రని యంగలార్చుచు మెడ నున్న ఘంట మ్రోయునటుఁ బరువెత్తినను వదలక పిడుగు వలె వెంబడించి తాఁకె వడిచేత నని తాత్పర్యము.

ఉ. గబ్బి సమక్షికం బయి మొగంబడువ న్దరుపర్ణము ల్పడం,
బ్రొబ్బుచుఁ గామొగిళ్ల రొదతోఁ బురణించెడు బొబ్బరింతగా,
డ్పుబ్బి విసంజ్ఞగాఁగఁ జెవులూదిన వల్లవుఁ డుర్విఁ గూలఁగా,
బెబ్బులి గొంతు క్రోల్గఱచి పెల్లున మామెడ ద్రెళ్ల దాఁటుచున్. ౧౯.

టీక. గబ్బి = దుర్గంధము, సమక్షికంబయి = ఈఁగెలతోఁ గూడినదై, మొగంబడువన్ = ముఖమునఁ గొట్టుచుండఁగా, తరుపర్ణముల్పడన్ = చెట్లనున్న యాకులురాలునట్లుగ, ప్రొబ్బుచున్ = త్రోయుచును, కామొగిళ్ల = వర్షాకాలపు మేఘములయొక్క, రొదతోన్ = ధ్వనితోడను, పురణించెడు = సమానమగునట్టి, బొబ్బరింత = ఆర్పుటయొక్క, గాడ్పు = గాలి, ఉబ్బి = ఉల్బణమై, విసంజ్ఞగాఁగన్ = ఒడలెరుగకుండునట్లుగాను, చెవులూఁదిన = కర్ణములఁ బ్రవేశింపఁగా, వల్లవుఁడు = గొల్ల, ఉర్విన్ = భూమియందు, కూలఁగాన్ = పడఁగా, బెబ్బులి = పెద్దపులి, గొంతుక్రోల్ = గొంతుక్రోవి, కఱచి, పెల్లున = అతిశయముచేత, మామెడన్ = మాఱుమెడలోను, త్రెళ్లన్ = పడునట్లుగా, దాఁటుచున్ = లంఘించుచును.

తా. ఈఁగెలతోఁ గూడిన దుర్గంధము ముఖమునకుఁ గొట్టుచుండ చెట్ల యందున్న యాకులు రాలునటుల నూకుచును మేఘధ్వనినంటి రొదచేత నిండియున్న ఆర్పువలని గాలి యుబ్బి స్మృతి దప్పునట్లుగఁ జెవులూఁదినఁ బసులకాపరి యైన గొల్లవాఁడు నేలఁ బడఁగాఁ బెద్దపులి ధేనువు మెడ గొంతికి మాఱు మెడతోఁ బడు నటుల దాఁటుచు నని తాత్పర్యము.

ఆ. వె. తనువుఁ గొమ్ము గొరిజఁ గొనకుండ మలఁపుచుఁ,
జప్పు డేసఁగఁ దోఁక నప్పళించి,
శోణితంబుఁ గ్రోలుచు నేర్పుమై ఘుమన్,
గవిని గవికి నీడ్చు నవసరమున. ౨౦.

టీక. ఆవ్యాఘ్రము, కొమ్మున్ = ఆగ్రోవుయొక్క శృంగమును, గొరిజన్ = గొరిసెలను, కొనకుండ = తాఁకకుండ, తనువున్ = దేహమును, మలఁపుచు = మరలించుచు, చప్పుడేసఁగన్ = ధ్వనించునటుల, తోఁకన్ = వాలమును, అప్పళించి = తాటించి, శోణితంబున్ = రక్తమును, క్రోలుచున్ = పానము సేయుచు, నేర్పుమైన్ = నేర్పుతోను, ఘుమన్ గవిన్ = యాగధేనువును, గవికిన్ = కొండగుహకు, ఈడ్చు నవసరమున = ఈడ్చు సమయమందు.

తా. ఆ పులి యాగోవుయొక్క కొమ్ములు గొరిసెలు దాఁకకుండ దాని శరీరము మరలిచి తన తోఁకను ఝాడించుచు రక్తపానము సేసి తన సామర్థ్యమునఁ గొండగవికి నీడ్చుచున్న సమయంబునని తాత్పర్యము.

చ. పొలమరులందుఁ గూఁతలిడ భూసురు లన్నది వార్చి వార్చి ప్రాఁ
కుల తుద లెక్కి చప్పటలు గొట్టి యదల్పఁగ సాహిణీలు మా
వులఁ బఱపంగ వైచి సెలవుల్ వెస నాకుచు బోయె వృక్షమం
డలికయి తూలుచు న్ఘుటఘుటధ్వని సారె మలంగి చూచుచున్. ౭౧.

టీక. అందు = అక్కడను, పొలమరులు = పొలముఁదిరుగువారు, కూఁతలిడన్ = కూఁతలుపెట్టఁగా, భూసురులు = బ్రాహ్మణులు, అన్నదిన్ = అనదియందు, వార్చివార్చి = సంధ్యవార్చి, ప్రాఁకులతుదలెక్కి = కొనప్రాఁకులకెక్కి, చప్పటలు గొట్టి = చప్పట్లుగొట్టి, అదల్పఁగన్ = అదలింపఁగా, సాహిణీలు = రౌతులు, మావులఁ బఱపంగన్ = గుఱ్ఱములనెక్కి తఱుమఁగా, వైచి = ఆధేనువునువిడిచి, సెలవులునాకుచు, వెసన్ = గొబ్బున, వృక్షమండలికయి = చెట్లుమెండుగ నుండుచోటికి, తూలుచున్ = తూఁగుచును, ఘుటఘుటధ్వనిన్ = ఘుటఘుటధ్వనిచేత, సారెన్ = మాటిమాటికి, మలంగిచూచుచున్ = మరలిచూచుచును.

తా. ఆ ప్రాంతములందుఁ బొలముఁ దిరుగు వారలు సూచి కూఁతలిడఁగా విని బ్రాహ్మణులా నదియందు సంధ్యవార్చి చెట్లపైనెక్కి చప్పట్లు గొట్టి యదలించుచుండ నంతలో రౌతులు గుఱ్ఱముల నెక్కివచ్చి తఱుమఁగా నా పెద్దపులి సెలవుల నాకుచు శీఘ్రముగ మిగులఁ జెట్లు గలిగియున్న చోటికి ఘుటఘుటధ్వనిఁ జేయుచుఁ బలుమాఱు వెనుకఁ దిరిగి చూచుచు వెళ్లెనని తాత్పర్యము.

కం. చుఱుచుఱుకున నెత్తురు వెలి,
కుఱుకుచు రొద సేయ నటితి యొడపిన యార్పు,
ల్పఱవ మిడి గ్రుడ్లు వడఁకఁగఁ,
గొఱ ప్రాణము తోడఁ దన్నికొను నమ్మొదవున్. ౭౨.

టీక. చుఱుచుఱుకునన్, నెత్తురు = రక్తము, వెలికి = వెలపటికి, ఉఱుకుచు = బయలువెడలుచు, రొదసేయన్ = చప్పుడుసేయఁగా, అటితియొడపిన = మెడగండివలననై, ఊర్పులు పఱవన్ = వెడలఁగాన్, మిడిగ్రుడ్లు = మిట్టగ్రుడ్లు, వడఁకఁగన్ = వణఁకుచుండఁగా, గొఱప్రాణముతోడన్ = కొసఉసురుతోడన్, తన్నికొను = తన్నుకొనుచున్న, అమ్మొదవున్ = ఆగోవును.

తా. సుగమము.

సీ. విన్నవించుటయు ఋత్విజులఁ బ్రాయశ్చిత్త మడిగె రా జడిగిన నడుగు మనిరి,
వారు కసేరువుఁ దా రెఱుఁగక పోయి యతఁడును శునకుని నడుగు మనిగొ,
నతఁడు దాను నెఱుంగ ననిపల్కె నృప వినుమా ఋత్విజ్యుల పిండు నా కసేరు,

ఏను నెఱుంగ లేమిఁక నొక్క యేమె కా • దిలమఱి యెవ్వాఁడు నెఱుఁగఁ డెవ్వఁ
డేని సప్తాంగములు నీకు నిచ్చి చెట్లు • వట్టి పెన్నాలితిప్పలు వట్టి తిరుగు,
నట్టి ఖాండిక్యుఁ డొక్కఁడ యరయ నెఱిఁగె • నేని యెఱుఁగు వేఁడుమ దికజ్జమేని యనిన.

టీక. విన్నవించుటయు = ధేనువుకథను రాజునకుఁ దెలిపినను, రాజు, ఋత్విజులన్ = ఋత్విజులను, ప్రాయశ్చిత్తమడిగెన్, అడిగినన్ = అడుగఁగా, వారు. తా రెఱుంగక పోయి = తా మెఱుంగమిగాన, కసేరువున్ = కసేరువను ఋషిని, అడుగుమనిరి, అతఁడును = ఆకసేరువును, శునకునిన్ = శునకమహర్షిని, అడుగుమనియెన్, అతఁడు = ఆశునకుండు, తానున్ = తానును, ఎఱుంగన్ = ఎఱుఁగను; అనిపల్కి = అట్లనిచెప్పి, నృప = ఓరాజా, వినుము = ఆలకింపుము, ఆఋత్విజుల పిండును = ఋత్విక్సమూహమును, ఆకసేరువును. ఏనున్ = నేనును; ఎఱుంగలేము = ఎఱుఁగఁజాలము, ఇఁక నొక్క యేమె కాము = ఒకనేము మాత్రమె యెఱుంగనివారము కాము, ఇలన్ = భూమియందు, ఎవ్వాఁడును = ఎట్టివాఁడును, ఎఱుఁగఁడు = తెలిసికొనఁడు, ఎవ్వఁడేని = ఎవ్వఁడైన, నీకు, సప్తాంగములు = స్వామ్యమాత్య సుహృత్కోశ రాష్ట్రబలదుర్గము లనియెడి సప్తాంగములను; ఇచ్చి = ఒసఁగి, చెట్లు వట్టి = వృక్షములంబట్టి, పెన్నాలితిప్పలు వట్టి = పెద్దతాటిగుట్టలంబట్టి, తిరుగున్ = సంచరించుచున్నవాఁడో, అట్టిఖాండిక్యుఁడు, ఒక్కఁడ = ఒకఁడుమాత్రమె; అరయన్ = విచారింపగా, ఎఱిఁగెనేని = ఎఱింగియుండెనేని, ఎఱుఁగున్ = ఎఱిఁగియుండును, అది = అడుగుట, కజ్జమేని = కర్తవ్యమాయెనా, వేఁడుము = అడుగుము; అనిన = అనఁగాన్.

తా. ఆ ధర్మధేనువు యొక్క వృత్తాంతము రాజునకు విన్నవింప నతఁడు ఋత్విజులను ప్రాయశ్చిత్త మడుగఁగా దమకుఁ దెలియదు గానఁ గసేరువను ఋషి నడుగుమనిరి వాని నడుగఁగ నాకసేరువు శునకుని నడుగుమనియె నాశునకు నడుగఁగా నతడు నాకుఁ దెలియదని పల్కి రాజా ఋత్విజులకును గసేరువునకును నాకును దెలియదు గదా భూమియం దెవ్వరికిని దెలియదు తెలిసియున్న యెడ నెవ్వఁడు సప్తాంగముల నీకిచ్చి యడవి పాలై చెట్లు గుట్టలు వట్టి తిరుగుచున్నవాఁడో యట్టి ఖాండిక్యునికిఁ దెలిసి యుండవచ్చును గాన నా ప్రాయశ్చిత్త మడుగుట యవశ్యకముగఁ గర్తవ్యమాయె నేని యతని నడుగ వలయు నని చెప్పెనట.

చ. నరపతి పల్కె మాని వర • నారిపు నిష్కృతి వేఁడ బోయి నం,
ధరహతుఁ జేసె నేని సవనంపు • ఫలం బొడ గూడుఁ గాక మ,
త్సరగతిఁ జెప్పె నేని మఖతంత్ర • మతంత్రముఁ గాక పూర్ణమౌ
సిరు వెఱుఁగు న్మదీప్సితము • యేగెద నంచు రథాధిరూఢుఁడై. ౬౮.

టీక. నరపతి = రాజు, పలికెన్ = శునకునితో ననియెను, మౌనివర = మునిశ్రేష్ఠుఁడా, నారిపున్ = నాశత్రువును, నిష్కృతిన్ = ప్రాయశ్చిత్తమును, వేఁడం బోయినన్ = అడుగఁబోతినేని, ధరన్ = నేలపై, హతుఁ జేసె నేని = చంపెనా, సవనఫలంబు = యజ్ఞఫలంబు, ఒడఁగూడు = సిద్ధించును, కాక = అట్లుకాక, అమత్సరగతిన్ = మత్సరపుమార్గము విడిచి, చెప్పెనేని = ప్రాయశ్చిత్తము వచించినయెడ, మఖతంత్రము = యజ్ఞకృత్యము, అతంత్రముగాక = క్రమముతప్పక, పూర్ణతన్ = నెఱవేరును, ఇరుదెఱంగుల్ = రెండువిధములు, మదీప్సితమె = నాకోరఁబడినవే, ఏఁగెదనంచు = పొయ్యెదనని, రథాధిరూఢుఁడై = అరదము నెక్కినవాఁడై.

తా. ఆ కేశిధ్వజుండును రాజు శునకునితో నోయి మునిశ్రేష్ఠుఁడా నాయొక్క శత్రువును ప్రాయశ్చిత్త మడుగఁ బోయిన సమయంబున నేలపైఁ జంపె నేని యజ్ఞమధ్యంబున శరీరము విడుచుటచేత యజ్ఞఫలము చేకూరునులేక మాత్సర్యము వదలి ప్రాయశ్చిత్తము సెప్పెనేని యజ్ఞానుష్ఠానము పరిసమాప్తి నొందును గాన నీరెండు విధంబులు నా మనోరథంబు లగుటచేతఁ బోయెద నని చెప్పి రథము నెక్కెనని తాత్పర్యము.

క. హరిణాజి నోత్తరీయుండు,
నిరాయుధుఁడు నగుచు నతని౯ నెల వగు నడవిం,
జొర గొట్టికాండ్రు టెక్కెముఁ,
బరికించి యెఱింగి కలయఁ బడి౯ కూఁత లిడన్. ౨౪.

టీక. హరిణాజిన = జింకచర్మము, ఉత్తరీయుండు = పైవస్త్రముగాఁగలవాఁడును, నిరాయుధుఁడును = ఆయుధము లేనివాఁడును, అగుచున్ = ఐ, అతనినెలవగు = ఆఖాండిక్యునికి స్థానమైన, అడవిన్ = అరణ్యమును, చొరన్ = ప్రవేశింపఁగాన్, గొట్టికాండ్రు = అచ్చటనున్న వేగువాండ్రు, టెక్కెముఁబరికించి = టెక్కెమును జూచి, ఎఱింగి = కేశిధ్వజుండని తెలిసి, కలయఁబడి = కూడి, కూఁతలిడన్ = కూఁతలు పెట్టఁగా.

తా. జింకచర్మము నుత్తరీయంబుగ ధరియించి నిరాయుధుండై యాఖాండిక్యునకు నివాసస్థానమగు నడవిఁ జొచ్చి పోఁగా నచ్చటనుండు వేగువాండ్రు టెక్కెముఁ జూచి రాజని యూహించి కలసి కూఁతలు సేయ సాగిరని తాత్పర్యము.

ఆ.వె. వలుస బెదర నృపతి గలఁగక౯ ప్రజ వగ,
లార్పఁ బనిచి కనమ౯ లందు నిలువ,
వేలు వేట యేర్చి విలువుందిఁ౯ బనిచి తాఁ,
దడుకు వెండె మలుక౯ వాడమ వెడలి. ౨౫.

టీక. వలుసబెదరన్ = వలసవచ్చియున్న జనముభయపడఁగా, నృపతి = ఖాండిక్యుఁడు, కలఁగక = చలింపక, ప్రజవగలు = జనులుచింతలు, ఆర్పన్=మాన్పుటకు, పనిచి = కొందఱఁబంపి, కనములందు నిలుపన్=గండ్లుకాచుటకు, విలునందిన్ = విలుకాండ్రను, వేఱువేఱయేర్చి = ఏర్పరచి, పనిచి = పంపి, తాన్ = తాను, అలుక = కోపము, పొడమన్ = అంకురింపఁగా, తడుకుపెంటెము = లెట్టువాకిటితలుపు, వెడలి = వెళ్లివచ్చి.

తా. వలుస వచ్చియున్న ప్రజలు బెదరఁగ నాఖాండిక్యుఁడు, చలింపక ప్రజల గోడు మాన్పుటకుఁ గొందర నియమించి గండ్లు గాచుటకు విలుకాండ్రఁ జేర్పఁజేచి పంపి తాను గోపయుక్తుండై తడికపెంటెము వెడలి వచ్చెనని తాత్పర్యము.

కం. వచ్చు రిపుఁ జూపులనె చుఱుఁ,
బుచ్చుచు సిరిఁ గొనుట మగుడఁ, బొడముటఁ రుష ము,
చ్చిచ్చునను వెచ్చమరి వి,
ద్యుచ్చలచాపజ్యఁ దూపుఁ, దొడుగుచుఁ బలికెన్. ౨౭.

టీక. వచ్చు = తనదిశకువచ్చెడి, రిపున్ = శత్రుఁడైనకేశిధ్వజుని, చూపులనె = చూపులచేతనే, చుఱుఁబుచ్చుచు = దహించుచు, సిరిఁగొనుట = రాజ్యముఁదీసికొనుట, మగుడఁబొడముట = మరలవచ్చుట, రుష = రోషము గలుగుటయును నీ, ముచ్చిచ్చునను = మూఁడగ్నులచేతను, వెచ్చమరి = వేఁడిగలిగి, విద్యుత్ = మెఱుపువలెను, చల=కదలుచున్నట్టి, చాపజ్యన్=వింటియల్లెయందు,తూపుఁదొడుగుచున్ = బాణముదొడుగుచును, పలికెన్ = వచించెను.

తా. తన దిక్కునకు వచ్చుచున్న కేశిధ్వజుని ఖాండిక్యుండు చూపులచేతనే దహించుచు రాజ్యముఁ దీసి కొనుటయు మరల వచ్చుటయు రోషము గలుగుటయు నీ మూఁడు విధంబులైన యగ్నిచేతఁ వేడిమిని బొంది మెఱుపు వలెఁ జపలమైనట్టి వింటి యల్లెయందు బాణముఁ దొడుగుచును బలికె నని తాత్పర్యము.

మ. ధన ధాన్య ద్విరదాశ్వ గోధనః సమేతం బెల్ల సామ్రాజ్యముం,
గొనియుం జాలక తాటకేయ పలః ఘుక్కూటాకృతిం జికతో,
లున నాచ్చన్నుఁడవై ప్రశాంతుః గతి మాలోఁ జొచ్చి ప్రాణంబులుం,
గొన నేతెంచి తె దుమఱత్తీ, గెడపెద న్గాత్రంపు భల్లంబునన్. ౨౮.

టీక. ధనము, ధాన్యము, ద్విరద = ఏనుంగులు, అశ్వములు, గోధన= గోవులనెడి ద్రవ్యములతో, సమేతంబు = కూడిన, ఎల్లసామ్రాజ్యముం గొనియున్ = సామ్రాజ్యమంతయుఁ గైకొనియును, చాలక = తృప్తినొందక, తాటకేయ = తాట

కాపుత్రుఁడైన, పలభుక్ = మాంసభక్షకుఁడైన మారీచునియొక్క, కూటాకృతిన్ = కపటాకారముతో, ని. "మాయానిశ్చల యంత్రేషు కైతవానృత రాశిషు, అయోఘనే శైల శృంగే సీరాంగే కూటమస్త్రియాం" మని యమరము, జింకతోలునన్ = కృష్ణాజినము చేత, ఆచ్ఛన్నుఁడవై = కప్పఁబడినవాఁడవై, ప్రశాంతుగతిన్ = శాంతునిం బలె, మాలోన్ = మాలోపలను, చొచ్చి = ప్రవేశించి, ప్రాణంబులుంగొనను = ప్రాణములనుం దీసికొనుటకు, ఏతెంచితె = వచ్చితివా, దుర్మతీ = ఓరిదుర్బుద్ధీ, క్రూరంపుభల్లంబునన్ = ఘోరమైనయమ్ముచేతను, కెడపెదన్ = పడవేసెదను.

తా. ధనధాన్యాది సకల సామ్రాజ్య సమృద్ధంబగు రాజ్యముం గైకొనియును దృప్తి లేక మాయావేషము ధరియించిన మారీచునిం బలె జింకతోలుఁ గప్పుకొని వచ్చి మాలోఁ జొచ్చి మదీయ ప్రాణంబు లపహరింప వచ్చితివా దుర్బుద్ధీ నిన్ను జెడిదపు బాణమునఁ బడ వేసెద నని ఖాండిక్యుండు వచించెనని తా.

మహాస్రగ్ధర. అనినం జేయెత్తి యోహో యలుగక వినుమా నాతతాయి న్బ్రమాదం
బున వైకల్యంబు యాగంబునకుఁ బొడమ నే భూసురశ్రేణి వేఁడ,
న్నిను నావేదించి పంపె న్నృప యత డెఱుంగు న్నిష్కృతి న్వేఁడుమహో హో,
మ్మని కోప మ్మైన రోపమ్మైన విడుపు మెల్లైన మే లింక నన్నన్. ౭౯.

టీక. అనినన్ = ఇట్లనఁగా, కేశిధ్వజుండు, చేయెత్తి = హస్తముఁ బైకెత్తి, ఓహో, అలుగక = కోపింపక, వినుమా = ఆకర్ణింపుము, ఆతతాయిన్ = వధోద్యతుఁడను, (వధార్హుఁడనియుఁ జెప్పవచ్చును), కాన్ = కాను, శ్లో. "అగ్నిదో గరదశ్చైవ శస్త్రపాణిర్ధనాపహః। క్షేత్రదారాపహర్తా చ షడేతే హ్యాతతాయినః॥ ఆతతాయి నమాయాంతం హన్యాదేవా విచారయన్" అని మనుస్మృతి, ప్రమాదంబునన్ = మాంద్యముచేత, యాగంబునకు = యజ్ఞమునకు, వైకల్యంబు = వికలత్వము, పొడమన్ = పుట్టఁగా, ఏన్ = నేను, భూసురశ్రేణి = విప్రసంఘమును, వేఁడన్ = ప్రాయశ్చిత్తమడుగఁగా, నృప = రాజా, అతఁడు = ఖాండిక్యుఁడు, ఎఱుఁగున్ = తెలిసినవాఁడు, నిష్కృతిన్ = ప్రాయశ్చిత్తమును, వేఁడుము = అడుగుము, హోహో మ్మని, నినున్ = నిన్ను, ఆవేదించి = నిరూపించి, పంపెన్ = పైనముసేసెను, కోపమ్మయినను = రోషమునుగాని, లేక, రోపమ్మయినను = బాణమునయినను. ని. "పత్త్రీ రోప ఇషుర్ద్వయోః" యని యమరము. విడువుము, ఎల్లైనన్ = ఏవిధంబైనను, ఇంకన్ = ఇఁకమీఁదను, మేలు = క్షేమము, అన్నన్ = అనఁగా.

తా. ఖాండిక్యుండు చంపెద ననఁగా విని కేశిధ్వజుండు చేయెత్తి యోహో కోపింపకుము మఱి "హన్యాదేవా విచారయన్" అను మనువచన ప్రకారము విచా

రింపకయె వధించుటకు నేనాతతాయని గాను బుద్ధి మాంద్యము వలన జన్మమునకు వైకల్యమొదవఁ గవి ప్రసంఘమును ప్రాయశ్చిత్తము వేఁడ నంచులకు నోయి రాజా యాఖాండిక్యుం డక్క నెవ్వరికిం దెలియదు గాన నతని వేఁడుము పొమ్మని నిన్నా వే దించి పనిచిరి గానవచ్చితిని రోషమును వదలి ప్రాయశ్చిత్తము సెప్పినను శ్లేకబాణ మును విడిచి వధించినను నీకనుఁదే విధం బైనను క్షేమంబే యని పలికె నని తా.

వ. అతండు తరుషండంబు సొచ్చి మంత్రి పురోహితప్రభృతి సుహృజ్జనంబులకుఁ దద్వృత్తాంతంబుఁ జెప్ప మంతనంబునకుం జొచ్చిన మంత్రు లిట్లనిరి. ౩౦.

టీక. అతండు = ఆఖాండిక్యుఁడు, తరుషండంబుసొచ్చి = చెట్లగుంపులోపలికిఁబోయి, మంత్రి పురోహిత ప్రభృతి సుహృజ్జనంబులకున్ = ప్రధాను పురోహితులు మొదలగు నా ప్తజనంబులకును, తద్వృత్తాంతంబు సెప్పి = ఆ కేశిధ్వజుని యొక్క వృత్తినింజెప్పి, మంతనఁబునకున్ = ఆలోచించుటకు, చొచ్చినన్ = ప్రవేశింపఁగా, మంత్రులు = ప్రధానులు, ఇట్లనిరి.

తా. సుగమము.

కం. పాలు గల వాఁడు మన కొక,
జాలి యిడక తానె తారఁ సానకు వచ్చెఁ,
వేళ యిదె లెమ్ము నృప కృప,
జాలు న్గారాకు మేపి చంపకు ప్రజలన్. ౩౧.

టీక. పాలుగలవాఁడు = దాయాదుఁడయినవాఁడు, మనకొక జాలియిడక= మనకొక వ్యథపెట్టకయె, తానె, తారసానకు వచ్చెన్=తలపడుట కేతెంచెను, ("వికృతౌక్వచిచ్చలోపోమా దీర్ఘశ్చాత ఆదిమస్యభ వేత్త"సుసూత్రముచేత ము లోపమును బూర్వవర్ణ దీర్ఘంబునుంగలిగె), వేళయిదె = సమయమిదె, నృప = రాజా, కృపచాలును = దయచేసిచాలును, ప్రజలను= మీప్రజలను, కారాకుమేపి= మురికూరదినిపించి, చంపకుము = వధింపకుము, లెమ్ము.

తా. మంత్రులు దాయాదుఁ డైన వాఁడు మన కొకశ్రమ నియ్యక తానె తారసమునకువచ్చెఁ గాన నిదె సమయము రాజా శత్రువు విషయమయి మీదయచాలును మీసేవకులగు ప్రజలను మురికూరఁ దినిపించి చంపకుము శీఘ్రముగ యుద్ధమునకు లెమ్మని రని తాత్పర్యము.

ఉ. అంటులు గట్టి చేలకును నాంధ్రులను బిడ్డలు గూరఁగోయఁబోఁ,
గంటకము లృద్గాగ్రములఁ గాఁడఁగ దూసిన నొప్పిఁ గూయిడ,
న్గంటికి నిద్రగాన కొదుగంఁ బడి కేఁగెద మింద నొక్కనా,
కంటయ కాచు నీవుఁ వడు నట్టి యవస్థ వచింప శక్యమే. ౩౨.

టీక. అంఘ్రిను= భార్యలును, ("నిత్యం దారా దేశ్చ స్యాల్లోర్థుల యోరుసౌ చతత్రశస్స"అను సూత్రము చేతనాం(శ్రము,) బిడ్డలు, అంటులుగట్టి=గుంపులుగట్టుకొని, చేలకుఁ = చెలికలకు, కూరఁగోయఁబోక, కంటకముల్ = ముండ్లు, పదాగ్రము లకు = కాళ్లకొసలయందు, కాఁడఁగఁగ = నాటఁగా, యూసిప్పిక్ =విడఁదీసినవాప్పి చేతను, కూయిడక = కూఁతలువెట్టఁగక, కంటికినిద్రగానక = కంటికినిద్రయేయుం గక, ఒదుగంబడి = ఒదిగి, వేఁగెదము = వేఁగుచున్నారము, ఒక్క మాకంటయ కాదు = మాకుమాత్రమనుకేకాదు, ఇంచుక = ఇక్కడ, నీవుపడు నట్టియవస్థ= నీవు పడుకష్టము, వచింపశక్యమె = చెప్పఁదరమా.

తా. అంఘ్రి బిడ్డలును జెలికలయందుఁ గూరలు గోయం బోవుc తటిc గాళ్ల ముండ్లు నాటినందియcగానే నాప్పిచేతc గూతc విడc గంటికి నిద్ర చొట్టక యుచ్చట నొదిగికొని వేఁగు చున్నార మిట్టి శ్రమ మాకు మాత్ర మె కాదు నీవు పడు నట్టి యవస్థ చెప్పఁదరము గా కున్నదని పలికి రని తాత్పర్యము.

తే. స్వామ్యమాత్య సుహృత్కోశ జనపద బల,
దుర్గములు స్వామి గలిగినఁ దొలుతఁ గలవు,
అంగి సుఖియైన నంగంబు లటుకు మును పె,
చాల సుఖు లౌట మనకుఁ దృష్టంబు గాదె. 33.

టీక, స్వామి = ప్రభుత్వము, అమాత్య = మంత్రులు, సుహృత్ = ఆప్తులు, కోశ = భండారము, జనపద = దేశము, బల=చతురంగబలము, దుర్గములు= కోటలు, ఇవి, స్వామి = ప్రభువు, కలిగినఁ = కలిగినట్లాయెనేని, తొలుతఁగలవు= అమాత్యాదులుముందేకలరు, అంగి = శరీరి, సుఖియైన = సుఖముగలవాఁడాయెనేని, అంగంబులు = కరచరణాదులు, అటుకుమును పె = అంతకుముందఱనే, చాలసుఖులౌట = మిగుల సుఖముగలవౌట, మనకుదృష్టంబుగాదే = మనకుదృష్టాంతముగాదా.

తా. స్వామ్యమాత్యాది సప్తాంగములు రాజు గలిగె నేని యటకు మున్నె యమాత్యాదులుం గలరు శరీరి సుఖియైన యెడఁ గరచరణాద్యవయవములు మున్నె సుఖంబులం బడసి యుండుట మనకు దృష్టాంతముగ నుండలేదా యని నుడివిరనితా,

కం. అతని పనిఁ దీర్చ రాజ్య, ద్వితయము నినుఁ జేరునెట్టి వెఱవున నైనక్,
ఓరిపుల కరి జయము ధనో, న్నతియుఁ బ్రజా నీతి రక్షణము ధర్మంబుల్.

టీక. అతనిపనిఁదీర్పక = ఆకేశిధ్వజునిం జంపింతిషేc, రాజ్యద్వితయము = మీయుభయుల రాజ్యములు, నినుc = నిన్ను, చేరుc = పొందును, ఎట్టివెఱవుననై [illegible] = ఏయుపాయము చేతనైనను, అరిజయము= శత్రుసంహారము, ధనోన్నతియు=

ధనమార్జించుటయు, ప్రజానీతిరక్షణము = ప్రజలయొక్క నీతిచెల్లించుటయు, ఇవి, క్షితిపులకు = రాజులకు, ధర్మంబుల్ = ధర్మములు.

తా. ఆ కేశిధ్వజుని వధియించితి వేని మీ యిరువుర రాజ్యములు నిన్నుఁ జేరును ఎట్టి నేర్పుచేతఁ గాని శత్రుసంహారము సేయుటయు ధన మార్జించుటయుఁ బ్రజలను నీతిప్రకారముగఁ బాలించుటయు నివి క్షత్రియ ధర్మంబు లని తాత్పర్యము.

కం. అన్యాయంబున దుస్సహ,
మన్యుండగు ప్రబలరిపుని మడియించిన ధ,
ర్మన్యక్కృతి కగు నిష్కృతి,
సన్యాయంబుగఁ బ్రజాళి సంరక్షింపన్. ౩౫.

టీక. దుస్సహమన్యుండగు=సహింపరాని యాగ్రహముగలవాఁడైన, ప్రబలరిపునిన్ = బలవంతుఁడైన శత్రువును, అన్యాయంబునన్ = అనీతిచేతను, మడియించిన = మడియించుటవలని, ధర్మన్యక్కృతికి = ధర్మతిరస్కారమునకు, ప్రజాళిన్ = ప్రజలసంఘమును, సన్యాయంబుగన్ = న్యాయయుక్తముగా, సంరక్షింపన్ = పరిపాలింపఁగా, నిష్కృతి = అదెప్రాయశ్చిత్తము, అగున్.

తా. మిగుల రోష యుక్తుఁడైన శత్రువునన్యాయముగ వధియించిన పక్షమున ధర్మ తిరస్కారమగును నందులకు న్యాయముగా దయతోఁ బ్రజాపాలన మొనరించిన యెడ నదియె ప్రాయశ్చిత్త మగుఁ గాన నిరాయుధుఁడైనచ్చిన పగవానిం జంపిన యెడఁ బ్రాయశ్చిత్త మొనరింప వచ్చునని చెప్పి రని తా.

కం. తన రాష్ట్రము చెడ వచ్చిన,
ననిమిష పతి విప్రుఁ డనక యాచార్యుఁ ద్రిశీ,
ర్షునిఁ దునుమఁడె విడువుము దయ,
నిను నమ్మిన ప్రజలు నవయ నీ దయ యేలా. ౩౬.

టీక. తనరాష్ట్రము = తనరాజ్యము, చెడవచ్చిన = హానిఁజెందరాఁగా, అనిమిషపతి = దేవేంద్రుండు, విప్రుఁడనక = బ్రాహ్మణుండనక, ఆచార్యున్ = గురువైనట్టి, త్రిశీర్షున్ = విశ్వరూపుని, తునుమఁడె = వధింపఁడా, దయన్ = శత్రునిమీఁదికృపను, విడువుము = వదలుము, నినునమ్మినప్రజలు, నవయన్ = కష్టపడఁగా, నీదయ = నీకృప, ఏలా = ఏటికి.

తా. దేవేంద్రుండు తన రాజ్యమునకుఁ గీడొనరించుచున్న యాచార్యుండగు విశ్వరూపునిం బ్రాహ్మణుండని విచారింపకయే వధింపలేదా. శత్రునిమీఁద ను

న్న కృప విడువుము నిన్ను నమ్మియుండు ప్రజలు కష్టపడుచుండఁగా నీ దయ వల్ల నేమి ప్రయోజనం బనిపలికె రని తా.

కం. శిష్టు నిను నింతఁ జేసిన, దుష్టాత్ముని బిలుకు మార్చి, దురితము పిదప,
నష్టంబుగ భూవల్లభ, యిష్టాపూర్తములు సేసి, యెసఁగఁగరాదే. ౩౭.

టీక. శిష్టున్ = శిష్టుఁడవైనట్టి, నినున్ = నిన్ను, ఇంతఁ జేసిన, దుష్టాత్మునిన్ = దురాత్మునిన్, బిలుకుమార్చి = చంపి, పిదపన్ = పిమ్మటను, దురితము = పాపము, నష్టంబుగన్ = నశించునటుల, భూవల్లభ = రాజా, ఇష్టాపూర్తములుసేసి = క్రతువులు వాపీకూపాది నిర్మాణము సేసి, (ని. "అథ క్రతుకర్మేష్టం పూర్తం ఖాతాది కర్మ" యని యమరము,) ఎసఁగఁగరాదె = ఒప్పరాదె.

తా. పూజ్యుండవైన నిన్ను వ్యథపెట్టిన దుష్టుండగు శత్రునిం జంపి పిదపఁ బాపములు పోవుటకుఁ గాఁ గ్రతువులు వాపీ కూపాది ధర్మములు సేయఁ గూడదా యని వచించి రనుట.

తే.గీ. ఇంక రెణ్ణాళ్లు సూచి నీ వంకఁ దెగువ,
గలుగ కుండినఁ బ్రజ లూళ్లు, దలఁచి పోవ,
మౌని వగుట యె యొండె, విహీన సంధి,
నతనిఁ గను టొండె గాకుండు, మతము గలదె. ౩౮.

టీక. ఇంకన్ = ఇఁకను, రెణ్ణాళ్లుసూచి = రెండుదినములుసూచి, నీవంకన్ = నీయందు, తెగువ = తెంపు, కలుగకుండినన్ = లేకయుండినను, ప్రజలు = జనులు, ఊళ్లుదలఁచిపోవన్ = తమతమయూళ్లుస్మరించిపోయినయెడ, మౌనివగుటయె = మునివగుటకాని, విహీనసంధిన్ = హీనమగుసంధిచేత, అతనిఁగనుటొండె = ఆశత్రువుని జేరుటగాని, ఈరెండువిధములుదక్క, ఒండుమతము = గౌరవమైన మతి యొక మార్గము, కలదె = కలదా, లేదనుట.

తా. ఇఁక మీఁద రెండు దినములు సూచి జనులు నీయందుఁ దెగువ పుట్టకుండె నేని వారి వారి యూళ్లు తలంచుకొని వెళ్లెదరు. పిదప ముని వృత్తి నాశ్రయింపవలె, లేక యతనితో హీన సంధినైనను జేయ వలయు. ఈరెండు విధములు దక్క గౌరవంబైన మతి యొక మార్గము లేదని రని తాత్పర్యము.

కం. జనవర తపమునకుం జొ, చ్చినఁ గన్నులు మూసికొంటె, సెల వింతియకా,
క నిదిధ్యాసకు బ్రహ్మం, బనయము నై పరిభవము శల్యము పైదలో ముల్లగున్. ౩౯.

టీక. జనవర = రాజా, తపమునకున్ = తపస్సునకు, చొచ్చినన్ = ప్రవేశించినను, కన్నులుమూసికొంటె = కన్నులుమూసి కొనుటయు, సెలవింతియకాక =

ఇంతేప్రయోజనముగాని, నిదిధ్యాసకు = ధ్యానమునకు, బ్రహ్మంబు = పరబ్రహ్మము, ఎనయునె = సందర్శించునా, పరిభవప్రశల్యము = తిరస్కారమనియెడి యలుగు, ఎదలోన్ = హృదయమున, మెఱవన్ = మెఱయుచుండఁగా.

తా. ఓ రాజా తనను బోనర్చుట కేతెంచినను గన్నులు మూసికొనుటె ప్రయోజనముగాని తిరస్కార మనియెడి యలుగు హృదయమందు మెఱయుచుండఁగా బ్రహ్మానుసంధాన మనుష్ఠింప దని తాత్పర్యము.

కం. అవమతిఁ బితృఘ్నులగు భూ,
ధవుల వెదకి పిల్లపిల్ల • తరము దునిమి భా,
ర్గవుఁడు మునియయ్యు మఱి వై,
భవము వలదు శాంతి కైనఁ • బగ దెగ కగునే. ౮౦.

టీక. అవమతిన్ = అవమానము చేత, పితృఘ్నులగు = తండ్రినిఁ జంపినట్టి, భూధవులన్ = రాజులను, వెదకి, పిల్లపిల్లతరము, దునిమి = చంపి, భార్గవుఁడు = పరశురాముఁడు, మునియయ్యున్ = జడదారియయ్యును, మఱి = మఱియును, వైభవము = ప్రభుత్వము, వలదు = అక్కరలేదు, శాంతి కైనన్ = ఉపశాంతికైనను, పగదెగక = పగఁదీర్చికొనక, అగునె = సిద్ధించునా, సిద్ధింపదనుట.

తా. పరశురాముం డవమానము చేతఁ దన తండ్రినిఁ జంపిన రాజులను వెదకి పిల్లపిల్లతరము చంపి పిమ్మట మౌని యయ్యును గాన నటుం బలెఁ బ్రభుత్వము వలదు శాంతి కైనను బగఁ దీర్పకయె సిద్ధింపదని పల్కె రని తాత్పర్యము.

గీ. పగయు వగయును లేక యే • పాటి గన్న,
నలరు సామాన్య సంసారి • యగుట మేలు,
మదిఁ దగిలెనేని శాంతిచే • మఱువఁ దగదు,
రాజ్య భూమికఁ దాల్చిన • రాజునకును. ౮౧.

టీక. పగయు = ద్వేషము, వగయును = విచారమును, లేక, ఏపాటిగన్నన్ = ఏమాత్రము గలిగినను, అలరు = సంతసించునట్టి, సామాన్య సంసారి యగుటమేలు = పరిపాటి సంసారి యగుటయే మేలు, రాజ్య = ప్రభుత్వమనెడి, భూమికన్ = వేషమును, తాల్చిన = ధరియించిన, రాజునకును = భూపాలునకును, మదిన్ = బుద్ధిని, తగిలెనేని = శత్రుకృత తిరస్కారమంటినట్టాయెనా, శాంతిచే = శమము చేత, మఱువఁదగదు = మఱువరాదు.

తా. ఒకనితో ద్వేషమును జింతయును లేక యేపాటి కలిగినను సంతసించునట్టి పరిపాటి సంసారి యగుట యుత్తమము. రాజ్యమను భూమికను ధరియించిన

రాజునకు శత్రుకృత తిరస్కారము మదిం దగిలెనేని శాంతచిత్తుఁడై మఱచుట తగ దని తాత్పర్యము.

కం. పులి మల డిగి యూళ్ళకు న,
క్షుల రుజ రా జనము మాన్పఁ • గోఁ బనిచి గవి,
న్నెలకొన సురియలుగొని చని,
పొలియునొ యూరఁ గుయిరేఁగి పొడుచునొ చెప్పుమా. ౪౨

టీక. పులి= వ్యాఘ్రము, ఈనినపుడు, అక్షులరుజన్= కన్నులకలఁకచేతను, మలడిగి= పర్వతముడిగి, ఊళ్ళకున్= గ్రామములకు, రాన్= రాఁగా, జనము= ప్రజ, మాన్పఁగోఁబనిచి= దయచే మాన్పుకొననిచ్చి, గవిన్=గుహయందు, నెలకొనన్= స్వస్థమైయున్న దానిమీఁద, సురియలుగొని= ఆయుధములుపట్టి, చని= పోయి, పొలియునో= దానిచేతఁజచ్చునో, లేక, ఊరన్= కన్నుల నొప్పితో వచ్చినప్పుడు గ్రామమందున్నవారందఱు, కుయిఁరేఁగి=గుంపులయి కూతలుపెట్టుచు, రేఁగి= పొడుచునో, చెప్పుమా= వచింపుమా.

తా. పులి యీనినప్పుడుఁ గన్నుల కలఁకతోఁ గొండఁ దిగి గ్రామములకు రాఁగా నందఱు పోగై కూఁత లిడుచు వచ్చి యపాయము నొందిన పులినిఁ జంపుదురో, లేక, దాని నేత్రవ్యాధిని దయచేసి మాన్పుకొన నిచ్చి దానికి నెలవగు గవియందు స్వస్థముగా నుండు తఱి జన మాయుధములం బట్టి పోయి యా పులిచేతఁ జచ్చునో వచింపు మని మంత్రులాడిరి యని తాత్పర్యము.

కం. ఈ వేళ బలియు నతనిం, బో విడిచితి పొమ్ము వాఁడు • పోయిన రాజ్యం,
బే విధిఁ గ్రమ్మఱు నా వెర, వీవెర వని వ్రేలు మడఁచి యేర్పడఁ జెపుమా. ౪౩

టీక. ఈవేళన్= ఈసమయమున, బలియునతనిన్= బలవంతుఁడగు నా కేశిధ్వజుని, పోవిడిచిపొమ్ము= పోవునట్లుగ విడిచిపెట్టితివి పో, వాఁడుపోయినన్, రాజ్యంబు= సామ్రాజ్యము, ఏవిధింగ్రమ్మరు= ఏప్రకారము మరలవచ్చును, ఆవెరవు= సామ్రాజ్యమువచ్చెడి యాయుపాయము, ఈవెరవని= ఈయుపాయమని, వ్రేలుమడచి= అంగుళమువంచి, ఏర్పడన్= తెలియునటుల, చెపుమా=వచింపుమా.

తా. ఈ సమయమందు మిగుల బలవంతుఁడగు కేశిధ్వజుని విడిచి పెట్టితివి పో వాఁడు పోయిన పిమ్మట సామ్రాజ్య మే విధంబున మరల వచ్చునో యా యుపాయం బిది యని వ్రేలు మడచి చెప్పు మని రని తాత్పర్యము.

తే. గీ. అలసతఁ బరున్న మనుజుండు • గలియుగంబు,
ద్వాపరం బెన్నఁ గూర్చున్న • వాఁడు త్రేత,

యుత్థితుఁడు యాయి మతి కృత ♦ యుగ మటన్న,
ననుచిద మనోక్తి ఋగ్బ్రాహ్మ ♦ ణమున వినవె. ౮౪.

టీక. అలసతన్ = ఆయాసపడుటచేతను, పరున్నమనుజుండు = పండినసరుఁడు, కలియుగంబు = కలియుగము వంటివాఁడు, కూర్చున్నవాఁడు, ఎన్నన్ = విచారింపఁగా, ద్వాపరంబు = ద్వాపరమువంటివాఁడు, ఉత్థితుండు = లేచినవాఁడు, త్రేతన్ = త్రేతాయుగమువంటివాఁడు, మతి = మతియును, యాయి = సంచరించువాఁడు, కృతయుగము = కృతయుగమువంటివాఁడు, అటన్నన్ = అట్లనునట్టి, ననుచిదమనోక్తిన్ = ఇందునిని వాక్యమును, ఋగ్బ్రాహ్మణమునన్ = ఋగ్వేదమందలి బ్రాహ్మణమందు, వినవే = విన్నవాఁడవు కావా. (అనఁగా నిరుద్యోగుఁడుగా నున్నవాఁడు పరమ నికృష్టుఁడనుట.)

కం. ఛిద్రప్రహారి రాష్ట్రో, పద్రవ పరిహారి యాప్త ♦ భాషణ రుచి వే,
ళోద్రిక్తుఁడన్య వేళా, నుద్రిక్తుఁడ నల్ప కాల ♦ ముర్విఁ భరించున్. ౮౫.

టీక. ఛిద్రప్రహారి, ఛిద్ర = తన రాజ్యమందుఁ బుట్టిన దోషంబులను, ప్రహారి = పోఁగొట్టువాఁడును, రాష్ట్రోపద్రవపరిహారి = రాజ్యమునకు శత్రువులవలన యుపద్రవమును బోఁగొట్టువాఁడును, ఆప్త = ఇష్టులయినవారియొక్క, భాషణ = వాక్యములయందు, రుచి = ప్రీతిఁగలవాఁడును, వేళా = శత్రువును వధింపఁదగిన సమయము దొరికినప్పుఁడు, ఉద్రిక్తుఁడు = త్వరపడినవాఁడు, అన్యవేళన్ = సమయము కానియప్పుడు, అనుద్రిక్తుఁడు = త్వరపడక యుండువాఁడును, అనల్పకాలము = బహుకాలము, ఉర్విన్ = భూమిని, భరించున్ = వహించును.

తా. తన రాజ్యమునఁ బుట్టిన దోషములను వెంటనె పోఁగొట్టుచుఁ దనరాజ్యమునకు శత్రువుల వలని యుపద్రవము లంటకుండఁ జేయుచు శత్రుభంజనావసరము సిద్ధించి నపుడాప్తుల ప్రీతి వాక్యముల విని ప్రయత్న పడుచును నాసమయములయందుఁ ద్వరపడక నిమ్మళించుచు నిత్తెఱంగునఁ బ్రవర్తించు రాజు బహుకాలము పుడమిఁ బాలించు నని తాత్పర్యము.

వ. లే లె మ్మనుటయుఁ బ్రధానులకు భూనాథుం డిట్లనియె. ౮౬.

టీక. సుగమము.

తా. స్పష్టము.

కం. మీ నొడివిన యది కార్యం,
బౌ నిప్పని సేయ రాజ్య ♦ మంతయు మనకు,
న్నానికిఁ బర లోకము జిత,
మౌ నొక్కటి యందు వాసు ♦ లతయుఁగ వలయున్. ౮౭.

టీక. మీనాడివినయది= మీరన్నవాక్యము, కార్యంబౌట= కర్తవ్యమవుట, ఇప్పనిసేయఁగ= ఈకార్యము సేయఁగా, రాజ్యమంతయు= ఎల్లరాజ్యము, మనకుఁ, వానికిఁ= ఆకేశిధ్వజునకు, పరలోకను= స్వర్గము, జితమగుట=గెలువఁబడినదౌను. (అనఁగాఁ గెలుగుననుట). ఒక్కటి= ఒక్కసారిగా, ఇందుఁ= ఈరెంటియందు, వాసులు= ఎక్కువతక్కువలు, అరయఁగవలయుఁ= విచారింపవలయును.

తా. మీరన్నది చేయఁదగినది యౌను ఈ లాగునఁ జేయఁగా మనకు నెల్లరాజ్యంబును వానికిఁ బరలోకమును సిద్ధించుచున్నది యయిన నొకసారిగా నీ రెంటియొక్క తారతమ్యము విచారింప వలయు నని చెప్పెనని తాత్పర్యము.

క౦. పర లోక సుఖము శాశ్వత, మరయ మహీ రాజ్య సౌఖ్య మల్పానేహః,
పరిభోగ్యం బిందుల కై, దురితము గావించి తొలఁగుదునె పరమునకుఁ. ౪౮.

టీక. పరలోకసుఖము = పరలోకానందము, అరయఁ = విచారింపఁగా, శాశ్వతము = నిత్యము, మహీరాజ్యసౌఖ్యము = భూపాలనమువలనిసుఖము, అల్పానేహః పరిభోగ్యంబు = స్వల్పకాల మనుభవింపఁదగినది. (సి. కాలోదిష్టోప్య నేహా స్త్రియని యమరము), ఇందులకై = ఈయల్పసుఖమునకై, దురితము = పాపము, కావించి = పరమునకుఁ = పరలోకసుఖమునకు, తొలఁగుదునె = దూరమగుదునా.

తా. విచారింపగాఁ బరలోకానందము నిత్యము రాజ్యానంద మనిత్యము గాన నల్పకాలానుభవయోగ్యం బైన రాజ్యమునకై పాప మొనర్చి పరలోకమునకు దూరీభూతుఁడనుగా నొల్ల నని యనియెననుట.

క౦. బద్ధాంజలిపుటు దీను, గ్రుద్ధతఁ దన మఱుఁగు సొరఁగఁ గూల్చుట గడు కీ,
డుద్ధతి పరలోకార్జన, బుద్ధికి నను కణ్వవాక్యములు దలఁప రొకో. ౪౯.

టీక. బద్ధాంజలిపుటుఁ = ముకుళితహస్తుఁడయినట్టి, దీనుఁ = దైన్యమొందినవానిని, తనమఱుఁగుసొరఁగఁ = తన్నుశరణుఁజొచ్చినపుడు, క్రుద్ధతఁ = కోపయుక్తుఁడై, ఉద్ధతిఁ = గర్వముచేత, కూల్చుట = వధియించుట, పరలోకార్జనబుద్ధికిఁ = పరలోకముసంపాదించెద ననుమనంబుగలవానికి, కడుకీడు = మిక్కిలి పాపము, అను = అనునట్టి, కణ్వవాక్యములు = కణ్వమహర్షివాక్యములు, తలఁపరొకో = విచారింపరొకో.

తా. బద్ధాంజలియయి దీనత్వము వహించి శరణుఁజొచ్చిన వానిఁ బరలోకబుద్ధిగల పురుషుఁడు కోప యుక్తుఁడై గర్వముచేత వధియించెనేని యతనికి మహాపాతకం బని కణ్వమహర్షి సెప్పినవాక్యములు విచారింపరు కాబోలు నని తా.

ఆ. వె. అనుచు వెడలి వచ్చి యా రాజు నడిగి త,
ద్ధనుజ నైచికీ వధక్రమంబు, •

దెలిసి తగిన నిష్కృతిఁ వచింప నాతండు,
మగుడఁ గ్రతువుఁ సాంగముగ నొనర్చి. ౫౦.

టీక. అనుచు = ఇట్లనుచు, వెడలివచ్చి = కెండెముబయలువెళ్ళివచ్చి, ఆ రాజున్ = ఆకేశిధ్వజుని, అడిగి = వేఁడి, ధర్మనైచికీవధక్రమంబు = యజ్ఞధేనువధ ప్రకారమును, (సి. ఉత్తమాగోషునైచికీ యనియమరము.) తెలిసి= ఎఱింగి, తగిన నిష్కృతిన్ = సరియైనప్రాయశ్చిత్తమును, వచింపన్ = చెప్పఁగా, ఆతండు = ఆకేశిధ్వజుండు, మగుడన్ = మరలివచ్చి, క్రతువు = యజ్ఞమును, సాంగమునగన్= సంపూర్ణముగను, ఒనర్చి = చేసి.

తా. ఖాండిక్యుండు మంత్రులతో నాలోచించి యట్లనుచుఁ గెండెము వెడలి వచ్చి కేశిధ్వజుని వలన యజ్ఞధేను వధక్రమంబెఱింగి తగిన ప్రాయశ్చిత్తను విచారించి చెప్పఁగా నా కేశిధ్వజుండు మరల యజ్ఞశాలకు వచ్చి క్రతువును సాంగోపాంగముగ నొనర్చె నని తా.

ఆ, వె. అవభృథాప్లుతోత్తమాంగుఁడై ఋత్విక్స,
దస్యగణముఁ బూజఁ దనిపి పిదప,
సూత మగధ వందిఁ వైతాళిక ప్రభృ,
త్యర్థికోటికి నభిమతార్థ మొసఁగి. ౫౧.

టీక. అవభృథ = అవభృథమనుయజ్ఞదీక్షాంతస్నానముచేతను, ఆప్లుత = చక్కఁగాఁదడపఁబడిన, ఉత్తమాంగుఁడై = శిరముగలవాఁడై, ఋత్విక్ = ఋత్విజుల యొక్కయు, సదస్య = సభ్యులయొక్కయు, గణమున్ = సంఘమును, పూజన్ = దక్షిణాంతపూజచేత, తనిపి = తృప్తినొందించి, పిదపన్ = పిమ్మటను, సూత, మగధ, వంది, వైతాళికప్రభృతి = వీరలుమొదలగు, అర్థికోటికిన్ = యాచకసమూహమునకు, అభిమతార్థము = కోరఁబడినవస్తువులను, ఒసఁగి = ఇచ్చి.

తా. కేశిధ్వజుండు యాగము ముగియఁగా నవభృథస్నాతుఁడై ఋత్విజులకుఁ బూజనీయులగు సభికులకును దక్షిణాంతపూజ లొనర్చి తృప్తి నొందించి సూత మాగధాది యాచక సమాజమునకుఁ గోరిన వస్తువుల నెల్ల నిచ్చెనని తా.

తే, గీ. మఱియుఁ గోరిన వారి, యక్కఱలు దీర్చి,
యనుమనః పూర్తిఁ జాలక కోయ్యనఁ దలంచి,
యకట గురుదక్షిణ యొసంగ నయితి నంచు,
మగుడఁ జనిశంక నతఁడు సంభ్రమము పడఁగా. ౫౨.

టీక. మఱియున్ = ఇదియునుంగాక, కోరినవారి యుక్కులు దీర్చియును = కోరినవారి కోర్కులన్నియు నిచ్చియును, మనఃపూర్తిఁ జాలక = మనస్సునకుఁదనివిఁ దీరక, ఒయ్యనన్ = మెల్లగా, తలంచి = తలఁచుకొని, అకట, గురుదక్షిణయొసంగనైతిని = గురుదక్షిణయియ్యనైతిని, అంచున్, మగుడన్ = మరలను, చని = పోయి, అతఁడు = ఆఖాండిక్యుఁడు, శంకన్ = అనుమానముచేతను, సంభ్రమపడఁగా = తొట్రుపడఁగా.

తా. మఱియు నా కేశిధ్వజుండు గోరిన వారి మనోరథముల నెల్లఁ బూరించియును మనస్తృప్తిలేక యాలోచించి గురుదక్షిణ యియ్యనయితినని మెల్లగఁ దలంచికొని యా ఖాండిక్యుఁడున్న నెలవుఁ గూర్చి వెళ్ళి యాఖాండిక్యుఁడు తొట్రుపడఁగా నని తా.

కం. వారించి నీకు నెయ్యది, కోరిక యేతెంచినాఁడ♦ గురు దక్షిణ యీ,
భూరమణ వేఁడు మనుటయు, నారాజన్యుండు మఱియు♦ నాప్తుల తోడన్.

టీక. వారించి = నీకుశంకవలవదని తొట్రుపాటుమాన్పి, గురుదక్షిణయీన్ = గురుదక్షిణయిచ్చుటకొఱకు, ఏతెంచినాఁడన్ = వచ్చినాఁడను, భూరమణ = ఓరాజా, నీకున్ = నీకు, ఎయ్యదికోరిక = ఏమేమియపేక్షితంబు, వేఁడుము = అడుగుము, అనుటయున్ = అనఁగా, ఆరాజన్యుండు = ఆఖాండిక్యుఁడు, మఱియున్ = మగుడన్, ఆప్తులతోడన్ = ఇష్టులతోడను.

తా. సుగమము.

కం. గురుదక్షిణ యిచ్చుట కీ, నరవరుఁ డేతెంచె మీరు♦ నాకనురక్తు,
లరికించి పదింబదిగా, నరయుఁడు మది నెద్దిమేలు♦ ప్రార్థించుటకున్. ౫౪.

టీక. గురుదక్షిణయిచ్చుటకు, ఈనరవరుఁడు = కేశిధ్వజుండు, ఏతెంచెన్ = వచ్చెను, మీరు = మీరలు, నాకు, అనురక్తులు = ఆప్తులు, ప్రార్థించుటకున్ = అడుగుటకు, ఎద్దిమేలు = ఏదియుత్తమంబు, మదిన్ = మనస్సున, పరికించి = వెదకి, పదింబదిగా, అరయుఁడు = విచారింపుఁడు.

తా. గురుదక్షిణ యిచ్చుటకై కేశిధ్వజుండు వచ్చి యున్నాఁడు మీరలు నాకాప్తులు కాన నెయ్యది యుత్తమం బపేక్షించుటకు దానిం బరికించి మనంబునఁ బదింబదిగా విచారింపుడీ యనిపలికె నని తా.

ఉ. నావుఁడు వార లమ్మనుజ♦ నాథున కిట్లని రుబ్బినేఁ పుగా,
దైవము గల్గెవేగ గురు♦ దక్షిణగాఁ జతురబ్ధి వీవృ గో,
ర్వీవలయంబ శేషమును♦ వేఁడుము భూవరమమ్ము నందఱం,
బ్రోవుము బాంధవాప్త♦ జనపోషణ కంటెను ధర్మ మున్నదే. ౫౫.

టీక. నావుడు = అట్లనఁగా, వారలు, అమ్మనుజనాథునకు = ఆఖాండిక్యునకు, ఇట్లనిరి = ఈవిధముగ నాడిరి, ఉబ్బి = పొంగి, నేఁడుగా = నేఁడుగదా, దైవము గల్గె = అదృష్టము గలిగెను, వేగ = గొబ్బున, చతురర్ణవీవృత = నాలుగు సముద్రముల చేతఁ జుట్టఁబడియున్న, ఉర్వీవలయంబు = భూమండలము, అశేషము = సమస్తము, గురుదక్షిణగాఁ, వేఁడుము = ప్రార్థింపుము, భూవర = రాజా, మమ్మానందలన్, బ్రోవుము = రక్షింపుము, బాంధవాప్త జనపోషణకంటెను = బంధుమిత్రవర్గ రక్షణకంటె, ధర్మము = పుణ్యము, ఉన్నదె = ఉన్నదా, లేదనుట.

తా. అట్లనఁగా వారలు హర్షముచేత నుబ్బి నేఁడుగదా యదృష్టము గలిగెను నాలుగు సముద్రముల మధ్యంబున నున్న యశేష భూమండలమును దక్షిణగాఁ గోరి మమ్ముం గాపాడుము బంధు మిత్ర జన రక్షణ కంటెను వేరే ధర్మము లేదని ఖాండిక్యునితో విన్నవించి రని తా.

ఉ. ఎన్నఁడు లావుగూడు మన కెన్నఁ డగుం దఱి యయ్యె నేని పో,
రెన్నిక యౌనె పోరిన జయింప నశక్యము నీదు భాగ్య సం,
పన్నతఁ జేరెఁ గార్య మిటు బంధు సుహృత్తతికిం గీడు రా,
కున్నటులుండఁగానె సిరు లూరక చావక నొవ్వ కబ్బునే. ౫౬.

టీక. ఎన్నఁడు = ఎప్పుడు, లావుగూడు = బలిమిగల్గును, మనకు, ఎన్నఁడు = ఎప్పుడు, తఱి = సమయము, అగు = ఔను, అయ్యెనేని = సమయము సిద్ధించినను, పోరు = యుద్ధము, ఎన్నికయౌనె = శ్రేష్ఠమగునా, శ్రేష్ఠము గాదనుట, పోరిన = యుద్ధమొనరించినను, జయింప = గెలుచుటకు, అశక్యము = శక్యముగాదు, నీదు = నీయొక్క, భాగ్యసంపన్నత = భాగ్యాతిశయముచేతను, కార్యము = ప్రయోజనము, ఇటు = ఈవిధంబుగ, చేరెఁ = ఒనగూడెను, బంధుసుహృత్తతికి = బంధుమిత్రవర్గమునకు, కీడు = చెఱుపు, రాక = కలుగక, ఉన్నటులుండగానె, సిరులు = సంపదలు, చావక = మరణమునొందక, నొవ్వక = నొప్పింపబడక, ఊరక, అబ్బునె = సిద్ధించునా, సిద్ధింపవనుట.

తా. ఎప్పుడు బలిమి గలుగు నెన్నఁడు సమయమగును సమయము తటస్థించినను జగడము శ్రేష్ఠముగాదు కదా అయినను జగడ మొనర్చితిమి పో జయింప నశక్యంబు నీయదృష్టము వలన నిట్టి ఘన కార్య మొనగూడెను బంధు మిత్ర వర్గముల కపాయము సంభవింపకయె సంపదలు సిద్ధింపవనిరని తా.

చ. అనవుఁడు నల్ల నవ్వి మనుజాధిపుఁ డిట్లను మీర లర్థ సా,
ధన పరతంత్ర కోవిదులు, దక్క మహాసుఖ దాయి మోక్ష మా,

సకల భవక్లేశ సంక్షయం బెయ్యది ♦ యవ్విద్య బోధింపు మనిన నవ్వి, యహహ
నిష్కంటకాస్మదీయాధి రాజ్య ♦ మడుగనొల్లక యిదియేటి కడిగి తిపుడు,
క్షత్రియుల కెల్ల రాజ్యంబుకంటె మతిప్రి ♦ యంబుగలదె యటన్న నిట్లనియె నతఁడు.

టీక. విడుఁడని = ఈమాటలు యుక్తంబులుగావు విడువుండని, పీడువెల్వడి వచ్చి = పాళెమువిడిచివచ్చి, ఖాండిక్యుఁడు, ఆరాజున్ = కేశిధ్వజుని, కనుగొని = చూచి, గారవమునన్ = ప్రేమచేతను, గురునిష్క్రియంబు = గురుదక్షిణ, నిక్కువముగా = నిజముగా, ఒసఁగెదేయని = ఇచ్చెదవాయని, పల్కి = వచించి, ఇత్తున్ = ఇచ్చెదను, తథ్యముగన్ = సత్యముగను, అన్నన్ = అనఁగా, అవనీతలేంద్ర = రాజా, నీవు = ఈవు, అధ్యాత్మగతుఁడవు = బ్రహ్మవిద్యానిష్ఠుండవు, దక్షిణ గురునకీఁ దలఁచితేని = గురుదక్షిణ యీఁదలఁచితివా, సకలభవక్లేశ సంక్షయంబెయ్యది = సాంసారికసర్వక్లేశనాశకంబేదో, ఆవిద్యన్ = ఆట్టివిద్యను, బోధింపుము = తెలుపుము, అనినన్ = అనఁగా, నవ్వి = హాసించి, అహహ = ఆశ్చర్యము. నిష్కంటక = శత్రురహితమైన, అస్మదీయ = నాసంబంధియైనట్టి, అధిరాజ్యము = ప్రభుత్వమును, అడుగనొల్లక = వేఁడవలవక, ఇదియేటికడిగితిపుడు = ఈయధ్యాత్మవిద్య నిపుడేల యడిగితివి, క్షత్రియులకెల్లన్ = రాజులకెల్లను, రాజ్యంబుకంటె = ప్రభుత్వముకంటె, మతిప్రియంబుగలదె = అతిశయమైనయిష్టముగలదా, అటన్నన్ = అట్లనఁగా, అతఁడు = ఖాండిక్యుఁడు, ఇట్లనియె = ఈప్రకారమనియె.

తా. ఈ మీమాట లుత్తమంబులుగావు విడుండని యా ఖాండిక్యుండు పాళెము వెడలివచ్చి కేశిధ్వజునింగని ప్రీతితో గురుదక్షిణ నిశ్చయముగ నీఁ దలఁచితివా యని పల్కి సత్యముగ నిత్తునన్న నోరాజా నీ వధ్యాత్మ విద్యయందు దక్షుండవు గాన సాంసారిక సర్వక్లేశ నాశకంబగునది యేదో యట్టి విద్యను బోధింపు మనఁగ నవ్వి యాశ్చర్యంబు నిష్కంటకం బగు నా యాధిరాజ్యము నడుగనొల్లక యీ యధ్యాత్మవిద్య నిపుడేల యడిగితివి రాజులకెల్లఁ బ్రభుత్వముకంటె గొప్పకార్యముం గలదే యనఁగా నాఖాండిక్యుఁడు వక్ష్యమాణ ప్రకారంబుగ నిట్లనియెనని తా.

మ. విను కేశిధ్వజ ధాత్రివేఁడమి కినా ♦ వేదించెద స్హేతువ,
జ్ఞునకుం గాక వివేకికేల జనియుం ♦ చున్ లౌల్య మెంచునర్థిం,
బునఁ బాడిన్నిరి గెల్చువాఁడియుఁ బ్రజా ♦ పోషంబు ధర్మంబు రా,
జున కౌనైన నశక్తు త్వద్విజిత రా ♦ జ్యనన్నఘుం బంటునే. ౬౦.

టీక. కేశిధ్వజ = కేశిధ్వజుఁడా, వినుము = ఆకర్ణింపుము, ధాత్రి వేఁడమి కిన్ = భూమినిఁ బ్రార్థింపకయుండుటకు, హేతువు = బీజమును, ఆవేదించెదన్ =

తెలిపెదను, ఎందుఁ = ఎందైనను, లౌల్యంబు = చాపల్యము, అజ్ఞునకుంగాక = అవివేకికిఁదక్క, వివేకికిన్ = జ్ఞానికి, ఏలజనియించున్ = ఎందులకుఁబుట్టును, రణంబునన్ = జగడమందు, పాడిన్ = ధర్మము చేత, రిపున్ = శత్రువును, గెల్చువాడియున్ = జయించునట్టి బంటుతనము, ప్రజాపోషంబు = ప్రజలరక్షించుట, రాజనకు = ప్రభువునకు, ధర్మంబౌన్ = న్యాయమగును, ఐనన్ = అట్లయినను, త్వద్విజితరాజ్యున్, త్వత్ = నీచేత, విజిత = జయింపఁబడిన, రాజ్యున్ = రాజ్యముగలయట్టియు, అశక్తున్ = బలిమిలేనియట్టి, నన్ను = నను, అఘంబు = పాపంబు, అంటునె = స్పృశించునా, అంటదనుట.

తా. ఓయి కేశిధ్వజుఁడా! రాజ్యము వేడకుండుటకుఁ గారణముఁదెలిపెద వినుము. ఏవస్తువందయినను చాపల్య మజ్ఞునకుఁ గలుగు గాక జ్ఞానికి నేల జనియించును యుద్ధమందు ధర్మముచేత శత్రువును గెల్చుటయుఁ బ్రజల రక్షించుటయు ను రాజులకు ధర్మంబౌ నయినను నీచేత నపహరింపఁబడిన రాజ్యము గల్గి యశక్తుఁడనై యున్న నన్నఘంబులు స్పృశింపవని చెప్పెనని తాత్పర్యము.

సీ. నరనాథ యీరాజ్య పరిపాలనా రాతి ♦ హననాది కృతరూప యగునవిద్య, య
  నధికారికి విసర్జనముఁ గావింపంగఁ ♦ గలుషంబు రాదధికారి యైన, వాఁడు
  విసర్జింపవచ్చు వర్ణాచార ♦ లోపంబు చేనగు పాపలేప, మైన నేనిత్తుఁ గొ
  మ్మనఁ గొను ధరణిభో ♦ గమునకుగాక ధర్మమునకగునె, కావునను క్షత్రి
  యాలకు భైక్షంబుగీడు ♦ మత్ప్రధానులు వేఁడు సామ్రాజ్యమనెడు, పలుకు ధ
  ర్మచ్ఛలంపు లోభంబయుక్త ♦ మది యెఱిఁగి రాజ్య మడుగ నేనిచ్ఛయింప. ౬౧.

టీక. నరనాథ = కేశిధ్వజుఁడా, ఈరాజ్యపరిపాలనము, అరాతిహనన = శత్రు సంహారము, ఆది = మొదలగువానిచేత, కృత = చేయంబడిన, రూపయగు = స్వరూపము గలదైన, అవిద్య = అజ్ఞానము, అనధికారికి = అధికారము లేనివానికి, విసర్జనముఁ గావింపఁగ = విడిచిపెట్టఁగా, కలుషంబురాదు = పాపమొదవదు, అధికారియైనవాఁడు, విసర్జింపన్ = విడువఁగా, వర్ణాచారలోపంబుచేన్ = క్షత్రియ వంశాచార లోపముచేతను, అగు = ఐనట్టి, పాప = కల్మిషముయొక్క, లేపము = పూఁత, వచ్చున్ = కలుగును, (అనఁగాఁ బాపప్రాప్తియౌననుట), ఐనన్ = ఐనను, ఏన్ = నేను, ఇత్తున్ = ఒసఁగెదను, కొమ్మనన్ = గ్రహింపుమనఁగా, కొను = గ్రహించునట్టి, ధరణి = భూమి, భోగమునకుఁగాక = అనుభవించుటకేగాని, ధర్మమునకగునె = ధర్మమునకగునా, కావునను = అట్లు గనుక, క్షత్రియులకు = పుడమితేండ్లకు, భైక్షంబు = అడిగిపుచ్చుకొనుట, కీడు = పాపము, మత్ప్రధానులు =

నామంత్రులు, వేఁడుసామ్రాజ్యము = రాజ్యముకోరుము, అనెడు = అనియెడు, పలుకు = మాట, ధర్మచ్ఛలంపు = ధర్మమనువ్యాజముగల, లోభంబు = లోభగుణము, అయుక్తము = యుక్తముగాదు, అది యెఱిఁగి = అది తెలిసి, రాజ్యమడుగక = ప్రభుత్వము వేఁడుటకు, ఇచ్ఛయించక = అపేక్షింపను.

తా. ఓయి కేశిధ్వజుఁడా! యీ రాజ్య పరిపాలన శత్రుసంహారము మొదలగువానిచేతఁ జేయఁబడిన రూపము గలయట్టి యవిద్యయ నధికారియగువాఁడు గ్రహింపక విడిచెనేని పాతకము రాదధికారియగు వాఁడువిడిచెనేని క్షత్రియ వంశాచారలోప మగుటవలని పాపలేపంబౌనైనను నే నిచ్చెదఁ బరిగ్రహింపుమనఁగ గ్రహించినట్టి సామ్రాజ్యము భోగమునకేఁగాని ధర్మమునకుఁ గాదు గావున రాజులకు యాచ్ఞావృత్తి చేతఁబుచ్చుకొనుట మిగులఁ బాతకము నామంత్రులు గోరును రాజ్యమన్న మాట ధర్మ వ్యాజముగల లోభగుణంబయుక్తమైనదియని తెలిసి నే రాజ్యమడుగక బ్రహ్మవిద్య నడిగితినని ఖాండిక్యుఁడు పలికె నని తాత్పర్యము.

తే. గీ. ఆస పడుదురె బుధులు రా • జ్యమున మమత,
మానని జడాత్ములట్లహం • మాన పాన,
మత్తులకె కాక యదియేల • మాదృశులకు,
ననిన హర్షించి మెచ్చి య • జ్జనకుఁడనియె. ౬౨.

టీక. బుధులు = పండితులు, మమతమానని = మమకారము విడువనట్టి, జడాత్ములట్లు = మూఢాత్ములంబలె, రాజ్యమునన్ = రాజ్యమందు, ఆసపడుదురె = వాంఛింతురా, అది = ఆవాంఛ, అహంమానపానమత్తులకేకాక, అహంమాన = అహంకారమనియెడి, పాన = మధుపానముచేతను, మత్తులకేకాక = మదించినవారికేకాని, మాదృశులకున్ = మావంటివారికి, ఏల = ఎందుకు, అనినను = అనఁగా, హర్షించి = సంతసించి, మెచ్చి = శ్లాఘించి, అజ్జనకుఁడు = ఆకేశిధ్వజుండు, అనియె = పలికెను.

తా. ప్రాజ్ఞులైన వారు మమకారము విడువని మూఢుల వలె రాజ్యమపేక్షింప రట్టి వాంఛ యహంమాన పాన మత్తులై యున్న వారలకే కాక మముఁ బోటుల కేల? అనఁగా నజ్జనకుండు హర్షించి స్తుతిఁ జేసి యొక మాట సెప్పె నని తాత్పర్యము.

ఆ. వె. ఏ నవిద్య వలన మృత్యువుఁ • దరియింప,
ననఘ రాజ్యములు-మ • ఖాదికములు,
చేయు చున్న వాఁడ క్షీణింపఁ • జేయుదుఁ,
బుణ్య ఫలము భోగ • భుక్తివలన. ౬౩.

టీక. ఏన్ = నేను, అవిద్యవలన = అజ్ఞానమువలన, మృత్యువున్ = సంసారమును, తరియింపన్ = దాఁటుటకు, అనఘు = పాపరహితుఁడా, రాజ్యమును = ప్రభుత్వమును, మఖాదికములు = యజ్ఞాదిసత్కర్మములను చేయుచున్నవాఁడ, పుణ్యాఫలము = సత్కర్మఫలమును, భోగభుక్తివలనన్ = భోగానుభవముచేతను, క్షీణింపఁజేయుదున్ = నష్టపఱుతును.

తా. పాపరహితుఁడవగు నోయి ఖాండిక్యుఁడా! నే నజ్ఞానము వలన సంసారము దాఁటుటకు ప్రభుత్వమును యాగాది సత్కర్మములుఁ జేయుచున్నాఁడను భోగానుభవము వలనఁ బుణ్యాఫలంబుల క్షీణింపఁ జేయుదు నని వచించె ననుట.

కం. మన యీ నిమి వంశముపా, వన మగు భాగ్యమున మనుజ ♦ వరతత్త్వవివే,
చన చింత నీకుఁ బొడమెను, విను మిక వినుపింతు నేను ♦ విద్యా విధమున్.

టీక. మన = మనయొక్క, ఈనిమివంశము = నిమిచక్రవర్తివంశము, పావనమగు = పవిత్రమగునట్టి, భాగ్యమునన్ = పుణ్యానుచేతను, మనుజవర = రాజా, తత్త్వవివేచనచింత, తత్త్వ = తత్త్వముయొక్క, వివేచన = తెలిసికొనునట్టి, చింత = విచారము, నీకున్ = నీకు, పొడమెన్ = పుట్టెను, ఏన్ = నేను, విద్యావిధమున్ = జ్ఞానమార్గమును, వినుపింతున్ = తెలియఁజెప్పెదను, ఇఁక, వినుము=ఆలకింపుము.

తా. మానవశ్రేష్ఠుఁడా! మన యీ నిమి చక్రవర్తి వంశము పరిశుద్ధ మగునట్టి పుణ్య విశేషముచేత నీకుఁ దత్త్వ వివేచన చింత గలిగెను గాన నిఁక నేను జ్ఞాన మార్గముం దెలిపెద నాకర్ణింపు మనియె నని తాత్పర్యము.

ఆ,వె. ఆత్మ గాని మేన ♦ నాత్మబుద్ధియును న,
స్వంబునందు మిగుల ♦ స్వత్వమతియు,
నవని వరయ విద్య యను మ ♦ హాతరువును,
త్పత్తి కీ ద్వయంబు ♦ విత్తు మొదలు. ౬౫.

టీక. అవనివర = భూనాథుఁడవగు నోయి ఖాండిక్యుఁడా, ఆత్మగాని = జీవుఁడుగానట్టి, మేనన్ = శరీరమందు, ఆత్మబుద్ధియును = జీవజ్ఞానమును, అస్వంబునందు = తనదిగాకుండునట్టి గృహాదులయందు, స్వత్వమతియు = తనదియను బుద్ధియు, ఈద్వయంబు = ఈ రెండును, అవిద్యయను = అజ్ఞానమనియెడు, మహాతరువు = గొప్పవృక్షముయొక్క, ఉత్పత్తికి = జననమునకు, "పస్త్యాడతో ్చినుమ్నే" అను సూత్రముచేత నుమాగమము, మొదలు = ఆదియైనట్టి, విత్తు = బీజము.

తా. ఓ ఖాండిక్యమహారాజా! తానుగాని దేహమందుఁ దాననుజ్ఞానముదనదిగాక యుండెడి గృహాదులయందుఁ దనది యనెడి బుద్ధియు నీరెండు నజ్ఞాన మను మహావృక్షమునకు నాదియైన బీజం బని తాత్పర్యము.

కం. నరనాథ పాంచభౌతిక, శరీరమున దేహి మోహ • సాంద్రతమతమః,
పరివృతుఁ డైయ్యేని దినా, పరికరమని యవధిలేని • భ్రమపడి తిరుగున్. ౬౬

టీక. నరనాథ = రాజా, దేహి = జీవుండు, పాంచభౌతిక = పంచభూత పరిణామంబైన, శరీరమున = కాయమునందు, సాంద్రతమ = మిగులదట్టమైన, తమః = అవిద్యచేతను, పరివృతుఁడై = ఆవరింపఁబడినవాఁడై, ఏను = నేను, ఇది, నాపరికరము = నాసొమ్ము, అని = నిశ్చయించికొని, అవధిలేని, భ్రమపడి = అజ్ఞానమునఁబడి, తిరుగున్ = భ్రమణముఁ జేయుచుండును.

తా. ఓరాజా! పంచభూత పరిణామంబగు దేహమందు మిగుల బలిసియున్న యజ్ఞానముచేత నావరింపఁబడిన వాఁడు గాన జీవుఁడు దానని యుఁ దనపరికరంబులనియును దరిలేని భ్రాంతిఁ జెంది తిరుగుచుండు నని తాత్పర్యము.

కం. జల వసుధాంబర పవన,
జ్వలనంబులకంటె దాన • జస్రంబు వెలి,
న్వెలుగొందు నాత్మయుండఁగఁ,
గళేబరము నెవ్వఁ డాత్మ • గాఁ దలపోయున్. ౬౭.

టీక. జల = ఉదకము, వసుధా = భూమి, అంబర = ఆకాశము, పవన = వాయువు, జ్వలన = అగ్ని, ఈపంచభూతములకంటె, తాన్ = తాను, (అనఁగా నాత్మయనుట), అజస్రంబు = నిరంతరమును, వెలిన్ = వెడను, వెలుఁగొందున్ = ప్రకాశించునట్టి, ఆత్మ = జీవుఁడు, ఉండగన్ = ఉండఁగా, కళేబరమున్ = దేహమును, ఎవ్వఁడు = ఎట్టివాఁడు, ఆత్మగాన్ = తానుగా, తలఁపోయున్ = నిశ్చయముఁ జేయును.

తా. పృథివ్యప్తేజో వాయ్వాకాశంబులను పంచభూతములకంటెను దాని రంతరము వెలపటఁ బ్రకాశించు చున్న జీవుండై యుండియు శరీరము నెవ్వఁ డాత్మ యని తలంచు ననుట.

సీ. వపురుపభోగ్యముల్ నృపగృహక్షేత్రాదు • లవి బొంది వాఁగాక యాత్మ వగు
నే, యట్లన పుత్త్రి పౌత్త్రానీకమును నాత్మ • గాని నైఁ బుట్టుటఁ గావుతనని,
గాన మృత్యువుఁ గను కాయంబున జనించు • పుత్త్రాదులఁ స్వత్వబుద్ధి దగవు,
ఎప్పుడేని యాత్మ వేఱేయనునప్పుడే • యదరు భోగంబు లీయాత్మకంట, వ్రేగా
కీయొడలె యాత్మయన్న నంటు • మృద్గృహము నిల్పు నెట్లుల్కా మృజ్జలాది, న
ట్లు భౌతిక భోగాశనాది భౌతి • కాంగములు నిల్పు భోగి మించ దాత్మ కెట్లి. ౬౮.

టీక. నృప = రాజా, వపురుపభోగ్యములు = శరీరముచేత ననుభవింపఁదగి నట్టి, గృహక్షేత్రాదులు = ఇండ్లు, భార్య మొదలైనవి, (ని, క్షేత్రంపత్నీ శరీరయో యని యమరము) అవి = ఈచెప్పఁబడ్డవి, బాంధివి = దేహసంబంధములైనవి, కాక, ఆత్మవగునె = ఆత్మసంబంధములైనవి యగునా, అట్లన = ఆరీతిగానె, పుత్త్రపౌత్త్ర=, క్షామాఁకులు మనుమలు, వీరియొక్క, అనీకమును = సంఘమును, ఆత్మగాని = జీవుఁడుగాని, మైన్ = దేహమందు, పుట్టుటన్ = జనియించుటచేత, తనవిగావు = ఆత్మవిగావు, కానన్ = అగ్గుటచేత, మృత్యువుఁగనుకాయంబున = మృత్యువును బొందునట్టి శరీరమందు, జనించు = పుట్టుచున్న, పుత్త్రాదులెడ = కొమారులు మొదలగు వారియందు, స్వాత్త్వబుద్ధి = తనదనుజ్ఞానము, తగదు = కూడదు, ఎప్పుడేని= ఎప్పుడైనను, ఆత్మ = జీవాత్మ, వేఱే = భిన్నమె, అనున్ = అనుకొనునో, అప్పుడె, అవరు= వృద్ధియగుచున్న, భోగంబులు = స్రక్చందనాదులు, ఆత్మకు = తనకు, అంటవు = స్పృశింపవు, అట్లుగాక = అటుగాక, ఈయొడలె = ఈశరీరమె, ఆత్మ = నేను, అన్నన్ = అన్నట్టాయెనేని, అంటున్ = ముట్టును, మృద్గృహము = మృణ్మయనికేతనము, అల్కుమృజ్జలాదిన్ = అలికి పూసినట్టి మన్ను నీళ్లు మొదలగువానిచేత, ఎట్లు= ఏప్రకారము, నిలుచున్ = ఉండునో, అట్లు = ఆప్రకారముగ, భౌతిక = భూతసంబంధమైన, భోగ = సుఖము, అశన = అన్నము, అదిన్ = మొదలుగా గలవానిచేత, భౌతికాంగములు నిల్చున్ = పంచభూతాత్మక శరీరములు నిలుచును, ఇందు= దీనియందు, భోగము = సుఖము, ఆత్మకు = జీవునకు, ఎద్ది = ఏది.

తా. ఓయిరాజా! దేహోపభోగ్యంబులైన గృహక్షేత్రాదులు, శరీర సంబంధులుగాని యాత్మ సంబంధులు గావు. అత్తెఱంగుననే పుత్త్రపౌత్త్రాది సమూహము దేహమందు జనియించుటచేత నాత్మవి గావు గాన మరణము నొందునట్టి శరీరమున జనియించిన పుత్త్రాదులందు స్వత్వబుద్ధి గూడదనియు నెపుడేని యాత్మకు దేహము భిన్నం బని భేదజ్ఞానము గలుగుచున్నదో యపుడు భోగంబు లాత్మ కంటవటుగాక శరీరమె తానని తలంచినయెడ భోగంబు లంటుచున్నవి. మంటితోఁ గట్టంబడియున్న గృహము మృజ్జలాదులచేత నెట్లు నిలుచునో యత్తెఱంగున పంచభూత సంబంధమైన సుఖము అశనము మొదలగు వానిచేత భౌతికాంగములు నిలుచును దీనియం దాత్మకు భోగమెక్కడిది దని తాత్పర్యము.

మ. జనిసాహస్రిబహుప్రయాణ మగు సం ♦ సారంపుఁ ద్రోవ న్సదా,
చనుచుండు న్ఘన మోహ ఖేద మహిమ ♦ న్సంసారి పాంథుండు వా,
సనలం ధూళి మునుంగుఁగాఁగ నెపుడేన్ ♦ జ్ఞానంపుటుష్ణోదకం,
బునఁ దత్క్షాళన సేయు వాని కపుడ ♦ మ్మోహశ్రమంబు న్జనున్. ౬౯.

టీక. జనిసాహస్రి = జన్మసహస్రము లనియెడి, బహుప్రయాణమగు = అనేకప్రయాణములుగల, సంసారంపు= జననమరణాది రూపమైనసంసారమనియెడు, త్రోవన్ = మార్గమునందు, సంసారి = సంసారియను, పాంథుడు = పథికుండు, వాసనలన్ = అనాదికర్మ వాసనలనియెడి, సూళి = పరాగము, ముసుంగు గాఁగను = కప్పుగాఁగా, ఘన = అతిశయమగు, మోహ = మోహమనియెడు, ఖేదము= క్లేశము, అలమన్= చుట్టుకొనఁగా, సదాచనుచుండున్= ఎప్పటికిని దిరుగుచుండు ను, ఎపుడేన్ = ఏసమయ మున, జ్ఞానంపుటుష్ణోదకంబునన్ = శాస్త్రజన్య జ్ఞానమనియెడి యుష్ణజలంబుచేత, తత్క్షాళనసేయున్, తత్= ఆకర్మవాసన లనియెడుపరాగమును, క్షాళనసేయున్ = కడుగుకొనునో, వానికి = సంసారియనుపథికునికి, అపుడు = ఆక్షణమందు, అమ్మోహశ్రమంబున్ = ఆమోహమనుశ్రమమును, చనున్= నివర్తించును.

తా. జన్మసహస్రము లనియెడి యనేక ప్రయాణము గల జనన మరణాది రూపమగు సంసార మను త్రోవ యందు సంసారియను పథికుం డనాది కర్మ వాసన లనియెడి పరాగము గప్పుకొనఁగా నతిశయం బగు మోహ మను క్లేశము చుట్టుకొనంగ నెడతెగక తిరుగుచుండును ఎపుడు శాస్త్రజన్యజ్ఞాన మను నుష్ణోదకము చేత సంసారి యను తెరువరి యా కర్మవాసన లనియెడి పరాగమును గడుగు కొనుచున్నాఁడో యపుడమ్మోహ మను శ్రమము నివర్తించు నని తా.

తే,గీ. అట్టి మోహశ్రమం బాఱ నాశరీరి,
స్వస్థుఁడై తాననన్యాతిశయను బాధ,
మనఁగ విలసిల్లు నిర్వాణ మనుభవించు,
ననఘ తొల్లియు నిర్వాణ ఖనియ కాన. ౭౦.

టీక. అట్టి = అటువంటి, మోహశ్రమంబు = అజ్ఞానమనియెడియాయాసము, ఆఱన్ = తీరఁగాన్, ఆశరీరి = ఆజీవుఁడు,స్వస్థుఁడై= తాను సుఖపడినవాఁడై, అనన్యాతిశయము = తనకంటెనతిశయము లేనట్టిదియు, అబాధము = దుఃఖరహితమైనది, అనఁగన్ = అనఁగా, విలసిల్లు= ఒప్పుచున్న, నిర్వాణము= మోక్షానందమును, అనుభవించున్ = భోగించును, అనఘ = పాపరహితుఁడా, తొల్లియు = మునుపును, నిర్వాణఖనియె కాన= మోక్ష శ్రేయుండే కాన, (అనఁగాజీవన్ముక్తుఁడే యనుట).

తా. పాపరహితుండవగు నోయిరాజా! యతండు తొలుత జీవన్ముక్తుఁడే కానఁ దాదృశంబగు నజ్ఞానమనియెడి యాయాసము దీరఁగా జీవుండు సుఖియై సర్వోత్తమంబును దుఃఖరహితము నైనది యను నట్లుగఁ బ్రకాశించు చున్న యానందమనుభవించు నని తాత్పర్యము.

వ. విను జనేశ్వర జలం బస్పృష్ట దహనం బయ్యుఁ దదీయ యోగంబునఁ గలశోద రంబున నునికిం దా నతి శీతలంబయ్యు నుడికి శబ్దోద్రేకాది ధర్మంబులం బొందు న ట్లాత్మయుం బ్రకృతి సంబంధంబున నహంమానాది దూషితుండై ప్రాకృతం బు లగు ధర్మంబులం బొందు వీని కత్యంత విలక్షణుండు నక్షయుండు నాత్మ య ట్లగుటనింత యనర్థ మూలం బగు నవిద్యా బీజంబు నీ కెఱింగించితి నే వంవిధంబు లగు సకల క్లేశంబులకు సంక్షయ కరంబు యోగంబు దక్క మఱి యొం డుపాయ ము లే దనుటయుఁ బ్రీతుం డై ఖాండిక్యుండును మహాత్మా యి న్నిమి వశంబున విజ్ఞాత యోగశాస్త్రార్థుండ వీవు నాకు నీయోగంబు సమ స్తంబు విస్తరింపవలయు ననినఁ గేశిధ్వజుండు కృపాళుం డై మహీపాలా విను మెందేని సంస్థితుం డై ముని మఱి పునర్భవంబునకు రాక బ్రహ్మసాధర్మ్యంబుఁ బొందునట్టి యోగంబుఁ జెప్పెద సావధానుండ వై వినుమని యిట్లనియె. ౭౧.

టీక. విను = వినుము, జనేశ్వర = రాజా, జలము = నీరు, అస్పృష్ట దహ నంబయ్యు = అగ్ని నంటకయుండియు, తదీయ = ఆయగ్నిసంబంధియైన, యోగం బునన్ = సంపర్కముచేత, కలశోదరంబునన్ = ఘటోదరమునందు, ఉన్కిన్ = ఉండుటం జేసి, తాన్ = ఉదకము, అతిశీతలంబయ్యున్ = మిగులఁజల్లనై యుండియు, ఉడికి = కాఁగి, శబ్దోద్రేకాది ధర్మంబులన్ = కళపెళయను శబ్దము పొంగు మొ దలైన గుణములను, పొందునట్లు = ఆశ్రయించినట్లు, ఆత్మయున్ = జీవుఁడును, ప్రకృతిసంబంధంబున = శరీరసంబంధముచేత, అహంమానాదిదూషితుండై = అహం కార మమకారాదులచేత మలినుండై, ప్రాకృతంబులగు ధర్మంబులంబొందు = ప్ర కృతిజన్యగుణంబుల నాశ్రయించునుగాని, వీనికి = ఈప్రకృతిధర్మములకు, అత్యంత విలక్షణుండును = మిగుల వేఱైనవాఁడును, అక్షయుండును = నాశములేనివాఁడు ను, ఆత్మ = జీవుఁడు, అట్లగుటన్ = అట్లుగాన, ఇంత యనర్థమూలంబగు, అవి ద్యా = అజ్ఞానముయొక్క, బీజంబు = కారణమును, ఎఱింగించితి = తెలిపితిని. "శ్లో. అనాత్మన్యాత్మబుద్ధిర్యా అస్వేస్వమితియామతిః, అవిద్యాతరుసంభూత బీజమేత ద్విధాస్థితమ్." అని విష్ణుపురాణము. ఏవంవిధంబులగు = ఈప్రకారమైన, సకలక్లేశ ములకు = సమస్తదుఃఖములకు, సంక్షయకరంబు = నాశముఁజేయునది, యోగంబు దక్క = యోగమువినా, మఱియొండుపాయము లేదనుటయు = మఱియొక సాధ నంబులేదనఁగ, ప్రీతుండై = సంతసించినవాఁడై, ఖాండిక్యుండును, మహాత్మా = మహా మతియగు నోయి కేశిధ్వజుఁడా, ఈనిమివంశంబున, విజ్ఞాత = తెలియఁబడిన,యో గశాస్త్రార్థుండవు = యోగశాస్త్రార్థము గలవాఁడవు, నీవు, నాకున్ = నాకును, ఈయోగంబు సమస్తంబు విస్తరింపవలయు ననినన్ = ఈయోగమంతయు విపులము

గఁ జెప్పవలయుననఁగా, కేశిధ్వజుండు, కృపాళుండవై = దయగలవాఁడవై, మహీపాల = భూనాయకుఁడా, వినుము = ఆకర్ణింపుము, ఎందేని సంస్థితుండవై = ఏయోగశాస్త్రమందైన నున్నవాఁడవై, ముని = సాధకుండవు, మఱి = పిమ్మట, పునర్భవంబున కురాక = పునర్జన్మమునకురాక, బ్రహ్మసాధర్మ్యంబు = బ్రహ్మత్వమును, పొందుదో = పొందుదువో, అట్టి యోగంబుఁ జెప్పెద = ఆయోగము వచించెదను, సావధాన చిత్తుఁడవై = నిశ్చలమనస్కుఁడవై, వినుమని = ఆకర్ణింపుమని, ఇట్లనియె.

తా. సుగమము.

ఆ.వె. ప్రాణికోటి కెల్ల ♦ బంధంబు మోక్షంబు,
చేరుటకును మనసు ♦ కారణంబు,
విషయ సంగినైన ♦ వినుబంధకారి నిర్
విషయ మైన ముక్తి ♦ విభవకారి. ౭౨.

టీక. ప్రాణికోటి కెల్లన్ = ఎల్లప్రాణులకు, బంధంబు = సంసారరూపబంధను, మోక్షంబు = తద్విమోచనము, చేరుటకును = ఈరెండుఁబొందుటకు, మనసు = మనంబు, గారణంబు = హేతువు, విషయసంగినైన = శబ్దస్పర్శాది విషయములయందుఁదగిలెనేని, బంధకారి = బంధము గలుగఁజేయునది, నిర్విషయమైన = విషయములయందుఁ దగిలకుండెనేని, ముక్తివిభవకారి = ముక్తివైభవముఁ జేయునది.

తా. సకల ప్రాణులయొక్క సంసారరూప బంధమునకు మోక్షమునకును మనంబే కారణ మనియు నామనంబు శబ్దస్పర్శాది విషయములయందుఁ బ్రవేశించెనేని బంధంబును విషయముల యెడఁ దగిలకుండెనేని యనన్యాతిశయంబగు మోక్షంబును గలుగఁజేయు నని తాత్పర్యము.

సీ. విజ్ఞానమునఁ జేసి విషయాది వలననె ♦ మ్మనమాహరించి బ్రహ్మము పరేశుఁ,
జింతింపవలయు నిశ్రేయసంబునకట్లు ♦ చింతింప నతఁడు తచ్చింతకునకు,
నాత్మభావం బిచ్చు నాకమఠాకము వికా ♦ ర్యశక్తిసారమునఁ దార్చునట్లు గాఁగ,
మన యమాదికవిషయం బైన యాత్మప్రయ ♦ యత్నంబున కధీన మైన సాత్త్వి,
కపుమనోగతి యయ్యాది గలదుదాని ♦ బ్రహ్మసంజ్ఞఁగఁజేయుచు బ్రోచుమాడ్కి,
యిట్టిపై నిన్స్పృహమఁ బొందె నెగలుగు ♦ నట్టియోగంబు గలిగిన యతఁడు యోగి.

టీక. విజ్ఞానమునఁ జేసి = విశేషజ్ఞానము చేతను, విషయాదివలనన్ = శబ్దస్పర్శాది విషయములు మొదలగు వానివలన, నెమ్మనము = కునస్సును, ఆహరించి = మరలించి, పరేశున్ = పరమేశ్వరుఁడైన, బ్రహ్మమున్ = పరబ్రహ్మను, నిశ్రేయసంబునకు = మోక్షమునకు, చింతింపవలయు = ధ్యానము సేయవలయు, అట్లు చింతింపన్ = అలా గు ధ్యానము సేయఁగా, అతఁడు = ఆబ్రహ్మము, తచ్చింతకునకు = ఆధ్యానము సేయు

వానికే, అకషణకము = ఆకర్షణకమైనట్టి సూదంటురాయి, వికారి = రూపాంతరముగల, అశ్మసారము = లోహమును, తార్చునట్లు = ఆకర్షించునట్లు, ఆత్మభావంబు = తనస్వరూపమును, ఇచ్చుక = ఒసంగును, యోగమున = యోగమనంగా, యమాదికంబైన = యమనియమాది విషయకమయిన, ఆత్మ = జీవునియొక్క, ప్రయత్న = వ్యవసాయమునకు, అధీనమైన = తగునట్టైన, సాత్వికపు = సత్వగుణప్రధానమైన, మనోగతి = మనోవ్యాపారము, ఎయ్యదిగలదు = ఏదికలదో, దానిని = అమనోవ్యాపారమును, బ్రహ్మసంబంధినిగా = బ్రహ్మమునుబొందినదానిగా, చేయు= చేయునట్టి, ప్రౌఢిసూవె = ప్రౌఢియనుసుమీ, ఇట్టిపై శిష్ట్యధర్మణము = విశేషభావముగల ధర్మము, ఎందేనిగలదు = ఎక్కడగలదో, అట్టియోగంబు గలిగినయతండె యోగి = అట్టియోగము గలవాఁడె యోగి.

తా. విశేషజ్ఞానముచేత విషయాదులను హరించి బ్రహ్మమును సంధానముఁ జేయువాని కాపరబ్రహ్మము సూదంటురాయి వికారముగల యినుమును దనయందు గ్రహించినట్లుంబలె నాత్మస్వరూపము నిచ్చుననియు యోగమనఁగ యమనియమాది విషయకంబయిన తనప్రయత్నమునకధీనమైన సత్వగుణప్రధానమగు మనోవ్యాపారమును బ్రహ్మసంబంధిగాఁ జేయునట్టి ప్రౌఢిమసుమీయనియు నిట్టి వైశిష్ట్యధర్మ మెందుఁగలదో యదేయోగ మా యోగము గలవాఁడె యోగియనియును తాత్పర్యము.

వ. మఱియు బ్రహ్మచర్యాదులగు యమంబులేనును స్వాధ్యాయాదులగు నియమంబులేమును నిష్కాముండై యోగి యగు వాఁడు మనస్సైర్య్య సంపాదనకు నాచరింపవలయు నివి కామ్యంబులైన విశిష్టఫలదంబులు నిష్కాములకు ముక్తిదంబులగు నట్టి యమనియమంబులు వదలక భద్రాసనాదులందు నొకటి నవలంబించి ప్రాణాభిధానంబగు పవనంబు నభ్యాసంబున వశంబు సేయవలయు నదియు ప్రాణాయామ మనంబడు నట్టి ప్రాణాయామంబు సబీజాబీజ సంజ్ఞలం బరగునది యై ప్రాణాపానంబుల మిథోనురోధంబుల నుభయ నిరోధనంబున రేచకాదితై త్రివిధ్యంబునుం బొందు మొదల నా చెప్పిన సబీజాబీజ సంజ్ఞలందు నంతస్థ్సాలరూపావలంబియగు నదియ సబీజం బితరంబ బీజంబు మఱి శబ్దాది విషయంబులం బ్రసన్నంబు లగు నింద్రియంబులం ద్రిప్పి మానసంబున కధీనంబులు సేయుట ప్రత్యాహారం బిట్టి ప్రత్యాహారంబు ముముక్షునకవశ్యకర్తవ్యంబు దీనివలననతిచంచలంబులగు నింద్రియంబులకు నాత్మవశ్యత గలుగునవిగ ననవశ్యంబులు గాకుండిన నాయోగి యోగసాధకుండు గానేరండు ప్రాణాయామంబునఁ బవనంబులు ప్రత్యాహారంబున నింద్రియంబులు వశంబులైన పిమ్మటఁ జిత్తంబు శుభాశ్రయంబునం దిడునది యనుటయ్యు భాండిక్యుండిట్లనియె. ౭౭.

ప్రత్యాహారమునచేత, ఇంద్రియంబులు = శ్రోత్రాదులు, వశంబులైన = అధీనములైన, పిమ్మటన్ = పిదప, చిత్తంబు = మనమును, శుభాశ్రయంబునందు = శుభాధారమగు పరబ్రహ్మమునందు, ఇడునది = పొందింపవలయును, అనుటయు = అట్లనఁగా, ఖాండిక్యుఁడు, ఇట్లనియె = ముందు చెప్పుచున్నాఁడు.

తా. బ్రహ్మచర్యము మొదలగు యమములైదును, స్వాధ్యాయము మొదలగు నియమములైదును చిత్తశుద్ధి కొఱకనుష్ఠింప వలయును. ఇవి కోరికచేతఁజేసిన పక్షమున విశేషఫలములనిచ్చును. కోరకచేసినయెడ మోక్షమబ్బును. భద్ర ముక్త పద్మ సిద్ధ వీర ముక్త పద్మ మను నివి మొదలగు నాసనములలో నొకటి నవలంబించి వాయువును రేచక పూరక కుంభకాభ్యాసముచేత వశపఱచుకొనవలయును. ఇట్లు ప్రాణవాయువును వశపఱచుకొనుటయే ప్రాణాయామ మనంబడును. అది సబీజం బబీజం బని ద్వివిధంబు. శబ్ద స్పర్శ రూప రస గంధము లను పంచవిషయములకుఁ బోవు శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణమ్ములను పంచేంద్రియంబుల మరలుచుకొనుట ప్రత్యాహారంబు. ఇది ముముక్షున కవశ్యము చేయఁదగినది. ఇట్లొనరింప నింద్రియములు మనస్సున కధీనములగును. పిమ్మట శుద్ధంబగు చిత్తమును పరబ్రహ్మయందుఁ జేర్ప వలయు ననుట.

క. మనమున కెద్ది శుభాశ్రయ, మనఘ యెఱింగింపు మటి సమస్తాధారం,
బనఁ జన యద్వస్తువు యన్మనన మశేషోరుదుఃఖమండలిఁ జెఱుచున్. ౭౪.

టీక. మనమునకు = మనస్సునకు, ఎద్ది = ఏవస్తువు, శుభాశ్రయము = శుభమైనస్థానము, మఱి = మఱియును, సమస్తాధారంబు = సకలమును ధరించునది, అనన్ = అనునట్టుల, యద్వస్తువు = ఏవస్తువు, చనున్ = ఒప్పును, యన్మననము = ఏదేవునిమననము, అశేష = సకలమైనట్టియు, ఉరు = విస్తారమయిన, దుఃఖమండలిన్ = శోకసమూహములను, చెఱుచున్ = నష్టముఁజేయునో, అనఘ = పరిశుద్ధుఁడా, ఎఱింగింపుము = తెలుపుము.

తా. మానసంబున కేది శుభమైన స్థానము సకలాధారంబగు వస్తువేది యేదేవుని మననము సకల దుఃఖ సమూహంబులం బోఁగొట్టునో పరిశుద్ధుండవగు నోయి కేశిధ్వజుఁడా! యెఱింగింపుమని పలికెనని తాత్పర్యము.

తే.గీ. అనినఁ గేశిధ్వజుఁడు వాని ♦ కనియె బ్రహ్మ,
మాశ్రయంబు మనంబున ♦ కదియు పరము,
నపరమునఁనంగఁ బొలుచు నం ♦ దపరమనఁగ,
మూర్తమ్ము పరంబనంగ న ♦ మూర్తమనఘ. ౭౫.

టీక. అనినన్ = ఇట్లనఁగా, కేశిధ్వజుఁడు = జనకుండు, వానికనియెన్ = ఆఖాండిక్యునకుఁ జెప్పెను, అనఘా = పరిశుద్ధుండవగు నోయిరాజా, మనంబునకున్ = చిత్తంబునకు, బ్రహ్మను = పరబ్రహ్మము, ఆశ్రయంబు = స్థానము, అదియు = ఆపర బ్రహ్మమె, పరమున్ = పరమనియు, అపరమున్ = అపరమనియు, అనంగన్ = అను నటుల, పొలుచున్ = ఒప్పును, అందు = ఆరెంటియందును, అపరమనఁగ, మూర్తము = రూపవత్తు, పరంబనంగన్ = పరమనఁగా, అమూర్తము = రూపవత్తుగా కుండునది.

తా. అట్లనఁగాఁ గేశిధ్వజుండు పరబ్రహ్మమే చిత్తమునకువాశ్రయంబనియు నా పరబ్రహ్మము పరాపరభేదంబులఁ జెందియుండు నందుఁ నపరమనఁగా రూపవత్పదార్థము పరమనఁగ రూపవత్తనియును, ఖాండిక్యునకుఁ దెలిపెనని భావము.

మ. మును నాచెప్పిన రెంటిలోఁ బర మన ముక్తాత్మ దూరంబు పా,
సనఁ గావింపనమూర్త మింక పరసంజ్ఞం బబ్జగర్భాది బ,
ద్ధనికాయం బది మూర్తమైనను బరిత్యాజ్యంబు శక్త్వాత్త్రిభా,
వనలం గూడుట నారురుక్షునకు సేవ్యం బీద్వయంబుస్రుచన్. ౭౪.

టీక. మును = ముందు, నాచెప్పిన = నేఁజెప్పినట్టి, రెంటిలోన్ = ద్వయములో, పరమనన్ = పరమనఁగా, ముక్తాత్మ = విడువఁబడిన బ్రహ్మము, అమూర్తము = ఆకారములేనిది, గనుక, ఉపాసనఁగావింపన్ = ధ్యానముచేయుటకు, దూరంబు = శక్యముగాదు, ఇంక = ఇంకను, అపరసంజ్ఞంబు = అపరమనుపేరుగలది, అబ్జగర్భాది = బ్రహ్మమొదలగు, బద్ధనికాయంబు = బద్ధజీవుల సంఘరూపము, అది = ఆయపరము, మూర్తమైనను = రూపవత్తైనను, శక్త్వాత్ = మాటిమాటికిని, త్రిభావనలన్ = భావనాత్రయముతోడను, కూడుటన్ = కూడియుండుటచేత, పరిత్యాజ్యంబు = సేవింపఁదగినదికాదు, ఆరురుక్షునకు = మోక్షకునికి, తుదన్ = కడపట, ఈద్వయంబున్ = ఈపరాపరములు రెండును, అసేవ్యంబు = విడువఁదగినది.

తా. పూర్వము నాచేతఁ జెప్పఁబడిన పరాపరములలో బరము నిరాకారముగాన ముముక్షువులగు జీవుల కుపాసనా శక్యమనియు నపరమను సంజ్ఞగల చతుర్ముఖాది బద్ధజీవ సంఘరూపము సాకారమైనను భావనాత్రయవిశిష్టముగుటం జేసి పరిత్యాజ్యమనియు నారురుక్షునకు శరీరత్యాగకాలమందు నీరెండువిధంబులుపాసనకుఁ దగినవి కావనియును తాత్పర్యము.

వ. ఆభావనాత్రయం బెద్ది యనినఁ జెప్పెద బ్రహ్మభావనయుం గర్మభావనయు బ్రహ్మకర్మోభయభావనయందు బ్రహ్మభావనాయుతులు సనందనాదులు, దేవాది స్థావరాంతములగు ప్రాణులందఱు కర్మభావనాభావకులు, హిరణ్యగర్భాదులుభయ

భావనాపరులీమూఁడు తెఱఁగులవారు భావనాత్రయాన్వితులు గావున ధాత్రీశ యీత్రివిధాత్మకరూపంబ సేవ్యంబు సనందనాదులును బ్రాగ్బ్రహ్మకల్పంబుల సంసరించుట భావనాబద్ధులె యిబ్భావనాత్మకంబగువిశ్వంబు సంస్థితికి నవధి దేవ మనుష్యాది విశేషజ్ఞాన కర్మంబులు క్షీణించుటయ యట్టి విశ్వంబై తోఁచు హిరణ్యగర్భాదులకంటె నన్యంబు పరాఖ్యం బిది ముక్తరూపం బమూర్తంబై యుండునని మొదల సూచించితిం గదా తదాకారంబుఁ దేటపఱచెద వినుము. పూర్వోక్త దేవాది భేదరహితంబై తద్భేదరాహిత్యంబున నిట్టిదట్టిదని వచించుటకు గోచరంబుగాక యపక్షయాది రహితంబును సచ్ఛబ్దవాక్యంబును నాత్మ సంవేద్యంబును నై జ్ఞానైక నిరూపణీయం బగుచు జ్ఞానశబ్ద వాచ్యంబును దానయై బ్రహ్మాత్మకం బగుట బ్రహ్మసంజ్ఞయుం గాంచి యొప్పును. మఱి భావనాత్రయాత్మక విశ్వ వైలక్షణ్యం బె లక్షణంబుగాఁగల యీరూపం బభ్యస్యమాన యోగుండగు యోగికిం జింతింప నశక్యంబు. మఱి యపరంబని చెప్పంబడిన హిరణ్యగర్భుండు వాసవుండును బ్రజాపతులు మరుత్తులు వసువులు రుద్రులు ఆదిత్యులు తారకంబులు గ్రహంబులు గంధర్వ యక్ష రక్షో దైత్యాది సమస్త దేవయోనులు మనుష్యులు పశువులు అద్రులు సముద్రంబులు ద్రుమంబులు వెండియు నేకపాద ద్విపాద బహుపాదాపాదంబులగు నితర భూతంబులుం దదుత్పత్తి హేతువులునుగా విలసిల్లునట్టి ప్రధానాది విశేషాంత చేతనాచేతనాత్మక ప్రపంచ భావంబగు స్థూలరూపంబు నుపక్రాంతయోగునకుఁ జింతింప శక్యంబు. శక్యమేనియుఁ దద్భావనాత్రయాత్మకం బగుట నశుభాశ్రయంబు గావున ముక్తిసాధనంబుగా దీ చెప్పఁబడిన సకల ప్రపంచంబును విష్ణుశక్తి సమన్వితంబై యతనికి శరీరంబులైయుండునట్టి విష్ణుశక్తులు మొదల నేఁ జెప్పిన పరాపరాఖ్యలను దదరిక్తయగు కర్మాఖ్యయును ద్రివిధలై యుండు నందుఁ గర్మాఖ్య శక్తిచేత వేష్టితయై యపరాఖ్య యగు క్షేత్రజ్ఞశక్తి జన్మ జరామరణాద్యనేక సంసార తాపంబు లనుభవించుచుఁ దత్తత్కర్మానుగుణ శరీరంబులెత్తి విజ్ఞాన తారతమ్యంబుల నొందుఁ దత్ప్రకారం బాకర్ణింపుము. ౭౮.

టీక. ఆభావనాత్రయుం బెద్దియనిన = ఆభావనాత్రయం బేదియనిన, చెప్పెదన్ = వచించెదను. బ్రహ్మభావనయు కర్మభావనయు బ్రహ్మకర్మోభయ భావనయు నని మూఁడు ప్రకారములు, అందు = ఆమూఁటియందు, సనందనాదులు = సనందనుఁడు మొదలగు మహాయోగులెల్లను, బ్రహ్మభావనాయుతులు, దేవాదిస్థావరావధులగు = దేవతలు మొదలు పర్వతపాషాణములు తుదగాఁగల, ప్రాణులందఱు = జీవులందఱును, కర్మభావనాభావకులు = కర్మభావనాయుతులు, హిరణ్యగర్భాదులు,

ఉభయభావనాపరులు = కర్మబ్రహ్మోభయభావనాపరులు, ఈమూఁడు తెఱంగుల వారు= మూఁడువిధంబులవారును, భావనాత్రయాన్వితులు = త్రిభావనలతోఁ గూడి యున్నవారు, భావునకా = అట్లౌటవలన, ధాత్రీశ = వసుమతీనాథా, ఈత్రివిధాత్మ కరూపంబ సేవ్యంబు = మూఁడువిధంబులగు రూపంబులు, సేవింపఁదగినవి, సనందనాదులు = సనందనుఁడు మొదలగువారును, ప్రాగ్బ్రహ్మకల్పంబులన్ = మునుపటి బ్రహ్మకల్పములయందు, సంచరించుటన్ = జన్మము లెత్తుటచేతను, భావ నాబద్ధులు = బ్రహ్మభావనచేత బద్ధులైనవారు, ఈ భావనాత్మకంబగు = భావనా స్వరూపంబైన, విశ్వంబు = జగత్తుయొక్క, స్థితికిన్ = ఉనికికి, అవధి = మర్యాద, దేవమనుష్యాది= దేవమనుష్యులు మొదలగు, విశేష= నానావిధప్రపంచముయొక్క, జ్ఞానకరణంబులు, క్షీణించుట = నష్టమౌట, ఇట్టి = ఈదృశంబైనట్టి, విశ్వంబై = జగత్తై, తోఁచు = కనుపించునట్టి, హిరణ్యగర్భాదులకంటె = చతుర్ముఖాదుల కంటెను, అన్యంబు = ఇతరమైనది, పరాఖ్యంబు = పరమనుపేరుగలది, అది, ముక్త రూపంబు = రూపములేనిది, అమూర్తంబైయుండుననిన్, మొదల = తొలుతనె, సూ చించితిఁగదా = జ్ఞాపకము సేసితిఁగదా, తదాకారంబు దేటపఱచెద వినుము = తత్స్వరూపంబుఁ దెలిపెద నాకర్ణింపుము, పూర్వోక్త = మున్ను చెప్పఁబడిన, దేవాది భేదరహితంబై = దేవాది భేదంబులు లేనిదై, తద్భేద రాహిత్యమునన్ = ఆభేదము లేకపోవుటచేత, ఇట్టిదట్టిదని వచించుటకు = ఈదృశంబు తాదృశంబని పల్కుటకు, గోచరంబుగాక = విషయముగాక, అపక్షయాది రహితంబును, అప క్షయ = నాశము, ఆది = మొదలగు వికారములచే, రహితంబు = విడువఁబడినది, సచ్ఛబ్దవాచ్యంబు, సత్ = సత్తను, శబ్ద = శబ్దముచే, వాచ్యంబు = చెప్పఁదగినది, ఆత్మసంవేద్యంబును, ఆత్మ = జీవునిచేత, సంవేద్యంబు = తెలియఁదగినదియు, జ్ఞా నైకనిరూపణీయంబును = జ్ఞానముచేతనే నిరూపింపఁదగినదియును, అగుచున్, జ్ఞా నశబ్దవాచ్యంబును = జ్ఞానమను శబ్దముచేఁ జెప్పఁదగినదియును, తానయ్యె, బ్రహ్మా త్మకంబగుటన్ = బ్రహ్మస్వరూపమౌటచేతను. బ్రహ్మసంజ్ఞయున్ = బ్రహ్మమను నట్టినామమును, గాంచి = పొంది, ఒప్పున్ = ఒప్పును, మఱి, భావనాత్రయాత్మక= త్రిభావనస్వరూపమైన విశ్వ = జగత్తుకంటె, వైలక్షణ్యంబె = వేఱగుటె, లక్షణంబు గాఁగల = చిహ్నముగాఁగల, ఈరూపంబు = ఇట్టిరూపము, అభ్యస్యమానయోగుఁ డగు = అభ్యసింపఁబడు యోగముగల, యోగికి = యోగవంతునికి, చింతింప నశ క్యంబు = అనుసంధానము చేయ శక్యముగాదు, మఱియు పరంబని చెప్పంబడిన, హిర ణ్యగర్భుండు = చతుర్ముఖుండు, వాసవుండు = ఇంద్రుఁడును, మొదలుగాఁగల్గి మూర్తములు = ఏకపాద దీతరభూతంబులును, తదుత్పత్తి హేతువులుగా = అభ్యాసాది

జన్మములకుఁ గారణంబులుగా, విలసిల్లునట్టి = ఒప్పుచున్నట్టి, ప్రధానాది విశే షాంత = ప్రధానము మొదలు విశేషములు తుదగాఁగల, చేతనాచేతనాత్మక = జ్ఞానాజ్ఞానజీవరూపంబైన, ప్రపంచభావంబగు = ప్రపంచభావము గలయట్టి, స్థూల రూపంబు, ఉపక్రాంతయోగునకు = యోగమునకు ప్రక్రమించినయోగికి, చింతింప శక్యంబు = ధ్యానసాధ్యంబు, శక్యమేనియు = ధ్యానసాధ్యంబైనను, తత్ = ఆ, భావనాత్రయాత్మకంబగుటన్ = భావనాత్రయ స్వరూపమగుటచేత, అశుభాశ్రయంబు = శుభాశ్రయము గాదు, కావునన్ = కాన, ముక్తిసాధనంబుగాదు, మోక్షసాధనంబుగాదు, ఈచెప్పఁబడిన సకలప్రపంచంబును, విష్ణుసమన్వితంబై, అతనికిన్ = ఆదేవునికి, శరీరంబునైయుండును, అట్టి విష్ణుశక్తులు = విష్ణుసామర్థ్యములు, మొదలనె చెప్పిన = తొలుత నాచేఁ జెప్పఁబడిన, పరాపరాఖ్యలను = పర అపర అను నామములచేతను, తదతిరిక్తయగు = దానికి వేఱైన, కర్మాఖ్యను = కర్మశక్తి అనునట్లుగను, త్రివిధలై యుండును, అందు = వానియందు, కర్మాఖ్యశక్తిచేత వేష్టితయై = కర్మమను పేరుగల శక్తిచేతఁ జుట్టఁబడినదై, అపరాఖ్యయగు = అపరమను పేరుగల, క్షేత్రజ్ఞశక్తి = పురుషశక్తి, జన్మజరామరణాది = జననము ముదిమి చచ్చుట మొదలగు, అనేక సంసారతాపంబులన్ = బహువిధములగు సంసారమువలని వేదనలను, అనుభవించున్, తత్కర్మ = ఆయాకర్మలకు, అనుగుణ = సరియైనట్టి, శరీరంబులు = దేహములు, ఎత్తి = పొంది, విజ్ఞానతారతమ్యంబుల = విశేష జ్ఞానంబులయొక్క వాసలను, పొందున్ = చెందును, తత్ప్రకారంబు = తత్క్రమంబు, ఆకర్ణింపుము = వినుము.

తా. సుగమము.

సీ. ఉండు నప్రాణులం • దొక్కించుక కాశక్తి, స్థావరశ్రేణిఁ ద • ద్జాతికంటె,
నెక్కుఁ గీటకబంద • మెక్కుడిం దిడిము, న్నగు సరీసృపములం • దంతకంటె,
ఖగముల మఱి వాని • కంటె మృగావలి, యందు నూహింపంగ • నంతకంటె,
దంతి గోముఖ పశు • తతి నంతకంటె మా, ర్త్యకదంబకములయం • దంతకంటె,
యక్ష గంధర్వ నాగాళి • నంతకంటె, నంతకంటె విప్రులం • దంతకంటె,
హరిహయునియందు దక్షునం • దంతకంటె, నామ్యఁదమ హిరణ్యగర్భునం • దంతకంటె.

టీక. ఆశక్తి = ఆక్షేత్రశక్తి, అప్రాణులందు = ప్రాణరహితవస్తుజాలమందు, ఒక్కించుక = కొంచెము, ఉండున్ = ఉండును, తజ్జాతికంటె = ప్రాణరహిత వస్తుజాతికంటెను, స్థావరశ్రేణిన్ = స్థావరపదార్థములగు పర్వతవృక్షాదులయందు, ద్విగుణంబుగ నుండును, (ఈపద్యమునం దుదాహరింపఁబడిన స్థావరశ్రేణిశబ్దము మొదలు హిరణ్యగర్భశబ్దమువరకు యథాక్రమంబుగ దత్తచ్ఛబ్ద వాచ్యంబులగు భూతముల

యందు నొకదానికంటె నొకదానియం దావిష్ణుశక్తి ద్విగుణంబు హెచ్చుగా నుండు నని యూహింపవలయు), తజ్జాతికంబెక = ఆస్థావరజాతికంబెను, ఎట్టిలు-రోఁకటిబండలు, గెట్టిపోతులు, దుస్తిండి = మన్నుదినునట్టిమణుదురు, గున్న = ఫ్రూడు బాములు, మున్నగు = మొదలయిన, సరీసృపములందు = సర్పములందును, అంతకంటె, ఖగమునఁ = పక్షులందు, వానికంటె, మృగావలిఁ = మృగసమూహమందు, ఊహింపఁ = గ్రహింపఁగా, అంతకంటె, దంతి = ఏనుఁగు, గో = ఆవు, ముఖ = మొదలగు, పశుతతిఁ = పశుసంఘమందును, అంతకంటె, మాత్యఁ = మనుష్యసంబంధమైన, కదంబకములయందు = గుంపులయందును, అంతకంటె, యక్ష గంధర్వనాగాళిఁ = యక్షాదులయందును, అంతకంటె, నిలింపులందు = దేవతల యందు, అంతకంటెఁ, హరిహయునియందు = దేవేంద్రునియందు, అంతకంటెఁ, దక్షునియందును, అంతకంటెఁ, ఆద్యుండు = మొదటివాఁడైన, హిరణ్యగర్భునందుఁ = చతుర్ముఖునియందు, క్షేత్రజ్ఞశక్తి యుండును.

తా. సుగమము.

ఆ.వె. ఇట్టి రూపకోటు • లెల్లనవ్విష్ణుని,
తను చయంబు సుమ్ము • ధరణినాథ,
యతఁ డచింత్యశక్తి • నఖిల భూతముల నా,
కసము వోలె నిండి • యెసఁగుఁ గాన. ౯౦.

టీక. ధరణినాథ = రాజా, ఇట్టిరూపకోటులెల్ల = ఏతాదృశరూప సహస్రంబులన్నియును, అవ్విష్ణుని = ఆదేవునియొక్క, తనుచయంబుసుమ్ము = దేహసమూహముసుమీ, అతఁడు = ఆదేవుఁడు, అచింత్యశక్తిఁ = చింతింప నశక్యంబైన సామర్థ్యముచేత, అఖిలభూతములఁ = సకలభూతములయందు, ఆకసమువోలె = ఆకాశముంబలె, నిండి = సంపూర్ణుఁడై, ఎసఁగుఁగాన = ఒప్పునుగాన.

తా. ఆవిష్ణుం డప్రమేయం బగు నిజ సామర్థ్యముచేత నిఖిల భూతములయం దాకాశము మాడ్కి నిండి ప్రకాశించుచుండును గాన నుక్తంబు లగు నేతాదృశ రూప సహస్రంబు లాదేవుని శరీర పుంజంబులు సుమీ ఓ ధరణీనాథా! యని కేశి ధ్వజుండు పలికెనని తాత్పర్యము.

సీ. మున్నెన్నినపరాఖ్య • మునకుద్వితీయమై, విష్ణుసంజ్ఞఁగను ను • ర్వీతలేశ,
యోగిహృద్ధ్యేయమై యొప్పునమూర్తరూ, పంబాఁడుసత్సంజ్ఞఁ • బ్రాజ్ఞకోటి,
దానివచించు నే • తద్రూపముసమస్త, శక్తులకెల్లనా • శ్రయత నొందు,
ప్రాగుక్త విశ్వరూ • పవిధుండతఁగాంచి, కల్యాణగుణభూతి • గరిమఁజనరి,

యతి మహత్త్వంబుచే వెల్గు • నట్టిశక్తి, నలరు బ్రహ్మంబు దేవ తి • ర్యఙ్మనుష్య,
నామ చేష్టావదవ తర • ణములనాత్మ, లీల జగదుపకృతికిఁ గ • ల్పించుచుండు.

టీక. ఉర్వీతలేశ = రాజా, మున్నెన్ని నపరాఖ్యమునకు = మునుపు చెప్పిన పరమనియెడు పేరుగల బ్రహ్మమునకు, ద్వితీయమై = రెండవదియై, యోగిహృద్ధ్యేయమై = యోగిచిత్తములచేతధ్యానము సేయఁదగినదియై, ఒప్పన్ = ఒప్పుచున్న, అమూర్తరూపంబు = మూర్తభిన్నరూపంబు, ఒండు = ఒకటి, విష్ణుసంజ్ఞన్ = విష్ణువను పేరును, కనున్ = పొందును, ప్రాజ్ఞకోటి = పండితసమూహము. (సీ. ధీరోమనీషీజ్ఞః ప్రాజ్ఞస్సంఖ్యావాన్పండితః కవి యని యమరము) దానిన్ = ఆరూపమును, సత్సంజ్ఞన్ = సత్తనునామముచేత, వచించున్ = పలుకును, ఏతద్రూపమె = ఈరూపమె, సమస్తశక్తులకెల్లన్ = నానావిధ సామర్థ్యములకు, (ఇది చింత్యము) ఆశ్రయతన్ = స్థానముగుటను, ఒంది = పొంది, ప్రాగుక్త = ముందు, చెప్పఁబడిన, విశ్వరూప = జగద్రూపమునకంటె, విలక్షణతన్ = వైలక్షణ్యమును, కాంచి = కని, కల్యాణగుణభూతి = కల్యాణగుణ సంపత్తియొక్క, గరిమన్ = గురుత్వము జేతను, తనరి = ఒప్పి, అతిమహత్త్వంబుచే = అత్యంత మాహాత్మ్యముచేత, వెల్గున్ = ప్రకాశించును, అట్టి, శక్తిన్ = సామర్థ్యముచేత, అలరు = ఒప్పునట్టి, బ్రహ్మంబ = పరబ్రహ్మమె, దేవ = దేవతలయందు, తిర్యగ్ = మత్స్యాది తిర్యగ్జాతులయందు, మనుష్య = మనుష్యులందు, నామచేష్టావత్ = నృసింహ వామన మత్స్య కూర్మ వరాహ రామ కృష్ణాదినామములు చేష్టలుగల, అవతరణములన్ = అవతారములను, ఆత్మ = తనయొక్క, లీలన్ = విలాసముచేతను, జగదుపకృతికిన్ = లోకోపకారమునకు, కల్పించుచుండు = చేయుచుండును.

తా. ఓయి భూనాయకుఁడా! మున్ను నేఁ జెప్పిన పరమనియెడు బ్రహ్మమునకు రెండవదియై యోగులచేతఁ దెలియఁదగినదియైన మూర్తభిన్నరూపం బొక్కటివిష్ణువను నామమును బొందియున్నదనియుఁ బండితులట్టి రూపంబును సత్తను సంజ్ఞచేత వచించుచున్నారనియు నీరూపంబె నానావిధ సామర్థ్యముల కాశ్రయతనుబొంది పూర్వము చెప్పఁబడిన జగద్రూపమునకంటెను వైలక్షణ్యమునుం గాంచి కల్యాణగుణ సంపద్గురుత్వముచేత నొప్పి యత్యంత మాహాత్మ్యముం గలిగి ప్రకాశించుచున్న సామర్థ్యముచేత నొప్పుననియు నట్టి పరబ్రహ్మమే నిజ విలాసముచేత దేవ తిర్యఙ్మనుష్యులయొక్క, నామములు వ్యాపారములుం గల రామకృష్ణాద్యవతారములను లోకోపకారమునకై కల్పించుచుండు నని తాత్పర్యము.

ఆ. వె. కమల భుక్తికొఱకుఁ • గాదిట్టి తల్లీల,
యతఁడు సకల జాతు • లందుఁ బుట్టు,

బుట్టినట్టి యతని • భూరిచేష్టితము ల,
వ్యాహతములు• రావణాదివలన. ౮౨.

టీక. ఇట్టి, తత్ = ఆదేవునియొక్క, లీల = విలాసక్రియ, కర్మఫుక్తి, కొఱకుఁగాదు = కర్మానుభవము కొఱకుఁగాదు, అతఁడు = అవిష్ణుదేవుఁడు, సకలజాతులందున్ = దేవమనుష్య తిర్యగాది సమస్తజాతులయందును, పుట్టుట = జన్మమునొందుటను, పుట్టినట్టి = జనియించిన, అతని = ఆదేవునియొక్క, భూరిచేష్టితములు = అధికములైన వ్యాపారములు, రావణాదివలన = రావణుండు మొదలగు దుష్టులవలన, అవ్యాహతములు = భగ్నములు గావింప నశక్యంబులు.

తా. ఆవిష్ణుదేవునియొక్క విలాసక్రియ స్వకీయకర్మానుభవము కొఱకుఁ గాదనియు అతఁడు తిర్యగాది నిఖిల జాతులయందుఁ బుట్టినను నతని వ్యాపార విస్తారంబులు దుష్టులగు రావణాదుల వలన భగ్నములుగావింప నసాధ్యంబులనియును తా.

వ. అట్టి పరమేశ్వరునకు బద్ధముక్తాది రూపంబు లనేకంబులు గలిగిన ముముక్షునకు జ్ఞాన సిద్ధికిఁ బరవ్యూహ విభవాది రూపంబులే చింతనీయంబులు ప్రజ్వలిత శిఖుండగు పవన సఖుండు నీరస నికుంజంబు నెట్లుదహించునట్లు చిత్తస్థుండగు విష్ణుండు యోగిజనంబుల సకల కిల్బిషంబులు నిదహించుఁగావున సకలశక్త్యాశ్రయుండైన యప్పరమాత్మునియందుఁ జిత్తంబు నిల్పుట విశుద్ధయగు ధారణ యనంబడు సర్వసంగంబునఁ జలాత్మకంబగుచిత్తంబునకుఁ ద్రిభావభావనాతీతుండగు నద్దేవుండు శుభాశ్రయుండై ముక్తికరుం డగు నేతద్వ్యతిరిక్తలగు బ్రహ్మాదిదేవతలు కర్మయోను లగుట నశుద్ధులుగావునఁ జిత్తంబున కవలంబనీయులుగారు. మఱి నిరవలంబ ధ్యానంబు పొందుపడదు గావున ధారణాధ్యాన విషయంబై శుద్ధంబగు స్థూలరూపాంతరం బయ్యనంతునకుం గలదు. దాని విస్తరంబుగాఁ జెప్పెద నాకర్ణింపుము. ౮౩.

టీక. అట్టిపరమేశ్వరునకు బద్ధ ముక్త ఆది = మొదలైనరూపంబులు, అనేకంబులుగలిగిన = పెక్కులుగలిగియుండినను, ముముక్షునకు = సాధకునికి, జ్ఞానసిద్ధికిన్ = జ్ఞానము సిద్ధించుటకొఱకు, పరవ్యూహ సంకర్షణ వాసుదేవ ప్రద్యుమ్న అనిరుద్ధ యను చతుర్విధవ్యూహములు, విభవ = రామకృష్ణాద్యవతారంబులు, ఆది = మొదలగు, రూపంబులె = స్వరూపములె, చింతనీయంబులు = ధ్యానవిషయంబులు, చిత్తస్థుఁడగు = మనంబున నిల్చినట్టి, విష్ణుండు = విష్ణువు, ప్రజ్వలిత శిఖుండగు = మిగుల మండుచున్నజ్వాలలుగల, పవనసఖుండు = అగ్ని, నీరసనికుంజంబున్ = ఎండినపొదను, ఎట్లుదహించున్ = ఏవిధంబుగఁగాల్చునో, అట్లు = అవిధంబుగ, యోగిజనంబుల = యోగులయొక్క, సకల కిల్బిషంబులు = సమస్తపాపములను, నిదహించున్ =

కాల్చుచు, కావునన్ = కాన, సకలశక్త్యాశ్రయుండైన = సమస్త సామర్థ్యములకు కాధారమైన, అప్పరమాత్మునియందుఁ, చిత్తంబునిలుపుట = మనంబుంచుట, విశుద్ధయగు ధారణయనంబడును, సర్వసంగంబునన్ = నిఖిలవస్తుసంబంధములచేత, చలాత్మకంబగుచిత్తంబునకు = చంచలరూపమైనమనంబునకు, త్రిభావ = మూఁడుభావములుగల, భావనా = ధ్యానమునకు, అతీతుండగు = వెలిగానున్నట్టి, అద్దేవుండు, శుభాశ్రయుండై = శుభస్థానమై, ముక్తికరుండగు = మోక్షమునిచ్చువాఁడగును, ఏకద్వ్యతిరిక్తులగు = ఈవిష్ణునకు భిన్నులైన, బ్రహ్మాదిదేవతలు = చతుర్ముఖుఁడు మొదలగు నిలింపులు, కర్మయోనులగుటన్ = కర్మమే కారణంబుగాఁగలవారౌటచేత, అశుద్ధులు = అయోగ్యులు, (మలినులనుట), కావునన్, చిత్తంబున కవలంబనీయులుగారు = మనస్సున కాశ్రయింపఁదగినవారలుగారు, మఱియును, నిరవలంబ = ఆధారములేని, ధ్యానంబు, బొందుపడదుగావున = సిద్ధింపదుగాన, ధారణాధ్యానవిషయంబై = ధారణాధ్యానంబులకు, గోచరంబై, శుద్ధంబగు = నిర్మలంబగు, స్థూలరూపాంతరంబు = మఱియొకస్థూలరూపము, అయ్యనంతునకున్ = అపరబ్రహ్మమునకు, కలదు = ఉన్నది, దాని విస్తరంబుగాఁ జెప్పెద నాకర్ణింపుము.

తా. స్పష్టము.

సీ. శరదిందు చకచక • స్మయజిత్ప్రసన్నాస్యు, దొడ్డకెందమ్మి క • న్దోయి వాని,
నతి కమ్రగల్లభా • గాభోగ ఫాలాఢ్యు, మకరాంక రత్నక • ర్ణికలవాని,
గాంబవోద్యచ్ఛ్రీవి • డంబివృత్తశిరోధి, సిరి పొల్చు మచ్చ పే • రురమువాని,
నత నాభి యుతవళి • త్రితయశాతోదరు, జానులంబి చతుర్భు • జములవాని,
గరివర కరోరు రుచిర జం • ఘరమణీయు, సమత బొందిన పద • పల్లవములవాని,
పైఁడి వసనుఁ గిరీటహా • రాంగదాది, కలితు శంఖ రథాంగాబ్జ • లలరువాని.

టీక. శరదిందు = శరత్కాలచంద్రుని యొక్క, చకచక = చాకచక్యముయొక్క, స్మయ = గర్వమును, జిత్ = గెలిచినట్టి, ప్రసన్న = ప్రసాదముగల, ఆస్యున్ = ముఖముగలవానిన్, దొడ్డ = గొప్పలైన, కెందమ్మి = ఎఱ్ఱదామరలవంటి, కన్దోయివానిన్ = నేత్రయుగళముగలవానిన్, అతికమ్ర = మిగులఁగమనీయమైన, గల్ల = చెక్కిళ్లయొక్క, భాగ = ప్రదేశముచేతను, ఆభోగ = పరిపూర్తిగల, ఫాల = నొసటిచేత, ఆఢ్యున్ = సంపన్నుఁడైనవానిన్, మకర = మొసళ్లు, అంక = చిహ్నముగాఁగల, రత్న = మణిఖచితములయిన, కర్ణికలవానిన్ = పోగులుగలవానిన్, కాంబవ = శంఖసంబంధియైన, ఉద్యత్ = విలసిల్లుచున్న, శ్రీ = కాంతియొక్క, విడంబి = పోలికగలిగినయట్టి, వృత్త = వర్తులమైన, శిరోధిన్ = మెడగలవానిన్, సిరి = లచ్చి, పొల్చు = ఒప్పునట్టి, మచ్చ = శ్రీవత్సమను మచ్చగల, పేరురమువానిన్ = గొప్ప

రొమ్ము గలవానిన్ (లక్ష్మీదేవియు శ్రీవత్సమను మచ్చయును స్వామి వక్షస్థలమందు నుండునని ప్రసిద్ధంబు), నత = లోతైన, నాభి = బొడ్డుతోడను, యుత = కూడియున్న, వళిత్రితయ = మూఁడుముడతలుగలిగిన, శాత = సూక్ష్మమైన, ఉదరున్ = బొజ్జగలవానిన్, జానులంబి = మోకాళ్లపర్యంతము వ్రేలుచున్న, చతుర్భుజముల వానిన్ = నాలుగు చేతులుగలవానిన్, కరివర = గజశ్రేష్ఠముయొక్క, కర = తుండమువంటి, ఊరు = తొడలచేతను, రుచిర = మనోహరమైన, జంఘ = పిక్కలచేతను, రమణీయున్ = సుందరుఁడైనవానిన్, సమతఁబొందిన = సమమైనట్టి, పదపల్లవములవానిన్ = చిగురుటాకులవంటి పాదములు గలవానిన్, హైమ = సువర్ణసంబంధియైన, వసనున్ = వస్త్రముగలవానిన్, కిరీట హార, అంగద = బాహుపురి, ఆది = మొదలైనవానితో కలితున్ = కూడియున్నవానిన్, శంఖ = శంఖము, రథాంగ = చక్రము, ఆదులు = మొదలుగాఁగల పంచాయుధములచేతను, అలరువానిన్ = ఒప్పుచున్నవానిన్.

తా. శరత్కాలచంద్రునియందలి చాకచక్యమును ధిక్కరించుచుఁ బ్రసన్నమై యున్న ముఖము గలయట్టియు గొప్పవైన యెఱ్ఱదామరలవంటి నేత్రయుగళముగలిగి నట్టియు, మిగుల సుందరమగు చెక్కిళ్లు, పరిపూర్తి గలనాసలు, వీనిచే సంపన్నుఁడై నట్టియు మకరాంకములు రత్నఖచితములునైన ప్రోగులుగలయట్టియు శంఖకాంతి ననుకరించుచు వట్రువగానున్న మెడగలయట్టియు లక్ష్మిచేతను శ్రీవత్సమను మచ్చ చేత నొప్పుచున్న రొమ్ముగల మిగుల లోతైన నాభితో గూడిన వళిత్రయముగల సూక్ష్మమగు బొజ్జగలయట్టియు మోకాళ్లవరకు వ్రేలెడి చతుర్భుజములుగలయట్టియు నేనుంగు తుండమువంటి తొడలచే నతిరమణీయంబగు పిక్కలచేత సుందరుండైనట్టి యు చిగురుటాకులవంటి పాదములుగల్గి హైమవసనము గలయట్టియుఁ గిరీట హారాంగదాది సహితుఁడైనట్టియు శంఖరథాంగాది పంచాయుధములచే నొప్పుచు నుక్తసకల లక్షణలక్షితుండై యున్న జగదీశ్వరుండగు శ్రీహరి దివ్యమంగళ విగ్రహమును సాధకుండు వక్ష్యమాణక్రమంబున ధ్యానమొనర్ప వలయునని తాత్పర్యము.

సీ. శ్రీవిష్ణు నీగతిఁ • జింతింప వలయుఁ ద, న్మయుఁడగు యోగి క్ర • మంబుతోడ,
నొక్కయంగమె మున్ను • చిక్కలో భావించి, యదిదృఢంబగుటయు • నవలియంగ,
కము మఱి చింతింపఁ • గాఁ దగునట్టి య, ధ్యాసంబువలన • య్యవయవములు,
నడచిన నన్నమా • నక యెద్దియేనియుఁ, జేయుచున్ననుమదిఁ • బాయఁ డేని,
యతని సామ్యంబుగని ముక్తుఁ • డగుసురాది, భేదసంజనకాజ్ఞాన • మేదఁ బిదప,
నలము కల్యాణ గుణముల • సారికేఁపనకు, లేనిభేదమువ్వాఁడు కల్పింపఁగలఁడు.

టీక. శ్రీవిష్ణున్ = శ్రీహరిని, ఈగతిన్ = వక్ష్యమాణ ప్రకారంబుగ, చింతింపవలయున్ = ధ్యానముసేయవలయు, తన్మయుఁడగు = ఆవిష్ణుస్వరూప మ

య్యాశి, యోగి = యోగవంతుఁడు, క్రమంబుతోడన్, మున్ను = తొలుత, ఒక్క-యంగమె = ఒకయవయవమునె, చిక్కన్ = గురుతుచిక్కునట్లుగ, లోన్ = లోపల భావించి = చింతించి, అనిదృఢంబగుటయున్ = ఆయంగము దృఢముగ మనంబులో నిలిచినపిమ్మట, అవలి = ఆవలనున్న, అంగమును, మఱి=మఱియును, చింతింపఁగాఁ దగున్ = ధ్యానము సేయవలయు, అట్టియభ్యాసంబువలన = అటువంటివాడుకచేత, అయ్యవయవములు = ఆయంగములను, నడచినన్ = గమనమొనరించినను, ఉన్నన్= స్థితుండైనను, మానక = వదలక, ఎద్దియేనియుఁ జేయుచున్నను = ఏపని సేయుచుండినను, మదిన్ = బుద్ధిని, పాయఁడేని = తొలగకుండఁ జేసి సేని, అట్లాచరించిన సాధకుండు, అతని = అప్పరమాత్మునియొక్క, సామ్యంబు = సారూప్యము, కని = కాంచి, ముక్తుఁడగున్ = మోక్షముఁబొందును, సురాది = సురలు మొదలగు, భేద = భేదమును, సంజనక = పుట్టించుచున్న, అజ్ఞానము= అవిద్య, ఏదన్= నివర్తింపగ, పిదపన్ = పిమ్మటను, అలము = ప్రాప్తమగునట్టి, కల్యాణగుణములన్= సౌశీల్యాది శుభగుణములచేత, హరికిన్ = విష్ణునకు, తనకు = యోగికిని, లేనిభేదము= ఎన్నటికి లేకుండు భేదమును, ఎవ్వాఁడు = ఎట్టివాడు, కల్పింపఁగలడు = నిర్మాణము సేయ సమర్థుఁడౌను.

తా. శ్రీయఃపతియొక్క సారూప్యం బపేక్షించువార లీప్రకారము ధ్యానము సేయవలయు నెట్లన్నను మున్నొక్క యవయవమును మనంబున కంటునట్లుగ మిగుల భావన యొనర్చి యది దృఢముగ గుఱు దగిలిన పిమ్మట మఱి యొక యంగమును భావించుచు నిత్తెఱంగున నవయవంబుల నెల్ల ధ్యానించి తానూరకున్నను లేక గమనాది వ్యాపారంబులు వడసి యున్నను మఱియు నెట్టి యవస్థ నొందియున్నను ధ్యానము మానక యుండిన నా యంగంబులు మనంబు విడిచి కదల కుండు నట్లభ్యాస పాటవ మొనర్చె నేని యట్టి సాధకుండు శ్రీహరి సారూప్యము నొంది ముక్తుం డగుననియు దేవతలు మొదలగు భేదమును గల్పించుచున్న యజ్ఞానము నివర్తించిన పిదపఁ గల్యాణ గుణ సమన్వితుం డై యావిష్ణునకుం దనకును లేని భేదం బెవ్వాఁ డేనియుం గల్పింపఁజాలఁడనియును తాత్పర్యము.

కం. నరవర యిటు బంధచ్యుతి,
కొరకగు నంగాష్ట కాఖ్య • గురుయోగము వి,
స్తరముగఁ జెప్పితి నింకం,
గరణీయం బెద్దినాకుఁ • గల్పింపు మనన్. ౮౬.

టీక. నరవర = రాజా, ఇటు = ఈప్రకారము, బంధచ్యుతి కొరకగు = సంసారబంధ మోచనమున కైనట్టి, అంగాష్టకాఖ్య = అంగాష్టకమను పేరంబరగిన,

గుర్వు = అతిశయంబగు, యోగము = సమాధిని, విస్తరముగన్ = విపులమగునట్లు, చెప్పితిన్ = వచించితిని, ఇంకన్ = ఇకను, నాకున్, కరణీయంబు = చేయందగినది ఎద్ది = ఏది, కల్పింపుమనన్.

తా. ఓయి రాజా! ఈప్రకారముగ సంసార రూప బంధ మోచనంబునకై యంగాష్టకాఖ్యంబగు నుత్తమ యోగంబు సెప్పితి నింక నేఁజేయం దగినది యెద్దియో తెలుపు మనఁగా నాఖాండిక్యుండు ముంపు వచించుచున్నాఁ డనుట.

తే. గీ. నృప కృతార్థుండ నైతి నా కింత కంటె,
నర్థనీయంబు మఱియెద్ది యనుచు నతని,
కర్చఁ గావించి వల దన్న నతఁడొసంగు,
తనదు తొంటి రాజ్యంబునఁ దనయు నిలిపి. ౯౭.

టీక. నృప = కేశిధ్వజుండా, కృతార్థుండనైతిన్ = ధన్యుండనైతిని, నాకున్, ఇంతకంటెన్ = ఈయోగముకంటెను, అర్థనీయంబు = కోరఁదగినది, మఱియెద్ది = మఱియొకటియేది, అనుచున్, అతనికి = కేశిధ్వజునకు, అర్చఁగావించి = పూజయొనర్చి, వలదన్నను = వలవదన్నను, అతఁడు = ఆకేశిధ్వజుఁడు, ఒసఁగు = ఇచ్చినట్టి, తనదు = తనయొక్క, తొంటిరాజ్యంబునన్ = పూర్వపు రాజ్యమునందు, తనయున్ = పుత్రకుని, ఉనిచి.

తా. ఓయి కేశిధ్వజుఁడా! ధన్యుండనైతి నీ యోగంబుకంటె వేఁడఁదగినది యెద్దియును లేదనుచు నా కేశిధ్వజునకుం బూజఁగావించి వలవదన్నను కేశిధ్వజు డిచ్చిన తన పూర్వపు రాజ్యమునందుఁ దన పుత్రకుని నియమించె నని తాత్పర్యము.

వ. పురోహిత ప్రధానుల నప్రాప్తయౌవనుం డగు నతని మెలపి కాని నియోగించి వారల దాన సన్మానాదులం బ్రోవుమని కుమారునకు నప్పగించి గోవిందచరణారవింద విన్యస్తమానసుండై ఖాండిక్యుం డుభయ కర్మంబులు డుడిపి యవ్వనంబు తపోవనంబుగాఁ గొంత కాలంబు కేశిధ్వజోపదిష్టయోగాను సంధానంబున మధుమథన సాధర్మ్యంబునొందెఁ గేశిధ్వజుండును దత్పుత్రునిఁ దత్ప్రధానులఁ దదీయ రాజ్య పరిపాలన కనిచి మిథిలాపురంబు ప్రవేశించి యోగాశ్రయుండై భోగంబులఁ బుణ్యంబులు తదితరంబుల దురితంబులు ప్రక్షీణంబులుగా క్షోణీతలం బేలుచుండెఁ గావున ముముక్షున కుపాశ్రయణీయుం డధోక్షజుండు పాండ్యాధీశా నీవతని భజియింపు మిదియు భక్తి యోగంబు దీనియందు నొక్క కొలఁది గల దంతరాయంబు నొందినఁ బునర్భవంబుఁ బొందించి మఱి ముక్తిఁ జేర్చు నట్లగుట నింతకంటె సులభోపాయం బాయోధనంబున నయ్యధోక్షజుండు గాఁడి

వికుపదేశించిన శరణాగత ధర్మంబని పరిణతాంతఃకరణుండగు నతనికి మూల మంత్ర పూర్వకంబుగా ద్వయము ప్రసాదించి భాగవత ప్రధానుం గావించిన.

టీక. ఖాండిక్యుండు,పురోహితులను,ప్రధానులను, అప్రాప్తయౌవనుండగు-వయసురానివాఁడైయున్న, అతనిన్ = ఆకుమారుని, మెలపికొండని = తీర్చికొండని, నియోగించి = ఆజ్ఞాపించి, వారలన్ = ఆమంత్రిపురోహితులను, దాన = ఈవులు, సన్మాన = బహుమానములు, ఆదులన్ = మొదలగువానిచేత, ప్రోవుమని= రక్షింపుమని, కుమారున కప్పగించి = పుత్రకుని వశపఱిచి, గోవింద = శ్రీహరియొక్క, చరణారవింద = పాదపద్మములయందు, విన్యస్త = ఉంచబడిన, మానసుండై= మనంబుగలవాఁడై, ఖాండిక్యుండు, ఉభయకర్మంబులుడులిపి = పుణ్యపాపములనెల్లఁగొట్టి, అవ్వనంబ = తానున్న యరణ్యంబె, తపోవనంబుగ = తపమొనరించునట్టి యాశ్రమముగ, కొంతకాలంబు = కొన్నినాళ్లు, కేశిధ్వజోపదిష్ట = కేశిధ్వజునిచేత నుపదేశింపఁబడిన, యోగానుసంధానమ్మునన్ = యోగమునాచరించుటజేత, మధుమథన = శ్రీమన్నారాయణునియొక్క, సాధర్మ్యంబున్ = సమానధర్మమును, ఒందెన్ = పొందెను, కేశిధ్వజుండును, తత్పుత్రుని = ఆఖాండిక్యుని కుమారుని, తత్ప్రధానులన్ = అతని మంత్రులను, తదీయ రాజ్య పరిపాలనకనిచి = ఖాండిక్యుని రాజ్యమంతయు = నేలుటకుఁబంపి, మిథిలాపురంబు ప్రవేశించి = తాను మిథిలాపట్టణముసొచ్చి, యోగాశ్రయుండై, భోగంబులన్ = సుఖానుభవములచేత, పుణ్యంబులు = పుణ్యకర్మంబులు, తదితరంబులన్ = వానికంటెవేఱైన దుఃఖానుభవములచేత, దురితంబులు = పాపములు, ప్రక్షీణంబులుగాన్ = నశించునటుల, (ప్రారబ్ధకర్మణాంభోగాదేవక్షయ యనునట్టిన్యాయమవలంబివై), క్షోణీతలంబేలుచుండెన్, కావున= అటుగాన, ముముక్షునకు, ఉపాశ్రయణీయుండు = ఆశ్రయింపఁదగినవాఁడు, అయ్యధోక్షజుండు = ఆవిష్ణుండె, పాండ్యక్షితీశా = ఓయిరాజా, నీవు, అతనిన్ = ఆవిష్ణుని, భజింపుము = భజనసేయుము, ఇది భక్తియోగంబు, దీని నొక్కకొంతగలదు, అంతరాయంబు = విఘ్నము, ఒందినన్ = పొందినన్, పునర్భవంబుఁబొందించి = పునర్జన్మమెత్తించి, మఱి = పిదప, ముక్తింజేర్చున్ = పరమపదమునందుఁజేర్చును, అట్లగుటన్ = అలాగగుటచేత, ఇంతకంటె సులభోపాయము, ఆ మోహనమునన్ = తొల్లిభారతయుద్ధమందు, అయ్యధోక్షజుండు = ఆశ్రీకృష్ణుండు, గాండీవికిన్ = అర్జునునకు, ఉపదేశించిన శరణాగతధర్మంబ = శ్రీభగవద్గీతా చరమశ్లోకోక్తధర్మంబే, నిరపాయధర్మంబు = అపాయరహితమైన ధర్మము, అని = ఇట్లని, పరిణతాంతఃకరణుండగు = పరిపక్వమనస్కుండైన, అతనికి = ఆపాండ్యరాజునకు, మూలమంత్ర పూర్వకంబుగా = శ్రీమదష్టాక్షరీ మంత్ర సహితము

బుగా, ద్వయంబు = వాక్యద్వయంబును, ప్రసాదించి = అనుగ్రహించి, భాగవత ప్రధానుఁడు = భాగవతోత్తమునిఁగా, కావించినన్ = చేయఁగా.

తా. స్పష్టము.

మ. వకుళాలంకృత యోగిహృన్నిలయ భా • స్వత్పాండు భాస్వన్మయాం,
బక నాభీజలజాత సూత విధి సం • ప్రాప్తస్మరారిష్ట ము,
ష్టికఠోరార్పణ కర్బురీఫలిత కే • శిక్రూర రక్షోంగకా,
కృకవాకుధ్వజ దీర్ఘికాప్లవతపః • క్రీడోత్సవాద్యుత్సుకా. ౮౯.

టీక. వకుళ = పొగడపువ్వులచేతను, అలంకృత = అలంకరింపఁబడిన, యోగి = నమ్మాళ్వారను యోగియొక్క, హృత్ = హృదయము, నిలయ = గృహముగాఁగల వాఁడా, భాస్వత్ = సూర్యునియొక్క, పాండు = తెల్లనైన, భాస్వత్ = కాంతి గలచంద్రునియొక్క, మయ = స్వరూపమైన, అంబక = నేత్రద్వయము గలవాఁడా, (ని. స్యాదంబకమ్ దృష్టి యని నిఘంటువు.) నాభీజలజాత = బొడ్డుతామరయందు, సూత = పుట్టిన, విధి = చతుర్ముఖునిచేతను, సంప్రాప్త = పొందఁబడిన, స్మర = మన్మథునికి, అరిష్ట = శత్రుఁడైన శివుఁడుగలవాఁడా, (విష్ణువు వలన బ్రహ్మయు నతని వలన రుద్రుఁడును బుట్టిరనుట) ముష్టి = పిడికిలియొక్క, కఠోర = నిష్ఠురమైన, అర్పణ = ఉనికి (అనఁగా ముష్టిఘాతమన కనుట), కర్బురీఫలిత = దోసపండుగాఁ జేయఁబడిన. (ని. ఉర్వారుః కర్బురీ స్త్రీయామ్ అని నిఘంటువు), కేశి = కేశియనునట్టి, క్రూరరక్షః = కర్కశుండగు రక్కసునియొక్క, అంగకా = దేహముగలవాఁడా, కృకవాకుధ్వజ = కోడిటెక్కెమందు గల కుమారస్వామియొక్క, దీర్ఘికా = సరస్సునందు, ప్లవ = ఈఁదులాటగల, తపఃక్రీడా = గ్రీష్మకాలమందలి కేళియొక్క, ఉత్సవ = మహోత్సవము, ఆది = మొదలగువానియందు, ఉత్సుక = ఆసక్తుఁడైనవాఁడా.

తా. భాగవత ప్రధానుండగు నమ్మాళ్వారు హృదయమందుఁ గ్రుమ్మరుచున్నట్టియు సూర్యచంద్రులు నేత్రములుగాఁగలయట్టియు తన వలనఁ బుట్టినట్టి చతుర్ముఖునియందుఁ బుట్టిన రుద్రుఁడుగల యట్టియుఁ గఠోర మగు ముష్టిఘాతముచేత దోసపండుం బలెఁ బగల్పఁబడిన కేశి దనుజుఁడు గల యట్టియుఁ గ్రీష్మఋతువందు స్వామి పుష్కరిణిలో నీఁదులాడుటయను నుత్సవమం దుత్సుకుఁడ వైనవాఁడా! యని తాత్పర్యము.

కం. ఊరీకృత పాండవరథ, సారథ్య సయూథ్య గోప • శాబక సహకే,
ళీరత భక్తప్రహ్లా, దారచిత స్తోత్రపులకి • తాంచితగాత్రా. ౯౦.

టీక. ఊరీకృత = అంగీకరింపఁబడిన, పాండవ = అర్జునునియొక్క, రథ = ఆరథముయొక్క, సారథ్య = సారథిత్వము గలవాఁడా, సయూథ్య = చెలికాండ్రైన, గోపశాబక = గొల్లపిల్లవాండ్రతోడను, (ని. పృథుకశ్శాబశ్శిశుః అని నిఘంటువు) సహకేళీ = కూడఁ గ్రీడించుటయందు, రత = ఆసక్తిగలవాఁడా, భక్త = అనురక్తుఁడైన, ప్రహ్లాద = ప్రహ్లాదునిచేత, ఆరచిత = విశేషముగఁ జేయఁబడిన, స్తోత్ర = స్తుతిచేత, పులకిత = సంజాత పులకమైన, అంచిత = ఒప్పుచున్న, గాత్రా = దేహముగలవాఁడా.

తా. అర్జునుని రథమునకు సారథివైనట్టియు వయస్యులగు గొల్లతోడి క్రీ

డలయందాసక్తిగలయట్టియు భాగవతుం డగు ప్రహ్లాదునిచేతఁ జేయఁబడిన స్తోత్రముచేత నైన రోమాంచముచే నొప్పుచున్న దేహముగలవాఁడా యని తాత్పర్యము.

స్రగ్విణి. ఆసితాహీంద్రశయ్యా దభీయస్సర, త్ప్రసృతాంఘ్రి శ్రితవ్రాతచేతోఘదా,
కస్సలప్రస్పృశత్కాళియక్ష్వేళమూ, ర్ధస్థలీనృత్తమల్లీహల్లీసకా. ౯౧.

టీక. ఆసిత = శయనింపఁబడిన, అహీంద్ర = శేషుఁడే నెదు, శయ్యా = పాన్పుగాఁ గలవాఁడా, దభీయస్సర = మిగులఁ బొడవుగ, ప్రసృత = నడచిన, అంఘ్రి = పాదములు గలవాఁడా, శ్రితవ్రాత = భక్తసమూహముయొక్క, చేతః = మనంబులందలి, ఘ = పాపములను, దా = ఖండించువాఁడా, (దో = అవఖండనె అని ధాతువు), కస్సల = ఉదకప్రదేశములు, ప్రస్పృశత్ = స్పృశించుచున్నట్టి యనఁగా నుదకమందున్న, కాళియ = కాళియమను సర్పముయొక్క, క్ష్వేళ = విషయుక్తమైన, మూర్ధస్థలీ = శిరఃప్రదేశమునందు, నృత్తమల్లీ = నృత్తశ్రేష్ఠమైన, హల్లీసకా = హల్లీసకమను తాండవము గలవాఁడా.

తా. శేషశాయియైనట్టియు వామనావతారమందుఁ గడుదూరముగ నుంచఁబడిన యంఘ్రియుగము గలయట్టియు నాశ్రిత జనపుంజ చిత్తస్థితంబులగు పాపంబులఁ బోఁగొట్టునట్టియుఁ గాళియుండను రక్కసుని శిరంబున నృత్తమొనర్చినట్టి యోశ్రీహరీ యని గ్రంథకర్త యొనర్చిన ధ్యానము.

మ. ఇది పాత్రప్రహరేశ్వరప్రభృతి బం • హిష్ఠోత్కళానీక గు,
ప్త దివిస్పృక్పటుయంత్రకొండపలి హృ • ద్బాహాసికద్రూజదీ,
ప్త్యుదారోద్యమకృష్ణరాయనృప సం • జ్ఞాస్మత్కృతాముక్తమా,
ల్యదనాశ్వాసము హృద్యపద్యము తృతీ • యంబై మహిం బొల్పుఁగాత. ౯౨.

టీక. ఇది, పాత్రప్రహరేశ్వర ప్రభృతి = పాత్ర ప్రహరేశ్వరులు మొదలైన, బంహిష్ఠ = మిక్కిలి యధికులై యుండెడి, ఉత్కళ = ఓఢ్రరాజులయొక్క, అనీక = సమూహము చేత, గుప్త = రక్షింపఁబడిన, దివిస్పృక్పటుయంత్రకొండపలిహృత్ = ఆకాశమునొరయుచుండెడు సమర్థమైన యంత్రములు గలిగియుండెడి కొండపల్లి దుర్గమును హరించుచునుండెడి, బాహా = భుజమందలి, అసి = ఖడ్గమనియెడు, కద్రూజ = సర్పముయొక్క, దీప్యత్ = ప్రకాశించుచునుండెడి, ఉదారోద్యమ = మహోద్యోగము గలిగిన, కృష్ణరాయనృపసంజ్ఞాస్మత్కృత = కృష్ణరాయలనియెడి పేరుగలిగిన నాచేతఁ జేయఁబడిన, ఆముక్తమాల్యదన్ = ఆముక్తమాల్యద యనియెడు ప్రబంధమునందు, హృద్యపద్యము = మనోహరపద్యములుగల, ఆశ్వాసము, తృతీయంబై = మూఁడవదియై, మహిన్ = భూమియందు, పొల్పుఁగాత = ఒప్పుఁగాత.

గద్య. ఇది శ్రీదక్షిణామూర్తి మంత్రోపాసనా సమాసాదితాఖండ సాహిత్య ధురీణుండును నాత్రేయ గోత్ర పవిత్రుండును వావిళ్లవంశ పయోరాశి రాకాసుధాకరుండు నగు రామస్వామి శాస్త్రిచేత ననేక పూర్వ వ్యాఖ్యానాభిప్రాయంబులఁ బర్యాలోచించి రచియింపఁబడిన రుచిసమాఖ్యానం బగు నాముక్తమాల్యదా వ్యాఖ్యానంబునందుఁ దృతీయాశ్వాసము.

శ్రీరస్తు.

# ఆముక్తమాల్యద - సవ్యాఖ్యానము.

## చతుర్థాశ్వాసము.

కం. శ్రీమందిరభుజమధ్యమ, గోమండలకర్షణ వేణు • గుంభన దృప్య,
ద్భౌమాహృతసురజనయి, శ్రీమణితాటంక వృషగి • రిస్థ ఖగాంకా. ౧.

టీక॥ శ్రీ = లక్ష్మీదేవికి, మందిర = నివాసస్థానమగు, భుజమధ్యమ = వక్షస్థలముగలవాఁడా, గోమండల = ధేనుసమూహమును, కర్షణ = ఆకర్షించుచున్న, వేణు = పిల్లఁగ్రోవియొక్క, గుంభన = పూరించుటగలవాఁడా, దృప్యద్భౌమ, దృప్యత్ = గర్వితుఁడగు, భౌమ = భూసుతుఁడగు నరకాసురునివలన, ఆహృత = అపహరింపఁబడిన, సురజనయిత్రీ = దేవతామాతయగు నదితియొక్క, మణితాటంక = రత్నమయకర్ణభూషణములుగలవాఁడా! వృషగిరిస్థ = వేంకటాచల నివాసా, ఖగాంకా = గరుడకేతనా.

తా. అని స్వామికి విశేషణములు. నరకాసురుఁ డదితికర్ణతాటంకములు దనపరాక్రమువలనఁ దెచ్చియుండినవి శ్రీకృష్ణుండు మరలఁ దీసికొనెనని శ్రీభాగవతప్రసిద్ధము.

వ. అవధరింపు మాసమయంబున. ౨.

టీక. ఇది గ్రంథకర్త స్వామికి విన్నవించెడు మాట. ఆసమయంబునన్ = విష్ణుచిత్తుఁడు పరతత్త్వనిరూపణముఁ జేసిన సమయమునందు.

మ. బలిమిం ద్రెంపఁగఁ బోలెఁ బాయవడుచుం • బర్యాయభంగంబునం,
గలనూ లెల్లను నంచు మోవఁ దెగి రా • గాఁ గొంత సేపుండి తాఁ,
జెలుచ న్గంటు ఫుటుక్కనం జనిసి పే • ర్పృథ్విం బడె న్జాలె మి,
న్నుల మ్రోసె న్సురదున్దుభు ల్గురిసెఁ బె • న్సోనై విరుల్ఫోరనన్. ౩.

టీక. బలిమిన్ = బలాత్కారముచేత, ద్రెంపఁగఁబోలెన్ = త్రెంచివేయుటచేత నన్నట్లు, పాయవడుచున్ = విచ్చిపోవుచు, పర్యాయభంగంబునన్, పర్యాయ = క్రమముగా, భంగంబునన్ = తెగుటచేత, కలనూలెల్లను = ఆసూత్రమందుఁ గలిగియున్న నూలంతయును, అంచుమోవన్ = చివరదనుకను, తెగిరాఁగాన్ = తెగివచ్చుచుండగా, కొంతసేపుండి = కొంతకాలమచ్చటనుండి, తాన్ = జాలెయనుట, జెలుచన్ = కఠినముగా, గంటు = ముడుపు, ఫుటుక్కనంజనిసి = ఫుటుక్కనుశబ్దము గలుగునట్లుగా భిన్నమై. పేర్ = త్వరితముగా, జాలె = వరహాలసంచి, పృథ్విన్ = భూమియందు, పడెన్. అంతట, మిన్నులన్ = ఆకాశమందు, సురదున్దుభుల్ = దేవతా

భేరులు, మ్రోసెన్ = ధ్వనిచేసెను, విరుల్ = పుష్పములు, పెన్సోనై = పెద్దవర్షమై బోరనన్ = బోరనిధ్వనిగ లుగునట్లు, కురిసెన్ = వర్షించెను.

తా. విష్ణుచిత్తుఁడు పరతత్త్వనిరూపణము సేయఁగా నంతకుమున్న విద్యాశుల్కముగా వ్రేలఁగట్టించియున్న వరహాల సంచికిఁ జుట్టియున్న సూత్రమందలి నూలంతయును దనకుఁ దానే తెగి యంచునకు వెడలఁగా ముడుపుపుటుక్కుమధ్వని సేయుచు సూత్రమునుండి తునిసి జాలె క్రిందఁబడెననియును, ఆపరతత్త్వ నిర్ణయమునకు దేవతలు సంతోషించి దుందుభులు మ్రోయించి పుష్పవర్షములు గురియించిరనియు భావము.

శా. ఆవేళన్పతి పారితోషికము లీ॰ నందంద పంపం భ్రమ,
త్సేవివ్రాతముచే త్వరితస్ఖలితమై॰ దీవ్యన్మణిస్వర్ణభూ,
షావాసశ్ఛట జానుదఘ్న యగుచు॰ న్సంసచ్చతుశ్శాలికా,
రైవేశ్మాంతరపద్ధతిన్నెరసె గో॰ త్రాచిత్రమాల్యం బనన్.

టీక. ఆవేళన్= ఆసమయమందు, పతి = పాండ్యరాజు, పారితోషికములు= సంతోషపు బహుమతులను, ఈన్ = ఇచ్చుటకై, అందంద = అచ్చటచ్చటనే, సంపన్ = సేవకులనుబంపఁగా, భ్రమత్ = తొట్రుపడుచున్న, సేవి = సేవకులయొక్క, వ్రాతముచేన్ = సమూహముచేతను, త్వరితస్ఖలితమై = త్వరితముగా జాఱఁబడినదై, దీవ్యన్మణిస్వర్ణభూషావాసశ్ఛట (ఇదికర్తృపదము), దీవ్యత్ = ప్రకాశించుచున్న, మణి = రత్నములుచెక్కిన, స్వర్ణభూషా = బంగారు సొమ్ములయొక్కయు, వాసః = వస్త్రములయొక్కయు, ఛట = సమూహము, సంసచ్చతుశ్శాలికా, సంసత్ = సభాసంబంధినియగు, చతుశ్శాలికా = నాలుగు శాలలుగల మండపము యొక్కయు, రైవేశ్మ=బొక్కసపుటింటియొక్కయు, అంతర= మధ్యప్రదేశమందలి, పద్ధతిన్ = మార్గమందు, జానుదఘ్నయగుచున్ = మోఁకాలిలోఁతై, గోత్రాచిత్రమాల్యంబనన్, గోత్రా = భూమియొక్క, చిత్ర = నానావర్ణములుగల, మాల్యంబనన్ = మాలికాలంకారమాయనునట్లు, నెరసెన్ = వ్యాపించెను.

తా. పాండ్యరాజాసమయమందు సంతోషించి విష్ణుచిత్తుఁడు మొదలగు వారికి బహుమతులొసంగుటకై పైపైని సేవకులను బొక్కసములకుఁ బంపఁగా వారాయుగ్రాణమునుండి రత్నములుచెక్కిన కనకభూషణములను వస్త్రము లవ్వారిగాం దెచ్చునప్పుడు త్వరపాటుచేత వారిచేతులలో నుండి జాఱిపడిన యవి రాజు మొదలగువారు గూరుచున్న సభామంటపము మొదలుకొని బొక్కసమువఱకు మార్గమధ్యమందు మోకాలియెత్తున నిండియుండెనని భావము, దీనిచే జాఱిపడిన రత్నాభరణాదులే యంతమిక్కుటముగా నుండఁగా బహుమతులిచ్చిన రత్నాదులకు లెక్క

యే లేవనుట. అలం. అతిశయోక్త్యర్థాపత్త్యత్ప్రేక్షలు.

ఆ, వె. వేదవేద్యమైన ♦ విష్ణుతత్త్వం బిట్లు, వాదు గెలిచి తెలిపి ♦ వసుమతీశు,
భక్తినోలలార్చి ♦ భగవత్ప్రపన్నుఁగాఁ, జేసిలోకహితము♦ సేయుటయును,

టీక. ఇందు విష్ణుచిత్తుఁడను కర్తృపదమధ్యాహార్యము. వేదవేద్యమైన = వేదములచేఁ దెలియఁదగిన, విష్ణుతత్త్వంబు = అయిన నారాయణ తత్త్వమును, ఇట్లు, వాదుగెలిచి = వాదమున గెలిచి, తెలిపి = బోధించి, వసుమతీశున్ = పాండ్యరాజును, భక్తిన్ = భక్తిరసమందు, ఓలలార్చి = తేలాడఁజేసి, భగవత్ప్రపన్నుఁగాన్, భగవత్ = శ్రీమన్నారాయణునియందు, ప్రపన్నుఁగాన్ = ప్రపత్తిగలవానిఁగాను, చేసి = ఒనరించి, లోకహితము, లోక = లోకములకు, హితము = ఉపకారమును, చేయుటయును = చేయఁగానే.

శా. అర్థావాగ్విబుధ మ్మహీనవచనక ♦ వ్యాహార మాహోవచ
స్స్థిష్ణ్వాః కృతతాం గతః కలి రితి ♦ శ్రీసూక్తివిద్యాధర,
మ్మిద్ధౌద్ధత్యమగా ల్లయంహి కుధియా ♦ మిత్థం వదత్కిన్నర,
మ్మర్ధీరాగ్రణి గెల్పుటుత్సవమునం ♦ దయ్యో న్నభం మ్మంతయున్. ౬.

టీక. నభమ్మంతయున్ = ఆకాశమెల్లను, అర్ధీరాగ్రణి = ధీరాగ్రేసరుఁడగు నావిష్ణుచిత్తునియొక్క, గెల్పుటుత్సవమునందున్ = విజయోత్సవమునందు, అర్థావాగ్విబుధమ్ము, అర్థా = యథార్థమనెడు, (అర్థాయన్నది సత్యార్థకమైన యవ్యయము) వాక్ = మాటలుగల, విబుధమ్ము = దేవతలుగలదియు, అహీనవచనకవ్యాహారము, అహీనా = అచ్యుతమను, వచన = పలుకులుగల, కవ్యాహారము = పితృదేవతలుగలదియు, (హవ్యకవ్యేదైవపిత్ర్యేయని యమరము) ఆహోవచస్స్థిష్ణ్యమ్ము, ఆహో = చిత్రమనెడు, వచః = పలుకులుగల, స్థిష్ణ్యమ్ము = స్థిష్ణులుగలదియు, ఆఃకృతతాంగతః కలిరితి శ్రీసూక్తివిద్యాధరమ్ము, కలిః = కలియుగము, కృతతాం = కృతయుగమాటను, గతః = పొందెను, ఆః = ఆశ్చర్యము, ఇతి = ఇట్లను, శ్రీసూక్తి = శుభవాక్యములు గల, విద్యాధరమ్ము = విద్యాధరులుగలదియు, ఇద్ధౌద్ధత్యమగాల్లయంహికుధియా మిత్థంవదత్కిన్నరమ్ము, కుధియామ్ = కుత్సితబుద్ధులు గలవాండ్రయొక్క, ఇద్ధౌద్ధత్యమ్, ఇద్ధ = వృద్ధిఁబొందియున్న, ఔద్ధత్యమ్ = ధౌర్త్యము, లయము = నాశమును, అగాద్ధి = పొందెనుగదా, ఇత్థంవదత్ = ఇట్లుచెప్పుచున్న, కిన్నరమ్ము = కిన్నరులుగలదియు, అయ్యెన్ = ఆయెను, అర్థావాగ్విబుధమ్మనునది మొదలుగా నైదు కేవలసంస్కృతములవలెఁ గనఁబడు వాక్యములనడుమ నున్న యర్థాదిపదములు వానికి వేఱువేఱఁ బరమందున్నవాగాది సంస్కృతశబ్దములతోడ నన్వయించుచుండవిబుధాదిశబ్దములు సమాసాంతగతములై తత్సమంబులగుచు నుండుటవలన నపదాన్వయ

సుప్తిఙ్‌త్వాతమునా మను సూత్రంబునకు విరుద్ధమ్ముగాకుండుటంజేసి సుసంగంబు లయ్యెను.

తా. ఆవిష్ణుచిత్తుండు వాదమున జయించినప్పుడాకాశమందుఁ జేరియున్న దేవతలు సత్యమనియును, పితృదేవత లహహా యనియును, సిద్ధులాహాయనియును, విద్యాధరులు కలియుగము కృతయుగమాయె నిది యెంత వింత యనియును, కిన్నరులు దుర్జయులబింక మడఁగెననియును, మెచ్చి సంతసిల్లి పలుకుచుండిరని భావము.

సీ. సెలవులు నాకుచు వెలియరుంగులు సూడ, కరిగి పాదూవాహు నరయువారు,
తమ మ్రోలనుండునం దలము గానక దాఁటి, పేరెలుంగున బెస్తఁ జీరువారు,
నగరు వెళ్వడువాఁకఁ దెగి పోయి మఱి నిల్చి, తోడివిద్వాంసులఁ గూడువారు,
నెదురైన తమవాని గృహకృత్య మడిగి వాఁ, డనునవి తప్పనూఁ గొనెడివారు,
వాద మేమాయె నన్న భూవరుని పక్షు, పాత మాచాసరికిఁ గల్గి ప్రతికెనెదు,
వారు నా లెం డిటు విమర్శ నాదూరమైన, వాకిట వసించు నెవ్వాఁడ న్వారు నగుచు.

టీక. ముందు వచ్చెడు పద్యములోనుండు విద్వాంసులను కర్తృపద మధ్యాహార్యము. ఇదివఱలో వాదము సేయుచున్న యితరవిద్వాంసులు— సెలవులు=ఊర్ధ్వాధరోష్ఠసంధికోణములను నాకుచున్ = విన్నఁదనమున నాకుకొనుచు, వెలియరుంగులు= నగరు వాకిట నున్న తిన్నెలను, చూడక = వీక్షింపకయే, అరిగి = ఆవలఁబోయి, పాదూవాహున్= పాదుకలు దెచ్చువానిని, అరయువారు= వెదకెడువారు, వాకిటి తిన్నెలమీదనున్న తమ పాదుకలు దెచ్చెడు సేవకులను గానక ఆవల నరిగి వెదకుచుండి రనుట. తమ మ్రోలన్ = తమయెదుటనే, ఉండు=ఉనిచియున్న, అందలమున్= ఆందోళికను, కానక = చూడక, దాఁటి = అతిక్రమించి, పేరెలుఁగునన్ = పెద్ద కంఠనాదము చేతను, బెస్తన్ = బోయిని, చీరువారు = పిలిచెడువారు, నగరు వెల్వడుదాఁకన్ = రాజగృహము విడుచువరకు, తెగిపోయి = కేడించిపోయి, మఱి = పిమ్మట, నిల్చి = నిలుచుండి, తోడివిద్వాంసులన్ = తమతోడి పండితులను, కూడువారు = కలిసికొనువారు, రాజభయముచేత నొండొరు లచ్చటఁ గలియక నగరు దాఁటి పోయి యొకరితో నొకరు గూడిరనుట, ఎదురైన = తమ కెదురుపడిన, తమ వానిన్= తమకు సంబంధించినవానిని, గృహకృత్యము= తమయింటివార్తను, అడిగి= ప్రశ్నచేసి, వాఁడు = ఆయడుగఁబడినవాఁడు, అనునవి = చెప్పెడుమాటలను, తప్పన్ = మనస్సునకుఁదగులనియట్లు, ఊఁకొనెడువారు = ఊఁకొట్టెడువారు, తమ యింటనుండి వచ్చినవాఁడు తమ కెదురుపడఁగా వానిఁ దమ యిండ్లవార్త యడిగి వాఁడు సెప్పెడు పల్కులయందు మనస్సులేక జరిగిన వాదమందే మతిఁగలిగి యూరక

యూఁకొనుచుండి రనుట. వాదమేమాయెన్ = వాదుసల్లినవిధమేమి, అన్నన్ = ఎవరేనియడుగఁగా, భూవరుని పక్షపాతము = రాజుయొక్క పక్షపాతము, ఆదాసరికిన్ = ఆవిష్ణుచిత్తున కనుటకు బదులుగాఁ దిరస్కారోక్తిగ నా దాసరివాని కని రనుట, కలిగి = ఉదయించి, బ్రతికెన్ = ఆదాసరి జీవించెను, రాజు పక్షపాతము వలన నావిష్ణుచిత్తుఁడు బ్రదికెనే కాక నిక్కమునకు మేమే జయించితిమని చెప్పి రనుట, అనెడువారును = అనిచెప్పెడువారును, ఔలెండు = ఔనుద్గమింపుఁడు, ఇటు = ఈవిధముగా, విమర్శదూరమైన = విచారణకు దూరమగు, వాకిటన్ = ద్వారమందు, ఎవ్వఁడు వసించున్ = ఎవ్వఁడునిలుచును? అన్ వారునగుచున్ = అని పలికెడువారు నవుచు, కలిసి యని ముందటిపద్యమున కన్వయము. ఇట్లు న్యాయ విమర్శలేని రాజు ద్వారమం దెవ్వఁడును నిల్వఁగూడ దని రనుట. ఇక్కడఁ బరాజితులయిన విద్వాంసుల స్వభావము వర్ణింపఁబడెఁగాన స్వభావోక్త్యలంకారము.

తే. గీ. కలిసి యొక కొంతసేపు శృంగాటకముల,
నగరుదెసఁ జూచుచున మంతనంబు లాడి,
చనిరి విద్వాంసు లిండ్లకు గజ్జనవిభుండు,
రూఢి కతలి మహాగజారూఢుఁ జేసి. ౮

టీక. విద్వాంసులు = ఆపండితులు, శృంగాటకములన్ = నలుత్రోవలు గలిసెడు చోటులయందు, కలిసి = కూడుకొని, నగరుదెసన్ = రాజగృహముతట్టు, చూచుచునే = వీక్షించుచునే, మంతనంబులాడి = రహస్యములాడి, ఇండ్లకుఁజనిరి = తమగృహములకుఁబోయిరి, అజ్జనవిభుండు = ఆపాండ్యరాజు, రూఢికిన్ = ప్రసిద్ధికొఱకు, అతనిన్ = ఆవిష్ణుచిత్తుని, మహాగజారూఢున్, మహాగజ = పెద్దయేనుఁగుమీఁద, ఆరూఢున్ = ఎక్కినవానిఁగా, చేసి = ఒనరించి, పురి నేగించి యను ముందటి పద్యముతో నన్వయము.

మ. పురి నేగించి తదీయమైననగరంబుం జేర్పు డంచు న్వడిం,
దొరలన్ రాజకుమారుల న్బనుపఁగాఁ దూర్యస్వనంబు ల్నిరం,
తరవందిస్తుతులుం జెలంగ గజఘంటావారకాంతాంఘ్రినూ,
పురములో మ్రోయఁగఁ గొల్చి వారెరుగడం బో మార్గ మధ్యంబునన్. ౯

టీక. పురిన్ = మథురాపట్టణమందు, ఏగించి = మెరవడిఁ జేయించి, ఊరేగించియనుట. తదీయమైన = ఆవిష్ణుచిత్తుసంబంధియైన, నగరంబున్ = పట్టణమగు, శ్రీవిల్లిపుత్తూరిని, చేర్పుడంచున్ = ప్రవేశపెట్టుండని, పాండ్యరాజనుట, దొరలన్ = రాజులను, రాజకుమారులన్ = రాచకొమరులను, పనుపఁగాన్ = పంపఁగా, తూ

ర్యస్స్వనంబుల్ = వాద్య ఘోషములును, నిరంతరవందిస్తుతుల్ = ఎడతెగనిబట్టి కై వారములను, చెలంగన్ = విస్తరిల్లుచుండఁగా, గజఘంటా = ఏనుఁగులకుఁ గట్టిన గంటలును, వారకాంతాంఘ్రినూపురముల్ = ఆటకత్తియలయొక్క పాదములయం దలి అందియలును, మ్రోయఁగా = ధ్వనిసేయుచుండఁగా, వారు = రాజులు, రా జకుమారులు, వందిమాగధులు, వారకాంతలు మొదలగువారు, ఇరుగడన్ = పార్శ్వ ద్వయమందు, ద్విగుసమాసము, పోన్ = పోవుచుండఁగా, మార్గమధ్యంబునన్ = నడితెరువునందు, క్రియ ముందటి పద్యమందున్నది.

ఉ. ఇంగిలికంబునం దడిపి యెత్తుకసీసపు రెంటెమో యన,
న్నింగి గరుత్పరంపరల నిగ్గున లేఁదొగ రెక్కునంత నీఁ,
చెం గలశాబ్ధిమీఁగడల జిడ్డెరిగించెడు కమ్మగాడ్పు నిం,
డెం గడుమ్రోఁత పెన్తిరువడిం గనిరాఖగరాజు మూఁపునన్. ౧౦.

టీక. నింగి = ఆకాశము, ఇంగిలిగంబునన్ = హింగుళశబ్దార్థమగు నింగిలిక ముచేతను, తడిపి = ఆర్ద్రముఁజేసి, ఎత్తు = పైకెత్తిన, కసీసపు రెంటెమో = నీలవస్త్ర మో, అనన్ = అనునట్లుగా, గరుత్పరంపరల నిగ్గునన్, గరుత్ = ముందుచెప్పఁబడు పెరియతిరువడి తెక్కలయొక్క, పరంపరల = పఙ్క్తులయొక్క, నిగ్గునన్ = కాంతి చేతను, లేఁదొగ రెక్కునంతన్ = తరుణారుణకాంతి గలుగునంతలోనే, గరుత్మంతుని తెక్క లెత్తినవిగావున వానికాంతులచే నాకాశమెఱ్ఱనయ్యెననుట, కలశాబ్ధి = పాల సముద్రముయొక్క, మీఁగడల = మీఁగడలయొక్క, జడ్డు = జిడ్డువాసనను, ఎఱిం గించెడు = తెలిపెడు, కమ్మగాడ్పు = సుగంధివాయువు, వీఁచెన్ = విసరెన్, గ రుత్మంతుఁడు గదలఁగానె యాయన తెక్కలవలనఁబుట్టినఁ వాయువు క్షీర సముద్రపు మీఁగడలవాసనను రేఁపఁగా నావాసన లావాయువుతోఁగూడ వచ్చె ననుట, మ్రోఁత = పెద్దధ్వని, కడున్ = మిక్కిలియు, నిండెన్ = సంపూర్ణ మయ్యె ను. పెన్తిరువడిన్ = పెరియతిరువడియని ద్రవిడభాషయందు శ్రీవైష్ణవసంకేతితమైన నామము గలవైనతేయుని, కనిరి = ఆరాజులు మొదలగువారు చూచిరి. ఆఖగరాజు మూఁపునన్, ఆఖగరాజు = ఆపక్షీంద్రుఁడగు గరుత్మంతునియొక్క, మూఁపునన్ = స్కంధమందు, క్రియ ముందటిపద్యమునం దున్నది.

తా. విష్ణుచిత్తునకుఁ బ్రత్యక్షమగుటకు శ్రీ క్షీరసముద్రమునుండి స్వామి వెడలఁగానే గరుత్మంతుని తెక్కల యెఱ్ఱనికాంతిచేత నాకాశ మింగిలికముతోఁ దడిపి యెత్తిన నీలిగుడ్డవలె నీలలోహితవర్ణము గలిగియుండె నంతలోనే పాలమీఁ గడ జిడ్డువాసనలతో వాయువులు విసరె నంతలోనే గరుత్మంతుని రెక్కల ధ్వని

వినంబడె నింతలో నతివేగవంతుండగు గరుత్మంతుండు గానంబడియె నంత నతని వీంపుమీంద స్వామియుం దోంచె నని భావము.

సీ. చిగురుంబొట్లపుదోయిం జెందమ్ములనం దార్క్ష్యహస్తోదరములదివ్యాంఘ్రులమర
నునుం గప్పుమేనం దోంచిన తదర్వచ్ఛాయ, లీలందాల్పు పసిండిచేల మెఱయ,
వ్రాలిన యోగివర్గమునిర్మలాంతఃక, రణములుంబోలె హారములుదనర,
సిరికి బుట్టింటినెచ్చెలులౌట మనవికై, డాసెనా మకరకుండలములమర,
శ్రితసిత మరాళవాత్యాభిహతపరాగ, వలయమండిత కల్పశాఖలో యనంగ,
శంఖచక్రాంచితోరుహస్తములుదనర, దోంచెంగమలేక్షణుండుచతుర్భుజుండు.

టీక. చిగురుంబొట్లపు = చివుళ్ళపొట్లముయొక్క, దోయిన్ = ద్వంద్వమంచు, చెందమ్ములనన్ = ఎఱ్ఱదామరపువ్వులనునట్లు, తార్క్ష్యహస్తోదరములన్, తార్క్ష్య = గరుత్మంతునియొక్క, హస్తోదరములన్ = కరతలములయందు, దివ్యాంఘ్రులు = శ్రీపాదములు, అమరన్ = పొందుపడంగా, నునుంగప్పు = నిద్దమగుసీలవర్ణముగల, మేనన్ = దివ్యమంగళవిగ్రహమందు, తోంచిన = ప్రతిఫలించిన, తదర్వ = ఆవాహనమగు గరుత్మంతునియొక్క, ఛాయలీలన్ = కాంతివలె, తాల్చు = ధరియించిన, పసిండిచేల = కనకాంబరము, మెఱయన్ = ప్రకాశించుచుండగా, వ్రాలిన = చేరినట్టి, యోగివర్గము = యోగీశ్వర సమూహము యొక్క, నిర్మలాంతఃకరణములుం బోలెన్ = నిష్కళంకములగు అంతరంగములవలెను, వ్రాలిన యను శబ్దమంత కరణశబ్దముతో నన్వయించునది, ఇదిసమస్తపదము, హారములు = ముక్తాహారములు, తనరన్ = ఒప్పుచుండంగా, సిరికిన్ = శ్రీదేవికి, పుట్టింటి = జనకగృహ సంబంధులైన, నెచ్చెలులౌటన్ = స్నేహితులౌటచేతను, మనవికిన్ = విన్నవించుటకు, డాసెనాన్ = సమీపించెనో యనునట్లు, మకరకుండలములు = మకరాకారకర్ణ భూషణములు, అమరన్, శ్రీదేవియును మకరములును సముద్రమునందే జనించుటం జేసి లక్ష్మికిం బుట్టినయింటి స్నేహములు గలవి గావున మిక్కిలి చనువు గలిగి శ్రీయఃపతి వీనుల సమీపమునకుం జేరెననుట. శ్రిత = చేయంచున్న, సిత = తెల్లనైన, మరాళ = హంసచేతను, వాత్యా = సుడిగాడ్పుచేత, అభిహత = రేంపంబడిన, పరాగ = కెందూళియొక్క, వలయ = వలయముచేతను, మండిత = అలంకరింపంబడిన, కల్పశాఖలో యనంగన్ = కల్పవృక్షపుకొమ్మలో యనునట్లు, శంఖ = పాంచజన్యముచేతను, చక్ర = సుదర్శనముచేతను, అంచిత = ఒప్పుచున్న, ఉరు = దీర్ఘములైన, హస్తములు = భుజములు, తనరన్ = ప్రకాశింపంగా, శంఖము హంసవలెను జక్రము పరాగ వలయము వలెను, భుజములు కల్పశాఖవలె నున్నవనుట. సమ

లేక్షణుండు= తమ్మికంటి, చతుర్భుజుండు = నాల్గుభుజములు గలిగినస్వామి, తోఁచెన్ = ప్రత్యక్షమయ్యెన్, ఉత్ప్రేక్షాలంకారము.

క. ఎప్పుడు హరి గని రమరులు,
ముప్పదియును మూఁడుకోట్లు • మునిఁ గనుఁగొనువా,
రప్పుడు తత్కరములతో,
విప్పిన గొడుగులును మింట • వేగమ మొగిడెన్. ౧౨.

టీక. ఎప్పుడు = ఏక్షణమందేని, మునిఁగనుఁగొనువారు = విష్ణుచిత్తుని సేవించెడివారు, ముప్పదియును మూఁడుకోట్లు = త్రయస్త్రింశత్కోటిసంఖ్యగల, అమరులు = దేవతలు, హరిన్ = స్వామిని, కనిరి = చూచిరో, అప్పుడు= ఆక్షణమందు, తత్కరములతోన్ = వారిహస్తములతోడను, విప్పిన= తెరవఁబడిన, గొడుగులును= దేవతల ఛత్రములును, మింటన్ = ఆకాశమందు, వేగమ = శీఘ్రమే, మొగిడెన్= ముకుళితమయ్యెను.

తా. ముందే స్వర్గమందలి ముప్పది మూఁడుకోట్లు దేవతలు విష్ణుచిత్తునిఁ జూడవచ్చియుండిరి గావున వారలు స్వామి వేంచేసినంతనె యదివఱలోఁ దెఱవఁబడియున్న గొడుగులు ముడిచి హస్తములు మొగిడ్చి నమస్కరించి రనితా. అలం. సహోక్తి.

తే, గీ. సామరదిదృక్షుఖస్థరక్షఃపిశాచ, పుంజమహిభుక్పతత్రప్రభంజనములు,
సోఁకవెఱఁబాఱెఁగళ్యానశూర్పవాత, ఘట్టనలఁబాఱుపెనుపొల్లుకట్టువోలె.

టీక. సామర = దేవతలతోఁగూడిన, దిదృక్షు = చూడనిచ్ఛించిన, ఖస్థ = ఆకాశమందు నిలిచియున్న, రక్షఃపిశాచపుంజము = రక్కసులయొక్కయు పిసాసులయొక్కయు సమూహము, రక్షఃపిశాచాదులు దేవయోనులగుటంజేసి స్వర్గమందుండురనుట. అహిభుక్పతత్ర ప్రభంజనములు, అహిభుక్= సర్పభక్షకుఁడగు గరుత్మంతునియొక్క, పతత్ర= తెక్కలవలని, ప్రభంజనములు= పెనుగాడ్పులు, సోఁకన్= స్పృశింపగానే, వెఱన్ = వెఱపుచేతను, కళ్యానన్ = కళ్ళమునందు, శూర్పవాత= చేటల గాడ్పులయొక్క, ఘట్టనలన్ = ఒరిపిళ్ళచేతను, పాఱు= ఎగసిపోవుచున్నట్టి, పెను = పెద్దదియగు, పొల్లుకట్టువోలెన్ = తఱకలవలె, పాఱెన్ = పరుగెత్తెను, ప్రథమపాదమం దున్న సామరపదముయొక్క ప్రథమవర్ణమును రక్షశ్శబ్దము యొక్క యంతిమవర్ణముతోడ సంబంధపడునట్లు హల్ప్రధానముగ నుభయపక్షములలో నిదిగా సాంబాదిశబ్దములవలె విశ్రమమునకుఁ జెప్పినాఁడు. సమ్మదదిదృక్షు అను పాఠమున సంతోషమునఁ జూడఁగోరెడు అనియర్థము. కళ్యానననుచోట వికృతి

క్వచిచ్ఛలోపో మోదీర్ఘశ్చాత ఆదిమస్యభసే" త్తను సూత్రానుసరణముగా, కం. మానుగ ధృతరాష్ట్రుఁడు ప్రా। ణానఁగలుగంగ ననియెడు భారతప్రయోగమువలె సంగతమైనది. అంతరిక్షమం దంతకు మున్ను దేవతలతోఁడఁ జేరి యున్న రక్షఃపిశాచసంఘము తనజాతికి విరోధియగుస్వామికి వాహనమైన గరుత్మంతుని రెక్కలగాడ్పు తమపై వీవఁగానే భయపడి పరుగెత్తెను. దేవతలు మాత్రము నిలచి యుండిరి యెట్లంటేని కళ్ళమందు ధాన్యముమీఁదఁ జేటలచేత విసరఁగానే గట్టినిల్చి పొట్టుచెదరి పోయినట్లని భావము.

క. నీరంధ్రకుసుమధారా, సారచరచ్చంచరీక ♦ సంకులకలఝుం,
కారానుకారిసంస్తవ, కారిమునిస్తోమసామ ♦ గానం బెసఁగెన్. ౧౪.

టీ. నీరంధ్ర = దట్టమైన, కుసుమాధారా = పుష్పధారలయొక్క, ఆసార = వర్షమందు, చరత్ = సంచరించుచున్న, చంచరీక= తుమ్మెదలయొక్క, (ఇందిందర శ్చంచరీకయని యమరము,) సంకుల = అధికమైన, కల= అవ్యక్తమధురములగు, ఝుంకార= ఝుంకృతులను, అనుకారి= అనుకరించుచున్న, సంస్తవ= స్తోత్రములను, కారి= చేయుచున్న, ముని= నారదాదిమునులయొక్క, స్తోమ= సమూహముయొక్క, సామగానంబు = సామవేదముపాట, ఎసఁగెన్ = విస్తరిల్లెను, స్వామితోఁగూడ నారదాది మునీంద్రులు సామగానము సేయుచుండఁగా నది పుష్పవర్షముబడి తిరిగెడు తేఁటుల మ్రోఁతవలె మధురమై వీతెంచె ననిభావము.

తే.గీ. అట్లుప్రత్యక్షమైనప ♦ ద్మాక్షునంత,
రిక్షమునఁగాంచి మునిప్రమో ♦ దాశ్రుజలము,
నిగుడఁ బులకించి కరటిఘం ♦ టికలతాళ,
ములుగనిట్లని యమ్మహా ♦ త్మునినుతించె. ౧౫.

టీక. అట్లు = పూర్వోక్తరీతిగా, ప్రత్యక్షమైన = సాక్షాత్కరించినట్టి, పద్మాక్షున్ = తామరలవంటి నేత్రములుగలస్వామిని, లేక, లక్ష్మీదేవియే నేత్రములయందుఁగలస్వామిని, అంతరిక్షమునన్ = ఆకాశమందు, కాంచి = చూచి, ముని = విష్ణుచిత్తుఁడు, ప్రమోదాశ్రుజలము = ఆనందబాష్పములు, నిగుడన్ = వెలికుబుకఁగా, పులకించి = గగుర్పాటుగలిగి, కరటిఘంటికల, కరటి = తానెక్కియున్న యేనుఁగుయొక్క, ఘంటికల = ఇరుప్రక్కలనున్న గంటలే, తాళములుగన్ = వాయించెడు తాళములుగాఁగా, అమ్మహాత్మునిన్ = ఆపరమాత్ముఁడగుస్వామిని, ఇట్లని=వక్ష్యమాణక్రమముగా, నుతించెన్ = కొనియాడెను.

కవిరాజవిరాజితము.

జయ జయ దానవదారణకారణ ♦ శార్ఙ్గరథాంగగదాసిధరా,
జయ జయ చంద్రదినేంద్రశతాయుత ♦ సాంద్రశరీరమహః ప్రసరా,
జయ జయ తామరసోదరసోదర ♦ చారుపదోజ్ఝితగాఙ్గఝరా,
జయ జయ కేశవ కేశినిషూదన ♦ శౌరిశరజ్జలజాక్షహరీ. ౧౬

టీక. దానవ = రాక్షసులయొక్క, దారణ = ఛేదనమునకు, కారణ = హేతువులగు, శార్ఙ్గ = ధనువును, రథాంగ = చక్రమును, గదా = గదను, అసి = నందకమనుఖడ్గమును, ధరా = ధరించినస్వామీ! జయజయ = సర్వోత్కృష్టుఁడవుగాఁ బ్రవర్తిల్లుము. దరాఅనుపాఠమందు శంఖమును గలవాఁడా యనియర్థము. దానవదారణకారణ యని ప్రత్యేక విశేషణముగాను జెప్పవచ్చును, జయజయ యనినాల్గుపాదముల యందునువచ్చును. చంద్ర = చంద్రులయొక్కయు, దినేంద్ర = సూర్యులయొక్కయు, శతాయుత = అయుతశతసంఖ్యలయొక్కవలెనే, సాంద్ర = దట్టమైన, శరీర = దివ్యమంగళమువొక్క, మహః = కాంతులయొక్క, ప్రసరా = వ్యాపించుటగలవాఁడా. తామరస = తామరపువ్వులయొక్క, ఉదర = అంతర్భాగమునకు, సోదర = తోఁబుట్టువును, చారు = సుందరమునగు, పద = పాదముచేత, ఉజ్ఝిత = విడువఁబడిన, గాంగ = గంగానదీసంబంధియగు, ఝరా = ప్రవాహముగలవాఁడా, కేశినిషూదన = కేశియనురక్కసుని సంహరించినవాఁడా, శరజ్జలజాక్ష, శరత్ = శరత్కాలమందలి, జలజ = కమలములవంటి, అక్ష = కన్నులుగలవాఁడా. కేశవ = బ్రహ్మరుద్రుల కుత్పత్తిస్థానమైనస్వామీ. (క ఇతి బ్రహ్మణో నామ ఈశోఽహం సర్వదేహినామ్ । ఆవాం తవాఙ్గే సంభూతౌ తస్మాత్కేశవనామవాన్, అని ప్రమాణము.) శౌరి = హరీ, అని మంగళాశాసనముచేసెను. భగవంతునకు జీవకోటి యాశీర్వాదము చేయవచ్చునాయనినఁ బూర్వముట్టి యాచారము కలదు. (పూర్వాం దిశం వజ్రధరః దక్షిణాం పాతు తే యమః । వరుణః పశ్చిమాం మాశాం కుబేరస్తూత్తరాం దిశ మని సీతమ్మవారు శ్రీరాములవారికి మంగళాశాసనము చేసియున్నారు.)

దశావతార పద్యములు.

మ. దివిజద్వేషి నుదారవారిచరమూ ♦ ర్తిం ద్రుంచి చాతుర్యమొ,
ప్పవడిం జౌకపుఁదెల్ల కౌచుగమిదం ♦ భం బొందమ్మైఁదాల్చి వే,
దవిశుద్ధాక్షరపఙ్క్తిఁ గ్రమ్మఱఁగ వే ♦ ధం జేర్చెదో నాఁగఁద,
చ్ఛ్వనం బద్ధిసితాంబుబిందు లక్ష్మం ♦ బ్రోద్యద్రుచిం దాఁటు వే. ౧౭

టీక. దివిజద్వేషిన్ = వేదచోరకుఁడగు హయగ్రీవాసురుని, ఉదార = కొలఁదిదెలియరాని, వారిచర = మీనముయొక్క, మూర్తిన్ = శరీరముచేతను, త్రుంచి = ఖండించి, చాతుర్యము = విన్నాణము, ఒప్పన్ = తనర్చునట్లు, నడిన్ = వేగముచేత, చొకపు = చదరమగు, తెల్లకాచు = ధవళకాంతిగల పై పొట్టుయొక్క, గమి = సమూహమనెడు, దంభంబు = వ్యాజము, ఒందన్ = పొందునట్లు, మైన్ = శరీరమందు, తాల్చి = ధరించి, వేదవిశుద్ధాక్షరపఙ్క్తిన్, వేద = వేదములయొక్క, విశుద్ధ = శుభ్రములగు, అక్షర = అక్షరములయొక్క, పఙ్క్తిన్ = శ్రేణిని, క్రమ్మఱఁగన్ = మరల, వేధన్ = బ్రహ్మదేవుని, చేర్చెదొ నాఁగన్ = చేర్తువో యనునట్లు, తత్పవనంబు = ఆ బ్రహ్మలోకము, అబ్ధి = సముద్రముయొక్క, సిత = తెల్లనైన, అంబు = ఉదకముల యొక్క, బిందులు = బిందువులు, అలమన్ = వ్యాపింపఁగా, ప్రోద్యద్రుచిన్, ప్రోద్యత్ = వృద్ధిఁబొందుచున్న, రుచిన్ = కాంతిచేతను, దాఁటవే = అతిక్రమింపవా. "ఉదారో దక్షిణే ఖ్యాతే దానశౌణ్డే మహత్యపి" యనిరత్నమాల. "స్త్రియాం మూర్తి స్తను స్తనూః" అనియును, "కపటోఽస్త్రీ వ్యాజదమ్భోపధయ శ్ఛద్మకైతవే" యనియు నమరము. నీవు మత్స్యరూపమును ధరించి వేదచోరకుఁడగు రక్కసుని వధించి వాఁడపహరించిన వేదములు నేర్పుతో నప్పుడే బ్రహ్మకిచ్చుటకై పోయెదవో యనునట్లు నీవు సంచరింపుచుండుట వలన సముద్రోదకములు సత్యలోక మాక్రమింపుచుండఁగా నీవాలోకమును దాటితివనియు నప్పుడు నీమీన శరీరమందలి తెల్లని పొలుసు పరిశుద్ధములగు వేదాక్షరములో యన్నట్లుండె ననియు భావము. కైతవాపహ్నుత్యనుప్రాణితమైన యుత్ప్రేక్షాలంకారము.

చ. ఎలమి యుగాంతవారి కెదు ♦ రెక్కుతఱిన్ వడిఁ దాలుగహ్వరం
బులఁ జనునీటివెల్లిబడిఁ ♦ బోవు సపక్షనగోరువార్చరం
బులు దనుఁ దాఁక దద్గతత ♦ మ్రోయు సజాండమ దైత్యు వేదప
ఙ్క్తులుగొని కూల్చినట్టిజయ ♦ ముందుఁ జేసితి కా మురాంతకా. ౧౮.

టీక. ఎలమిన్ = సంతోషముచేతను, యుగాంతవారికిన్ = ప్రళయోదకమునకు, ఎదురెక్కుతఱిన్ = ఎదురుగాఁబోవు సమయమందు, వడిన్ = వేగముచేతను, తాలుగహ్వరంబులన్ = దవుడలనెడు గహ్వరంబులన్ = గుహలయందు, చను = పోవునట్టి, నీటివెల్లిబడిన్ = జలప్రవాహమువెంట, పోవు = పోనెంచు, సపక్షనగ = ఱెక్కలతోఁ గూడియున్న మైనాకాదిపర్వతములును, ఉరు = గొప్పలగు, వార్చరంబులు = తిమితిమింగిలాదులు మొదలగు జలచరములును, తనున్ = బ్రహ్మాండమునునటు, తాఁకన్ = తగులఁగా, తద్గతతన్ = ఆదవుడలను పొందియుండుటచేతను, మ్రోయు = ధ్వనిఁజేయుచున్న, అజాండము = బ్రహ్మాండమే, దైత్యున్ = సోమకాసురుని, వేదపఙ్క్తులుగొని = వేద

సమూహములను దీసికొని, కూల్చినట్టి = సంహరించినట్టి, జయదుందుభిక్ = జయభేరినిగా, చేసితికా, మురాంతకా = మురాసురహరాయని సంభోధనము. ఇచ్చట నబాండమయని ప్రథమావిభక్తి, "ఇతరత్రచద్వితీయా తస్యాః ప్రథమాచజడపదానాంస్యాత్" అనుసూత్రమనుసరించి యప్రాణి వాచకమగు జయందుంధుభియందలి ద్వితీయకుఁ దుల్యమైనది. మఱియు, "కర్మాదేః కర్తృత్వమిత్యాది సూత్రపద్ధతివలన జయదుందుభియందుఁ గూల్చినట్టియనుపద మన్వయించుట సరిగా నున్నది.

మీనముతన నైజగుణముచేత నీటి కెదురెక్కుట ప్రసిద్ధము గావున నీమత్స్యము ప్రళయోదక ప్రవాహమున కెదురెక్కుచుండఁగా నావేగమునకు నిలువలేక యానీటి వెంబడిమైనాకాది పర్వతంబులును దిమిప్రముఖంబులగు మహాజలచరంబులు నవశంబులై పోరలి యామీనముయొక్క దవుడలలోఁబడినవనియును జలప్రళయమందు బ్రహ్మాండము సెడకుండ నామత్స్యమూర్తి తనదవుడల నునిచికొనియున్నాఁడనియును నామైనాకాదు లావేగముచేత నాబ్రహ్మాండము దగులఁగా నది ధ్వనిఁజేసెఁగావున నాబ్రహ్మాండమే స్వామి వేదములు దీసికొని రక్కసుని ద్రొక్కలించిన దానికి జయభేరివలె నుండెనని భావము. అనుభయ తాద్రూప్యరూప కాలంకారము.

చ. మితి గడవం దిమింగిలత ♦ మెయ్మొయి వెంచిననీచువాతఁగు
త్సితపలలాశిమైన ♦ చిఱుఁ జేఁపది ద్రెళ్ళుట నీవుమ్రింగుటే,
శ్రుతులగు నూరుపుల్ మగుడఁ ♦ జొచ్చుతఱి న్భవదేధనైధనై,
ధితజవశక్తి నీడ్చుకొని ♦ తెచ్చుటకాక తదల్పతాల్పతక్. ౧౯.

టీక. మితి = పరిమాణము, కడవక్ = అతిక్రమించునట్లు, తిమింగిలతక్ = మహామీనత్వముచేతను, మెయ్మొయి వెంచిన = మిక్కిలిశరీరము పెంచినట్టి, నీచు = నీసంబంధియైన, వాతక్ = వక్త్రమునందు, కుత్సితపలలాశియైన = కుత్సితరాక్షసుఁడనియును, మీనములు మాంసను భక్షించుట ప్రసిద్ధముగావున నట్టిపలలాశియగు, చిఱుజేప = చిన్నచేప, అది = మత్స్యతారోపముచేత నమహద్వాచకము, రాక్షసుఁడనుట, ద్రెళ్ళుట = పడుట, నీవుమ్రింగుటే = నీవుకబళించుటయే యని ప్రశ్నార్థకము. శ్రుతులగు = వేదమయములగు, ఊరుపుల్ = ఉచ్ఛ్వాసవాయువులు, మగుడక్ = మరల, చొచ్చుతఱిక్ = వక్త్రమునందుఁ బ్రవేశించునప్పుడు, తదల్పతాల్పతక్, తత్ = ఆపలలాశియొక్క, అల్పతాల్పతక్ = అత్యంతాల్పమాటచేతను, భవత్ = నీయొక్క, ఏధనైధన = అతిసమృద్ధిచేతను, ఏధిత = వృద్ధించేయఁబడిన, జవ = వేగముయొక్క, శక్తిక్ = సామర్థ్యముచేతను, ఈడ్చికొని = ఆకర్షించుకొని, తెచ్చుటకాక = తీసికొనివచ్చుటయేకాక, మ్రింగుట కాదనుట. తిమింగిలత మెయ్మొయియను చోటనీకారణ

మాలోకించుటకు విరాటపర్వమున మ. "మగఁడుం గీచకుఁ బట్టువాఁడును ఖలో◆న్మాదంబునన్బాహుగ, ర్వగరిష్ఠుండగు నాహిడింబరిపుఁడీ◆వక్రోధుఁడైనట్టిచో, ట్టుగఁ ద్రోపాడఁగ నిద్దఱున్భుజబలా◆టోపంబుమై నాంగొరు, స్నగులం జ్వాలక కొంత సేపువడి మె◆య్యెమ్మెఁ బోరి రుద్రాకృతిన్". అన్నపద్యంబునం జతుర్థపాదంబునను, నిర్వచనోత్తరరామాయణమందు ఉ. "ఆటున మూర్ఛవో◆యిన రుద్ర◆హస్తుఁ గనుంగొని యింకఁ జాఁకిన, స్గిటుడఁగించు నజాసురుఁడు◆గేవలుఁడే యని భీతచిత్తులై, మేటి మగల్బలంగ జెడలి◆మెయ్యెమ్మియి మార్గ్గాన లేక పాటీన, నాటుక కొండవోలె దశ◆కంఠుఁ డెదిర్చె మహీమహేంద్రునిన్." అనినపద్యంబునఁ దృతీయపాదంబునను, దిక్కన సోమయాజిప్రయోగంబు కలిమిఁ జేసి యిందుం బ్రయోగింపంబడియె.

ఇంతంత యని చెప్పఁ గూడనియత్యున్నతశరీరముతో మత్స్యమూర్తిని విహరించుచుండఁగా నాయనయుచ్ఛ్వాసవాయువులు మగిడి ముఖమందుఁ బ్రవేశించున ప్పుడావాయువులవెంబడి నీమహామీనము ముందఱ నత్యల్పతముండనఁగా నున్నయా రక్కసుఁడు దనకుఁ దానే త్రెళ్లెను గాక యామత్స్యమదియొకయత్నముగా వాని మ్రింగ లేదనియును మహామత్స్యములును బర్వతాదులును బ్రవేశించెడు నావక్త్రమం దీకుత్సితఫలలభ్యతక మగు రాక్షసుఁ డనుచిన్నచేఁప పడిపోవుటచిత్రము గాదనియును తాత్పర్యము. హేత్వపహ్నుత్యలంకారము.

మ. జలపూరప్లవమానమృణ్మయమహీ◆సంరక్షకై గారయీ
బలె ముక్తామణిశుక్తిశంఖనికురుం◆బం బెల్లఁజూర్ణం బుగా
బలభిద్వజ్రసదృఙ్నిజోపరిపరి◆భ్రామ్యన్మహామందరా
చలసంఘృష్టిఘరట్టమైనకమఠ◆స్వామి న్నినుంగొల్చెదన్. ౨౦

టీక. జలపూర=నీటికుప్పయందు, ప్లవమాన=నానుచున్న, మృణ్మయ=మృత్తికావికారమగు, మహీ=భూమియొక్క, సంరక్షకై = రక్షణముకొరకు, గారయీబలెన్= గచ్చుసేయుటకొఱకువలె, ముక్తామణి= ముత్యములయొక్కయు, శుక్తి=గుల్లలయొక్కయు, శంఖ = సంకులయొక్కయు, నికురుంబంబెల్లన్ = సమూహమంతయును, చూర్ణంబుగాన్ = సున్నమగునట్లు, బలభిద్వజ్ర = దేవేంద్రునియొక్క, వజ్రాయుధముతోడ, సదృక్= సమానమైన, నిజోపరి= స్వకీయమైనపైభాగమందు, పరిభ్రామ్యత్ = తిరుగుచున్న, మహత్ = గొప్పదియైన, మందరాచల = మంద్వరపర్వతముతోడ, సంఘృష్టి = ఒరసికొనుటకు, ఘరట్టమైన= ఱాగుతిరుగలియయిన, కమఠస్వామిన్ = కూర్మరాజైన, నినున్ = నిన్ను, కొల్చెదన్ = సేవించెదను.

సముద్రమథనకాలమందు మందరాచలముక్రిందఁ గమఠమూర్తియొక్క కర్పరమొరసికొనుచుండఁగా సముద్రమందలి ముత్యములు ముత్తెపుఁజిప్పలు శంఖములెల్ల

నా పర్వతకర్పరముల సంఘమునఁ బడి నలిగి చూర్ణ మగుచుండె గావున సముద్రోదకములయందు వృద్ధి కారణ మగుభూమి నాని కరఁగు నని నని దానిఁ గట్టి పఱచుట కై గారకారకు స్వామి సున్నము నూరుచున్నాఁడో యన్నట్లుండెను నని భావము. ఫలోత్ప్రేక్ష. సంఘృష్టి ఘరట్టమనుచో రూపకము.

చ. ఒకమఱి బుడ్డగింప నిల • యోదకము ల్పయి కుప్పి చిప్ప వ్ర
చ్చుకొని మహాభ్రవీథిఁ జన • సూకరత న్మెయి పెంచి పెండి క్రిం
దికిఁ గయివ్రాలు తత్సలిల • నిర్మలధార నతఃపరస్ఫుర
త్ప్రకృతికినీ యజాండమును • బంగరు ముంగరఁగా నొనర్పవే. ౨౧

టీక. ఒకమఱి = ఒకమారు, బుడ్డగింపన్ = పూత్కారము సేయఁగా, ఇది వరాహచేష్ట, ఇలయోదకములు = ప్రళయజలములు, పయి కుప్పి = పైకెనుదికి, చిప్ప = బ్రహ్మాండకర్పరమును, వ్రచ్చుకొని = భేదించుకొని, మహాభ్రవీథిన్ = మహాకాశముయొక్క వీథియందు, చనన్ = పోవునట్లుగా, సూకరతన్ = వరాహత్వముచేత, మెయి పెంచి = శరీరమును బెంచి, పెండి = మరల, క్రిందికిన్ = అధోభాగమునకు, కయివ్రాలు = దిగజాఱుచున్న. తత్సలిలనిర్మలధారన్, తత్ = మున్ను చెప్పఁబడిన, సలిల = ఉదకము యొక్క, నిర్మల = తేటయయిన, ధారన్ = ధారచేతను, అతఃపర = బ్రహ్మాండమునకుఁ బరమైనట్టియు, స్ఫురత్ = ప్రకాశించుచున్న, ప్రకృతికిన్ = మాయయనెడు స్త్రీకి, ఈయజాండమును = ఈ బ్రహ్మాండమును, బంగరుముంగరగాన్ = సువర్ణమయ నాసాభూషణముగాఁగ, ఒనర్పవే = చేయవా,

వరాహావతారమందు నొక్కసారి ప్రళయసముద్రమందలియుదకములలో నాదివరాహము మూతి నుంచి బుడ్డగింపఁగానే యాయుదకములు బ్రహ్మాండకర్పరము దాఁటియావలఁ బైకి పోయి మగిడి వచ్చుచుండఁగా నాయుదకధార యాకర్పరమునకుఁ బైగా నున్న ప్రకృతి యనెడు స్త్రీయొక్క ముక్కుకొన నున్న సన్న కాడవలె నుండెననియును, బ్రహ్మాండ మాకాఁడకు నదికి యున్న బంగారుముంగరవలె నుండెననియు నట్లొక్కసారి బుడ్డగించినమాత్రనే సముద్రోదకములు బ్రహ్మాండమును దాఁటఁజేయునంత బలము గలిగినవరాహరూపమును స్వామి ధరించె ననియును భావము, రూపకము.

మ. అసురేంద్రాశయకుండికాచ్ఛరుధిక • వ్యాప్తస్వకచ్ఛాయఁ గాం
చి సముద్యత్ప్రతిసింహమత్సరమిళ • చ్చేష్ట స్ఫుటద్భావదీ
ఘనసటా ఘూటముఁ బెల్లగించుగతి నాం • త్రశ్రేణిఁ గిన్కం బెరం
జు సితక్రూర భవన్నఖావళులు ప్రోఁ • చు న్నరత్యపంచాననా. ౨౨

టీక. మర్త్యపంచాననా = ఓనరసింహా అనిసంబుద్ధి; అసురేంద్ర=రాక్షసేశ్వరుఁడగు హిరణ్యకశిపునియొక్క, ఆశయ=హృదయమనెడు, కుండికా = గుండమునందలి, అచ్ఛ=తేటయయిన, రుధిర=నెత్తుటియందు, వ్యాప్త=వ్యాపించిన, స్వక=స్వీయమైన, ఛాయన్=నీడను; కాంచి=చూచి, సముద్యత=విజృంభించుచున్న, ప్రతిసింహ=అన్యసింహమనెడి, మత్సర=ఈసుతోడను, మిళత్=కూడుకొన్న, చేష్టన్= చిట్టకముచేతను; తత్=ఆప్రతిసింహమునియొక్క, ఉద్దామ=గొప్పలగునట్టియు, దీర్ఘ=నిడుదలగు, సటా=జూలువెండ్రుకల యొక్క, ఝాటమున్=సమూహమును; ఖిల్లగించుగతిన్=పెకలించినట్లుగా; అంత్రశ్రేణికన్=ప్రేఁగులయొక్కపంక్తిని; కిన్నన్=కోపముచేతను, పెరుజు=తెముల్చుచున్నట్టి, సిత=తెల్లనైన, క్షుర=తీక్ష్ణములైన, భవన్నఖావళులు = నీగోళ్లయొక్కపంక్తులు; ప్రోచున్=మమ్మురక్షించును.

స్వామి నృసింహావతారమెత్తినప్పుడు హిరణ్యకశిపునిహృదయముఁ జీల్చి యారక్తమందు నీడఁ జూచి ప్రతిబింబించిన తనరూపును మఱియొకసింహముగా భావించి మత్సరించి యాకోపముచేతను దత్సింహముయొక్క సటలు పెల్లగించెనో యన్నట్లు హిరణ్యకశిపునిప్రేఁగులు పైటికి లాగెననియు నట్లు లాగినతెల్లనితీక్ష్ణములగు గోళ్లు తమ్ము రక్షించు నని మంగళాశీర్వచనము చేసికొనెననియుభావము, భ్రాంతిమదనుప్రాణితోత్ప్రేక్షాలంకారము.

మ. మునుముం దెల్పును బూటఁబూటమటి కెంపున్ వెండియుం బూటఁ గం
దనగాయం గలనల్పుఁ దోఁప నఖకోణశ్రేణిచే విక్రమం
బున వాఁ డుగ్రతఁ గొన్నయట్టివిలసన్మూర్తిత్రయీతేజముం
గొనులీల న్విలసింపవే యసురవక్షోభిత్తి మిథ్యాహరీ. ౨౩.

టీక॥ మిథ్యాహరీ=మాయాసింహరూపధారివగు నృసింహస్వామీయని సంబుద్ధి; మునుమున్ = మొదలను; తెల్పున్=ధావళ్యమును; పూటఁబూటన్ = ఉచ్చిపోఁగాన్; మటి=పిమ్మట; కెంపున్=ఎఱుపును; వెండియు బూటఁగన్=ఇంకనుం ... పోఁగా, కందనగాయన్ = గుండెకాయయందును; కల=కలిగినట్టి, నల్పున్=నీలవర్ణమును, తోఁపన్=కనుపడఁగా, విక్రమంబునన్=పరాక్రమముచేతను, వాఁడు=ఆహిరణ్యకశిపుఁడు, ఉగ్రతన్ = బెట్టిదముచేతను, కొన్నయట్టి=గ్రహించిన, విలసన్మూర్తిత్రయీతేజమున్, విలసత్=విప్పుచున్న; మూర్తిత్రయీ = పంచానన చతురానన జనార్దనులనియెడు ముగ్గురు మూర్తులయొక్క, తేజమున్=తేజస్సును, కొనులీలన్=మరలఁగ్రహించునట్లు, నఖకోణశ్రేణిచేన్, నఖ=గోళ్లయొక్క, కోణ=కొనలయొక్క, శ్రే

ణిచేన్=పక్షిచేతను, అసుర=రాక్షసునియొక్క, వక్షోభిత్తిన్=గోడవంటి వక్షస్థలమును, విదళింపవే=చీల్పవా?

హిరణ్యకశిపుని వక్షఃస్థలము భేదించినప్పుడు మొదటిభాగము తెగఁగానె తెల్లగా నుండె ననియును మఱికొంత తెగఁగానె యామాంస మెఱ్ఱగా నుండెననియు కడకుఁ దెగఁగా గుండెకాయం దవిలి నల్లగా నుండెననియును ఆమూఁడుకాంతులు దోఁచుట దొల్లిట వాఁడు విక్రమించి శివుని తెల్లనితేజస్సును బ్రహ్మదేవుని యెఱ్ఱని తేజస్సును విష్ణుదేవునినల్లనితేజస్సును గ్రహించెను గావున నవి వానిశరీరములో నుండఁగా స్వామివారు వాని మరల బైటికిఁ దీయుచు న్నట్లుండె ననిభావము. స్వభావోక్త్యనుప్రాణితోత్ప్రేక్షాలంకారము.

మ. బలిదైతేయ భయాంధకారభరితబ్రహ్మాండగేహంబులో
పలఁ బై మండెడుతత్ప్రతాపమయదీపజ్వాల డిందన్ గడుం
దలమై మింటికి గ్రక్కున న్నెగయునుద్యత్తన్మహాచ్ఛాయ నాఁ
గలనీలాంగము శింశుమార మొరయంగాఁ బెంపవే వామనా. ౨౪

టీక. బలి=బలిచక్రవర్తి యనెడు, దైతేయ=రాక్షసునివలని, భయ=భయమనియెడు, అంధకార=కటికిచీకటిచేత, భరిత=నింపఁబడిన, బ్రహ్మాండ=బ్రహ్మాండమనెడు, గేహంబులోపలన్=ఇంటిలోపలను, పైన్=ఉపరిభాగమందు, మండెడు=ప్రజ్వరిల్లెడు, తత్ప్రతాపమయ=ఆబలిచక్రవర్తియొక్క పరాక్రమరూపమైన, దీపజ్వాల=దివ్వెవెలుంగు, డిందన్=మఱుఁగుపడునట్లుగా, దలమై=దట్టమై, మింటికిన్=ఆకాశమునకు, గ్రక్కునన్=వేగముగా, నెగయు=ఉద్గమించుచున్న, ఇది నకారాది పదము, ఉద్యత్=ప్రకాశించుచున్న, తత్=ఆదీపప్రభానివారణానంతరమయిన, మహచ్ఛాయనాన్=పెద్దనీడయోయనఁగా, కల=ఉన్నట్టి, నీలాంగము=నల్లనిశరీరమును, శింశుమారము=శింశుమారచక్రము, ఒరయంగాన్=అంటునట్లు, పెంపవే=పెనుపవా? వామనా=వామనస్వామీయని మొదటికన్వయము.

బలిచక్రవర్తివలని భయమనెడు చీకటి బ్రహ్మాండమనునింటిలో వ్యాపించియుండె ననియును వానిమీఁద ననఁగా మూఁడులోకము లతిక్రమించి యతని ప్రతాపమనియెడుదీపము వెల్గుచుండె ననియును దద్దీపజ్వాల యడంగున ట్లంతకంటెఁ బైఁగా శింశుమారచక్ర మంటువఱకు స్వామివారు నల్లనిశరీరముఁ బెంపఁగా నదిదీపమునకద్ద మగుఛాయవలె నుండె ననిభావము. రూపకానుప్రాణితోత్ప్రేక్షాలంకారము.

టీక. రఘుకులస్వామీ = రఘువంశనాయకా, రమావల్లభా = శ్రీసీతానాథా; పవిధారాపతనంబున్, పవి = వజ్రాయుధముయొక్క, ధారా = అంచుయొక్క, పతనంబున్ = ప్రహారమును, కైకొనని = సఱకుసేయని, అపౌలస్త్య = ఆపులస్త్య వంశజుఁడైన రావణాసురునియొక్క, మై = శరీరముయొక్క, సప్తధాతువులన్ = త్వగసృగస్థిస్నాయు శుక్లవసామజ్జలనియెడు నేడు ధాతువులను, తూఱన్ = ప్రవేశించుటకై, పరిశ్రమంబునకున్ = అలవాటునకు, ఉద్యోగించెనాన్ = ఆరంభించెనో యనునట్లు, సప్త = ఏడైన, సాల = కిష్కింధాప్రాంతవృక్షములయొక్క, విభేదంబు = వ్రచ్చుటను, ఒనరించి = చేసి, నిల్వక = విరమింపక, వెసన్ = వేగముచేతను, చన్నట్టి = పోయినట్టి, యుష్మన్మరుజ్జవనాస్త్రంబు, యుష్మత్ = నీయొక్క, మరుత్ = వాయువువలె, జవన = వేగముగలిగిన, అస్త్రంబు = బాణము, (వాయవ్యాస్త్రమని యేనియుం జెప్పవచ్చును.) సిరుల్ = శ్రీలను, ఒసఁగున్ = ఇచ్చుఁగాఁత.

దేవేంద్రుని వజ్రాయుధముచేతఁ బ్రహరింపఁబడియును లక్ష్యముసేయని రావణాసురుని కఠినమైన శరీరమందలి సప్తధాతువులను భేదించుటకై మున్నే యాలవడు కొనుటకువలె సప్తసంఖ్యగలసాలములమీఁద సుగ్రీవునినమ్మకముకొఱకు శ్రీరామస్వామివారు బాణమును బ్రయోగింపఁగా నది ఆసాలములుదూఱి యావలఁబోయెననియునట్టి బాణము మాకు సిరులొసంగుతమనియును భావము.

సీ॥ స్యందనస్థితబిడౌ ♦ జఃక్షత్తృన, జాడ్యకృ జ్ఝంఝా మరుద్గరు♦జ్ఝాత్కృతములు
క్రవ్యాశిరాడ్గాత్ర♦కనదసృగ్గాహన, స్ఫుటశల్య హవ్యభు♦క్ఛూత్కృతములు
యోధవర్మితహృ త్పు♦టోత్క్రాంత నిజపాత,సాలాశ్మకృతముహు♦ష్ఠాత్కృతములు
పతితోగ్ర రక్షఃక♦బంధభార భృశార్తి, భుగ్నభోగ ఫణీంద్ర♦ఫూత్కృతములు
క్రాంతరథ్య నిరంత ర♦చ్ఛాయదములు, దివ్య తావక కార్ముకో ♦ త్ప్రేరితములు
కలుషము లడంచుఁ గాతలం♦కాపురాంగ, ణాంబర చరత్కలంబక♦దంబకములు.

టీక. స్యందన = రథమందు, స్థిత = ఉన్నట్టి, బిడౌజః = దేవేంద్రునియొక్క, క్షత్తృ = సారథియగు మాతలికి, జాడ్య = మాంద్యమును, కృత్ = చేయుచున్న, ఝంఝా మరుత్ = పెనుగాడ్పులుగల, గరుత్ = గఱులయొక్క, ఝాత్కృతములు = ఝాత్కారములు గలవియు, క్రవ్యాశిరాట్ = క్రవ్య = మాంసమును, అశి = భక్షించెడురాక్షసులకు, రాట్ = రాజైన దశకంఠునియొక్క, గాత్ర = దేహమందలి, కనత్ = ఒప్పుచున్న అసృక్ = రక్తమందు, గాహన = మునుఁగుటచేత, స్ఫుట = వ్యక్తమైన, శల్య = ములుకులయందలి, హవ్యభుక్ = అగ్నియొక్క, ఛూత్కృతములు = ఛూత్కారములుగలవియు. యోధ = జోదులయొక్క, వర్మిత = సంజాతకవచములగు, హృత్పుట = హృద

యపుటములవలన, ఉత్క్రాంత = వెడలిన, నిజ = స్వకీయములగు, పాత = వ్రేటులచేతనగు, సాల = లంకాపురి కోటలయందలి, అశ్మ = పాషాణములచేత, కృత = చేయఁబడిన, ముహుః = సారెసారెకుఁగలుగు, ఠాత్కృతములు = ఠాత్కారములు గలవియు, పతిత = పడిన, ఉగ్ర = భయంకరులగు, రక్షః = రక్కసులయొక్క, కబంధ = మొండెములయొక్క, భార = వ్రేఁగుచేతనైన, భృశ = మిక్కిలియగు, ఆర్తి = పీడచేత, భుగ్న = వంగిన, భోగ = పడగలుగల, ఫణీంద్ర = పాపఱేఁడగు శేషునియొక్క, ఫూత్కృతములు = ఫూత్కారములు గలవియు, శ్రాంత = బడలిన, రథ్య = తేరిగుఱ్ఱములకు, నిరంతర = దట్టమగు, ఛాయదములు = నీడయిచ్చునవియు, దివ్య = శ్రేష్ఠమగు, తాపక = నీసంబంధియగు, కార్ముక = ధనువువలన, ఉత్ప్రేరితములు = విడువఁబడినవియు, అగు లంకాపుర = లంకాపట్టణముయొక్క, అంగణ = సమీపమందలి, అంబర = బైటను, చరత్ = చరించుచున్న. కలంబ = బాణములయొక్క, కదంబకములు = సమూహములు, కలుషములు = మాపాపములను, అడంచుఁగాత = అడఁచివేయుఁగాత. ని॥ శతాంగస్స్యందనోరథః॥ బిడౌజాఃపాకశాసనః॥ సూతః క్షత్తాచ సారథిః॥ ఝంఝావాతస్సవృష్టికః॥ గరుత్పక్షశ్ఛదఃపత్త్రం॥ రుధిరేసృగ్లోహితాస్రరక్తక్షతజశోణితం॥ హుతభుగ్దహనోహవ్యవాహనః॥ భటా యోధాశ్చయోద్ధారః॥ సన్నద్ధోవర్మితస్సజ్జః॥ ప్రాకారోవరణస్సాలః॥ ముహుఃపునశ్శశ్వద భీక్ష్ణమసకృత్సమాః॥ కబంధోస్త్రీక్రియాయుక్త మపమూర్ధకళేబరం॥ భోగస్సుఖేస్త్ర్యాదిభృతావహేశ్చఫణకాయయోః॥ రథ్యోవోఢారథస్యయః॥ కలంబమార్గణశరాః॥ నికురుంబం కదంబకమని యాయాపదముల కమరము. శల్యోవంశశలాకాయాం శకుంతా మరయోరపి। శల్యఃకశ్చిన్మహీపాల యని రత్నమాల.

శ్రీరాముఁడు రావణునితో యుద్ధము సేయునప్పుడు స్వామి ధనుస్సువలన విడువఁబడి లంకాపట్టణ ప్రాంతములయందు సంచరించెడు బాణపరంపర లప్పుడు స్వర్గము నుండి దేవేంద్రునివలనఁ బనుపఁబడిన రథమందు సారథ్యముఁ జేయుచున్నమాతలికి మాంద్యముగలుగునట్లు పార్శ్వములయందుఁ గట్టిన ఱెక్కలు పెనుగాడ్పుతో ఝూత్కారములు సేయుననియును మఱియు రావణుని శరీరమందుఁబ్రవేశించి యెముకలతో నొరసికొనినప్పుడు ములుకులలో నిప్పువడఁగా నందలి రక్తము నిప్పుతోఁజేరి చుయ్యనిశబ్దము వెడలుననియును ఇతరరాక్షసుల కవచములుచించి హృదయములు భేదించి వెన్నులోనుండి మాటియంతనిలువక లంకాపట్టణపుకోట పాషాణములకుఁ దగులఁగా సారెకు ఠాంకారములు గలుగుననియును, ఈబాణములచేత లెక్కకు మిక్కిలియగు రక్కసుల పీనుఁగుపెంటలవలన నధిక భారముగలభూమిని భరింపలేక పడగలువంచికొని శేషుఁడు బుసలు విడుచుననియును వినువని యుద్ధమందు రథమునకుఁ బూన్చినవి వేలుపుల గుఱ్ఱములేని

యు మిక్కిలి బడలికను జెందఁగా వాని బడలికదీఱుటకుఁ బందిలివేసినట్లు దట్టమగు నీడ నిచ్చుచున్నవ యయును నట్టిబాణములు మాపాపములు పోఁగొట్టుఁగాక యని భావము.

చ. క్షితిహలకృష్టిఁ బుట్టి యడఁ ♦ గె న్క్షితియందున సీతయంచుఁ ద
త్ప్రతి విరహార్తి పాండిమముఁ ♦ దాలిచి రామశరీరమెత్తి యీ
క్షితిఖననక్రియ న్మగుడఁ ♦ జెందఁగఁగాక కళిన్దజాతట
క్షితి దునవేటికి న్హలము ♦ చే మఱి నీ కవశాత్మత న్హరీ. ౨౮.

టీక హరీ = ఓస్వామీ, ఇచ్చట హలీయనియునుఁగలదు, సీత = సీతాదేవి, క్షితిన్ = భూమియందు, హల = నాఁగలివలని, కృష్టిన్ = దున్నుటచేతను, పుట్టి = జనించి, క్షితియందున = భూమియందే, అడంగెన్ = అడఁగిపోయెను, అంచున్ = అనుచు, తత్ప్రతి = ఆసీతయొక్క, విరహార్తి, విరహ = పాయుటచేతనైన, ఆర్తి = పీడవలని, పాండిమమున్ = తెల్లఁదనమును, తాలిచి = ధరించి, రామశరీరము = రామావతారము, ఎత్తి = వహించి, ( బలరామావతారమనుట. ) ఈక్షితి = ఈ భూమియొక్క, ఖనన = త్రవ్వుటయొక్క, క్రియన్ = కార్యముచేతను, మగుడఁజెందఁగఁగాక = తిరిగిపొందుటకైకాక, కళిందజా = కాళిందీనదియొక్క, తట = దరియొక్క, క్షితిన్ = భూమిని, మఱి = పదంపడి, హలముచేన్ = నాఁగలిచేతను, అవశాత్మతన్, అవశ = స్వాధీనముగాని, ఆత్మతన్ = శరీరముగలుగుటచేత, నీకుదునన్ ఏటికిన్, దునన్ = దున్నుట, నీ కేటికిన్ = నీకేమి యక్కఱ యనుట, —ఇచ్చటదున్న ధాతువు ప్రథమలుగపిద్విసుల్యోః-అనుసూత్రమువలనదును అనియెడు ధాతువయ్యె. కం. దునకయు వెదఁబెట్టకయును, ననుమొదలగు ప్రబంధపరమేశ్వరాది మహాకవి ప్రయోగసిద్ధంబయ్యునున్నది.

స్వామీ పూర్వము రామావతారమెత్తినప్పుడు సీతాదేవి భూమియందు జనకచక్రవర్తి దున్నించుచుండగాఁబుట్టి కడపట స్వామివారి సభాస్థలిలో భూమియందే యడఁగిపోయెఁ గావున నారాముఁడే మరల బలరాముఁడై యవతరించి యా సీతావిరహమువలన మున్నునల్లనైనదేహము తెల్లనై యుండఁగా నాసీత భూమిలోనెయున్నదనియును మున్నుదున్నుటవలననే పుట్టెఁగావున మరలదున్ని యాసీతను బొందవలయునని యూహించివిరహాతిశయమువలన నైమఱచి కాళిందీతీరభూమినాఁగటిచే దున్నితివే కాక వేఱొకప్రయోజనమేమున్నదని భావము. యమునాతీరమును దున్నుటకు సీతాప్రాప్తిని ఫలముగా నుత్ప్రేక్షించినాఁడు గనుక ఫలోత్ప్రేక్ష.

ఉ. ఆయతయుష్మదాకృతి క ♦ రాగ్రనగాంచలవాంతవారిధా
రాయుతచంద్రకాంతఫల ♦ కావళిబింబితమై వెలుంగ నా

రాయణమూర్తిమత్కవచ ♦ రత్నముచేఁ బరిరక్షఁ గాంచె నా
నోయదువీర వృష్టిఁ బసి ♦ యూఁటడఁ బ్రోవవె సప్తరాత్రముల్. ౨౯

టీక. ఓయదువీర = ఓయాదవవీరుఁడవగు శ్రీకృష్ణాయని యామంత్రణము, ఆయత = పొడవగు, యుష్మత్ = నీయొక్క, ఆకృతి = ఆకారము, కరాగ్ర, కర = నీహస్తముయొక్క, అగ్ర = చివరయందలి, నగ = గోవర్ధనపర్వతముయొక్క, అంచల = అంచులవలన, వాంత = వెడలుచున్న, వారిధారా = ఉదకధారలతోడ, యుత = కూడియున్న, చంద్రకాంతఫలక = చంద్రకాంతపుఁబలకలయొక్క, ఆవళి = పఙ్క్తులయందు, బింబితయై = ప్రతిఫలించినదియై, వెలుంగన్ = ప్రకాశించుచుండఁగా, నారాయణ = నారాయణసంబంధియగు, మూర్తిమత్ = శరీరముగల, కవచరత్నముచేన్ = కవచశ్రేష్ఠముచేత, పరిరక్షన్ = మిక్కిలిసంరక్షణమును, కాంచెనాన్ = పొందెనోయనఁగా, వృష్టిన్ = దేవేంద్రనియుక్తవర్షమందు, సప్తరాత్రములు = ఏడురాత్రులు, పసి = పశుసమూహము, ఊఁటడన్ = ఊటఁజెందునట్లు, ప్రోవవె = సంరక్షింపవా.

స్వామీ కృష్ణావతారమెత్తినప్పుడు దేవేంద్రుఁడు సప్తరాత్రములు ప్రబలమగువర్షముగురియింపఁగా నట్టి కాలమందు గోవర్ధనగిరి హస్తాగ్రమునందు ధరించి గోవులను రక్షించితివిగావున నా పర్వతమెత్తినప్పుడు సుట్టును జాఱుచున్న యుదకధారలతోఁ గూడిన చంద్రకాంతములయందు నీయాకృతి ప్రతిఫలించుచుండఁగా నేదిక్కుఁజూచినఁగృష్ణమయమై యుండుటంజేసి శరీరముగల నారాయణకవచము గోవులుధరించినవియో యన్నట్లుండెనని యును నారాయణకవచ మాపదలనడంచుట ప్రసిద్ధంబుగావున నట్టికవచధారణంబుననే యవి రక్షింపఁబడినట్లు గోవులను నీవు రక్షించితివని భావము. నారాయణుఁడనుపదమున కర్థముదకవాసియగు విష్ణువు గనుక నిచ్చట నుదకప్రతిబింబితమైన శ్రీకృష్ణ విగ్రహమునట్లు చెప్పెను. ఉత్ప్రేక్షాలంకారము.

మ. తరుణత్వత్సుతబాణపంచకమునం ♦ దైత్యాబలాశ్రేణి త
ద్వరసందోహము యుష్మదాత్మకజర ♦ ద్బాణం బొకంట నైజ
స్థ్వరఁ గావించితి వేటికో యహహ బు ♦ ద్ధంబయ్యె నీభావ మ
త్తరుణీశీలతనుత్ర మేరికి నసా ♦ ధ్యంబౌటఁ గా కేశవా. ౩౦

టీక. కేశవా = బ్రహ్మేశానోత్పత్తికారణమవైన స్వామీ యని సంబోధనము; తరుణ = లేఁతవాఁడగు, త్వత్సుత = నీకొడుకగు మన్మథునియొక్క, బాణ = బాణముల యొక్క, పంచకమునన్ = ఐదింటిచేతను, దైత్యాబలాశ్రేణి, దైత్య = త్రిపురరాక్షసుల యొక్క, అబలా = భార్యలయొక్క, శ్రేణి = సమూహంబును, యుష్మదాత్మక = భవన్మయమైన, జరత్ = ముదిమిగల, బాణంబొకంటన్ = ఒక్క బాణముచేతను, తద్వరసం

దోహము, తత్ = ఆదైత్యస్త్రీలయొక్క. వర=భర్తలయొక్క, సందోహము= సమూహము; చెడక్ = భంగపడునట్లు; ఏటికో = ఏలనో; త్వరc గావించితివి = శీఘ్రము చేసితివి. అహహా = ఆహాహా! నీభావము = నీయభిప్రాయము; బుద్ధంబయ్యెన్=తెలియనయ్యె. అత్తరుణీశీల = ఆస్త్రీలయొక్క పాతివ్రత్య మనియెడు, తనుత్రము = కవచము; ఏరికిన్ = ఎవ్వారికని; అసాధ్యంబౌటcగా = అసాధ్యమౌటచేతcగదాయని త్వరగా వించితివనుట కన్వయము.

త్రిపురసంహారకాలంబున నాత్రిపురస్త్రీల పాతివ్రత్య మసాధ్యమవుటంజేసి ముందఱవారిని జెఱచుటకు స్వామి తనకుమారుc డగుమన్మథుcడు దనకంటె లేcతవాcడగుటవలన నతని యైదు బాణములను ముసలివాcడగు తన రూపమయిన యొకబాణమును ద్వరితముగా వారిభర్త లగుత్రిపుర రాక్షసులc జెఱపుటకు నుపయోగింపc జేసెనని ముఖ్యభావము.

శా. ఘోరాపారమహాఘపంచకముc జె ♦ క్కు ల్సేయcగా నేర్చ నా
ధారాపంచకధావనం జెలcగుగం ♦ ధర్వంబుc ద్రొక్కించు బ
ల్బీరంపున్నెఱరౌతు కీకటశరా ♦ ళీవారవాణీభవ
ద్దోరుద్భ్రాంత కృపాణికాద్వితయవి ♦ ద్యుద్గ్రంథి నిం గొల్చెదన్. ౩౧.

**టీక.** ఘోర = కఠోరములగునట్టియు, అపార = పారములేని, మహత్ = అధికములగు, అఘ = పాపములయొక్క, పంచకము = ఏనింటిని; (స్వర్ణస్తే యీ సురాపాయీ భ్రూణహా గురుతల్పగః। మహాపాత కినస్త్వేతే తత్సం యోగీచ పంచమ యనియివి మహాపాతకములు) చెక్కుల్ = భేదములు; చేయcగాన్ = చేయుటకు; నేర్పన్నాన్ = నేర్పుటకొఱకోయనునట్లు; ధారా=అశ్వగతి విశేషములగు నాస్కందిత ధౌరితకరేచితవల్గితప్లుతములనియెడు ధారలయొక్క, (గతయోమూః పంచధారా యని యమరము) పంచక = ఐదింటియొక్క, ధావనన్ = పరువిడుటచేతను; చెలcగు=ప్రకాశించుచున్న, గంధర్వంబున్ = అశ్వమును; త్రొక్కించు = నడిపించుచున్నట్టి, బల్= అధికమగు, బీరంపు = వీరగుణముగల, నెఱరౌతు=పూర్ణరాహుత్తయినట్టియు, కీకట= బోయలయొక్క, కీకటదేశవాసులుబోయలు, (దేశభేదేచకీకట యని నిఘంటువు) శరాళీ = బాణసమూహములకు, వారవాణీభవత్ = కవచమగుచున్న, దోః = భుజములయందు, ఉద్భ్రాంత =త్రిప్పcబడుచున్న కృపాణికా = పట్టాకత్తులయొక్క, ద్వితయ = జంటయనియెడు, విద్యుద్గ్రంథిన్ = మెఱపులముడి గలిగిన; నిన్ - కల్కియగునిన్ను; కొల్చెదన్ = సేవించెదను.

స్వామి కల్క్యవతారమం దుత్తమాశ్వముమీఁద నెక్కి బవిరి - దువాలంబు - రవగాలు - జోఁడన - జళిపియను పేరులుగల యైదు గమనవిశేషములచేత నడుపుచుండఁగాఁ బంచమహాపాతకముల నడఁగఁద్రొక్కుటకు నైదు విధములగు గమనములు నేర్పుచున్నట్లుండుననియును, రెండుచేతుల రెండుపట్టాకత్తులు పూని త్రిప్పుచుండఁగా నన్నిప్రక్కలమెఱుపులు మెఱసినట్లుండుననియును, నాఖడ్గద్వయ సంచారమే యాకాలమందు స్వామినెదురింపఁగల బోయలబాణ పరంపరలకుఁ గవచమై యాబాణములను బైకి రానీకుండు ననియును భావము.

చ॥ అని నుతియింపఁగా హరి సు ♦ ధాశనవర్ధకిఁ జూచి పాండ్యుఁ డి
చ్చినధన మిమ్మునీశ్వరుఁ డ ♦ శేషము భాగవతాస్మదీయగే
హనివహసాత్కరించి యక ♦ టా కడు రిక్తత నొందు నేతదీ
యనిలయ మప్పురి న్మణిమ ♦ యంబును సార్ధముఁ జేయు నాపుడున్॥ ౩౨

టీక॥ అని = ఈరీతిగాను; నుతియింపఁగాన్ = స్తోత్రము సేయఁగా; హరి = స్వామి; సుధాశనవర్ధకిన్ - సుధాశన = దేవతలయొక్క, వర్ధకిన్ = వడ్లంగియగు విశ్వకర్మను, (తక్షాతువర్ధకీస్త్వష్టా యని యమరము) చూచి = ఈక్షించి; పాండ్యుఁడిచ్చినధనము = పాండ్యరాజొసంగినద్రవ్యమును; ఇమ్మునీశ్వరుఁడు = ఈవిష్ణుచిత్తుఁడు; అశేషము = సమస్తమును, భాగవత = భగవద్భక్తులవిషయమందు, అస్మదీయ = నాసంబంధులగు, గేహ = ఆలయములయొక్క, నివహ = సమూహమునకు; సాత్కరించి = వినియోగపఱచి; అకటా = అయ్యో; కడున్ = మిక్కిలి; రిక్తతన్ = లేమిని; ఒందున్ = పొందును. ఏతదీయనిలయము, ఏతదీయ = ఈవిష్ణుచిత్తుని సంబంధియగు, నిలయము = గృహమును; మణిమయంబును = మణివికారముగాను; సార్ధమున్ = ధనసహితమైనదిగాను; అప్పురిన్ = ఆవిల్లిపుత్తూరియందు; చేయు = చేయుము, నాపుడున్ — అనఁగా.

తా. సుగమము.

తే, గీ. విశ్వకర్మయు నట్ల కా ♦ వించె నంత । నంబుజాక్షుఁడు సమ్ముని ♦ నాదరించి
యీక్షణాగోచరుం డయ్యె ♦ ఋషియు నేగి । పౌరులు భజింప విల్లిపు ♦ త్తూరికరిగె.

టీక. ఈక్షణాగోచరుండయ్యెన్ = అంతర్ధానమును జెందెను, కడమసుగమము.

తా. సుగమము.

క. స్థానికులు దన్మునిదిదృ । క్షానందితు లగుచుఁ బురము ♦ గైసేసి ప్రజ
ల్తో నరుగ నాగవాసము । తో నెదురుగ నేగి రంత ♦ తూర్యము లులియన్.

టీక. స్థానికులు = శ్రీవిల్లిపుత్తూరిలోని దేవస్థానమందలి యధికారులు, తన్ముని = ఆవిష్ణుచిత్తునియొక్క, దిదృక్షా = చూడనిచ్ఛచేత, ఆనందితులగుచున్ = సంతోషపడినవా

రగుచు; పురముఁ = విల్లిపుత్తూరిని; కైసేసి = అలంకరించి; ప్రజల్ = పౌరులు. తో నరుగఁ = కూడ రాఁగా; నాగవాసముతోఁ = భోగమేళముతోడ; ఎదురుగ నేగిరి = అభిముఖముగాఁ బోయిరి. తూర్యములు = వాద్యములు; ఉలియఁ = ధ్వని సేయుచుండఁగా; అంతఁ = పిమ్మట; ఇది మొదటికన్వయము.

తా. సుగమము.

వ. ఇట్లెదుర్కొని పట్టపవిత్ర భగవత్ప్రసాదతీర్థంబు లుపాయనంబులుగఁ బ్రణామంబు లాచరించి లేచి ప్రాంజలులై భర్మపరికర్మనిర్మితం బగుబ్రహ్మరథంబున నబ్భాగవతవతంసంబు నునిచికొని పోవుసమయంబునఁ బరస్పరసమేతంబు లగుపౌరజానపదజనంబులు గలసి మెలసి నడుచునెడ మృదంగంబుపాంగం బావజంబు దండెతాళంబు రుమ కిన్నెర సన్నగాళె వీణె ముఖవీణె వాసె కోలు డోలు మౌరి భేరి గౌరు గుమ్మెటం బుడుక్క డక్కి చక్కి చుయ్యంకి లోనగునసంఖ్యాతవాదిత్రపరంపరలు మొరయ నెడనెడఁ బడఁతుకలు మలఁపుగొనఁ బట్టణాగతగజ ఘట్టఘోట్టాణఘోటక ఘంటికాకదంబఘుర్ఘురఘోషంబుల కనుప్రాసంబులై విలాసినీమంజుమంజీరంబు లెలుఁ గియ్యనల్లనల్లనం జాఁగుతఱిఁ గెలంకులఁ గవచితకుథాకర్బురలగుకరివరకరేణుకంధరలం గనకాంకుశంబులు చేఁబూని సేవించి పోవుసామంతభూకాంతకుమారఘట్టంబులం బిట్టు గాంచి మొండొరుఁగడవ సంభ్రమించుచు మ్రొక్కి నిక్కి చేయెత్తి యొత్తిలి నేత్రంబు లుత్తానతరళతారకంబులుగా మగిడి పొగడుచుఁ బోవుతఱిం దద్రాజకదంబకంబచ్చటిపడంతుకలకుం దమకుం బురికిం జనుదెంచినప్పుడెల్ల నెడకాండ్రగుట నేల మూఁడఁబోలు నాప్రోలిపౌళింపుఁగళావతుల వ్రేయుతెపంబునం గ్రామగ్రామగ్రామణులో సంగునారంగమాతులుంగజంబీరకుందకందుకాదులం బూర్వానుభుక్తలగునక్తంకరముఖులవైవ ధళధళత్తరళతాటంకంబును నంకురితస్మితంబును గా నాతన్ముఖప్రేంఖోళితస్ఫీతసాకూతవిభ్రమాకేకరాపాంగవిలోకనంబును నాచలితధమ్మిల్లంబునుంగా మొగంబులు మొగిచికొని సంమర్దంబునం జనుమార్దంగికులమూఁపులమఱుఁగులం డాఁగి యన్నాగవాసంబు నాగరికవిలోకనంబునం జెలరేఁగి మొగంబులు బిగించికొని వేదు రెత్తినగలి నరిదియెత్తఁ బ్రతిపదంబును మర్దళముఖావమర్దనకుఁ గ్రుంగుటయు బయలుపడి చేయునది లేక యాకడకు మగిడి తుఱుము దిద్దుచుఁ దద్వారకాభినయవత్పరాచీనకరాబ్జలై సుడివడునెడం బోడముకర్ణకుసుమావతంసకపోలఖురళీకించిచ్చలనోపలక్ష్యవైలక్ష్య హాసకుందంబులు సాంద్రశరచంద్రికాకందంబులం దీటుకొలుపఁ జాటూక్తివాచాట లగుజరఠవనితలు తమకు మ్రొక్కం దారు మ్రొక్క కొక్కించుక యోరమో మిడి వారియిరుపక్కియల నొదిఁగి తొంటియంటుఁ దలంచి తలవాంచిన వంచనం గటాక్షించి యెక్క నక్కెంబునకుఁ దమచేత మ్రొక్కించువేడ్క న

క్కడం బుడమి కేఁదు లేమి సామాన్యమానవులం గైకొనక సుమాళంబు వేద్యంబుగా
విద్యావయోవృద్ధుల రగుమీరు మ్రొక్కుఁడదారు మ్రొక్కుమియ్యెట్లు మ్రొక్కింపుం డనుట
యు గ్రక్కనం బాడను మ్రొక్కునగవుల మోముపమ్ములకు వే ఱొక్క వింత తెలివియె
క్క మ్రొక్క కక్కుడఁ గెడగూడి నడుచు తోడిచేడియల కిట్టారలకుఁ దమసం దష్ట
యుం బొందు గలవను పెద్దఱికం బెఱుకపఱుపఁ గెంమోవులు మలంచి లోలోన నొయ్యా
నను చుక్కున నక్కలితెంగి దక్కు సొమ్మని తమ్మునమ్ముదునక్కు ముందటికి నూకి యక్క
క్క మ్రొక్కవే మనపాలివేలు పని బుజ్జగించియు బొమలుగొని జంకించియు నెట్టకేల
కు నొడంబఱిచినఁ బ్రపాతరళనయనలై విరళ విరళాంగుళాంజలిబంధంబుగా మ్రొక్కి క
క్కసాన నిల్లు మ్రొక్కించి హెచ్చి యచ్చయ్యాట మెడఁ బడకయుండఁ జిగురుగండె
లుఁ బోలె నల్లుకొని గొల్లన నగునల్లోలాంగనలఁ గల్లకోపంబునం గొట్టి కసరుఁ జాప
భూపసంఘంబులపై నిగుడ మగుడ మఱుపడు కోమరెహరిణలోచనల చలితకంకణ సంకు
ల క్రేంకారంబు లానన్నామోద మేదురాళి ఝుంకారంబుల బింకంబు లడంపఁ జెవులసంకు
లు లోవంకభుజంబులు కొంకి సిగలు గావిదుప్పటులు నొప్ప నిమ్ముదెప్పరంబై ముప్పనన
ప్పరంబు సేరి రసికజనబాంధవంబున బంధువియోగంబు మఱచి గంధకలనాకుసుమ స్రగ్గ్ర
థనాదుల నాంధ్యంబులేకలరునంధ్రదేశీయు లగు గంధకారులు పాటిపాటి పద్యంపు మ్రొ
క్కులతో వెఱ్ఱివెఱ్ఱికైవారంబుల గౌరుతత్తడులపై వచ్చు రాచవారిపై నాఁడువారిపై
నాళువారిపైఁ జల్లగాఁ జల్లఁ బెల్లెగసి సృష్టియెల్లను ముష్టీకరించు నస్పష్టభేద యగు పరి
మళ సముష్టిం బెట్టు పిష్టాతకంబున భోమండలికిం జండాతకంబై చండకిరణంబులు మాటు
వఱుపఁ బన్నీరు నించిన నన్నీరుతిత్తు లొత్తి వియత్తలంబునం బాఱకై ప్రాలు ధారల హా
ద్యంబులు దడిసిన విద్యోపజీవులు పుష్కరంబులు గ్రాపనగ్గి రోయుచుండ నమ్మొత్తమ
త్తటి నృత్తంబుఁ జూడ నిలిచి మెత్తమెత్తన నడుచుచుండు మిండతండంబునుం దారు
నప్పిండు పుండరీకాస్య లవకాశంబుఁ గాంచి కాశకుసుమ ప్రతిఫలనపాండురంబులై ప
ద్యాలిహృద్యపార్శ్వద్వయోద్యానపాదపంబులకుం బాఱు చెంగలువకాలువలకుం డిగ్గి కా
సరదధిమండమానరంబులుగాఁ బిసికి యారం బెట్టిన నారంగశృంగిబేరభంగంబులతోఁ గ
ట్టిన కలమాన్నంపుఁ జల్ది పోకపొత్తులం గుడువఁ గూర్చుండ వీక్షించి కుక్షింభరిత్వంబున
క్షుత్క్షాములై తిరిగితిరిగి వేసరి మోసరిలినదాసరిగుంపు వారిపాల గోపాలభిక్షఁ భిక్షిం
చి భక్షింపఁ దీరక్షోణి నిలిపిన తోరంపుదివెదాఁకికోలల (తిరువలికోలల నిపాఠాంతర
ము) రంధ్రగోళంబుల నుత్కలంబులై మండు ధగధగనిజగజ్జ్యోతి దీపజాలంబుల మధ్య
ధూపకుండికాంగారంబుల నీరారఁ గ్రాఁచి నాదుఁ బరికింప వాయించు ధమిధమిధ్వానం
బులకుం బెదరి యావలి యుపవనశుకంబు లావలికావలియు పవనశుకంబులీవలికి దట్టం
బుగాఁ గట్టనితోరణంబులై పఱవఁ దలలు విసరుటయు నోరు దెఱచుటయుఁ గేలుసలు

చుటయుఁ దక్క మిక్కుటంబగు నక్కోలాహలంబున నేపాటియుం బాటవినరాక మూ
కగట్టిన భాగవతజాతంబు లేతేర నూరూరి సంతసంతకుం దిరుగఁ బెద్దలింటింట సంతరిం
చిన పిలుకవాటుగోడిగల జావడంబులకుం బుట్టి కాల్గట్టి విడువ నెత్తంబున మెత్తని గతిక
మేసి పోసరించి మాపుమాపున మేపుసజ్జకవణంపుమేపునఁ బిడుక గొఱపంబుతో మకం
బునఁ బుటపుటనై కఱియకంబడి వ్రాఁతఁ గని మైనసీడకని మైనం బెదరుకొదమతట్టువ
గుంపుకాలి కొలందికి వ్రేలు లాలుకుంచెలు గీలించిన గవ్వదంటలగంటల నలంకరించి
మొలుగుమడ్డిం దోఁచి మూరకొక్కుండును జేనకొక్కుండునుగాఁ గుట్టినడొల్లు టు
ల్లారు ఉల్లసిల్ల బల్లించిన పల్లంబులపైఁ జిల్లతైలంబును వాసనకొడుపులం బూనినమణుం
గుఁజంద్రికచేలలె రవణంబులుగా నెదురుగా వేడుకకుం జూడవచ్చిన యప్పాటి పేటిసా
తె యగసాలె పటుసాలె వానె సై జాతిసాఁతు సెత్తులకొమరులు తుములమై వచ్చుతచ్చ
మూసామజంబులం జూచి యేచినవెఱం దమయెక్కిరింత లెక్కికొని వాగెలిరుగేలం గు
దియంబట్టిన నిలువ కయ్యుత్సవం బీక్షింపవచ్చినప్రజలం ద్రొక్కుచుం బోవఁ దన్మధ్యవృ
ద్ధవధ్వాతురాదులు దిట్ట నిట్టట్టనలేక ప్రాణంబులు పిడికిటం బట్టుకొని పోవుచున్న వీనసవి
ధకేదారంబులం ద్రెళ్లి చట్టలుదిగంబడి వెడల లేకుండం దారు దిగసిమ్ములేక బిమ్మటిగొని
నలుదెసలుం జూడం జూచి కేలు చఱచి కొహొయాయని గేలిసేయు గణికాకదంబంబుల
చప్పటులు నిబిడనిష్కుటవిటపిఝాటద్ములం బ్రతిశబ్దంబులు పుట్టింప నిట్లనూన విభవం
బు సిగురొత్తన త్తిరుపతి సొచ్చి యచ్చక్రధరు నగరిమోసల నిలుచుటయు నవ్విష్ణుచిత్తుం
డు దద్రథావతరణంబు చేసి ధరణీధవ సమూహస్థాని కవ్యూహంబు వెంటరా నవ్వైష్ణవుం
డు సేవించి తత్ప్రసాద లబ్ధంబగు పరివట్టంబున నలంకృతుండై నానాలంకార సహితంబు
ను రత్నకాంచన మయంబును నగు నాత్మీయభవనంబు గాంచి విస్మితుండై పుండరీకాక్ష
మహిమాభిలబ్ధవైభవంబు కాఁ దెలిసి తత్రత్యధాత్రీకళత్ర వర్గంబుల ననిపి ప్రవేశించి తొం
టికంటె శతగుణంబుగా భాగవత పూజాప్రవణుండై యుండెనంత. ౩౯.

టీక. ఇట్లు = పూర్వోక్తప్రకారముగాను, ఎదుర్కొని= ఎదురుగావచ్చి, పట్ట=
తిరుప్పరివట్టమును, పవిత్ర = పావనములైన, భగవత్ప్రసాద తీర్థంబులు = రంగమన్నా
రుస్వామియొక్క యభిషేకోదకనిర్మాల్యాదులును, (ఇచ్చట గ్రన్థకర్త అల్పాచ్తరం పూర్వ
మని ద్వంద్వమునకు నిషేధమున్నప్పటికిని లక్షణహేత్వోః క్రియాయా యనుజ్ఞాపక సూ
త్రముచేతఁ బ్రయోగించియున్నాఁడు.) ఉపాయనంబులుగాఁ = కానుకలుగా, ప్రణా
మంబులాచరించి = నమస్కరించి, లేచి = ఉత్థితులై, ప్రాంజలులై = చేతులు జోడిం
చినవారై, (అంజలిబంధము గలవారనుట) భర్మపరికర్మవర్మితంబగు = భర్మ = బంగా
రుమయమైన, పరికర్మ = అలంకారముచేతను, వర్మితంబగు = సన్నద్ధమైన, బ్రహ్మరథం

బునన్ = బ్రహ్మరథమందు, అబ్భాగవతవతంసంబున్ = భగవద్భక్తశిరోభూషణమయిన యావిష్ణుచిత్తుని॥ ని॥(గాంగేయ్యం భర్మకర్బురం - పరికర్మాంగసంస్కారః - సన్నద్ధో వర్మితస్సజ్జః - పుంస్యుత్తంసావతంసౌ ద్వౌ కర్ణపూరే పిశేఖరేయనియు నమరము.) ఉనిచి = ఉంచి, కొనిపోవు సమయంబునన్ = వెంచేపు చేసికొని వెళ్ళుకాలమందు, పరస్పర సమేతంబులగు, పరస్పర = అన్యోన్యము, సమేతంబులగు = కలసియున్నటువంటి, పౌరజానపదజనంబులు, పౌర = పట్టణమందలి, జానపద = పల్లెలయందలి, జనంబులు = నరులు, కలసి = కూడికొని, మెలసీ = వ్యాప్తములై, నడచునెడ = పోవుతఱి, మృదంగంబు = మద్దెల, ఉపాంగంబు = తిత్తి, ఆవజము = రుంజ, దండె = తంబురా, తాళంబు = లయనుసరిగా వాయించు కంచువాద్యము, ఉరుమ = వాద్యవిశేషము, కిన్నెర = తంత్రీవాద్యవిశేషము, నన్నగాళె = తిరుచ్చిన్నము, వీణె = విపంచి, ముఖవీణె = నోరుచంగు, వాసెక్రోలు = పిల్లనగ్రోవి, డోలు = వాద్యవిశేషము, సన్నారి = నాగసరమును, భేరి = దుందుభి, (భేరీస్త్రీ దుందుభిః పుమానని యమరము.) గౌరు = కాహళి, గుమ్మెట = తుడుము, తుమ్మటంబు = డప్పు, డుక్క, చక్కి, డక్కి, వాద్యవిశేషములు. చుయ్యంకి = సానాయి, లోనఁగు = మొదలుగాఁగల, అసంఖ్యాత = లెక్కకుమిక్కుటమైన, (అంక్యాది వాద్యత్రితయయనియును పాఠముగలదు) వాదిత్రపరంపరలు, వాదిత్ర = వాద్యములయొక్క త్రితయ = మూఁటియొక్క, పరంపరలు = సమూహములు, ని (తౌర్యత్రికం నృత్తగీతవాద్యంనాట్యమిదం త్రయమని యమరము) మొరయన్ = ధ్వనిచేయఁగా, ఎడనెడన్ = నడుమనడుమ, పడఁతుకలు = నాట్యస్త్రీలు, మలఁపుగొనన్ = ఎదురుదిరిగి నాట్యముచేయఁగా, పట్టణాగత, పట్టణ = నగరములనుండి, ఆగత = వచ్చినటువంటి, గజఘట్ట = ఏనుంగుల సమూహముయొక్కయు, ఘోట్టాణ = ఘోట్టాణదేశమందుఁబుట్టిన, ఘోటక = అశ్వములయొక్కయు, ఘంటాకదంబ = గంటలసమూహముయొక్క, ఘుర్ఘరఘోషంబులను, ఘుర్ఘురధ్వనులను, అనుప్రాసంబులై = అనుకరణములై, విలాసినీ = స్త్రీలయొక్క, మంజు = సుందరములయిన. ని. (మనోజ్ఞంమంజుమంజుళమని యమరము) మంజీరంబులు = అందెలు. ని. (మంజీరోనూపురో స్త్రీయామని యమరము) ఎలుఁగియ్యన్ = ధ్వనిచేయఁగా, అల్లనల్లనన్ = మెల్లమెల్లగా, చాగుతఱిన్ = నడచునవయమందు, కెలంకులన్ = ప్రాంతములందు, కవచిత = కంచుకములుగాఁ జేయఁబడినటువంటి, కుథా = పృష్ఠాస్తరణములచేత, కర్బురలగు = చిత్రవర్ణములయిన, ని (ప్రవేణ్యాస్తరణంవర్ణః, పరిస్తోమః కుథోద్వయోయని యమరము.) కరివర = గజశ్రేష్ఠములయొక్కయు, కరేణు = ఆఁడేనుంగులయొక్కయు. కంధరలన్ = కంఠప్రదేశములయందు. ని. (కరేణురిభ్యాంస్త్రీనే భయనియు, కంఠోగళోథగ్రీవాయాం శిరోధిః కంధరేత్యపియనియునమరము) కనకాంకుశంబులు = బంగారపుసృణులు, చేఁబూని = చేతబట్టి, సేవిం

లగు = గర్హ్యవాక్యములుగలిగి నటువంటి (ని. వాచాటోబహుగర్హ్యవాక్కని యమ రము) జరతవనితలు = వృద్ధాంగనలు (జరఠౌజీర్ణకర్కశౌఅని నానార్థ రత్నమాల), తమకుఁ = ఆవిటులకు, మ్రొక్కఁ = నమస్కరింపఁగా, తారు = తాము మ్రొక్కక = అంజలి గావింపక, ఒక్కించుక = ఇంచుకంత, ఓరమోమిడి = మాఱుమొగముచేసి, వారి = ఆవృద్ధస్త్రీలయొక్క, ఇరుపక్కియలనొదిఁగి, ఇరు = రెండైన, పక్కియలఁ = పార్శ్వములయందు, ఒదిఁగి = ఒత్తిగిలి, తొంటియంటుఁదలంచి = పూర్వపు సంబంధమును స్మరించి, తలవాంచినఁ = శిరస్సు వంపఁగా, వంచన గ్గటాక్షించి = ఆరాజకుమారులు కపటముచేతఁ జూచి, యద్వా. వంచనఁ = ఆ స్త్రీలు నమస్కరింపని కపటమును, కటాక్షించి = చూచి, ఎక్కసక్కెంబునకుఁ = పరిహాసమునకు, తమచేతఁ = ఆస్త్రీలచేతను, మ్రొక్కించుకొనువేడ్కఁ = వందనయు చేయించుకొనవలయునను కుతూహలముచేతను, అక్కడఁ = ఆస్థలమందు, పుడమిఱేఁడులేమిఁ = రాజులేనందువల్లను, సామాన్యమానవులఁ = సాధారణ జనులను, కైకొనక = లక్ష్యపెట్టక, సుమాళంబు = మనోభావము, వేద్యంబుఁగా = తెలియుటకొఱకు. విద్యావయోవృద్ధులగు, విద్యా = గానాదులచేతను, వయః = వయస్సుచేతను, వృద్ధులగు = పెద్దలగు, మీరుమ్రొక్కఁ = మీరు నమస్కరింపఁగా, తారు = తమరు, (వయస్త్రీలనుట) మ్రొక్కమియెట్లు = నమస్కరింపక పోవుటెట్లు, మ్రొక్కింపుఁడనుటయు = మీరు నమస్కరింపఁ జేయుఁడనుటయు, గ్రక్కునఁ = శీఘ్రముగ, పొడము = పుట్టుచున్న. మొక్కవగపులఁ = హాసాంకురములచేతను, మోముదమ్ములకుఁ = ముఖపద్మములకు, వేఱొక్కవింత తెలివియొక్క = మఱియొక యాశ్చర్యపుతేట గనుపట్టఁగా, మ్రొక్కక = నమస్కరింపక, అక్కడఁ = ఆస్థలమందు, గెడగూడి = జతగూడి, నడచు = చనుచున్న, తోడిచేడియలకుఁ = సహవాసపు స్త్రీలకు, అద్దారలకుఁ = ఆరాజకుమారులకు, తమకును = వారాంగనలకు. తద్దయుంబొందుగలదను, తద్దయుఁ = ఎక్కువగా, పొందుగలదను అనుకూల్యము గలదను, పెద్దఱికంబు = గొప్పతనము, ఎఱుకపఱుపఁ = బయలు పఱుచుటకొఱకు, కెమ్మోవులు = ఎఱ్ఱనియధరోష్ఠములు, మలంచి = ముణిచి, (పెదవులు విరిచియనుట) లోలోనఁ = లోలోపల, ఒయ్యనొయ్యనఁ = మిగులశీఘ్రముగను, ఛుక్కనఁ = రిక్కవేయఁగా, (అనఁగా నాశ్చర్యకరమైన ధ్వని విశేషముచేయఁగాననుట.) ఆక్కిలెఱింగి = ఆజాడదెలిసి, దక్కెసొమ్మని = ధనముదొఱకెనని, తమ్ముఁ = ఆస్త్రీలను, అమ్ముదుసళ్ళు = ఆవృద్ధవేశ్యలు, ముందటికినూకి = అగ్రభాగమునకుఁద్రోచి, అక్కక్క = ఓ యక్కక్క, (ఆదరముచేతద్విరుక్తి) మనపాలివేలుపు = మనపాలిటిదైవము, మ్రొక్కవే = వందనముసేయుము, అని = ఈలాగని, బుజ్జగించి

యఁ౯ = మంచిమాటలాడియును, బొమలుగొని= భ్రూసంజ్ఞచేతను, జంకించియు౯ = వెఱపించియును, ఎట్టకేలకు౯ = కొంతసేపటికి, ఒడంబఱిచిన౯ = సమ్మతింపఁజేయఁగా, త్రపాతరళనయనలై, త్రపా = లజ్జచేతను, తరళ = చంచలములైన, నయనలై = నేత్రములుగలవారై, విరళవిరళాంగుళాంజలి బంధంబుగా, విరళవిరళ = మిక్కిలియెడములై, అంగుళ = వ్రేళ్లుగల, అంజలి బంధంబులుగా = జోడింపఁబడినచేతులు గలుగునట్లుగ, మ్రొక్కి = వందన మొనరించి, ( విరళవిరళాంజలి బంధమనియును పాఠముగలదు, కక్కసంబున౯ = బహుసంకటముచేతను, అట్లు = ఆలాగున, మ్రొక్కించి = నమస్కారము చేయించి, హెచ్చి = అతిశయించి, అచ్చయ్యాట మెడపడక యుండ౯ = ఆసల్లాప మెడముగాకుండఁగ, జిగురుగండెలు వోలె౯ = జిగురు గండెల లాగున, ( జిగురుగండెలనఁగాఁ బక్షులఁబట్టుటకొఱకు నశ్వత్థ క్షీరాదులచేత వండఁబడి వీనెలకుఁ బూయఁబడి యుండు పక్షి గ్రహణ యంత్ర విశేషములు ) అల్లుకొని = చుట్టికొని, గొల్లననగు = గొల్లునహసించుచున్న, అల్లోలాంగనల౯ = ఆవృద్ధవేశ్యలను, కల్లఁగోపంబున౯ = అబద్ధపు కోపము చేతను, కొట్టి = ప్రహరించి, కనరుఁజూపు = కోపదృష్టి, అబ్బాపసంఘంబుపై౯ = ఆ రాజకుమార సంఘముమీఁద, నిగుడ౯ = ప్రసరించునట్లుగ, మగుడ౯ = మరలను, మఱుపడు = అదృశ్యలగునట్టి, కొమరె హరిణలోచనల, కొమరె = పిన్నవయస్సుగల॥ హరిణలోచనల = లేడి కన్నులవంటి కన్నులు గల స్త్రీల యొక్క, చలిత కంకణసంకుల క్రేంకారంబు, చలిత = కదలింపఁబడ్డ, కంకణ = కరభూషణములయొక్క, సంకుల = సంకీర్ణములైన, (ని. సంకీర్ణం సంకులాకీర్ణే యని యమరము. ) క్రేంకారంబులు = క్రేంకారధ్వనులు, ఆననామోద, ఆనన = ముఖముయొక్క, ఆమోద = పరిమళమునకుఁ, (ని. ఆమోదస్సోతి నిర్హారీయని యమరము. ) మేదుర = దట్టమైన, అళి = తుమ్మెదలయొక్క, ఝంకారంబుల౯ = ఝంకారధ్వనులను, బింకంబులడంప౯ = గర్వములనణఁపఁగా తిరస్కరింపఁగాననుట, చెవులసంకులు, చెవుల = కర్ణప్రదేశములయందలి, సంకులు = సంకుపూసలును, లోవంకభుజంబులు, లోవంక = లోపలికివంగిన, భుజంబులు౯ = బాహువులును, కొంకిసిగలు = వంకరకొప్పుబంధంబులు, కావిదుప్పట్లు౯ = చాయబట్టలును, ఒప్ప౯ = అమరియుండఁగా, ఇమ్ము = స్వస్థలము, తెప్పరంబై = తప్పిపోయి, ముప్పున౯ = వార్ధిక్యమందు, అప్పురంబు = ఆ శ్రీవిల్లిపుత్తూరు, చేరి = ప్రవేశించి, రసికజన = సజ్జనులయొక్క, బాంధవంబున౯ = సహవాసముచేతను, బంధువియోగంబు మఱచి, బంధువియోగంబు౯ = బాంధవుల నెడబాయుటను, మఱచి=విస్మృతిఁజెంది, గంధకల నాకు సుమస్రగ్గ్రథనాదుల౯, గంధకలనా = బుక్కాచేయుట, కుసుమస్రక్ = పుష్పమాలికలయొక్క, గ్రథనాదుల౯ = కూర్చుటమొదలగువానియందు, ఆగ్నంబులేక = మాంద్యము లేక, అలరు = ఒప్పుచున్నట్టి.

ఆంధ్రదేశీయులగు — తెనుగు దేశమందుండివచ్చిన, గంధకారులు = బుక్కావాండ్రు, పాటిపాటిపద్యంపు మ్రొక్కులతోఁ, పాటిపాటి = కొంచెకొంచెపు, పద్యంపు = పద్యములతోఁగూడిన, మ్రొక్కులతోన్ = దండములతోడను, వెట్టివెట్టికైవారంబులన్ = చేతులుసాచిచేయు పిచ్చి పిచ్చి స్తోత్రములతోఁ, గౌరు = తత్తడులపైవచ్చు, ఏనుంగుల మీఁదను గుఱ్ఱములమీఁదనువచ్చెడి, రాచరిపైన్ = రాజసంఘంబులమీఁదను, ఆఁడువారిపైన్ = నాట్యమాడు స్త్రీలమీఁదను, ఆళువారిపైన్ = పెరియాళ్వారిపైని, (అయనె విష్ణుచిత్తుఁడు) చల్లఁగాఁజల్లన్ = మిగులనవకీర్ణము చేయఁగా, పెల్లగసి=బిట్టెగసి, సృష్టియెల్లను = సర్వమంతయును, (అనఁగా జగత్తుననుట) ముష్టికరించు = పిడికిటి పట్టిన వ్యాపించిన, అస్పష్టభేదయగు = భేద మేర్పడకయున్న, పరిమళసముష్టింబెట్టు = వాసనలనీనుచున్న, పిష్టాతకంబు = బుక్కా. (ని. పిష్టాతః పటవాసక యని యమరము) నభోమండలికిన్ = అంతరిక్ష ప్రదేశమునకు, చండాతకంబై = అర్ధోరుకమై, చండకిరకిరణమ్ములన్ = సూర్యకిరణములను, మాటుపడుపన్ = ఆచ్ఛాదింపఁగా, పన్నీరునించిన = హిమాంబువుచే నిండించిన, అన్నీరు తిత్తులొత్తన్ (తన్నీరు తిత్తులనియును పాఠము కలదు) ఆపన్నీటి చర్మభస్త్రికలను బిగియఁబట్టఁగా, వియత్తలంబునంబారి = అంతరిక్షమున కెగసి, పైత్రావాలు = క్రిందుగావంగుచున్న, ధారలన్ = ఉదకధారలచేతను, వాద్యంబులు = మృదంగాదులు, తడసినన్ = క్లిన్నములుగాఁగా, విద్యోపజీవులు = ఆవాద్యవిద్యలచేత జీవనము చేయువారు, పుష్కరంబులుగాఁపన్. పుష్కరంబులు = వాద్యభాండ ముఖంబులు. కాఁపన్ = కాఁచుటకొఱకు (ని. పుష్కరం కరిహస్తాగ్రే వాద్యభాండముఖేజలే అని యమరము.) అగ్గిరోయుచుండన్ = నిప్పును వెదకుచుండఁగా, అస్తోమము = ఆనసమూహము. అత్తఱిన్ = ఆసమయమందు, నృత్తంబుఁజూడనిలిచి = నాట్యమాడుటను వీక్షింపనిలిచి, మెత్తమెత్తనన్ = మెల్లమెల్లనే, నడచుచుండు = అరుగుచున్నట్టి, మిండమితండంబును = విటసమూహమును, తారున్ = కమరును, అప్పిండు = ఆనమూహమందలి, పుండరీకాస్యలు = స్త్రీలు, అవకాశంబున్ = సమయమును, కాంచి = చూచి, కాశకుసుమ = రెల్లుపువ్వులయొక్క, ప్రతిఫలన = ప్రతిబింబించుటచేతను, పాండురంబులై = తెల్లనై, పద్యా = మార్గములయందు, ని (హరిణః పాండురః పాండు- సరణిః పద్ధతిః పద్యా యని యమరము.) అతిహృద్య = మిగుల మనోహరములైన, పార్శ్వద్వయ = ఇరుప్రక్కలయందును, ఉద్యానపాదపంబులకున్ = ఆక్రీడావనమందున్నవృక్షములకు, పాఱు = ప్రవహించుచున్న, చెంగలువకాలువలకుడిగ్గి, చెంగలువ = ఎఱ్ఱకలువలుగల, కాలువలకున్ = సారణులకు, డిగ్గి = దిగి, కాసరీదధిమ్మండమాసరంబులుగాఁ బిసికి, కాసరీ = గేదలయొక్క, దధి = పెరుగుచేతను, మండ = మీఁగడచేతను, (ని. మండం దధిభవం మస్తువని యమరము) మాసరంబులుగా = దట్టముగాను, పిసికి = కలిపి, ఊరం బెట్టిన

నారంగశృంగిబేర భఙ్గంబులతోఁగట్టిన, ఊరంబెట్టిన= లవణముతోఁజేర్చి నానఁబెట్టిన, నారంగ = నారింజకాయలయొక్కయు. నారదబ్బకాయలయొక్క యనియు, శృఙ్గిబేర=అల్లముయొక్కయు, భంగంబులతోన్ = తునకలతోడను (ని. ఆర్ద్రికఁశృంగిబేరంస్యాత్తనియమరము) కట్టిన=బంధించిన, కలమాన్నపుఙ్జద్ది = రాజనపర్యుషితాన్నము. (మోస్తువిభక్త్యేకవచనకేపుంపూ అని శబ్దానుశాసనుఁడు సూత్రించినాఁడు గనుక కలమాన్నమనుచోట మకారమునకుఁ బుమాదేశమువచ్చెను. పోకపొత్తులన్ = క్రముకపుపట్టలయందు, పొత్తులన్ =ఏకపాత్రలయందు, కడువన్ =భోజనముఁ జేయుటకు, కూర్చుండన్ = ఆసీనులుగాఁగా, వీక్షించిచూచి, కుక్షింభరిత్వంబునన్ =ఉదరపోషణత్వంబుచేతను, క్షుత్క్షాములై=ఆకలిచేతఁ గృశించినవారై, తిరిగితిరిగి= సంచరించిసంచరించి, వేసరి=విసికి, ఓసరిలిన=అలసినట్టి, దాసరిగుంపు=దాసళ్ళసమూహము. వారిపాలన్ = చల్దిగుడుచువిటులయొద్దను, గోపాలభిక్ష=అన్నభిక్ష, (దాసళ్లు భిక్షకుఁ బోవునపుడు గోపాలభిక్ష యని యడుగుట ప్రసిద్ధముగాన నిచ్చట గోపాలభిక్షయని ప్రయోగించినాఁడు మాధవకర మన్నట్లు) భిక్షించి=యాచించి, భక్షింపన్ = భోజనము చేయుటకు, తీరక్షోణులన్ = ఏటిదరినేలలయందు, నిలిపిన=ఉనిచిన, తోరంపు= లావగు, దివెదారికోలల = దీపపుకంబములయొక్క, (తిరువలిక్కోలలను పాఠమునసిదెయర్థము)రంధ్రగోళంబులన్ = సుషిరప్రదేశములనుండి, ఉత్కీలంబులై =ఉద్గతజ్వాలలై, మణ్డు=వెలుఁగుచున్న, ధగధగని =ధగధగమనియెడు, జగజ్జ్యోతి దీపజాలంబులన్ (జగజ్జ్యోతియనఁగఁ బ్రమితెలుమొదలగువానియందు వర్తివేయక మధ్యప్రదేశమందుఁ జమురుచేతఁ దడుపఁబడిన గుడ్డలులోను గాఁగలవానినించి వెలుఁగించుదీపము) దీపజాలంబులన్ = దీపసమూహములచేతను, (జాలజ్గవాక్ష ఆనాయెక్షారకేకపటెగజెయని విశ్వము) మధ్యమార్గము యొక్క నడుమను వేసిన, ధూపకుండికాంగారంబుల, ధూప = ఉపచారార్థము వేసిన సాంబ్రాణి పొగయొక్క, కుణ్డికా = పాత్రలయందున్న, ని. (పుంసిచకుండః పీఠరేతో యాధారేచవహ్నిగర్తేచ, కుండోజారాజ్జాతస్సభర్తృకాయాంకమండలౌకుండీయని నానార్థరత్నమాల,)అంగారంబులన్ = అగ్నులయందు, స. (అంగారోలాతముల్ముకమని యమరుఁడు,)నీరారంగ్రాఁచి, నీరారన్ = తడియారునట్లుగ, గ్రాఁచి = తప్తముచేసి, వాదుఁబరికింపన్ = ధ్వనిచూచుటకు, వాయించు=ధ్వనిఁజేయునట్టి, ధిమిధిమిధ్వానంబులకున్ = ధిమిధిమియను ధ్వనులకు, బెదరి = జడసి, ఈవలియుపవన శుకంబులు, ఈవలి = ఇవతలి వైపుననున్న, ఉపవన = ప్రాంతవనమందలి, శుకంబులు = చిలుకలు, ఆ వలికిన్ = ఆవలివైపునకును, ఆవలి యుపవనశుకంబులు = ఆవలి తోటయందున్న చిలుకలు, ఈ వలికిన్ = ఇవతలికిని, దట్టంబుగా = ఎడతెగకుండ, కట్టనితోరణంబులై, ఏర్పఱుపని మకరతోరణంబులై, పఱవన్ = వ్యాపింపఁగా, తలలువిసరుట

యును = శిరఃకంపనములు చేయుటయును, (అభినయించునప్పుడు తలలుకదులుచుండును
నుట) నోరుదెఱచుటయు — పాడుటకు వదనములవిప్పుటయు, కేలుసఱచుటయు =
చప్పట్లుగొట్టుటయును, తక్కన్ = తప్ప, మిక్కుటంబగు = అతిశయమైన, అ
కోలాహలంబునన్ = ఆ కలకలధ్వనియందు, (కోలాహలః కలకలయని యమరము,)
ఏ పాటియు = ఎంతమాత్రమును, పాటవినరాక = పాడుట వినఁబడక యుండఁగా,
మూఁకగట్టిన = గుంపులై యున్న, భాగవతజాతంబులే తేరన్, భాగవత = భగవద్భక్తుల
యొక్క, జాతంబులు = సంఘంబులు (ఉత్పన్నభూతయోర్జాతం బృందజాత్యోస్తునద్వ
యోయని యుత్పలమాల) ఏ తేరన్ = వచ్చుచుండగా, ఊరూరి సంతసంతకున్,
ఊరూరి = ప్రతిగ్రామముయొక్క. సంతసంతకున్ = ప్రతిసంతకును, (సంతయనఁగా
వారమున కొకపర్యాయము సకలవస్తువులఁజేర్చికొని యందఱును విక్రయించుటయుఁ
గ్రయమునకుఁ దీసికొనుటయు నిట్టివ్యాపారమునకు నిర్ణయించుకొన్న ప్రదేశము) తిరు
గన్ = సంచరించుటకు, పెద్దలు = ప్రముఖులు, ఇంటింటన్ = ప్రతిగృహమందు
ను, నంతరించిన = పోషించిన, పిలుకవాటు = పిల్లలనిచ్చునట్టి, గోడిగలజావడముల
కున్ = ఆడు గుఱ్ఱపుతట్లకు, పుట్టి = జనియించి, కాలుగట్టివిడువన్ = పాదమై
నత్రాటిచేఁ బాదబంధన మొనరించి విడువఁగా, నెత్తంబునన్ = ఊరఁబాటియందు,
మెత్తని మృదువులైన, గఱికమేసి = దూర్వనుదిని, బోసరించి = గర్వించి, మాపుమాపు
నన్ = ప్రతి సాయంకాలమందును, మేపుతినిపించుచున్న. సజ్జకవణంపుమేపునన్ =
గంటెకోటి మేతచేతను, విడక = కరీషమును, గొరపంబు = గుఱ్ఱమును దోమునట్టి
సాధనముచేత, తోమకంబునన్ = శరీరశోధనముచేత, పుటపుటనై = నున్ననున్ననై,
కరియకంబడి ప్రాతఁగనిమైనన్ = నల్లకంబడి గుడ్డచూచినను, నీడఁగనిమైనన్ = మ
నుష్యాదులనీడను వీక్షించినను, బెదరు = జడుపుఁగొనుచున్న. కొదమతట్టువగుంపు,
కొదమ = లేతలైన, తట్టువ = గుఱ్ఱములయొక్క, గుంపు = సమూహము, కాలికొ
లందికి = పాదముల పర్యంతము, వ్రేలు = లంబితములై యున్న, లాలుకుచ్చెలు = ఎ
ఱ్ఱనికుచ్చులు, లాలుకుచ్చెలనఁగా గంగెద్దులవాండ్రు చేతబట్టుకొనివచ్చు సారంపుకుచ్చు
లని కొందఱు, కీలించిన. కట్టిన, గవ్వదండలన్ = వరాటికాసరములచేతను, గజ్జలన్ =
గజ్జలచేత, అలంకరించి = ప్రసాధనముఁజేసి. మొలుగుమడ్డిందోఁచి = మోదుగుచెక్క
వేసికాఁచిననీళ్లతోఁ దడిసి, మూరకొక్కండును = హస్తప్రమాణమున కొకటియును,
జేనకొక్కండునుగాన్ = అరమూరకొక్కటియును గలుగునట్లుగ, కుట్టిన = కుట్టప
డిన, డొల్లుటుల్లారులుల్లసిల్లన్ = = డొల్లుటుల్లారులు, వ్రేలుజాలరు. ఉల్లసిల్లన్ =
వెలుగునట్లుగ, (మోదుగుచెక్క రసముచేతను రంగువేయఁగా నలుపువర్ణమువచ్చును
గాన నెఱ్ఱనికుచ్చులనడుమను వీని నొక్కొకటిని జేర్చి కట్టఁబడియున్న జాలరులననుట)

వల్లించిన = ఆయింతపఱచిన, పల్లంబులపైన్ = పల్యాణములమీఁదను, చిల్లతైలంబును = ఇడుగవగరును, వాసనకోఁదుపుల్ = పరిమళయుక్తమైన శలాకలచేతను. పూసిన = లేపనము చేయఁబడిన, మణుంగు = చలువచేయఁబడినటువంటి. చంద్రికచేలలె = తెల్లబట్టలె, రవణంబులుగాన్ = భూషణములుగాను, ఎదురుగాన్ = అభిముఖముగాను, వేడుకఁజూడవచ్చిన = సంతోషముచేత వీక్షించుటకైవచ్చిన, అవ్వీటి = ఆ శ్రీవిల్లిపుత్తూరియందున్న, మేటి = ప్రబలులైన. సాలె = వస్త్రకారులును. అగసాలె = స్వర్ణకారులును, పటుసాలె = పట్నూలువాండ్రును, వాసె = హీనజాతికోమట్లును, వైజాతి = పలువవాండ్రును, సాతులు = గోనెలు నేయువాండ్రును, (అనఁగాఁ బెరికెవాండ్రనుట) ఎతుల = చాపలునేయువాండ్రును, వీరలయొక్క, కొమ్ములు = స్త్రీలు, (కొమరులుఅను పాఠమున చిన్నవాండ్రనియర్థము.) తుములమై =సంకులమై, వచ్చు = ఏతెంచుచున్న, తచ్చమూసామజంబులంజూచి = ఆ సేనయందలియేనుఁగులవీక్షించి, (ని. పృతనానీకినీచమూయనియు,సామజః పేచకీశూర్పశ్రుతిర్ద్వైదణ్ణ ఇత్యపిఁయనియునమరము) ఏచిన = అధికమైన, వెఱన్ = భయముచేతను, తమ = తమయొక్క, ఎక్కిరింతలెత్తికొని = అశ్వములు దమపైనున్నవారినెత్తుకొని, వాఁగెలిరుగేలంగుదియంబట్టినన్, వాఁగెలు = కళ్లెములను, ఇరుగేలన్ = రెండుచేతులచేతను, కుదియంబట్టినన్ = బిగియఁబట్టినను, నిలువక = ఆ స్థలమున్నుండకయె, అయ్యుత్సవంబీక్షింపవచ్చిన = ఆ తిరుణాళ్లఁజూడనే తెంచినట్టి, ప్రజలన్ = మనుష్యులను, త్రొక్కుచున్ = పాదఘట్టనమొనరించుచు, పోవన్ = పారిపోవఁగ, తన్మార్గవృద్ధవధ్వాతురాదులుదిట్టన్, తన్మధ్య = ఆ త్రొక్కుడుపడుచున్నవారి నడుమనున్న, వృద్ధ = ముదుసళ్లును, వధూ = స్త్రీలును, ఆతుర = రోగపీడితులును, ఆదులు=లోనగువారు, తిట్టన్ = శపింపఁగా, ఇట్టిట్టనలేక = మాఱుమాటాడలేక, ప్రాణంబులుపిడికిటంబట్టికొని = అరచేతిలోను సురులంబెట్టికొని, పోవుచున్ = వెళ్లుచును, నవీనసవిధకేదారంబులన్, నవీన = నూతనములైన, సవిధ = సమీపమందున్న, కేదారంబులన్ = దున్నుచేసిన వరిమళ్లలోను, (ని. కేదారకంస్యాత్కైదార్యంక్షేత్రంకైదారకం గణెయనియమరము) త్రెళ్లి = తుళ్లి, చెట్టలుదిగంబడి = దంతలవఱకుఁ గ్రుంగిపోయి, (చప్పటులనియును బాఠముగలదు) పెడలలేకుండన్ = పైకిలేవజాలకుండఁగా, తారు=తమరు, డిగన్ = దిగుటను, ఇచ్చలేక = స్థలములేనక, బిమ్మటఁగొని, ఉంగిటగుడిచి = మనోదుఃఖముపొంది, నలుదెసలున్ = నాలుగు దిక్కులను, చూడన్ = వీక్షింపఁగా, చూచి = వారినిజూచి, కేలుచఱచి = చప్పట్లుగొట్టి, కోహోయని = కోహోయను పరిహాసవ్యంజకమగుధ్వని విశేషముచేసి, గేలిసేయు = పరిహాసముఁజేయుచున్న, (తేరిమూఁదిహోయని గేలిసేయుచున్న కౌశదంబులయని యొకపాఠము)

(నర్తకయనఁగా నపుర్తాడనిది) గణికాకదంబంబుల = వేశ్యాసంఘములయొక్క, చప్పటులు = చేతులు తట్టుటలు, నిబిడనిష్కుటవిటపిఘ్రాటంబులన్, నిబిడ=దట్టమైన, నిష్కుట = ఉపవనములయొక్క, విటపి = వృక్షములయొక్క, ఘాటంబులన్ = సమూహములందు, ప్రతిశబ్దంబులు = ప్రతిధ్వనులు, పుట్టింపన్ = ఇయ్యఁగా, ఇట్లు= ఇత్తెఱంగున అనూనవిభవంబు = మహావైభవము, చిగురొత్తన్ = అంకురింపఁగా, ఆ త్తిరువలి = ఆ శ్రీవిల్లిబుత్తూరు, చొచ్చి = ప్రవేశించి. అచ్చక్రధరు = ఆ శ్రీమహావిష్ణుని యొక్క. నగరిన్ = దివ్యమందిరముయొక్క, మోసలన్ = ముఖశాలయందు, నిలుచుటయున్ = ఉండఁగా, అ విష్ణుచిత్తుండు = ఆ పెరియాళువారు తద్రథావతరణంబు జేసి = ఆ బ్రహ్మరథమునుడిగ్గి, ధరణీధవసమూహస్థానిక వ్యూహంబులు, ధరణీధవ=రాజులయొక్క, సమూహ = సంఘమును, స్థానిక = దేవస్థానాధికారులయొక్క, వ్యూహంబులు=సమూహమును, వెంటరాన్ = వెంబడించి రాఁగా,] అవ్వైష్ణవకుండు సేవించి = ఆ స్వామిని దర్శనముచేసి, తత్ప్రసాదలబ్ధంబగు=ఆ పుండరీకాక్షుని యనుగ్రహమువలనఁ బొందఁబడ్డదైన (ప్రసాదస్తు ప్రసన్నతా యని యమరము)పరివట్టంబునన్ = తిరుపరివట్టంబుచేతను, అలంకృతుండై =భూషితుండై, నానాలంకారసహితంబును. నానా లంకార =అనేక విధములగు ప్రసాధనములతోడను, సహితంబును=కూడికొనినదియును, రత్న=మణులయొక్కయు. కాంచన = బంగారముయొక్కయు. మయంబునునగు = వికారమునైన,ఆత్మీయభవనంబుఁగాంచి=స్వీయగృహమునుజూచి,విస్మితుండై =ఆశ్చర్యము నొందినవాఁడై, పుండరీకాక్ష=శ్రీమహావిష్ణునియొక్క, మహిమ=ప్రభావముచేతను, అభిలబ్ధ=పొందఁబడిన, వైభవంబుగా=ప్రాభవముగాను, తెలిసి=ఎఱింగి, తత్రత్య=అచ్చటనున్న, ధాత్రీకళత్ర=రాజులయొక్క, వర్గంబులన్=సమూహములను,అనిపి=పంపి ప్రవేశించి = గృహప్రవేశమొనరించి, తొంటికంటెన్ = మునుపటికంటెను, శతగుణంబుగా = నూఱంతలధికముగ, భాగవతపూజాప్రవణుండై, భాగవత = విష్ణుభక్తులయొక్క, పూజా = సపర్యయందు, ప్రవణుండై = ఆసక్తిగలవాఁడై, ఉండెన్ = ఉండెను. అంతన్ = తరువాతను.

తా. శ్రీవిల్లిబుత్తూరిలోనుండు దేవస్థానమందలి యధికారులు నృత్తగీత వాద్యములతోడ నా విష్ణుచిత్తునెదుర్కొని నమస్కరించి యాతనిం దమరు తెచ్చిన స్వర్ణమయంబైన బ్రహ్మరథమునం దునిచికొనిపోవుతఱి మహావైభవంబులతో నందఱు వెంటనంటి రాఁగా నా విష్ణుచిత్తుండు పురము ప్రవేశించి కోవెలముందర బ్రహ్మరథంబుడిగ్గి యచ్యుతుని సేవించి యాదేవుని యనుగ్రహంబున లబ్ధంబైన కాంచననిర్మితంబగు తనగృహము ప్రవేశించి తొల్లింటికంటె నధికంబుగ భాగవతపూజాపరాయణుండై యుండెనని భావము.

మ. ఉలుపా ల్పట్టినయిండ్ల మజ్జనన్నపా ♦ ర్థోదారభుక్తిక్రియా,
జ్వలులై రే హరికొల్వునన్ విబుధు ♦ స్వస్వర్థిసుభ్రూభ్రమం,

పల్లించిన = అయితపఱిచి... ...పుచ్చి మణివా ♦ సోభూషణగ్రామము,
ను = ఇడుగవగరును, ...స్సమర్పణము ని ♦ ష్ఠం జేసి యవ్వేఁకువఁ. 3౽
పూసిన = లేపనము...
చేలలె = తై... ...లుపాల్పట్టిన = కానుకలుదెచ్చిన ఇండ్లఁ = వారిగృహములయందు, ...అభ్యంగనాదులచేతను, నృపార్హ = రాజయోగ్యమైన భుక్తిక్రియా = భోజనవ్యాపారములచేతను, ఉజ్జ్వలులై = వెలుఁగుచున్నవారలై, రే = రాత్రియందు, హరికోల్వనఁ = భగవత్సన్నిధానమందు, వివిధలాస్యస్పర్థి, వివిధ = పలుదెఱంగులైన. లాస్య = నాట్యములయందు, (లాస్యంనృత్తంచనర్తనమని యమరము) స్పర్థి = వివాదపడుచున్న. సుభ్రూ = స్త్రీలయొక్కయు, భ్రుకుంసులు = నర్తకులయొక్కయు, (భ్రకుంసశ్చ భ్రుకుంసశ్చభ్రూం కుంసశ్చేతి నర్తకయని యమరము.) వాదులు = వివాదములను, సరిదీర్చి = సరిపుచ్చి, (సమ్మతిపఱచియనుట) పుచ్చి = అంపి, (ఇచ్చి యను పాఠమున వారికి బహుమతులిచ్చి యని యర్థము.) మణివాసోభూషణగ్రామముల్. మణి = రత్నములును, వాసః = వస్త్రములును, భూషణ = ఆభరణములును. గ్రామముల్ = ఊళ్లును, జలజాతాక్షునకుఁ = పుండరీకాక్షునకు నిష్ఠఁ = భక్తిచేతను, సమర్పణముఁజేసి = సమర్పించి, అవ్వేఁకువఁ = ఆ తెల్లవాఱఁగట్లను.

తా. అప్పుడా విష్ణుచిత్తుననుసరించి వచ్చియున్న పుడమిఱేండ్లు తమకుఁగానుకలుదెచ్చియిచ్చియున్న వారిగృహములయందు నభ్యంగస్నానములును రాజయోగ్యంబులయిన భోజనకృత్యంబులం దీర్చికొని రాత్రియందు భగవత్కైంకర్యానక్తచిత్తులై యాదేవమందిరముల కరుగుదెంచి యందనేక విధనాట్యములయందు వాదులిడుచున్న నర్తకీనర్తకులవాదములుదీర్చి పుత్తెంచి యప్పుండరీకాక్షునకు నతిభక్తితోడం బ్రత్నరత్నభూషణాంబర గ్రామావళులొసంగి తెల్లవాఱఁగా ననుట.

తే. గీ. ప్రభువు లరిగిరి క్రమ్మఱఁ ♦ బాండ్యనగరి, కమ్మునియు నట్లు వైష్ణవా ♦ భ్యర్చనంబుఁ
దనచిరంతనతులసికా ♦ దామకరణ, దాస్యమును జేసికొనుచుఁద ♦ త్పరత నుండె.

టీక. క్రమ్మఱఁ = తిరిగియును, ప్రభువులు — అధికారులు. పాండ్యనగరికిఁ = మధురకు, అరిగిరి = వెళ్లిరి. అమ్మునియుఁ = ఆ విష్ణుచిత్తుఁడును, అట్లు = పూర్వప్రకారము, వైష్ణవాభ్యర్చనంబుఁ = భాగవతారాధనమును, తన = తనయొక్క, చిరంతన = బహుకాలమునుండి యొప్పియున్న, తులసికాదామ = తులసీమాలికలయొక్క, కరణ = చేయుటయను, దాస్యమును = కైంకర్యమును, చేసికొనుచు = సలుపుకొనుచు. తత్పరతఁ = భగవద్దాసక్తిచేతను. (తత్పరేప్రసితాసక్తాయని యమరము) ఉండెఁ = ఈలాగునుండెను.

తా. అప్పుడా ప్రభువులు మధురాపురంబునకు మగల సేతెంచిరి పిమ్మట మునివరుండైన యావిష్ణుచిత్తుండు మునుపటి యట్ల తాను భాగవతారాధనమును, చిరకాలాను

ష్ఠితంబై యున్న తులసీమాలాకరణరూపంబగు భగవత్కైంకర్యమును జేసికొనుచు నా దేవుని యందాసక్తిగలవాఁడై యుండెనని తాత్పర్యము.

వ. ఒక్కనాఁడు మధ్యాహ్నసమయమాలికారోపణానంతరంబున మందిరంబున కుం బోవునతనిం బ్రసాదమందస్మితవళక్షం బగుకటాక్షంబున వీక్షించి పక్షిపుంగవ కేతనుండు పుండరీకనికేతన కిట్లనియె. ౩౮

టీక. ఒక్కనాఁడు = ఒకదినము, మధ్యాహ్నసమయ = మధ్యాహ్నకాలమందు. (ని. సమయాశ్శపథాచార కాలసిద్ధాంతసంవిదయని యమరము) మాలికారోపణానంతరంబున = పుష్పమాలసమర్పణముఁజేసిన పిదప, మందిరంబునకుం బోవు = తనగృహమునకు వెళ్లుచున్న, అతనిన్ = ఆ విష్ణుచిత్తుని, ప్రసాదమందస్మితవళక్షంబగు, ప్రసాద = అనుగ్రహముచేతనైన, మందస్మిత = చిఱునవ్వుచేతను, వళక్షంబగు = తెల్లనైన, (ని. వళక్షోధవళోర్జునయని యమరము). కటాక్షంబునన్ = అపాంగదర్శనముచేతను, వీక్షించి = చూచి, పక్షిపుంగవకేతనుండు = గరుడధ్వజుండు, (భగవంతుఁడనుట) పుండరీకనికేతనకున్ = లక్ష్మితోన్, ఇట్లు = వక్ష్యమాణక్రమంబున, అనియెన్ = పలికెను.

తా. ఒక్కనాఁ డావిష్ణుచిత్తుండు మధ్యాహ్నకాలమున నిత్యము తాను బుష్పమాలికను స్వామికి నొసంగురీతిని సమర్పించి తనయింటికి వెళ్లుచుండఁగా నప్పుడప్పక్షిపుంగవకేతనుండైన విష్ణుదేవుండతనిం దన కరుణాకటాక్షమునకుఁ బాత్రుంజేసి యా పద్మనికేతనయగు లక్ష్మీదేవితో నిట్లని వచించెనని తాత్పర్యము.

తే. గీ. యామునాచార్యుఁడొక్కఁడు♦నీమహాత్ముఁ, డొక్కఁడును గాదె మన్మతం♦బుద్ధరించి
రస్మదీయకృపాతిశ♦యమున ననిన, నిందిరాదేవి తనభర్త♦ కిట్లు లనియె. ౩౯

టీ. యామునాచార్యుఁడొక్కఁడు = యామునాచార్యుఁడొక్కండును, ఈ మహాత్ముఁడొక్కఁడును = ఈవిష్ణుచిత్తుఁడొకఁడును, కారె = వీరలిరువురుగదా, మన్మతంబు = శ్రీవైష్ణవసిద్ధాంతమును, ఉద్ధరించిరి = నిర్వహించిరి, అస్మదీయ = నా సంబంధియైన, కృపాతిశయమునన్ = దయాధిక్యముచేతను, అనినన్ = ఇట్లనఁగాన్, ఇందిరాదేవి = లక్ష్మీదేవి, (ని. ఇందిరాలోకమాతామా యని యమరము.) తనభర్తకున్ = తనకుభర్తయైన శ్రీమహావిష్ణువునకు. ఇట్టులనియె = వక్ష్యమాణ క్రమంబున వచించెను.

తా. యామునాచార్యుండును నీ విష్ణుచిత్తుండును వీరిరువురె కదా నా కృపకుం బాత్రులై వైష్ణవసిద్ధాంతంబు ద్ధరించిరనఁగా విని యా లక్ష్మీదేవి తనభర్తయైన శ్రీవిష్ణుదేవునితో నిట్లనియె ననుట.

క. ఇతనికథ యెఱిఁగినది కా, యతఁ డేమి యొనర్చె ననిన ♦ నబ్జాక్షుం డా,
శతపత్రనిలయ కిట్లను, నతివ కలం డొకఁడు మత్ప ♦ దాశ్రితుఁ డాదిన్. ౪౦.

టీ. ఇతని = ఈవిష్ణుచిత్తునియొక్క, కథ = చరిత్రము, ఎఱిఁగినదికా = తెలియఁబడినదిగదా, అతఁడు = ఆయామునాచార్యుఁడు, ఏమియొనర్చెన్ = ఏమి చేసెను, అనినన్ = ఇట్లుమందలింపఁగా, అబ్జాక్షుండు = పుండరీకాక్షుఁడు, ఆశ తపత్రనిలయకున్ = ఆ యిందిరాదేవికి, ఇట్లనున్ = ఈలాగునఁబలికెను, అతివ = ఓ లక్ష్మీ, ఆదిన్ = తొలుదొల్తను, మత్పదాశ్రితుఁడు, మత్పద = నాచరణముల ను, ఆశ్రితుఁడు = ఆశ్రయించినవాఁడు, ఒకఁడు=ఒక్కఁడు, కలండు=ఉండెను.

తా. ఈ విష్ణుచిత్తుని చరిత్రంబెల్లఁ దెలియంబడియున్నదిగాని యయ్యామునాచా ర్యుండేమియొనరించెనో తెలియఁబడదుగాన వివరించి తెలుపుమనపుఁ డప్పు డప్పుండరీ కాక్షుండా యబ్జాలయతోనోయింతి యింతకుమున్ను మదీయచరణారవిందమరంద పాన ప్రముదిత హృదయుండైయొక్కరుం డుండెననియానతిచ్చెననుట.

ఆ, వె. అతఁడు చిఱుతనాఁడె ♦ యాచార్యకులమున,
వేడ్క వేదశాస్త్ర ♦ విద్య లభ్య,
సించు చుండ నపుడు ♦ చెలువ యిప్పటిపాండ్య,
నృపతిపూర్వవంశ్యుఁ ♦ డే యొకండు. ౪౧.

టీ. అతఁడు = ఆ యామునాచార్యుఁడు, చిఱుతనాఁడె = పిన్నవయస్సుననే, ఆచార్యకులమునన్ = గురుని గృహమందు, (ని. సహావాసః కులం క్షితియని యమరకోశ మము). వేదశాస్త్ర = శ్రుతులు – శ్రుతములుమొదలగు, విద్యలన్ = కళలను, అభ్య సించుచుండన్ = నేర్చుకొనుచుండఁగా, (అనఁగాఁ జదువులుచదువఁగా ననుట) చె లువ = ఓలక్ష్మీదేవి, అపుడు = ఆ కాలమందు, ఇప్పటి పాండ్యనృపతి పూర్వవం శ్యుఁడే = ఈ పాండ్యరాజువంశమునఁ బూర్వము జనించినవాఁడే, ఒకండు=ఒకరాజు

తా. అట్లుండిన యామునాచార్యుండు బాల్యమందెగురు కులవాస మొనరించు చు వేదశాస్త్రాది నిఖిలవిద్యలు గఱచుచుండు నవసరంబున నిప్పటి పాండ్యరాజుయొక్క ంశజుఁడగు పూర్వపు రాజులలో నొక్కరుఁడుండెననుట. ఇక్కడ యామునాచా ర్యనికంటె విష్ణుచిత్తుడుపూర్వుఁడైన నుయామునాచార్యుఁడు పూర్వుఁడని భగవంతుఁడు ప్పుటవలన లోకసంరక్షణార్థము భగవదవతారము లెట్లు పలుమాఱుకలుగునో యట్లే ాగవతావతారములని యెఱుఁగునది.

తే. గీ. వెట్టిశైవంబు ముదిరి మ ♦ ద్భనుతి వినఁడు,
నతి యొనర్పఁడు మామక ♦ ప్రతిమలకును,

హరుఁడె పరతత్త్వ మనుమదీ ◆ యాలయముల,
నుత్సవంబుల కులుకు నై ◆ య్యురును నట్ల. ౪౨

టీ. వెఱ్ఱి = చిత్తభ్రమరూపమైన, శైవంబు = శివభక్తి, ముదిరి = అతిశయించి, మద్వినుతివినఁడుకా నా స్తోత్రముల నాలకింపఁడు. (అనగా జెవులబెట్టడనుట) మామకప్రతిమలకును, నా సంబంధులయిన విగ్రహములకును, నతియొనర్పఁడు = నమస్కరింపఁడు, హరుఁడె = శివుఁడె, పరతత్త్వమనుకా = పరబ్రహ్మమనును, మదీయాలయములకా = విష్ణుమందిరములయందలి, ఉత్సవములకుకా = తిరుణాళ్లకును, ఉలుకుకా = అదరిపడును, నెయ్యురును = అతని స్నేహితులును, అట్ల = ఆ రాజువలెనె, (ఉలుకు దురనుట).

తా. ఆ రాజునకు వెఱ్ఱిశైవము ముదిరి విష్ణుస్తవములు చెవియందు బెట్టక విష్ణువిగ్రహములకు నమస్కరింపక విష్ణుమందిరములయందు జరిగింపంబడు నుత్సవాదుల కసహ్యపడుచు శివుఁడె పరబ్రహ్మమని తాను తనస్నేహితులతోఁగూడ నిర్విఘ్నంబుగ నుండెనని భావము.

సీ. అశ్రాంత జంగమా ◆ ర్చా శ్రద్ధ వర్తిలు, వేదవిద్ద్విజపూజ ◆ వీటఁ గలపు,
భౌమవారపు వీర ◆ భద్ర పళ్లెర మిడు, గృహదైవతంబు లి ◆ ట్రింకు లింక,
షణ్ణవతిశ్రాద్ధ ◆ చయ మారఁ బెట్టు శం, కరదాస మయ్య భ ◆ క్తవ్రతతికి,
నాద్యంబు లైనదే ◆ వాలయంబులు వ్రాల, నవని నిరాశ మ ◆ ఠాళి నిలుపుఁ
జందె ముత్తరశైవంబుఁ ◆ జెన్ది త్రెంచుఁ, బలితు లారాధ్యదేవుల్లె ◆ ప్రాపు లనుచు,
నుపనిషత్తులు వారిచే ◆ నుబ్బివినును, వెండియే జంగ మెత్తిన ◆ వెలఁగుపడును. ౪౩.

టీ. అశ్రాంతజంగమార్చాశ్రద్ధకా, అశ్రాంత = ఎడతెగని, జంగమార్చా = జంగములపూజయందు, శ్రద్ధకా = ఆసక్తిచేతను, (అత్యంతజంగమార్చా శ్రద్ధననియునుబాఠముగలదు) వర్తిలుకా = ప్రవర్తించును, వేదవిద్ద్విజపూజకా, వేదవిత్ = వేదార్థమెఱింగిన, ద్విజ = బ్రాహ్మణులయొక్క, పూజకా = సపర్యమును, వీటఁగలపుకా = వ్యర్థముగునట్లుచేయును, భౌమవారపు = అంగారకవారసంబంధియైన, వీరభద్రపళ్ళెరము = వీరభద్రపళ్ళెరమను గణార్చనను, ఇడుకా = ఒనర్చును, గృహదైవతంబులు = ఇలువేల్పులు, ఇట్రింకులింకకా = మిక్కిలి యుంకిపోఁగా, బెదిరిముడిగియుండఁగా నని కొందఱు = ఆ పక్షమున సట్రింకులనఁగా జింకలు భయమునొంది దూరముగ వెళ్లుటకు యత్నించుసమయమున బెదరి ముడిగియుండు నవస్థావిశేషము (షణ్ణవతి శ్రాద్ధచయము = తొంబదియాఱుతిథులు) "శ్లో. అమాయుగమను క్రాంతిధృతిపాతమహాలయాః । త్రిస్రోష్టకాశ్చ విజ్ఞేయాః షణ్ణవత్యః ప్రకీర్తితాః॥" ఆరకా = నశింపఁగా, శంకరదాసదుయ్య = శంకరదా

స్వముగల యయ్యలనియెడు, భక్తప్రతతికిఁ = సేవక సమూహములకు, బెట్టుఁ = ఇడును, ఆద్యంబులైన = పురాతనములగు, దేవాలయంబులు = కోవెలలు, ప్రాలఁ = పడిపోఁగా, అవనిఁ = భూమియందు, నిరాశ = జంగములకు, మఠాళి = సన్యాసులు మొదలగు వారుండుగృహసమూహములు, నిలుపుఁ = కట్టించును, (జంగమపీఠస్థలకు స్థిరంతులనియు = మఱియువారలకేచరంతులనియు, లింగధారులయొక్క గురువులకు నయ్యలనియును వారిలో వ్యవహారము గనుక స్థిరాళిమఠాళియను పాఠమున స్థిరంతులమఠములనని యర్థము) జంజెము = యజ్ఞోపవీతమును, ఉత్తరశైవంబుఁ = పిమ్మటవచ్చిన శైవంబును, చెంది = అంగీకరించి, త్రెంచుఁ = త్రెంచివైచును, పతితులు = వేదబాహ్యులైన, ఆరాధ్యదేవుళ్ళే = ఆరాధ్యదైవతములె (అనఁగా లింగధారులనుట) ప్రాప్యులనుచుఁ = పొందఁదగిన వారనుచును, ఉపనిషత్తులు = కాలాగ్ని రుద్రాద్యుపనిషత్తులను, వారిచేఁ = ఆ యారాధ్యులచేతను, ఉబ్బి = సంతోషించి, వినుచుఁ = ఆలకించివినుచును, వెండి = మఱియును. ఏ జంగము = ఏ జంగమదేవరైనను, ఎత్తినఁ = ప్రశంసచేసినను, వెఱఁగుపడు = ఆశ్చర్యపడును.

తా. అనఁగా మఱియు నప్పాండ్యరాజు వైదికంబులగు కర్మములమానిజంగాల సేవించుచు వారు చెప్పు శైవశాస్త్రములనె యాదరించుచుండెనని ముఖ్యతాత్పర్యము.

క. శివలింగముఁ ♦ దాల్చినజన, నివహము లేమైనఁ జేయ ♦ నిది పాపము దా,
నవుఁగా దనఁ ♦ డానమయము, నవు ననువిప్రులక యగ్ర ♦ హారము లిచ్చుఁ. ౪౪

టీ. శివలింగముఁదాల్చిన = శివలింగము గట్టికొనిన, జననివహములు = నరసమూహములు, యేమైనఁజేయుఁ = ఏపనిచేసినను, తాఁ = తాను, ఇది = ఇట్లొనర్చుట, పాపము = దురితమని, అవుఁగాదనఁడు = యుక్తమయుక్తమనిచెప్పఁడు, ఆ సమయముఁ = ఆయాచారమును. (ని. సమయాశ్శపథాచారకాలసిద్ధాంతసంవిదయని యమరము.) అవునను విప్రులక = యుక్తమని చెప్పుచున్న పుడమివేలుపులకే. అగ్రహారములిచ్చుఁ = గ్రామములనొసంగును.

తా. మఱియు నారాజు లింగధారులగు జనంబు లెటువంటి దుష్కృత్యములొనర్చినను విచారింపక యుండుటయకాక యాశైవాచారముయుక్తమని తన యభిప్రాయమును ననుసరించి పలుకుచుండు బ్రాహ్మణుల కగ్రహారాదుల నిచ్చుచుండెననుట.

తే. గీ. అతఁడు రాజ్యంబుఁ బాలించు ♦ నవసరమునఁ, దనవశం బైనయట్టియ ♦ త్తామ్రపర్ణిఁ,
గలుగు నలపుట్టరానిము ♦ క్తామణివర, కులము మాహేశ్వరులకంధ ♦ కలకుఁదీరె.

టీ. అతఁడు = అప్పాండ్యరాజు, రాజ్యంబుఁ = దేశమును, పాలించు = ఏలుచున్న, అవసరమునఁ = కాలమందు, తనవశంబైనయట్టి = తనయధీనమైన,

అత్తామ్రపర్ణిన్ = ఆతామ్రపర్ణియనునదియందు, కలుగు = జనించుచున్న, అల = ప్రసిద్ధమైన, పుట్టరాని = అపూర్వకములైన, ముక్తామణివర = శ్రేష్ఠంబులగుముత్తియములయొక్క, కులంబు = రాశి, మాహేశ్వరుల=లింగధారులయొక్క, కంధరలకున్ = మెడలకు, తీరెన్ = సరిపోయెను, (కంథలకును దీరెననుపాఠమున బొంతలకుసరిపోయెనని యర్థము.)

తా. ఆ రాజు రాజ్యపాలనంబొనర్చు తఱిఁదనదేశమందున్న తామ్రపర్ణి యనునదియం దుద్భవించి యమూల్యంబులై చెలంగుచున్న ముత్తియపుఁరాసు లాలింగధారులయొక్క మెడలకుఁ జాలవయ్యెననుట.

తే, గీ. అప్పు డిచ్చకు లగుబ్రాహ్మ ♦ ణౌఘమెల్ల, నాత్మజనిభూమి విడువ లే ♦ కలికభూతి
గడ్డముల నాన రుదురాక♦లిడ్డ సంది, సూతసంహిత లిఱికించి♦చొరఁ దొడఁగిరి.

టీ. అప్పుడు = ఆకాలమందు, ఇచ్చకులగు = ఇచ్ఛానువర్తులైన, బ్రాహ్మణౌఘమెల్లను = విప్రులందఱును, ఆత్మ = తమయొక్క, జనిభూమిన్ = జన్మభూమిని,విడువలేక = త్యజింపఁజాలక, అలికభూతి, అలిక = ముఖమండలి, భూతి = భస్మము, గడ్డములన్ = చుబుకప్రదేశములయందు, ఆనన్ = నిండఁగా, రుదురాకలిడ్డ = రుద్రాక్షలుకట్టికొనిన. (రుదురాకశబ్దము రుద్రాక్షశబ్దభవము) సందిన్ = సందిటియందు, సూతసంహితలు = సూత సంహితయను గ్రంథములను, ఇఱికించికొని = ఉనిచికొని, చొరఁ దొడఁగిరి = ప్రవేశింపనారంభించిరి. (ని. జనిరుత్పత్తిరుద్భవయనియు = భూతిర్భస్మనిసంపదియనియు నమరము.)

తా. అపుడు జన్మభూమియం దపేక్షగల కొందఱు బ్రాహ్మణులా రాజుయొక్క యిచ్ఛానువర్తనముగలవారలై తమముఖములయందు గడ్డములవఱకు వ్యాపించునట్లు విభూతిఁబూసి రుద్రాక్షలు ధరించికొని వాని సందున సూతసంహితయను గ్రంథమునిఱికించికొని యెదుటికి రాసాగిరని తాత్పర్యము.

క. శీలముఁ బట్టియు గంజా, హాల లుపాంశునభుజించు ♦ నధముల బైటం,
జాలఁడు వైవం విప్ర, స్థాలిత్యము బైట వేసి ♦ కనుగిఱుపు సభన్. ౪౭.

టీ. శీలమున్ = జంగమదీక్షను, పట్టియున్ = పూనియును, గంజాహాలలు. గంజా = గంజాయిని, హాలలు = మద్యమును, ఉపాంశునన్ = రహస్యమందు, భుజించు = సేవించుచున్న, అధములన్ = నీచులను, బైటవైవన్ = బయలుఁబెట్టుటకు, చాలఁడు = శక్తుఁడుగాఁడగును, విప్రస్థాలిత్యమున్, విప్ర = బ్రాహ్మణులయొక్క, స్థాలిత్యమున్ = తప్పితమును. బైటవేసి = ప్రకటనచేసి. సభన్ = కొలువుకూటమందు,

కనుగిఱపున్ = హేళనముచేయుమని సభ్యులంజూచి కనుసంజ్ఞఁజేయును. (ని. సు రాహాలిప్రియాహాలాయనియు, రహశ్శ్చొపాంశు చాలింగయనియు నమరము).

తా. శైవదీక్షవహించియు రహస్యముగ గంజాయిఁదిని మద్యపానముఁ జేయు చున్నట్టి భ్రష్టులనుబట్టి విచారించి శిక్షింపఁడు గాని బ్రాహ్మణులకుఁ బ్రమాదముచేత సంభవించిన కొంచెపుతప్పితములను సభయందు బయలుపఱిచి సభికులంజూచి హేళనముచేసి యాక్షేపింపుఁడని కనుసంజ్ఞఁజేయుచుండునని తాత్పర్యము.

క. ఆరాజుమహిషి ♦ నియతి మ. దారాధనపరత నుండు ♦ నట్లుండియు దు,
ర్వారవ్యథకుం ♦ గానదు, సారము విభుఁ డస్మదంఘ్రి ♦ భక్తుఁడు గామిన్. ౪౫.

టీ. ఆ రాజుమహిషి = ఆ పుడమిఱేనిపట్టపురాణి, నియతిన్ = భాగ్యముచేతను, మదారాధనపరతన్, మత్ = నాయొక్క, ఆరాధన = పూజనమందు, పరతన్ = ఆసక్తిచేత, ఉండున్ = వర్తించును, అట్లుండియున్ = మద్భక్తురాలైయుండియును, విభుఁడు = ప్రియుఁడు, అస్మదంఘ్రిభక్తుఁడుగామిన్, అస్మత్ = నాయొక్క, అంఘ్రి = పాదములయందు, భక్తుఁడుగామిన్ = భక్తిలేనివాఁడగుటంజేసి, దుర్వారవ్యథకున్ = మితిలేని మనోదుఃఖమునకు, పారమున్ = తుదను, కానదు = చెందదు.

తా. ఆ రాజుయొక్క భార్య మాత్రముదనసుకృతమువల్ల నాసపర్యయందనురక్తి గలదిగాయుండియుఁ దనమగండు నాకు భక్తుఁడుగాకయుండుటంజేసి తాన పారంబగు దుఃఖసముద్రంబున మునింగియుండు ననిభావము.

వ. మఱియు నప్పురంధ్రీరత్నంబు. ౪౬.

టీ. మఱియున్ = ఇంకను, అప్పురంధ్రీరత్నంబు, పురంధ్రీ = సచ్చరిత్రగలవనితలలోపల, రత్నంబు = శ్రేష్ఠురాలైనయాపట్టపుదేవి.

తా. సుగమము.

సీ. వింగడం బైనట్టి ♦ ముంగిట నెలకొన్న, బృందావనికి ముగ్గు ♦ బెట్టుదాన,
దశమినాఁడేకభ ♦ క్తముఁ జేసి యవలినాఁ, డోర్చి జాగరముతో ♦ నుండు నిట్లు,
పారసి పోసీరు♦పై నిద్రఁ బాయుట, కృలు పాడుమత్పుణ్యా♦కథలఁ ద్రోయు,
నేమంపుసూనాళు♦కామింప దధినాథు, మఱునాఁడు కన్నును♦మనసు దనియ,
నారజపువన్నెఁ బ్రతిసెజ్జ♦కరుగుఁ గూర్మి, నరుగుచో నాథిఁ దుడిచి క♦ప్పురపునాభి
బెట్టు నిట్టులు మద్భక్తి♦పుట్టియును ని, జేశు నెడ భక్తి చెడదు మ♦దిష్టముగుట. ౪౭.

టీ. వింగడంబైనట్టి = విరళముగనున్నయట్టి, ముంగిటన్ = ముంగిలియందు, నెలకొన్న = పొదుకొనియున్న, బృందావనికిన్ = తులసీవనమునకు, తాన = తానై,

కనుగిఱపుఁన్ = హేళనముచేయుమని సభ్యులంజూచి కనుసంజ్ఞఁజేయును. (ని. "సు రాహలిప్రియాహాలాయనియు, రహశ్చ్యోపాంశు చాలింగయనియు నమరము).

తా. శైవదీక్షవహించియు రహస్యముగ గంజాయిందిని మద్యపానముఁ జేయుచున్నట్టి భ్రష్టులనుబట్టి విచారించి శిక్షింపఁడు గాని బ్రాహ్మణులకుఁ బ్రమాదముచేత సంభవించిన కొంచెపుతప్పితములను సభయందు బయలుపఱిచి సభికులంజూచి హేళనముచేసి యాక్షేపింపుఁడని కనుసంజ్ఞఁజేయుచుండునని తాత్పర్యము.

క. ఆరాజుమహిషి ♦ నియతి మ. దారాధనపరత నుండు ♦ నట్లుండియు దు,
ర్వారవ్యథకుం ♦ గానదు, సారము విభుఁ డస్మదంఘ్రి ♦ భక్తుఁడు గామిన్. ౪౮.

టీ. ఆ రాజుమహిషి = ఆ పుడమిఱేనిపట్టపురాణి, నియతిన్ = భాగ్యముచేతను, మదారాధనపరతన్, మత్ = నాయొక్క, ఆరాధన = పూజనమందు, పరతన్ = ఆసక్తిచేత, ఉండున్ = వర్తించును, అట్లుండియున్ = మద్భక్తురాలై యుండియును, విభుఁడు = ప్రియుఁడు, అస్మదంఘ్రిభక్తుఁడుగామిన్, అస్మత్ = నాయొక్క, అంఘ్రి = పాదములయందు, భక్తుఁడుగామిన్ = భక్తిలేనివాఁడగుటంజేసి, దుర్వారవ్యథకున్ = మితిలేని మనోదుఃఖమునకు, పారమున్ = తుదను, కానదు = చెందదు.

తా. ఆ రాజుయొక్క భార్య మాత్రముదనసుకృతమువల్ల నాసపర్యయందనురక్తి గలదియై యుండియుఁ దనమగండు నాకు భక్తుఁడుగాక యుండుటంజేసి తాన పారంబగు దుఃఖసముద్రంబున మునింగియుండు ననిభావము.

వ. మఱియు నప్పురంధ్రీరత్నంబు. ౪౯.

టీ. మఱియున్ = ఇంకను, అప్పురంధ్రీరత్నంబు, పురంధ్రీ = సచ్చరిత్రగలవనితలలోపల, రత్నంబు = శ్రేష్ఠమైనయాపట్టపుదేవి.

తా. సుగమము.

సీ. వింగడంబైనట్టి ♦ ముంగిట నెలకొన్న, బృందావనికి ముగ్గు ♦ బెట్టుదాన,
దశమినాఁడేకభ ♦ క్తముఁ జేసి యవలినాఁ, డోర్చి జాగరముతో ♦ నుండు నిద్రు,
పారసి పోసీకు ♦ పై నిద్రఁ బాయుట, కప్పలు వాడుమత్పు ణ్యా ♦ కథలఁ ద్రోయు,
నేమంపుకూనాకు ♦ కామింప దధినాథు, మఱునాఁడు కన్నును ♦ మనసు దనియ,
నారజపువన్నెఁ బ్రతిసెజ్జ ♦ కరుగుఁ గూర్మి, నరుగుచో నాథిఁ దుడిచి క ♦ ప్పురపునాభి
బెట్టు నిట్టులు మద్భక్తి ♦ పుట్టియును ని, జేశునెడ భక్తి చెడదు మ ♦ దిష్టమగుట. ౫౦.

టీ. వింగడంబైనట్టి = విరళముగనున్నయట్టి, ముంగిటన్ = ముంగిలియందు, నెలకొన్న = పొదుకొనియున్న, బృందావనికిన్ = తులసీవనమునకు, తాన = తానై,

క. వనజజరు ♦ ద్రాదులు మ, త్తనువుల తత్పూజనంబు ♦ తథ్యము మత్పూ,
జనమ తదీప్సిత ♦ ఫలదా, తను నే నల్లైనఁ గలవు ♦ తరతమవృత్తుల్. ౫౧.

టీ. వనజజరుద్రాదులు = బ్రహ్మయు రుద్రుఁడు మొదలగువారు, మత్తనువుల = నాశరీరములే, తత్పూజనంబు, తత్ = వారలయొక్క. పూజనంబు = అర్చించుట. మత్పూజనమ = నన్నుఁ గూర్చియొనర్చినపూజయే, తథ్యము = యథార్థము, తత్ = ఆ ట్లాబ్రహ్మరుద్రాదులను బూజించువారలయొక్క, ఈప్సితఫల = ఇష్టసిద్ధులకు, దాతను ఇచ్చువాఁడను, నేన = నేనే, అల్లైనన్ = అలాగైనప్పటికిని, తరతమవృత్తుల్ = హెచ్చుతగ్గులు, కలవు = కలిగియుండును.

తా. ఈశానుఁడు బ్రహ్మయు లోనగువారంతయును నా శరీరంబులగుటంజేసి వారల నారాధించినయెడ యథార్థముగ నన్నారాధించినట్లు సంతసించి యట్లొనర్చినమనుజులకు నభీష్టార్థముల నిచ్చువాఁడను నేనయైనను నాకును వారలకును దారతమ్యము గలదనియెనుట.

క. కేవలశరీర ♦ దృష్టిన, దేవతల న్వేఱ కలుగఁ ♦ దెలిసినజడుల
న్నావాసు ♦ దేవతాస్థితి, భావింపనిపూజ సాంత ♦ ఫలమై త్రిప్పున్. ౫౨.

టీ. కేవలశరీరదృష్టిన = కేవల—ముఖ్యముగ, శరీర = ఇతరదేవతలశరీరముల యొక్క, దృష్టిన = చూచుట చేతనే, దేవతలన్ = అస్మచ్ఛరీరభూతులైన యితరదేవతలను, వేఱుకలుగన్ = ప్రత్యేకముగ నున్నట్లు, తెలిసిన = ఎఱింగిన, జడులన్ = అజ్ఞానులను, నా వాసుదేవతాస్థితి = నా—నా యొక్క వాసుదేవతా = వాసుదేవత్వముయొక్క, ("శ్లో. సర్వత్రాసౌ సమస్తంచ వసత్యత్రేతివై యతః। అతోస్యవాసుదేవేతివిద్వద్భిః పరిపఠ్యతే, అని విష్ణుపురాణము") స్థితిన్ = ఉంటను, భావింపని = తలంపని, పూజ = ఆరాధనము, సాంత = అంతముతోఁగూడిన, ఫలమై = ఫలముగలదై, త్రిప్పున్ = మళ్లించును.

తా. ముఖ్యముగ నితరదేవతలందఱు నా శరీరంబులే కాన నట్టిదేవతలు నాకు వేఱుగా నున్నవారనియుం బ్రత్యేకఫలప్రదులనియును దెలిసికొనియున్న యజ్ఞులను నా వాసుదేవత్వస్థితిని దెలియనిపూజ యల్పఫలప్రదాయకమై యనేక జననమరణరూపదుఃఖములం ద్రిప్పుచుండునని భావము.

వ. మఱియు నీరహస్యంబుఁ దెలియక బ్భాపతి తామసుండై మామకీనంబు లగు జనంబుల సామాన్యబుద్ధిం జూచుచుం దద్వృత్తుల కగునుపద్రవంబుల నుపేక్షించుచు రక్షావిముఖుండై యుండ వీక్షించి కలియుగంబునఁ ద్రవిడమండలంబునఁ గృతమాలాతాంబ్రప

ర్ణీతటంబుల మద్భక్తులు తఱచుగ నుంట నద్దేశంబున కొడయం డతం డగుటను రక్షణశిక్షణంబులు రాజముఖంబునం గాక నేన సాక్షాత్కరించి చేయమియుఁ దద్రక్షణేచ్ఛ యస్మదాభిముఖ్యంబునం గాని పొడమమియు నాయాభిముఖ్యంబు సంవాదంబునం గాని పుట్టమియు నే విచారించి తదాభిముఖ్యకరణార్థంబుగ నాస్థానం బెక్కి వాదిజయంబు సేయవలయు ననుతలం పవ్విప్రకుమారునకుం బుట్టింప నతం డేగి నానాదేశాగతదీనానాథవృద్ధభూసురకుటుంబంబులకు ధాన్యాజినపటాదులు వటువులకుం బెండ్లిండ్లు కనుపనీతుల కుపనయనంబులకుఁ బంగ్వంధబధిరాదులకు సౌరభేయాదియానంబులు మఱియుఁ జెఱువు గడమబడియె ననియుఁ బేదగుడులకుఁ బూజ నడువ దనియు నైడవునం జలిపందిరిడియెద మనియుఁ దిథి చిక్కె ననియుఁ దీర్థయాత్రఁ జనియెద మనియును వ్రతోద్యాపన కనియును వ్యాధి మాన్పుకో ననియును జెప్పి వంప నారాణివాసంబు గుప్తాగుప్తప్రకారంబులం బంపుద్రవ్యంబుఁ దెచ్చి యిచ్చునుదుసళ్ళగు వర్షధరులచేతులకుం గ్రందుకొని చే సాఁచి సందిటితోరణంబులై తోఁచు నేకదండిత్రిదండిబ్రహ్మచారులయున్నమితదండంబుల నిండారుకాషాయకద్రువస్త్రకౌపీనపరంపరలం గ్రమ్మి కావళ్ళపడగల జాడఁ గొని కేవలకార్పణ్యంబ విద్యగాఁ దక్కనవిద్య లెఱుంగక వేఁడునీదృగ్విధానేకప్రాణుల కాధారం బగు పడమటిద్వారంబుఁ జేరి ప్రతిదినాస్మత్పాదభజనకథాశ్రుతపూర్వ యగునాయుర్వీధవుదేవికాశీర్వచనాక్షతంబులు దౌవారికముఖంబునం బంపి వైదేశికుండ వైష్ణవవటుండ వాది గలిగిన విష్ణుతత్త్వంబె పరతత్త్వం బని వాదించి గెలిచెద వసుధావరుండు విష్ణుభక్తివిముఖుండు గావున వైష్ణవునిమనవి విన్నవింప నెవ్వరు వెఱతురు నీవు విష్ణుభక్తిపరాయణవు పతిహితాచారవుం గావున నీకు విన్నవించి పంపితి నీవిభుండు నీకు విధేయుండు విన్నవించి నన్ను రప్పించి వాదంబు సేయింప నోపుదేని వాదించి గెల్చి నీభర్తకు భగవద్భక్తి బుట్టించి కృతార్థుం గావించెద నని విన్నవింపం బంచిన

టీ. మఱియు నీరహస్యంబున్ = సర్వము నేననియెడి యేకాంతత్వమును, తెలియక = ఎఱుంగక, అబ్జాపతి = ఆరాజు, తామసుండై = తమోగుణముగలవాఁడై, మామకీనంబులగు = మద్భక్తులైన, జనంబులన్ = మనుజులను, సామాన్యబుద్ధిం జూచుచు = సాధారణజనులని తలంచుచు, తద్వృత్తులకున్, తత్ = ఆ భక్తులయొక్క, వృత్తులకున్ = మాన్యక్షేత్రాదులకు, అగు నుపద్రవంబులన్ = కలిగిన బాధలను, ఉపేక్షించుచు = నివర్తింపఁజేయక, రక్షావిముఖుండై = పాలించుటకుఁ బరాఙ్ముఖుండై, ఉండన్ = వర్తించుచుండఁగా, వీక్షించి = చూచి, కలియుగంబునన్ = కలికాలమందు, ద్రవిడమండలంబునన్ = అఱవదేశమునను, కృతమాలాతామ్రపర్ణీతటంబులన్, కృతమాలా = కృతమాలయను నదియొక్కయు, తామ్రపర్ణీ = తామ్రపర్ణియను నదియొక్కయు, తటంబులన్ = తీరములయందు, మద్భక్తులు = నాకుం దాసులైన భాగవతోత్తములు, తఱ

ర్ణీతటంబుల మద్భక్తులు తఱచగుటను దద్దేశంబున కొడయం డతండగుటను రక్షణశిక్షణంబులు రాజముఖంబునం గాక నేన సాక్షాత్కరించి చేయమియుఁ దద్రక్షణేచ్ఛ యస్మదాభిముఖ్యంబునం గాని పొడమమియు నాయాభిముఖ్యంబు సంవాదంబునం గాని పుట్టమియు నే విచారించి తదాభిముఖ్యకరణార్థంబుగ నాస్థానం బెక్కి వాదిజయంబు సేయవలయు ననుతలం పర్విప్రకుమారునకుం బుట్టింప నతం డేగి నానాదేశాగతదీనానాథవృద్ధభూసురకుటుంబంబులకు ధాన్యాజినపటాదులు వటువులకుం బెండ్లిండ్లు గనుపనీతుల కుపనయనంబులకుఁ బంగ్వంధబధిరాదులకు సౌరభేయాదియానంబులు మఱియుఁ జెఱువు గడమబడియె ననియుఁ బేదగుడులకుఁ బూజ నడువ దనియు నైదప్రసం జలిపంది రిడియెద మనియుఁ దిథి చిక్కె ననియుఁ దీర్థయాత్రఁ జనియెద మనియును వ్రతోద్యాపన కనియును వ్యాధి మాన్పుకో ననియును జెప్పి వంప నారాణివాసంబు గుప్తాగుప్తప్రకారంబులం బంపుద్రవ్యంబుఁ దెచ్చి యిచ్చునెడను భ్యగు వక్షధరులచేతులకుం గ్రందుకొని చే సాఁచి సందిటితోరణంబులై తోఁచు నేకదండిత్రిదండిబ్రహ్మచారులయున్న మితదండంబుల నిండారుకాషాయకద్రువస్త్ర కౌపీనపరంపరలం గ్రమ్మి కావళ్ళపడగలఁ బాఱఁ గొని శేవలకార్పణ్యంబ విద్యగాఁ దక్కినవిద్య లెఱుంగక వేఁడునిద్విగ్విధానేకప్రాంతంబుల కాధారం బగు పడమటిద్వారంబుఁ జేరి ప్రతిదినాస్మత్పాదభజనకథాశ్రుతపూర్వ యగు నాయుర్వ్వధవుదేవి కాశీర్వచనాక్షతంబులు దౌవారికముఖంబునం బంపి నే దేశికుండనై పూజనటుండ వాది గలిగిన విష్ణుతత్త్వంబె పరతత్త్వం బని వాదించి గెలిచెద నను ధావసుండను విష్ణుభక్తివిముఖుండను గావున వైష్ణవునిమనవి విన్నవింప నెవ్వరు వెఱతురు నీవు విష్ణుభక్తిపరాయణవు పతిహితాచారవుం గావున నీకు విన్నవించి పంపితి నీవిభుండు నీదు విధేయుండు విన్నవించి నన్ను రప్పించి వాదంబు సేయింప నోపుదేని వాదించి గెల్చి నీకుభర్తకును భగవద్భక్తి బుట్టించి కృతార్థుం గావించెద నని విన్నవింపం బంచిన

టీ. మఱియు నీరహస్యంబుల్ = సర్వము నేననియెడి యేకాంతికమును, తెలియక = ఎఱుంగక, అబ్జాపతి = ఆరాజు, తామసుండై = తమోగుణముగలవాఁడై, మామకీనంబులగు = మద్భక్తులైన, జనంబులన్ = మనుజులను, సామాన్యబుద్ధిం జూచుచు = సాధారణజనులని తలంచుచు, తద్వృత్తులకున్, తత్ = ఆ భక్తులయొక్క, వృత్తులకున్ = మాన్యక్షేత్రాదులకు, అగు నుపద్రవంబులన్ = కలిగిన బాధలను, ఉపేక్షించుచు = నివర్తింపఁజేయక, రక్షావిముఖుండై = పాలించుటకుఁ బరాఙ్ముఖుండై, ఉండన్ = వర్తించుచుండఁగా, వీక్షించి = చూచి, కలియుగంబునన్ = కలికాలమందు, ద్రవిడమండలంబునన్ = అఱవదేశమునను, కృతమాలాతామ్రపర్ణీతటంబులన్, కృతమాలా = కృతమాలయనునది యొక్కయు, తామ్రపర్ణీ = తామ్రపర్ణియనునదియొక్కయు, తటంబులన్ = తీరములయందు, మద్భక్తులు = నాకుం దాసులైన భాగవతోత్తములు, తఱ

చగుటన్ = విస్తరిల్లియుండుటచేతను, "(శ్లో. కలౌ ఖలు భవిష్యంతి నారాయణపరాయణాః । క్వచిత్క్వచిన్మహాభాగ ద్రావిడేషు చ భూరిశః, యని శుకయోగీంద్రువచనము.") తద్దేశంబునకున్ = ఆ దేశమునకు, ఒడయండు = రాజు, అతండగుటన్ = ఆ పాండ్యరాజగుటచేతను, (ఒడయఁడేలికె యొకిమీఁదు పుడమిఱేఁడని యాంధ్రనామసంగ్రహము) రక్షణశిక్షణంబులు, రక్షణ = పాలించుటయు, శిక్షణంబులు = శాసించుటయును, రాజముఖంబునంగాక = పార్థివునివల్లఁగాని, నేన = నేనే, సాక్షాత్కరించి= ప్రత్యక్షమై, చేయామియున్ = చేయకుండుటయును. తద్రక్షణేచ్ఛ, తత్ = ఆ భగవద్భక్తులయొక్క, రక్షణేచ్ఛ = పాలనాభిలాషము, అస్మదాభిముఖ్యంబునంగాని, అస్మత్ = నాకు, ఆభిముఖ్యంబునంగాని = ఎదురౌటచేతనే కాని. అతనికిన్ = ఆ పాండ్యరాజునకు, పొడమమియున్ = పుట్టమియును, నా = నాయొక్క, ఆభిముఖ్యంబు= అనుకూల్యము, సంవాదంబునంగాని = సంవాదాత్ప్రామాణ్యంబను న్యాయముచేతనేకాని, పుట్టమియున్ = జనింపకుండుటయును, విచారించి=తలపోసి, తదాభిముఖ్యకరణార్థంబు, తత్ = ఆ రాజుయొక్క, ఆభిముఖ్య=అభిముఖుఁడగుటయొక్క, కరణార్థంబు= చేయుటకు, ఆస్థానం బెక్కి=సభను ప్రవేశించి, వాదిజయంబు, వాది=వాదులయొక్క, జయంబు=గెలుపును. చేయవలయున్=ఒనరింపవలయును, అను=అనునట్టి, తలంపు=ఆలోచనను, అవ్విప్రకుమారునకున్=ఆ బ్రాహ్మణవటువునకు, పుట్టింపన్ = జనింపఁజేయఁగా, అతండు = ఆవిప్రుఁడు, ఏగి = వెళ్ళి, నానాదేశాగత= బహుదేశములనుండి వచ్చినట్టియు, దీన = దరిద్రులైనట్టియు, అనాథ = దిక్కులేనట్టియు, వృద్ధ = వృద్ధులైనట్టి, భూసురకుటుంబములకున్ = బ్రాహ్మణసంసారులకు, ధాన్యాజినపటాదులు, ధాన్య = వడ్లును, అజిన = కృష్ణాజినమును, పటాదులు వస్త్రములులోనగువానిని, వటువులకున్ = బ్రహ్మచారులకు, పెండ్లండ్లకును = వివాహములకును, అనుపనీతులకున్ = జందెములేనివారికి, ఉపనయనంబులకున్ = ఉపనీతులుగానొనర్చుటకును, పంగ్వంధబధిరాదులకున్ = కుంటుగ్రుడ్డుచెవిటివాండ్రకు, సౌరభేయాదియానంబులును = ఎడ్లుమొదలగువాహనంబులును, (సురభియనఁగాఁ గామధేనువు దానివలనఁ బుట్టినది, సౌరభేయమనఁగా నెద్దు, అది మొదలైనవి యనువిగ్రహార్థము.) మఱియున్ = వెండియును, చెఱువుగడమఁబడియెననియు=చెరువుగుంటలపనిముగియకున్నదనియు, పేదగుడులకుఁబూజనడువదనియు = బీదపడియున్న దేవాలయములోని దేవరలకుధూపదీపనైవేద్యాదులకు లేకయున్నదనియు, ఎడపునన్ = ఎడారిని, చలిపందిరిడియెదమనియు = పానీయశాలనేర్పఱిచెదమనియు, తిథి = పైతృకము, చిక్కెననియున్=దిగఁబడుననియు, తీర్థయాత్రఁజనియెదమనియు = పుణ్యతీర్థంబులసేవించుటకు వెళ్లెదమనియును, వ్రతోద్యాపనకనియు = శాస్త్రసిద్ధకర్మంబులఁదుదిముట్టించుటకనియును, వ్యాధిమాన్పుకోననియు = రోగముఁబోఁగొట్టుకోననియు

ను, చెప్పిపంపన్ = వార్తబుచ్చియాంపఁగా, ఆరాణివాసంబు = ఆయంతఃపురస్త్రీలు, గుప్తాగుప్తప్రకారంబులన్, గుప్త = రహస్యమైనట్టియు, అగుప్త = ప్రకటమైనట్టియు, ప్రకారంబులన్ = రీతులచేతను, పంపు = అనిపినట్టి, ద్రవ్యంబు = సామగ్రులను, తెచ్చి = తీసికొనివచ్చి, ఇచ్చు = ఇడుచున్నట్టి, ముదుసళ్ళగు = వృద్ధులైనట్టి, వర్షధరుల = షండులయొక్క, చేతులకున్ = హస్తములకు, క్రందుకొని = సందడిగొని, చేసాచిన = హస్తప్రసారణముచేయుచున్న, సందిటితోరణంబులై = సందిళ్ళతోఁగట్టినతోరణములై, తోఁచు = కనుపడుచున్న, ఏకదండి = స్మార్తసన్న్యాసులయొక్కయు, త్రిదండి = వైష్ణవసన్న్యాసులనఁగాజియ్యరులయొక్కయు, బ్రహ్మచారుల = వటువులయొక్కయు, ఉన్నమిత = ఎత్తఁబడ్డ, దండంబులన్ = కఱ్ఱలయందును, నిండారు = వ్యాపించుచున్న; కషాయ = ఎఱ్ఱనైనట్టియు, కద్రు = పచ్చనైనట్టి, (ని, రాగద్రవ్యేకషాయోస్త్రీ, నిర్యాసేపారదేరసె, పిశంగౌకద్రుపింగళౌ, అనియాదవామరములు.) వస్త్రకౌపీనపరంపరలన్, వస్త్ర = శాటులయొక్కయు, (దండములకుంగట్టుకుద్రవస్త్రములనుట.) కౌపీన = గోచులయొక్కయు, పరంపరలన్ = సమూహములచేతను, క్రమ్మి = కప్పి, కావళ్ళపడగలజాడఁగొని, కావళ్ళ = కావలియున్నస్థానములందలి, పడగల = టెక్కెములయొక్క, జాడఁగొని = వైఖరిఁదెలిసి, (కావళ్ళపడగలజడగొనియనియుఁబాఠముగలదు.) కావళ్ళ = వివిధములయొక్క, పడగల = కొసలవలెను, జడగొని = పెలికలుగొని, కేవల = ముఖ్యంబుగ, కార్పణ్యంబ = దీనత్వమె, విద్యగా = చదువుగా, తక్కిన విద్యలెఱుంగక = వేఱుచదువులెఱుఁగక, వేడు = యాచించుచున్న, ఈదృగ్విధ = ఇట్టిఱంగుననున్నట్టి, అనేక = లెక్కకుమిక్కుటంబైన, ప్రాణులకున్ = చేతనులకు, ఆధారంబగు = ఆస్పదమైన, పశ్చిమద్వారంబున్ = వెనుకనున్నగుమ్మమును. (అనఁగాదిడ్డివాకిలిననుట.) చేరి = ప్రవేశించి, ప్రతిదిన = దినదినమందును, అన్యత్పాద = నాచరణములయొక్క, భజనకథాశ్రుతపూర్వయగు = మున్నువినఁబడినభజనగాథలుగలదైన, (పూర్వమువినఁబడినవిశ్రుతపూర్వములు, దేనిచేతనాపాద భజనకథలుముందువినఁబడియున్నవోఅదియనివిగ్రహార్థము.) (భగవత్పాదారవిందధ్యానగరిష్ఠురాలనుట.) ఆయుర్వీధరుదేవికిన్ = ఆపాండ్యరాజుభార్యకు, ఆశీర్వచనాక్షతంబులు = మంగళాశాసనపూర్వాక్షతలను, దౌవారికముఖంబునంబంపి = ద్వారపాలునిచేతఁబంపి, వైదేశికుండన్ = పరదేశిని, వైష్ణవవటుండన్ = విష్ణుభక్తిగలబ్రహ్మచారిని, వాదిగలిగిన = విద్యావాదముచేయువాఁడున్నయెడ, విష్ణుతత్త్వంబె = నారాయణస్వరూపమె, పరతత్త్వంబని = పరమార్థమని, వాదించి = ప్రసంగమొనరించి, గెల్చెదన్ = జయించెదను, వసుధావరుండు = రాజు, విష్ణుభక్తివిముఖుండుగావున = నారాయణునియందుఁబాఱ్ఱప్రతిపత్తిలేనివాఁడగుటంజేసి, వైష్ణవునికునవి = విష్ణుభక్తుఁడనైన నాయొక్క విజ్ఞాపనమును, విన్నవింపన్ = ఎఱిఁగించుటకు, ఎవ్వరును = అందఱును, వెఱతురు = భయపడు

ధురు, నీవు= ఈవు, విష్ణుభక్తిపరాయణవు=విష్ణుభక్తియందాసక్తిగలదానవు, పతిహితాచారవుంగా పున=భర్తకనుకూలంబగు సద్వృత్తిగలదానవుగాన, నీకుక్ = నీ కొఱకు, విన్నవించి=విజ్ఞాపనముచేసి, పంపితిక్=అనిపితిని, నీ విభుండు=నీ భర్త, నీకు విధేయుండు = నీకువశ్యుండు, విన్నవించి = విన్నపమొనరించి, నన్నుక్ = నన్ను, రప్పించి = పిలువఁబంచి, వాదంబు = ప్రసంగమును, చేయింపక్=చేయించుటకు, ఓపుదేనిక్=సమర్థురాలవైతివా, వాదించి = ప్రసంగించి, గెల్చి = ప్రతివాదులను జయించి, నీదుభర్తకుక్ = నీ పతికి, భగవద్భక్తిక్ = శ్రీమన్నారాయణుని యందాసక్తిని, పుట్టించి= జనింపఁజేసి, కృతార్థుక్ = కృతకృత్యునిఁగా, కావించెదక్ = చేసెదను, అని= ఇట్లని, విన్నవింపంబంచినక్ = విన్నపము చేయఁబంపఁగా.

తా. వెండియు నీ రహస్యం బెఱుంగక పుడమిఁ బండజ్ఞానుండై నాభక్తులను సామాన్యజనుల మాడ్కిఁ జూచుచు వారల జీవనంబులకుం గలుగు నుపద్రవంబులను వారింపక యుండెం జూచి నాయందవు రక్తిలేని యీ రాజును వాదమున మెప్పించి నాభక్తుం గావింపని యెడఁ గలియుగంబునం గృతమాలా తామ్రపర్ణీతీరములయందుదండిగ వాసముజేయు నాభక్తుల నద్దేశము నేలుచున్న యితండు సన్మానింపఁడని విచారించి వాదము నజయించి రాజును విష్ణుభక్తుం గావింపవలయునను తలంప య్యామునాచార్యునకు నేఁబుట్టింప నతండవ్వటి కరిగి యనేక దేశములనుండివచ్చు బహువిధ యాచకతండంబులకిష్టార్థంబుల నిచ్చుచు మత్పాదసేవయందవు రక్తురాలై యున్న యా భూపతిదేవి యొద్దకు దౌవారికముఖంబున మంగళాశాసనాక్షతలంబంపి నేను వాదిగలిగినయెడ విష్ణుతత్త్వంబె పరతత్త్వమని సిద్ధాంత మొనరింపఁగలవాఁడయ్యును విష్ణుభక్తి విముఖుండైన రాజునకు నా మనవి విన్నవించువారు లేక యుండుటంజేసి విష్ణుభక్తురాలవు నీకు విన్నవించితి నీవు పతిభక్తియును గలదానవగుటచేత నీ భర్త నీకు వశ్యుఁడై యున్నవాఁడు గాన విన్నపముఁజేసి నన్నుఁ బిలువనంపి ప్రసంగముఁ జేయింపఁగలదానవై తివేనివచ్చి సభయందుఁ బ్రసంగించి వాదులను జయించి నీ పతికి శ్రీవిష్ణుభక్తిఁబుట్టించి ధన్యునిం జేసెదనని విన్నవింపుమని పంచెననుట.

తే. గీ, గ్రీష్మసమయనిరుత్సాహ ♦ కేకిరమణి, నవఘనధ్వని కలరుచం ♦ దమున నలరి
యేకతపునర్మగోష్ఠిఁ బ్రా ♦ ణేశుతోడ, నతనివిధ మెఱిఁగింపని ♦ ట్టులు పడుచు. ౫౪.

టీ. గ్రీష్మసమయ = వేసవికాలమందు, (సీ. సమయాశ్శపథాచారకాలసిద్ధాంతసంవిదయని యమరము.). నిరుత్సాహ = సంతోషరహితమైన, కేకిరమణి = ఆఁడునెమలి, నవఘనధ్వనికిక్, నవ = క్రొత్తయైన, ఘనధ్వనికిక్ = ఉఱుమునకు, అలరుచందమునక్ = సంతసించునట్లుంబలె, అలరి = ఆనందించి, ఏకతపు=ఏకాంతమంగై

న, నర్మ = విలాసార్థమగు, గోష్ఠిన్ = ముచ్చటించునపుడు, ప్రాణేశుతోడన్ = పెనిమిటితోడను, అతనివిధము, అతని = అయ్యామునాచార్యునియొక్క, విధము = ప్రసంగమొనరించెడ నన్నరీతిని, ఎఱిఁగింపన్ = తెలుపఁగా, ఇట్టట్టుపడుచున్ = అచ్చెరునొందుచును.

తా. పిమ్మట నారాజుభార్య వేసవికాలమునందుత్సాహములేక యున్నయాఁడునెమలి నూతనమేఘధ్వనివిని యానందించు పోలికనుబ్బి యుత్సహించి యేకాంతంబున సరససల్లాపములాడువేళం దనప్రాణవల్లభునితో నయ్యా మునాచార్యవర్యుండానతిచ్చిన విధంబెల్ల నెఱిఁగింప నయ్యుర్వీనాథుండాశ్చర్యము నొందుచుననని తాత్పర్యము.

క. భూవల్లభుఁ ♦ డెట్టెట్టూ, తావాదముఁ జేసి శివమ ♦ తంబు జయింపం,
గా వచ్చెనొ ♦ చూతము గా, గావింపు మ టన్న నాటి ♦ రాత్రి చనంగన్. ౫౫.

టీ. భూవల్లభుఁడు = రాజు, ఎట్టెట్టూ = ఏలాగేలాగు, తాన్ = తాను, (బ్రహ్మచారియనుట.) వాదము జేసి = వాదించి, శివమతంబున్ = శైవమతమును, జయింపంగావచ్చెనొ = గెలువవచ్చెనో, చూతము గా = వీక్షించెదముగాని, గావింపుము = పిలువనంపుము, అటన్నన్ = అట్లనఁగా, నాటిరాత్రి = ఆ రాతిరి, చనంగన్ = వెళ్లగాను.

తా. ఆ భూకాంతుండేలాగున నా బ్రహ్మచారి వాదమొనరించి శివమతమును జయింపఁగలఁడో చూతము పిలువఁబంపుమనుటయు, నింతలోఁ దెల్లవారఁగానని భావము.

వ. ప్రభాతంబునం బరిమితాస్థానంబునం గొలువున్నభర్త్రమోలఁ దా నుండి యయ్యిందువదన యతని యనుమతిం బ్రతిహారిచేతఁ బిలువఁ బంచిననబ్భూనిలింపకుమారుండు.

టీ. ప్రభాతంబునన్ = ప్రాతఃకాలమందు, పరిమితాస్థానంబునన్ = మితిజనముగలసభయందు, కొలువున్న = కూర్చుండియున్న, భర్త్రమోలన్ = పెనిమిటియెదుటను, ఉండి = నిల్చుండి, అయ్యిందువదన = చంద్రునివంటి మోముగలయారాజుభార్య అతని = ఆ రాజునొయొక్క, అనుమతిన్ = సమ్మతిచేతను, ప్రతిహారిచేతన్ = ద్వారపాలకునిచేతను, పిలువఁబంపినన్ = రమ్మని చెప్పియంపగానె, ఆ బ్భూనిలింపకుమారుండు = ఆ పుడమివేల్పుకొమరుఁడు.

తా, సు.

క. ద్వారంబు ♦ సొచ్చి కీలిత, గారుడమహివజ్రవేది ♦ కం జిపురులఁ గెం,
పారునొక ♦ పిప్పలముఁ గని, యారావి స్వాదసాక్షి ♦ కై వఁగొనుచున్. ౫౬.

టీ. ద్వారంబు = తలవాకిలిని. చొచ్చి = ప్రవేశించి. కీలిత = చెక్కఁబడిన, గారుడ = మరకతమణులుగల, మహిన్ = భూమియందు, వజ్రవేదికన్ = రవలతోఁ

గట్టినతిన్నెయందు, చివురులన్ = చిగుళ్ళచేతను, కెంపారు = ఎఱ్ఱనగుచున్న, ఒకపిప్పలము‌న్ = ఒకయశ్వత్థవృక్షమును, కని = చూచి, ఆ రావిన్ = ఆ యశ్వత్థమును, వాదసాక్షికై = ప్రసంగమునకుసాక్షిగా నుండుటకై, వలగొనుచున్ = ప్రదక్షిణమొనరించుచునని యుత్తరపద్యముతో నన్వయము,

తా. పిమ్మట బజారమునుండి నగరుఁ బ్రవేశించి పచ్చలచేతఁ జెక్కఁబడియున్న భూమియందు మిగుల వెలగల రవలచేతఁ గట్టంబడిన వేదికయందెరుపైన చిగుళ్లచేత నొప్పుచున్న యశ్వత్థవృక్షమును జూచి తాను జేయంబూనిన వాదమునకు దానిసాక్షిగాఁ గైకొను నిచ్చతోఁ బ్రదక్షిణమొనరించుచునని తాత్పర్యము,

సీ. పసిఁడిగచ్చమరసో ♦ పానముల్ మూటఁ దుం, గితవిశాలితయుఁ జి ♦ త్రితయు నైన,
సభ మహాపథముపై ♦ శార్దూలచర్మకం, థావృతుల్ జటిలులు ♦ నైన జరఠ,
మాహేశ్వరులు చుట్టి ♦ రా హారసంధి రు, ద్రాక్షాయుతముఁ దాల్చి ♦ యళికభూతి,
సురటిగాడ్పుల రాల ♦ నరుణాయతాక్షుఁడై, కుఱుగద్దెఁ బిల్లఁ బ్ర ♦ కోష్ఠ మునిచి,
నంది ముద్రితపాణి ♦ యందుఁ జెక్కఁ - దియా. గమములు వినుచు హే♦మము పొదివిన,
యలఁతిరుదురాకగమికట్టు ♦ లన్ని మెరయ, వెలిదపారంబు మించ దు ♦ వ్వలువగప్పి,
యడపమును వాఁడివాలొక్క ♦ యలివ దాప్ప,భార్య వింజామ రిడ నొప్పు♦ పాణ్డ్యుఁగనియె.

టీ. పసిఁడి = బంగారముయొక్క, గచ్చు = ఫ్రూంత, అమరన్ = ఒప్పుచుండగా, సోపానముల్ = మెట్లు. (అనగా నంతస్తులనుట) మూటన్ = మూటిచేత, తుంగిత = పొడగింపఁబడినది. విశాలితయున్ = వైశాల్యముగలదిగాఁజేయఁబడినట్టియు, చిత్రితయున్ = చిత్తరువులుగలదియును, ఐన — సభన్ = ఆస్థానమండపమందు, మహత్ = అధికమైన, కుథముపైన్ = ఆస్తరణమునందు, శార్దూలచర్మకంథావృతుల్, శార్దూలచర్మ = పులితోలుచేతను, కంథా = బొంతలచేతను, ఆవృతుల్ = కప్పఁబడినట్టియు. జటిలులును = జడలుగలిగియున్నట్టి, జరఠ = వృద్ధులైన, మాహేశ్వరులు = లింగధారులు, చుట్టిరాన్ = పరివేష్టింపఁగా, హారసంధిన్, హార = ముత్యాలపేరులయొక్క, సంధిన్ = సందులయందు, రుద్రాక్షాయుతముఁదాల్చి, రుద్రాక్ష = రుద్రాక్షములయొక్క. అయుతము దాల్చి = ఆ సంఖ్యమునుధరించి, (ని. శతంసహస్రమయుతంలక్షమానంత్యవాచకమని వచనము) అలికభూతి = ముఖమందలిభస్మము, సురటిగాడ్పులన్ = విం జామరలగాలిచేతను, రాలన్ = పడుచుండఁగా, అరుణాయతాక్షుఁడై = ఎఱ్ఱనై దీర్ఘములైనట్టి కన్నులుగలవాఁడై, కుఱుగద్దెన్ = కుఱుచపీఠమునందు, బిల్లన్ = వట్రువైనతలగడయందు, ప్రకోష్ఠమునిచి = మోచెయ్యిని, నందిముద్రిత = వృషాంకితాంగుళీయకముగల, పాణియందున్ = హస్తమునందు, చె

కూఁకిడి = గండస్థలమును జేర్చి, ఆగమములువినుచు = శైవాగమము లాలకించుచు, హేమముపొదివిన = పైడిపొదిగిన, అలఁతి = సన్నములయిన, రుదురాక = రుద్రాక్షములయొక్క, గమి = సమూహము, కుట్టులందుఁ = అంటుపోగులందు, మెరయఁ = వెలుంగఁగా, వెలి = తెల్లనైన, తపారంబు = పాగాను, మించఁ = అతిశయించునట్లుగ, దువ్వలువఁ = దుప్పటిని, కప్పి = ఆచ్ఛాదించికొని, అడపమును = తాంబూలపుసంచిని, వాడివాలు = పదునుగలఖడ్గమును, ఒక్కయతివ దాల్పఁ = ఒకస్త్రీ ధరించియుండఁగా, భార్య = రాజపత్ని, వింజామర = సురటులను, ఇడఁ = విసరఁగా, ఒప్పు, చెన్నొందుచున్న, పాండ్యుఁ = పాండ్యరాజును. కనియెఁ = చూచెను. (ఇది పంచపాదసీసమని కొందఱును, చతుష్పాదమని మఱి కొందఱైదవపాదము లేకయు పఠింతురు.)

తా. పసిండివన్నెపూఁతచే నొప్పి మూఁడంతస్తులమెట్లును మిగులం బొడవువెడల్పునుంగల్గి పలువెఱంగులయిన చిత్తరువులచేఁ జెన్నొందియున్న సభామంటపమునందు గొప్పయాస్తరణంబునం బులితోళ్లను బొంతలును గప్పుకొని జడలు ధరించిన వృద్ధులగులింగధారులు దన్నుఁ బరివేష్టించియుండ రత్నహారములయొక్క నడుమనడుమను రుద్రాక్షములం గూర్పించి ధరియించి నొసటంబెట్టిన విభూతి వింజామరల గాలికి రాలుచుండఁ గన్నులెఱ్ఱఁజేయుచు చిరుతగద్దియయందు బిల్లదిండుమీఁద మోచెయ్యుంచి నంది ముద్రితంబులైన యుంగరములుగల హస్తమునఁ జెక్కిలి యుంచికొని మాహేశ్వరులు చదువు శైవాగమముల నాలకించి వినుచుఁ గుందనపు బంగారముచేతఁ గట్టఁబడిన సన్నరుద్రాక్షల కుట్టుపోగులుగల్గి తెల్లనిపాగాను ధరించి నాణ్యపు దుప్పటిగప్పుకొని ఒకప్రక్క నడపమును వాడియైనకత్తి చేతంబట్టిన యొకస్త్రీ తన్నుసేవింపం బట్టపుదేవియైన తనభార్య వింజామర లిడుచుండం బ్రకాశించుచున్న యప్పాండ్యరాజుం గనియెనని భావము.

వ. కని వినతుండై చేర నరిగి యజ్ఞోపవీతంబు గానుకిచ్చి కూర్చున్న నాదరింపక సంరంభియై యవ్విశ్వంభరాభర్త యిట్లనియె. ౫౯.

టీ. కని = చూచి, వినతుండై = నమ్రుఁడై, చేరనరిగి = సమీపమునకుఁబోయి, యజ్ఞోపవీతంబుగానుకిచ్చి = జందెము పాయనంబుగ నొసంగి, కూర్చున్నఁ = ఆసీనుఁడైనను, ఆదరింపక = మన్ననచేయక, సంరంభియై = ఉద్రేకముగలవాఁడై, అవ్విశ్వంభరాభర్త = ఆరాజు, ఇట్లనియెఁ = వక్ష్యమాణక్రమంబునఁ బలికెను.

తా. సుగమము.

తే, గీ. సంగతియె యీయి యుసుమంత ♦ టెంగ కాపు, తత్త్వనిర్ణయవాదంబు ♦ దరమె నీకు,
వోడి తేనియఁ బట్టితె ♦ ట్రో యనంగ, లింగమును గట్టుకుదుంగ మె ♦ టింగి నుదుపు.

టీ. ఓయి = ఓ బ్రహ్మచారీ, సంగతియే = యుక్తమా, ఇసుమంత = ఇంచుకంత, టింగణావు = పిన్నవాఁడవు, తత్త్వనిర్ణయవాదలబు = స్వరూపనిశ్చయప్రసంగము, తరమెనీకుక్ = నీకు శక్యమా, ఓడితేనియు = పరాజితుండవై తివేసియు, పట్టి = బలాత్కరించి, మొఱ్ఱోయనంగక్ = ఆర్తధ్వనిచేయఁగా, లింగమునుగట్టక = శివమూర్తిబంధింపక, ఊదుగము = మానము, ఎఱింగి = విచారించుకొని, నొడువుము = మాటలాడుము.

తా. అప్పుడప్పాండ్యరాజు ఓ బ్రహ్మచారీ న్యాయమా నీవు మిక్కిలి చిఱుతవాఁడవుగాన స్వరూపసిద్ధాంత మెట్లానర్పఁగలవు వాదమునఁ బరాజితుండవై తివేని మొఱ్ఱో యన్నను వదలకపట్టి లింగముఁగట్టించి పంపుదుము విచారించి మాటలాడుమనియెననుట.

తే, గీ. వాదుల మటంచుఁ జెప్పించి ♦ వత్తురోట, మైన దయ నీరె యేమైన ♦ నసవిలజ్జ
జూటుదనమున సభ లెక్క ♦ చౌరవకాండ్రు, పారువారలసుద్ది సె ♦ ప్పంగ నేల.

టీ. వాదులమటంచుక్ = ప్రాసంగికులమని, చెప్పించి = వర్తమానముఁబంపి, వత్తురు = ఏతెంచెదరు, ఓటమైనక్ = ఓడినను, దయక్ = కృపచేతను, ఏమైనక్ = కొంచెమైనను, ఈరె = ఇయ్యరా, అని = ఇట్లని, విలజ్జక్ = సిగ్గు లేకుండుటచేతను, జూటుదనమునక్ = మోసముచేతను, సభలు = ఆ స్థానములను, ఎక్క = ప్రవేశించునట్టి, చౌరవకాండ్రు = ప్రవేశించు స్వభావముగల సాహసికులైనవారు, వత్తురనుక్రియతో నన్వయము, పారువారల = బ్రాహ్మణులయొక్క, సుద్ది = పారిశుద్ధ్యమును, చెప్పంగనేల = వచించుటయెందుకు.

తా. మఱియు నా రాజు ఏమియు నెఱుంగని బ్రాహ్మణులు దాము వాదమందోడినను గరుణించి కొంచెమయిన నీయరా చూతమని తలపోసి ప్రాసంగికులమని చెప్పిపంపివచ్చుచున్నారు. ఇట్లు లజ్జలేక మోసకారితనమున సభలను బ్రవేశించునట్టి సాహసికులగు నా విప్రుల పారిశుద్ధ్యమును వచింపుదునని నిందించెనని భావము.

వ. అని పలికి దరహాసంబుతో దేవిదెసఁ జూచి యిట్లనియె. ౬౨.

టీ. అనిపలికి = ఈలాగునఁజెప్పి, దరహాసంబుతోక్ = చిఱునవ్వుతో, దేవి = భార్యయొక్క, దెసక్ = దిక్కును, చూచి = వీక్షించి, ఇట్లనియెక్ = వక్ష్యమాణక్రమంబుగ వక్కాణించెను.

తా. సుగమము.

క. అన్నన్నతఁడుఁ ♦ దోడిన, భస్మము రుద్రాక్షములును ♦ బాసి యతనిచే
విష్ణయముగఁ ♦ దప్తముద్ర, ఘస్మరచక్రాంకితుండుఁ ♦ గాఁ గలవాఁడక్. ౬౩.

టీ. అస్మన్మతస్థుఁడోడినన్ = నాకిష్టమైన శైవమతస్థుడు పరాజితుఁడాయెనా, భస్మము = విభూతిని, రుద్రాక్షములును = రుద్రాక్షములను, పాసి = త్యజించి, ఇతనిచేన్ = ఈ వటువుచేతను, విస్మయముగన్ = ఆశ్చర్యముగా, తప్తపు = తపింపఁబడిన, మురఘస్మర = మురాసురునిభక్షించిన విష్ణుదేవునియొక్క, చక్ర = చక్రముచేతను, అంకితుండన్ = చిహ్నితుఁడను, కాఁగలవాఁడన్ = అయ్యెదను. (ని. భక్షకోఘస్మరోద్మరయని యమరము.)

తా. ఇపుడు నడువఁబోయెడివాదమున నాకభిమతుండయిన శివమతస్థుఁడోడెనేని విభూతి రుద్రాక్షములం బరిత్యజించి నేనీ బ్రహ్మచారిచేతఁ జక్రాంకితుండయ్యెదనని యె ననుట.

తే, గీ. ఉవిద యీనీదువిద్వాంసుఁ ♦ డోడె నేని, నీకు నితనికి నన్నపూ ♦ నికయ యన్న
నొప్పితిమి దేవరానతి ♦ దప్పకున్నఁ, జాలు మఱిపంచభూతము ♦ ల్సాక్షిగాఁగ. ౬౮.

టీ. ఉవిద = ఓ స్త్రీ. ఈ నీదువిద్వాంసుఁడోడెనేని = ఈ నీ పండితుఁడుపరాజితుఁడాయెనా, నీకున్ = నీకును, ఇతనికిన్ = ఈ యామునాచార్యునకును, అన్న = నేనన్నట్టి, పూనికయ = ప్రతిజ్ఞే, అన్న = ఇట్లనఁగా, ఒప్పితిమి = మేముసమ్మతించితిమి, దేవర = తమరు, ఆనతిన్ = చెప్పినమాటను, తప్పకున్నన్ = అతిక్రమింపకయుంటిరా, చాలును = పర్యాప్తము, మఱి = మఱియును, పంచభూతములు = పృథివ్యప్తేజోవాయ్వాకాశములు, సాక్షిగాఁగన్ = నిష్పక్షపాతముచేతి జూచువారలుగాఁగా, తప్పకుండినఁజాలునని క్రిందికన్వయము.

తా. ఓ వనితామణీ నీ పండితుఁడోడెనా నీవును నీ యామునాచార్యుఁడును నేఁజెప్పినట్లే శయివదీక్ష వహింపవలసియుండుననఁగా విని యా రాజుభార్యయో స్వామీ యాజ్ఞకొడంబడితిమి మీరును పంచభూతములుసాక్షిగా నానతిచ్చినమాటను దప్పక నడపవలయునని ప్రత్యుత్తరమిచ్చెననుట.

వ. అని పలుకు నయ్యిరువురప్రతిజ్ఞ లాకర్ణించి. ౬౯,

టీ. అని = ఇట్లని. పలుకు = వచించుచున్న. అయ్యిరువుర = ఆ యిద్దఱియొక్క, ప్రతిజ్ఞలు = శపథములను, ఆకర్ణించి = విని.

తా. సుగమము.

తే, గీ. అళఁడు మృగకృత్తి పెళపెళ ♦ యనఁగఁ జసవు, గోచిగట్టిన మోదుగ ♦ కోల నెగయఁ,
బ్రాంజలి వినీతుఁడై విన్న ♦ పం బట్టుచు, నర్థముక్తాసనత నిట్టు ♦ లనియెఁ బతికి. ౭౦,

టీ. అతఁడు = ఆ యామునాచార్యుఁడు, మృగకృత్తి = కృష్ణాజినము, పెళపెళయనఁగన్ = పెళపెళయాడఁగాను, పసపుగోచిన్ = హారిద్రాకౌపీనము, కట్టిన = కట్టఁబడిన, మోదుగకోలన్ = పలాశదండమందు, ఎగయన్ = చలింపఁగా, ప్రాంజలి = చేతులుజోడించినవాఁడై = నమ్రుఁడై, విన్నపంబటంచున్ = నేను శ్రుతపఱచు నట్టివాక్యము నాలకింపుమటంచును, అర్ధముక్తాసనతన్ = సగము విడువఁబడిన యాసనముగలవాఁడై, పలికెన్ = రాజునుగూర్చి, ఇట్టులనయెన్ = ఈలాగనియెను.

తా॥ అట్లయ్యిరువురు నిర్ణయించికొనిన శపథములనాకర్ణించి యామునాచార్యుం డపుడు దానుధరియించియున్న కృష్ణాజినము పెళపెళలాడఁగాఁ బాలాశదండమునందు బంధింపఁబడినగోచి చలించునట్లు సగము విడువఁబడ్డ యాసనముగలవాఁడై చేతులుజోడించి విన్నవించెద నాకర్ణింపుమని రాజునుగూర్చి పలికెననుట.

క. దేవా యి♦ట్లని యానతి, యీవల దేఁ గడుపుఁగూటి♦కిటరా నాడ,
బ్బేవారిఁ♦బ్రోవ భిక్షా, జీవిక వర్ణికిని విధి సృ♦జించెను గాదే. ౬౭.

టీ. దేవా = ఓరాజా, ఇట్లని = ఈలాగని, ఆనతియీవలదు = ఆజ్ఞయియ్యవలదు, ఏన్ = నేను, కడుపుఁగూటికిన్ = పొట్టవంటకమునకు, ఇటరాన్ = ఇక్కడికిరాను, నాడబ్బు = నాద్రవ్యము. ఏవారిన్ బ్రోవన్ = ఎవ్వరినిరక్షించుటకొఱకు, వర్ణికిన్ = బ్రహ్మచారికి, భిక్షాజీవిక = యాచ్ఞాజీవనము, విధి = బ్రహ్మ, సృజించెనుగాదె = సృష్టించియున్నాఁడుగదా.

తా. ఓయిరాజా నీవీలాగున సెలవియ్యవలదు నేనుగడుపుకూటినిమిత్తమై వివాదముఁజేసెదనని చెప్పి వచ్చినవాఁడనుకాను, నేనెవ్వరిని రక్షింపవలసియున్నది బ్రహ్మచారికి భిక్షావృత్తిని బ్రహ్మ మున్నే సృజియించియుండలేదాయని భావము.

తే. గీ. ఎవ్వఁ డీసర్వభూతస్థుఁ♦ డిత్తెఱంగు, నను బ్రేరేచె నతని యా♦నతియె తెచ్చె,
నెఱిఁగినవి నాల్గు నొడువ నె♦ట్లైన లెస్స, యతఁడ బొంకిన నేమి సే♦యంగ వచ్చు. ౬౮.

టీ. ఎవ్వఁడు = ఏభగవంతుఁడు, ఈసర్వభూతస్థుఁడు = ఈసర్వాంతర్యామియైన, ఇత్తెఱంగునకున్ = ఈప్రకారమునకు (వాదార్థమైయనుట) ప్రేరేచెన్ = ప్రేరణచేసెనో, అతని = ఆదేవునియొక్క, ఆనతియె = ఆజ్ఞయే, తెచ్చెన్ = తీసికొనివచ్చెను, అతఁడ = నన్నుదెచ్చినభగవంతుఁడె, బొంకినన్ = అబద్ధమాడినను, ఏమిసేయంగవచ్చున్ = ఏమిసేయఁగలను, ఎఱిఁగినవి = నాకుఁదెలిసినవి, నాల్గు = నాలుగుయుక్తులును, నొడువన్ = చెప్పఁగా, ఎట్లైన = ఏలాగైనను, లెస్స = యోగ్యమె.

తా. సర్వాంతర్యామియైన యేదేవుండు సన్నిట్లువాదముసేయుమని ప్రేరేపించె నో యట్టిభగవంతుండే బొంకినపుడు నేనేమిసేయంగలవాఁడను. నాకుందెలిసియున్న నాలుగుయుక్తులనుజెప్పెద దానిపై నేలాగైనను యోగ్యమేయని పలికెననుట.

తే. గీ. పంతమైనను గానిమ్ము ♦ పార్థివేంద్ర, యుక్తులను నిగ్రహస్థాన ♦ మొదవె నేని యమ్మ దెచ్చినవిద్వాంసుఁ ♦ డనఁగ వలువ, దెట్లు గావింప వలయు న ♦ ట్లట్ల చేయుఁగా.

టీ. పార్థివేంద్ర = ఓయిరాజా, పంతమైనను = నీవాడినప్రతిజ్ఞయైనను, కానిమ్ము = జరగనియ్యుము, యుక్తులను = ప్రతివాదియుక్తులచేతను, నిగ్రహస్థానము = ఓడుట. ఒదవెనేని = వచ్చెనేని, అమ్మ = దేవరదేవి, తెచ్చినవిద్వాంసుఁడు = రావించినపండితుఁడు, అనఁగవలదు = అనివిచారింపకుము, ఎట్లుగావింపవలయుఁ = ఏలాగునఁజేయవల యునో, అట్లట్ల చేయుము = ఆలాగుననేచేయుము.

తా. ఓయిరాజా నేఁబ్రతివాదియుక్తులకు నోడితినేని మీరానతిచ్చినట్టిప్రతిజ్ఞయైనను జరగింపుండు అమ్మగారు పిలువంబంచిన విద్వాంసుండని మన్నింపక మీకిష్టమువచ్చినయట్లు చేయింపుండని పల్కెననుట.

క. అని యలుకు విడిచి పలికి మగుడం గూర్చుండి యతని యనుమతి వాదంబునకుం దొడంగి. ౭౦.

టీ. అని = ఈలాగని, అలుకు = భయమును, విడిచి = త్యజించి, పలికె = వాక్రుచ్చి, మగుడఁ = మరలను, కూర్చుండి = ఆసీనుఁడై, అతనియనుమతిఁ = ఆరాజుయొక్కయాజ్ఞవల్లను, వాదంబునకుఁ = ప్రసంగమునకు, తొడంగి = ఉపక్రమించి.

తా. సుగమము

సీ. అందులో నొకమేటి ♦ కభిముఖుండై యాతఁ, డనినవన్నియును ము ♦ న్ననువదించి,
తొడఁగియన్నిటికన్ని ♦ దూషణంబులు వేగ, పడక తత్సభ నొడఁ ♦ బడఁగ బల్కి,
ప్రక్కమాటల నెన్న ♦ కొక్కొక్కమాటనే, నిగ్రహస్థానము ♦ నుగ్రహించి,
క్రందుగా రేఁగినఁ ♦ గలఁగకం దటుఁదీర్చి, నిలిపియమ్మొదలవా ♦ ఖకి నెమగడి,
మతిశ్రుతిస్మృతిసూత్రస ♦ మాజమునకు. నైకకంఠ్యంబుగల్పించి ♦ యాత్మమతము,
జగమెఱుంగ రాద్ధాంత ♦ మునను నిల్పి, విజితుఁగావించి దయవానివిడిచిపెట్టి. ౭౧.

టీ. అందులోఁ = ఆవాదులలో, ఒకమేటికి = ఒకప్రౌఢవాదికి, అభిముఖుఁడై = ఎదురుగానున్నవాఁడై, అతఁడనినవన్నియును = అతండు సెప్పిన యుక్తులనన్నిటిని, మున్ననువదించి = ముందనువాదముఁజేసి, తొడఁగి = ఉపక్రమించి, అన్నిటికి = అతఁడు సెప్పినయుక్తులకన్నిటికిని, అన్నిదూషణంబులు = అన్నిదోషంబులు, వేగపడక = త్వ

రపడక, (ప్రథమావై భక్తికమార్చింమశ్చమహాన్నలిక్రియార్థేషు—అను సూత్రము చేతమువర్ణకలోపము) తత్సభ = ఆ సభికులు, ఒడఁబడఁగన్ = సమ్మతించునట్లుగ, పల్కి = సంభాషించి, ప్రక్కమాటలన్ = పార్శ్వములనున్నవారు సెప్పువట్టియాయుక్తులను, ఎన్నక = గణనఁజేయక, ఒకొక్కమాటనె = ఒక్కొక్కయుక్తిచేతనే, నిగ్రహస్థానమును గ్రహించి = నిగ్రహస్థానమును బొందించి యనుగ్రహించి, (ని. గ్రహస్థానమనఁగాఁ బ్రసంగదోషములనఁబేరు) క్రందుగాఁ రేఁగిన = దొమ్మిగాఁ బ్రసంగింపరాఁగా, కలఁగక = తొట్రుపాటుపడక, అందఱన్ = ఎల్లరను, తీర్చి = సమాధానపఱచి, నిలిపి = ఉంచి. అమ్మొదలివానికినె = ఆ మొదలి విద్వాంసునకె, మగిడి = తిరిగి. మఱి = మఱియును, శ్రుతి = వేదములు, స్మృతి = ధర్మశాస్త్రములు, సూత్ర = వ్యాససూత్రములు, వీనియొక్క, సమాజమునకు = సమూహమునకు, ఐకకంఠ్యము = ఏకగ్రీవత, కల్పించి = చేసి, ఆత్మమతము = స్వమతము, జగమెఱుంగఁగన్ = లోకమెఱుంగునట్లు, రాద్ధాంతముగన్ = సిద్ధాంతముగా, ఒనర్చి = చేసి, విజితుఁగావించి = ఓడించి, దయన్ = కరుణచేతను, వానిన్ = అతని, విడిచిపెట్టె.

తా. ఆ వాదులలో నొకప్రౌఢవాది కభిముఖుండై యతఁడు సెప్పినయుక్తులను ముందనువాదముఁజేసి యుపక్రమించి పిమ్మట నాయుక్తుల కన్నిదూషణంబులును దానుత్వరపడక సభికులు మెచ్చునటులఁబల్కి యిరుప్రక్కలనున్నవారు సెప్పుచున్నమాటల నెన్నక యొక్కొక్కయుక్తిచేత నిగ్రహస్థానములొదవిన ననుగ్రహించి సభికులు దొమ్మిగావచ్చి ప్రసంగింపఁదా తొట్రుపడక యందఱను సమాధానపఱచియుంచి యామొదలివిద్వాంసునకే మరల వేదశాస్త్ర బ్రహ్మసూత్రములకు నేకవాక్యతఁగల్పించిచెప్పి పిమ్మట స్వమతము సిద్ధాంతమని లోకమెఱుంగునట్లుగఁజేసి యోడించి దయచేత వానివిడిచియని తాత్పర్యము.

క. నీవేమంటివి రమ్మం, చావలివానికిని మగిడి ♦ యట్లనె వానిం,
గావించి యొకఁడొకఁడు రా, నావిప్రుఁడు వాదసరణి ♦ నందఱఁ గెలిచెన్. ౭౨.

టీ. నీ వేమంటివి = తొలుతఁదొమ్మిగఁ బ్రసంగింపవచ్చిన వారలలో నొక్కనింజూచి యీవువల్కినదేమి, రమ్మంచు = రమ్మనియోడించి, ఆవలివానికిని = ఆవలనున్నమఱియొకనికిని, మగిడి = అభిముఖుండై, వానిన్ = ఆ వానిని, అట్లనె = మొదలివానివలెనే, కావించి = చేసి, మఱియు నీప్రకారముగన్. ఒకఁడొకఁడు = ఒకనివెంటనొకఁడుగా, రాన్ = రాఁగాను, ఆ విప్రుఁడు = ఆయామునాచార్యుఁడు, వాదసరణిన్ = వాదముఖమున, అందఱిన్ = వాదులనెల్లను, గెలిచెన్ = జయించెను.

తా. మఱియొకని తట్టుతిరిగి నీ వేమంటివి రమ్మని ప్రసంగించి యోడఁగొట్టి యావలివానికెదురై వానిని నోడఁగొట్టి యీరీతి నొక్కొక్కఁడుగ రాఁగా నావి

ప్రుఁడు ప్రసంగించి యందఱుఁ బ్రసంగించుసమయమున నోఁడఁగొట్టెనని తాత్పర్యము.

వ. ఇట్లు జయించి విష్ణుదేవుండె పరతత్త్వం బనియు విశిష్టాద్వైతంబ మతంబు నగుటం బ్రతిష్ఠించిన. ౭౩.

టీ. ఇట్లుజయించి = ఇవ్విధమున గెలిచి, విష్ణుదేవుండె = శ్రీమన్నారాయణుండె, పరతత్త్వంబనియున్ = పరబ్రహ్మమనియును, విశిష్టాద్వైతంబ = జీవేశ్వరులకు భేదప్రతిపాదనమగుటయు, మతంబున్ = సిద్ధాంతమును. అగుటన్ = ప్రతిష్ఠించినన్ = స్థిరపఱుపఁగా (స్థూలచిదచిద్విశిష్ట పరబ్రహ్మమునకును, సూక్ష్మచిదచిద్విశిష్ట పరబ్రహ్మమునకును, అభేదమనిచెప్పుట యవిశిష్టాద్వైతశబ్దార్థమనుట)

తా. సుగమము

క. ఆయెడను నొక్కపలు కెదు, రై యుండెడుపిప్పలమున ♦ నాయెను విన నో,
హో యిది నిక్కము నృప నా, రాయణుఁడె పరంబు కొలువు ♦ మతని నటంచున్.

టీ. ఆ యెడన్ = ఆ సమయమందు, ఎదురై యుండెడు = పురోభాగమునను న్నట్టి, పిప్పలమునన్ = రావిచెట్టునందు, వినన్ = అందఱు వినునట్లుగ, ఓహో = ఓయీ, నృప = రాజా, ఇది = ఈ యామునాచార్యుఁడు చెప్పినది, నిక్కము = యథార్థము, నారాయణుండె = విష్ణుదేవుండె, పరంబు = పరబ్రహ్మము, అతనిన్ = ఆ నారాయణుని, కొలువుము = సేవింపుము, అటంచున్ = ఈ లంగించుచు, ఒక్కపలుకు = ఒకవాక్యము, ఆయెన్ = వినఁబడెను.

తా. ఇట్లు యామునాచార్యుండు సిద్ధాంతమొనర్చిన సమయంబున నెదుటనున్నరావిమ్రానిలోనుండి యోయిరాజా యీ బ్రహ్మచారిచెప్పినది నిజము శ్రీమన్నారాయణుండే పరబ్రహ్మమగుటంజేసి యద్దేవుని సేవింపుమటంచు నొక్కశబ్దమెల్ల వారలచేవినఁబడియెనని భావము.

వ. అప్పలుకులు విని ఖిన్నంబై యక్కూడినపాషండషండంబు దల వంచుకొని పోయిన నాయుర్వీధవుండు నతని మాహాత్మ్యంబునకు సంతోషించి సాష్టాంగ మెఱఁగి హర్షాద్భుతరసోత్తరంగితాంతరంగుండై భుజగశయనచరణకుశేశయభక్తి నొడమి కృతార్థతం బొంది పాండ్యమండలమునకు భాగినేయుండ పట్టార్హుండు గావునఁ బాత్రంబని బ్రహ్మచారి యగునతనికిఁ దనకడగొట్టుచెలియలిం బరిణయంబు సేసి యరణంబుగ నమ్మహాత్మునకు ధారాపూర్వకంబుగా నర్ధరాజ్యం బిచ్చి యువరాజుం జేసి యధీతసాంగవేదుం డగునతనికి నధర్వశిర స్సభ్యస్తం బని యెఱింగి యందు దివ్యాస్త్రంబుల కలిమియుం దెలిసి యమ్మహాత్మున కెచ్చరించి దుస్సాధం బగువిరోధియూథంబు సాధింపు మని దండయాత్రఁ బనిచిన నయ్యామునుండును సన్నద్ధుం డగుచుఁ ద

త్పురోహితప్రధానమంత్రివర్గంబు సన్నిహితంబు లగునివ్వార్షికదినంబులు గడపి శరత్సమయంబున విద్విషత్సంహారంబునకు విజయంబు సేయు మనుటయు న త్తెలుంగురాజున కెఱింగించి తత్సమ్మతంబున నిలిచె నంత. ౭౫.

టీ. అప్పలుకులువిని = ఆ వాక్యము లాలకించి, ఖిన్నుండై = ఖేదయుక్తుండై, ఆకర్ణించినపాషండషండంబు = వాదమునకు నాయత్తపడివచ్చిన యావేదబాహ్యులసమూహము, తలవంచుకొని = అవనతశిరస్కులై, లేచిపోయినన్ = ఉత్థితులైపోఁగా, ఆయుర్వీధవుండును = ఆ రాజును, అతనిమాహాత్మ్యంబునకు = అయ్యామునాచార్యుని ప్రభావంబునకు, సంతోషించి = శ్లాఘించి, సాష్టాంగమెఱఁగి = ఎనిమిదియంగములతో నమస్కారమొనర్చి, ఉరస్సు, శిరస్సు, దృష్టి, మనస్సు, వచస్సు, కాళ్లు, చేతులు, చెవులు, ఈయెనిమిదింటితోఁ జేయునమస్కారము సాష్టాంగము. (దండవత్తుగా భూమిపయింబడుట సాష్టాంగమంద్రు) (ఎఱగెఁజేమోడ్చె ననునమస్కృతియొనర్చె ననుట కివియాఖ్యలై చెల్లున యాంధ్రనామ సంగ్రహము) హర్షాద్భుతరస = సంతోషరసముచేతను, ఆశ్చర్యరసముచేతను, ఉత్తరంగిత = ఉప్పొంగింపఁబడ్డ, అంతరంగుండై = హృదయముగలవాఁడై, భుజగశయన = శేషశాయియొక్క, చరణకుశేశయ = పాదపద్మములయందు, భక్తిపొడమి = భజింపవలయునన్న యాసక్తిపుట్టి, కృతార్థతంబొంది = కృతకృత్యుండై, పాండ్యమండలంబునకు = పాండ్యదేశమునకు, భాగినేయుండై = మేనల్లుఁడై. పట్టార్హుండుగాఁబున = ప్రభుత్వమునకుఁ దగినవాఁడుగాన, పాత్రంబని = యోగ్యుఁడని. బ్రహ్మచారియగునతనికిన్ = వటువైనట్టి యయ్యామునాచార్యునకు, తనకడగొట్టుచెలియలిన్ = తనపిన్నతోబుట్టువును, పరిణయంబుసేసి = వివాహము గావించి, అరణంబుగన్ = కట్నముగ, (అరణంబనఁగా పెండ్లికాలమందు మామగారల్లునికిచ్చునట్టి ద్రవ్యము) అమ్మహాత్మునకు = ఆ వటువునకు, ధారాపూర్వకంబుగాన్ = దానముగాను, అర్ధరాజ్యంబిచ్చి = సగముదేశమునొసంగి, యువరాజుంజేసి = చిన్నరాజుగానియమించి, అధీతసాంగవేదుండగు = షడంగవేదవేత్తయగు, అతనికిన్ = అయ్యామునాచార్యునకు, అథర్వశిరస్సు = అథర్వణశిఖ. అభ్యస్తంబని = చదువఁబడినదని, ఎఱింగి = తెలిసి, అందు = ఆ యాథర్వణవేదమందు, దివ్య = మహిమగల, అస్త్రమంత్రంబుల = బ్రహ్మాస్త్రము మొదలగు నస్త్రంబులయొక్కయు, తత్సాక్షాత్కారము చేయుమనువులయొక్కయు, కలిమియున్ = కలిగియుండుటను, తెలిసి = ఎఱింగి, అమ్మహాత్మునకు = అతనికి, ఎచ్చరించి = ప్రస్తావమొనరించి, దుస్సాధంబగు = సాధింపశక్యముగాని. విరోధియూథంబున్ = శత్రుసమూహమును, సాధింపుమని = జయింపుమని, దండయాత్రన్ = యుద్ధయాత్రను, పనిచినన్ = చేయుమనఁగా, అయ్యామునుండు = అయ్యామునాచార్యుండు, సన్నద్ధుండగుటయున్ = ప్రయాణోద్యుక్తుండైన సమయమునను, తత్పురోహి

త్ప్రధానమంత్రివర్గంబు, తత్ = ఆ యామునాచార్యునియొక్క, పురోహిత = పురోధస్సులయొక్కయు, ప్రధాన = దివానులయొక్కయు, మంత్రి = అమాత్యులయొక్కయు, వర్గంబు = గణంబు, సన్నిహితంబులగు = సమీపించియున్న, ఇవ్వార్షికదినంబులు = ఈ వానకాలపుదివసంబులు, కడపి = వెళ్ళజేసి, శరత్సమయంబునన్ = ఆశ్వయుజకార్తికమాసములయందు, విద్విషత్సంహారంబునకున్ = శత్రువులం బరిమార్చుటకు, విజయంబు సేయుమనుటయు = చనుండనఁగా, అత్తెరంగు = ఆ వర్షాకాలప్రయుక్తప్రతిరోధమును, రాజునకున్ = ప్రభువునకు, ఎఱింగించి = తెలిపి. తత్సమ్మతంబునన్ = ఆ రాజుయొక్క యనుమతిచేతను, నిలిచెన్ = వెళ్ళకయుండెను, అంత = అటుపిమ్మటను.

తా. అపు డిట్లద్భుతంబుగ నుత్పన్నంబులైన వాక్యంబులనువిని చేయునదియు లేక యాసభయందున్న పాషండులగు దుర్వాదులు ఖిన్నులై లేచిపోవంజూచి రాజయ్యామునాచార్య మహత్త్వంబునకు మెచ్చి సంతసించి యన్విప్రునకు దండప్రణామంబాచరించి శ్రీవిష్ణుదేవునియందు భక్తిజనించుటవలనఁ గృత్యుండై తనరాజ్యము మేనల్లునికిం బట్టముగట్టునట్టిసంప్రదాయకముగలది యగుటంజేసి యతనికిం దనముద్దుచెలియలినిచ్చి వివాహం బొనర్చి యావివాహకాలమున ధారాపూర్వకంబుగఁ దనరాజ్యమున సగరాజ్యంబిచ్చి యువరాజుగా నియమించి తరువాత సధీత నిఖిలాస్త్ర వేదుండగు నతనిం జిరకాలముగఁ దనకసాధ్యులైయున్న శత్రురాజుల సాధింపుమని నిరూపింప నందుల కయ్యామునాచార్యుండొడంబడి యుద్ధయాత్రవెళ్లుట కుద్యుక్తుండై యున్నంజూచి మంత్రిపురోహితులు మొదలగు వారలిప్పుడయనించియున్న వర్షాకాలము వెళ్లగానే దండయాత్ర యొనర్చుట యుక్తమని విన్నవించిన నవ్విధం బారాజునకుం దెలిపి యతని యనుజ్ఞవడసి నిలిచియుండె నింతలో ననిభావము.

ఉ. కర్కశుఁ డంత కోర్వ కుద ♦ కంబులు వాఃపతి గూర్చినట్లు న
య్యర్కుఁడుఁ దాను గూర్చి మఱి ♦ యాసలిలాధిపచిహ్న వాహతం
బేర్కొలుగంగ నాతఁడెల ♦ మి న్మకరస్థితిఁ గన్న నీర్ష్యఁ దాఁ
గర్కటకస్థుఁ డయ్యె ననఁ ♦ గర్కటకస్థితిఁ గాంచె నత్తఱిన్. ౭౬

టీ. అర్కుఁడు = సూర్యుఁడు, కర్కశుఁడంతయు = ఉగ్రుఁడైనవాఁడనుటయు ఓర్వక = సహింపక, ఉదకంబులు = జలములను, వాఃపతిగూర్చినట్లు = వరుణుఁడు సంగ్రహించినట్లు, అయ్యర్కుఁడున్ = ఆసూర్యుఁడును, తానుగూర్చి = తానును జలసంగ్రహముఁజేసి, మఱి = తరువాతను, ఆసలిలాధిపచిహ్న = వరుణునియొక్క యా గుర్తు, వాహతన్ = తనకువాహనమగుటచేతను-పేర్కొలుగంగన్ = ప్రసిద్ధపడునట్లుగా, అతఁడు = ఆవరుణుఁడు-ఎలమిన్ = ప్రీతితో = మకరస్థితిన్, మకర = మొసలి

యందు-స్థితిః = ఉండుటను, కన్నక్ = పొందఁగా, ఈర్ష్యక్ = అసూయచేతను, తాక్ = తాను, కర్కటకస్థుఁడయ్యెననక్ = కుళీరమందుఁబ్రవేశించెనోయన్నట్లు, అత్తరిక్ = ఆసమయమందు, కర్కటకస్థితిఁగాంచెక్ = కుళీరమందుఁ బ్రవేశించెను (సూర్యునకు సహజమైన కర్కాటకరాశి ప్రవేశమునకు మకరస్థగురువైర్యాకృతత్వమును ఉత్ప్రేక్షించుటవలనను త్ప్రేక్షాలంకారము) అనఁగా సూర్యుఁడు కర్కాటకమును బ్రవేశించెనని చెప్పుటవల్ల వర్షాకాలమారంభమాయెనని భావము.

తే.గీ. వనతతివరాహవాహరి ♦ వాయుభుగ్వి, రోధివారణవర్షాభు ♦ లాధిఁ బొరలఁగ,
నెంద్రి రవి చేర మూఁడవ ♦ యెడకుఁ జేరు, తరణి ధరణిం బ్రమోదసం♦ధాయి గాఁడె.

టీ. వనతతి = వనసమూహమును, వరాహ = అడవిపందులును, వాహరి = మహిషజాతియును, వాయుభుగ్విరోధి = మయూరములును, వారణ = ఏనుఁగులును, వర్షాభులు = కప్పలును, ఆధిఁబొరలఁగ = మనోవ్యథమానెను, (ని. వరాహస్సూకరో ఘృష్టిః । నీలకంఠో భుజంగభుక్ । కుంజరో వారణః కరీ । లులాయో మహిషో వాహద్విషత్కాసరసైరిభాః । భేకే మండూకవర్షాభూ. అనియంతటనమరము.) రవి = సూర్యుఁడు, ఎంద్రిక్ = కర్కటమును, చేరక్ = ప్రవేశింపఁగా, మూఁడవయెడకుక్ = జన్మలగ్నతృతీయస్థానమునకు, చేరు = ప్రవేశించునట్టి, తరణి = సూర్యుఁడు, ధరణిక్ = భూమియందు, ప్రమోదసంధాయి = సంతోషమునిచ్చువాఁడు, కాఁడె = కాఁడా, ( అగునసుట.)

తా. షట్త్రిదశస్థోభానుః అని జన్మరాశికి మూఁటనారింటఁ బదింటనున్న సూర్యుఁడు శుభఫలప్రదుఁడుగాన వనతతి-వారాహ-వాహరి-వాయుభుగ్విరోధి-వారణ-వర్షాభులనామాద్యక్షరము వకారమగుటవలన వోవా వీవో రోహిణీ అని నామాద్యక్షరముచేత వీనికి రోహిణీనక్షత్రమాయెనుగానఁ గృత్తికా త్రిపాదం రోహిణీ మృగశిరార్ధం వృషభమని వృషభలగ్నమాయెను ఆవృషభలగ్నమునకు మూఁడవదియైన కర్కాటకమందు రవిప్రవేశింపఁగానే వర్గములు కుసిసినందున యాతింటికిని సంతోషకరుఁడాయెనని చెప్పి సామాన్యముచేత విశేషమును సమర్థించినందునఁ బ్రరూపంబగు నర్థాంతరన్యాసాలంకారము-అనఁగా నెల్లప్పుడు నుదకములను గోరుచుండువనము మొదలగు నాతింటికిని సూర్యుఁడు కర్కాటకమును బ్రవేశింపఁగానే వర్షాకాలముగనుక వానలుగురిసి మిగుల సంతోషకరముగానుండెనని భావము.

తే.గీ. వనధిగమనజగర్భార్క ♦ జనితఘృణులు, మతి ప్రసూతికి నతని ♦ ధామముఁ జేరె,
ఘనతఁ జొచ్చినయిండ్లను ♦ వనయ లుండి, కాన్పు నయఁ బుట్టినిల్వేరు ♦ క్రమము గనమె.

టీ. వనధి = సముద్రముయొక్క, గమన = పొందుటచేతను, జ = పుట్టిన, గర్భ = గాలుగల, ( అనఁగా నుదకములోపలఁ గలిగినట్టువంటి) అర్క = సూర్యునివలన,

జనిత = పుట్టినటువంటి, ఘృణులు = కిరణములు, మఱి = తదనంతరమందు, ప్రసూతిన్ = ప్రసవించుటకు, అతనిధామంబున్ = ఆసూర్యునియొక్క స్థానమును, చేరెన్ = ప్రవేశించెను, ఘనతన్ = ఆధిక్యము చేతను. చొచ్చినయిండ్లన్ = అత్తవారిండ్లను, తనయులు = కొమార్తెలు, ఉండి = కాపురముండి, కాన్పునకున్ = ప్రసవమునకు, పుట్టినిల్చేరుక్రమమున్ = తల్లిగారింటికివెళ్లుమర్యాదను, చూడమా-చూచుచున్నామనుట.

తా. సూర్యకిరణములే మేఘములని ప్రసిద్ధిగాననట్టి సూర్యునివల్లఁబుట్టిన మేఘములు సముద్రునింబొందుటచేతఁ గలిగినలోపల నిమిడియున్న యుదకములను గర్భములఁదాల్చి ప్రసవమునకుఁ దమజన్మస్థానమైన సూర్యునిఁజేరుచున్న వన్నట్లు వర్షించుచున్న వనియు-గొప్పదనముచేత నత్తవారింటఁ గాపురముచేయుచున్న కొమార్తెలను గర్భములుగాఁగానే బిడ్డగనుటకుఁ బుట్టినిల్లు చేరుచుండుమర్యాద యందలు గుర్తెఱిఁగినదేయని యు మేఘములు సముద్రోదకముచేత గర్భమునుధరించి లోకమునంతట వర్షించుచున్న వని ప్రతీతిగనుక నిట్లువర్ణించెనసియును తాత్పర్యము.

తే.గీ. ఉర్విఁ గాదంబినులయల♦యుప్పనీరు, దొరుగఁ గేకులు కేకల♦తోన సేసె, ద్విజత
నారణ్యకధ్వని ♦ వినఁగఁ జేసిఁ, గర్భము సుఖచ్యుతము సేయఁ ♦ గడఁగె ననఁగ. ౭౯.

టీ. ఉర్విన్ = పుడమియందు, కాదంబినుల = మొయిళ్లగుంపులయొక్క, అల = ప్రసిద్ధమైన, ఉప్పనీరు = ఉబ్బనీరు, తొరుగన్ = స్రవింపగా, ద్విజతన్ = ద్విజత్వము చేతను ( ని. దంతవిప్రాండజాద్విజాయని యమరము ) అరణ్యకధ్వని = ఆటవికజనము వర్షమురాఁగా వర్షమువచ్చెనని రొదచేయునుగనుక నదియనునారణ్యకశాఖయొక్క ధ్వనిస, వినఁగఁజేసి = శ్రుతపఱిచి, గర్భము సుఖచ్యుతము సేయన్ = సుఖప్రసవము గల్గునట్లొనర్చుటకు, కడఁగెననఁగన్ = ఉపక్రమించెననఁగా, కేకులు = నెమళ్లు, కేకలు = కేకాస్వరములను, తోన = వెంబడిగానె, చేసెన్ = ఒనర్చెను, ఇచ్చట మేఘోదయమువలన సంతసించిన మయూరములయొక్క కేకలను సుఖప్రసవార్థమైన యారణ్యక శాఖాధ్వనికి హేతువని యుత్ప్రేక్షించినందున నుత్ప్రేక్షాలంకారము.

తా. లోకమందు వేకటిగలయువిదలకుఁ బ్రసవసమయంబునఁ గల్గునుప్పనీరు గానుపింపఁగా నక్కడనుండుస్త్రీలు దానింజూచి ప్రసవకాలంబనియూహించి తమలోఁ దాము గొలగొలలాడుట ప్రసిద్ధముగావున నావిధముగ నెమళ్లు మేఘమ్ములనుండి యుబ్బనీరు స్రవింపఁగాఁ దాము ద్విజులగుటంజేసి సుఖప్రసవార్థమారణ్యక శాఖ నధ్యయనముఁజేసి వినుపించుటకు నుపక్రమించెనో యన్నట్లు వెంబడించి కేకానాదములం జేసెనని తాత్పర్యము.

మ. అలపర్జన్యుఁడు భానుఁ డన్కొలిమిలో ♦ నభ్రంపుఁబెన్గాఁపెరన్, జల మూఁగన్
బిడు గుక్కు జాత్యపుటయ ♦ స్కాంతంబు నత్తున్కలో, పలఁ జూప న్మహిమీఁది
లోహరజముం ♦ బైఁ బర్వె నా లేచె వా, త్యలఁ బ్రాగ్గ్రావమషు
ల్మొగి ల్మొదల గ్ర ♦ ధ్రంబై దివిం బర్వినన్. ౬౦.

టీ. అల = ప్రసిద్ధుఁడైన, పర్జన్యుఁడు = దేవేంద్రుడుకమ్మరవాఁడు, భానుఁడన్ = సూర్యుఁడనియెడు, కొలిమిలోన్ = అయోగోళమందు, అభ్రంపుఁబెన్గాఁపెరన్ = మేఘమను పెద్దనీళ్లకాఁగునను. జలమూఁగన్ = ఉదకములనింపుటకై, పిడుగుక్కు, పిడుగు = అశనియను, ఉక్కు = లోహముయొక్క, జాత్యపు = సజాతీయమైన, అయస్కాంతంబు = సూదంటుఱాతియొక్క, అత్తున్కన్ = ఆశకలమును, లోపలన్ = అంతర్భాగమందు, చూపన్ = అతికింపఁగా, మహిమీఁది = భూమండలము మీదనున్న, లోహరజముల్ = ఉక్కుపొడి, పైన్ = పైకి, పర్వెన్ = ఎగసి వ్యాపించెన్ = నాన్ = అనునట్లు, వాత్యలన్ = సుడిగాడ్పులచేతను, ప్రాగ్గ్రావమషుల్ ప్రాగ్గ్రావ = మొదటిదైన కార్చిచ్చులయొక్క, మషుల్ = బూడిదలు, మొగిల్ = మేఘము, మొదలన్ = ప్రప్రథమమందు, గ్రధ్రంబై = గృధ్రపరిమాణముగలదై, దివిన్ = అంతరిక్షమందు, పర్వినన్ = వ్యాపింపఁగా, లేచెన్ = ఎగసెను.

తా. తొల్తొల్త మేఘము గృధ్రమాత్రమై యంతరిక్షమున నుండనప్పుడు భూమియందున్న కార్చిచ్చుల మషీసమూహములు సుడిగాడ్పులచే, నెగరఁగొట్టబడి పైకెగసి యందున్న స్వల్ప మేఘమును గలయునపుడు పర్జన్యుండను కమ్మరవాఁడు సూర్యుఁడను కొలిమియందు మేఘమనునీళ్ల కాఁగును నీరుకాగఁబెట్టుటకై పిడుగుక్కునకు సజాతియైన సూదంటుఱాతి తునుకను లోపల నతుకఁబెట్టఁగాఁ బుడమియందున్న లోహరజఃపుంజములన్నియుం బయికెగసి యామేఘము నావరించి వృద్ధిబొందించునట్లుండెనని భావము రూపకోత్థాపితమైన యుత్ప్రేక్షాలంకారము.

తే,గీ. ఇలవుడిగి చుట్టిచుట్టి దు♦మ్మెత్తియెగసి, పోయి తముముంచుసుడిగాలి♦పుష్కరముల
గడలినీరభ్ర కలభము♦ల్గ్రాసె ధరణి, నభ్రకరిశిక్ష దివి గాంచి ♦ నట్టికరణి. ౬౧.

టీ. ఇలవుడిగి = భూమికిదిగి, చుట్టచుట్టి = గిరగిరందిరిగి, దుమ్మెత్తి = ధూళినిగ్రహించి, ఎగసి = మీఁదికెగిరిపోయి, తముష్ = తమ్మును (అనఁగా మేఘములననుట) ముంచు = కప్పుచున్న, సుడిగాలి = తిరుగుడువాయువను, పుష్కరములన్ = తొండపుకొనలచేతను, అభ్ర = మేఘములనియెడు, కలభముల్ = ఏనుఁగుగున్నలు, కడలినీరు = సముద్రమునఁ బానముఁజేసియున్ననీటిని, ధరణిన్ = భూమియందు, గ్రాసెన్ = వెళ్ళఁజల్లెను, అభ్రకరి = ఐరావతముయొక్క, శిక్షన్ = నేర్పటను, దివిన్ = అంతరిక్షమందు, గాంచినట్టికరణిన్ = పొందెనో యన్నట్టుంబలె నీరు వెళ్లగ్రాసెనని క్రిందికిననన్వయము

తా. లోకంమునం దేనుంగులు దొండంబుల కొనలచేత దుమ్మెత్తి పైకిం జల్లుటయు ను నీటిఁబీల్చి మరల వెళ్ళఁజిమ్ముటయును బ్రసిద్ధముఃగావున మేఘములను నేనుంగుగున్న లు భూమియందు లేచిన సుడిగాడ్పులను తుండంబులచేత సముద్రోదకమును పానముఁ జేసి యైరావతముయొక్క సాహచర్యముచేత నంతరిక్షమం దభ్యాసముఁజేసిన విద్యచేత నోయన్నట్టుంబలె మరల వెళ్ళఁజిమ్మెననుట,రూపకోత్థాపితమైన యుత్ప్రేక్షాలంకారము.

తే,గీ. కృతపయఃపాననవమేఘ ♦ పృథుకములకు, రాలెనొయ్యన వడగండ్ల ♦ పాలపండ్లు
మఱిబలాకాద్విజాళిసం♦ప్రాప్తిగలిగెఁ, బెరుగఁ బెరుగంగ ధ్వనియుగం♦భీరమయ్యె.

టీ. కృత = చేయఁబడిన, పయః = ఉదకములను క్షీరములయొక్క, (పయఃపానీయ దుగ్ధయో యనిరత్నమాల) పాన = త్రాగుటగలిగినట్టి, నవ = క్రొత్తలైన, మేఘ = మొయిళ్ళనియెడు, పృథుకములకున్ = పసిబిడ్డలకు (పృథుకశ్శాబకశ్శిశుపని యమరము) ఒయ్యనన్ = మెల్లమెల్లగా, వడగండ్లపాలపండ్లు = వర్షోపలములను బాల్యదంతములు, రాలెన్ = పడెను, మఱి = వెనుకను, బలాకా = కొంగలనియెడు, ద్విజాళి = పులువరుసయొక్క, సంప్రాప్తి = ప్రాప్తించుట. కలిగెన్ = సంభవించెను, పెరుగఁబెరుగంగన్ = నానాటవృద్ధిఁబొందగా, ధ్వనియు = శబ్దమును, గంభీరమయ్యెన్ = మిగులనతిశయించెను.

తా. స్తన్యపానముఁజేయు పసిబిడ్డలకు మెల్లమెల్లనఁబాలపండ్లు రాలి మరలపండ్లు మొలవఁగా నానాటవృద్ధిబొంది స్వరమతిశయించునట్లుదక పానముగల నూతన జలధరములకు వడగండ్లను బాల్యదంతములురాలి పిమ్మటఁగొంగలను దంతపఙ్క్తిక్రమముగ వృద్ధిఁజెందఁగా గంభీరధ్వని యతిశయిల్లెననుట రూపకాలంకారము.

మ. తనతోయంబినరశ్ము లెత్త నిల వా ♦ త్యారేణుమూర్తి న్మహేం,
ద్రునకుం జెప్పఁగ ముచ్చుఁ బట్టి దివమం ♦ దు స్వల్ఘటింపం భయం,
బునఁ దద్రశ్మిసహస్రము ల్వెన శిగెం ♦ బో డాగి వె గ్రుస్సునిం,
ప ననం ధారలు దోఁచె మించు వెలుఁగిం ♦ ప న్మబ్బుల న్వానకై. ౮3.

టీ. తన = భూమియొక్క, తోయంబు = నీటిని, (తోయమనుశబ్దము దేశ్యమగుటవలన ముఖ్యవస్తువును బోధించుచున్నదిగాన (శ్రేష్ఠమైనపదార్థమనుట) ఇనరశ్ములు = సూర్యకిరణములు, ఎత్తన్ = అపహరింపగా, ఇల = భూమి, వాత్యా = సుడిగాలివల్లనెగసినట్టి, రేణు = పరాగరూపమయిన, మూర్తిన్ = శరీరముచేతను, మహేంద్రునకున్ = దేవేంద్రునకు, చెప్పఁగన్ = ఎఱింగింపగా, ఆయింద్రుండు, ముచ్చున్ = దొంగను, పట్టన్ = పట్టుటకై, దివమందున్ = అంతరిక్షమునందు, విఘటింపన్ = ధనుస్సు

నుబూనఁగా, భయంబునన్ = భీతిచేతను, తద్రశ్మి సహస్రముఖన్. తత్ = ఆ సూర్యునియొక్క, రశ్మి = కిరణములయొక్క సహస్రముఖన్ = వేయును, వెసన్ = వేగముచేతను, డాగి = కానరాకయుండి, వేన్ = త్వరితముగ, వెల్లిపైన్ = ప్రవాహముమీఁదను, గ్రుప్పరింపన్ = వర్షించుటకు, డిగెంబో = ఏగెను గాఁబోలు, అనన్ = అనునట్లు, మించు = మెఱుపు, వెలిఁగింపన్ = కనుపించునట్లు వెలుఁగుచేయఁగా, మబ్బులన్ = మేఘములయందు, ధారలు = నీటిదారలు, తోఁచెన్ = కనఁబడెను.

తా. భూమి తనయుదకములను ముఖ్యవస్తువులను సూర్యకిరణములుహరించికొనిపోయినవని సుడిగాలిచే రేపఁబడిన పరాగరూపమునుదాల్చి యింద్రునితో మొరవెట్టనా యింద్రుఁడంతరిక్షమందా దొంగలను బట్టుటకై తన ధనుస్సును గనుపఱుపఁగా నందుకు భయమంది సహస్రకిరణములు నేకకాలమందు వానిం గ్రుమ్మరింప నుద్యమించినవో యనునట్లు మేఘములనుండివచ్చు నుదకధారలు మెఱుపుల వెలుంగునఁ గానవచ్చుచుండెననుట.

చ. తొలితొలివచ్చు ధారలకె ♦ యెదుర్కొని తచ్ఛటఁ దీఁగెచుట్టుగా,
నలముచు ధాత్రి లేచి పొలు♦పారె మలీమసబాష్పవల్లులం,
దొలితొలి ధారకే వెఱచి ♦ తోనె ఘనాఘము వానకాళ్ళకుం,
బలరిపుఁ డాలయాభ్రముల ♦ భంగినెసంకెల లూన్చెనో యనన్. ౭౪.

టీ. తొలితొలివచ్చు = ముందుముందుగవచ్చుచున్న, ధారలకు = నీటిధారలకు, ఎదుర్కొని = ఎదిరించి, తచ్ఛటన్ = ఆ ధారాసమూహమును, తీఁగెచుట్టుగా = లతాపరివేష్టనమన్నట్టుగా, అలముచున్ = చుట్టుకొనుచు, ధాత్రిన్ = భూమియందు, లేచి = ఉత్థితమై, మలీమస = నల్లనైన, బాష్ప = పొగలయొక్క, వల్లులు = తీఁగెలు, బలరిపుఁడు = ఇంద్రుఁడు, అత్తొలితొలిధారకె = ముందుముందుగురిసినయుదకధారకె, వెఱచి = మిగుల వర్షించునని జంకి, తోనె = వెంబడియె, ఘనాఘము = మేఘసమూహముయొక్క, వానకాళ్లకున్ = ధారలనుబాదములకు. ఆ = ప్రసిద్ధమయిన, లయ = ప్రళయకాలమందలి, అభ్రములభంగినె = పుష్కలావర్తాదిమేఘములకుంబలె, సంకెలలు = నిగళబంధములు, ఊన్చెనోయనన్ = ఒనర్చెనోయన్నట్లు, పొలుపారెన్ = ఒప్పుచుండెను. (ని. సమిత్తిర్యండలీ పిండీరించోళీః పటలీఘటా, మలీమసంతుమలినంకచ్చరం మలదూషితం, బాష్పనేత్రజలోష్మణోః, వల్లీతుప్రతతిర్లతా అని యంతట నమరము.)

తా. నేలమీఁదఁ జినుకులురాలఁగానె యందున్నవేఁడిమి పొగరూపమ్మై పైకెగయుట ప్రసిద్ధముగాపున ముందు ముందు వర్షించు నుదకధారలచేత నైన గ్రీష్మాతపతప్త

భూమియొక్క పొగలీఁగ లెదుర్కొనుచుండ దేవేంద్రుండు తొలుదొల్తఁగను పడినయుదకధారలను వెలిచి ముందు విశేషముగ వర్షించునన్న శంకచేత మున్ను ప్రళయకాలమేఘములైన పుష్కలావర్తాదులను నిర్బంధించిన విధమున నీమబ్బులకును సంకెలలుదగిలించెనో యన్నట్లొప్పుచుండెననుట.

చ. ఎడపక మున్ను మింటిపయి ♦ నేతగులంబును లేక మూకతన్,
న్వెడలెడుచోఁ గఠోరఘన ♦ బృందము లడ్డమువడ్డ వానిమే,
యిడియ జవోష్మఁ బాఱెడుర ♦ వీందులదట్టపుబండికండ్లచ,
ప్పుడుగతి మ్రోసె రేవగలు ♦ భూరిభయంకరగర్జ లత్తఱిన్. ౨౫.

టీ. ఎడపక = ఎడతెగక, మింటిపయిన్ = ఆకాశమందు, మున్ను = వర్షాకాలమునకుఁ బూర్వమందు, ఏతగులంబును లేక = ఏ ప్రతిబంధమును లేక, మూకతన్ = చప్పుడు లేనట్లు, వెడలెడుచోన్ = పోవువేళలను, కఠోర = దట్టమైన, ఘన = మబ్బులయొక్క, బృందములు = గుంపులు, అడ్డమువడ్డన్ = నిరోధింపఁగా, వాని = ఆ మేఘములయొక్క. మే = శరీరము, ఇడియన్ = చూర్ణమగునట్లు, (ఇడియనన్నది ద్రావిడదేశీయము) జవోష్మన్ = వేగముచేతివేండ్రము చేతను, పాఱెడు = పరువిడుచున్న, రవీందుల = సూర్యాచంద్రులయొక్క, దట్టపు = సాంద్రమైన. బండికండ్ల = రథచక్రములయొక్క, చప్పుడుగతిన్ = ధ్వనివలెను, రేవగలు = అహోరాత్రములు. భూరి = అధికమగునట్లు, భయంకర = భీకరములైన, గర్జలు = ఉఱుములు, అత్తఱిన్ = ఆసమయమందు, మ్రోసెన్ = శబ్దించెను.

తా. వర్షాకాలమునకుఁ బూర్వమున నాకాశమం దెడతెగక యేలాటి ప్రతిబంధము లేమింజేసి నిశ్శబ్దముగఁబోవునప్పుడు దట్టమైన మబ్బుల చాళ్ళడ్డమురాఁగా వాని కాయంబులు చూర్ణంబు లగునట్లు వేగముచేతి వేడిమితోఁ బరువిడుచున్న దివాకరక్షపాకరులయొక్క యరదముల చప్పుడుల పగిది నయ్యవసరంబున నహోరాత్రంబులత్యంతభయంకరంబులైన యురుము లురిమెననుట.

చ. దినములవెంబడిం జడని ♦ ధిన్మును గ్రోలిననీరులోనఁ బే
రినలవణంపుఘట్టముల ♦ దృప్యదిరమ్మదరావము ల్పటు
ల్కొని పెటిలించునార్భటులొ ♦ కో యనఁగా సతటిద్భయంకర
స్తనితముల న్సృజించె నతి సాంద్రఘనాఘన గర్భగోళముల్. ౨౬.

టీ. దినములవెంబడిన్ = దినాలవరుసను, జడనిధిన్ = సముద్రమందు, మునుగ్రోలిననీరు = మున్ను త్రావిన యుదకము, లోనన్ = లోపలను, పేరిన = ఘనీభవించిన, లవణంపుఘట్టములన్ = ఉప్పుబిళ్ళలను, దృప్యత్ = అతిశయించినట్టి, ఇరమ్మద = మేఘ

జ్యోతియనెడు, దావముల్ = కార్చిచ్చులు, తవుల్కొని = అంటుకొని, పెటిలించు= పెట్లునట్లుగఁ జేయునట్టి, ఆర్భటులొకో యనఁగా = ప్రయత్నములో యన్నట్లు, సతటిద్భయంకర = మెరుపులతోఁగూడి భయంకరములైన, స్తనితములన్ = ఉరుములను, అతిసాంద్ర = మిగులదట్టమైన, ఘనాఘన = వానకాలపు మొయిళ్ళయొక్క, గర్భగోళములు = ఉదరప్రదేశములు, సృజించెన్ = కావించెను, (వార్షికాబ్దో ఘనాఘన యని యమరము) ఉత్ప్రేక్షాలంకారము.

తా. మేఘములు నానాటసముద్రమందుఁ ద్రావిన నీరులోపలఁబేరి యుప్పబిళ్ళలు కాఁగా వానిని మేఘాగ్నులు దహింప నందుఁ బుట్టిన పెటపెటధ్వనులో యన్నట్లు మించులచేత భయంకరములై యున్న యురుములామేఘములయం దొప్పచుండె ననిభావము.

మ. ఇనరశ్ము ల్తృష వార్ధిఁ జేరి జలమె ♦ క్కింతౌన నాత్మోష్మఁ జు
య్యని వెంటం బొగముంచికో నెగసి వా ♦ తాఘూతతత్సంధులం
గన నౌచుం గళదశ్రులై వడఁకురే ♦ ఖం దిక్తటప్రోత్థిత
స్తనయిత్నుచ్ఛటఁ జంచల ల్మెఱఁసె నా ♦ సారంబు దోరంబుగన్. ౮౭.

టీక. ఇనరశ్ములు = సూర్యకిరణములు, తృషన్ = దప్పిచేతను, వార్ధిఁజేరి= సముద్రమునుబొంది, జలమెక్కింతౌనన్ = ఉదకమును గొంతఁబానముచేయఁగా, ఆత్మోష్మన్ = స్వకీయమైన యుబ్బచేత, చుయ్యని=చుయ్యుమని ధ్వనిపెట్టి, వెంటన్ = వెంబడిగా, పొగముంచికోన్ = ధూమముగప్పుకొనఁగా, ఎగసి = అంతరిక్షమునకెగసి, వాత = గాలిచేతను, ఆఘూత = కదలింపఁబడిన, తత్సంధులన్ = ఆమబ్బుయొక్కసందులయందు, కననౌచున్ = అగపడుచు, గళత్ = జారుచున్నట్టి, అశ్రులై = కన్నీళ్ళుగలవై (వడదగిలినపుడు గన్నులనీరురాలుట ప్రసిద్ధము) వడకురేఖన్ = కంపించుచందమున, దిక్తట = దిగంతములయందు, ప్రోత్థిత = పుట్టినట్టి, స్తనయిత్నుచ్ఛటన్ = మొయిళ్ళగమియందు, ఆసారంబు = ముసారువాన, తోరంబుగన్ = అతిశయింపఁగా, చంచలల్ = మెరుపులు, మెఱసెన్ = వెలిఁగెను. (ని. స్తనయిత్నుర్వలాహకః। ధారాసంపాతఆసారః। చంచలాచపలాపిచ యనియంతట నమరము.)

తా. సూర్యుని కిరణరూపంబులగు మేఘములు సముద్రోదకమును బీల్చుతఱిఁ దమయొక్క యూష్మముచేతఁ జుయ్యుమని శబ్దించుచుండవెంటనె పొగ చుట్టికొన్నందునఁ బైకెగసి వాయువుచేతఁ గదలింపఁబడినందువల్లఁ దమయందు గానవచ్చుచునుగారుచున్న కన్నీరు గలదియునై కంపించు చందంబుననున్న మెరుపులు దిగంతములయందు జనించిన మేఘములయందు జడివాన గురియుచుండగాఁ బ్రకాశించెనని భావము.

మ. ఇలకుం గల్గినజీవనంబుల నిజా ♦ నిష్టోగ్ర మార్తండమం
డల మానందనవైరివైరి సఖుఁడౌ ♦ టం దద్రవిం బీల్చి య

య్యిల కొక్కప్పుడిఁ గ్రుమ్మరింపఁదగుఁదా ♦ నెంతైన నంతైనమం
డలముఁ రాహు పొసంగఁదాల్చు గతిమిం ♦ టం బర్వె నీలాభ్రముల్. ౭౭.

టీ. ఇలకున్ = భూమికి, కల్గిన = ఉన్నటువంటి, జీవనంబులన్ = ఉదకములను, నిజ = రాహువునకు, అనిష్ట = శత్రువైన, ఉగ్ర = తీక్ష్ణమైన, మార్తండ మండలము = సూర్యుని బింబము, ఆనన్ = పానము సేయఁగా, తన = తనయొక్క, వైరివైరి = పగవాని పగవాఁడు, సఖుఁడౌటన్ = మిత్రుఁడగుటచేతను, (అనఁగా లోకమందుఁ దన శత్రుని శత్రువు దనకు మిత్రుఁడౌట ప్రసిద్ధముగాన భూమియందున్న జలములనపహరించిన సూర్యునకు శత్రువైన రాహువునకు భూమికి మైత్రి యనుట) తద్రవిన్ = ఆసూర్యుని, పీల్చి = ఊటుకొని. (ముందు సూర్యుఁడు హరించిన యుదకములను మరల నాకర్షించి యనుట.) అయ్యిలకున్ = ఆభూమికి, ఒక్కప్పుడిన్ = ఒకపర్యాయమే, క్రుమ్మరింపన్ = కురియుటకు, తాన్ = ఆరాహువు, ఎంతైనన్ = ఎంతటి యాకృతిగలవాఁడైనను, తగున్ = సమర్థుఁడగునో, అంతైనమండలమున్ = అంతఁగా పెరుగుచున్న బింబమును, రాహు = సైంహికేయుఁడు, పొసంగన్ = సరిపడునట్లు, తాల్చుగతిన్ = ధారణ మొనరించెనో యన్నట్లు, నీలాభ్రములు = నల్లమబ్బులు, మింటన్ = ఆకాశమందు, పర్వెన్ = వ్యాపించెను.

తా. ఆకాశమం దంతట వ్యాపించియున్న నల్లమబ్బులను జూడఁగా భూమి తన జీవనంబులను సూర్యుండు పానముఁజేసి హరింపఁగా దాని మరల రప్పించుకొనవలయు నన్న యభిప్రాయముతో సూర్యునకు విరోధియైన రాహువుతోఁ జెప్ప నతఁడు భూమికి మిత్రుఁడౌటంజేసి యాసూర్య కిరణములయందున్న యుదకములను గ్రహించి వర్షించుట కుద్యమించిన రాహుమండలమో యన్నట్లుండెనని భావము.

తే.గీ. పుట్టవెడలి నభోభిత్తిఁ ♦ బట్టుశక్ర, కార్ముకపుఁబెద్ద పలువన్నె ♦ కట్లజెఱ్ఱి
దైననడచెడు కాళ్ళగుం ♦ పనఁగ గాలి, గారొక్కని దిగంతముల వాన ♦ కాళ్లు నడచె.

టీ. పుట్టవెడలి = వల్మీకమునుండి బయలుదేరి, (శ్లో॥ వల్మీకాగ్రాత్ప్రభవతిధనుః ఖండమాఖండలస్య యని కాళిదాసు ప్రయోగము.) నభోభిత్తిన్ = ఆకాశమనియెడు గోడను, పట్టు = అవలంబించునట్టి, శక్రకార్ముకపు = ఇంద్రధనుస్సనియెడు, పెద్ద = గొప్పదైన, పలువన్నె = నానావర్ణములుగల, కట్లజెఱ్ఱిదైన = కట్లుగలశతపది సంబంధియైన, నడచెడు = చనుచున్నట్టి, కాళ్ళగుంపనఁగ = పాదములచాళ్లనునట్లు, గాలిన్ = వాయువుచేతను, కారొక్కని = నల్లనివై, వానకాళ్లు = వర్షధారలు, దిగంతములన్ = దిక్తటములయందు, నడచెన్ = ప్రవర్తించెను.

తా. వల్మీకమునుండి వెడలి యాకాశమను గోడనాశ్రయించి నడచుచున్నయింద్రధనుస్సనియెడు బహువిధముల వన్నెలుగల కట్లు గలిగియున్న జెఱ్ఱికాళ్ళో యనునట్లు నలుగడలయందును వర్షధారలు గానఁబడె ననుట.

చ. ఒకచినుకు న్ససస్య యగు ♦ నుర్వికి డిగ్గఁగ నీవు మూఁగి చా
తకము లటంచు లోఁగనలి ♦ దట్టముగాఁ నలమేఘుఁ డాడుచుం
డక చన నూఁదఁగాఁ దొరఁగు ♦ నాళపుటుండలు వోలె రాలెఁద
క్కక పడు వర్షధారల మ ♦ ఖస్థములై కరకాని కాయముల్. ౯౦

టీ. ఒకచినుకున్ = ఒక్కబిందువును, ససస్యయగు = పయిరులుగల. ఉర్వికిన్ = భూమికి, చాతకములు = స్తోకకపక్షులు, మూఁగి = చుట్టుకొని, డిగ్గనీవు = జారనీయవు. (తామేవర్షబిందువులనన్నిటిని పానము జేసియనుట) అటంచున్ = ఈలాగనుచును, అల = ప్రసిద్ధుఁడైన, మేఘుఁడు = జలధరుఁడు, లోన్ = లోపలను, కనలి = కోపించి, దట్టముగాన్ = నిబిడముగాను, ఆడుచుండక = సంచరింపక, చనన్ = పోవునట్లు, ఊదఁగాన్ = వెళ్ళనూఁదఁగాను, తొరఁగు = వడుచున్న, నాళపుటుండలువోలె = క్రోవియందలియుండలవలెను. (లోకమునఁ బిట్టలుపట్టువారు నోటిలోనుంటలు వేసికొని గొట్టముతో వానిఁ బిట్టలపైఁ బడు నట్లూదుట ప్రసిద్ధముగానఁ బ్రయోగించినాడు) కరకాని కాయముల్ = వడగండ్లరాసులును, తక్కక = ఎడతెగక, పడు = పతనమగుచున్న, వర్షధారల = వానలకాళ్ళయొక్క, ముఖస్థములై = అగ్రములయందున్నవై, రాలెన్ = పడెను. శ్లో. సర్వంసహాపతితమంబునచాతకానామనియున్న ప్రకారము భూసంస్పృష్ట జలము చాతకములకు రోగహేతువుగాననంతరాళముననే గ్రహించుట ప్రసిద్ధము.

తా. చాతకపక్షు లొకబిందువునైనను భూమియందుఁ బడనీక పానముఁజేసి గుంపై యాడుచుండంజూచి మేఘుండాత్మలోఁ గోపించి యాచాతకపక్షులం గొట్టుటకై పిట్టలం బట్టువాఁడు నోటనించినయుండలను గొట్టముద్వారా వెళ్లగొట్టుచందంబున నెడతెగకుండ వర్షధారాముఖంబున వర్షింపగ వడగండ్లురాలెనని భావము.

సీ. ఎలగోలుజల్లు ము ♦ న్పెళపెళనేటవా ల్పడిగాలి నట్టిండ్లఁ ♦ దడిపి చనఁగ
నట్టితో వడగండ్ల ♦ కట్టావులు దుమార మావులు రేచి రెం ♦ డవదియుఁజన
మటి మూఁడవది నిల్చి ♦ మెఱసి బిట్టుఱిమి శీ కరవారిస్పృష్టిఁ ♦ జీఁకటిగ నలమ
నుయ్యాలచేరుల ♦ యొాజఁ బైపై వెండి జల్లుపై జల్లు పె ♦ ల్లల్లుకొనఁగ
భూభిదాపాదిదుర్భరాం ♦ భోభరంపు, వడిమరుజ్ఝంఝఁ దెరలక ♦ కడవ వంచి
నట్లు మెయారని ధారౌఘ ♦ మైక్య మొంది, విన్నుమన్నను నొకటిగా ♦ వృష్టిబలసె. ౯౧

టీ. ఎలగోలుజల్లు = మొదటవచ్చినవానజల్లు, మున్ = ప్రథమమందు, పెళపెళన్ = పెళపెళధ్వనితో, ఏటవాల్పడి ♦ వంపుగావాలి, గాలిన్ = వాయువుచేతను, నట్టిండ్లన్ = గృహమధ్యభూములను, తడిపి = నాన్చి, చనన్ = పోఁగా, అట్టి = ఆప్రకారమే, తోన్ = వెంబడిగానే, వడగండ్ల = వర్షోపలములయొక్క, కట్టావులు = అవిరులు, దుమార

ము=పరాగమును. ఆవులు=ఉబ్బలను, రేఁచి=ఎగరఁజేసి, రెండవదియున్=రెండవదియైన జల్లును, చనన్=పోఁగా. మఱి=పిమ్మట, మూఁడవది=తృతీయమయినవానజల్లు, నిల్చి=నిలువఁబడి, మెఱసి=మించులను వెలుగించి, బిట్టుఱిమి=మిగులగర్జించి, శీకర=తుంపరలతోఁగూడిన, వారిన్=ఉదకముచేత, సృష్టిన్=ప్రపంచమును, చీకటిగనలమన్=అంధకారమగునట్లు చుట్టుకొనఁగా, ఉయ్యెలచేరులయోజన్=డోలయొక్కగొలుసులవలెను, పైపైన్=మీఁదమీఁదను, (వెంటవెంటననుట) వెండి=మఱియును, జల్లుపైన్=వర్షముమీఁదను. జల్లు=వర్షము, పెల్లు=అతిశయముగ, అల్లుకొనఁగాన్=చుట్టుకోఁగా, భూభిదాపాది, భూ=భూమియొక్క, భిదా=భేదమును, ఆపాది=ప్రతిపాదించుచున్న, నిర్భర=భరింపశక్యముగాని, అంభోభరంపు=ఉదకాతిశయముయొక్క, వడిన్=వేగముచేతను, మరుఝ్ఝంఝన్=ఝంఝామారుతముచేతను, (ఝంఝావాతస్సవృష్టికయని యమరము) తెరలక=తెమలక, కడవవంచినట్లు=బానకుమ్మరించినవై ఖరిని, హోరని=హోరుమనుధ్వనితోఁగూడి, ధారౌఘము=ధారాసమూహము. ఐక్యమొంది=ఏకీభవించి, విన్నుమన్నునొకటిగా=ఆకాశభూములు రెండునొక్కటి యగునట్లు, వృష్టి=వర్షము, బలసెన్=వృద్ధిఁబొందెను.

తా, అపుడు భూమ్యంతరిక్షము లేక మగునట్లు హోరుమను ధ్వనితో నెడతెగకవర్షముగురియుచుండెననుట,

మ. అలపర్జన్యుఁడు కేకిపాత్రములగుం ♦ పాడించునో మేఘమం,
డలపున్ మద్దెల గ్రుంగ లేవను మరు ♦ త్స్వార్దంగికుం డర్థి నె
త్త లలి న్నేలకు వ్రాలుచు న్నెగయుచుం ♦ దారాడున త్తెల్లజ,
ల్లులుఁ గెంగుచ్చులు నయ్యె ధారలను ద♦ల్లోలేంద్రగోపంబులున్. ౯౨,

టీ. అలపర్జన్యుఁడు=ఆ యింద్రుఁడు, కేకి=మయూరములనియెడు, పాత్రముల=నటులయొక్క, గుంపు=సమూహమును, ఆడించుచోన్=నాట్యమాడించుతఱియందు, మేఘమండలపున్ మద్దెల=మబ్బులగుంపను మృదంగము, గ్రుంగన్=వంగఁగా, మరుత్స్వార్దంగికుండు=వాయువనెడు మద్దెలకాఁడు, లలిన్=విలాసముగా. అర్థిన్=ప్రియముతో, లేవను=ఉత్థితముకాఁగా, ఎత్తన్=పైకెత్తఁగా, ధారలును=ఉదకధారలును, నేలకున్=భూమికి, వ్రాలుచున్=వంగుచును, ఎగయుచున్=మీఁదికినెగయుచును, తారాడు=జీరాడుచున్న, అత్తెల్లజల్లులున్=అధవళమయిన జాలరులును, తల్లోలేంద్రగోపంబులున్, తత్=ఆ వర్షధారలయందు, లోల=చలించుచున్న, (చలల్లోలంచలాచలమనియమరము) ఇంద్రగోపంబులున్=ఆర్ద్రపురుగులును, కెంగుచ్చులును=ఎఱ్ఱనిక్కుచ్చులును, అయ్యెన్=ఆయెను, రూపకాలంకారము.

తా. అట్లమోఘముగ వర్షించుసమయంబున నాప్రసిద్ధుండగుపర్జన్యుఁడు మయూరములను నటుల నాడించునవసరంబున మేఘములు మృదంగములుగా, వాయువు మద్దెల వాయించువాఁడుగా, జలధారలు జాలరులుగా, వానియందు జలించుచున్న యార్ద్రపురుగులు గెంగుచ్చులునుగాఁ గన్పట్టెనని భావము.

ఉ. ఓహరిసాహరిం బ్రథమ ♦ మొల్కెడుధారల గాడ్పు లేటవా
ల్గాహతినీడ్చి వీఁగుప్రజ ♦ లం గలఁప న్మొగు లొందెనంబుభృ
ద్వాహచలద్రథత్వము మొ ♦ దల్మెఱుఁగన్ ధ్వజ మెక్కనాటగా
నాహదనం జెలంగుజన ♦ మంతము నూళ్ళకుఁ బోవ రామియున్. ౯౩

టీ. ఓహరిసాహరిన్ = తండోపతండముగాను, ప్రథమము=ముందరను, ఒల్కెడుధారలన్ = కురియుచున్న నీటిదారలను, గాడ్పులు = వాయువులు, హతిన్ = తను యొక్క కొట్టుచేత, ఏటవాల్గా = చేటచేర్పుగా, ఈడ్చి = ఆకర్షించి, వీఁగుప్రజలన్ = మఱుఁగులయందు దాఁగినజనులను, కలఁపన్ = తడిపివ్యాకులపెట్టఁగా, మొగులు = మేఘము, అంబుభృద్వాహ = దేవేంద్రునకు, (తురాషాణ్మేఘవాహన యనియమరము) చలద్రథత్వము, చలత్ = కదలుచున్న, రథత్వము = స్యందనభావమును, ఒందెన్ = పొందెను, ఈజనమింతకుముందేల వెళ్లకనిల్చియుండెననుశంకను వారించుచున్నాఁడు, మొదల్ = తొలుత, మెఱుఁగన్ ధ్వజము = మించనియెడు టెక్కెము, ఎక్కనాటగాన్ = ఆరోహణముచేయఁగా, ఆహదనన్ = ఆధ్వజారోహణసమయమందు, చెలంగుజనము= ఉన్నప్రజలు, అంతము = కడవఱకును, (ఆజీషదర్థేభివ్యాప్తౌ సీమార్థేధాతుయోగజే యని యమరము) ఊళ్లకున్ = గ్రామములకు, పోవరామియున్ = వెళ్ళుటకు యుక్తము గానందున. (వానవెలియువఱకనుట) రథత్వము నొందెనని పూర్వముతో నన్వయము.

తా. ముందుగఁ దండోపతండంబులుగాఁ గురియుచున్న వర్షధారలను గాడ్పులు విసరుచున్న వేగముచేతఁ జేటచెర్పుగాలాగి మఱుఁగునదాఁగినట్టి ప్రజలను క్లేశపెట్టఁగా మేఘము లింద్రునకుఁ జలద్రథమగుటను బొందెననియు - లోకము నందుత్సవాదులలో ధ్వజారోహణకాలమందున్న జనులు ధ్వజావరోహణమువఱకు నచ్చటనే యుండుట ప్రసిద్ధముగాన మించనియెడు ధ్వజము నెత్తగానే యచ్చటనున్నజనులు తుదకు నుండిరోయన్నట్లు కదలుటకు యత్నములేక యావర్షమునందుఁ దడిసిరనియును భావము, మేఘము లింద్రునికి రథముగాను, వర్షధారలు తేఱుమోకులుగాను మఱుఁగునవంగిన ప్రజలు రథమీడ్చువారుగాను త్ప్రేక్షింపఁబడెను.

తే. గీ. మిగుల నామనిఁ బచ్చచాం♦పేయకములు, నమ్మి కడపళ్ళఁ దము వైచి ♦ నాడు మగుడ
నాసపడువారి నవ్విన ♦ ట్లల్ల విచ్చెఁ, గలయ మూత్రులు కేతకీ ♦ గహనతతులు ౯౪

టీ. మిగులన్ = మిక్కిలియును. ఆమనిన్ = వసంతఋతువునందు, పచ్చచాంపేయకములన్, పచ్చ = పసపువన్నెగల, చాంపేయకములన్ = సంపగులను, (భండీరోప్యథచాంపేయశ్చంపకో హేమపుష్పకయని యమరము) నమ్మి=నిత్యమని విశ్వసించి, కడపళ్లన్ = కడపటను, (కంచెలోననుట) తమున్ = కేతకులను, వైచి=పడవయిచి, నాఁడు — వర్షర్తువునందు, మగుడన్ = తిరిగియును, ఆసపడువారిన్ = ఆశించెడువారిని, నవ్వినట్లు = అవహసించినట్లు, అల్లన్ = మెల్లగా, కేతకీగహనతతులు= మొగలితోటవరుసలు, కలయ = అంతటను, మూతులు = ముఖములను, విచ్చెన్ = వికసించెను.

తా. ఆ వర్షర్తువందంతట వికసించియున్న మొగిలిపువ్వులనుజూడఁగా వసంతఋతువునందుఁ బ్రబలియున్న సంపంగిపువ్వులనునమ్మి తమ్ముఁగడపటవేసి యిపుడా సంపంగులు లేకపోవుటచేత మరల నపేక్షించుచున్న జనులనుజూచి నవ్వినట్లుండెననియు నాఁటత్తనమునందుఁ దోటలచుట్టును మొగలిపూలుండుట ప్రసిద్ధముగానఁ గడపటవేసినట్లు వర్ణించెననియును భావము.

చ. అనయము నందనంబు దివి♦యందున యుండఁ బ్రసూనవాసన,
ల్గని పఱతెంచి పోవునల♦ కారుమెఱుంగులె పోవ రాక చి,
క్కెనో వనగంధలుబ్ధభుజ♦గీపరివేష్టన నా మొగిళ్లపిం,
డునఁ జెలఁగెం బసిండితగ♦టుం దెగడుం బువురేకుమొత్తముల్. ౯౭

టీ. అనయము = ఎల్లప్పుడును, నందనంబు = ఇంద్రోద్యానవనము, దివియందున = ఆకసమునందె, ఉండన్ = ఉండఁగా, ప్రసూనవాసనల్ = నందనోద్యానకుసుమామోదములను, కని = పొంది, పఱతెంచిపోవు — వర్షించుటకు భూమికిదిగివచ్చిన మేఘములతోడనువచ్చి మరలిపోవుచున్నట్టి, అల = ప్రసిద్ధమైన, కారుమెఱుఁగులె= తొలకరిమెరుపులె, నవ = క్రొత్తదైన, గంధ = పరిమళమునందు, (గంధేగంధకఆమోదె దేశే సంబంధగర్వయోరితి విశ్వము) లుబ్ధ = లోభపడుచున్న, భుజగీ = ఆఁడునాఁగుపాములయొక్క, పరివేష్టనన్ = చుట్టుకొనుటచేతను, పోవరాకచిక్కెనో = చనఁజాలకపట్టుపడెనో, నాన్ = అనునట్లు, మొగిళ్లపిండునన్ = మొగిలివనమందు, పసిండితగటున్ = బంగారువన్నెను, తెగడు = తిరస్కరించుచున్న. పువురేకుమొత్తముల్ = పువ్వులరేకులసమూహములు, చెలఁగెన్ = ప్రకాశించెను, హేతూత్ప్రేక్ష= వస్తూత్ప్రేక్ష.

తా. ఆ దేశమునందుఁ గంచెలవరుసలనుండెడు మొగిళ్ళయందుఁ జొక్కపుబంగారువన్నెగల పువ్వుల రేకులఁజూడఁగా గగనంబున నెయ్యనవరతముండు నందనోద్యానవన

ప్రసూన పరిమళంబుల గ్రహించి తమకాధారంబులగు మొయిళ్ళ వెంటవర్షించుటకైభూమికినరుగుదెంచి మరల పోవుచున్న మెఱుపులా నవగంధము నందాసక్తములయిన స్త్రీ సర్పములచేతఁ జుట్టబడి కదలుటకు శక్తిలేక నిలువంబడియున్నవో యన్నట్లుండెనని భావము.

చ. బలుసెగ నించువి ల్లడుగుఁ ♦ బట్టినదే యిపు డాకుబూదిగెం,
పులఁ ద్రిరుచిత్వ మూఁది మరు ♦ ముష్టి బిగిం దివిఁ గ్రాయుమౌక్తికం,
బులజడి దీన నంద ఱకుఁ ♦ బో యిది యింద్రునిదేని పుట్ట రాఁ,
గెలనమొ నాఁగ బో ల్విలుజి ♦ గిం గరకాస్రుతి నొప్పె మేఘముల్. ౯౬.

టీ. బలుసెగన్ = మిక్కుటముగువెట్టచేతను, (గ్రీష్మకాలమందనుట) ఇంచువిల్లు = చెఱకువిల్లు, అడుగుఁబట్టినదె = భూమినిఁబడవేసినదె, (అనఁగా మొలచేసినచెఱకేయనుట) ఇపుడు = ఈవర్షాకాలమందు, ఆకుబూదిగుంపులన్, ఆకు = పచ్చనియాకులచేతఁ బసరువర్ణము, బూది = నడుమనుండు తెలుపు, కెంపుల్ = చెఱకుననుండెడి యెఱుపును, వీనిచేతను = త్రిరుచిత్వము, హరితశ్వేతరక్తములనియెడు త్రివిధకాంతులుగలిగియుండుటను, ఊఁది = పొంది, మరుముష్టిబిగిన్ = మన్మథునిపిడికిలిబిగిచేతను, దివిన్ = ఆకసమునందు, మౌక్తికంబులజడి = ముత్యపువర్షము, దీనన్ = ఈ ధనుస్సును, క్రాయున్ = వెళ్లగ్రాయును, అందఱు = ఎల్లవారును, అగుఁబో = అగుసుమీ, ఇది = ఈ ధనుస్సు, ఇంద్రునిదేని = ఇంద్రునిదైన పక్షమున, పుట్టరాఁగెలనమొ = పుట్టలోనుండి యేలవచ్చెను, నాఁగన్. అనునట్లుగ, పోలు = చూడఁదగిన, విలుజిగిన్ = ఇంద్రధనుః కాంతిచేతను, కరకాస్రుతిన్ = వడగండ్లవానచేతను, మేఘముల్ = మొయిళ్లు ఒప్పెన్ = చెన్నొందెను,

తా, గ్రీష్మకాలమందు వెట్లచేతని క్షుధనుస్సు నేలంబడియుండి యిప్పుడాకుబూదికెంపులనియెడు మూఁడువర్ణములుగలిగినదై మరునిముష్టిబిగిచే వెలపలికి మౌక్తికములవర్షించుచున్నదిసుమా, అట్లుగాక ఇంద్రునిదైననీధనుస్సు పుట్టనుండి రావలసిననిమిత్తమేమని తోఁపింపఁజేయుచున్న యింద్రధనుః కాంతితోఁగూడిన వడగండ్లచేత మేఘములొప్పుచుండెనని భావము, శుద్ధాపహ్నవాను ప్రాణితోత్ప్రేక్షాలంకారము.

చ. అతిజల మబ్ధిఁ గ్రోలె నితఁ ♦ డంతయు రా నతివృష్టిదోష మౌ,
మితి నిపు డబ్దతం బరిణ ♦ మించినతోయమె చాలుఁ బంటక,
న్నతి నలఘాత గట్టగగ ♦ నంబున వర్తులత న్నమంతతో,
వృత మనుసేతుమండలము ♦ శ్రీపరివేషము సుట్టె భానునిన్. ౯౭,

టీ. ఇతఁడు = ఈ సూర్యుడు, అబ్ధిన్ = సముద్రమందు, అతిజలము = మిక్కిలినీటిని, క్రోలెన్ = పానముచేసెను, అంతయున్ = పానముచేసిన యుదకమంతయు

ను, రాన్ = వచ్చినపక్షమున, అతివృష్టిదోషమౌన్ = అతివృష్టిరూపమగు నీతిబాధయగును, మితిన్ = తగుమాత్రముచేతను, ఇపుడు = ఈ సమయమందు, ఘనతన్ = మేఘత్వముచేత, పరిణమించిన = ఏర్పడిన, తోయమె = ఉదకమె, పంటకున్ = సస్యములు ఫలించుటకు, చాలున్ = పూర్ణమగును, అన్మతిన్ = ఆనునట్టితలంపుచేతను, అలధాత = ఆ బ్రహ్మ, కట్టన్ = కట్టగట్టఁగా, గగనంబునన్ = ఆకాశమందు, వర్తులతన్ = వలయాకృతిచేతను, సమంతతః = అంతటను, వృతమగు = చుట్టుకొనియున్న, సేతుమండలము = మండలాకారమగు కట్టగొయొక్క, శ్రీన్ = కాంతిచేత. పరివేషము = వరదగుడి, భానునిన్ = సూర్యుని, చుట్టెన్ = చుట్టుకొనెను

తా. సూర్యునిఁ జుట్టికొనియున్న పరివేషమునుజూడఁగా నీ భానుండత్యంతతీక్ష్ణముగ నుదకపాన మొనరించియున్నవాఁడు గాన నితనికిరణము లీవల నావలవచ్చెనేని యతివృష్టిదోషము ఘటించును. మేఘరూపమువహించి యిపుడు మితముగ వర్షించిన యుదకము సస్యములకుఁ జాలియున్నయది యని ధాతతనమనంబున నాలోచించి యీ సూర్యునికిరణములకు గమనంబులేక యుండుటకై పరివేషమను మిషచేత నాసహస్రాంశునిం బంధించెనో యన్నట్లుండెననుట.

తే, గీ. గగనరంగస్థలంబున ♦ మిగులఁ బ్రౌఢి। మమునఁ గాళిక నిల్చి కో♦లము నటింపఁ,
బోరి మొగంబున రాలు♦నిప్పుక లనంగ, గుంపులై రాలె మహిఁ నింద్ర♦గోపతతులు.౯౪.

టీ, గగన = ఆకాశమనియెడు, రంగస్థలంబునన్ = నాట్యభూమియందు, మిగుల = మిక్కిలియును, ప్రౌఢిమమునన్ = దిట్టతనముచేత, కాళిక = మబ్బులగుంపనెడి కాళికాశక్తి, (మేఘజాలేపి కాళికాయని యమరము) నిల్చి = నిలువంబడి. కోలమునటింపన్ = నాట్యమొనరింపఁగా, పోరిన్ = అధికముగా, మొగంబునరాలు = ముఖముననుండి పడుచున్న నిప్పుకలనంగ = అగ్నికణములో యన్నట్లు, ఇంద్రగోపతతులు = ఆర్ద్రపురుగులు, గుంపులై = మొత్తములై, మహిన్ = భూమియందు, రాలెన్ = పడెను, రూపకానుప్రాణితోత్ప్రేక్షాలంకారము.

తా. సుగమము.

క. ద్యుమణికరాళి మొగుళ్లై, యమవసశశి గలయఁ గూర్చి ♦ హాట నొటయు న,
య్యమృతపుబిందులె. క్రమ్మఱ, నుమిసెడు ననఁ గలయఁ గరక ♦ లుడుగక రాలెన్.

టీ. ద్యుమణి = సూర్యునియొక్క, (ద్యుమణిస్తరణిర్మిత్రయని యమరము) కరాళి = కిరణపఙ్క్తి, మొగుళ్లై = మేఘములై, అమవసన్ = దర్శయందు, శశి = చందమామ, కలయ = తమతోఁ గలియుటవలన, కూర్చి = అమృతబిందువులనుగూడఁ

బెట్టికొని, (చంద్రుండమృతకిరణుండగుటచేతననుట,) (అమావాస్యనాఁడు చంద్రసూర్యు లేకస్థానగతులౌట ప్రసిద్ధము, దర్శస్సూర్యేందు సగమయని యమరము)హదనౌటయున్ = వేళరాఁగానే. అయ్యమృతబిందులే = అయ్యమృతకణములనే, క్రమ్మఱన్ = మగుడను, ఉమిసెడుననన్ = వెళ్లఁగ్రక్కుచున్నవోయన్నట్లు, కలయన్ = అంతటను, కరకలు= వడగండ్లు, ఉడుగక = ఎడతెగక, రాలెన్ = పతనమాయెను.

తా. అవిచ్ఛిన్నముగ వర్షముతోఁగూడ రాలుచున్న రుచ్యంబులగు వడగండ్లను జూడఁగా సూర్యకిరణములు మేఘములై యమావాస్యయందుఁ జంద్రునితోఁగూడి గ్రహించికొని కూడఁబెట్టియున్న యమృతబిందువులను సమయము తటస్థింపఁగా మరలవెళ్లఁ గ్రక్కుచున్నవో యన్నట్లుండెనని భావము.

చ. స్ఫురణ మొగుళ్ళపై మొదలఁ ♦ బొల్చి జలస్రుతి నాఁడునాఁటికిం,
గరఁగుచుఁ బుట్టుచుండుమణి ♦ కార్ముకరక్తిమ యెల్ల వెల్లిఁ గె,
న్నురుగులు గట్టినట్టులు గ♦నుంగొన నయ్యె సురేంద్రగోపము,
ల్గరఁగినవింటియప్పసరు ♦ కైవడిఁ దుట్టెలు పెట్టుపచ్చికన్. ౧౦౦.

టీ. స్ఫురణన్ = ప్రకాశముచేత, మొగుళ్ళపైన్ = మేఘముల మీఁదను, మొదలన్ = ప్రథమమందు, పొల్చి = ఒప్పి, జల = ఉదకముయొక్క, స్రుతిన్ = స్రవణము చేతను, నాఁడునాఁటికిన్ = దినదినమునకు, కరఁగుచున్ = కరఁగిపోవుచును, పుట్టుచున్ = ఉత్పత్తియగుచును, ఉండు = ఉన్నటువంటి, మణికార్ముక = ఇంద్రధనుస్సుయొక్క, రక్తిమయెల్లన్ = ఆరుణ్యమంతయును, వెల్లిన్ = వరదయందు= కెన్నురుగులుగట్టినట్టులు = రక్తవర్ణముగల ఫేనములయినట్లు, కనుంగొననయ్యెన్=చూడసొంపై యుండెను, కరఁగిన = ద్రవించి స్రవించిన, వింటియప్పసరుకైవడిన్ = ఆ మణిధనుస్సుయొక్క యాకుపచ్చవర్ణమువలెను, తెట్టెలుపెట్టు = గుంపులై యున్న, పచ్చికన్ = పచ్చికపట్లయందు, సురేంద్రగోపములు = ఆర్ద్రపురుగులు, కనుంగొననొప్పెన్=అని క్రిందికి నన్వయము, తా.ఇంద్రధనుస్సుకరఁగఁగా నైనరక్తిమము కెన్నురువలె ఆర్ద్రపురుగులును-కరఁగినపసరువలె పచ్చికలును కానవచ్చెనని భావము.

ఉత్ప్రేక్షాలంకారము.

చ. పెళపెళ మబ్బు బిట్టుఱుమ ♦ భీతి విదూరశిలాంకురచ్ఛటో,
త్పులకినియై ప్రియు న్నిబుర ♦ వోవుహరి న్వడిఁ గౌఁగలింపఁగాఁ,
దలరి ధరిత్రి సాఁచుగఱుఁ ♦ దాల్చినకే లనఁ గంకణంపుఁబ్రోఁ,
తలఁ బులు దేల వండుపయిఁ ♦ దాల్చి నదు ల్వడిఁ జొచ్చె వారిధిన్, ౧౦౧.

టీ. మబ్బు = మేఘము, పెళపెళన్ = పెళపెళమని, బిట్టుఱుమన్ = విశేషముగ గర్జింపఁగా, భీతిన్ = భయము చేతను, విదూరశిలా = వైదూర్యములయొక్క,

అంకుర = మొలకలయొక్క, ఛటా = సమూహముచేతను, (ఛలయనుపాఠమునవ్యాజముచేతనని యర్థము) ఉత్ = ఉద్గతమైన, పులకినియై = రోమాంచముగలదై (మేఘములుఉఱుమఁగా నైదూర్వాంకురములు పుట్టుట ప్రసిద్ధము. "శ్లో. విదూరభూమిర్నవమేఘశబ్దాదుద్భిన్నయారత్నశలాకయేవ" (అని కాళిదాసమహాకవి ప్రయోగము) ప్రియున్ = ఇష్టుఁడైనట్టియు, నిదురఁబోవు = నిద్రించుచున్న, హరిన్ = శ్రీకృష్ణస్వామిని, వడిన్ = వేగముచేతను, కౌఁగలింపఁగాన్ = ఆలింగనమొనరించుటకొఱకు, తలరి = త్వరపడి, ధరిత్రి = భూమి, చాఁచు = ప్రసరింపఁజేసినట్టియు, గఱుఁదాల్చిన = పులకాంకురితమైనట్టి, కేలనన్ = హస్తమోయన్నట్లు, కంకణంపుమ్రోతలన్, కంకణంపు = కంకణపక్షులనియెడు వలయములయొక్క (జాత్యేకవచనము) మ్రోఁతలన్ = శబ్దములచేతను, పులు = పచ్చికసవు, తేలన్ = మునుంగకపైనుండునట్లు, వండు = బురద, పయిన్ = మీఁదను, తాల్చి = ధరియించి, నదుల్ = ఏళ్లు, వడిన్ = వేగముచేతను. వారిధిన్ = సముద్రమందు, చొచ్చెన్ = ప్రవేశించెను. "ఉత్ప్రేక్షాలంకారము."

తా. మేఘములు పెళపెళమని యుఱుమఁగా భూదేవి ప్రీతినొంది నిద్రవోవు తనభర్తయగు శ్రీమహావిష్ణువును గౌఁగలించుటకొఱకుఁ జాఁచి నగఱుఁదాల్చినట్టి హస్తమో యన్నట్లు కంకణధ్వనులు విస్తరిల్లఁగ వండునీళ్లతోఁ బచ్చికసవును పైనిఁదాల్చి ప్రవాహములు సముద్రమును బ్రవేశించెనని తాత్పర్యము.

తే, గీ. కేకిషడ్జంబె తక్కఁ గో◆కిలపుపంచ, మం బఱుటఁ దోయిపదరులు◆మదిపొసఁగమి
నదియుఁ బ్రియుఁ గూర్ప నదులచో◆నమృత మయ్యెఁ, బ్రోషితలచేరికకునంపు◆బోటివోలె.

టీ. కేకి = నెమలియొక్క, షడ్జస్వరముదప్ప (ని. షడ్జంమయూరోవదతిపికఃకూజతిపంచమమని యమరము) కోకిలపు = కోవిలయొక్క, పంచమంబు = పంచమస్వరము, అఱుటన్ = లేకపోవుటవల్ల, తోయి = మేఘములయొక్క, పదరులు = ధ్వనులు, (ఉరుములనుట) మదిపొసఁగమిన్ = మనంబునకుఁ దగనివై యుండుటవల్ల, అదియున్ = ఆషడ్జస్వరమును, ప్రియున్ = వల్లభుఁడైన సముద్రుని, కూర్పన్ = కూర్చుటకై, నదులచోన్ = సరిత్తులపట్లను, అమృతమయ్యెన్ = సుధారసమాయెను, (హితమాయెనని యర్థము) ప్రోషితల = విరహిణులయిన స్త్రీలయొక్క. చేరికకున్ = నాథుల పొందునకు, అంపు = పంపునట్టి, బోటివోలె = మందయానవలె, హితమయ్యెనని క్రిందికినన్వయము. "శ్లో. దేశాంతరగతేకాంతే ఖిన్నాప్రోషితభర్తృకా యని వారిలక్షణము.

తా. వర్షాకాలమునందు నెమళ్లయొక్క షడ్జస్వరముదప్ప కోయిలలయొక్క పంచమస్వరంబు లేమింజేసి మేఘములయొక్క గర్జనధ్వనులుల్లంబునకు నిష్టములుగాక యాషడ్జస్వరమే విరహిణులైయున్న వామలోచనలను దమతమనాథులచెంతకుఁ జేర్చు

నట్టిబోటివలె నదులకు వానికిం బ్రియుండయిన సముద్రునింగూర్చుట విషయమైన యిష్ట మాయెననుట, ఇచ్చట మయూరమునకు నదీసముద్రములకు దౌత్యవర్ణనముం జేయుట వల్ల దూతీసామ్యము చెప్పబడెను గనుక నుపమాలంకారము.

తే, గీ. తతతనువు రాహు సోమామృ ♦ తంబు మ్రింగఁ,
జక్రి దునిమినమెడగంటి ♦ చాయఁ బొలిచె,
నసితమేఘస్థమణిధను ♦ వాసుదర్శ,
నంబనఁగ నింగిఁ బ్రతిసూర్య ♦ బింబ మడరె. ౧౦౩,

టీ. అసిత = నల్లనైన, మేఘస్థ = మేఘమందున్న, మణిధనువు = ఇంద్రధనుస్సు, తత = విస్తారమయిన, తనువు = దేహముగల, రాహువు = సైంహికేయుఁడు, సోమామృతంబు = చంద్రసుధను, మ్రింగన్ = కబళింపఁగా, చక్రి = శ్రీమహావిష్ణువు, తునిమిన = ఖండించిన, మెడ = కంఠమండలి, గంటి = గాయముయొక్క, చాయన్ = పోలికచేతను, పొలిచెన్ = ఒప్పెను, ప్రతిసూర్యబింబము = ప్రతిఫలితసూర్యబింబము, ఆ సుదర్శనంబనఁగన్ = తునిమియావంకనిలిచియున్న చక్రమోయన్నట్లు, నింగిన్ = ఆకాశమందు, అడరెన్ = ప్రకాశించెను.

తా. మితిలేని శరీరముగల రాహువు చంద్రునియందున్న యమృతకళ గ్రసింపరాఁగా శ్రీమహావిష్ణువుచేత ఖండింపఁబడిన కంఠమండలి గాయముమాడ్కి మేఘమధ్యమందు నింద్రధనుస్సును ఆరాహుకంఠమును ఛేదింపవచ్చియున్న చక్రమువలెఁ బ్రతిసూర్యబింబమును గానవచ్చుచుండెనని భావము.

చ. స్వరుఖరతాబ్రసాహిరిపు ♦ జాలమదాచిరరుక్శిఖిప్రభా,
కరకబకాతివాస్స్రుతికిఁ ♦ గా లవణేక్షుసురాజ్యదధ్యుదా,
కరములు దుగ్ధశుద్ధజల ♦ కంధులు నాఁ గలయట్టిసప్తసా.
గరములు మేఘుఁ డానె నొకొ ♦ కా యనఁగాఁ గనుపట్టె వీనిచేన్. ౧౦౪.

టీ. వీనిచేన్ = స్వరుఖరతాదిగుణములు గలిగియుండుటచేత, స్వరు=పిడుగునకు, ఖరతా = తీక్ష్ణతగలుగుటకొఱకును, అబ్రస, అప్ = ఉదకమునకు, రస= మాధుర్యముగల్గుటకొఱకును, అహిరిపుజాల = నెమళ్ళగుంపులకు, మద = గర్వముగలుగుటకొఱకును, అచిరరుక్ = మెఱుపులనియెడు, శిఖి = అగ్నికి, ప్రభా= దీప్తిగలుగుటకొఱకును, కర = వడగండ్లకొఱకును, బక = కొంగలకొఱకును, అతివాస్స్రుతికిన్ = శుద్ధోదకమును వర్షించుటకొఱకును, (ని. శతకోటిస్స్వరుశ్శంబోదంభోళిరశనిర్ద్వయోః । నీలకంఠోభుజంగభుక్ । వర్షోపలస్తుకరకః । ఆపస్స్త్రీభూమ్ని వార్వారియని యుంతట నమరము ) మేఘుఁడు= అభ్రము, లవణ = ఉప్పుయొక్కయు, ఇక్షు=చెఱ

క్షుపాలయొక్కయు, సురా = కల్లుయొక్కయు, ఆజ్య = నేతియొక్కయు, దధి = పెరుగుయొక్క, ఉదాకరములు = సముద్రములును, దుగ్ధ = పాలయొక్కయు, శుద్ధజల = మంచినీళ్లయొక్కయు, కంధులు = సముద్రములు, నాఁగలయట్టి = అనుపేళ్ళతోనుండునట్టి, (లోనగునట్టియనుపాఠము పొసఁగియుండమింజేసి దిద్దుపాటుచేయఁబడెను.) సప్తసాగరములన్ = సప్తసముద్రములను, ఆనెనో కాకా = పానముచేసెనాయేమి, అనఁగాన్ = అనునట్లు, కనుపట్టెన్ = చూపట్టెను, హేతూత్ప్రేక్షాలంకారము.

తా. మేఘములయందు స్వరుఖరతాది గుణములు గనుపట్టుటంజేసి తత్తద్గుణహేతుభూతంబులయిన సప్తసముద్రములయందు నీ జలధరంబులు దపాన మొనరించి వచ్చెనో యన్నట్లు గానంబడుచుండెననుట.

మ. తనిమం బచ్చమెఱుంగుగోఁచియు మణీ♦ధన్వోజ్జ్వలాషాఢముం,
గొని పుట్టం గొడుగబ్బ నెమ్మిపురియా♦కు ల్విప్పి శబ్దంబు మిం
చ నతస్ఫారరజోబలిత్వమున ను♦చ్చస్ఫూర్తి మిం దన్ని వే,
ఘననీలాంగుఁడు గాంచెఁ బాదసలిలౌ♦ఘంబున్ మరుత్సృష్టమున్. ౧౦౫.

టీ. తనిమన్ = సూక్ష్మత్వముతోఁగూడిన, పచ్చ = పచ్చని, మెఱుంగు = మెఱుపనియెడు, గోఁచియున్ = కౌపీనమును, మణీధన్వ = ఇంద్రచాపమనియెడు, ఉజ్జ్వల = వెలుంగుచున్న, ఆషాఢమున్ = దండమును. (పాలాశోదండ ఆషాఢయని యమరము) కొని - వహించి, పుట్టంగొడుగబ్బన్ = పుట్టగొడుగులను గొడుగులుగలుగఁగా, నెమ్మిపురి = నెమలిపింఛమునియెడు, ఆకుల్విప్పి = పాత్రమందలియాకులువిచ్చి, శబ్దంబుమించన్ = ఉరుములనియెడు వేదవాక్యములు బయలుదేరఁగా (కేకాధ్వనులనియెడు వేదవాక్యములనిగ్గానఁ జెప్పవచ్చును) నత = అడఁగిన, స్ఫార = అతిశయమైన, రజోబలిత్వమునన్ = పరాగముగు బలిచక్రవర్తిగలుగుటచేతను, ఉచ్చ = ఉన్నతమైన, స్ఫూర్తిన్ = పటిమచేతను, వే = శీఘ్రముగ, మిందన్ని = ఆకాశమందునిలిచి, ఘననీలాంగుఁడు, ఘన = మేఘమనెడు, నీలాంగుఁడు = వామనుఁడు, మరుత్ = దేవతలచేతను వాయువుచేతను, సృష్టమున్ = కల్పింపఁబడిన, పాదసలిలౌఘంబున్ = పాద్యోదకప్రవాహమును వానకాళ్ళను, కాంచెన్ = పొందెను: రూపకాలంకారము.

తా. మేఘుఁడు మెఱుపు మొదలగు లక్షణములను వహించియుండఁగాఁ బసపుగోఁచి మొదలగు వానిని ధరించియున్న వామనస్వామిగా రూపింపఁబడెను.

క. ఘనవృష్టి కతన ఘను లే, పున నలవల్మీకరంధ్ర♦ములు మూయఁగ నె,
త్తినగొడుగు లనఁగ ఛత్రా, కన్నికాయం బవని నెల్ల♦ కడలం బొడమెన్. ౧౦౬.

టీ. ఘనవృష్టికతనన్ = ఎక్కుడువానగల్గుటచేతను, ఫణులు = సర్పములు, ఏపునన్ = ఉరుటుచేతను, అల= ప్రసిద్ధములయిన, వల్మీకరంధ్రములు. వల్మీక = పుట్టల యొక్క; రంధ్రములు = బిలములను, మూయఁగన్ = కప్పుటకొరకు, ఎత్తిన=పైని నిలిపిన, గొడుగులనఁగన్ = ఛత్రములనునట్లు, ఛత్రాకనికాయంబు = పుట్టగొడుగుల యొక్క సమూహము, అవనిన్ = పుడమియందు, ఎల్లకడలన్ = సకలదిక్కులయందు, పొడమెన్ = పుట్టెను.

తా. మిక్కుటంబగు వర్షములు గురియుచుండఁగా సర్పములు దమ నివాసస్థానంబులయిన పుట్టల కలుఁగు మూయుటకై యెత్తిన ఛత్రములో యన్నట్లెల్ల దిక్కులయందును బుట్టగొడుగులు గానవచ్చెనని భావము ఉత్ప్రేక్షాలంకారము.

ఉ. సారెకు మింట మేఘుఁడు ని♦జస్ఫురణం బఱఁ గ్రూర మౌ పురోం,
గారకయోగ మూది తిరు♦గ న్సకుటుంబముఁ దద్గ్రహంబు నెం,
తే రుష ద్రొబ్బ నంతలును♦ నింతలునై పడుతన్నభశ్చ్యుతాం,
గారశిశుప్రతానముల♦ కైవడి రాలె సురేంద్రగోపముల్. ౧౦౭.

టీ. మేఘుఁడు = వలాహకుఁడు, మింటన్ = అంతరిక్షమందు, సారెకున్ = మాటిమాటికిని, నిజ = తనయొక్క, స్ఫురణంబు = స్ఫూర్తి, అఱన్ = చెడునట్లు, క్రూరమౌ = కఠినమైనట్టి, పురోంగారకయోగమూది = పురోంగారకమను నవయోగము వహించి, తిరుగన్ = అచ్చటనుండి మరలఁగా " (శ్లో. పురోంగారేత్వనావృష్టిః పురశ్శుక్రే ప్రవర్షతి అని జ్యోతిశ్శాస్త్రము నందున్నది") సకుటుంబమున్ = దారపుత్రాదులతోనున్న, తద్గ్రహంబున్ = ఆ యంగారక గ్రహమును, ఎంతేరుషన్=అధికమైన కోపముచేతను, ద్రొబ్బన్ = క్రిందికిఁ బడఁద్రోవఁగా, అంతలు నింతలునై =ఇంతంతతునియలై. పడు = పడుచున్నట్టియు, తన్నభః = ఆ యాకాశమువల్లను, చ్యుత= జారిన, అంగార = అంగారకునియొక్క, శిశుప్రతానములకైవడిన్ = పిల్లలగుంపులవలెనె, (ని. అంగారొభూసుతోల్ముకెయని రత్నమాల) సురేంద్రగోపముల్ = ఇంద్రగోప పురుగులు, రాలెన్ = పడెను.

తా. ఇంద్రగోపపురుగులు పుడమియందు రాలఁగా మేఘుఁ డంతరిక్షమునందుఁ దనమహిమను నంగారకగ్రహము పురోంగారక యోగమునువహించి యడంచు చుండఁ జూచి పిమ్మట నా యోగమును వదలివెళ్లుచున్న యా యంగారకగ్రహమును దారపుత్రాదులతో నత్యంతరోషముచేత భూమిపయిం బడద్రొబ్బఁగాఁ దుత్తుమురులై పడుచున్న దానిపిల్లలో యన్నట్లుండెనని భావము.

క. కాకోదరాహితుల వ, ల్మీకంబులఁ దూర్చె మెఱసి ♦ మేఘుం డని గుం,
పై కవ గూడి పొగడె నన, భేకధ్వను లెసఁగె వృత్త ♦ భేదానుకృతిన్. ౧౦౪.

టీ. కాకోదరాహితులన్, కాకోదర = సర్పములనియెడు, అహితులన్ = శత్రువులను, మెఱసి = మెఱుపులమెఱయఁజేసి, మేఘుండు = ఘనుఁడు, వల్మీకంబులన్ = పుట్టలను, తూర్చెన్ = ప్రవేశింపఁజేసెను, అని = ఈలాగని, గుంపై = మొత్తములై, కవగూడి = జోడుజోడుగాఁ గూడినవై, పొగడెననన్ = స్తోత్రముచేసెనో యనునట్లు, వృత్తభేదానుకృతిన్, వృత్తభేద = మండూకాది వృత్తభేదములయొక్క, అనుకృతిన్ = అనుకరణముచేతను, భేకధ్వనులు = కప్పకూతలు, ఎసఁగెన్ = అతిశయించెను.

తా. అపుడు మండూకాదివృత్తభేదముల ననుకరించు భేకధ్వనులు గలుగఁగా మేఘుఁడు దమకు శత్రువులైన సర్పములను మెఱుపుల మెఱయంజేసి పుట్టలలోఁ బ్రవేశింపఁ జేసెనని తలంచికొని సంతోషించి గుంపుగూడి యామేఘమును బొగడుచున్నవో యన్నట్లుండెననుట. క్రియానిమిత్తక్రియాస్వరూపోత్ప్రేక్ష.

తే. గీ. మొగులు మై చీఁకటుల నెక్కు ♦ జిగిమెఱుఁగుల, బగలు రాతిరి రాతిరి ♦ పగలు చేసె,
సకలమును నిద్రఁ బుచ్చు కే ♦ శవుని నిద్రఁ, బుచ్చు ఘనునకు నిట్టిద ♦ ద్భుతమె తలఁప.

టీ. మొగులు = మేఘుఁడు, మై చీఁకటులన్, మై = శరీరముయొక్క, చీఁకటుల = అంధకారముచేతను, ఎక్కుజిగిమెఱుఁగులన్ = అధికమైనకాంతిగలమెఱుపులచేతను, పగలు = దివమును, రాతిరి = రేయిగా, రాతిరి = నిశను, పగలు = దివముగాను, చేసెన్ = కావించెను, సకలమును = సర్వప్రపంచమును, నిద్రఁబుచ్చు = ప్రళయకాలమందుఁ దనయురంబుననునిచికొని నిద్రింపఁజేయునట్టి, కేశవునిన్ = శ్రీమహావిష్ణువును, నిద్రఁబుచ్చు = సుప్తిఁబొందించుచున్న, ఘనునకున్ = మేఘునకును, అధికునకును. (భగవంతుండు వర్షాకాలమందు యోగనిద్రాసక్తుఁడని ప్రసిద్ధముగాన నిద్రఁబుచ్చునని ప్రయోగించెను) ఇట్టిది = పగలు రాత్రి—రాత్రిపగలుగాఁ జేయుట, తలఁపన్ = విచారింపఁగా, అద్భుతమె = ఆశ్చర్యమా (కాదనుట) అర్థాపత్త్యలంకారము.

తా. పెనుచీకటిచేతను జొక్కపుమెఱుపులచేతను మేఘుఁడు రాత్రిని బగలుగను బగటిని రేయిగనొనర్చెననఁగా నంధకారము గ్రమ్ముకొనునట్లుగఁ జుట్టికొని వర్షించుచు మెఱుపులు మెఱయుచుండెనని భావము.

తే. గీ. ధూళి యడఁగిన మఱి మింటఁ ♦ దోఁచె శంప, జలధరద్రోణి మున్ను ప ♦ ర్జన్యుఁ డెత్తి
ఖనదిఁ దచ్ఛ్రీవిభూషేచ్ఛఁ ♦ గడుగ మెఱయు, మృదుమహీగతవసురజో ♦ రేఖయనఁగ.

టీ. ధూళి = దుమ్ము, అడిగినన్ = అడఁగఁగా, మఱి = పిమ్మటను, మింటన్ = అంతరిక్షమందు, శంప = మెఱుపు, తోఁచెన్ = కనుపించెను, పర్జన్యుఁడు = ఇం

ద్రుఁడు, జలధర = మేఘమనియెడు, ద్రోణిక్ = దోనెయందు, (ఆనఁగా జలగడుగు వాఁడు మసికట్టుకడిగెడు పలకయనుట) మృత్స్నక్ = భూమియందలి ధూళిరూపమైన మృత్తికను, ఎత్తి = ఉంచికొని, ఖనదిక్ = ఆకాశగంగయందు, తచ్ఛ్రీవిభూషేచ్ఛక్, తచ్ఛ్రీ = ఆగగనలక్ష్మికి, విభూషేచ్ఛక్ = భూషణముకొఱకైన యిచ్ఛచేతను, కడుగక్ = క్షాళనముచేయఁగా, మెఱయు = జ్వలించుచున్న, మృదుమహీగత = మృదువైనభూమియందున్న, వసు = బంగారముయొక్క, రజః = రవలయొక్క, రేఖయనఁగక్ = చాలనఁగా, తోఁచెనని క్రిందటికన్వయము.

తా. వర్షముచేత భూమియందలి దుమ్ముడఁగంగాఁ బిమ్మటఁ గానవచ్చినవిద్యుల్లత పర్జన్యుఁడు మేఘమను దోనెయందు భూపరాగము నెత్తికొని గగనలక్ష్మికి భూషణములు చేయవలయునన్న యిచ్ఛచేత నాకాశగంగయందుఁ గడుగఁగా బ్రకాశించుచున్న మృదువైన నేలయందున్నట్టి బంగారపు రవల చాలోయన్నట్లు గానవచ్చుచుండెననుట.

తే, గీ. స్థూలపరిపక్వకాననో ♦ దుంబరాగ్ర, రంధ్రముల వాననీరు సొ♦రంగ వెడలె,
మశకపఙ్క్తులు దావఘూ ♦ మంబు లడఁగ, రచ్చ సేయంగ వెడలెవి ♦ శ్రాంతికనఁగ.

టీ. స్థూల = గొప్పలై, పరిపక్వ = పండియున్న, కానన = అడవియందలి, ఉదుంబర = మేడిపండ్లయొక్క, అగ్ర = తుదలయందున్న, రంధ్రముల్ = బెజ్జములయందు, వాననీరుసొరంగక్ = వర్షోదకము ప్రవేశింపఁగా, మశకపఙ్క్తులు = దోమలబారులు, వెడలెక్ = బయలుదేరెను. దావఘూమంబులడఁగక్ = కాఱుచిచ్చులపొగలణఁగఁగా, విశ్రాంతికిక్ = శ్రమను బోఁగొట్టుకొనుటకొఱకు, రచ్చసేయంగక్ = కొలువు సేయుటకు, వెడలెననఁగక్ = బయలుదేరెనన్నట్లు వెడలెనని వెనుకటికన్వయము.

తా. మెండువానలు గురియుటచేత నడవియందలి పరిపక్వములైన మేడిపండ్లనుండి దోమలగుంపులు వెడలఁగాఁ గాఱుచిచ్చులు చల్లారుటంజేసి విశ్రాంతకొఱకుఁ గొలువుచేయ నాలోచించి బయలువెళ్లెనో యన్నట్లుండెననుట.

స్రగ్ధర. గ్రావాళిం గేతకీకో ♦ రకకుటజరజో ♦ రాజిదూర్వాంకురశ్రీ,
తో విక్షింపం దినాను ♦ త్రుటి మఱుపడుచుం ♦ దోఁచుచి క్లౌతిరోభా,
వావిర్భావంబులం బా♦యక పొరయు నభ ♦ స్స్రభము గప్పి పై నెం,
తే విప్పి పింఛికల్ బ♦ర్హిణులు దిరుగఁ బె♦ల్లింద్రజాలంబుఁ జూపెక్. ౧౧౨.

టీ. గ్రావాళిక్, గ్రావ = పర్వతములయొక్క, ఆళిక్ = సమూహమందు, (ని. అద్రిగోత్రగిరిగ్రావాచల శైలశిలోచ్చయా యని యమరము) కేతకీకోరక = మొగిలిమొగ్గలయొక్కయు, కుటజ = కొండమల్లెమొగ్గలయొక్క, (ని. కలికాకోరకః పుమానని యు- కుటజో గిరిమల్లికాయనియు నమరము) రజోరాజి = పరాగపఙ్క్తి, దూర్వాంకుర = గ

రికిమొలకలయొక్క, శ్రీతో = సంపదతో, వీక్షింపన్ = చూడఁగా, దిన = పగటియొక్క, ఆనుత్రుటికిన్ = ప్రతిక్షణమందును (స్త్రీయాంమాత్రాత్రుటిః పుంసి యనియమరము) మఱుపడుచున్ = కనుపడకయుండుచును, తోఁచుచున్ = కనుపడుచును, ఇట్లు = ఈప్రకారమయిన, తిరోభావావిర్భావంబులన్, తిరోభావ = కనుపడకయుండుటను, ఆవిర్భావంబులన్ = కనుపడుటను, పాయక = ఎడతెగక, పొరయన్ = పొందఁగా, నభస్సు = శ్రావణమాసము, అభ్రముల్ = మేఘములను, కప్పి = పఱపి, పైన్ = మీఁద, బర్హిణులు = నెమళ్లు, పింఛికల్ = పురుషులు, ఎంతేవిప్పి = మిక్కిలి వ్యాప్తములై, తిరుగన్ = ఆడుచుండఁగా, పెల్లు = అధికంబైన, ఇంద్రజాలంబున్ = ఇంద్రజాలమనుశాబరవిద్యను, చూపెన్ = కనుపఱచెను.

తా. వర్షాకాలంబునఁ బుష్పించుచున్న కుటజకేతకాదుల పరాగములును గరికికాంతులును గొంతవడిఁ గన్పట్టియుఁ గొంతవడిఁ గన్పడకయు నిట్లు తిరోధానావిర్భావంబుల నెడతెగక పొందఁగా శ్రావణమాసంబను నైంద్రజాలికుఁడు మేఘంబులను తెరవేసి నెమళ్ళయొక్క వెడల్పులైన పింఛములు వ్యాపింపఁజేసి యతిశయంబైన యింద్రజాలవిద్యను గనుపఱచెనని తాత్పర్యము. భస్మమును దూర్వయును నెమలిపింఛము నింద్రజాలసాధనములు. తిరోధానావిర్భావము లింద్రజాలగుణములు. ఇవి యన్నియు నప్పుడు కలిగియున్నవనుట.

తే, గీ. గిరులతటజంబు తరువులఁ ♦ దొరుగుపండ్లఁ,
బుట్టె జంబూనదులు గాన ♦ బొదవుమొయిలు,
మేన నవి సోఁకునెడలు గా ♦ మితిఁ దటిచ్ఛ,
లంబునను శుద్ధజాంబూన ♦ దంబు లయ్యె. ౧౧౩.

టీ. గిరుల = కొండలయొక్క, తట = చరులయందుఁబుట్టిన, జంబుతరువులన్ = నేరేడుచెట్లవల్లను, తొఱుగు = రాలుచున్న, పండ్లన్ = ఫలములవల్లను, జంబూనదులు = నేరేడుపండ్లరసపుటేళ్లు, పుట్టెన్ = ఉదయించెను, కానన్ = అడవియందు, పొదవు = అలముకొన్న, మొయిలు = మేఘముయొక్క, మేనన్ = శరీరమందు, అవి = ఆ జంబూనదులు, సోఁకు = తాఁకునట్టి, ఎడలుగా = తావులేగదా, మితిన్ = మేరదప్పక తటిత్ = మెఱుపనియెడు, ఛలంబునను = వ్యాజముచేతను, శుద్ధ = చొక్కమునైన, జాంబూనదంబులు = సువర్ణములు, అయ్యెన్ = ఆయెను.

తా. మేఘములయందుండు మెఱుపునుజూడగాఁ గొండలయందలి చరులయందు జనించియున్న నేరేడుచెట్లనుండి రాలుచున్నపండ్లయందుఁ బుట్టిన జంబూనదులడవియందెల్లదిశలనుండఁగా నంటుకొన్నమేఘములయొక్క దేహములందు నవి సోఁకినందున

జంబూనది ప్రవహించినచో స్వర్ణమగునట్టి మర్యాదదప్పక తటిత్తులను వ్యాజమునపొంది మెయిళ్ళు శుద్ధజాంబూనదంబులాయెననుట. అపహ్నవాలంకారము.

తే, గీ. సురభిబడిఁ జన్నసప్తలా ♦ శోకకమల, కువలయామ్రాళికిఁ గదంబ ♦ కుటజనీప,
కకుభయూధికలను సాయ ♦ కములు మరున, కేను గల్గి గేదఁగిసురె ♦ యెక్కుడయ్యె.

టీ. సురభిబడిన్ = వసంతునివెంబడిగా, చన్న = పోయినటువంటి, (ని. సురభిస్తుగవిస్త్రియాం । వసంతచైత్రయోః పుంసి । త్రిషుసౌమ్యసుగంధినోః అని తర్నమాల) సప్తలా = విరజాజియొక్కయు (సప్తలానవమాలికాయని యమరము) అశోక = కంకేళియొక్కయు, కమల = పద్మమునొక్కయు, కువలయ = కలువయొక్కయు, ఆమ్ర = చూతమునొక్కయు, ఆళికిన్ = సమూహమునకు, కదంబ = కడిమిపువ్వును, కుటజ = కొడిసెపువ్వును, నీప = కడపపువ్వును (అమరమున గదంబనీపములు పర్యాయములుగాఁ జెప్పఁబడియున్నను శుకులు బిల్వవకుళామ్రకదంబనీపాః అని భిన్నజాతిగాఁ బ్రయోగించియున్నారు గనుక నీగ్రంథకర్తయును రెంటిని వేఱుగాఁ జెప్పెనని యెఱుఁగఁదగును) కకుభ = మద్దిపువ్వును (ఇంద్రద్రుః కకుభోర్జునయని యమరము) యూధికలు = అడవిమొల్లయును (గణికాయూధికాంబష్ఠాయని యమరము) అను = అనునట్టి, సాయకములు = బాణములు, మరునకున్ = మన్మథునకు, ఏనుగల్గి = పంచబాణములకుఁ బ్రతినిధి పంచబాణములుగల్గియు, గేదఁగిసురె = మొగలిరేకను సురియకత్తి, ఎక్కుడయ్యెన్ = శ్రేష్ఠమాయెనని యర్థము. ఆరవయాయుధమాయెననిభావము.

తా. వసంతునితోడ నరిగిన సప్తలాశోకాది పంచబాణములకు బదులుగా నీవర్షర్తువందుగదంబకుటజాది పంచసాయకములుగల్గియు గేతకీకుసుమం బెక్కుడయ్యెననఁగా నీ ఋతువు వసంతర్తువుకంటె నతిశయముగ స్మరోద్దీపకమాయెననుట.

క. నటనపర కేకిపాత్ర, స్ఫుటయవనికలన మొగుళ్లు పొదవెన్ ♦ భూభృ,
త్తటుల నవి యాకు దిను చిట, పొటరవము సెలంగెఁ దాళ ♦ ములచప్పుడునై. ౧౧౫.

టీ. నటన = నాట్యమునందు, పర = ఆసక్తములైన, కేకి = నెమళ్లనియెడు, పాత్ర = నాట్యస్త్రీలయొక్క, స్ఫుట = వ్యక్తమైన, యవనికలనన్ = నీలితెరలోయనఁగా, (ప్రతిసీరాయవనికాస్యాత్తిరస్కరణీచసాయని యమరము) భూభృత్తటులన్ = కొండలయొక్క చరులయందు, పొదవెన్ = వ్యాపించెను, అవి = ఆ మేఘములు, ఆకుదిను = పర్ణములను దినుచున్న, చిటపొటరవము = చిటపొటయనుధ్వని, తాళములచప్పుడునై = తాళధ్వనియై (నాట్యోపయోగితాళంబులనుట) చెలఁగెన్ = ఒప్పెను, రూపకానుప్రాణితమైన యుత్ప్రేక్షాలంకారము.

తా. అప్పుడు నెమళ్లనియెడు నాట్యస్త్రీలు నర్తనంబు సేయఁగా మబ్బులుకొండలలోని యాకులుమేయుచుండఁగల్గిన చిటపొటధ్వనులు తాళంబులుగా నామేఘములు నీలపుతెరగుడ్డలుగా నొప్పుచుండెననుట.

చ. జలధర ముప్పతోఁ బులు సొ♦సంగు రసం బని యప్పయోధినిం,
  బొలయుఁగఁ గ్రోలి సై దధిప♦యోధియుఁ గ్రోలఁగఁ బ్రాఁచి దౌటఁ బె,
  న్బులుసుఁ గఱుల్లఁ గ్రాయ సవె♦పో వడగండ్లన రాలెఁ గాని నాఁ,
  డిలఁ బడువానిఁ దిన్నయపు♦డే చలిఁ బండ్లు వడంగ నేటికిన్. ౧౧౬.

టీ. జలధరము = మేఘము, ఉప్పతోన్ = లవణముతోఁగూడిన, పులుసు = ఆమ్లము, రసంబు = రుచిని, ఒసంగునని = ఇచ్చునని, అప్పయోధిన్ = ఆ లవణసముద్రమును, ఇంపొలయఁగన్ = ప్రీతిగల్గునటుల, క్రోలి = పానముఁజేసి, సైన్ = ఆ పిమ్మటను, దధిపయోధియున్ = పెరుగుసముద్రమును, క్రోలఁగన్ = త్రావఁగా, ప్రాఁచిదౌటన్ = అది ప్రాచీనమైనదిగాన (పులిసినపెరుగనుట) పెన్బులుసు = మిగులఁ బుల్లనైన, కఱుల్లన్ = పెరుగుగడ్డలను, క్రాయన్ = వెళ్లఁగ్రక్కఁగా, అవెపో = అట్లు వెళ్ళఁగ్రక్కఁబడిన పెరుగుగడ్డలే, వడగండ్లనన్ = కరకలనునట్లుగ, రాలెన్ = పతనముఁబొందెను, కానినాఁడు = ఈ వడగండ్లు దధికణములు కాకపోయెనేని, ఇలన్ = భూమియందు, పడువానిన్ = పతనమగుచున్న యావడగండ్లను, తిన్నయపుడే = తినఁగానే, పండ్లు = దంతములు, చలివడంగనేటికిన్ = జిల్లుమని చలిపడవలసిననిమిత్తమేమి?

తా. అపుడు రాలుచున్న వడగండ్లను నోటిలోఁ బ్రేయఁగాఁ బండ్లు జివ్వనితీపుగలవై పులుసు దగిలిన దంతములమాటిక్కఁ వస్త్వంతరముల నములుటకు శక్తిచాలకుండుటంజేసి మేఘము పులుసుతో నుప్పగలిపినట్లయిన మిక్కిలి రుచిగానుండునని తలంచి ముందు లవణసముద్రమున నీరుద్రావి యాపిమ్మట దధిసముద్రమును బానము చేయఁగా నది ప్రాచిదౌటవలన మిక్కిలి పులుసుగానుండెను గాన దాని వెళ్ళఁగ్రక్కఁగానే యాగడ్డలే వడగండ్లను వ్యాజమున రాలుచున్నవని యుత్ప్రేక్షించినాఁడనుట.

తే. గీ. అపుడు సల్లఁకు డిగక మే♦ఘాళి పొదవు, నచలములపైనె దొడ్డిక♦ట్టగు మృగాలి,
  చూడఁ జూపట్టె మీఁదిప♦ర్జన్యధన్వి, నృపున కగు తెరవేటయా♦యితమనంగ. ౧౧౭

టీ. అపుడు = ఆ వర్షాకాలమునందు, అసల్లఁకు డిగక = బురదలలోదిగక, మేఘాలి = మబ్బులచాళ్లు, పొదవు = చుట్టుకొన్న, అచలములపైనె = కొండలమీఁదనె, దొడ్డికట్టగు = దొడ్డిలోఁ దోలఁబడినవానివలె నిలిచియున్న, మృగాలిన్ = లేఁడులగుంపు (ఇది కర్తృపదము) చూడన్ = వీక్షింపఁగా, మీఁది = పయినున్న, పర్జన్య = ఇంద్రుఁడనియెడు, ధన్వి = ధనుర్ధరుఁడైన, నృపునకున్ = రాజునకు, అగు = అయినటువంటి, తెరవేటయాయితము = సిద్ధమయిన తెరవేట, అనంగన్ = అనునట్లు, చూపట్టెన్ = కానవచ్చెను (తెరవేటయనఁగా గొప్పయధికారులు వేటకు వెడలునవసరంబున ననుగతులయిన వేటకాండ్రచేత మృగము లొక్కచోటఁ గూడియుండునట్లుగఁ జొట్టును తెరవేసి సమకూర్చుట.)

తా. ఆ స్నానకాలమునందు జడిసి బురదలకు డిగ్గక మబ్బులగుంపుచేతఁ జుట్టును వ్యాపింపఁబడియున్న కొండలపైని దొడ్డికట్టుగా నిలువంబడియున్న మృగములను జూడఁగాఁ బర్జన్యుండను విలుకాఁడగు దొడ్డరాజునకై సిద్ధపఱుపఁబడిన తెరవేఁటయో యన్నట్లుండెననుట.

చ. తడి తల డిగ్గి ముంప జడ ♦ తం దుద రెప్పలఁ గన్ను విప్పి పు
ల్కొదుచుచు నీరు ముంగరల ♦ పోలిక ముక్కులఁ గూడ నోటఁ గొం
తొడియుచు గూఁటికట్ల సగ ♦ మొత్తుచు ఱెక్కవిదిర్పు మున్నుగా,
వడఁకుటె కాక చేష్టుడిగె ♦ వక్షము పక్షులు జానువుల్ చొరన్. ౧౧౪.

టీ. తడి = నీరు, తలడిగ్గి = తమశిరంబులనుండిదిగి, ముంపన్ = ముంచుకొనఁగా, (అనఁగా వర్షముచేతఁ బక్షులశిరంబులుదడిపి పిమ్మట వానిశరీరంబులను దడుపఁగాననుట) జడతన్ = జాడ్యముచేతను, తుదరెప్పలన్ = పక్ష్మాగ్రములచేతను, కన్నువిప్పి = నేత్రములుదెఱచి = పుల్కొదవుచు = కన్నులుపులకరించుచును (అనఁగాఁదెఱవఁగూడని కన్నుల నతిప్రయత్నమునఁదెఱచి లోని నీళ్ళువెలువరించుట) నీరు = వర్షోదకము, ముంగరలపోలికన్ = ముక్కఱలవైవడి, ముక్కులఁగూడన్ = నాసికలయందు వ్రేలఁగా, నోటన్ = వదనముచేతను, కొంతొడియుచు = కొంత స్వీకరించుచును, గూఁటికట్లన్ = గూటిపుడకయందు, సగము = అర్ధము, ఒత్తుచున్ = తుడుచుచును, పక్షులు = పిట్టలు, జానువుల్ = తమమోకాళ్ళు, వక్షము = ఎద, చొరన్ = చొచ్చియుండఁగా, వడఁకుటె కాక = కంపముండుటయే కాక, ఱెక్కవిదిర్పుమున్నుగా = పక్షవిధూననము మొదలయిన, చేష్ట = వ్యాపారము, ఉడిగెన్ = మానెను.

తా. ఆసమయంబునఁ బిట్టలు గూండ్లయందుముద్దలుగాఁ దడుపంబడి చలికివడఁకుట దక్కనొండుచేష్టలుడిగియుండెననుట.

క. చెందు నెఱసంజ కుంకుమ, క్రందునఁ గెంపెక్కు దివికిఁ ♦ గాశ్మీరత రా
నిందుశిలాత్వము రవి గని, యెం తోయముఁ గురియ నేల ♦ యిటు గాకున్నన్.

టీ. చెందు = ప్రాప్తమైన, నెఱసంజ = పూర్ణసంధ్యారాగమనియెడు, కుంకుమ = కుంకుమపుష్పముయొక్క, క్రందునన్ = అతిశయముచేతను, కెంపెక్కు = ఎఱుపెక్కిన, దివికిన్ = ఆకాశమునకు, కాశ్మీరత = కాశ్మీరదేశత్వము, రాన్ = రాఁగా, రవి = సూర్యుఁడు, ఇందుశిలాత్వము = చంద్రకాంతమణియౌటను, కనియెన్ = పొందెను, ఇటుగాకున్నన్ = సూర్యుఁడుచంద్రశిలగాకుండెనేని, తోయమున్ = జలమును, కురియనేల = వర్షింప నిమిత్తమేమి?

తా. సంధ్యాకాలమునందు వర్షించుచుండఁగా నెఱుపుఁజెందిన సంధ్య యను కుంకుమపుష్పముచేత నెఱ్ఱనైన యాకసంబునకు గాశ్మీరదేశత్వము రాఁగా సూర్యుఁడు త

ద్దేశోద్భవంబని ప్రసిద్ధికెక్కిన యిందుశిలాత్వమును బొందెను. అటుగాకపోయెనేని యా సూర్యుఁడుదకంబుల వర్షించుటకు హేతువేఁని ప్రజలు తలంచునట్లుండెనని భావము.

చ. అలజలరాశి నీటఁ బగ ♦ లర్కకరావళి చూలు దాల్పఁగా
నలమిన యీర్ష్యరాత్రి ధవ ♦ ళాంశుకరావళి దాము దాల్పఁ ద
జ్జలముల నాన మూఁగికొను ♦ చాడ్పుననాడి వహించెఁ జూలు మ
బ్బులనిలముంచనీల ఘన ♦ పుంజము వల్ల బలాకమాలికల్. ౧౨౦

టీ. అల=ప్రసిద్ధమైన, జలరాశి=సముద్రముయొక్క, నీటన్=ఉదకముచే, పగలు=పవటియందు, అర్కకరాళి = సూర్యకిరణసమూహము. (బలిహస్తాంశవఃకరాయని యమరము) చూలుదాల్పఁగాన్ = గర్భముధరియింపఁగా, అలమినయీర్ష్యన్ = జనించిన యసూయచేత, రాత్రిన్=రేయియందు, ధవళాంశుకరావళి = చంద్రకిరణసమూహము, తామున్=తామును, తాల్పన్=గర్భములుధరియించుటకొఱకు, తజ్జలములన్= ఆసముద్రోదకములను, ఆనన్=పానముచేయుటకై, మూఁగికొనుచాడ్పునన్=చుట్టుకొనినట్టుంబలె, ఆడి=సంచరించి, బలాకమాలికల్ = తెల్లగొంగలచాళ్ళు, (బలాకాబిసకంఠికయని యమరము) మబ్బులన్=చీకట్లచేతను, ఇలన్=భూమిని, ముంచు = కప్పుచున్న, నీలఘన=కాలమేఘముయొక్క, పుంజమువల్లన్ = సమూహమువల్లను, చూలు=గర్భమును, వహించెన్ = ధరియించెను.

తా. తెల్ల కొంగలు రాత్రులయందు నంధకారమగునట్లు భూమియందుఁ గప్పియున్న నల్లమబ్బులను మాలికలుగాఁ జుట్టికొని యాసీళ్ళుత్రాగి గర్భము ధరింపఁగా సూర్యకిరణములు పగటియందు సముద్రోదకముచేత గర్భముధరియింపఁజూచి యీర్ష్యగలవియై చంద్రకిరణములు దామును గర్భముల ధరియించుటకొఱకు నాసముద్రోదకములం బీల్చుటకై తిరుగుచున్నట్లుండె ననుట.

క. ఉరుము విని యలకకై దివి, వెఱఁ బఱచుమరాళపటలి ♦ విడిచినఁ బడున,
క్కఱచినబిసలవవిసరము, తెఱఁగున వడగండ్లు ధవళ ♦ దీధితి రాలెన్. ౧౨౧.

టీ. ఉఱుమున్ = గర్జితమును, విని = ఆలకించి, అలకకై = అలకాపురమునకెదురై, దివిన్ — అంతరిక్షమునందు. వెఱన్ = భయముచేతను, పఱచు = పఱువిడుచున్నట్టి. మరాళపటలి = అంచలగుంపు, విడిచినన్ = వదలఁగా, పడు = పతనమునొందుచున్నట్టి, అక్కఱచిన = ఆయంచలుగొఱికిన. బిసలవవిసరము = తామరతూఁడుతునుకలసమూహముయొక్క, తెఱగునన్ = చందమునను, వడగండ్లు = వర్షోపలములు, ధవళదీధితిన్ = తెల్లనికాంతితోడను, రాలెన్ = పడెను. తాత్పర్యము సుగమము.

క. తటిదుత్సారితఫణభృ, త్పటలి నిరన్నంబు లయ్యుఁ ♦ దక్కవుబర్హుల్,
న్నటన మతిహర్షహేతూ, త్కటలాభం బిడునె మది క్షు♦ధ న్నిర్వట్టున్. ౧౨౨.

టీ. బర్హులు = నెమళ్లు, తటిత్ = మెఱుపుల చేతను, ఉత్సారిత = పోఁదోలఁబడ్డ, ఫణభృత్ = పాములయొక్క, పటలిన్ = సమూహముచేతను, నిరన్నంబులయ్యున్ = నిరాహారములైనప్పటికిని, నటనము = నాట్యమాడుటను, తక్కవు = మానవు = అతిహర్ష = అత్యంతసంతోషమునకు, హేతు = కారణముయొక్క, ఉత్కట = అధికమైన, లాభంబు = ప్రాప్తి, మదిన్ = మనంబునందు, క్షుధన్ = ఆకలిని, నిర్వట్టున్ = దప్పిని, ఇడునె = కలుగఁజేయునా ? (చేయదనుట).

తా. సంతోషము సగముబలమన్ననానుడి ప్రకారమనుట. అర్థాంతరన్యాసాలంకారము.

సీ. రవిఁ జూచి కుడుచువా ♦ రలకును గృకలాస । ములకును దృష్టి మి♦న్నులనె నిలిచె
సంధ్యార్ఘ్యదాయిద్వి ♦ జశ్రేణి కిఱు సేరు । మొదవులకును భ్రాంతి ♦ మది జనించె,
హాలజీవిసందోహ ♦ ములకు బలాకికా । విసరంబులకు మంచి ♦ వెదలు దొరకె,
నెలమిఁ బొల్చగుయూధి ♦కలకు సంతలకూట । ములకును మఱి నిచ్చ♦మొగ్గ లొదవె,
నతిథిసంఘంబునకు నీఁ♦నట్టియునుప । కదుపులేఁగలగమికి వా♦కట్టు లెసఁగె,
మంటిమిద్దెలవారికి ♦ మరుపనులకు । నెఱఁతఁ బాసినవారికి ♦ నిదుర చెడియె. ౧౨౩.

టీ. రవిన్ = సూర్యుని, చూచి = వీక్షించి, కుడుచువారలకును = భోజనము సేయువారికిని, కృకలాసములకును = తొండలకును, (సరటః కృకలాస స్స్యాదిత్యమరము) దృష్టి = చూపు, మిన్నులనే = అంతరిక్షమందె, నిలిచెన్ = ఉండెను. (ఆదిత్యునిం జూడక భుజింపమను నియమముగలవారలకుఁ దద్దర్శనాపేక్షచేతను, తొండలకు వానపొలసు సందునఁ నీరుచొచ్చినవాని దేహము బూజుచున్నవిగానఁ గొమ్మలం దూర్ధ్వముగ నిలిచియుండుటచేతను గనుచూపు లంతరిక్షమందె యుండుననుట) సంధ్యార్ఘ్యదాయి, సంధ్యా = సాయంకాలమునందు, అర్ఘ్యదాయి = అర్ఘ్యదానము చేయునట్టి, ద్విజశ్రేణికిన్ = పుడమివేల్పులసంఘమునకును, ఇఱుసేరు మొదవులకు = ఇంటికివచ్చుచున్న పసులకును, భ్రాంతి = సాయంకాలమనుభ్రమము. మదిన్ = బుద్ధియందు, జనించెన్ = పుట్టెను. హాలజీవిసందోహమునకు = వ్యవసాయముఁజేయు జనసమూహమునకును, బలాకికావిసరంబులకు = తెల్లకొంగలగుంపులకును, మంచి = అనుకూలమైన, వెదలు = చల్లఁబడ్డచేలు, చక్కగా మొలచుటయు = గర్భధారణమును, దొరకెన్ = ప్రాప్తించెను, (శ్లో॥ గర్భం బలాకా దధతేభ్రయోగా న్నాకే నిబద్ధావలయం సమంతా త్తనకర్తోదయమందుఁ బ్రయోగము) ఎలమిన్ = ఉత్సాహముతో, పొల్చగు = ఒప్పుచున్న, యూథికలకు = మొల్లల భేదముల

కును, సంతలకూటములకును = సంతలకువచ్చి కూడియున్నజనములకును, (సంత యనఁగా గ్రామాంతరములనుండి వర్తకులు నానావిధంబులైన సరకులందెచ్చి బస్తీగా నుండు గ్రామమునకు వెలపలనునిచి యావస్తువుల విక్రయించెడు బజారందురు) మత్తి= మిక్కిలియును, విచ్చుమొగ్గలు = పరువిడుటయు = మొగ్గలువిచ్చుటయును, ఒదవెన్ = కలిగెను. (అనఁగా వర్షాకాలమునందుఁబుష్పించునట్టియూథికలు వికసించినవనియు,వర్షము రాఁగా సంతకువచ్చినప్రజలూళ్ళకువిచ్చిపోయిరనియుంభావము) అతిథిసంఘంబునకున్ = అతిథిసమూహమునకును, ఈనినట్టి =దూడ వేసినట్టి, ఎనుప= గేదెలమొుక్క, కదుపు=సంఘముమొుక్క, లేఁగలగమికిన్ = దూడలసమూహమునకును, వాకట్టులు =వాగ్బంధనములు, ఎసఁగెన్ =అతిశయించెను. (హేరదప్పినవర్షముగురియుచుండఁగా సంచరించుటకుపాయమొుందని యతిథులకున్నము లేనందునను-గేదెకదుపులలేఁగలకుఁజలిచేత దవడలుమూసికొని పాలుగుడువఁగూడక వాగ్బంధనములాదవెననుట) మంటిమిద్దెలవారికిన్ =మంటితోఁజేడలేర్పఱచుకొన్నవారికిని, మరుపనులకు =మన్మథవ్యాపారములకు, నెలంతల్ =స్త్రీలను, (ఇదిజాత్యేకవచనము) పాసినవారికిన్ = ఎడఁబాసినవారికిని, నిదురచెడియె=నిద్రలేకపోయెను (అనఁగా మంటిమిద్దెలుగలవారికిఁగైనున్న మున్నువర్షముచేతఁగఱఁగి యింటిలో నురియుటచేతను, మన్మథవ్యాపారములకుస్త్రీలు లేనివారికి విరహావేదనగల్గుటచేతను నిదురలేకయుంట ప్రసిద్ధము. మఱుపనులకు నెలంతఁబాసినవారికనుదానికితర వ్యాపారార్థము స్త్రీలనెడఁబాసిన వారికనికొన్ని వ్యాఖ్యానములలోనున్నది. మరుపనులకును నిద్రలేకపోయెననియైనం జెప్పవచ్చును అపక్షమున నవి యధికముగా జరగెననిభావము) "శ్లో. వర్ణ్యానామితరేషాంవాధర్మైక్యంతుల్యయోగితా" యను లక్షణముచేత నొప్పియున్న తుల్యయోగితాలంకారము. రెండవగీటున భ్రాంతిమదలంకారము॥

ఉ. కాలునిదున్న నందినయి ♦ గంటలు దున్నక మంటి నా మహా,
కాలునినంది దున్ననయి ♦ కష్టము మున్నతి లేక మంటి నా,
హాలికు లెన్నఁడుం దెగని ♦ యోరులచేలును జొన్న మళ్ళునుం,
గాలలి నేరు పొంగి రిలఁ ♦ గల్గుపసిం గొని పేద మున్నిగన్. ౧౨౪.

టీ. కాలుని = యమునిమొుక్క, దున్న = వాహనమైనదున్నపోతును - (కాలో దండధరశ్శ్రాద్ధదేవయనియమరము) నందినయి = వృషభమునై, గంటలు = అవురుదుబ్బలను, దున్నక = కృషిచేయక, మంటినాన్ = బ్రతికితిననఁగా, మహాకాలునినంది=రుద్రునకు వాహనంబైనవృషభము, (మహాకాలోమహానటయనియమరము) దున్ననయి=దున్నపోతునై, కష్టమున్నతిలేక - బురదలయందుఁ గాళ్ళుదిగఁబడుటలేక - (పంకోస్త్రీశాదకర్దమాయని యమరము) మంటినాన్ = బ్రదికితిననునట్లుగ, హాలికులు = కృషీవలులు ఎన్నఁడుందెగని = ఏదినమందునుదున్ననని, ఓరులచేలును గంటలుగల చెలికలును, జొన్న

మళ్లనుంగా = ఊషరములగు కేదారములుగా, లలిన్ = ఆసక్తిచేతను, పేదమున్నగాన్ = దరిద్రుఁడు మొదలుగా, ఇలఁగల్గు = భూమియందున్న, పసింగొని = పశుమాత్రమునంతయును గూర్చి, ఏరుసాఁగిరి = మడకకట్టిదున్నిరి.

తా. దున్నపోతులకు వెలిదుక్కి కష్టముగనుక యమునికి వాహనమగుటవల్ల దున్నక సుఖించితినని యామహిషంబును, ఎద్దులకురొంపి దుక్కి కష్టముగనుక నీశ్వరునకు వాహనంబైనందున దున్నవలసినదిలేదని యావృషభంబును నెంచునట్లుగఁ బుడమియం దెల్లెడలనుండు పశువులందెచ్చి బీదలుమొదలగు హాలికులు బీటిచేలుచవటికయ్యలు గూడదున్నిరనుట.

క. వరజుబడి రొంపిఁ ద్రొక్కం, జరణంబులఁ బెనఁగి పసిఁడి ♦ చాయకడుపులం
బోరి నీరుకట్టె లమరెను, బిరుదులు హాలికులు దున్నఁ ♦ బెట్టిరొ యనఁగన్. ౧౨౫.

టీ. వరజుబడిన్ = గనిమవెంబడిని, రొంపిఁద్రొక్కన్ = మడిలోనీరువెళ్ళకుండునట్లు బురదనుద్రొక్కఁగా, చరణంబులన్ = పాదములను, పెనఁగి = చుట్టి, పసిడిచాయకడుపులన్ = బంగారువన్నెగల యుదరములతోఁగూడిన, నీరుకట్టెలు = నీరుతొట్టిపాములు, పోరిన్ = ఔద్ధత్యముచేతను, హాలికులు = కర్షకులు, దున్నన్ = దుక్కియందు, బిరుదులు = తమకు సరియెవ్వరును గారని గండపెండెరములు, పెట్టిరొయనఁగన్ = ధరియించిరో యన్నట్లు, అమరెన్ = ఒప్పెను.

తా. సుగమము.

క. నాని శిఖి వంటచెఱకుల, చే నఱి నవి వెండివంట ♦ చెఱకులె యగుటం
బోనంబు ప్రజకు జక్కుల, బోనంబులె యయ్యెఁ బ్రొయ్యి ♦ పొగయమి వృష్టిన్.

టీక. శిఖి = అగ్ని, వంటచెఱకులచేన్ = వంటకట్టియలచేతను, నాని = తడిసి, అఱన్ = చల్లారఁగా, (ఎడతెగని వానలచేతఁ దడసియున్నకట్టెలను నిప్పుమీఁద వేయఁగానే యాయగ్ని చల్లారెననుట) అవి = ఆయింధనములు, వెండి = మఱియును (అనఁగా విచారింపఁగాననుట) వంటచెఱకులెయగుటన్ = వంటకుయోగ్యమయిన చెఱకులని యన్వర్థము లగుటచేతను (అనఁగా బెల్లమువండుటకుఁ దగిన చెఱకులు రసఘనములై యుండి గానిగయందుంచి త్రిప్పఁగా నెల్లరసమును వెళ్లఁగ్రక్కునో యాతీరుననే ప్రొయిలోనఁబెట్టఁగానే కట్టెయలు నీరు వడియుటంజేసి వంటచెఱకు లన్నపేరు సార్థకమాయెననుట) బోనంబు = అన్నము, ప్రజకున్ = జనమునకు, జక్కులబోనంబులెయయ్యెన్ = కామేశ్వరునిఁగొల్చు జక్కులవాండ్ర యన్నమాయెను. అనఁగా శూద్రులయొక్క పెండ్లిమొదలగు నుత్సవములయందు జక్కులవాండ్రు, అరివేణిపెట్టిన శూన్యభాండములనువల మీఁదమోచికొని బోనాలుబోనాలనిపల్కుట ప్రసిద్ధము గానఁ దత్తుల్యంబాయెనని భావ

ము. ప్రొయ్యి = అధిశ్రయణి, వృష్టిన్ = వర్షముచేతను, పొగయమిన్ = రాజకయుండుటచేతనని క్రిందికన్వయము.

సీ. ఇల్లిల్లు దిరుగ నొ ♦ క్కింతబ్బు శిఖియబ్బె నే నింటిలోఁ బూరి ♦ యిడివిసరక
రాఁజదు రాఁజిన ♦ రవులుకొల్పాసలె గాని కల్గదు గూడు ♦ దానఁ గలిగె
నేని కూ రగుట మం ♦ దైనఁ బెన్పొగ సుఖ భుక్తి సేకూర దా ♦ భుక్తి కెడినఁ
బ్రాగ్భోక్తలకె తీరు ♦ బహుజనాన్నము దీర నారుల కొదవుఁ బు ♦ నః ప్రయత్న
మాజ్యపటుముఖ్యలయ మెన్న ♦ రాలయాంగ, దారులయమెన్న రంతిక ♦ కారజనిక
పచననాంధోగృహిణి రామిఁ ♦ బడకమరుఁదు, వెడవెడనెయార్వ నొగిలిర ♦ జ్జడిని గృహులు.

టీ. ఇల్లిల్లు = ప్రతిగృహమునకును, తిరుగన్ = వెళ్లఁగా, శిఖి = అగ్ని, ఒక్కింత = కొంచెము, అబ్బున్ = దొరకును, అబ్బెనేని = లబ్ధంబాయెనా, ఇంటిలోఁబూరి = ఇంటిపైకసవును, ఇడి = దానిపైనునిచి, విసరక రాఁజదు = వీజనము సేయక యంటికొనదు. రాఁజినన్ = అంటికొనినను, రవులుకొల్పాసలె గాని = ప్రజ్వలింపఁజేయు నపేక్షయొకటి దక్క, దానన్ = ఆమంటవల్ల, కూడు = అన్నము, కల్గదు = దొరకదు (రవులు కోల్పాసాలఁగానియను పాఠమునందు గృహములో నివాసములని విఱిచి పెట్టకగాని కలుగదని యర్థము) కలిగెనేని = అన్నమైనప్పటికిని, కూరగుట = శాకమగుట, మందు = ఔషధము (అనఁగా దుర్లభమనుట) ఐనన్ = శాకమైనను, పెన్పొగన్ = ప్రబలంబైన ధూమముచేతను, సుఖభుక్తిసేకూరదు = సుఖకరమైనభోజనము దొరకదు. ఆభుక్తికెడినన్ = ఆభోజనమున కొసంగినను, బహుజనాన్నము = ఇంటిలో నున్నవారలకెల్ల వండిన యన్నము, ప్రాగ్భోక్తలకే = తొలుబంతి భోజనముఁ జేయువారలకే. తీరున్ = సరిపోవును (ఆ కాలమునకువచ్చిన యతిథులఁ బరిహరింపరామింజేసి వారలకిడుటచేతఁ బక్వాన్నము సరిపోవు ననుట) తీరన్ = సరిపోఁగా, నారులకు = ఉవిదలకు, పునఃప్రయత్నము = మరలవంటయొనర్చుట, ఒదవున్ = కలుగును. అంతికకున్ = ప్రొయ్యికి, ఆజ్య = నేతిచేతఁ దడుపఁబడిన. పటుముఖ్య = కోకలు లోనైనవానియొక్క, లయమెన్నరు = నష్టము విచారింపరు, ఆలయ = ఇంటియొక్క, అంగదారు = వాసాలయొక్క, లయము = నాశమును, ఎన్నరు = లెక్కింపరు (ప్రొయ్యిమండుటకై నేతిలో బట్టలుదడిపివైచియు వాసాలు పెరికివైచియును వానినష్టమును లెక్కింపకుండిరనుట) ఆరజనిక = రాత్రివఱకును, పచన = పాకము సేయుటచేతను, నాంధః = అన్నము లేకయుండిన, గృహిణి = ఇల్లాలు. రామిన్ = రాకపోవుటవల్ల, పడకన్ = శయ్యయందు, మరుఁదు = పచ్చవిల్తుఁడు, వెడవెడనె = వెళవెళమని, ఆర్వన్ = వేగిరింపఁగా, అజ్జడిన్ = ఆముసారునందు, గృహులు = గృహస్థులు, నొగిలిరి = కృశించిరి. (అనఁగా దొఱ్ఱుపడిరనుట.)

తా. ఆసమయంబునందు నెల్లదిక్కులనుండు పతీపతులంద ఱాహారమజ్జన శయనాదులయందుఁ క్లేశము నొందు నట్లెడతెగక జడివానలు గురియుచుండె ననుట.

చ. పిడుగుల కల్కిఁ లోఁ దొలిచి ◆ భీరులు కంచముఁ జల్లు దీధితు
ల్గడపల వెళ్ళిరాఁ బొగలఁ ◆ గావిఁ గ్రుంగెడు పుల్లగృహంబు లె
ల్లెడఁ గనుపట్టె నూళ్ళ నిల ◆ యెల్ల సముంచి రసాతలంబుపై
విడియఁగ దండు డిగ్గిన స ◆ విద్యుదురుస్తనయిత్నులో యనన్. ౧౨౪.

టీ. పిడుగులకున్ = ఆశనిపాతములకు, అల్కి = వెఱచి, భీరులు = భయస్వభావముగల స్త్రీలు (భీరుస్త్వంబాధరాంగనా యని నిఘంటువు) కంచము = భోజన పాత్రమును, లోఁదొలిచి = కడపలకులోపలనేకడిగి, చల్లు = త్రిప్పినీరుపైటఁ జల్లఁగాబుట్టిన, దీధితుల్ = కాంతులు, కడపలవెళ్ళిరాన్ = దేహళులదాఁటిరాఁగా, పొగలన్ = ధూమములచేతను, కావిఁగ్రుంగెడు = ధూమ్రవర్ణము గప్పినట్టి (వర్షాకాలమందుఁ దడిసిన గృహములకుఁ బొగచుట్టికొనియుండుట ప్రసిద్ధము) పుల్లగృహంబులు = పూరి యిండ్లు, ఎల్లెడన్ = ఏదెసఁజూచినను, ఊళ్ళన్ = గ్రామములయందు, కనుపట్టెన్ = చూపట్టెను, ఇలయెల్లను = భూమియంతయును, ముంచి = వాననీళ్ళచేతనిండింపఁజేసి, రసాతలంబుపైన్ = పాతాళముమీఁదను, విడియఁగన్ = ఆక్రమింపవలయునని, దండుడిగ్గిన = భూమియందు సేనాసమేతమై విడిసిన, సవిద్యుత్ = మెఱుములతోఁగూడిన, ఉరు = గొప్పలయిన, స్తనయిత్నులోయనన్ = మేఘములోయనునట్లు, కనుపట్టెనని క్రిందికన్వయము. ఉత్ప్రేక్ష.

చ. గొడుగుల గాలిఁ దూల్చి మటి ◆ కోలలతోడన పాఱ నాన్చెఁ జే
డ్పడ జడి మేఘుఁ డట్లకట ◆ పాంథులపైఁ దన కెంతవైరమో
తడిసిన మేననింకి యది ◆ దారవియోగజ వహ్నిఁ గొంత కొం
తుడిపె విధాతరక్ష విష ◆ మొక్కొకమా టమృతంబు సేయఁగన్. ౧౨౫.

టీ. మేఘుఁడు = జలధరుఁడు, గొడుగులన్ = ఛత్రములను, గాలిన్ = వాయువుచేతను, దూల్చి = ఎగరఁగొట్టి, మటి = పిమ్మటను, కోల లతోడన = గొడుగుకఱ్ఱలుమాత్రము చేతఁబట్టి, పాఱన్ = పఱువిడుచుండఁగా, జడిన్ = వర్షముచేతను, చేడ్పడన్ = బాధపడునట్లుగ, నాన్చెన్ = తడిపెను, అట్లు = ఆలాగుతడుపునట్లు, అకట = అయ్యో, తనకున్ = మేఘునికి, పాంథులపైన్ = పథికులమీఁదను, ఎంతవైరమో = ఏపాటివిరోధమో (నాన్చెనని క్రిందికన్వయము) విధాతరక్ష = విరించియొక్క రక్షణము, విషమ్ము = గరళమును, ఒక్కొకమాటు = ఒక్కొకపర్యాయము, అమృతంబుసేయఁగన్ = సుధగాఁజేయుటవల్లను, అది = ఆ వర్షము, తడిసిన = నానిన, మేనన్ = శరీరమందు, ఇంకి = ఇగిరి, దారవియోగజవహ్నిన్ =

భార్యలవిరహమువల్లఁబుట్టినయగ్నిని, కొంతకొంతుడిపెన్ = కొంతవడిఁబోఁగొట్టెను, ఈపద్యమునందుఁ బూర్వార్థంబున వ్యాఘాతాలంకారంబు నుత్తరార్థంబున విచిత్రాలంకారము. శ్లో, స్యాద్వ్యాఘాతోతథాకారి తథాకారిక్రియేతచేత్ । విచిత్రంయత్ప్రియత్నశ్చే ద్విపరీతఫలేప్సయాః అని వానికిలక్షణము.

తా. సుగమము.

తే. గీ. దవులుజల్లని దూఱనం ♦ తక మునుపటి, జల్లునీరానివచ్చునా ♦ జల్లు మొదలి
గాలి యెలగోలుచేఁగొమ్మ♦గదలి జల్లు, దలపడకమున్న వంగుళ్లఁ♦దడిపెదరులు.

టీ. తరులు = వృక్షములు, దవులన్ = దూరమునందు, జల్లని=వానయనుకొని, దూరన్ = వానిక్రిందికిఁబోఁగా, అంతకమునుపటిజల్లు = దూరమునసుండి వచ్చువానకంటె మున్నుగురిసియున్నవానయొక్క, నీరాని=ఉదకముగలనై, వచ్చునాజల్లు=దూరమున వచ్చుచున్నయావానయొక్క, మొదలి=ముందుగవచ్చిన, గాలియెలగోలుచేన్ = ఎలగోలుగాలిచేతను, (దండునకు ముందుగాఁబోయి హెచ్చరికచేయుటకు నెలగోలని చెప్పుట ప్రసిద్ధము) కొమ్మగదలి = శాఖచలనమునొంది, జల్లుదలపడకమున్న = వచ్చుచున్నవర్షము రాకమునుపే, వంగుళ్ళన్ = వ్రమములైయున్నకొమ్మలు మొదలగువానిచేతను, తడిపెన్ = నాన్చెను, పథికులనని పూర్వపద్యమునసుండు కర్మ నధ్యాహరింపవలయును.

తా. సుగమము.

చ. రయమున వృష్టికై యొదిఁగి రచ్చలపై విధియింతు రుగ్రతన్,
హయపతిమీఁద దంతిపతి ♦ నాతనిపై నృపతిం గజాదిని,
ర్ణయముల మొత్తు లాడుదురు ♦ మబ్బొక యించుక విప్ప వచ్చు మొ,
గ్గయి మఱి పాఱి పోదురు స♦మస్తదిశాగతు లైనయధ్వగుల్. ౧౩౧

టీ. సమస్తదిశ = సకలదిశలనుండి, ఆగతులైన = వచ్చినట్టి, అధ్వగుల్= తెరువరులు, రయమునన్ = వేగముచేతను, వృష్టికై = వానకై, ఒదిగి = చోటుచాలక యడంగికొని, రచ్చలపైన్=ధర్మపుచావిళ్ళ యఱుఁగులమీఁదను, హయపతిమీఁదన్= అశ్వపతిపైని, దంతిపతిన్ = గజపతిని, అతనిపైన్ = ఆగజపతిమీఁదను, నృపతిన్=నరపతిని (అశ్వపతిప్రబలుఁడు - వానికంటె గజపతి ప్రబలుడు గజపతింకంటె నరపతిప్రబలుడనియనుట) ఉగ్రతన్=కోపముతోడను, విధియింతురు = నిర్ణయింతురు, గజాదినిర్ణయములన్,గజ=యేనుఁగులు, ఆది=మొదలగువానియొక్క, నిర్ణయములన్=నిశ్చయించుటలయందు మొత్తులాడుదురు - కలహపడుదురు (అనగా నశ్వపతే యెక్కుఁడనియొక్కండును గజపతే ప్రబలుండని మఱియొక్కండును నందఱికంటె నరపతియధికుఁడనియన్యుండును - వానికంటె వీనికి నశ్వములెక్కువనియు - వీనికంటె వానికి గజంబులుతక్కువనియు నీ మొదలగు గజాదిసంఖ్యానిర్ణయాభినివేశములచేతఁ గలహించుచుందురనుట)

మబ్బు=మేఘము, ఒకయించుకవిప్పన్ = కొంచెము విడువఁగాను, మఱి=పిమ్మటను, విచ్చుమొగ్గయి = ప్రోగువీడినవారలై, పాఱిపోదురు = ఎవ్వరిదారినివారు వెళ్ళుదురు.

తా. పాటసారులకుఁ ద్రోవ జరగకుండునట్లు జడివానలు గురియుచుండునని భావము.

క. తనరె బలిభుక్తతులు నిం, డినగ్రామశ్రీల గళతటి నీలము లగుటం,
గనియెఁ దృణగ్రాహిత నన, గొను కసవులఁ జైత్యతరుల గూండ్లిడుభ్రమలన్.

టీ. బలిభుక్తతులు = కాకులగుంపులు, (ధ్వాంక్షాత్మఘోషపరభృద్బలిభుగ్వాయసా అపియని యమరము) నిండిన గ్రామశ్రీలకున్ = సంపూర్ణగ్రామలక్ష్ములకు, గళతటి= కంఠమునందున్న, నీలములగుటన్ = ఇంద్రనీలమణులౌటచేతను, తనరెన్ = ఒప్పెను, చైత్యతరులన్ = ఉద్యానపాదపములందు (చైత్యమాయతనే బుద్ధబింబే చోద్యానపాదపె యని విశ్వము) గూండ్లిడుభ్రమలన్, గూండ్లిడు = గూండ్లుపెట్టుటకొఱకు, భ్రమలన్ = తిరుగుటలచేతను, కొనుకసవులన్ = పట్టికొనిపోవుతృణములచేతను, తృణగ్రాహితన్ = తృణగ్రాహిత్వమును, కనియెన్ =పొందెను, అనన్ =అనునట్లు, తనరెనని క్రిందికన్వయము.

తా. నీలములు తృణగ్రాహులుగాన నావిధంబుగఁ గాకులంగుంపులు గ్రామసమీపమునను౦డు నుద్యానమందలి చెట్లయందుఁ గూండ్లు గట్టికొనవలయునన్న యిచ్ఛచేతఁ గఱచికొనిపోవుచున్న కసవులంజూడఁగా దండివైన గ్రామలక్ష్ములు కంఠమునందు ధరియించిన హారమందలి నీలమణులు తృణంబులను గ్రహించుచున్నవో యన్నట్లుగ నొప్పెననుట.

మ. వసతుల్వెల్వడి వానకై గుడిసె మోవన్ రాక తా నాని యే,
పసగా నిల్చినజమ్ముగూడఁ బొలమంబల్మోయుచుం బట్టి పె,
న్మసురం దీగెడుకాఁపుగుబ్బెతలపెన్ గుబ్బల్పునాసల్వెలిం,
బిసికిళ్లుం బిసికిళ్ల హాలికుల కర్పించె న్నభస్యంబునన్. ౧౩౩.

టీ. వసతుల్వెల్వడి = గృహములు బయలువెళ్లి, వానకై = వర్షబాధానివృత్తికొఱకు, గుడిసెమోవన్ = పొలములోఁ గాపునిమిత్తమై వేయఁబడ్డకుటీరము దగిలికొనఁగా లోపలికిరాక, తాన్ = తాను, ఆనియే = తగిలికొనియే, పసగా = ఒప్పిదముగా, నిల్చిన = నిలుపంబడియున్న, జమ్ముగూడన్ = జమ్ముచే గట్టఁబడ్డగూడను (జమ్ముగూడ కావలిగుడిసెలోకిరాక గుడిసెదగిలినిలిచియుండఁగాననుట) పొలమంబల్మోయుచున్ = కృషిసేయుభూమికి నంబలిమ్మోచికొనుచును, పట్టి = ధరియించి, పెన్మసురందు = జడివానయందు, ఈగెడు = గుడిసెలోపలం దూరునట్టి, కాఁపుగుబ్బెతల = కాఁపువాండ్రవనితలయొక్క, పెన్గుబ్బల్ = గొప్పవైనకుచములును, పునాసల్ = పూర్వసస్యంబు

లైన సజ్జలు మొదలయినవియును (పునర్వసు కార్తెయందుఁ జల్లఁబడ్డ ధాన్యములు గనుకఁ బునాసలని వ్యవహారము) వెలిన్ = వెలుపలను, హాలికులకున్ = కృషిఁజేయు శూద్రులకు, పిసికిళ్లన్ = కుచగ్రహణంబులును, పిసికిళ్లు = కంకులు నల్పుటలును, నభస్యంబునన్ = భాద్రపదమాసమునందు, అర్పించెన్ = ఒసంగెను.

తా. సుగమము.

మ. గురుగుం జెంచలి దుమ్మి లేఁదగిరిసా ♦ కుం దింత్రిణీపల్లవో,
త్కరముం గూడఁ బొరంటినూనియలతోఁ గట్టావికుట్టారికో,
గిరము ల్మేసి తమిం గొమ ల్పొలము పో♦ ద్రేఁపు ల్మెయి ల్నాకమేఁ,
కెరవుంగుంపటిమంచ మెక్కి రి ప్రభు ♦ త్వైకాప్తి రె డ్లజ్జడిన్. ౧౩౪.

టీ. గురుగున్ = కురకటశాకమును, చెంచలి = తువిన్నకశాకము, తుమ్మి = ద్రోణశాకము, లేఁదగిరిసాకున్ = కోమలమైనతంటెపుకూరయును, తింత్రిణీపల్లవోత్కరమున్ = చింతచిగురు, కూడన్ = వానితోఁగలిపి, నూనియలతోన్ = తైలములతోను, పొరంటి = పొరఁటి, కట్టావి = మిగుల వేఁడియయిన, కుట్టారికోగిరముల్ = కుఱుచయారికకూళ్లు (మూఁడు నెలలకుఁ బండునవి కుఱుచయారికలనియు నయిదు నెలలకుఁ బండునవి పెద్దారికలనియుం జెప్పుదురు) మేసి = మెక్కి, (పశుప్రాయులగుటం జేసి మేసియని ప్రయోగించుట యుచితము) తమిన్ = రాత్రియందు, కొమల్ = కొడుకులు (చెట్లకు శాఖలవంటివారు గనుక నిట్లు చెప్పవచ్చును) పొలముపోన్ = చేలుగాయఁబోగా, రెడ్లు = పెత్తనముచేయు కాఁపులు, ప్రభుత్వైకాప్తిన్ = అధికారమొకటియబ్బుటచేతను, అజ్జడిన్ = ఆ ముసురునందు, క్రేపుల్ = దూడలు, మెయుల్ = దేహములను, నాకన్ = లేహనమొనరింపఁగా, మేకెరవుంగుంపటి = మేకలయెరవున నెత్తియుంచిన కుంపట్లుగల, మంచమెక్కిరి = ఖట్వారోహణము సేసిరి, (వానకుఁదడియునని దూడలను మంచపుఁగోళ్లకుఁగట్ట నవి దేహములను నాఁకుచుండఁగా శయనించిరనుట).

తా. సుగమము.

సీ. మణియష్టిఁ గేలిబ ర్హిణషడ్జసుధ వీను । లాలాడఁ బ్రొద్దెక్కి ♦ మేలుకాంచి,
ఘుమఘుమవత్సుమ ♦ గంధరాజాంగమ । ర్దనపైఁ జిరోష్ణమ♦ జ్జనము లాడి,
మిసిమిదువ్వలువ బ♦ న్నసరంబు మొగలిఱే । కులఁ దాల్చి జామెక్కి♦ కొలువొసంగి,
జాంగలామిషముతో ♦ శాల్యన్న మధికహ । య్యంగవీనంబుగా ♦ నారగించి,
మృగమదము మించుతమలంపు♦ టిఱుల మోవి। దలముగా సాగరుహసంతి♦ వెలుఁగ సౌధ
శిఖరవాతాయనాగతా ♦ చిరరుగంశు । వతదృగవగోధములతోడ♦ నగిరి నృపులు.

టీ. మణియష్టిన్ = మణిమయమైనగండమునందున్న, కేళిబర్హిణ = పెంపుడు నెమళ్ళయొక్క, షడ్జ = షడ్జస్వరమనియెడు = సుధ — అమృతము, వీనులోలాడన్ = చెవులునిండఁగా, ప్రాద్దెక్కి = సూర్యోదయంబైన మఱి కొంతసేపటికి, మేలుకాంచి = నిద్రలేచి, ఘుమఘుమవత్ = ఘుమ్మనివాసించుచున్న, సుమగంధరాజ = ఈపేరిటి ద్రవ్యముయొక్క, అంగమర్దనమైన్ = నలుఁగుబెట్టినమీఁదట, చిరోష్ణ = మిక్కిలివేఁడిమిగలయుదకములచేత, మజ్జనములు = జలకములు, ఆడి = సలిపి, (చిరోష్ణమజ్జనములాడియని యున్నందున నుష్ణశబ్దమునకు నుష్ణోదకమనియర్థముఁ జెప్పవలయును) మిసిమిదువ్వలువన్ = సరిగ తళతళలాడుదుప్పటిని, బన్నసరంబులన్ = బన్నసరములను హారములను, మొగలిఱేకులన్ = మొగిలిపువ్వులను, తాల్చి = ధరియించి, జాముెక్కి = జాముప్రొద్దెక్కినవెనుక, కొలువొసంగి = సభఁజేసి, జాంగల = మరుభూమియందలి, ఆమిషముతోన్ = మాంసముతోడను (అనఁగా మరుభూమియందు సంచరించెడు కౌఁజు - పూరేఁడు - ఉడుము - ఏఁదుఁబంది మొదలగువాని మాంసమనుట) (పలలంక్రవ్యమామిషమని యమరము) శాల్యన్నము = రాజనపుసాదమును, అధికహయ్యంగవీనంబుగాన్ = వెన్నగాచిననెయ్యి యెక్కుడుగాఁ గలుగునట్లు (తత్తుహయ్యంగవీనం యద్ధ్యోగోదోహోద్భవంఘృతమని యమరము) ఆరగించి = భోజనముఁ జేసి, మృగమదముమించు = కస్తూరియెక్కువగాఁగల. తమలంపుఁజిరులు = విడెముకాంతులు, (కస్తూరి యధికమగుటవల్లనల్లగానుండుటచేత నిరులనుట) మోవిదళముగా = ప్రదవిదట్టముకాఁగా, సాగరుహసంతివెలుఁగన్ = అగరుచెక్కతో నించినకుంపట్లు ప్రజ్వలించుచుండఁగా, సౌధ = ఉప్పరిగెలయొక్క, శిఖర = పైయంతస్తులయందున్న, వాతాయన = గవాక్షములవల్ల, ఆగత = వచ్చినట్టి, అచిరరుక్ = మెఱుపులయొక్క, అంశు = కాంతులచేతను, నత = వంపఁబడిన, దృక్ = చూపులుగల, అవరోధముల తోడన్ = అంతఃపురస్త్రీలతోడను, (శుద్ధాంతశ్చావరోధశ్చయని యమరము) నృపులు = రాజులు, నగరి = ఆనందించిరి.

తా. సుగమము.

వ. ఇట్లు సాంద్రసలిలధారాసారమాసరంబులగు వార్షికవాసరంబులు ప్రశాంతం బగుటయుఁ దదనంతరంబ. ౧౩౬

టీ. ఇట్లు = ఇవ్విధంబుగ, సాంద్ర = ఘనమైన. సలిల = ఉదకములయొక్క, ధార = దారలయొక్క, ఆసార = సమ్యక్ప్రవర్షణములచేతను, మాసరంబులగు = వ్యాప్తములైన, వార్షికవాసరంబులు = వానకాలపుదినములు, ప్రశాంతంబగుటయున్ = శాంతింపఁగా, తదనంతరంబ = అటుపిమ్మటను. ఇది వర్షర్తువర్ణనంబు సమాప్తం బాయెను.

## శ ర దృ తు వ ర్ణ న ము.

ఉ. రాజమరాళలబ్ధగిరి ♦ రంధ్రము శాలివనీశరావలీ,
నైజననంబు యజ్వహుత ♦ వాజహుతాశము భాస్వదిందిరాం,
భోజసమాగమం బుదిత ♦ బోధభుజంగశయోపచారనీ,
రాజనఫుల్లహల్లకన ♦ రం బుదయించె శరద్దినం బిలన్. ౧౩౭.

టి. రాజమరాళ = రాజహంసల చేతను, లబ్ధ = పొందఁబడిన, గిరిరంధ్రము = క్రౌంచపర్వతముయొక్క బిలముగల్గినట్టియు (అంచలు మానససరోవరంబునవర్షాకాలము వెళ్లఁబుచ్చి శరదృతువురాఁగాఁ క్రౌంచపర్వతపుబిలములోఁజొచ్చి దశార్ణాదిదేశంబుల కువచ్చుట ప్రసిద్ధము) శాలివనీ = రాజనపుంజేలకు, శరావలీ = రెల్లుగంటలసమూహమునకును, నైజననంబు = ఈనుసెలవైనదియును, (సూతిమాసో నైజననయని యమరము) యజ్వ = ఋత్విక్ప్రకారము. జన్నముఁజేసనవారిచేత, హుత = హోమముచేయఁబడ్డ, వాజి = హవిస్సుగల, హుతాశనము = శ్రౌతాగ్నిగలదియును (అపుడు సోమయాజులు నూతనాన్నభోజనముకొఱకు నాగ్రయణేష్ట్యాదికముఁజేసిరనుట-లేకవాజి-వాజపేయముగలయనియైనఁజెప్పవచ్చును, శరద్వాజపేయము ప్రసిద్ధము) భాస్వత్ = వెలుంగుచున్న ఇందిరా = లక్ష్మికి, అంభోజ = కమలములయొక్క, సమాగమంబు = కలియుటగలదియును (శరదృతువునందుఁ గమలములకువికసనముగల్గుటంజేసి వానియందే లక్ష్మినివసించెననుట) ఉదిత = జనించిన, బోధ = మేల్కనుటగల. భుజంగశయ = దామోదరునకు, ఉపచార = పూజనార్థమైన, నీరాజన = నివాళియయిన, ఫుల్ల = పూచియున్నట్టి, హల్లక = చెంగల్వలుగల, నరంబులు = కొలంకులుగలిగినట్టి, (హల్లకంరక్తసంధ్యకమని యమరము) అనఁగాఁ జాతుర్మాస్యలప్పటికిఁ గడచినవిగాన భగవంతుండు నిద్రమేలుకొనఁగా శరల్లక్ష్మి నీరాజనమెత్తెనోయన్నట్టుం బలెఁజెన్నొందియున్న యెఱ్ఱచెంగల్వలతో నొప్పియున్నకొలంకులు గలదియనుట) శరద్దినంబు = శరద్వాసరము. ఇలన్ = భూమియందు, ఉదయించెన్ = కనుపడెను, వికసించినచెంగల్వలను నిద్రమేలుకొన్న యీశ్వరునకు శయనోపచారనీరాజనముగా వర్ణించినందున నుత్ప్రేక్షాలంకారము.

తా. వర్షర్తుధర్మములయిన వర్షించుట మొదలగు చిహ్నములుమాని శరదృతుధర్మములుగానవచ్చెనని తాత్పర్యము.

క. కరము పొగ రెక్కె నంబర, మురువిద్యుద్దీపకళిక ♦ లుమిసిన ధూమ,
స్ఫురణ బాగచూరె ననఁగా, హరివణిజంబూఫలాళి ♦ తామలరుచులన్. ౧౩౮.

టి. కరము = మిక్కిలియును, అంబరము = గగనము, ఉరు = అధికమైన, విద్యుత్ = మెఱుపులనెడు, దీపకళికలు = దీపాంకురములు, ఉమిసిన = చిమ్మినటువంటి,

టి "శ్లో. నిష్ఠ్యూతోద్గీర్ణవాంతాదిగౌణవృత్తివ్యపాశ్రయమ్ । అతిసుందరమన్యత్ర గ్రామ్యకక్ష్యాం విగాహతే" అని ఆచార్యదండి చెప్పియున్నారుగాననుమిసిన - అనునది మొదలగువానికి గౌణార్థములె కాని ముఖ్యార్థములు చెప్పఁగూడదనుట) ధూమ = పొగయొక్క, స్ఫురణన్ = స్ఫురించుటచేతను, పొగసూరెననఁగాన్ = ధూమితమాయెనోయన్నట్లు, హరిమణి = ఇంద్రనీలములవలెను, జంబూఫల = నేరేడుపండ్లవలెను, అసిత = నల్లనై, అమల = స్వచ్ఛములై యున్న, రుచులన్ = కాంతులచేతను, పొగరెక్కెన్ = మదించెను; ఉత్ప్రేక్షాలంకారము

తా. సుగమము.

ఆ. వె. సాంధ్యరాగలహరి ♦ సామిరంజితములై, తిరిగె మింట నిదుర ♦ దెలిసినట్టి,
యిందిరాధిపతికి ♦ నెత్తుకర్పూరనీ, రాజనంబు లన శ♦రద్ఘనములు. ౧౪౦.

టీ. శరదద్ఘనములు = శరత్కాలమేఘములు, సాంధ్య = సంధ్యాసంబంధియయిన, రాగ = రక్తిమయొక్క, లహరి = తరంగములచేతను (మహత్యుల్లోలకల్లోలౌలహర్యుత్కలికె సమే అని యమరశేషము) సామి = సగము, రంజితములై = కెంపువర్ణములుగలవిగాఁ జేయఁబడినవై, నిదురదెలిసినట్టి = నిద్రమేల్కాంచిన, ఇందిరాధిపతికిన్ = లక్ష్మీరమణునకు ఎత్తు = పట్టినటువంటి - కర్పూరనీరాజనంబులనన్ = ఘనసారపునివాళులోయన్నట్లు, మింటన్ = అంతరిక్షమునందు, తిరిగెన్ = సంచరించెను (సామిత్వర్ధేజుగుప్సేయనియు, ఇందిరాలోకమాతా మాయనియు నమరము) ఉత్ప్రేక్షాలంకారము.

తా. సుగమము.

చ. అళిగరుదంచలాపలత ♦ దంతరబింబిత యయ్యెఁ బాకని;
ర్దళితమహాఫలౌఘహరి ♦ తచ్ఛదకర్కరికావనాళి నాఁ,
గలమవనభ్రమచ్ఛుకని ♦ కాయములోపల సాంధ్యరక్తిమం,
బలఁతిగఁ దాల్చి మింటఁ గన ♦ నయ్యె విపాండుపయోదఖండముల్. ౧౪౧.

టీ. విపాండు = మిగులఁ దెల్లనైన, పయోద = మబ్బులయొక్క, ఖండముల్ = శకలములు, కలమవన = పండినరాజనపుచేలమీఁద, భ్రమత్ = తిరుగుచున్న, శుకనికాయము = చిలుకలగుంపు, లోపలన్ = శరత్కాలమేఘములలోపలను, సాంధ్య = సంధ్యాకాలసంబంధిమైన. రక్తిమంబు = ఆరుణ్యమును, అలతిగన్ = కొంచముగా, తాల్చి = ధరియించి, పాక = పండుటచేతను, నిర్దళిత = మిక్కిలి విరిసిన, మహత్ = గొప్పవైన, ఫల = పండ్లయొక్క, ఓఘ = సమూహముగల్గియు, హరితచ్ఛద = పచ్చనియాకులుగల, కర్కరికావనాలి = పొసతోఁటలగుంపు, అళి = తుమ్మెదలయొక్క, గరు

త్ = ఱెక్కలయొక్క, అంచల = కొనలవలెనున్న, అమల = నిర్మలమయిన, తత్ = ఆకాశముయొక్క, అంతర = నడుమను, బింబితయయ్యెనాక్ = ప్రతిఫలించెనోకోయన్నట్లు, కననయ్యెన్ = చూడనొప్పెను, ఉత్ప్రేక్షాలంకారము.

తా. పండినపైరులమీఁద సంచరించుచున్న చిలుకల గుంపును దమయందించుకంత సంధ్యాకాలికరక్తిమము ధరియించిన తెల్లని మేఘఖండములును జరిపక్వములై పండి విరిసిన గొప్పపండ్లును బచ్చనయినయాకులునుం గలదో సతోఁటలు ద్విరేఫముల ఱెక్కల మొనలవలెనై గనిగ్యముగల యయ్యాకాశమునందుఁ బ్రతిఫలించెనో యన్నట్లుండెననుట.

క. ఘుణగణవిహరణఁ జివికెన, మణిధనువునఁ దొరఁగునుసి స♦మానములై ద,
ర్పణనిభనభమునఁ బరిణత, శణకణహారిణములు పాండు♦ జలదము లొలసెన్. ౧౪౨

టీ. ఘుణ = నుసిపురుగులయొక్క, గణ = సమూహముయొక్క, విహరణన్ = సంచారముచేతను, చివికిన = వానలకుఁదడిసి శిథిలమయిన, మణిధనువునన్ = ఇంద్రధనువునందుంటి, తొరఁగు = పడుచున్నట్టువంటి, నుసిసమానములై = పరాగసదృశములై. పరిణత = పరిపక్వములయిన, శణ = జనపనారయొక్క, కణ = లేశములవలెను, హారిణములు = తెల్లనైనట్టువంటి, పాండుజలదములు = తెల్లనిమబ్బులు, దర్పణ = అద్దముతోడను, నిభ = సమానమయిన, నభమునన్ = ఆకాశమందు, ఒలసెన్ = సంచరించెను, శరత్కాలమేఘములను మణిధనువుయొక్క పరాగములని యుత్ప్రేక్షించి నందున నుత్ప్రేక్షాలంకారము.

తా. సుగమము.

క. రవిశశిముకురములు శర, ద్యువతి మెఱుఁగుఁబెట్టుభూతి♦ దోఁ యనఁ బర్వె,
న్పవనాహతసప్తచ్ఛద, నివహపరాగంబు దివికి♦ నిర్మలకాంతిన్. ౧౪౩.

టీ. రవిశశి = చంద్రసూర్యులనియెడు, ముకురములు = అద్దములను, శరద్యువతి = శరదృతువనుజవరాలు, మెఱుఁగుఁబెట్టు = కాంతిగలుగఁజేయునట్టి, భూతియో యనన్ = భస్మమో యనఁగా, పవన = వాయువుచేతను, ఆహత = ఎగరఁగొట్టఁబడిన, సప్తచ్ఛద = ఏడాకుల యరఁటులయొక్క, నివహ = సమూహముయొక్క, పరాగంబు = పుప్పొడి, దివికిన్ = అంతరిక్షమునకు, నిర్మల = స్వచ్ఛమయిన, కాంతిన్ = తేజస్సుచేతను, పర్వెన్ = వ్యాపించెను, ఉత్ప్రేక్షాలంకారము.

తా. లోకమునం దద్దమునకువచ్చిన మాలిన్యమును భస్మముచేతఁ దుడుచుట ప్రసిద్ధముగాన నటు వర్షాకాలమందుఁ జంద్రసూర్యులను నద్దములకు నైర్మల్యము దక్కువపడఁగా వానికి మెఱుఁగెక్కించి చక్కఁబఱచుటకై శరద్వనితయుంచిన విభూతియో యనునట్లాసమయమందు సప్తచ్ఛదపరాగములు గాలిచేత నెగరఁగొట్టంబడి యంతరిక్షమున వ్యాపించెననుట.

స్రగ్ధర. సంభూతజ్ఞప్తివాతా ♦ శనశయనము న్వి♦శ్వంభరుం డూఁది లేవం,
గంభీర ప్రక్రియాము ♦ న్నత డిగు జగతిం ♦ గ్రందుగాఁ దోఁచు వర్షా,
దంభోళిస్థూలరంధ్రో ♦ ద్గతసితపృథుపా ♦ తాళజాతాంబుధారా,
స్తంభంబు ల్పోలె నెన్ను ♦ ల్ధవళరుచిశర ♦ స్తంభపఙ్క్తిం జనించెన్. ౧౪౪

టీ. సంభూత = జనించినట్టి, జ్ఞప్తిన్ = మెలఁకువచేతను, వాతాశనశయన. ముల్ = శేషపర్యంకమును, విశ్వంభరుండు = శ్రీమహావిష్ణువు, (విశ్వంభరః కైటభజి ద్విధుశ్శ్రీవత్సలాంఛన యనియమరము) ఊఁదిలేవన్ = ఊనికొనిలేవఁగా, గంభీరప్రక్రియా = నిమ్న ప్రకారమగునట్లు, మున్నతన్ = మునుంగుటవల్లను, డిగు = క్రిందికినడఁగినట్టి, జగతిన్ = భూమియందు, క్రందుగాన్ = దట్టముగాను, తోఁచు = కానవచ్చుచున్న, వర్షా = వానకాలమందలి, దంభోళి = పిడుగులయొక్క, స్థూలరంధ్ర = గొప్పబెజ్జములవల్లను, ఉద్గత = బయలుదేరిన, పృథు = గొప్పలైన, సిత = తెల్లనైన, పాతాళజాత = పాతాళలోకమందుబుట్టిన, అంబుధారా స్తంభంబుల్పోలెన్ = స్తంభములవంటి యుదకధారలవలె, శర స్తంభపఙ్క్తిన్ = రెల్లుకాఁడలవరుసయందు, ఎన్నల్ = కంకులు, ధవళరుచిన్ = తెల్లనికాంతితో, జనించెన్ = పుట్టెను, ఇందు రెల్లు యొక్క యెన్నులను బిడుగులరంధ్రములనుండి బయలువెళ్ళినట్టి పాతాళజలధారా స్తంభములుగా నుత్ప్రేక్షించి నందున నుత్ప్రేక్షాలంకారము.

తా. ఆశరదృతువునందే దిక్కునఁజూచినను రెల్లుపొదలు ఎన్నులుదీసి తెల్లఁగాఁ బ్రకాశించుచుండెననుట.

తే, గీ. నీరజేక్షణుఁ డవ్వేళ నిద్ర ♦ దెలిసి, యడుగుఁ దనమీఁద మోప నో ♦ యవనిరమణి,
కంటకితగాత్రి యయ్యె నాఁ ♦ గా విపాక, పరుషకంటకశాలిమం ♦ జరులు వొలిచె.

టీ. నీరజేక్షణుఁడు = విష్ణుదేవుఁడు, అవ్వేళన్ = ఆ శరత్సమయమునందు, నిద్రదెలిసి = నిదురమేల్కొని, అడుగున్ = పాదమును, తనమీఁదన్ = భూమిపైని, మోపనో = ఉంచఁగానో, అవనిరమణి = భూదేవి, కంటకితగాత్రియయ్యెనాఁగాన్ = పులకితాంగియయ్యెనన్నట్లు, విపాక = పండుటచేత, పరుష = వాడిగ్రొయున్న, కంటక = ముండ్లుగల, శాలిమంజరులు = సన్నవరియెన్నులు. పొలిచెన్ = ఒప్పెను, హేతూత్ప్రేక్షాలంకారము.

తా. పండి ముదురైనందున వాడిమిగలిగియున్న ముండ్లతోనుండు సన్నవరియెన్నులంజూడఁగా నా శరదృతువునందుఁ గమలాక్షుండు నిద్రలేచియడుగుఁ దనమీఁదనుంచుటచేత నా భూదేవికంటకిత గాత్రియాయె ననునట్లుండెననుట.

మ. స్ఫుటభయదాగస్త్యతిశంకఁ వార్ధి ననర ♦ శ్మత్విట్తతుల్ మిన్నఁ జేర్పం దటి
చ్ఛటు లౌర్వాంబుగఁ గారుఁగొంచు ఘనలై ♦ క్ష్మాఁ దీర వర్షింపఁ, న
చ్ఛోటనం దోఁచి గ్రసింపఁ బోలుఁ గలశీ ♦ సూనుండు గాకున్న నొ
క్కొటఁ దారాగ్రహభాస్కరేందుమణిశు ♦ క్త్యుల్ వ్యక్తమై తోఁచునే. ౧౪౬

టీ. స్ఫుట = వ్యక్తమైన, భయదాగస్త్యతిశంకన్ = అగస్త్యుండు మరలఁ బానముఁజేయు ననుభయముచేతను (శంకా వితర్కభయయోః అని యమరము) ఇనరశ్మితతుల్ = సూర్యకిరణములు, వార్ధిన్ = సముద్రమును, మిన్నచేర్పన్ = అంతరిక్షమును బొందింపఁగా, (సూర్యకిరణములు సముద్రోదకములను మేఘములందుఁ జేర్పఁగా ననుట) తటిచ్ఛటలు = విద్యుత్సమూహములు, ఔర్వంబుగన్ = బడబాగ్నిగా, కారుకొంచు = నల్లనివై, ఘనలై = మేఘములై, క్ష్మాన్ = భూమిని, తీరవర్షింపన్ = ఉదకమంతయు వానలుగు రియఁగా, అచ్ఛోటనన్ = ఆ యాకాశమునందును, గలశీసూనుండు — అగస్త్యుఁడు, తోఁచి = కనుపించి, గ్రసింపఁబోలున్ = సముద్రోదకమును బానముఁజేసెఁగాఁబోలు, కాకున్నన్ = అట్లుగాకుండెనేని, ఒక్కొటన్ = ఏకరీతిగా, తారా = చుక్కలును, గ్రహ = అంగారకాదిగ్రహములును, భాస్కర = సూర్యుఁడును, ఇందు = చంద్రుఁడును, (అనియెడు) మణి = రత్నములును, శుక్తుల్ = ముత్యపుచిప్పలును, వ్యక్తమై = స్ఫుటమై, తోఁచునే = కానవచ్చునా. కానరావనుట.

తా. శరత్సమయమున నంతరిక్షమందు మేఘములు లేక నక్షత్ర సూర్యేందువులు స్ఫుటముగఁ బ్రకాశించుటను నగస్త్యోదయంబగుటను జూడఁగా బూర్వమగస్త్యునికి వెఱచి మేఘరూపమును వహించి యాకాశమును జెందియున్న సముద్రుని నగస్త్యుండు మరలఁ బానముఁజేసియుండును లేకపోయెనేని యందుండు తారాగ్రహములనియెడు రత్నములును సూర్యాచంద్రులను ముత్యపుచిప్పలును గానవచ్చుటకుఁ గారణంబు లేదనునట్లు తోఁచుచుండెననుట.

చ. అలమలయాద్రిఁ గుంభభవుఁ ♦ డన్ కతకంబు శరద్ఘటంబునం,
దలిఁ బ్రతిబింబకైతవము ♦ నం దను [illegible] దేసిత,
ల్గాఁచుల కేలఁ దాఁప నిడి ♦ తోఁపఁ [illegible] దిగియుచో,
త్పలతను బ్రహ్స్వమౌట కరి ♦ తారకలంబుపుఁ దేర్చునే యనన్. ౧౪౭

టీ. అల = ప్రసిద్ధమైన, మలయాద్రిన్ = మలయపర్వతమునందున్నట్టి, కుంభసంభవుఁడన్ = అగస్త్యుఁడనియెడు, (అగస్త్యః కుంభసంభవః అని యమరము) కతకంబు = చిల్లగింజను (వృక్షస్య కతకః [illegible]) శరత్తు = శరదృతువు, కుండమునందటిన్ = [illegible], ప్రతిబింబకైతవమున్ = ప్రతిఫలనవ్యా

జము చేతను, తమకున్ = ఆ వారిదేవతలకు, ఇచ్చినన్ = ఇయ్యఁగా, వారిదేవతల్ = జలదేవతలు, తొలఁకుల కేలన్ = తరంగములను హస్తములచేతను, తాఁపనిడి = మెట్టురాతిమీఁదఁ బెట్టి, తోమన్ = అరఁదీయఁగా, కలంకఁడఁగెన్ = కాలుష్యముదీరెను, తదీయ = ఆ యగస్త్యుని సంబంధియైన, తత్ఫలతకున్ = ఆ చిల్లగింజౌటకు. హ్రస్వమౌటె = చిన్నదౌటయే, కరి = సాక్షి, (చిలగింజ గనుకనే అరఁచినందున హ్రస్వమాయె ననుట) (అట్లు గాకుండెనేని) తారకలు = నక్షత్రములు. అంబువున్ = ఉదకమును. తేర్చునే = తేటగాఁజేయునా, చేయవనుట - (అనన్ = అనునట్లు, కలంకడఁగెనని క్రిందికన్వయము - రూపకానుప్రాణితాపహ్నుత్యుత్థాపితోత్ప్రేక్షాలంకారము).

చ. ఇలకు సుధాసమత్వము వ♦హింప శరజ్జలజాక్షి కుండమం,
డలి సలిలంబు కల్మష మ♦డంగ మొగు ల్విరియెండ గాయుచోఁ,
జిలుకునిశారజఃపటలి ♦ చెన్ను వహించెఁ దరంగపఙ్క్తిపైఁ,
దళదరవిందకైరవక ♦ దంబకడారపరాగపూగముల్. ౧౪౪.

టీ. తరంగపఙ్క్తిపైన్ = కెరుల్లబంతిమీఁదను, తళత్ = వికసించుచున్న, అరవింద = పద్మములయొక్కయు. కైరవ = కలువలయొక్కయు, కదంబ = సమూహములయొక్క, కడార = పచ్చనైనటువంటి, (కడారః కపిలః పింగ యని యమరము) పూగముల్ = సమూహములు (పూగో వితానం ప్రకర యని యమరము) ఇలకున్ = భూమికి, సుధాసమత్వము = అమృతసామ్యము, వహింపన్ = పొందునట్లు, శరజ్జలజాక్షి = శరత్కాలమను స్త్రీ, కుండమడలిన్ = కొలంకులయందు, (కుండం పిఠరె తోయాధారవిశేషే చ వహ్న్యగర్తె చ । కుండో జారాజ్జాతస్సభర్తృకాయాం కమండలౌ కుండీ యని రత్నమాల) సలిలంబు = ఉదకము, కల్మషమడంగన్ = కలుషముపోవుటకు, మొగుల్ = మబ్బులు, విరి = విసిరిన, ఎండగాయుచోన్ = ఎండతపింపఁగా, చిలుకు = చల్లఁబడినటువంటి, నిశారజఃపటలి = పసపుపొడిరాశియొక్క. చెన్ను = సౌందర్యమును, వహించెన్ = పొందెను.

తా. ఆ సమయంబున వికసించిన తామరలయొక్కయుఁ గలువలయొక్కయుఁ బరాగములు తరంగములపైఁబడి శరదృతువను స్త్రీ యుదకములోని కల్మషమడఁగించి రుచిపుట్టించుటకొఱకుఁ జల్లిన పసపుపొడివలె నుండెననుట.

ఉ. హెచ్చినమైత్రిఁ బద్మినుల ♦ కెల్ల ఘనాత్యయకారకుండు సౌ,
ఖ్యచ్ఛపడంగఁ జేయుటకు ♦ నై యలక్రౌంచనగంబు పేరిక,
మ్మచ్చున నీడ్చు శర్వగిరి ♦ యందలి వెండిశలాకపిండు నా,
వచ్చి మరాళమాలికలు ♦ వ్రాలెఁ గొలంకులఁ జక్కరుగ్మ్యకృతిన్, ౧౪౫.

టీ. హెచ్చినసొంపునన్ = అతిశయించినస్నేహముచేతను, పద్మినులకెల్లన్ = తామరకొలంకులను బద్మినీస్త్రీల కంతయును, ఘనాత్యయ = మేఘావసానమనెడు (అనఁగా శరదృతువనుట) కారకుండు = అగసాలవాఁడు. సొమ్ము = భూషణము, అచ్చుపడంగన్ = సమముగనుండులాగున. చేయుటకునై = తీగగా నొనరించుటకై, అల = ప్రసిద్ధమైన, క్రౌంచనగంబుపేరి = క్రౌంచపర్వతమనియెడు మిషగల, క్రమ్మచ్చునన్ = వెండిబంగారు తీఁగెతీయునట్టి యినుపకమ్మచ్చుయొక్క బెజ్జమందు, ఈడ్చు = లాగెడు శర్వగిరియందలి = కైలాసపర్వతమునందున్న, వెండిశలాకపిండునాన్ = రజతపుతీఁగసమూహమో యనునట్లు, మరాళిమాలికలు = హంసలబంతులు, వచ్చి = ఎతెంచి, కొలంకులన్ = సరస్సులయందు, చక్ర = సుడిగాలియొక్క, ఝుంకృతిన్ = ఝుంకారముతోడను, ప్రాలెన్ = దిగెను (అనఁగా విస్తరించి హంసలు వచ్చెనని భావము).

తే. కుంభజుఁడు వార్ధితోఁ గ్రోలి ♦ కుక్షి నున్న । మించుముక్తాచ్ఛటలె క్రమ్మరించె ననఁగ
జలజదళములఁ దేటలుఁ ♦ జవులునయిన, యంబుకణములు పొలిచెఁ బ ♦ ద్మాకరముల.

టీ. కుంభజుఁడు = అగస్త్యుఁడు. వార్ధితోఁ గ్రోలి = సముద్రముతోఁగూడఁ బానముచేసి, కుక్షినున్న = ఉదరములోనున్న. మించు = అతిశయించిన, ముక్తాచ్ఛటలె = మౌక్తికసమూహములె, క్రమ్మరించెననఁగన్ = మగుడ దిగువఁబోసెనో యనఁగ, జలజదళములన్ = తామరాకులయందు, తేటలు = స్వచ్ఛమైనటువంటియు, చవులునైన = రుచిగలవియునైన (ముత్యాలలోనొక్కలెక్క కుచవియని పేరుగనుకన వియనియు నర్థము) అంబుకణములు = ఉదకబిందువులు. పద్మాకరములన్, పద్మ = తామరలకు, ఆకరములన్ = గనులైన కొలఁకులయందు, పొలిచెన్ = ఒప్పెను.

తా. సుగమము.

చ. కెరలుస్రవంతిపైయిసుక ♦ క్రిందగువేళ నినుండు మేఘపుం,
దెర సనఁ జల్లఁగా విరహ ♦ దీప్తకరప్లుత మానజీరకో,
త్కరగుడ మట్లు పద్మినులఁ ♦ గ్రమ్ముసకేసరమాధ్వి పొల్చెఁ గైఁ,
గర మరుదారెఁ దేంట్లు సెక ♦ గందినము త్రైపు సేసలో యనన్. ౧౫౧.

టీ. కెరలు = ప్రవహించుచున్న, స్రవంతి = నదులయందు (స్రవంతీనిమ్నగాపగా యని యమరము) పైయిసుక = ప్రవాహవేగముచేత నీళ్లతోఁగలిసి పైగాఁ బ్రవహించుచున్నయిసుక, క్రిందగువేళన్ = అడుగుఁబట్టినప్పుడు (వేగముతగ్గినప్పుడి సుక క్రిందఁబడుట ప్రసిద్ధము) స్రవంతియనఁగాని సుకపోసియుండు ఘటికా యంత్రమునకునుపేరగుసుక దానిలోఁ బైయిసుక క్రిందికిరాఁగాననియు నర్థము) ఇనుండు = సూర్యుఁడను నాయకుఁడు (ఇనస్సూర్యేప్రభౌయని యమరము) మేఘపుందెరసనన్ = మేఘమను తెరదీయఁగా, చల్లఁగాన్ = చిలకరింపఁగా (ఉంచగాననుట) విరహ = వియోగవేద

చేత, దీప్త = వెచ్చనైన, కర = హస్తమందు, ప్లుతమా = తేలుచున్న, సజీరకోత్కర = జీలకఱ్ఱలతోఁగూడిన, గుడమట్లు = బెల్లమువలె, పద్మినులన్ = తామరతీఁగెలనియెడుపద్మినీజాతిస్త్రీలయందు, క్రమ్ము = వ్యాపించినట్టి, సకేసరమాధ్వి = కేసరములతోఁగూడినమకరందము, పొల్చెన్ = ఒప్పెను, (పద్మినీకరిణీస్త్రీ సరోజనలినీచయని రత్నమాల) (విరహతాపతప్తమైన హస్తమందుగుడమునుంచఁగాఁ గరఁగి పాకమైనట్లు మకరందముండెననుట) తేఁట్లు = భ్రమరములు, సెకన్ = తాపముచేతను, కందిన = కములినటువంటి, ముత్తెపుసేసలో యనన్ = ముత్యాలతలంబ్రాలో యనునట్లు, పైన్ = ఉపరిభాగమందు, కరము = మిక్కిలి, అరుదారెన్ = ఒప్పెను, ఉత్ప్రేక్షాలంకారము.

తా. సుగమము.

చ. జలజదళస్థతోయములు ♦ సందుల క్రిందుగఁ దోఁచు మింటినీ,
డలుఁ గనుపట్టె నత్తఱిఁ ద ♦ టాకముల న్లఘుమంబు రెంటిలోఁ,
దెలియఁ దరంగశైతెగయు ♦ తేఁటులచేరులఁ దూన్పఁ దోయము,
ల్పలుచనఁ దేలె మిన్నడుగుఁ ♦ బట్టెఁ గడుం దళపాటనో యనన్. ౧౫౨.

టీ. జలజదళ = పద్మపత్రములయందు, స్థ = ఉన్నటువంటి, తోయములు = ఉదకములును, సందుల = ఆ పద్మపత్రములసందులయొక్క, క్రిందుగన్ = అధోభాగమునందు. తోఁచు = కనుపించుచున్న, మింటినీడలున్ = ఆకాశముయొక్క ప్రతిఫలనములును, అత్తఱిన్ = ఆ శరత్సమయమునందు, లఘుమంబు = చులకఁదనము. రెంటిలోన్ = ఆకాశజలములలోను, తెలియన్ = ఎఱుంగుటకొఱకు, తరంగశైతెగయు = కరుళ్లచేతశైతెగయుచున్న, తేఁటుల = తుమ్మెదలనియెడు, చేరులన్ = దారములచేతను, తూన్పన్ = తామరాకులనియెడు తూనికెసిబ్బెలయందుఁ దూఁచఁగా, తోయముల్ = ఉదకములు, పలుచనన్ = తేలికయగుటవల్ల, తేలెన్ = పైకిఁదేలెను, మిన్ను = ఆకాశము, కడున్ = మిక్కిలియును. దళపాటనో = మందపాటుచేతనో, అడుగుఁబట్టెన్ = క్రిందికిఁబోయెను, అనన్ = అనఁగా, తటాకములన్ = సరస్సులయందు, కనుపట్టెన్ = చూడనొప్పెను.

తా. తామరాకులపయినుండు నీరును వానిసందులయందుఁ దటాకములోనియుదకమునఁ బ్రతిఫలించిన యాకాశముయొక్క నీడలనుజూచి యాకాశము తేలికో లేక యుదకములు తేలికయో చూతమను సంకల్పముచేతఁ దేఁట్లనుదారములుగల తటాకమను తక్కెడయందుఁ దూనికవేయఁగా నుదకములు పలుచనగనుక మీఁదికివచ్చెను మిన్ను దళముగనుక నడుగుఁబట్టెనో యన్నట్లుండెననుట.

మ. ఇలతు స్వైరిగుఁగఁ బండుతీరవనపుం ♦ బ్రేంఖచ్ఛటాక్రీపుల,
గ్గలమై ప్రాల నుతుస్వనంబు లెసఁగం ♦ గాఁ ద్రిప్పురాట్రంపుఁగుం,

డ్రలు నాఁ దేనెకొలంకులం బొరలి పా♦ఱన్విచ్చుపంకేరుహం
బుల నాడెం దొలుసంజఁ దేఁటివలయం బు♦త్తారఝంకారముల్. ౧౫౩.

టీ. ఇలకున్ = భూమికి, వ్రేఁగుగన్ = బరువగునట్లు. పండు = పరిపక్వమైన తీర = దరియందలి, వన = ఉద్యానవనమందున్న, పుండ్రేక్షుచ్ఛటల్ = నామాలచెఱకుగుంపులు (రసాలఇక్షుస్తద్భేదాః పుండ్రకాంతారకాదయః యనియమరము) తీపులు = మాధుర్యములు, అగ్గలమై = అతిశయమై (రసమువిస్తరించియనుట) వ్రాలన్ = మీఁదవంగఁగా, ఉరుస్వనంబులు = అధికమైనధ్వనులు, ఎసఁగంగా = ఒప్పఁగాను, త్రిప్పు = త్రిప్పఁబడుచున్న, రాట్రంపుగుండ్రలునాన్ = చెఱకుగానిగయొక్క కోలలోయనఁగా, తేనె = మకరందము, కొలంకులన్ సరస్సులయందు. పొరలిపాఱన్ = లుంఠితమై ప్రవహింపఁగా, విచ్చు = వికసించుచున్న, పంకేరుహంబునన్ = పద్మములయందు, తారఝంకారముల్ = గంభీరములయినధ్వని విశేషములుగల, తేఁటివలయంబుల్ — తేఁటి = తుమ్మెదలయొక్క, వలయంబుల్ = మండలాకారభ్రమణంబులు, తొలుసంజన్ = ప్రాతస్సంధ్యయందు, ఆడెన్ = తిరిగెను, ఉత్ప్రేక్షాలంకారము.

తా. తీరమందలి చెఱకులువంగి తటాకములలోనున్న కమలములమీఁదఁబడియుండ నా కమలంబులయందలి మకరందములు సరస్సులలోఁ బొరలి పాఱుచుండఁగా నందు మండలాకారభ్రమణంబులు సేయుచున్నతుమ్మెదలయొక్క ధ్వనులు చెఱకుగానిగకోలల ధ్వనులవలె నుండెననుట.

సీ. హాలనమత్కదళికం♦దాభతిర్యఙ్నతా। స్యమునఁ గొమ్ముకటి మో♦సనఁగఁ గ్రుంగఁ,
గటముల డిగి చిబు♦కమున రేఁ బేరిన। మద మంజనగ్రంథి♦మాట్కి మెఱయ,
ఛిద్రోర్ధ్వహాతవల♦త్క్రముజ మనఁ జుట్టు। తో విప్పుతో దగఁ♦ దొండ మాడ,
వెల్లిపెల్లలు నీటఁ♦ద్రెళ్లి ఫేనము వండు। నయి పునఃప్రాప్య దా♦నీయము నొసఁగ,
ఘనరజోవృష్టికై మీఁది♦కన్ను మొగుడఁ, గటిదెసలు నిక్క బరితోలు♦గదలఁ గీలు,
మదము లిక్తత నకులకీ♦వదనకృద్వ్ర।శాలితోఁ దేంట్లు సలుపఁ గో♦రాడెఁ గరులు.

టీ. హాల = నాఁగేటిమొక్క చేతను, నమత్ = వంగుచున్నట్టువంటి, కదళీకందాభ = అనంటిదుంపసామ్యముగల, తిర్యక్ = అడ్డముగా, నత = వంగినట్టువంటి, ఆస్యమునన్ = ముఖమందు, కొమ్ముకటి = ఒకవిషాణము, (దంతమనుట) మోసనఁగన్ = ఆకువిప్పనియరఁటిమొలక యనునట్లు, క్రుంగన్ = వంగఁగా, కటములన్ = గండస్థలములనుండి, డిగి = జాఱి, చిబుకమునన్ = గడ్డమందు, రేన్ = రాత్రియందు, పేరిన = ఘనీభవించిన, మదము = దానము, అంజనగ్రంథిమాట్కిన్ = కాటుకడబ్బివలెను, మెఱయన్ = ఒప్పఁగా, ఛిద్రోర్ధ్వ = రంధ్రముపలన బయలువెడలినట్టియు, హాత = కొట్టఁబడినబగనుక,

వలత్ = చుట్టుకొనుచున్న, కద్రూజనమున్ = సర్పసమూహము, చుట్టుతోన్ = పెనఁచికొనుటతోడను, విప్పుతోన్ = విడఁదీయుటతోడను, దరిన్ = నదీకూలమందు, తొండము = శుండాదండము, ఆడన్ = చలించుచుండఁగా, తెల్లు = శరములు, పెల్లలు = మంటిగడ్డలును, నీటన్ = ఉదకమునందు, త్రెళ్లి = పడి, ఫేనము = నురువును, వండును = ప్రవాహముతోవచ్చియున్న బురదయును, అయి = అయినవై, పునః = మరలను, ప్రావృడాశయమున్ = వర్షాకాలమనుబుద్ధిని, ఒసఁగన్ = పుట్టింపఁగా, (అనఁగాఁ దెల్లని తెల్లు నురుఁగుగా మంటిపెల్లలువండునుగానున్నందున వర్షాకాలమనుబుద్ధిని బుట్టించె ననుట) ఘనరజోవృష్టికై, ఘన = అధికమైన, రజః = పరాగముయొక్క, వృష్టికై = వర్షమువలన (చల్లుటవలన ననుట) మీఁదికన్ను = పైనేత్రము, మొగుడన్ = ముయ్యఁబడఁగా. కటిదెసలు = మొలప్రక్కలు (పిఱుఁదు ప్రక్కలనియుం జెప్పదగును) నిక్కన్ = పైకెగయుఁగాను, బరితోలు = పార్శ్వమందున్న చర్మము, కదలన్ = చలింపఁగాను, కీలు = స్రవించుచున్న, మదము = దానోదకము, తిక్తతన్ = సౌగంధ్యమును, నదులకున్ = సరిత్తులకు, ఈన్ = ఒసఁగఁగాను, (కటుతిక్తకషాయాస్తుసౌరభ్యేపిప్రకీర్తితా యని యాదవము) తత్ = ఆ తమ్మును, అనుకృత్ = అనుకరించుచున్న (పోల్చినయనుట) వృషాళితోన్ = వృషభసమూహముతోఁగూడను (సుకృతే వృషభే వృషయనియమరము) తేంట్లు = తుమ్మెదలు, పఱవన్ = తమవ్యాపారమునకువెఱచి పాఱిపోఁగా. కరులు = ఏనుంగులు, కోరాడెను = తిర్యగ్దంతప్రహారముఁజేసెను. ఉత్ప్రేక్షాలంకారము.

తా. సుగమము.

శా. గండద్వంద్వగళత్కరాళమదరే ♦ ఖల్ ఫుల్లసప్తచ్ఛదా,
ఖండక్షోదసిత ల్ప్రకీర్ణకములై ♦ కర్ణద్వయి న్మించఁగాఁ,
గొండల్ప్రద్వినమన్నకత్తులగతిం ♦ గొమ్ముం గొన ల్మంపవే,
దండంబు ల్పృథుదంతు లాటఁ దెలిపెం♦దండెత్త భూపాలికిన్. ౧౫౫.

టీ. గండద్వంద్వ = కపోలద్వయమువల్లను, గళత్ = జాఱుచున్న. కరాళ = దట్టమైన, (కరాళో దంతురే తుంగేయనిరత్నమాల) మదరేఖల్ = దానప్రవాహపుచారలు, ఫుల్ల = విచ్చినటువంటి, సప్తచ్ఛద = ఏడాకులయరఁటిగెయొక్క, అఖండ = అధికమైన, క్షోద = పుప్పొడిచేతను, సితల్ = తెల్లనైనవి, ప్రకీర్ణకములై = చామరములై, (చామరంతుప్రకీర్ణకమనియమరము) కర్ణద్వయిన్ = శ్రోత్రయుగమును, మించఁగా = అతిక్రమించికొమ్ములపర్యంతము రాఁగా, కొండల్ ప్రద్వినమన్న = పర్వతములుకోరాడినట్టి, కత్తులగతిన్ = ఒరలతోనున్నఖడ్గములరీతిని, కొమ్ముంగొనల్ = దంతాగ్రములను, ముంపన్ = కప్పఁగాను, వేదండంబుల్ = మత్తేభములు, భూపాలికిన్ = రాజమండ

లమునకు, దండెత్తన్ = యుద్ధయాత్రకొఱకు, చవుదంతుతోటన్ = చతుర్దంతదంతా వళముతోటను, తెలిపెన్ = చూపెను, చామరసదృశములైనమదరేఖలుకొమ్ములమూఁడిఁట నుండఁగాననుట.

తే, గీ. అప్పు డన్యోన్యవిజిగీషు ♦ లైనదొరల,
కవదొనలనుండి లబ్ధల ♦ క్ష్యంబు లైన,
స్వాన్వయ శరాళిచేఁ గీర్తి ♦ చాలఁ గనెనొ,
యన వనాళిఁ బ్రఫుల్లశ ♦ రాళి మెఱసె. ౧౫౬

టీ. అప్పుడు = ఆశరత్సమయమునందు, అన్యోన్యవిజిగీషులైన = ఒండొరులజ యింపనిచ్ఛగల్గినటువంటి, దొరల = నృపులయొక్క, కవ = రెండైన, దొనలనుండి = తూణీరములందుండి, లబ్ధలక్ష్యంబులైన = పొందఁబడినగుఱిగలవిగ్గైన, (లక్షలక్ష్యంశ రవ్యమనియమరము) స్వాన్వయశరాళిచేన్, స్వ = తమయొక్క, అన్వయ = వంశము గల, (తమరు శరశబ్దవాచ్యులగనుకననుట) శరాళిచేన్ = బాణసమూహము చేతను, కీర్తిచాలఁగనెనొయనన్ = అధికమైనయశస్సునుబొందెనోయనఁగా, వనాళిన్ = అర ణ్యపఙ్క్తియందు, ప్రఫుల్ల = వికసించిన, శరాళి = కాశకుసుమపఙ్క్తి, మెఱసెన్ = వెలిఁగెను. శ్లేషానుప్రాణితోత్ప్రేక్షాలంకారము.

తా. కీర్తితెలుపని కవిసమయముగాన తెల్లుపువ్వులుం దెల్పఁగుటంజేసి యపుడవి విస్తరించి యున్నందున విస్తారమైనకీర్తిని బాణములు పొందెనో యన్నట్లుండెననుట.

తే, గీ. దరులతడివండు పొదవుమూఁ ♦ పురము లంటు, తెల్లుగంటల నాఁబోతు ♦ లుల్లసిల్లె
గిరులమోరులసవి సము ♦ ద్గీర్ణసలిల, జలధరచ్ఛేదములు ప్రాలఁ ♦ జెలఁగుకరణి. ౧౫౭

టీ. దరుల = నదీకూలములంచలి, తడివండు = కర్దమము, పొదవు = వ్యాపించి న, మూపురములు = కకుత్ప్రదేశములను, అంటు = తగిలికొనునట్టి, తెల్లుగంటలన్ = పూచినతెల్లుగంటలచేతను, ఆఁబోతులు = అచ్చువేయఁబడిన కోడెలు, ఉల్లసిల్లెన్ = మిగులనొప్పెను, గిరుల = కొండలయొక్క, మోరులసవిన్ = శిఖరములను బుద్ధిచేతను, సముద్గీర్ణ = కురియంబడిన, సలిల = ఉదకములుగల, జలధరచ్ఛేదములు = మబ్బుతునియలు, ప్రాలెన్ = పైనిఁ జేరియుండఁగా, చెలఁగుకరణిన్ = ఒప్పెడుచందంబునను, ఉల్లసిల్లెనని క్రిందికన్వయము. ఉత్ప్రేక్ష.

తా. సుగమము.

తే, గీ. గగనలక్ష్మిక్ నిజోరున ♦ క్షత్రమాలి, కలు వియన్నది జలములఁ ♦ గడుగఁ బిసుక,
నెఱయుకుంకుడుపండుల ♦ నురు వనంగఁ, బలపలనిపొండు రాంబుద ♦ పఙ్క్తు లమరె.

టీ. గగనలక్ష్మి = ఆకాశలక్ష్మి, నిజ = స్వీయమైన, ఉరు = గొప్పలైన, నక్షత్రమాలికలు = చుక్కలపఙ్క్తులనియెడు నిరువదియేడుముత్యములుగల హారములు (సైవనక్షత్రమాలాస్యాత్సప్తవింశతిమౌక్తికాయని, యమరము) వియన్నది= ఆకాశగంగయందలి, జలములన్ = ఉదకములయందు, కడుఁగన్ = మునికికెనెత్తుటకొఱకు, పిసుకన్ =నలఁపఁగా, నెఱయు = వ్యాపించినట్టి, కుంకుడుపండుల = ఫేనిలఫుపండ్లయొక్క, నురువనంగన్ = ఫేనములో యనునట్లు, పలపలని = పలుచనైన, పాండుర = తెల్లనైనట్టి, అంబుదపఙ్క్తులు = మబ్బులచాళ్లు, అమరెన్ = ఒప్పెను. శ్లేషానుప్రాణితమైన యుత్ప్రేక్షాలంకారము

శా. అప్పుల్వారిధిచేతఁ బుచ్చికొని కార్యంబైన మున్నొన్నయు,
యప్పుల్దొ చనియు నవృద్ధికముగా నవ్వార్ధికే తీర్పఁగా,
నప్పుణ్యాతివిశుద్ధజీవుఁడు నిజాచ్ఛాంగంబులం దోఁచుఁ న.
ట్లొప్పారె న్శశిబింబగర్భితములై ద్యోచారిశుభ్రాభ్రముల్. ౧౫౯

టీ. అప్పుల్ = ఉదకములు, ఋణములును. వారిధిచేన్ =సముద్రునిచేత, పుచ్చికొని = కైకొని = కార్యంబైనన్ = పనితీరఁగా, మున్నొన్న= ముందు పుచ్చికొని. నట్టి, అయ్యప్పుల్ = ఆ యుదకములను ఋణములను, దొచనియున్ = దూరదేశములువెళ్లియును = వానకాలముగడచియును, సవృద్ధికముగాన్ =అధికముగాను—వడ్డితోఁగూడను, అవ్వార్ధికే = ఆ సముద్రునికే, తీర్పఁగాన్ = నరిపుచ్చఁగా, అప్పుణ్య=ఆఋణముక్తిరూపసుకృతముచేతను, అతివిశుద్ధ= మిగులఁ బరిశుద్ధుఁడైన. జీవుఁడు=ప్రాణి, నిజ= స్వీయములైన, అచ్ఛ = స్వచ్ఛములైన. అంగంబులన్ = అవయవములందు, తోఁచునట్లు = అగపడునట్లు, శశిబింబగర్భితములై = చంద్రబింబముదరమందుఁగలవిమై, ద్యోచారి = అంతరిక్షమున సంచరించుచున్న శుభ్రాభ్రముల్ = తెల్లనిమబ్బులు, ఒప్పారెన్ = ఒప్పిదమాయెను.

తా. "శ్లో. బ్రహ్మహాముచ్యతే పాపైః ఋణీతు నకదాచన యన్నట్లు ఋణమపరిహార్యమైన పాపముగనుక నట్టిపాపముచేత విముక్తుఁడైనమనుజుని మాడ్కిఁ జంద్రగర్భితములైన మేఘములు వెలింగెననుట శ్లేషానుప్రాణితమైన యుత్ప్రేక్ష."

చ. విశదపయోదపుంబొరల వేష్టనచే నొకచో నభోమణి,
న్నశునపటత్వ మొందుట మనంబున నారసి కాంచి విష్ణుఁ డ,
య్యశివతకై పదంబు వల యంబునఁ బాపి యవస్తులోభక,
ర్కశతఁ బ్రబోధ మొంది సిరిఁ గాంచి చెలంగెఁ బయఃపయోనిధిన్. ౧౬౦

టీ. విశద = తెల్లనైన, పయోదపు = మేఘములయొక్క, పొరల = ఆవరణములయొక్క, వేష్టనచేన్ = వ్యాప్తిచేతను, ఒకచోన్ = ఒకప్రదేశమునందు, నభోమణిన్ =

సూర్యుని = ఆకాశమందలిమణిని, లశునపటత్వమొందుటన్ = లశునపటమను దోషము పొందుటను, మనంబునన్ = చిత్తమందు, ఆరసి = విచారించి, కాంచి=చూచి, విష్ణుఁడు = లక్ష్మీరమణుఁడు, అయ్యశివతకై = ఆ దోషనివృత్తికై, (తులమెత్తుగల కెంపునకు మణియని సంజ్ఞగాన దానికిఁ గలుగు లశునపటమను దోషము ద్యుమణియైన సూర్యునికి శరత్కాల మేఘరూపముతోఁ గలుగఁగాఁ జూచి యశివంకరము గాదు గనుకఁ దన్నివృత్తికై యనుట) వలయంబునన్ = పరివేషమువలనను, అందెవలనను, పదంబు = పాదస్థైన యాకాశమును, పాపి = విడిపించి, (అప్పుడు పరివేషముండదనుట) అవస్తులోభకర్కశతన్ = వస్తువునందు లోభము చేతఁ గఠినుండు కాక పోవుటవల్లను, (అనఁగా దోషవస్తువులయందాసక్తిలేనివాఁడౌటవల్లననుట) ప్రబోధమొంది = జాగ్రత్తనొంది=మేలుకొని, పయఃపయోనిధిన్ = పాలసముద్రమునందు, సిరిఁగాంచి = సంపదనొంది, శ్రీమహాలక్ష్మినిఁ బొంది; చెలంగెన్ = ఒప్పెను.

తా. సుగమము.

ఉ. అంబరవాసు లగ్నిక్రియ ♦ కై ద్యుమణిస్ఫటికోపలంబునం,
దుం బడయ న్శరజ్జలద ♦ తూలపరంపరఁ గొంత సైఁ ఘటిం,
పం బెలుచం జనించి మఱి ♦ మట్టున నిల్వక యాక్రమించె గా,
కం బరితాప మూనె ననఁ ♦ గాసె మొగుల్విరియెండ లత్తఱిన్. ౧౬౧

టీ. అంబరవాసులు = దివిషదులు, అగ్నిక్రియకై = వహ్నిఁబుట్టించుటకై.(వర్షర్తువునందుక్షీణమైన దానిననుట) ద్యుమణిస్ఫటికోపలంబునందున్ = ద్యుమణి=సూర్యుఁడనియెడు, స్ఫటికోపలంబునందున్ = స్ఫటికశిలయందు, పడయన్ = పొందుటకొఱకు, శరజ్జలద = శరన్మేఘములనియెడు, తూలపరంపరన్ = దూదిప్రోగును, కొంత = కొంచెము, సైఁ ఘటింపన్ = మీఁదనుంచఁగా, వెలుచంజనించి=విస్తరించి యగ్నిపుట్టి, మఱి= పిమ్మటను, మట్టునన్ = కొద్దిగా, నిల్వక = నిలిచియుండక, కాఁకన్ = అగ్నియొక్క వేఁడిమిచేతను, పరితాపమూనన్ = వ్యాకులత్వమును బొందునట్లు, ఆక్రమించెన్ = వ్యాపించెను, అనన్ = అనఁగా, అత్తఱిన్ = ఆ సమయమునందు, మొగుల్విరియెండలు = మబ్బువిరిసిన యెండలు, కాసెన్ = తపించెను.

క. కంజహితాస్తోదయవేళ, సంజకడల నడుమఁ గప్పు ♦ సంధిల మిన్నా,
ప్పెం జూడఁ బ్రకృతిశబరీ, గుంజానాసావిభూష ♦ కొమరు భజింపన్. ౧౬౨

టీ. కంజహిత=సూర్యునియొక్క, అస్తోదయవు=అస్తమయోదయములయొక్క, వేళసంజ = ఎఱ్ఱసంధ్యారాగము, కడలన్ = దిక్కులయందును, కప్పు=నైల్యము, నడుమన్ = మధ్యప్రదేశమందును, సంధిలన్ = వ్యాపింపఁగా, మిన్ను=అంతరిక్షము, ప్రకృ

తిశబరీ = మూలప్రకృతియనుచెంచితయొక్క, గుంజానాసావిభూష = గురిగింజముక్కరయొక్క, కొమరున్ = సౌందర్యమును, భజింపన్ = పొందునట్లుగా, చూడన్ = వీక్షింపఁగా, ఒప్పెన్ = చెన్నొందెను,

తా. సంధ్యాకాలములయందు దానిరక్తిమముదిగంతములవరకు వ్యాపించియుండఁగా నంతరిక్షమునడుమ నల్లనై ప్రకృతియను కిరాతస్త్రీయొక్క ముక్కురయందునలుపుపైపై పుగానుంచి యడ్డముగాఁ గ్రుచ్చిన గురిగింజవలెఁ జూడనొప్పెననుట. రూపకానుప్రాణితోత్ప్రేక్షాలంకారము.

తే, గీ. గూండ్లకై శాలిమంజరు ◆ ల్గొనుచు మూఁగి,
యంబరంబునఁ బఱచుకీ ◆ రాళి పొలిచెఁ,
బసరుటొంటొంటియాకుతోఁ ◆ బండఁ బాఱి,
ఛేదభయమున నెగసిన ◆ చేలనంగ. ౧౬౩,

టీ. గూండ్లకై = కులాయములకై, శాలిమంజరులు = వరివెన్నులు, (వల్లరీమంజరీస్త్రియామని యమరము) కొనుచు = గ్రహించికొనుచు, మూఁగి = గుంపులుగూడి, అంబరంబునన్ = ఆకాశమునందు, పఱచు = ఎగసిపోవుచున్న. కీరాళి = శుకపఙ్క్తి (కీరశుకౌసమౌ అని యమరము) పసరుటొంటొంటియాకులోన్ = పసరువర్ణముగల యొక్కొకపర్ణముతోడను, పండఁబాఱి = పరిపక్వములై, ఛేదభయమునన్ = తమ్ముఁగోసివేయుదురన్నభయముచేతను, ఎగసినచేలనంగన్ = పైకెగరినపైరుచేలోయన్నట్లు, పొలిచెన్ = ఒప్పెను. ఉత్ప్రేక్ష.

సీ. శ్రీలు దా రౌట నా ◆ శ్రితపద్మకర్ణికా । కృతిఁ జెవుల్ కమలక ◆ ర్ణికల మెఱయ,
నతనుసారథ్యకృ ◆ ద్రతిరేఖ మంచపై । నదలించురొదఁ జిల్క ◆ పదువు పర్వఁ,
దొగలమొగ్గల నైవ ◆ దూర మేఁగమిఁ బెట్టు । చప్పట్లఁ జన్నులు ◆ జడలు గదల,
వెడత్రోవ నును చెప్పి ◆ వడి నవ్వ దిరుగు న । ద్వగులకొలఁది యప ◆ త్రపయు మరల,
నధరరదనప్రసాదంబు ◆ నడుగ నోరు । దెఱచెనో యన వ్రీలి ము ◆ త్తైనులు తోఁచు.
చెఱకుజంఘులఁ బోలమి ◆ శిరసు వాంచు । రాజనముఁ గాచుగోపికా ◆ రాజి పొలిచె.

టీ. తారు = శ్రోత్రములు, శ్రీలు = శ్రీకారములు, లక్ష్ములును, ఔటన్ = అయినందువల్లను, ఆశ్రిత = ఆశ్రయించిన, పద్మకర్ణికాకృతిన్ = తామరమిద్దెలవలెను, చెవుల్ = కర్ణములు, కమలకర్ణికలన్ = తామరమిద్దెలతో, మెఱయన్ = వెలుంగఁగా, అతను = పెనిమిటియైన మన్మథునకు, సారథ్యకృత్ = రథమునడుపుచున్న, రతిరేఖన్ = మన్మథుని భార్యయయిన రతివలె (సారథ్యముచేయుచు రతీదేవి చిలుకగుఱ్ఱము నెట్లదలించునో యట్లనుట) మంచపైన్ = మంచమీఁదను, అదలించురొదన్ = నివారించుధ్వనిచేతను, చిల్క

పదువు = కీరపఙ్క్తి, పర్వన్ = పరువిడుచుండఁగా. తొగల = కలువలయొక్క, మొగ్గలన్ = కుట్మలములను, నైవన్ = విసరివేయఁగా, దూరమేగమిన్ = ఆచిలుకలు దవ్వుగా వెళ్ళనందున, పెట్టుచప్పట్లన్ = చేతులతట్టుటలచేతను, చన్నులు=కుచములును, జడలు = కేశపాశములును, కదలన్ = చలింపఁగా, మును = పూర్వము, పెడత్రోవన్=దబ్బఱమార్గమును, చెప్పి=పల్కి, నవ్వన్=హాసముచేయఁగా, వడిన్=శీఘ్రముగా, తిరుగు = మరలవచ్చుచున్నటువంటి, అధ్వగులకొఁది=పథికులతోడనే, అపత్రపయున్=సిగ్గును, మరలన్=మళ్ళఁగా (పథికులకుఁ దప్పుదారిఁజెప్పి నవ్వఁగా నదిగ్రహించి యా పథికులు మళ్లి రాఁగా లజ్జించిరనుట) అధర = పెదవియొక్కయు, రదన = దంతములయొక్కయు, ప్రసాదంబున్ = అనుగ్రహమును, అడుగన్ = యాచించుటకొఱకు, నోరుదెఱచెనో యనన్ = వదనమువిప్పెనో యనఁగా, వ్రీలి=పగిలి, ముత్యములు = మౌక్తికములు, తోఁచు = కనుపడునట్టి, చెఱకున్ = ఇక్షువనమును, జంఘులఁబోలమిన్ = తమపిక్కలను సరిపోలనందున, శిరసువాంచు = తలవంచికొనిన, రాజనమున్ = శాలిసస్యమును, కాచు = రక్షించుచున్న, గోపికారాజ = చేలకావలిస్త్రీలవరుస, పొలిచెన్ = ఒప్పెను. ఉత్ప్రేక్ష.

తా. చెఱకులు దమయందలి రసమాధుర్యముకంటె నాచెఱకు తోటకావలిస్త్రీలయొక్క యధర రసమాధుర్య మధికమనియుఁ దమలోనున్న ముత్యముల చక్కఁదనముకంటె నాస్త్రీలయొక్క పలువరుసల చక్కఁదన మతిశయమనియు నధరరదనములకునోడి పరాజితులయినవారు నోరు వికిరించి వేడుకొన్నట్లుం బలె గణుపులు పగిలి గర్భితములయిన ముత్యములు గన్పట్టుచెఱకును రాజనపుంబయిరుల పొట్టలాం స్త్రీల పిక్కలకు సాటిరానందున సిగ్గుచేఁ దలవాంచికొన్నట్టుంబలెఁ బండి వంగియున్న రాజనపుచేలను గాచుచున్న స్త్రీలు శ్రీమహాలక్ష్మికి నాశ్రయస్థానమైన కమలకర్ణికలు బహిర్నిర్గతము లయినందున శ్రీసదృశములయిన శ్రోత్రములుగనుక కాని నవి యాదరించినట్లుగఁ జెవులయందుఁ గమల కర్ణికలు ధరించికొని మన్మథ రథరథ్యంబులయిన చిలుకల నదలించురతిదేవిమాడ్కజిలుకలం దోలుచుఁ గలువ పువ్వులతోఁ దోలఁగా నవిదూరముపోనందున చప్పట్లు గొట్టుచు నధ్వగులకు పెడత్రోవఁ జెప్పినవ్వఁగా వారు మళ్ళుటతోనే సిగ్గు గలవారయి యొప్పిరనుట.

తే. గీ. నింగి యత్తఱిఁ దన్మహా ♦ నీలమైన, గరిమ కుందగఁగాఁ దృణ ♦ గ్రాహి యయ్యె
ననఁగఁ బరిణతకలమాది ♦ యవసరాశి, తరులు గిరు లన నభ్రంక ♦ షత జెలంగె-

టీ. నింగి = ఆకాశము, అత్తఱిన్ = ఆశరదృతువునందు, తత్ = ప్రసిద్ధమైన, మహానీలమైన = మిగుల నల్లనైనట్టియు నీలమణియైనట్టియు, గరిమకున్ = ఆధిక్యమున

కు, తఁగఁగాన్ = అర్హమగునట్లు, తృణగ్రాహి = కసవును గ్రహించునది, ఆయ్యెననఁగన్ = ఆయెనో యన్నట్లు, పరిణత = పండియున్న, కలమాది = వరిమొదలగువానియొక్క, యవసరాశి = గడ్డివాములయొక్క, తతులు = వరుసలు, గిరులనన్ = కొండలో యనునట్లు, అభ్రంకషతన్ = ఆకాశమునొరసికొనుటచేతను, చెలంగెన్ = ప్రకాశించెను. పరిణామోత్ప్రేక్షాలంకారములు.

తా. స్పష్టము.

మ. అయనిష్ఠన్ ధవళాతపత్త్రి యగున•య్యాగంబు సాగంగ నం,
దు యమిశ్రేణులు రాఁగఁ బుంగవకకుత్•స్థుం డల్ల వర్షాదినా,
త్యయరాముండు సలక్ష్మణుం డినునకో•జోవాప్తిగా విల్లు ని,
ర్దయతం ద్రుంపఁ బ్రభగ్నశాల్యవని సీ•తాలబ్ధి గాకుండునే. ౧౬౬.

టీ. అయనిష్ఠన్ = శుభావహవిధినిష్ఠచేతను, (అయశ్శుభావహోవిధియని యమరము) ధవళాతపత్త్రియగు=తెల్లదామరగొడుగుగల శరదృతువైన, అయ్యాగంబు=ఆరాకయును, ధవళాతపత్త్రియగు=తెల్లని గొడుగుగల జనకునిదైన, అయ్యాగంబు = ఆ యజ్ఞమును, (ఇచ్చట ధవళశబ్దముచేతఁ బుండరీకములు లక్షింపఁబడును, పుండరీకాతపత్త్రిస్తంవికసత్కాశ చామరమని రఘువంశమున శరదృతువర్ణనమున్నది) సాగంగన్ = జరఁగఁగా, అందున్ = ఆ శరత్కాలమందును, ఆ జన్నమునందును, యమిశ్రేణులు =హంసపంక్తులును, యోగిబృందములును (యమిన్ శబ్దమునకు ఋషులర్థము ఆఋషులకు హంసలను పేరుగలదు గనుక లక్షితలక్షణచేత హంసలన్నయర్థము) రాఁగన్ = వచ్చుచుండఁగా, పుంగవకకుత్స్థుండు = ఎడ్లయొక్కమూపురములయందున్నట్టియు, కకుత్స్థులలో శ్రేష్ఠుండైనట్టియు, పుంగవాదు లుత్తరపదములై శ్రేష్ఠార్థమునిచ్చునవియైన నిచ్చట శ్లేషనిమిత్తము పూర్వపదమాయెను (ప్రాధాన్యే రాజలింగేచ వృషాంగే కకుద స్త్రియామని యమరము) అల్ల = ప్రసిద్ధమైన, వర్షాదినాత్యయరాముండు, వర్షాదినాత్యయ=శరదృతువనెడు, రాముండు=శ్రీరాముఁడు, సలక్ష్మణుండు = ఆఁడుబెగ్గురులతోఁ గూడిన వాఁడును= సుమిత్రానందనునితోఁ గూడినవాఁడును (సారసస్యతు లక్ష్మణా యని యమరము) సారసపక్షులు వర్షర్తువునందుఁ బిల్లలు వెట్టి శరత్కాలమునందు వ్యాపించునవి యనుట, ఇనునకున్ = సూర్యునకును, జనకునకును, ఓజోవాప్తిగాన్ = తేజమును, కీర్తియును గలుగునట్లుగా, విల్లు=మణిధనుస్సును, శివధనుస్సును, నిర్దయతంద్రుంపన్ = సంకోచింపకవిఱువఁగా, ప్రభగ్నశాల్యవనిన్=కొయ్యఁబడిన రాజనాలుగల భూమియందు, సీతాలబ్ధిగానుండునే = నాఁగేటిచాలుయొక్క లాభము కలుగకుండునా (పొలమున వరి గొయ్యఁగానే మరల దున్నిరనుట) (సీతాలాంగలపద్ధతి యని యమరము) ప్రభగ్న = విఱు

చుటచేత, శాలి=ఒప్పుచున్న, అవనిన్ = భూమియందు, సీతాలబ్ధి=కాకుండునే=వైదేహి ప్రాప్తి కాకపోవునా (కలుగుననుట) రూపకానుప్రాణిత శ్లేషాలంకారము. నానార్థసంశ్రయశ్లేషో వర్ణ్యావర్ణ్యోభయాస్పద యని శ్లేష లక్షణము.

క. మొగులు విరియెండ వెండియు, నిగుడ శుకశ్రేణి పసరు ♦ నింగి న్నిండం
బెగడెఁ బ్రజ హరితవాజుల, గగనమణిస్యందనంబు ♦ గదిసెనొ యనుచున్. ౧౬౭.

టీ. మొగులు = మేఘములు, విరియెండ = విరిసినయెండ, (శరత్కాలాతప మనుట) వెండియున్ = మిక్కిలియును, నిగుడన్=వ్యాపింపఁగా, శుకశ్రేణి = చిలుకల పదుపుయొక్క, పసరు=పచ్చనిచాయ, నింగిన్=ఆకాశమందు, నిండన్=పూర్ణమగుచుండఁగా, హరితవాజుల = పచ్చడాలుగల గుఱ్ఱములుగల (పాలాశో హరితో హరిత్ । వాజివాహార్వ గంధర్వా యని యమరము) గగనమణిస్యందనంబు = సూర్యరథము, కదిసెనో యనుచున్ = సమీపించివచ్చెనో యని, ప్రజ=జనము, బెగడెన్=జడిసెను. అతిశయోక్త్యలంకారము.

తా. సుగమము.

తే, గీ. భువి సరః కైరవశ్రేణి ♦ పోవఁ దోల, దివిఁ గనద్గ్రహనక్షత్ర ♦ దీప్తి దలుమఁ,
గృష్ణపక్షపువాసి లే♦కిరులు దనదు, నలుపునను గూడె నన నైల్య♦ మొలసె నభము.

టీ. భువిన్ = భూమియందు, సరః = కొలనులయందున్న, కైరవశ్రేణి = తెల్లనికలువంబంతి, (సితేకుముదకైరవేయని యమరము) పోవఁదోలన్ = వెళ్లఁదోలఁగా, దివిన్ = అంతరిక్షమందు, కనత్ = ప్రకాశించుచున్న, గ్రహ = అంగారకాదులయొక్కయు, నక్షత్ర = అశ్విన్యాదులయొక్కయు, దీప్తి = కాంతి, తలుమన్=వెళ్లఁగొట్టఁగా, ఇరులు = అంధకారములు, కృష్ణపక్షపువాసిలేక =బహుళపక్షపురేలబలిమిలేక, తనదునలుపునను = తననైల్యముతోడను, కూడెననన్=కలిసెనోయన్నట్లు, నభము= ఆకాశము, నైల్యమొలసెన్ = అతినైల్యమును బొందెను. ఉత్ప్రేక్షాలంకారము.

తా. సుగమము.

క. క్రేపు దలఁచి పసి మేయుచుఁ, జేపినపా ల్గలయ నెండ ♦ చేఁ బాంథజనుల్,
ద్రూపింపమి కజుఁ డంపిన, యాపాగా యనఁగ నదుల ♦ నంచలు మెఱసెన్. ౧౬౯.

టీ. పసి = పశుసమూహము, మేయుచున్ = పొలముకసవుఁదినుచును, క్రేపుతలఁచి=లేఁగదూడలను దలంచికొని, చేపినపాలు=వెలికుబికి స్రవించినక్షీరములు, కలయన్= నద్యుదకములతోఁజేరఁగా, ఎండచేన్ = ఆతపముచేతను, పాంథజనులు = అధ్వగులు, దూపింపమికిన్ = పానముసేయునందుకు. (ఎండలోఁ దప్పిగొన్నవారు పాలుగ్రావవలెనట ప్రసిద్ధము) అజుఁడంపిన = బ్రహ్మపంపిన, ఆపాగా = నదులలోనిక్షీరసరములు వేఱుపఱుపుమని బ్రహ్మాపతియానిపినట్లు,

ఆ పాగా యనఁగన్ = తనవాహనపక్షికిఁ దొరో యనునట్లు, అంచలు = హంసలు, మెఱసెన్ = వెలిఁగెను. ఉత్ప్రేక్షాలంకారము.

తా. సుగమము.

తే. గీ. వెదమొదవుఁ గూడఁ బోలేమి ♦ వెచ్చ క్రొవ్వు, స్వల్ప మెడసూప వెడలెనో ♦ యనఁగ నెట్ట,
కేలకును గ్రుంగి తెచ్చురం ♦ కెలు నిగుడఁగ, మందగతి గుస్కె వృషభము ♦ ల్మందపిఱుఁద.

టీ. వెదమొదవున్ = ఋతుమైన ధేనువును, కూడన్ = కలియుటకు, పోలేమిన్ = నడువలేనందున, వెచ్చన్ = తాపముచేతను, క్రొవ్వు = కంఠమునందున్నమదము. స్వల్పము = కొంచెము, ఎడసూపఁగాన్ = సందు విప్పఁగా, వెడలెనో యనఁగన్ = బయలుదేరెనో యనఁగా, ఎట్టకేలకున్ = కొంతతడవునకు, గ్రుంగి = భూమికి వంగి, తెచ్చురంకెలు = రప్పించెడు వృషభధ్వనులు, నిగుడఁగన్ = సాగఁగా, వృషభముల్ = ఆఁబోతులు, మందపిఱుఁదన్ = పసులగుంపు వెనుక, మందగతిన్ = మెల్లనినడకతో, గుస్కెన్ = కొంచెముగాఁ బఱుపు పెట్టెను.

తా. సుగమము

తే. గీ. శరధిజలమెల్ల రిత్తగాఁ ♦ గురియ నుప్పు, డొక్కఁ జేరిన నత్తెల్పె ♦ చిక్కి మీఁద,
గాన నగుచున్న దచ్ఛతి ♦ చే ననంగఁ, బఱచు శరదభ్రముల మేను ♦ పాండిమ మమరె. ౧౭౧.

టీ. శరధిజలమెల్లన్ = సముద్రోదకమంతయును, రిత్తగాఁ గురియన్ = శూన్యమగునట్లు వర్షింపఁగా, ఉప్పు = జలమందుండు లవణాంశము, డొక్కఁ జేరినన్ = కడుపులో ఘనీభవింపఁగా, ఆ తెల్పె చిక్కి = ఆ లవణముయొక్క ధావళ్యము మాత్రము మిగిలి, అచ్ఛతచేన్ = నైర్మల్యముచేతను, మీఁదన్ = మేఘముపైని, కానన గుచున్నది = చూడఁబడుచున్నది, అనంగన్ = అనునట్లు, పఱచు = పరువిడుచున్న, శరదభ్రముల = శరత్కాలమేఘములయొక్క, మేని = దేహముయొక్క, పాండిమ = ధావళ్యము, అమరెన్ = ఒప్పెను. ఉత్ప్రేక్షాలంకారము.

తా. సుగమము.

క. శరనిధి మును గ్రోలిన ని, ర్భరజలములు గురిసి మేఘ ♦ భావం బఱి య
క్కరములు కరములె కా జిగి, నొరిమెనన రవియు మెఱసె ♦ నుడిగెను మొయిలుల్.

టీ. శరనిధిన్ = సముద్రమునందు, మును గ్రోలిన = మున్ను పానముసేసిన, నిర్భరజలములు = అధికోదకములు, కురిసి = వర్షించి, మేఘభావంబఱి = జలధరత్వమును బోఁగొట్టికొని, అక్కరములు = ఆ సూర్యకిరణములు, కరములె కాన్ = సూర్యకిరణములుగా నె కాఁగా, రవి = సూర్యుఁడు, జిగిన్ = తేజస్సుచేతను, ఒరిమెననన్ = తీక్ష్ణుఁడాయె నన్నట్లు, మెఱసెన్ = ప్రకాశించెను, మొయిలుల్ = మేఘములును, ఉడిగెన్ = శాంతించెను. హేతూత్ప్రేక్ష.

తా. సుగమము.

క. ప్రాశించిననీరంతయుఁ, బో శరదభ్రములు మగుడఁ ♦ బూరింపఁగ నా,
వేశించెఁ గొలంకుల ననఁ, గాశప్రతిబింబపటలి ♦ కడు నొప్పారెన్. ౧౭౩

టీ, శరదభ్రములు = శరత్కాలమేఘములు, ప్రాశించిననీరంతయున్ = మును పుదాము గ్రోలినయుదకమంతయు, పోన్ = వెళ్లఁగా, మగుడఁబూరింపఁగన్ = మరలనిండించికొనుటకు, కొలంకులన్ = సరస్సులయందు, ఆవేశించెన్ = ప్రవేశించెను, అనన్ = అనునట్లు, కాశప్రతిబింబపటలి = రెల్లుపువ్వుల ప్రతిమానసమూహము, కడున్ = మిగులను, ఒప్పారెన్ = చెన్నొందెను.

తా. సుగమము.

తే, గీ. కొలనఁ గరిదంపతులు పద్మ♦కళిక లొకటి,
కొకటి యీ నెత్త మకరంద♦ములుక నమరె,
నివి శరత్పద్మనిలయకు ♦ నెలమితోడఁ,
గవల నభిషేకమున కెత్తు ♦ కడవ లనఁగ. ౧౭౪

టీ. కొలనన్ = సరస్సులయందు, (జాత్యేకవచనము) కరిదంపతులు = సతీపతులైన గజద్వంద్వము, పద్మకళికలు = అఱవిరితమ్మిమొగ్గలు, ఒకటికొకటి యీనెత్తన్ = పరస్పరమిచ్చుటకై పైకెత్తఁగా, మకరందము = పూఁదేనె, ఒలుకన్ = ప్రసరించుచుండఁగా, ఇవి = ఈ పద్మముకుళములు, శరత్పద్మనిలయకున్ = శరల్లక్ష్మికి, ఎలమితోడన్ = సంతోషముచేతను, కవలన్ = జోడుగా. అభిషేకమున కెత్తు = స్నానమొనరించుటకుద్దిష్టమైనట్టి, కడవలనగన్ = కుంభములోయన్నట్లు, అమరెన్ = ఒప్పెను.

తా. తామరకొలంకులయందుఁ గ్రీడించుచున్న గజమిథునముఁ జూడఁగా "శ్లో. లక్ష్మీర్దివ్యైర్గజేంద్రైర్మణిగణఖచితైః స్నాపితా హేమకుంభైః" అన్న శ్లోనుంగులు శ్రీమహాలక్ష్మికి హస్తంబులయందు సువర్ణకుంభములను ధరియించి యభిషేకమొనరించు చందంబునఁ గానవచ్చుచుండెననుట.

తే, గీ. పంక మడుగంటి తేరిన ♦ బావు లెల్లఁ, బంకములె చేసెఁ గ్రమ్మఱఁ ♦ బంకజములు
కళితమకరందయుతరజః ♦ కర్దమమునఁ, గారణగుణంబు గలుగదే ♦ కార్యమునకు.

టీ. పంకము = అడుసు, అడుగంటి = అధఃప్రదేశముఁబట్టి, తేరినబావులెల్లన్ = స్వచ్ఛోదకములుగల్గినకొలంకులంతయును, పంకజములు, కమలములు, గళిత = జారినటువంటి, మకరందయుత = పూఁదేనియతోఁగూడిన, రజఃకర్దమమునన్ = పరాగపంకముచేతను, క్రమ్మరన్ = మగుడను, పంకములెన్ = కర్దమయుక్తములైనవిగానే, చేసెన్ = ఒనర్చెను, కారణగుణంబు = కారణముయొక్కగుణము, కార్యమునకున్ = కలుగదె. కలుగుననుట.

తా. కమలములు పంకజములుగాన నీళ్ళనుబంకయుక్తములుగాఁ జేసెననుట. సామాన్యముచేత విశేషమును సమర్థించిన యర్థాంతరన్యాసాలంకారము. "శ్లో. జ్ఞేయస్సోऽర్థాంతరన్యాసోవస్తుప్రస్తుత్యకించన । తత్సాధనసమర్థస్య న్యాసోయోऽన్యస్య వస్తునః అని దానిలక్షణము."

క. ఒసఁగి రగస్త్యార్ఘ్యములం, గొసరి జనుల్వార్ధినీరు ♦ గ్రోలితి వీనిం,
బసికై మా కిమ్మని క, న్నొసరుడుగం గావ నప్ప ♦ గించెదుమాడ్కిన్. ౧౭౬

టీ. జనుల్ = మనుష్యులు, కొసరి = వేడికొనుచును, వార్ధి = సముద్రమందలి, నీరు = ఉదకమును, గ్రోలితి = పానముచేసితివి, వీనిన్ = మాకుపయోగమైన యీ యుదకమును, పసికై, పశువులకొఱకై, మాకున్ = మా కొఱకు, ఇమ్మని = విడువుమని, కన్నొసరుడుగన్ = కోపప్రయుక్తమైన నేత్రదోషము నివర్తించుటకై, కావన్ = ఆ యుదకమును ద్రావకరక్షించుటకొఱకు, అప్పగించెదుమాడ్కిన్ = ఇదిగో రక్షింపుమని యొప్పగించినరీతిని, అగస్త్యార్ఘ్యములన్, అగస్త్య = అగస్త్యునికి, అర్ఘ్యములన్ = జలాంజలులను, ఒసంగిరి = ఇచ్చిరి. హేతూత్ప్రేక్ష, శరదృతువునందు నగస్త్యునికిచ్చునట్టి యర్ఘ్యములనిట్లుత్ప్రేక్షించెను.

క. పరుషాతపతప్తం బగు, ధరణీపాత్రమునఁ బడుట ♦ దళ మయ్యెఁ జుమీ,
పరిపక్వంబై యనఁగా, శరదిందుజ్యోత్స్న రేల ♦ సాంద్రతఁ గాసెన్. ౧౭౭.

టీ. పరుష = కఠినమైన, ఆతప = ఎండచేతను, తప్తంబగు = కాఁగినటువంటి, ధరణి = భూమియనియెడు, పాత్రమునన్ = ఆధారమందు, (పెనముమీఁదననుట) పడుటన్ = పతనమగుటచేతను, దళమయ్యెఁజుమీ = దట్టమాయెనుజుమ్మీ, అనఁగాన్ = అనునట్లు, పరిపక్వంబై = పండినదై, శరదిందుజ్యోత్స్న = శరచ్చంద్రచంద్రిక, రేలన్ = రాత్రులయందు, సాంద్రతన్ = దట్టముగా, కాసెన్ = వెలిఁగెను.

తా. సుగమము.

తే.గీ. వృష్టితతి నిడ్డజెనఁ ద్రావఁ ♦ గ్రింద నుండి, తేటనదినీటఁ దనవెంటఁ ♦ దేలుమీల,
తళుకుతో నాఁచులతఁ బోఁచె ♦ వెలికి జమిలి, వెండిమీ లెక్కు వెంద్రుక ♦ విల్లువోలె॥

టీ॥ వృష్టితతిన్ = వర్షాకాలమునందు. ఇడ్డ = పెట్టిన. జెనన్ = చేఁపలయొక్క జెనను. త్రావన్ = పానము సేయుటకొఱకు, క్రిందనుండి = అడుగునఁబట్టి, తేట = నిర్మలమైన, నదినీటన్ = ఏటియుదకమందు, తనవెంటన్ = ఆనాఁచుతీఁగవెంబడి, తేలు = పైకి వచ్చుచున్న, మీల = మత్స్యముల యొక్క, తళుకుతోన్ = కాంతితోడను, వెలికిన్ = బైటికి, జమిలి = జోడుజోడయిన, వెండిమీలు = రజతముచేతఁ జేయఁబడినమత్స్యములు, ఎక్కు = పై కెగయఁగా నొప్పుచున్న, వెంద్రుకవిల్లువోలెన్ = గుఱ్ఱపుతోఁక వెంద్రుకలచేఁ

గట్టినధనుస్సోయన్నట్లు (ఇదిదాసరివాండ్రు వాయించువాద్యమనియు దీనిపేరు కామాచియనియుఁ జెప్పుదురు) నాచులతదోఁచెన్ = ప్రాఁచితీఁగకన్పించెను.

తా॥ వానకాలమందుఁజేపలునాఁచుతీఁగవెంట గుడ్లు విడిచియుండ వానిందినుట కునీళ్లనుండి యానాఁచుతీఁగ వెంబడిని మత్స్యములు పైకిరాఁగా దాసరివాండ్రు గుఱ్ఱపువెండ్రుకలచేత పింటిబద్దకట్టి వానిమీఁద వెండితగుల్లచే మత్స్యములనేర్పఱచి వాయించునప్పుడవి పైకెగయుటగలదుగాన నాలాగుసఁ గన్పట్టెననుట.

కం. హంసము క్రౌంచము తొలి రా, మాంసలరుచి వచ్చెఁ దాను ♦ మలయముశిఖఁబాల్మాంస విఱువ నీ ర్వెటిచెను, హంసమున కగస్తి పరమ♦హంసం బగుటన్ ॥ ౧౭౯॥

టీ. హంసము=అంచపిట్ట, క్రౌంచము తొలిరాన్=క్రౌంచపర్వతబిలమునసుండి రాఁగా, తాను=ఆయగస్త్యుఁడును, మలయముశిఖన్ = మలయపర్వతాగ్రముననుండి, మాంసలరుచిన్ = అధికకాంతిచేతను, (బలవాన్మాంసలోంసలయనియమరము) వచ్చెన్ = ఉదయించెను, హంసమునకు చక్రాంగమునకు, అగస్తి = అగస్త్యమహర్షి (అగస్త్యోగస్తిరిత్యపి యని ద్విరూపకోశము) పరమహంసంబగుటన్ = పరమహంసయను ఋషియౌటచేతను, హంస = అంచ, పాల్ =క్షీరమును, విఱువన్=నీరముతోవేర్పఱపఁగా, నీర్విటిచెను = తానునీళ్ళలోనిబురదను బోఁగొట్టెను.

తా. హంసలు పాలునీళ్ళు నేర్పఱప నగస్త్యుండు నీరుబురదనేర్పఱచినందున పరమహంస యనునట్లు శరదృతువునందు నుదకంబులంతయు నిర్మలంబు లాయెననుట.

తే.గీ. క్రౌంచమొకకొన్ని గుడ్డులు♦గాంచెమింట,నవియహంసచ్ఛదాచ్ఛాద♦నానుభూతి హంసతతులయ్యెఁగావన్న♦ నరుణచూడ, గుప్తభుజగాశనాండము♦ల్గురులుగావె.

టీ. క్రౌంచము=కొంచగుబ్బలియందున్నరంధ్రము, ఒకకొన్నిగుడ్డులు=కొన్నిఅండములను, మింటన్ = తనపైభాగమందు, గాంచెన్=వహించెను, (పరశురామునిబాణముచేతఁ దొలవఁబడిన క్రౌంచాచలపు రంధ్రముననుండి హంసలు మానససరోవరంబునకుఁ జనుటయు మరలి వచ్చుచుండుటయునుం గలదని సంప్రదాయము) అవి = ఆక్రౌంచాచలమున గుడ్డులు, అహంస = దానియందురాకపోకల్గుగల హంసేతరములైన పక్షులయొక్క, ఛద=ఱెక్కలయొక్క, ఆచ్ఛాదన=కప్పుటయొక్క, అనుభూతిన్ = అనుభవముచేతను, హంసతతులయ్యెన్ = అంచలగుంపులాయెను, కావన్నన్ = హంసగుడ్లనితరపక్షులుపొదిగిన హంసపిల్లలుగానేరవన్నట్లాయెనా, అరుణచూడ = కోళ్ళచేతను, (కృకవాకుస్తామ్రచూడః కుక్కుటశ్చరణాయుధ యని యమరము) గుప్త=పొదుగఁబడిన, భుజగాశన=నెమళ్ళయొక్క, అండముల్ = గుడ్డులు, గుఱులుగావె = చిహ్నములుకావా (అవుననుట) ఇందు సామాన్యముచే విశేషమును సమర్థించిన యర్థాంత

రన్యాసాలంకారముచేత సుత్థాపితంబైన యసంబంధమున సంబంధముఁ గలుగఁజేసిన య
తిశయోక్త్యలంకారము.

చ. కలయఁగ వారిదేవతలు ♦ గాంచుసరోవరదంభదర్పణం
బులపయి దట్టపుంజిలుము ♦ వోవఁగఁ దారల కంచు గీయఁగా
బలె నలువంకలం గలయఁ ♦ బాయక తేలుచుఁ బద్మరేణువు
ల్కెలఁకులఁ బాసిపోఁజెలఁగెఁ ♦ గ్రేంకృతు లిచ్చుమరాళమాలికల్. ౧౮౧.

టీ. వారిదేవతలు=జలాధిదేవతలు, కలయఁగన్=అంతటను, కాంచు=చూచుచున్నటువంటి, సరోవర=కొలంకులనియెడు, దంభ=వ్యాజముగల, దర్పణంబులపయిన్=అద్దములమీఁదను, దట్టపుంజిలుము=సాంద్రమైన మాలిన్యము, పోవఁగన్=పోవునట్లు, తారు=ఆజలాధిదేవతలు, అలకంచున్=ఆయద్దమైనకంచును, గీయఁగాబలె=తోమిగీతఁబెట్టినందువల్లనోయన్నట్లు, నలువంకలన్=నాలుఁగుదిక్కులయందును, కలయన్=వ్యాపించునట్లు, పాయక=విచ్ఛిన్నముగాక, తేలుచున్=పోవకమీఁదనేయుండుచు, పద్మరేణువుల్=నళినపరాగములు=కెలఁకులఁబాసిపోన్=ప్రక్కలనువిడిపోవునట్లు, క్రేంకృతులిచ్చు=క్రేంకారములుచేసెడు, మరాళమాలికల్=అంచలబంతులు, చెలఁగెన్=ఒప్పెను. అపహ్నుత్యుత్థాపితోత్ప్రేక్షాలంకారము.

సీ॥ అర్కమండలికభ్ర ♦ మడ్డమై నంతనె। యెఱ మాని మోము బి ♦ ట్టెత్తి చూచి,
ఘుమఘుమధ్వని గాలి ♦ గుహఁ జొరఁ బురి యొకిం। చుక విచ్చి కని తలం ♦ చుకొని వంచి,
నిష్పుష్ప కేతకీ ♦ నేత్రాంబు వొత్తి భే। కపుటెంకి పడియచోఁ ♦ గర్ణ మొగ్గి,
కేకకుఁ ద్వ్రి వనత ♦ గ్రీవమై రాక యొ। క్కింత తార్చి వాత నే ♦ మేమె కమిచి,
వెడలుపేరెండకును శర ♦ ద్వృక్షు ముడిగి। వార్షికమె యెక్కి త్రోటిని ♦ ర్వంకపక్ష
తులనునివురుచు వెఱ్ఱిచూ ♦ పునసురంబు, కెలఁకులఁ గనుంగొనుచుఁ గానఁ ♦ గేకులుండె.

టీ॥ అర్కమండలికిన్=సూర్యమండలమునకు, అభ్రము=మేఘము, అడ్డమైనంతనె=కొంచెమాచ్ఛాదకముకాఁగానె, ఎఱమాని=మేతవిడిచి, మోము=ముఖమును, బిట్టెత్తి=పొడవుగానెత్తి, చూచి=వీక్షించి, (వానకాలమను భ్రాంతిచేఁజూచియనుట) ఘుమఘుమధ్వని=ఘుమఘుమశబ్దముచేత, గాలి=వాయువు, గుహఁజొరన్=గుహలోఁబ్రవేశింపఁగా, పురియొకించుకవిచ్చి=పింఛమునుగొంచెమువిచ్చి, (గాలిచేతఁగల్గినధ్వనిని మేఘధ్వనియని భ్రమించియనుట) కని=చూచి, తలంచుకొని=అదియురుముగాదని వితర్కించి, వంచి=పింఛమును మరలనడంచి, నిష్పుష్ప కేతకీ నేత్రాంబువొత్తి=పువ్వులు లేని మొగలిచెట్లయొక్క కన్నీరుదుడిచి, భేకపుటెంకి=కప్పలకునికిపట్టైన, పడియచోన్=పల్వలములలోని నెఱియకై, కర్ణమొగ్గి=చెవివంచి,(కప్పకూఁతలుగలిగినవర్షముగలదన్న ప్రతీ

తినిబట్టి యనుట) కేకకున్ = తనవాక్కునకు, త్ర్యవనత = మూఁడుమాఱులువంచఁబడిన గ్రీవమై = మెడగలదై, రాక = ఆకేకాధ్వనియును వెడలక, ఒక్కింతార్చి = కొంచెముధ్వని సేసి, వాతన్ = నోటిచేతను, ఏమేమొకమిచి = ఏమేమోచప్పరించుకొనుచు, వెడలు = , కలిగిన, పేరెండకున్ = తీక్ష్ణాతపనివృత్తికొఱకు, శరద్వృక్షమున్ = ఏడాకు లరఁటిచెట్లను, డిగి = విడిచిపెట్టి, వార్షికమెయెక్కి = గుమ్మడునారోహించి, (శారదోవిషమచ్ఛదః । వార్షికంత్రాయమాణాస్యాత్తని రెంటికి నమరము) (వర్షాకాలమున నెక్కియున్న వృక్షమున నెక్కినవర్షము కలుగునని శరద్వృక్షమును విడిచి వార్షికవృక్షమున నెక్కెననుట) త్రోటిన్ = ముక్కుచేతను (చంచుస్త్రోటిరుభేస్త్రియామని యమరము) ఇర్వంకపక్షతులను = ఉభయపార్శ్వ పక్షమూలములను, (స్త్రీపక్షతిఃపక్షమూలమనియమరము) నివురుచున్ = వెండ్రుకలు దువ్వికొనుచు, వెఱ్ఱిచూపునన్ = వికృతపుదృష్టిచేత, ఉరంబున్ = ఱొమ్మును, కెలఁకులన్ = ఇరుప్రక్కలను, కనుంగొనుచున్ = చూచికొనుచును, కానన్ = అరణ్యమునందు, కేకులు = నెమళ్ళు, ఉండెన్ = నివసించెను.

తా. సుగమము.

క. వెలుతు రస లంటి యెండియు, లలి విప్పమిఁ జెడక శిఖిక ♦ లాపము వని వ
ర్తిలెఁ బర్జన్యుఁడు నటన, మ్ముల మెచ్చి మెఱుంగుఁ గాపె ♦ ముద్రించె ననన్.

టీ. శిఖికలాపము, శిఖి = నెమళ్ళయొక్క, కలాపము = పురి, అసలంటి = బురదదగిలి, వెలుతురు = మబ్బువిడిచినయెండచేతను, ఎండియున్ = ఆఱియును, లలివిప్పమిన్ = ఎప్పటికినివిడఁజేయకపోవుటవల్ల, (సామాన్యముగాఁ దడిసినపురులువిప్పరావు - బురదయంటియెండియున్నట్లున్న వనుట) చెడక = చెడిపోక; వనిన్ = అడవియందు, పర్జన్యుఁడు = వర్ష దేవత, నటనమ్ములన్ = నాట్యములను, మెచ్చి = శ్లాఘించి, మెఱుంగుఁగాపెన్ = ప్రకాశించుచున్న చిత్రవస్త్రమును, ముద్రించెననన్ = ముద్రవేసెనోయన్నట్లు, వర్తిలెన్ = ఉండెను. (వానకాలపుబురదలు తమకలాపములకునంటి యెండచేత నిగిరినందున శరత్కాలమునందు నెమళ్ళు పింఛములువిప్పియాడకయుండఁగా వర్ష దేవత నెమళ్ళయొక్క నృత్యములకుమెచ్చి తననటులు మఱియొకచో నాడకుండునట్లు ముద్రవేసెనో యన్నట్లుండెననుట).

సీ॥ చక్రస్తనప్రకా♦శమునకు ఫేనంపుఁ । గొంగిడి గొనగొన♦ గోళ్ల గొఱిగి,
యుక్తనితంబంబు♦హంసహారమును బ । రాగ రేఖాస్వర్ణ ♦ రశనముగను,
జలశాటి పులినంపు ♦ జఘనంబు పైఁ జాఱ । వ్యస్తవేతసభుజ♦స్వస్తిక మిడి,
తనిమతో వెచ్చనై ♦ తటశరప్రతిబింబ । హంసాలి బాష్ప లు ♦ చ్ఛ్వాసములకు,
నగుచుఁ జెంబావకంటను♦నలిగి తమ్మ । లంటుకై యొత్తు పదనతి♦నలరి కువల,
మధులహరి నబ్ధిపైఁ జెంది♦మగతనముల। నొక్కెడలఁగూడుచు స్రవన్తు♦లుబ్బి పెనఁచె.

టీ॥ స్రవంతులు = నదులు, (స్రవంతీనిమ్నగాపగాయనియమరము) ఉచ్ఛ్వాసములకున్=పరీవాహములను నిట్టూర్పులకు, (జలోచ్ఛ్వాసాఃపరీవాహాఇయనియమరము) అగుచున్=అయినవై, చెందొవ=ఎఱ్ఱగలువయనియెడు,కంటన్=నేత్రము చేత, అలిగి=కోపగించి, శరత్కాలమందుఁ బ్రవాహములుతక్కువై నందునఁ బెనిమిటియైన సముద్రునితోఁ దమకు సంపర్కము లేమింజేసి ప్రణయకోపముఁజేసి యనుట) తమ్ములంటు=పద్మములనంటుచున్న, కై యొత్తు=సముద్రపుకాలువల పొంగుటయనెడు, కై=హస్తముచేతను, ఒత్తు=పట్టుటగల, పద=పాదములయందు, నతిన్=నమస్కారము చేతను, అలరి=సంతసించి, చక్రస్తన=కోకములనియెడు కుచములయొక్క, ప్రకాశమునకు=కనుపించుటకొఱకై, ఫేనంపు=నురుఁగనియెడు, కొంగు=పైటచెఱఁగు, ఇడి=విడిచి, (భర్తకు గుచంబులు గన్పించుటకై పైటచెఱఁగుఁదొలంగించెననుట)గొనకొన=అవ్యక్తముగా,కోళ్ళన్=జలకుక్కుటములను వ్యాజముచేత (బొల్లికోళ్ళనుట) గొణిగి = జల్పితముఁ జేసి (అనఁగా మణితములనుట) అశ్మనితంబంబున్=పాషాణములనుకటిపశ్చాద్భాగమును, (పశ్చాన్నితంబః స్త్రీకట్యాయని యమరము) హంసహారమును = మరాళములనుముత్యాలసరమును, పరాగరేఖా=పద్మరేణువులబంతియే, స్వర్ణరశనముగను = బంగారు మొలనూలుగాను, జల = ఉదకములనియెడు,శాటి = వస్త్రము,పులినంపు = ఇసుకదిన్నెయనియెడు,జఘనంబుపైన్=కటిపూర్వభాగముమీఁదనుండి, జాఱన్=గళితముకాఁగా,(క్లీబేతుజఘనంపుర యనియమరము) వ్యస్త=వేసైనట్టి,వేతన=ప్రబ్బలిచెట్లనియెడు,భుజ=బాహువులయొక్క,స్వస్తికమిడి=స్వస్తికబంధమునుంచి,(భుజస్వస్తికమనఁగాభర్తనాలింగనమొనర్చుటకైచేయునట్టి భుజబంధవిశేషము)తనిమతోన్=సూక్ష్మరూపముతోడను,వెచ్చనై=వేఁడియై,తట=తీరమందున్న,శర=రెల్లుపువ్వులయొక్క,ప్రతిబింబ=ప్రతిఫలనములనియెడు, హాస=నవ్వును, అళి=తుమ్మెదలనియెడు, బాష్పలు=నకజ్జలానందబాష్పములుగలవియై, కువలమధులహరిన్,కువల=కలువలయొక్క.(కువాలంకువలంకువమనినానార్థరూపకోశము)మధు=మకరందముయొక్క,లహరిన్=ప్రవాహముచేతను,అబ్ధిపైన్=సంద్రముమీఁదను,చెంది=పొంది, (మకరందముదకములపైని దేలునుగనుకఁ బైఁజెందియనుటయుక్తము) మగతనములన్ = పురుషాయితరతులచేతను, ఒక్కెడలన్=ఒకొక్కకప్పుడు, కూడుచున్=కలయుచును, ఉబ్బుపెనఁచెన్ = సముద్రునినుప్పొంగించెను.

తా. సముద్రముయొక్క సమీపమునకుఁ గలువమకరంద ప్రవాహముతోవచ్చి శరత్కాలమందుఁ బ్రవాహములులేమింజేసి కూటమిలేకుండుటవలనఁ బ్రణయకోపప్రయుక్తంబైన నేత్రరక్తిమములు గల్గిన కెంగలువలచే నొప్పుచు నుప్పుకాలువల పోటనియెడు హస్తములతో నొత్తుటచేత నమ్రత్వమునకు సంతసించి యొకానొకప్పుడు గూడుచుఁ బు

రుషాయితరతులచేత నదులు సముద్రుని సంతోషమును బొందించెననుట.) ఈ పద్యము నకుఁ బెక్కండ్రు పెక్కువిధములుగ నర్థవర్ణనంబులు చేయుదురు, అవియన్నియు మిగుల రసయుక్తంబులుగా నుండనందున గ్రంథవిస్తరభీతిచేత నిందుపేక్షింపంబడియె. పురుషాయితలక్షణము, నటదుత్తుంగపయోధరంబు గతిమందాక్షక్రియోదాగను । స్ఫుటవాగంకురదక్షికోణనివసత్పుష్పేషుదర్పంబునం । ఘుటితాలింగనవామనీకృతకుచాగ్రప్రౌఢ రోమాంచమై, విటుఁజూక్కించెఁ బ్రఫుల్లవద్మనయనా నీరాయితంబెంతయుఁన్. అని నరసభూపాలీయమున నున్నది. రూపకాలంకారము.

వ. ఇట్లు శరత్సమయం బెసంగిన నంగీకృతక్షత్రధర్ముండు గావున దిగ్విజయయాత్ర ధర్మం బని యానీతబలషట్కంబు నాకృష్టసామన్తరాట్కంబుగా వెడలి. ౧౮౫.

టీ. ఇట్లు = ఈ యుక్తక్రమంబున, శరత్సమయంబు = శరదృతువు, ఎసంగినన్ = ఒప్పఁగా, (యామునాచార్యుండు) అంగీకృత = అంగీకరింపబడిన, క్షత్రధర్ముండుగావునన్ = క్షాత్రములుగలవాఁడౌటచేతను, దిగ్విజయయాత్ర. దిక్ = తూర్పు మొదలగు దిశలయొక్క, విజయ = గెలుపునిమిత్తమై, యాత్ర = తల్లిపోవుట, ధర్మంబని = న్యాయమని, ఆనీత = పిలువంబడిన, బలషట్కంబు = షడ్విధంబైన సైన్యము గలుగునట్లును (మౌల్యభృత్యాదిరూపముగ బలము షడ్విధము) "శ్లో. షడ్విధంబలమాదాయప్రతస్థేదిగ్జిగీషయా" యని కాళిదాసుని ప్రయోగము. ఆకృష్ట=ఆకర్షింపఁబడిన, సమస్త=ఎల్లవారైన, సామంతరాట్కంబుగాన్ = తనదేశమునకుఁ జుట్టుప్రక్కలనుండు రాజులుగల్గునట్లు, వెడలి = యుద్ధయాత్రకు బయలువెడలి.

తా. సుగమము.

మహాస్రగ్ధర. గజఘోటస్యందనాళీ ♦ కబళితధరణిం ♦ గాద్రవేయాధిరాణ్మూ,
ర్ధజరత్నశ్రేణు లంత ♦ ర్మణులసవతులై ♦ మ్రగ్గఁ బాదాతమంత,
ధ్వజవాతాఘాతఘూర్ణ ♦ ద్ఘనఘులరవళు ♦ ల్వాద్యము ల్మ్రోఁగఁగాఁ ద,
ద్ద్విజరాజన్యుండు విద్వ ♦ ద్విదళన మనిఁ గా♦వించె దిగ్జైత్రయాత్రన్. ౧౮౬.

టీ. గజ = ఏనుంగులయొక్కయు, ఘోట = గుఱ్ఱములయొక్కయు, స్యందన = అరదములయొక్కయు, ఆళీ = సమూహముచేతను, కబళిత – మ్రింగఁబడిన, ధరణిన్ = భూమియందు, కాద్రవేయ = పాములకు, అధిరాట్ = దొరయయినశేషునియొక్క, మూర్ధజ = తలయందుఁబుట్టిన, రత్నశ్రేణులు = రత్నాలపఙ్క్తులు, అంతర్మణులసవతులై = భూమిరత్నగర్భ గనుకఁ దామూభూమిలోనున్న రత్నములతో సమానములైయనుట) మ్రగ్గన్ = అవిసిపోఁగా, పాదాత = పదాతిసేనాసంబంధియైన,

కుంత = ఈటె మొనలయందున్నటువంటి, ధ్వజ = టెక్కెపుబట్టలయొక్క, వాత = గాలి యొక్క, అనిపాత = తాఁకుడు చేతను, ఘూర్ణత్ = పొంగుచున్నటువంటి, వనధుల=సము ద్రములయొక్క, రవళుల్ = ధ్వనులు. వాద్యముల్ = మద్దెల, డోలు, వీణె, సన్నాయి మొదలగువానిని, మీఱఁగాన్ = అతిశయింపఁగా, తద్ద్విజరాజన్యుండు=విప్రుఁడైనయా రాజు, మీఁద (యామునాచార్యుఁడనుట) దిగ్జైత్రయాత్రన్ = దిగ్విజయయాత్రయందు, అనిన్ = యుద్ధరంబు మందు, విద్విడ్విదళనమున్ =పగతురయొక్క సంహారమును, కావించెన్ =ఒనర్చెను.

క. ... విడి జన్నములు చేసి దానము, ల న్నానాదేశవిప్రుల ... లం దనిపి సుసం,

పన్నత ననిశము బహుభోగోన్నతుఁడై యాదమఱచి యుండె నశంకన్. ౧౨౭.

టీ. జన్నములు = యజ్ఞములు, చేసి = కావించి, దానములన్ = ఉదకధారా పూర్వకంబుగ నిచ్చినయీవుల చేతను, నానాదేశవిప్రులన్ = బహుదేశములనుండివచ్చిన బ్రాహ్మణులను, తనిపి = తృప్తినొందించి, సుసంపన్నతన్ = సకలసమృద్ధిగలవాఁడౌటచే తను, అనిశము = ఎల్లప్పుడును, బహుభోగోన్నతుఁడై = ఎక్కుడైనసుఖములచే నతిశ యించినవాఁడై, అశంకన్ = వెఱపులేనట్లు, ఆదమఱచి = వరాకునొంది, ఉండెన్ = వసించెను. రాజ్యమోహముచేత జ్ఞానభక్తివైరాగ్యములు మఱచియుండెననుట.

వ. మఱియు నతనిరాజ్యంబునఁ గసవుఁ గఱచి చేయెత్తి మొఱఁబెట్టుట కరులయంద యట్టునట్లు పడ ... బట్టి త్రోయుట వెడవెడంబోవుపల్లవులం బందువ త ... చేపలయంద ... లంటులను నింటికిం దెచ్చుపణ్యాంగనాభ్రాతల ... న్న మొత్తు టయుం బట్టు కారులం బట్టుటయు సౌధసౌవర్ణభూషాదినిర్మాణంబులయంద కాసె చుట్టుటయుఁ గత్తి గట్టుటయుఁ గృకవాకులకలహంబులయంద యతుల్యతులనాది ఘర్షణాదిదోషంబులు జాంబూనద పరీక్షాదులయంద ... దేనియుం గన్ను వేయుట మృదంగాదివాదిత్రంబులయంద ధాతువాదంబులు తెఱచగుట శాబ్దికులయంద కాక యితరస్థలంబుల లేకుండ రాజ్యపరిపాలనంబు సేయుచుండె. ౧౨౮.

టీ. మఱియున్ = వెండియు, అతనిరాజ్యంబునన్ = అయ్యామునాచార్యునిదే శమందు, కసవుఁగఱచి = తృణముగఱచి, చేయెత్తిమొఱబెట్టుట = హస్తమునుపైకెత్తియె లుఁగిడుట, కరులయంద = ఏనుఁగులయందె, (చెయ్యనఁగాఁగరము, అది గలది కరియని వ్యవహారము) అట్టునట్లుపడన్ = అయాలాగునఁ బతనమగునట్లు,మెడఁబట్టిత్రోయుట= గళముఁబట్టి యావలికిం ద్రొబ్బుట. వెడవెడంబోవు = మెల్లమెల్లనెనడచుచున్నట్టి, పల్లవు లన్ = విటులను, (షిద్గఃపల్లవికోవిటయని యమరము) పండువతలంటులకున్ = సంవత్స రాదిపండువ మొదలగు సంతోష దినములయం దభ్యంజనము సేయుటకొఱకు, ఇంటికిం దెచ్చు = గృహమునకు రావించుచున్న, పణ్యాంగనాభ్రాతల = వేశ్యాసహోదరులమొ

ర్యుఁడు శ్రీపుండరీకాక్షుఁడు ఆయనకు నాచార్యుఁడు శ్రీమన్నాథముని గనుక నాయన యాచార్యునకు నాచార్యుండు పరమాచార్యుండు గానఁ బరమగురు పౌత్రుఁడన్న ప్రయోగమ్ము) ఇట్టి బంధమెట్లు = ఇటువంటి రాజ్యప్రాప్తిరూపమైన ప్రతిబంధక మేలాగు సంభవించెను.

వ. యోగసామ్రాజ్యంబు మఱచి సామ్రాజ్యంబునం దాసక్తుఁ డయ్యె నట్టిమహాత్ముని వంశంబునం బుట్టినట్టి యితం డిట్లగుట యతివ్యతిక్రమంబు.

టీ. యోగసామ్రాజ్యంబుమఱచి = ఐశ్వర్యరూపమైనశక్తియోగ ప్రపత్తియోగము లనువిడిచి, సామ్రాజ్యంబు నందాసక్తుండయ్యెన్ = సమ్రాట్టుయొక్క భావము సామ్రాజ్యము (శాస్తియశ్చాజ్ఞయాచాజ్ఞ స్ససమ్రాట్టనియమరము) అట్టిమహాత్మునివంశంబునంబుట్టినట్టి = అటువంటి మహాపురుషుని కులమునందు జన్మించిన, ఇతండు = ఈ యామునాచార్యుండు, ఇట్లగుట = రాజ్యాసక్తుండౌట, అతివ్యతిక్రమంబు = మిగుల నక్రమము.

సీ. వృషశైలఝరవారిఁ ♦ ద్రిషవణస్నానంబు । నిష్ఠఁ గావించి యా ♦ హ్నికముఁ దీర్చి,
యేకాంతగుహ తత్త ♦ టీకుశాసనమున । నుండి లక్ష్మీశాంఘ్రి ♦ పుండరీక,
మంకురత్పులక హ ♦ ర్షాశ్రుఁడై దహరపు । ష్కరమున భావించి ♦ సవిత దిరుగ,
యజ్ఞోపవీత ప ♦ ద్మాక్షమాలికతోడి । యోగపట్టికఁ గూడి ♦ యురము మెఱయ,
శౌరిఁ దద్ధరణీధ్రవా ♦ స్తవ్యుఁ గొలిచి, నతియు నాలర్కశాక మం ♦ చితము వండ,
వి ల్లుముందున కర్పించి ♦ వేల్మిఁ దీర్చి, యిట్లు తనయాత్ర నడపు ము ♦ న్నితనితాత.

టీ. వృషశైలఝరవారిన్ = వృషశైల, ఘటికాచలముయొక్క (దీనికి ద్రవిడ భాషయందు అళగర్ తిరుమలయని నామము. నారాయణాద్రి వృషభాద్రి వృషాద్రి యని పర్యాయములుగాను వ్యవహారము గలదు) ఝరవారిన్ = సెలయేటియుదకమందు, త్రిషవణస్నానంబు = మూఁడువేళలయందును జలకములాడుటను, నిష్ఠన్ = నియమముచేత, కావించి = చేసి, ఆహ్నికమున్ = సంధ్యావందనాది కృత్యమును, తీర్చి = ఒనర్చి, ఏకాంత = రహస్యమైన, గుహ = గుహలుగల, తత్ = ఆ వృషశైలముయొక్క, తటీ = చఱియందు, కుశాసనమునన్ = దర్భాసనమునందు, ఉండి = కూర్చుండి, లక్ష్మీశ = శ్రీపతియొక్క, అంఘ్రిపుండరీకము = పాదపద్మమును, అంకురత్ = మొలచుచున్న, పులక = గోమాంచమును, హర్షాశ్రుఁడై = ఆనంద బాష్పములు గలవాఁడై, దహరపుష్కరమునన్ = హృత్పుండరీకమందు (పుష్కరం కరిహస్తాగ్రే వాద్యభాండముఖే జలే. వ్యోమ్నిఖడ్గఫలే పద్మే తీర్థౌషధి విశేషయోః అని యమరము) భావించి = ధ్యానించి, సవితదిరుగన్ = ప్రొద్దుపడమటికి మళ్లఁగా, యజ్ఞోపవీత = జందెముతోడను, పద్మాక్షమాలికతోడి = తామరపూసలతోడను గూడిన, (ఇది తులసిపూసలదండల కుపలక్షణము) " శ్లో. యేకంఠలగ్నతులసీనళినాక్షమాలా యేబాహుమూలపరిచిహ్నితశంఖచక్రాః। యేవాలలాటఫలకే లసదూర్ధ్వ

పుండ్రాస్త్రేవైష్ణవాభువనమాశు పవిత్రయంతియని యున్నది'' యోఁగపట్టికన్ = యోఁగులు జందెముగా వేసికొనునట్టి యల్లికపట్టుపట్టెడను, కూడి = కలిసి, ఉరము = ఱొమ్ము, మెఱయన్ = వెలుంగఁగా, తద్ధరణీధ్ర = ఆ వృషశైలమందు, వాస్తవ్యున్ = ఉన్నటువంటి, శౌరిన్ = సుందరబాహువును, కొలిచి = సేవించి, పతియున్ = నాథమునిభార్యయును, అంచితము = ఒప్పైన, అలర్కశాకము = ముండ్లముస్తెకూరను, వండన్ = పచనముఁ జేయఁగా, ఇల్లుకుందునకున్ = తనయింట నారాధింపఁబడు కమలనాభునకు, అర్పించి = సమర్పణముచేసి, వేళ్విన్ = ఔపాసనాదిహోమములను, తీర్చి = ఒనర్చి, మున్ను = పూర్వమందు, ఇతనితాత = ఈ యామునాచార్యునికిఁ బితామహుండైన శ్రీమన్నాథముని, ఇట్లు = ఉక్తక్రమంబుగా, తనుయాత్రన్ = శరీరయాత్రను, నడపున్ = కడపును.

తా. సుగమము.

క. తొడిఁబడ విషయాతురు నవి, విడుపు మనుటకంటెఁ గలదె ♦ వేఱే పగ నే,
ర్పడరఁ గథాదుల నొకటం, బడి పోఁపం బలికి మైత్రి ♦ పాపుట యొప్పన్. ౧౯౩.

టీ. తొడిఁబడన్ = త్వరపడి, విషయాతురున్ = స్రక్చందనాదివిషయములయందాసక్తుఁడైన వానిని, అవి = ఆ విషయములను, విడుపుమనుటకంటెన్ = విడిచిపెట్టుమనుటకంటెను, వేఱేపగ = అన్యమైనవిరోధము, కలదె = ఉన్నదా (లేదనుట) నేర్పు = చతురత్వము, అడరన్ = ఒప్పఁగా, కథాదులన్ = భాగవతాదికథలయందు, ఒకటన్ = దేనిచేతనైన నొకదానిచేత, బడిపోఁపన్ = పూర్వులక్రమముపోఁచునట్లు, పలికి = తెలిపి, మైత్రి = విషయములయందున్న స్నేహము, పాపుట = వదల్చుట, ఒప్పున్ = తగును.

తా. సుగమము.

క. వసుధం బుత్త్రాదికదు, ర్వ్యసనము సైతమును దండ్రి ♦ వారించుటకున్,
వసపడ దఁట మఱి రాజ్య, వ్యసనము వారింప నెంత ♦ వాఁ డెవ్వాఁడున్.

టీ. వసుధన్ = భూమియందు, పుత్త్రాదిక = సుతులు మొదలగువారియొక్క, దుర్వ్యసనము సైతమును = స్త్రీద్యూతాదిచింతనమును, తండ్రి = జనకుఁడు, వారించుటకున్ = నివర్తింపఁజేయుటకు, వసపడదఁట = శక్యముగాదఁట, మఱి = ఇఁకను, రాజ్యవ్యసనమున్ = దొరతనపుచింతను, వారింపన్ = నివర్తింపఁజేయుటకు, ఎవ్వాఁడున్ = ఎవ్వఁడును, ఎంతవాఁడు = ఎంతటివాఁడు (ఎట్టివాఁడైనను సమర్థుఁడు కాఁడనుట)

తా. సుగమము.

ఆ, వె. నల్ల గ్రోల నిచ్చి ♦ మెల్లనె చివ్వంగి, నోరి జింకఁ దివియు ♦ సేరు పొదవు,
వేఁటకాఁడువోలె ♦ విషయాళిఁబలనఁ ద, త్తృష్ణఁ దీర నిచ్చి♦ త్రిప్పు టురువు. ౧౯౪.

టీ. నల్లన్ = రక్తమును, క్రోలనిచ్చి = త్రావనిచ్చి, మెల్లనె = తడవుగానె, చివ్వంగి = తరక్షువుయొక్క, నోరి = నోటియందున్న, జింకన్ = లేఁడిని, తివియు = తీయునట్టి, నేరుపాదవు = నైపుణ్యముగల్గినట్టి, వేటకాఁడువోలెన్ = మృగయువువలెను, విషయాళివలనన్ = శబ్దాదివిషయసమూహమందు, తత్తృష్ణన్ = ఆ యామునాచార్యునియొక్క యాశను, తీరనిచ్చి = ముగియనిచ్చి, త్రిప్పుట = మళ్లించుట, ఉరువు = మంచిది.

తా. సుగమము.

వ. కావున నట్లయిన నితని నింక నుపేక్షింప రా దుపాయంబునఁ జొచ్చి యొక్కరీతిం ద్రిప్ప వలయు నుర్వి నాహారదోషంబు విజ్ఞాననాశంబునకు మూలం బని వితర్కించి.

టీక. కావుననట్లయినన్ = అందు వల్లనాలాగైనను, ఇతనిన్ = ఈయామునాచార్యుని, ఇంకన్ = ఇఁకమీఁదను, ఉపేక్షింపరాదు (అలక్ష్యము సేయరాదు) ఉపాయంబునఁజొచ్చి = నేర్పుతోఁబ్రవేశించి, ఒక్కరీతింద్రిప్పవలయున్ = ఒకానొకప్రకారముచేత మళ్లింపవలయును, ఉర్విన్ = భూమియందు, ఆహారదోషంబు = భోజనమువలని దోషంబు, (అనఁగాఁ బాపమనుట) ఆశ్రయనిమిత్తజాతిస్వరూప దుష్టాహారవర్జనంబువల్లఁ గాయశుద్ధియనియున్నదిగావున ) విజ్ఞాననాశంబునకున్ = మతిచెడుటకు, మూలంబని = కారణంబని, వితర్కించి = ఊహించి ౧౯౬.

తా. సుగమము.

క. ముల్లు దలకొనని నవకపు, పల్లవములతోడ ముక్తి ♦ భామ చెవులకుఁ,
బల్లేరుపువ్వు లగుపువు, లుల్లసిలు నలర్కశాక ♦ మొదుగుగఁ గొనుచున్.

టీ. ముల్లుదలకొనని = కంటకముపుట్టని, నవకపు = లేఁతలైన, పల్లవములతోడన్ = చిగుళ్లతో, ముక్తిభామ = మోక్షాంగనయొక్క, చెవులకున్ = కర్ణములకు, పల్లేరుపువ్వు లగు, (అనఁగాఁ బల్లేరుపువ్వులనెడు భూషణములవలెనున్నవియనుట) పువులు = పుష్పములు, ఉల్లసిలు = ఒప్పుచున్న, అలర్కశాకము = ముండ్లముస్తెకూర, ఒదుగుగన్ = విస్తారముగా, కొనుచున్ = సంగ్రహించికొనుచును, శ్లో. అయత్నతో యామునమాత్మదాస మలర్కపత్త్రార్పణ నిష్క్రయేణ। యఃక్రీతవా నాస్థితయౌవరాజ్యం నమామితం రామమమేయసత్త్వ మని ప్రసిద్ధము. ౧౯౭.

తా. సుగమము.

తే.గీ. తెచ్చి యొకవైష్ణవుఁడు కాను ♦ కిచ్చె ననుచు, బానసపుబాడబులచేతఁ ♦ బంపుటయును, నతఁడు ప్రియపడి వండించి ♦ యారగింపఁ, దెచ్చు నిచ్చఁ గొన్నాళ్లిట్లు ♦ తెచ్చుచుండ.

టీ. ఒకవైష్ణవుఁడు = ఒకవిష్ణుభక్తుఁడు, తెచ్చి = తీసికొనివచ్చి, కానుకిచ్చెననుచున్ = ఉపహారముసంగెనని, బానసపుబాడబులచేతన్ = వంటబ్రాహ్మణులచేతను, పంపుట

యును = అంపఁగా (అథద్విజాత్యగ్రజన్మభూదేవ బాడబా యని యమరము) అతఁడు= అయ్యాముని నాచార్యుండు, ప్రియపడి=ఇష్టపడి, వండించి పచనము చేయించి, ఆరగింపన్ =భోజనము చేయఁగా, ఇచ్చన్ =ప్రీతిముతో, తెచ్చున్ =మరలఁదెచ్చి యిచ్చును, కొన్నాళ్లు= కొన్నిదినములు, ఇటు= ఈప్రకారముగా, తెచ్చుచుండన్ = తెచ్చియిచ్చుచుండఁగా.

తా. సుగమము.

వ. ఒక్కనాఁ డతండు భోజనసమయంబున సకలశాకాస్వాదనంబు సేయుచు వచ్చి తచ్ఛాకంబు నంజుచుం దలంచుకొని యే తద్దానేత యగుభాగవతు భోజనానంతరంబ మమ్ముం గాన్పింపుం డనిపలికి పాణిప్రక్షాళనాచమనానంతరంబ యతనిం గాన్పించుకొని నమస్కరించి వచ్చిన ప్రయోజనం బడుగుటయు నతం డిట్లనియె. ౧౯౮.

టీక. ఒక్కనాఁడు=ఒక్కదివసమునందు, భోజనసమయంబునన్ =ఆరగింపుతఱి, సకల=సమస్తమైన, శాక = వ్యంజనములయొక్క, ఆస్వాదనంబు=రుచిచూచుటను చేయుచు, వచ్చివచ్చి=క్రమముగావచ్చి, తచ్ఛాకంబున్ = ఆముండ్లముస్తె కూరను, నంజుచున్ =ఆస్వాదించుచు, తలంచుకొని = జ్ఞప్తితెచ్చుకొని, ఏతద్దానేతయగు= ఈకూరదెచ్చినట్టి, భాగవతున్ =భగవద్భక్తుని, భోజనానంతరంబ=ఆరగించినవెనుకనే, మమ్ముం గాన్పింపుండని = మమ్ముఁ గనఁగొనఁజేయుండని, పలికి=నుడివి, పాణిప్రక్షాళనాచమనానంతరంబ = చెయిగడిగి యుపస్పర్శము చేసినపిమ్మటను (ఉపస్పర్శస్త్వాచమనమని యమరము) అతనింగాన్పించుకొని=ఆమహాభాగవతునిం గానుపింపఁజేసికొని, నమస్కరించి= సేవించి,వచ్చినప్రయోజనంబడుగుటయు=ఆగమనకార్యమునుబ్రశ్న సేయఁగా, అతండు= ఆశ్రీరామమిశ్రుఁడు, ఇట్లనియెన్ =వక్ష్యమాణక్రమంబునంబలికెను.

తా. సుగమము.

క. మీపెద్దలు కూర్చినని, క్షేప మొకటి సహ్యజనిత ♦ సింధుజలాంత,
ర్ద్వీపమున నుండ నీకుం, జూపంగా వచ్చితిని వ ♦ సుమతీనాథా. ౧౯౯.

టీక. వసుమతీనాథా = ఓయిరాజా, మీ = మీయొక్క, పెద్దలు = వృద్ధులయిన పితృపితామహాదులు, కూర్చిన = కూడఁబెట్టినట్టియు, భక్తిచేత సేవించినట్టి, నిక్షేపము ఒకటి=పాఁతిపెట్టినయొకనిధి, సహ్య = సహ్యపర్వతమునందు, జనిత = పుట్టినటువంటి, సింధు = కావేరియొక్క, జలాంతః=ప్రవాహద్వయమధ్యముననున్న, ద్వీపమునన్ =దీవిగడ్డయందు, ఉండన్ =ఉండఁగా, నీకున్ = నీకు, చూపంగాన్ = కనుపఱచుటకొఱకు, వచ్చితిని=ఏతెంచితిని.

తా. సుగమము.

క. నా కేటికి నిక్షేప మ, నాకు నిధియు నాకరంబు ♦ నరనాథులసొ
మ్మే కాన విన్నవించెద, నాకర్ణింపుము తదీయ ♦ మగువిధ మెల్లన్. ౨౦౦.

టీక. నిక్షేపము=ధననిధి, నాకేటికి=నాకెందుకు, అనాకుము = అనిపలుకకుము, నిధియున్ = నిక్షేపమును, ఆకరంబున్ = గనియును, నరనాథులసొమ్మే కానన్ = రాజులద్రవ్యమేగనుక, విన్నవించెదన్ = తెలిపెదను, తదీయమగు = ఆనిక్షేపసంబంధియైన, విధమెల్లన్ = స్వరూపమంతయును, ఆకర్ణింపుము = వినుము.

తా. సుగమము.

సీ. స్ఫుటల మణుల్ మీఱ ♦ శాంతమై శ్వేతమై । నట్టి త్రాఁచొకట ♦ చుట్టి యుండు,
రక్షోగృహీత మ ♦ న్ప్రథ తొల్లి గల దది । పొలయ దం డేఁడాఱు ♦ నెలలు గాని,
యేపాటిబలి యైనఁ ♦ జేపడుఁ బ్రాణిహిం । సాదిపూజనముల ♦ కాసపడదు,
తనవెలుంగొగి నిరఁ ♦ జనదృష్టికిని లక్ష్య । మై యుండు నయ్యనిం ♦ తంత గాదు
రత్న మొక్కటి పై నపూ ♦ ర్వంబు మెఱయుఁ । గలదు వర్థంబు శంఖంబు ♦ పలుకులేటి
కక్షయ మనంత మాద్య మే ♦ కాంతమందు । భూప నీకొక్కనికె కాక ♦ చూపరాదు.

టీక. స్ఫుటల = పడగలయందు, మణులు = రత్నములు, మీఱన్ = అతిశయింపఁగా (స్ఫుటాయాంతు ఫణాద్వయోః అని యమరము) శాంతమై = ఓర్పుగల్గినదై, శ్వేతమై నట్టి = తెల్లనైనటువంటి, త్రాఁచొక్కటి = ఒకకృష్ణసర్పము, చుట్టియుండున్ = పరివేష్టించియుండును (ధననిక్షేపమును సర్పముచుట్టికొనియుంట ప్రసిద్ధముగాన బ్రకృతమందు రంగనాయకుని యామునాచార్యునియొక్క పూర్వులుంచిన నిక్షేపముగా రూపించిచెప్పినందున ధ్వన్యర్థముగా శ్రీరంగేశ్వరునియందలి ధర్మములను నిధి ధర్మములుగాను నాయన శేషశాయియగుటవల్ల సర్పావతారములకు నిధులని వ్యవహారముగలదు గనుక నట్టి నిక్షేపమునకు సర్పముచుట్టికొనియున్నట్లును జెప్పుటయుక్తము) రక్షః = రక్కసునిచేత, గృహీతము = స్వీకరింపఁబడ్డది, అన్ = అనెడు, ప్రథ = ప్రసిద్ధి, తొల్లి = పూర్వమునందు, కలదు = కద్దు, అది = ఆప్రసిద్ధి, అందున్ = ఆనిధియందు, ఏఁడు = సంవత్సరమునకైనను, ఆఱు నెలలఁగాని = షణ్మాసములకుఁగాని, పొలయదు = పొందదు (నిక్షేపమునకు రాక్షసగృహీతత్వముండునుగనుక నట్లిక్కడ శ్రీరంగనాయకుఁడు పూర్వము విభీషణునిచేత స్వీకరింపఁబడినను విభీషణుఁడాఱుమాసములకొకపర్యాయముగాని సంవత్సరమునకొకపర్యాయముగాని పూజయొనర్చుచుండుట ప్రసిద్ధముగాన నిప్పుడా నిక్షేపమునకు రాక్షసగృహీతత్వము నిరంతరముగలేదు సులభముగా గ్రహింపవచ్చుననుట) ఏపాటిబలియైనన్ = నిశ్చలచిత్తుఁడై యెంతమాత్రముపూజఁజేసినను, చేపడున్ = అనుగ్రహించును (బలిః పూజోపహారయోః అని యమరము) ప్రాణి = జంతువులయొక్క, హింసాది = కాయక్లేశాదులవలన, పూజనములకున్ =

అర్చనలను (ద్వితీయార్థమందుషష్ఠి) ఆసపడరు = అపేక్షింపరు (లోకమునందునిక్షేపమును బొందువారలు ప్రాణిహింసాది బలులొసంగి దానిం గొనుట ప్రసిద్ధముగాన నట్లుగాక నూక్ష్మబలిచేత వచ్చునని చెప్పుటవల్ల సులభోపాయముచేత నే శ్రీరంగేశుఁడు ప్రసన్నుఁడౌనసుట) తన = ఆ నిక్షేపముయొక్క, వెలుంగు = జ్వలించుట, (అనఁగాఁగనుపించుటయనుట) ఒగిన్ = ప్రయత్నముచేతను, నిరంజనదృష్టికినె = కాటుకఁ బెట్టనికన్నులుగలవానికె, లక్ష్యమైయుండున్ = చూడఁదగినిదై యుండును, (ధననిక్షేపాదులంజూచువారు గంటఁగాటుకఁబెట్టి చూచుట ప్రసిద్ధమైన నీ నిక్షేపమును జూచుటకు నది యక్కరలేదనుట) తన వెలుంగు = స్వప్రకాశము, ఒగిన్ = యత్నముచేత, నిరంజన = బంధరహితమైన, దృష్టికినె = జ్ఞానముగలవానికె, లక్ష్యమైయుండున్ = చూడఁదగినదై యుండును). (కేవలచర్మచక్షుస్సులకు గోచరముగాదనుట) అయ్యున్ = కనుపించునదయ్యును, ఇంతమాత్రమని లెక్కింపరాదు. (ఆనిధియింతయనియు శ్రీరంగనాయకులమహిమం బింతయనియుం జెప్ప శక్యంబుగాదనుట) మైన్ = అనిక్షేపముమీఁదను, రత్నమొకటి = ఒకమణి, మెఱయున్ = వెలుఁగొందును, శంఖంబు పద్మంబు = శంఖపద్మాది సంఖ్యగలద్రవ్యము, కలదు = కద్దు (శ్రీరంగనాదునియందు శంఖము నాభియందుపద్మముండుట ప్రసిద్ధము) పలుకు లేటికి = మాటలెందుకు, అక్షయము = నాశరహితము, అనంతము = అంతములేనిదియు, దేశకృతకాలకృతపరిచ్ఛేదము లేనిదియు, ఆద్యము = బహుకాలముగనుండియున్నదియు, సర్వభూతాదియు, ఏకాంతము = రహస్యమైనదియును, అందున్ = అనిచెప్పెదను, భూప = ఓయివిభుఁడా, నీకొక్కనికె కాక = నీకుమాత్రమే కాని, చూపరాదు = అన్యులకుఁ జూపఁగూడదు. అనఁగా నితరులుచూడఁగూడదనుట, (అసాధారణభగవద్భక్తిఖనివైన నాథమునిమనుమఁడవుకనుక నీకాయోగ్యతగలదని భావము.)

వ. అని విన్నవించిన సంతసించి సేనాసమేతుండై యతండు మున్నుగా శ్రీరంగంబునకరిగి కావేరిచంద్రపుష్కరిణులఁ దీర్థం బాడి రంగనాథు సేవించి సాభిప్రాయంబుగా నతనిం గటాక్షించిన నతం డిట్లనియె. ౨౦౨.

టీ. అని = ఇట్లని, విన్నవించినన్ = విజ్ఞాపనముచేయఁగా. సంతసించి = సంతోషించి, సేనాసమేతుండై = సేనతోఁగూడుకొనినవాఁడై, అతండు = ఆ శ్రీరామమిశ్రుఁడు, మున్నుగాన్ = ముందుగాను, శ్రీరంగంబునకరిగి = శ్రీరంగమను దివ్యక్షేత్రమునకు వెళ్లి, కావేరీ చంద్రపుష్కరిణులన్ = కావేరీ చంద్రపుష్కరిణులయందు, తీర్థమాడి = స్నానముఁజేసి, రంగనాథున్ = రంగనాయకుని, సేవించి = నమస్కరించి, సాభిప్రాయంబుగాన్ = ఆ మాతసహితమగునట్లు, అతనిన్ = ఆ శ్రీరామమిశ్రుని, కటాక్షించినన్ = చూడఁగా, అతండు = ఆ శ్రీరామమిశ్రుఁడు, ఇట్లనియె = వక్ష్యమాణప్రకారంబుగఁ బలికెను.

తా. సుగమము.

క. మీపెద్దలు గూర్చినని, క్షేపమ్మిది గొమ్మటంచు ♦ శ్రీరంగపతి,
శ్రీపదయుగ్మముఁ జూపిన, నాపృథివీపతి హఠాద ♦ పాస్తభ్రముఁడై. ౨౦౩.

టీక. మీపెద్దలు=మీపూర్వికులయిన నాథమునిప్రభృతులు, కూర్చిన = సంపాదించిన, నిక్షేపమ్ము=ధననిక్షేపము, కొమ్మటంచుక్ = దీనింబరిగ్రహింపుమని, శ్రీరంగపతి = శ్రీరంగనాయకునియొక్క, శ్రీపదయుగ్మముక్ = శోభాయుక్తమగు పదద్వంద్వమును, చూపినక్ = కనుపింపఁజేయఁగా, ఆపృథివీపతి = ఆయామునాచార్యుఁడు, హఠాత్ = అదరుపాటున, (ప్రసహ్యాతుహఠార్థకయన యమరము) అపాస్త=పోఁగొట్టఁబడిన, భ్రముఁడై = భ్రాంతిగలవాఁడై.

తా. సుగమము.

వ. గ్రక్కునఁ దనపూర్వదశఁ దలంచి యిన్నాళ్లు దనప్రమాదంబునకుం బరమ నిర్వేదన నొంది నీ వెవ్వండ వనుటయు నే మీపితామహుండ నగునాథముని ప్రశిష్యుండ నయ్యోగి వరుండు భావిభవజ్జన్మం బెఱింగి భాగవతవతంసంబ వగునీచేత నివ్విశిష్టాద్వైతంబు సకలభూతహితంబుగా వెలయం గలయది యని నిశ్చయించి నీకు ద్వయం బుపదేశింపు మని తనశిష్యుఁ డగు పుండరీకాక్షున కుపదేశించిన నతండు భోగాసక్తుండ వైనని న్నుపాయంబునఁ దెలిపి నీ కుపదేశింపు మనుటయుఁ బనివింటి ననిన సాష్టాంగంబుగాఁ బ్రణమిల్లి యతనిచేతం బంచసంస్కారసంస్కృతుండై యంత నిలువక తురీయాశ్రమంబునకు రాఁగలవాఁడై స్కంధావారంబునకు మగుడి వచ్చి కుమారునందు రాజ్యభారంబుఁ బెట్టి బంధుమిత్రామాత్య సమేతం బగుబలచతుష్టయం బునుబ్రకృతివర్గంబును నతని కొప్పగించి యిట్లనియె. ౨౦౪.

టీక. గ్రక్కునక్ = శీఘ్రముగా, తన=తనయొక్క, పూర్వదశఁదలంచి=రాజ్యభారభరణము మొదలయిన వృత్తాంతమంతయు స్మరించుకొని, ఇన్నాళ్లు = ఇన్నిదినములు, తన=తనయొక్క, ప్రమాదంబునకుక్ = మఱపునకు, పరమనిర్వేదనక్ = అధికమైన విషాదమును, ఒంది=చెంది, నీవెవ్వండవనుటయుక్ = నీవెవ్వఁడవనఁగా, నేక = నేను, మీపితామహుండగు = మీతండ్రికిఁదండ్రియైన, నాథమునిప్రశిష్యుండక్ = నాథమునియొక్క యనుంగుశిష్యుఁడయిన పుండరీకాక్షునకంతేవాసిని, అయ్యోగివరుండు = శ్రీమన్నాథముని, భావి = కాఁగల, భవత్ = మీయొక్క, జన్మంబు = అవతారమును, ఎఱింగి = తెలిసి, భాగవతవతంసంబవగు = భగవద్భక్తశిరోభూషణంబయిన, నీచేతక్ = ఇవ్విశిష్టాద్వైతంబు (స్థూలచిదచిద్విశిష్టపరమాత్మకు సూక్ష్మచిదచిద్విశిష్టపరమాత్మకు నభేదమని చెప్పుటయే విశిష్టాద్వైతశబ్దార్థము) సకలభూత=నిఖిలప్రాణులకును, హితంబుగా = మేలగునట్లు, వెలయంగల యది=శోభింపఁగలది, అనినిశ్చయించి = అట్లనిరూఢిఁజేసి,

నీకుద్వయంబుపదేశింపుమని=నీకుమంత్రరత్నదానముఁజేయుమని, తనశిష్యుండగు పుండరీకాక్షున కుపదేశించినన్=తనయంతేవాసియైన పుండరీకాక్షునకు ద్వయమంత్రదానముఁజేయఁగా, అతండు=ఆపుండరీకాక్షుండు, భోగాసక్తుఁడవయిన=అర్థకామాదులయం దిచ్ఛగలవాఁడవయిన, నిన్నున్ = నిను, ఉపాయంబునం దెలిపి = నేర్పుచేత. నెఱింగించి, నీకుపదేశింపుమనుటయున్ = నీకుద్వయమంత్రదానముఁజేయుమనఁగా, శ్లో. నేతృత్వంనిత్యయోగం సముచితగుణజాతంతనుఖ్యాపనంచోపాయం కర్తవ్యభాగంత్వథమిథునపరంప్రాప్యమేవం ప్రసిద్ధం, స్వామిత్వంప్రార్థనాంచ ప్రబలతరవిరోధిప్రహాణం దశైతాన్మంతారంత్రాయతేచేత్య నిగతనియమంషట్పదోయం ద్విఖండమనిద్వయమంత్రలక్షణము) పనివింటినని నన్=వచ్చితిననఁగా, సాష్టాంగంబుగాఁ బ్రణమిల్లి=అష్టాంగయుక్తముగునట్లునతియొనర్చి, అతనిచేతన్ = ఆశ్రీరామమిశ్రునిచేతను, పంచసంస్కారసంస్కృతుండై = అయిదు శోధనలచేత శోధింపఁబడ్డవాఁడై (పంచసంస్కారములనఁగా. శ్లో. తాపఃపుండ్ర స్తథానామ మంత్రోయాగశ్చపంచమః, అమీపరసంస్కారాః పరమైకాంతిహేతవ యనిదానిలక్షణము.) అంతనిలువక = అంతమాత్రముచేత విరమింపక, తురీయాశ్రమంబునకు రాగలవాఁడై = చతుర్థాశ్రమమునకువచ్చుట కుద్యుక్తుండై (అనఁగాయత్యాశ్రమమునకనుట.) స్కంధావారంబునకు = దండుదిగియున్న స్థలమునకు, మగుడివచ్చి =తిరిగివచ్చి (స్కంధావారోనివేశనమనినిఘంటువు) కుమారునందు రాజ్యభారంబుఁబెట్టి = రాజ్యంబునఁ బుత్రునభిషిక్తుంజేసి, బంధుమిత్రామాత్యసమేతంబగు = బాంధవమిత్రామాత్యులతోఁ గూడియున్న, బలచతుష్టయంబును=చతురంగసైన్యమును, ప్రకృతివర్గంబును = ప్రజాసమూహమును, అతనికిన్=ఆకుమారునికి, ఒప్పగించి=అధీనముఁజేసి, ఇట్లనియెన్=వక్ష్యమాణక్రమంబునఁ బల్కెను (రాజ్యాంగానిప్రకృతయః పౌరాణాం శ్రేణయోపిచ యనియమరము.

తా. సుగమము.

ఇది. మొదలుకొని రాజనీతి.

క. ఏపట్టున విసువక ర, క్షాపరుఁడవు గమ్ము ప్రజల ♦ చక్కి విపన్నుల్
గూపెట్టిన విని తీర్పుము, కాపురుషులమీఁద నిడకు ♦ కార్యభరంబుల్. ౨౦౫

టీక. ఏపట్టునన్ = ఏసమయమునందును, విసువక = వేసరక, ప్రజలచక్కిన్ = జనులపట్లను, రక్షాపరుఁడవుగమ్ము = రక్షణపరతంత్రుఁడవగుము, విపన్నుల్ = ఆపదనొందినవారలు, కూపెట్టినన్ = మొఱపెట్టఁగా, విని=ఆలకించి, తీర్పుము = వారియాపదలఁబొలంగఁజేయుము, కార్యభరంబుల్ = గొప్పపనులను, కాపురుషులమీఁదన్ =కుత్సితజనులయందు, ఇడకుము=ఉంచకుము.

తా. సుగమము.

తే.గీ. రాష్ట్రవర్ధన మెదఁ గోరు♦ రాజు మేలు, రాష్ట్రమును గోరుదానఁ గా♦ర్యమె యనంగ
రాదు బ్రహ్మోత్తరములైన♦ ప్రజలయేక, ముఖపుఁగోర్కెఁ దదంతరా♦త్ముం డొసఁగఁడె.

టీక. రాష్ట్రవర్ధనము=ప్రజాభివృద్ధిని (రాష్ట్రమనఁగా దేశమనియుం జెప్పవచ్చును) ఎదన్ = హృదయమందు, కోరు = అపేక్షించుచున్నటువంటి, రాజు = ఏలికయొక్క, మేలు = వృద్ధిని, రాష్ట్రమును = ప్రజయును, కోరున్ = అపేక్షించును, దానన్ =అట్లుకోరుటవల్లను, కార్యమె = ప్రయోజనమేమి, అనంగరాదు = అనఁగూడదు, బ్రహ్మోత్తరములైన=బ్రాహ్మణులులోనగు జనములయొక్క, ఏకముఖపుఁగోర్కెన్ = ఒకరూపమయినకోరికను, తదంతరాత్ముండు = వారి యంతర్యామియయిన శ్రీమన్నారాయణుఁడు, ఒసఁగఁడె=ఇయ్యఁడా (ఇచ్చునవుట.)

ఆ.వె. ఆజ్ఞ వలయు నృపతి♦కాభీరభిల్లాది, కంపకోల నూల♦ నాజ్ఞ చెల్లు,
నంట సార్వభౌముఁ♦ డైనభూపతి యాజ్ఞ, కెల్ల వారు దల్ల♦డిల్ల వలదె. ౨౦౭.

టీక. నృపతికిన్ =రాజునకు, ఆజ్ఞ= సెలవు, వలయున్ =వాలాయము కావలయును, అభీర = గొల్లలకును, భిల్లాదికిన్ = చెంచువాండ్రు బోయవాండ్రు మొదలగువారికి (భేదాః కిరాతశబరపుళిందామ్లేచ్ఛజాతయః, గోపే గోపాల గోసంఖ్య గోధుగాభీర వల్లవాయని రెంటికినమరము) అంపకోలన్ =అంపకఱ్ఱచేతను, నూలన్ =దారపుపోగుచేతను, ఆజ్ఞ చెల్లునంట = ఉత్తరువు చెల్లుబడియగునఁట (అడవులయందుండెడు పశుప్రాయులైన పాళెగాండ్రునయిత మెవనికైన నభయదానము చేసిన వానిచేత నొకయంపకఱ్ఱైగాని నూలుపోగుగాని తమముద్రగానిచ్చిన వక్షముల మఱియతనిని జోరులంటరని ప్రసిద్ధము) సార్వభౌముఁడైన = సకలభూమండలము నేలుచున్న, భూపతి= రాజుయొక్క, ఆజ్ఞకున్ =ఉత్తరువునకు, ఎల్లవారు = సకలజనులు, తల్లడిల్లవలదె =వెఱవవలదా, భూమండలమునకంతయుఁ బ్రభుత్వముచేయుచుండు రాజున కెల్లవారును భయముతోఁగూడి వశంవదులై యుండవలయుననుట.

క. దుర్గము లాప్తద్విజవర, వర్గమునకె యిమ్ము దుర్గ♦వత్తత్తతి క
త్యర్గళధరాధిరాజ్యవి, నిర్గతసాధ్వసత పొడము♦ నిలుపకు కొలఁదిన్. ౨౦౮.

టీ. దుర్గములు = స్థలజలగిరివనదుర్గములను, ఆప్త=ప్రియులయిన, ద్విజవరవర్గమునకె = బ్రాహ్మణోత్తమసమూహమునకె, ఇమ్ము = ఇయ్యఁగావలయును (దుర్గాధిపత్యంబులననుట) దుర్గవత్ =స్థలదుర్గాదులుగల, తత్తతికిన్ = ఆద్విజబృందమునకు, అత్యర్గళ=నివారింపశక్యముగాని, ధరాధిరాజ్య=భూమండలాధిపత్యముచేత, వినిర్గత=పోయినటువంటి, సాధ్వసత = భయముగలుగుట, పొడమన్ =జనించునట్లు, కొలఁదిన్ = కొద్దిని, నిలుపకు=ఉంచకుము (భీతిర్భీస్సాధ్వసంభయమని యమరము.)

తా. దుర్గాధిపత్యమును బొందినవాఁడు దేపాటిశత్రువువచ్చినను వెఱవకయెదిరించుటకు యుక్తమైన బలస్తోమములం గూర్చి వానిం భరియింపుమనుట.

ఆ.వె. మొదలఁ బెనచి పిదపఁ ♦ గుదియింప నెవ్వాఁడుఁ, దనదుతొంటిహీన ♦ దశఁ దలంపఁ
డలుగుఁ గాన శీల ♦ మరయుచుఁ గ్రమవృద్ధిఁ, బెనిచి వేళ వేళఁ ♦ బనులు గొనుము.

టీ. మొదలన్ = ప్రథమమందు, పెనిచి = వృద్ధిచేసి, పిదపన్ = వెనుకను, కుదియింపన్ = తగ్గింపఁగా, ఎవ్వాఁడున్ = ఎటువంటివాఁడయినను, తనదు = తనయొక్క, తొంటిహీనదశన్ = మునుపటితక్కువస్థితిని, తలంపఁడు = స్మరింపఁడు, అలుగుఁగాన్ = కోపించునుగనుక (అనఁగా పేర తన్నుఁదగ్గించినాఁడని కోపగించునుగాని తానున్న తక్కువస్థితిని దలంపఁడనుట) శీలమరయుచున్ = వానివానినడవళ్ళు నెఱింగికొనుచును (స్వభావమున నిట్టిదని చెప్పవచ్చును) శీలం స్వభావే సద్వృత్తే యని యమరము) క్రమవృద్ధిఁబెనిచి = పర్యాయముగా వృద్ధినొందించి, వేళవేళన్ = సమయములయందు, పనులుగొనుము = కార్యములు తీసికొనుము.

ఆ.వె. అనభిజాతుఁ గీక ♦ టాలయు నశ్రుతు, నలుకువాని బొంకు ♦ పలుకువాని
నాతతాయి గడుసు ♦ నన్యదేశ్యు నధర్ము, విడుము విప్రు నేల ♦ వేఁజితేని. ౨౧౦.

టీ. అనభిజాతున్ = హీనకులముగలవానిని, కీకటాలయున్, కీకట-శబరపల్లియందు, ఆలయున్ = గృహముగలవానిని, అశ్రుతున్ = పాండిత్యము లేనివానిని, అలుకువానిన్ = పిరికిని, బొంకుపలుకువానిన్ = అబద్ధములాడువానిని, ఆతతాయిన్ = ద్రోహచింతకుని, (శ్లో. అగ్నిదో గరదశ్చైవ శస్త్రపాణి ర్ధనాపహః । క్షేత్రదారాపహర్తాచ షడేతే ఆతతాయినః యని యాతతాయిలక్షణము.) గడుసున్ = అపవాదభయము లేనివానిని, అన్యదేశ్యున్ = దేశాంతరస్థుని, అధర్మున్ = ధర్మశూన్యుని, విప్రున్ = ఇట్టి బ్రాహ్మణుని, ఏలఁదలఁచితేని = ఉద్యోగమిచ్చి పోషింపఁదలంచితివేని, విడుము = వదలుము, ఇట్టివారలు బ్రాహ్మణులైనను బరిహరింపుమనుట.

క. తక్కుము మిగులఁ బథిచ్యుత, పక్కణవర్తులఁ దొల్లి ♦ భ్రష్టగు విప్రుం
డొక్కం డలుగఁడె ప్రోచిన, కొక్కెరపై నొక్కపూట ♦ కూటికిఁ గాఁగన్.

టీ. మిగులన్ = మిక్కిలియును, పథిచ్యుత-స్వవృత్తిభ్రష్టులై దుష్టసంసర్గము గల, పక్కణవర్తులన్ = శబరవాటికలయందుఁ జరిగినటువంటి బ్రాహ్మణులను, తక్కుము = విడువుము, తొల్లి = పూర్వమునందు, భ్రష్టగు = చెడిపోయినట్టి, విప్రుండొక్కండు = బ్రాహ్మణుఁడొక్కరుండు, ప్రోచిన = తన్నుఁగాపాడినట్టి, కొక్కెరపైన్ = కొంగమీఁదను, ఒక్కపూటకూటికిఁగాఁగన్ = ఏకకాలాహారమునకుఁగా (మాంసార్థమై పొలుమార్చి యనుట) అలుగఁడె = కోపింపఁడా. ఈకథ మహాభారతమందలి శాంతిపర్వంబున రాజధర్మమందుఁ జెప్పఁబడియున్నయది.

తా. బ్రాహ్మణుండై జన్మించినను మద్యమాంసముల నారగి భ్రష్టుండైనవాఁడు నిరంతరము దాసియై కులాచారములు మొదలగువానియందు లక్ష్యముంచక స్వేచ్ఛానుసారముగ వర్తిల్లుచుండును గనుక నట్టివాని కధికార మియ్యఁగూడదనుట.

చ. చదివి యధర్మభీరు నృప ♦ శాస్త్రవిధిజ్ఞత లన్వయస్సు డెం
బ్బదిటికి లోను నేఁబదికి ♦ బాహ్యము నై యరుజ న్స్వపూర్వులై,
మద మఱి రాజుప్రార్థనన ♦ మాత్యతఁ గైకొని తీర్చు పాఱువా,
రొదవిన నంగము ల్మిగుల ♦ నూర్జిత మౌటకుఁ బూట చాలదే. ౨౧౨.

టీ॥ చదివి=శాస్త్రాదులం బఠించి, అధర్మభీరు నృపశాస్త్రవిధిజ్ఞతలన్=అన్యాయభీతితోను రాజనీతి పరిజ్ఞానముతోనుగూడి, వయస్సు=ప్రాయము, (ఖగబాల్యాదినోర్వయ యని యమరము) డెబ్బదిటికిన్=సప్తతి సంవత్సరములకు, లోనును=లోపుగాను, ఏఁబదికిన్=పంచాశద్వర్షములకు, బాహ్యమును=వెలపటిదిగాను, ఐ=కలవాఁడై, అరుజన్=రోగములేనివాఁడై, స్వపూర్వులై=తమ పెద్దలనాటనుండి కనిపెట్టియున్నవారై, మదమఱి=మాత్సర్యాదులు లేక, రాజు=నృపునియొక్క, ప్రార్థనన్=వేడుకొనుటచేత, అమాత్యతన్=ప్రధానత్వమును, కైకొని=అంగీకరించి, తీర్చు=కార్యనిర్వాహము చేయునట్టి, పాఱువారు=బ్రాహ్మణులు, ఒదవినన్=లభించిరేని, అంగముల్=రాజ్యాంగములు (స్వామ్యమాత్యసుహృత్కోశ రాష్ట్ర దుర్గబలానిచ, రాజ్యాంగానియని యమరము) మిగులన్=మిక్కిలియు, ఊర్జితమౌటకున్=వృద్ధిఁ బొందుటకు, పూటచాలదె=ఒకదినము చాలదా, నీతిశాస్త్రమందుఁ జెప్పఁబడియున్న లక్షణములుగల మంత్రిదొరకినట్లాయెనేని శీఘ్రముగ రాజ్యమభివృద్ధి నొందుననుట.

తా. సుగమము.

వ. అట్టిమంత్రివర్గంబు దొరకదేని. ౨౧౩.

శా. నీతిం దాన తలంచి చేయఁ బని గా ♦ నీ కాక పోనీ బల,
వ్రాతార్థాఢ్యత నెమ్మినుండక రుజం బ్రో ♦ వ స్వమంత్రి యంచుం గుణా,
తీతుం గున్కడి కాయ యంత యగుచు ♦ దైంస్తే మనం బేర్చ న,
ట్లే తా నాతని చేతిలోఁ బ్రదుకు నా ♦ జేయాంజనేయుం డటన్. ౨౧౪.

టీక. నీతిన్=రాజన్యాయముచేతను, తానతలంచి=తానే యోజించి, చేయన్=రాజ్యపాలనమొనరింపగా, పని గాని=కార్యము తీరని, కాక పోని=కార్యముతీరక పోని, బలవ్రాత=సేనాసమూహముచేతను, అర్థ=ధనముచేతను, ఆఢ్యతన్=ఒప్పియుండుటచేతను (ఇభ్యఆఢ్యోధనీస్వామియని యమరము) (ధనబలములుగల్గి స్వతంత్రుఁడై యుండుటచేతననుట) నెమ్మినుండక=నెమ్మదినుండక, గుణాతీతున్=సద్గుణముల

వతిక్రమించినట్టి (అనఁగా గుణశూన్యుఁడనుట). ఒరుఁ = మఱియొక పురుషుని, మంత్రియంచుఁ = అమాత్యుఁడని, ప్రోవన్ = రక్షింపఁగా, గుమ్మడికాయ యంతియగుమ త్రైంబై = కూశ్మాండప్రమాణమైన మౌ క్తికమై (గుమ్మడికాయంతయంతమ త్రైమనఁగా శరీరమం దుధరింపఁగూడదనుట) మనంబేర్చన్ = మనోవ్యథ సేయఁగా (స్వాధీనుఁడుగాకయనుట) అక్లే = ఆలాగుననే, తాన్ = పరాధీనుఁడయినతాను, ఆతని చేతిలోన్ = ఆస్వవశుఁడుగాని మంత్రిహస్తములో, నీఁదటన్ = వెనుకను బ్రదుకువాఁడేయౌ రాజు మీ = అతఁడు చెప్పినట్లు వినుకొని జీవింపవలయుఁజుమీ. (అనఁగా దగినమంత్రి ద్వారకనపుడు నీతిశాస్త్రపరుఁడై స్వతంత్రుఁడై యున్న రాజు సుఖపడుననుట.

క. ఒక్కనివిరివికిని దొర, లెక్కండ్రే నొక్కనొకని ♦ వెంబడి ననుగు
లెక్కండ్రు నిలువఁ బను లగుఁ, గక్కనము గుదింపఁ బెంప ♦ గాఁ గాకుండున్.

టీ. ఒక్కనివిరివికిని = ఒకనికివి స్తరించియిచ్చుదానికి, దొరల్ = ఉద్యోగస్థులు, పెక్కండ్రేని = అనేకులయిరేని, (అనఁగా నొకయధికారమనేకులకిచ్చినప్పు డనుట) ఒక్కనొకని వెంబడిన్ = వారిలో నొకనొకని వెంట, అనుఁగుల్ = వారివారి స్నేహితులు, పెక్కండ్రు = అనేకులు, నిలువన్ = నిలిచియుండఁగా, పనులు = రాజకార్యములు, అగున్ = అనుకూలములగును, కుదింపన్ = తగ్గింపఁగా, కక్కనము = కఠినము, పెంపఁగాన్ = వృద్ధిసేయఁగాను, కక్కనముగాకుండున్ = కఠినముగాకుండును.

తా. సుగమము.

క. ధన ముఖ్యము కేవల మే, పనికిన్ రాచాస్థగలిగి ♦ పలువురు ప్రభువు
ల్పని సేయక తద్వశ్యం, బునకు నలోభానృశంస్య ♦ ముల్ ఋతముఁ జెలుల్.

టీ. పలువురు = పెక్కండ్రైన, ప్రభువులు = గొప్పయుద్యోగస్థులు, పని సేయక = ముందునిలువంబడి శ్రద్ధతోఁ గార్యమొనర్పక, ధనముఖ్యము = ధనప్రాధాన్యము, కేవలము = ముఖ్యముగా, ఏ పనికిన్ రాదు = ఏ ప్రయోజనమునకును రాదు, తద్వశ్యంబునకున్ = వారు స్వాధీనులౌటకు, అలోభ = లోభరాహిత్యమును, అనృశంస్యముల్ = క్రౌర్యరాహిత్యమును, ఋతమున్ = సత్యమును, చెలుల్ = స్నేహితులును, (ఉండవలయునని యధ్యాహారము.)

తా. అనఁగా రాజునకు ధనమాత్రముండి యుపయోగింపదు, గొప్పవారిసాహయ్యము ముఖ్యముగ నుండవలయును గాన వారు స్వాధీను లగుటకై యౌదార్యమును, క్రౌర్యము లేకను, సత్యప్రవర్తనమును గల్గి మిత్రులతోఁగూడి యుండవలయు ననుట.

క. భాండాగారహయాద్యము, లుండియు నను వగుమనుష్యుఁ ♦ లొదవమి నవియు
ద్యుమ్మండలము నవయ నరికొది, గుండినసింహాసనంబు ♦ లుర్వి న్విననే. ౨౧౭.

టీ. భాండ=మూలధనముయొక్క, అగార=గృహమును, (భాండాగారమనుట) (స్యాద్భాండమశ్వాభరణే మంత్రేమూల వణిగ్ధనే యని యమరము) ఇచట వణిగ్ధనము గాకుండినను మూలధనమాత్రమనెడి ప్రయోగము) హయాద్యములు=గుఱ్ఱములు మొదలగునవి; ఉండియున్=ఉండినను, అనవగుమనుష్యులు=తగినమనుజులు, ఒదవమిన్=లేనందువల్లను, అవియున్=ఆయర్థబలములు రెండును, మండలమున్=రాష్ట్రమును, నవయన్=నశించిపోఁగా, అరికి=శత్రువునకు, ఒదిగుండిన=మూలవీగుచున్న, సింహాసనంబులు=వానినధిష్ఠించు రాజులను, (అనఁగా సంస్థానముల ననుట) ఉర్విన్=భూమియందు, వినమే=వినకున్నామా; (అనఁగా నెవ్విధంబున నయినను మంచి మనుష్యులం గూర్చికొనియుంట యుక్తమనుట.)

తే.గీ. బాహుజాంఘ్రిజముఖవిడం◆బనకునయిన, గొలిచి మనువిప్రధర్మంబు◆దెలిసియైన
బూనిసంకటములనిల్చుఁ◆గాన దఱచు, బ్రాహ్మణునిఁబ్రభుఁజేయుటఁ◆పతికిహితము.

టీ. బాహుజ=క్షత్రియులును (మూర్ధాభిషిక్తో రాజన్యో బాహుజః క్షత్రియో విరాట్టని యమరము) అంఘ్రిజ=శూద్రులును, ముఖ=మొదలగువారిని, విడంబనకు నయినన్=అనుకరింపవలయుననియైనను, కొలిచి=పూర్వమందు రాజసేవయొనర్చి, మను=కాలమునుగడపిబ్రదుకుచున్న, విప్ర=బ్రాహ్మణులయొక్క, ధర్మంబున్=ఆచారమును, తెలిసియైనన్=గ్రహించియైనను, అతఁడు=ఆవిప్రుఁడు, సంకటములన్=ఇక్కట్టువేళలయందు, పూని=వహించుకొని, నిల్చుఁగానన్=నిలువంబడుచున్నాఁడుగనుక, పతికిన్=రాజునకు, తఱచు=విస్తారముగా, బ్రాహ్మణునిన్=విప్రుని, ప్రభుఁజేయుట=అధికారిగానియమించుట, హితము=అనుకూలము.

తా. సుగమము.

ఉ. ఆయతికాని కీవు మమ◆రాలయముఖ్యము లాతఁ డర్థతృ
ష్ణాయుతుఁడై నిజోర్వి నగు◆నష్టికి దద్ధనముం దొరల్చి యా
జాయతనంబుఁ జేర్చు మఱి◆యట్టి దపథ్యము దాన నొంటిగాఁ
దే యధికారి గావలయు◆నించుక తిన్నను వాఁడె రూపఱున్. ౨౧౯.

టీ. ఆయతికానికిన్=ధనమురాఁబట్టువానికి, అమరాలయముఖ్యములు=దేవాలయము మొదలగువానిని, (అనఁగా దేవబ్రాహ్మణ జీవనాధికారముల ననుట) ఈకుము=ఇయ్యకుము, ఆతఁడు=ఆయుద్యోగస్థుఁడు, అర్థతృష్ణాయుతుఁడై=ద్రవ్యాశతోఁగూడినవాఁడై, నిజోర్వినగునష్టికిన్=తానుద్యోగముఁ జేయునట్టి దేశమున కైన నష్టికి, తద్ధనమున్=ఆదేవబ్రాహ్మణులయొక్క ద్రవ్యమును, దొరల్చి=పూరించి, రాజాయతనంబున్=నృపునియింటిని, చేర్చున్=చెందించును, మఱి=అనంతరమందు, అట్టిది=ఆదేవ

బ్రాహ్మణద్రవ్యప్రాప్తి, అపథ్యముగానన్ = రాజునకుఁగీడుగావున, ఒంటిగాఁడె = ఒక్కఁడె, అధికారిగావలయున్ = ఉద్యోగస్థుఁడుగా నుండవలయును (దేవబ్రాహ్మణ ద్రవ్యలేశము గలసినను రాజునకుఁ బాతకముగాన నది కలియకుండునట్లధికారిని వేఱుగా నేర్పఱచుట యుక్తం బనుట) ఇంచుకతిన్నను = అట్లు నియమింపఁబడినవాఁడు కొంచెము భక్షించినను, వాఁడె = ఆదేవబ్రాహ్మణ వృత్త్యధికారియే. రూపఱున్ = నశించిపోవును.

చ. మును దనసీమ చేసికొని ♦ ముల్లిడి గ్రుచ్చట వెండి చేనిమొ,
త్తనకయి వేరు వెల్లఁకియుఁ ♦ ద్రవ్వెడు కర్షకునట్లు శత్రుతోఁ,
నెనసి యయ్యైనదుర్గబల ♦ మేకొనియైన నిజాత్మ చింతలే,
క నెగడఁ జేసి లోన మఱి ♦ కంటకశోధనఁ జేయు టొప్పగున్.

టీ. (రాజైనవాఁడు) మును = ప్రథమమందు, తనసీమచేసికొని = తనయావరణము కావించికొని, ముల్లిడి = చుట్టుగంపవేసి, వెండి = మఱియును, గ్రుచ్చటన్ = గ్రుచ్చుటచేతను, చేనిమొత్తనకయి = వరిమొదలగునవి ఫలించునట్టి ప్రదేశముననున్న నున్నమ్మరువగుటకై, వేరు = వృక్షాదులమూలమును, వెల్లఁకియున్ = మోట్లును (జాత్యేకవచనము) త్రవ్వెడు = ఖననముచేయుచున్న, కర్షకునట్లు = కాఁపువానివలెను, శత్రుతోన్ = పగతునితోడను, ఎనసియయ్యైన = కపటస్నేహము చేసియైనను, దుర్గబలమేకొనియైనన్ = స్థలజలాది దుర్గములం గైకొనియైనను, తనసీమచేసికొని = రాష్ట్రముతనయధీనముచేసికొని, నిజాత్మ = తనహృదయమును, చింతలేక = పరునిచేత నుపద్రవముకలుగునను విచారములేక, నెగడజేసి = ఒప్పఁజేసి, లోనన్ = ఆ రాజ్యమందు, మఱి = పిమ్మటను, కంటకశోధనన్ = క్షుద్రశత్రునిరసనమును. (సూచ్యగ్రే క్షుద్రశత్రౌచ రోమహర్షేచ కంటక యని యమరము) చేయుటొప్పగున్ = చేయుటయుక్తము.

తా. రాజ్యమును స్వాధీనము చేసికొనకయె క్షుద్రశత్రు నిరసనము చేయఁగూడ దనుట.

క. మొదలనె యొరుదలఁకానిం, జెదరంగా నాడ కాత్మఁ ♦ జింతింపు పదిం,
బదిగ మృష యేని మఱి విడు, ముదస్థుఁగాఁగాక యుండు ♦ నొక్కఁడమతమునన్.

టీ. ఒరుదలఁకానిన్ = పిశునుని, (కొండెగాని ననుట) మొదలనే = ప్రథమమందె, చెదరంగానాడక = చెదరిపోవునట్లు చెప్పక, ఆత్మన్ = మనస్సునందు, పదింబదిగన్ = లెస్సగా (వదిపర్యాయములనుట) చింతింపుము = విచారింపుము, మృషయేని = అబద్ధమాయెనా, మఱి = పిమ్మట, ఒక్కఁడమతమునన్ = ఒకపక్షమునను, ఉదస్థుఁగాఁగాక యుండన్ = పరాభూతుండు గాకుండునట్లు, విడుము = వదలుము.

తా. కొండెగాండ్రు మాలనాడిన రాజునను రహస్య వృత్తాంతములు తెలియవు గనుక చెదరనాడఁగూడ దనుట.

క. ధరణి నసాధ్యనగాటవు, లిరవుగ భూపీడ సేయుఁ ♦ నెఱుకుల పొరుగూ
ళ్లిరవుగ నస్థితిశూరుల, కెరవుగ నిచ్చునది మిథము ♦ నెట్లయిన నురుఁ. ౨౨౨.

టీ. ధరణిన్ = భూమియందు, అసాధ్య = సాధింపనలవిగాని, నగ = కొండలును, అటవులు = అరణ్యములును, ఇరవుగన్ = టెంకిచేసికొని, భూపీడసేయు = భూమికుపద్రవము చేయుచున్న, ఎఱుకుల = ఈ పేరుగల నీచజాతివాండ్రయొక్క. పొరుగూళ్ళు = సమీపగ్రామములను, అస్థితి = స్థితిదప్పినటువంటి, శూరులకు = శౌర్యముగలపురుషులకు, (విదేశములనుండి స్థితిదప్పివచ్చిన శూరులకనుట) ఇరవుగన్ = ఉనికిపట్టుగా, ఎరవుగన్ = మనోవృత్తికిగాను, ఇచ్చునది = ఇయ్యవలయును, మిథమున్ = పరస్పరమును, ఎట్లయినన్ = స్పర్థచేతనేలాగైనను, ఉరున్ = మేలగును.

తా. ఇట్లొనర్చితివేని వైదేశికులైన శూరులు దెగినను మిగుల హానిలేదు, ఆటవికులు దెగిరేని యది మిక్కిలియు మేలౌ ననుట.

వ. విశేషించియు నప్పార్వతీయబలంబు లోనం గూడుకొన్న రాజునకుఁ బ్రజాబాధ దఱుఁగదెట్లేని బెదరు వాపి వారలం జేకూర్చుకొన వలయు నవిశ్వాసంబును విశ్వాసంబును నలుకయు నెలమియు నతివైరంబును నత్యానుకూల్యంబును నల్పు లగుట నల్పంబునన యగు నెట్లంటేని. ౨౨౩.

టీ. విశేషించియున్ = మిగులను, అప్పార్వతీయబలంబు = అయ్యాటవికసేన, లోనం గూడుకొన్నన్ = అడవిలో మెండైయుండెనా, రాజునకు = మండలాధిపతికి, ప్రజాబాధదఱుగదు = జనపీడతక్కువపడదు (రాజునకుం దిరుగంబడి పోరులేక వాని దేశమునకుపద్రవము చేయుచుందురనుట) ఎట్లేనిన్ = ఏలాగైనను, బెదరువాపి = జడుపుఁదీర్చి, వారలన్ = ఆయాటవికులను, చేకూర్చుకొనవలయున్ = అనుకూలము చేసికొనవలయును, అవిశ్వాసంబును = నమ్మకపోవుటయును, విశ్వాసంబును = నమ్ముయుటను, అలుకయున్ = కోపమును, ఎలమియున్ = ఆర్ద్రహృదయత్వమును, అతివైరంబున్ = అత్యంతవిరోధమును, అత్యానుకూల్యంబును = అత్యంతసహకారిత్వమును, అల్పులగుటన్ = తుచ్ఛజాతులగుటవల్లను, అల్పంబునన = స్వల్పకార్యముచేతనే, అగున్ = కలుగును, ఎట్లంటేని = ఏవిధంబంటివా.

శా. విల్లుం దానును భిల్లుఁ డొక్కఁ డరుగ ♦ న్వెం బింట దుగ్ధాన్నము,
న్భిల్లుం డన్యుఁడు వెట్ట నారయిడుక ♦ న్వీక్షించి దొబ్బంచు వాఁ,
డెల్ల న్వమ్ముగఁ జేసితి న్ననుపరా ♦ నెందేఁ దెగం జూడఁగా,
నుల్లంబై చన నంపునార చెడునా ♦ నూహించి పో నంపఁడే. ౨౨౪

టీ. విల్లుందానును = వింటిబద్దయును దానును, (విల్లుచేతఁబుట్టియనుట) భిల్లుఁడొక్కఁడు = ఒక బోయవాఁడు, అరుగన్ = పోఁగా, భిల్లుఁడన్యుఁడు = మఱియొక

బోయవాఁడు, ఇంటన్ = తనగృహమందు. దుగ్ధాన్నమున్ = పాలన్నమును, విందు = ప్రీతిపూర్వకమైనభోజనమును, పెట్టన్ = ఇడఁగా, నారయుడుకనిన్వీక్షించి=వానియింటుజానకి త్రాటికొఱకై ప్రొయిమీఁదఁ బక్వమగుచున్న సట్టతాటలనై నెట్ట్రఁగాఁబొంగిన నీటిఁజూచి, దొబ్బంచు = మాంసమని యెంచి, (ఇది తనకుఁబెట్టకపోయెఁ గదాయని కొంచెపుపనిగా విచారించి కోపించియనుట) వాఁడు = అతఁడు, ఎల్లన్ = దీనినంతయును, వమ్ముగఁజేసి = వ్యర్థపఱచి, తన్నుసపరాన్ = వాఁడు దన్నను పుటకొఱకుఁ గొంతదూరముఁరాఁగా, ఎందేన్ = ఎక్కడనైనను, తెగంజూడఁగాన్ = చంపఁదలఁపఁగా, ఉల్లంబై = మనస్సుగలవాఁడై, చననంపుము = పోనంపుము, నారచెడునాన్ = ప్రొయిమీఁద నుడుకఁబెట్టివచ్చినత్వక్కు చిమిడిపోచున్నదని చెప్పినంతఁగా, ఊహించి= ఆ పిమ్మట నుడుకునదినారగాని మాంసముకాదని వితర్కించి చేసికొనంపఁడే = పోవునట్లు సెలవిచ్చి పంపఁడా, (చంపకయె పోనిచ్చెననుట).

తా. అల్పుల కతినైరాత్యానుహాల్యము లల్పకార్యమువల్లనే పుట్టుచున్నవని భావము.

క. ఆపాలుగూటనే నిజ, మేపాటియుఁ దప్ప రాడ ♦ రే నెరసునఁ గొం,
తేపాటి గన్న నలుగుదు, రీపని యెంతనక వెడఁగు ♦ లెద నాటవికుల్. ౨౨౫.

టీ. ఆటవికుల్ = భిల్లపుళిందాదులు, ఆ పాలుగూటనె = ఆ క్షీరాన్నముఁ బెట్టుటచేతనే, ఆడిరేన్ = పలికిరా, నిజమేపాటియుఁ దప్పరు = తామాడినయథార్థమైన పలుకు నెంతమాత్ర మతిక్రమింపరు, నెరసునన్ = తప్పిదము విషయమై, కొంత = కొంచెము, ఏ పాటిగన్నన్ = ఏ మాత్రము చూచినను, ఈపని = ఈ కార్యము, ఎంతనక= ఎంతమాత్రమని యెంచక, వెడఁగుటెదన్ = వెఱ్ఱిమనస్సుచేతను, అలుగుదురు = కోపగింతురు.

తా. బోయవాండ్రు మొదలగు నల్పజనులు స్వల్ప కారణములంబట్టి ప్రసాదనిగ్రహములు గలవారగుదురుగాని గొప్పకార్యములకుఁ దగినట్లు గొప్పగా యోజింపరనుట.

తే. గీ. ఆటవికవశ్యకలనస ♦ త్యమున నైరి, మనుజపతిమైత్రి దూతస ♦ మ్మానమునను,
గూర్మి దఱిభృతిఁ గాల్వుర ♦ కును సపారి, తోషికపుసేవ నెలమి రా ♦ తులకుఁగలుగు.

టీ. ఆటవిక = పుళిందాదులయొక్క, వశ్యకలన = స్వాధీనకరణము, సత్యమునన్ = యథార్థమువచించుట చేతను, కలుగున్ = అగును, (సత్యవాక్యముననే వశ్యులగుదురనుట) వైరి = శత్రువైన, మనుజపతి = నృపునియొక్క, మైత్రి = స్నేహము, దూతసమ్మానమునన్ = వారిరాయబారులను బహుమానించుటచేతను, కలుగున్ = సంభవించును, తఱిన్ = కోరిన సమయమందు, భృతిన్ = జీతమిచ్చుటచేతను, కాల్వు

రకును = పదాతులకు, హార్ది = మైత్రి, కలుగున్ = సంభవించును, (భృతిర్భరణమూల్యయోాయని రత్నమాల) సపారితోషిక పుసేవన్ = బహుమానములతోఁగూడఁ గొలిపించుకొన్నందువల్లను, రౌతులకున్=అశ్వారోహకులకు, ఎలమి=సంతోషము, కలుగున్=సంభవించును.

తా. రాజైనవాఁడు సమయములనుబట్టి వారివారికిం దగినట్లు నడపింపవలయుననుట.

క. మేలగుఘోటకమును శుం, డాలంబును నాప్తసుభటు ♦ నకె యిమ్ము తఱి,
మ్మే లగుమేపున మందుర, బాలింపుము దొరలపాలు ♦ పఱుపకు మెపుడున్. ౨౨౭.

టీ. తఱిన్ = ఆయాసమయములయందు, మేలగుఘోటకమును = గొప్పయశ్వమును, శుండాలంబును = ఏనుంగును, మందురన్ = వాజిశాలయందు, (వాజిశాలాతు మందురాయని యమరము. ఇది గజశాలకు నుపలక్షణము) మేలగుమేపునన్ = మంచి మేతచేతను, పాలింపను = సంరక్షింపను, ఆప్త= ఇష్టుఁడైన, సుభటునకె = మంచి రౌతునకె, ఇమ్ము = ఒసంగుము, ఎపుడున్ = ఏ సమయమందును, దొరలపాలుపఱుపకుము = గొప్పయధికారులవశము చేయకుము.

తా. గజాశ్వాదులకు సుఖరక్షణము చేయఁదలంచితివేని దానినొప్పి నెఱుంగక యారోహణముఁజేయునట్టి గొప్పయుద్యోగస్థుల కధీనముచేయక యాప్తుఁడైన బంటున కధీనము సేయుమనుట.

తే, గీ. కార్య మొకఁ డుఁడు గనిన మాత్సర్యమున నొ,
కండు గా దని ఖండించుఁ ♦ గన్నెఱింగి,
యిరువురను గా దనక కొల్వు ♦ విరిసి మీఁద,
నల్లవాఁ డెన్నినది సేయ ♦ నగు శుభంబు. ౨౨౮.

టీ. ఒక్కఁడు = ప్రధానపురుషుఁడు, కార్యము = పనిని, కనినన్ = తెలిసిప్పఁగా, మాత్సర్యమునన్ = అట్లుచెప్పిన వానిమీఁది ద్వేషముచేతను, ఒకండు = ఱియొకఁడు, కాదనిఖండించున్ = అతఁడు చెప్పినట్లు కాదని భంగపఱచును, కన్నెంగి = వారిద్దఱిలోని యాలోచనక్రమమునెఱింగి, ఇరువురను = ఆలాఁగున జెప్పినారిద్దఱను, కాదనక = నిషేధింపక, కొల్వువిరిసి = సభఁజాలించి, మీఁదన్ =పిమ్మను, అల్లవాఁడు=మాత్సర్యములేక తొలుతహితముఁ జెప్పినవాఁడు, ఎన్నినదెచేయన్=చారించిన కార్యమునేచేయఁగా, శుభంబు = మంగళము, అగున్ = ఔను.

తా. సుగమము.

పగ వెలిఁ గని లోదస్యులఁ, జిగురింపఁగఁ జేసి నృపతి ♦ చిక్కఁ పడఁ బను,
లైగి సేయుక తా రేచి, కుక్కఁగ నడతు రశంక నల్లి ♦ కొనిదుస్సచివుల్. ౨౨౯.

టీ. పగవెలిఁగని = రాజునకు సమనంతరదేశమునందుండునట్టి విరోధుల నుండఁ జూచి, లోదస్యులన్ = స్వరాష్ట్రమునందలి క్షుద్రశత్రువులను (దస్యుశాత్రవశత్రవయని యమరము) చిగురింపఁగన్ = పల్లవింపఁగా, చేసి = ఒనర్చి, నృపతి = రాజు, చిక్కుపడన్ = గ్రహింపఁబడునట్లు, పనుల్ = రాచకార్యములను, తెగిచేయక = సాహసించి యొనర్పక, తా రేదిక్కుగన్ = వేఱుమంత్రులులేక రాజునకుఁ దామేయాధారమగునట్లు, దుస్సచివుల్ = దుష్టమంత్రులు, అశంకన్ = భయములేనట్లు, అల్లుకొని = కొందఱంగట్టుకొని, (ఏకీభవించియనుట) నడతురు = ప్రవర్తింతురు, (కావున నట్టిదుర్మంత్రులు లేక యుండునట్లుగఁ బ్రభుత్వము సేయవలయుననుట).

క. ఇప్పింతు రాత్మ వశులకుఁ, దప్పింతురు పరుల కాడి ♦ తప్పింతురు రా,
జిప్పగిది వాఁడె యని వే, చెప్పినఁ బెరవారు నమ్మి ♦ చేరక యుండన్. ౧౩౦

టీ. ఆత్మవశులకున్ = తమకు స్వాధీనులై యుండువారలకు, ఇప్పింతురు = వలయువస్తువుల నియ్యఁజేయుదురు, పరులకు = తమకనుబంధములేనివారలకు, తప్పింతురు = ఇయ్యకుండునట్లు చేయుదురు, ఆడితప్పింతురు = రాజు పలికినమాట దొలగునట్లు చేయుదురు, వే = వేయివిధములుగా, చెప్పినన్ = పలికినను, రాజు = ఱేఁడు, ఇప్పగిదివాఁడెయని = ఈలాగునఁజెప్పి తప్పెడువాఁడేయని, పెరవారు = అన్యులెవ్వరును, నమ్మి = విశ్వసించి, చేరకయుండన్ = దగ్గఱవచ్చి చేరకుండునట్లు, రాజుచేత నాడి తప్పింతురని క్రిందికన్వయము.

తా. సుగమము.

ఆ. వె. వాఁడిఁ బొదలు జఠర ♦ వైశ్వానరుఁడు గఫ, ప్రముఖదోషయుక్తి ♦ బలిమిచెడిన,
వెలి మహౌషధంబు ♦ బలమిచ్చుగతిఁ బ్రతి, సేయవారిమదముఁ ♦ జెఱుచుఁ బరుఁడు.

టీ. వాఁడిన్ = తైక్ష్ణ్యముచేతను, పొదలు = ప్రబలుండైన, జఠరవైశ్వానరుఁడు = జఠరాగ్ని, కఫప్రముఖదోషయుక్తిన్ = శ్లేష్మాదిదోషసంబంధముచేతను, బలిమిచెడిన్ = సత్వహీనుఁడు కాఁగా, వెలిన్ = వెలుపలనున్న, మహౌషధంబు = శ్రేష్ఠమైన భైషజ్యము, బలమిచ్చుగతిన్ = జఠరాగ్నికి సత్త్వముగలుగఁజేయునట్టుంబలె, ప్రతిసేయన్ = బదులుగా నొకసమర్థుని నియమింపఁగా, పరుఁడు = ఆ యధికారమునకు వచ్చినపురుషుఁడు, వారి = ఆ దుర్మంత్రులయొక్క, మదముఁజెఱుచున్ = అహంకారమడంచును.

తా. సుగమము.

వ. వారి మిగిలి ప్రతి సేయ నెట్లం టేని,

టీ. వారిమిగిలి = పూర్వమునందున్న యామంత్రుల నతిక్రమించి, ప్రతిసేయ నెట్లు = ఏలాగున నితరపురుషునఁ దేవచ్చునన్న, అంటేని = ఈలాగంటివా చెప్పెదను.

క. భండారముతో హయమద, శుండాలఘటాళి దనదు ♦ సొమ్మై పాగా,
నుండిన నంతటఁ బాయదె, పండితుఁడును బిరుదునైన ♦ పతికిని బయలై. ౨౩౩.

టీ. భండారముతో = బొక్కసముతోడను, హయ = గుఱ్ఱములయొక్కయు, మదశుండాల = మదపుటేనుఁగులయొక్క, ఘట = గుంపులయొక్కయు, ఆళి = వరుస, తనదుసొమ్మై = తనయధీనమై, పాగానుండినన్ = శాలయందుండఁగా, అంతటన్ = అటుపిమ్మటను, పండితుఁడును = ఎఱుకగలవాఁడును, బిరుదునైన = శూరుఁడునైనటువంటి, పతికిన్ = రాజునకు, బయలై = దుర్మంత్రివ్యాపారము నివృత్తమై, పాయదె = పోదా, (పోవుననుట)

తా. సుగమము.

క. కుడుపున నొకకడి తఱిఁగినఁ, జెడఁ జూచుటె కాక పతికిఁ ♦ జెలియుఁ గలఁడే
యిడ నని విడువం జెల్లునె, నడప వలయు నేర్చినట్లు ♦ నమ్మకయె కృపన్. ౨౩౪

టీక. కుడుపునన్ = భోజనమందు, ఒకకడి = ఒక్కకబళము, తఱిగినన్ = తక్కువపడఁగా, చెడఁజూచుటె కాక = రాజునకుఁ జెఱుపుతలంచువారే కాని, పతికిన్ = రాజునకు, చెలియున్ = మిత్రుఁడును, కలఁడె = ఉన్నాఁడా, ( లేఁడనుట ) ఇడనని = ఈలాంటి వీరులకుఁ బెట్టనని, విడువన్ = త్యజించుట, చెల్లునె = తగునా, ( విడువంగూడదనుట ) నేర్చినట్లు = తగినయట్లు, నమ్మకయె = వారియందు మనంబున విశ్వాసముంచకయె, కృపన్ = దయచేతను, నడపవలయున్ = పోషింపవలయును, ( సేనకులకుఁ దక్కువపడనట్లు పోషింపకున్న స్వప్రయోజనములు జరగవుగానఁ జక్కఁగాఁ బోషింపవలయుననుట ).

చ॥ ఒకటికి రోయ కుంటఁ గను ♦ మున్నవి యుం ద్రుపదుండు మారణే,
ష్టికిఁ బసిఁ జూపి వేఁడ ముని ♦ సింహుఁ డొకండు తమన్న వేల్పుఁబం,
డొకఁ డపవిత్రభూమిఁ గని ♦ యొల్లక యే చనఁ దా గ్రహించె రో,
య కనియెఁ గాన నక్కఱఁగ ♦ నొఁ జను సర్వముఁ గాన శక్యమే. ౨౩౫

టీక. ఒకటికిన్ = ఒకయకృత్యమునకు, రోయకుంటన్ = అసహ్యపడకుండుట చేతను, ఉన్నవియున్ = తక్కినవడవడికలను, కనుము = తెలిసికొనుము, ద్రుపదుండు = పాంచాలుండు, మారణేష్టికిన్ = హింసారూపమైన హోమమునకై, పసిన్ = పెక్కు గోవులను, చూపి = అగపరచి, వేఁడన్ = ఇచ్చెదనని ప్రార్థింపఁగా, మునిసింహుఁడొకండు = ఉపయాజులనే మునిశ్రేష్ఠుండొకండు, ( స్యురుత్తరపదే వ్యాఘ్రపుంగవర్షభకుంజరాః, సింహశార్దూలనాగాద్యాః పుంసిశ్రేష్ఠార్థగోచరాయని యమరము ) తమన్న వేల్పున్ = తమజ్యేష్ఠభ్రాతయైన యాజుఁడు పాపకర్మమునరోయక హోమముసేయును, బెట్టుంబేని, పండొకఁడు = ఒకఫలమును, అపవిత్రభూమిన్ = అపరిశుద్ధస్థలమందు,

కని=పడియుండఁగాఁజూచి, ఒల్లక = ఆఫలమునుగ్రహింపక, నేన్ = నేను, చనన్ = ఆవలికిఁబోఁగా, తాన్=మాయన్నయైన యాజుఁడు, రోయక = ఏవగింపక, గ్రహించెన్ = పుచ్చుకొనెను, అనియెఁగానన్ = అలాగనెనుగనుక, (అనఁగాఫలాపేక్షగలవాఁడుగనుక నాయనయొద్దకువెళ్లిన నీమారణయజ్ఞమును జేయించునుగాన నచ్చటికివెళ్లుమని ద్రుపదునితోఁ బల్కెనుగనుకననుట) అశ్లోటుఁగనొన్ = స్థాలీపులాకన్యాయముచేత నశ్లోటుంగవలయును, చనుసర్వమున్ = జరగువానినన్నిటిని, కానన్ = పరీక్షించిచూచుట, శక్యమె=సాధ్యమా. (కాదనుట)

తా. సుగమము.

కం. వీఁ డెడరునఁ గీ డెన్నిన, వాఁ డని జయ మైన హింస ♦ వదలఁగ నుము శ్రీ,
పోఁడి మహి యేమి గొఱబ, ల్వాఁడి సెడిన నట్టి దయకు ♦ వైరి నమ్మున్.

టీక. వీఁడు = ఈపురుషుఁడు, ఎడరునన్ = ఇక్కట్టుసొకకడి నందు, కీడు= అనిష్టమును, ఎన్నినవాఁడని=తలంచినవాఁడని, (గూఢశత్రువునకు సంబంధుండైన బలవద్విరోధియనుట) జయమైనన్=ఉపాయముచేత గెలిచినపిమ్మటను, హింసవదలి = చంపఁదలఁపక, శ్రీ = ఐశ్వర్యముయొక్క, పోడిమి = అతిశయమును, కొనుము=హరింపుము, అహి = పాము, కొఱబల్వాడిసెడిన్ = పంటితైక్ష్ణ్యమడంగినపిమ్మటను, ఏమికొఱ = ఏమిచేయఁగలదు, వైరియన్=శత్రువును, అట్టిదయకున్=అటువంటివిరోధిని జంపకవిడిచినకృపకు, నమ్మున్ = విశ్వసించును, (హింసాపరుఁడు గాకుండెనేని శత్రువైనను నమ్ముననుట).

తే.గీ. దేశవైశాల్య మర్థసి ♦ ద్ధికిని మూల, మిల యొకింతైన గుంటగా ♦ ల్వలు రచించి,
నయము పేదకు నరిఁ గోరు ♦ నను నొసంగి, ప్రబలఁ జేసినన ర్థధ ♦ ర్మములు పెరుఁగు

టీక. దేశవైశాల్యము, దేశ = రాష్ట్రముయొక్క, వైశాల్యము = విప్పుగల్గుట, అర్థసిద్ధికిన్ = ధనాదాయమునకు, మూలము = హేతువు, ఇలయొకింతైనన్ = (అట్లువిస్తారముగాక) భూమికొంచెమైనను, గుంట=తటాకములు, కాల్వలు=వరుదకాలువలు, రచించి=కలుగఁజేసి, పేదకున్=దరిద్రుఁడైన కాఁపువానికి, అరిన్=పన్నునందును, కోరునను=వారకమందును, నయము=మేలు, ఒసంగి=కలుగఁజేసి, ప్రబలన్ = వృద్ధిబొందునట్లు, చేసినన్ = ఒనర్చినట్లాయెనా, అర్థధర్మములు = ధర్మార్థములు, పెరుగున్ =వృద్ధినొందును.

తే.గీ. ప్రజ లవసి చన్నఁబిలువక ♦ ప్పసులఁ గొలుచు, నమ్మి యిం డ్లింధనంబున ♦ కాయెన నెడు,
కలనిన కైకొనయధికారి ♦ గలనృపతికి, నేఁడుదీవులు గొన్న స ♦ మృద్ధి లేదు. ౨౩౮.

టీక. ప్రజలు = తన రాష్ట్రమునందలిజనులు, అవసి = నొగిలి, చన్నన్ = లేచిపోఁగా, పిలువక=మరలవారిని నొడంబఱచి వెంటఁబెట్టుకొనిరాక, అప్పసులన్ = వారి

పశువులను, కొలుచుఁ = ధాన్యమును, అమ్మి = విక్రయించి, ఇండ్లు = వారిగృహములు, ఇంధనంబులకాయెఁ = వంటచెఱకునకొదిగెను, అనెడు = అనునట్టి, కలనినక్కైన = పోరిలోని జంబుకమువలె నశుభమును గోరుచున్న, అధికారిగల = ఉద్యోగస్థుఁడు గల్గినట్టి, నృపతికిఁ = రాజునకు, ఏడుదీవులు = సప్తద్వీపములను, కొన్నఁ = గ్రహించినప్పటికిని, సమృద్ధిలేదు = సంపదసేకూరదు.

తా. సుగమము.

మహాస్రగ్ధర. ఉరు వాచాగంబు భోగం ♦ బుభయము నొకపా ♦ లుగ్రసేనావనార్థం,
బిరువా ల్నిండారుభండా ♦ రిలు చొర నొకపా ♦ లిట్లుగా నాయ ముప్పం,
జరదృష్టి న్వైరిపక్షే ♦ క్షణము సచివము ♦ ఖ్యస్వపక్షేక్షణంబుం,
ధరణీనాథుం డొనర్పం ♦ దగుఁ దగు దునుమం ♦ దస్కరాళి న్నిజోర్విన్.

టీక. రాజు దనకువచ్చునట్టి యాయతిని నాలుగుపాళ్లుచేసి ఉరువా = అధికమైన, చాగంబు = త్యాగమును, (ఇది త్యాగశబ్దభవము) భోగంబు = స్వానుభవమును, ఉభయమున్ = రెంటికిని, ఒకపాలు = ఒకభాగము, ఉగ్ర = ప్రతాపశాలియైన, సేనా = చతురంగబలముయొక్క, అవనార్థంబు = రక్షణముకొఱకు, ఇరువాల్ = రెండుభాగములును, నిండారు = సంపూర్ణమయిన, భండారిలు = కోశాగారమును, చొరన్ = ప్రవేశించుటకై, ఒకపాలు = ఒకభాగమును, ఇట్లుగాన్ ఈచతుష్ప్రకారములుగా, ఆయముప్పన్ = అర్థాగమమేర్పడియుండగా, (అర్థాగమో భవేదాయయని యమరము) చరదృష్టిన్ = చారులనియెడు నేత్రముచేతను, (అపసర్పశ్చరస్స్పశయనియమరము). వైరిపక్షేక్షణము = శత్రుపార్శ్వదర్శనమును, సచివముఖ్యస్వపక్షేక్షణంబున్ = మంత్రులులోనగు స్వపక్షజనదర్శనమును, ధరణీనాథుండు = రాజు, ఒనర్పందగున్ = చేయఁదగును, నిజోర్విన్ = తనరాజ్యమునందు, తస్కరాళిన్ = దొంగలగుంపును, తునుమందగున్ = చంపుటయోగ్యమగును.

కం. లాలన నారక్షులగమి, నేలి తెలిసి ముచ్చు నాజ్ఞ ♦ యిడ కతఁడు చెరం,
బో లాఁతి నిడ నయశ మెం, తే లేవదె శూలపృథువ ♦ ణిజ్న్యాయమునన్. ౨౮౦.

టీక. లాలనన్ = బహుమానముచేతను, ఆరక్షుల = తలవరులయొక్క, గమిన్ = గుంపును, ఏలి = పోషించి, తెలిసి = ఎఱిఁగి, ముచ్చున్ = దొంగను, ఆజ్ఞయిడక = వెంటనెశిక్షింపక, చెరన్ = బందిఖానాలోనుండి, అతఁడు = ఆదొంగ, పోన్ = పాఱిపోఁగా, లాతినిడన్ = వాఁడుపలాయితుఁడైనందునఁ దలవరులుతమకాజ్ఞవచ్చునని యన్యునిందెచ్చి, యాచెరసాలలోనుంచఁగా, శూలపృథువణిజ్న్యాయమునన్ = కొఱ్ఱవేయఁబడిన పెద్దకోమటిశెట్టి న్యాయమువలెను, అయశమెంతేలేవదే = అపకీర్తియధిక

ముగ రాదా, (వచ్చుననుట) అదెట్లన్ననపరాధముఁ జేసినవానిం గొఱ్ఱువేయునట్లాక వివేకములేని రాజాజ్ఞ చెయ్యఁగా గొఱ్ఱువేయునవసరంబునఁ బెద్దకొఱ్ఱియందపరాధిని వేయునెడఁదగియుండదు చూడవచ్చినయీపెద్దకోమటిసెట్టి తగియున్నాఁడని యొకఁడు చెప్పఁగా యుక్తమనియెంచి యట్లుపెద్దసెట్టినే కొఱ్ఱువేయించిన రాజునకెంత యపకీర్తిగలిగెనో యంత యపకీర్తి గల్గుననుట.

చ. ఎఱుఁగ నగు న్స్వశక్తి నవ ♦ నీశుఁడు నాలుగుపాళ్లు మూఁడుపా,
ళ్లెఱుఁగక మోచినట్టిపని ♦ కిష్టసుహృత్తతి దెల్ప నొక్కపా,
లెఱుఁగ నగు న్నయాఢ్యమతి ♦ నిట్లు నిరాగ్రహుఁడైనఁ జేయునె,
త్తఱిను పదుగ్రదణ్డపర ♦ తంత్రుఁడు గాక చిరంబు రాజ్యముల్. ౨౪౮

టీక. అవనీశుఁడు = రాజు, నాలుగుపాళ్లన్ = తెలియందగిన నాలుగంశములయందు, స్వశక్తిన్ = తనసామర్థ్యముచేతను, మూఁడుపాళ్లు = మూఁడంశములను, ఎఱుఁగనగున్ = తెలియఁదగును, ఎఱుఁగక మోచినట్టిపనికి = ఎఱుకపడనట్లు దాచియుంచినవిషయమునకు, ఇష్ట = ఆప్తులైన, సుహృత్తతి = మిత్రబృందము, తెల్పన్ = ఎఱుకచేయఁగా, ఒక్కపాలు = ఆనొకభాగమును, ఎఱుఁగనగున్ = తెలిసికొనవలయును, నయాఢ్యమతిన్ = నీతియుక్తమైన బుద్ధిచేతను, ఇట్లు = ఉక్తప్రకారముగా, నిరాగ్రహుఁడైనన్ = కోపములేనివాఁడాయెనా, ఎత్తఱిన్ = ఏసమయమునందును, విపత్ = తనకుఁగల్గినయాపదకును, ఉగ్రదండ = అపరాధులవిషయమైన భయంకరంబగు దండనకును, పరతంత్రుఁడు గాక = అధీనుఁడు గాక (క్రూరదండన సేయక యనుట) చిరంబు = బహుకాలము, రాజ్యముల్ = దొరతనము, చేయున్ = ఒనర్చును.

తా. సుగమము.

తే.గీ. కన్నొకటి నిద్ర వోఁ బెఱ ♦ కంట జాగ, రంబు గావించుభూరుహా ♦ గ్రంబుమీఁది,
యచ్ఛభల్లంబు గతిభోగ ♦ మనుభవించు, నెడను బహిరంతరరులపై ♦ దృష్టివలయు.

టీ. కన్నొకటి = ఒకనేత్రము, నిద్రపోన్ = నిదురింపఁగా, పెఱకంటన్ = రెండవనేత్రముచేతను, జాగరంబుగావించు = మేలుకొన్నటువంటి, భూరుహాగ్రంబుమీఁది = చెట్టుమొక్కకొననున్న, అచ్ఛభల్లంబుగతిన్ = భల్లూకమువలెను, (ఋక్షాచ్ఛభల్లభల్లూకాయని యమరము) భోగమనుభవించునెడను = రాజ్యసుఖానుభవముఁ జేయునప్పుడు, బహిరంతః = బాహ్యాంతరములయందున్న, అరులపైన్ = శత్రులమీఁదను, దృష్టివలయున్ = చూపునుంచవలయును.

తా. సుగమము.

ఉ. అక్షరపక్షపాతమున ♦ నర్థము నూళ్లు నొసంగ నుబ్బున,
భిక్షుజటాధరాలికులు ♦ భిన్ననిజవ్రతు లౌదు రైన దు,
ర్భిక్షరుజాశిశుచ్యుతులు ♦ పెక్కుగు భక్తియ చాలు దాన నా,
తత్క్షుభితత్వమే యఘముఁ ♦ దార్పదు శంకఁ దలంగు మియ్యెడన్.

టీ. అక్షర = నాశమునొందని, (విద్యాపరముగానైనఁ జెప్పవచ్చును) పక్షపాతమునన్ = దాక్షిణ్యము చేతను, (చెడని యనుగ్రహము చేతననుట) అక్షరముఁ జదివియున్నారన్న పక్షపాతము చేతననియుం జెప్పవచ్చును. అర్థమున్ = ధనమును, ఊళ్ళన్ = గ్రామములను, ఒసంగన్ = ఈయఁగా, ఉబ్బునన్ = పొగరుచేతను, భిక్షు = సన్న్యాసులు, జటాధర = జడలు ధరించినవారును, ఆదికులు = లోనగువారు, భిన్ననిజవ్రతులౌదురు = నియమభ్రంశముగలవారౌదురు, ఐనన్ = అట్లగుటవల్లను, దుర్భిక్ష = క్షామమును, రుజా = ముక్కుడిమొదలగు వ్యాధులును, శిశుచ్యుతులు = బాలారిష్టములును, పెక్కుగున్ = విస్తరిల్లియుండును, భక్తియచాలున్ = వారిపట్లఁ బూజ్యానురాగమే చాలును, దానన్ = ఆ యర్థగ్రామాదుల నియ్యనందుననగు, తత్ క్షుభితత్వము = ఆ సన్న్యాసులు మొదలగువారు క్షోభపడుట, ఏ యఘమున్ = ఏ పాపమును, తార్పదు = రాజును బొందింపదు, ఇయ్యెడన్ = ఈ పట్లను, శంకన్ = భయమును, తలంగుము = విడువుము (శంకావితర్క భయయో యని యమరము.)

తా. సుగమము.

క. విను వారత్రయవిజ్ఞా, పన కోర్వుము వధ్యకోటి ♦ పట్టునఁ జెదరం,
దన కప్పుడె కీడగు ననుఁ, జనముం బట్టుటకు మునుప ♦ శస్త్రము చాలున్. ౨౪౪.

టీ. వినుము = (ఈ చెప్పెడుహితము వినుమనుట) వధ్యకోటిపట్టునన్ = చంపఁదగిన ప్రజలపట్లను, వారత్రయ = మూఁడుమాఱులు, విజ్ఞాపనకున్ = విన్నపమునకు, ఓర్వుము = సహించుకొనుము. (మూఁడు నేరములను గావుమనుట) చెదరన్ = వాఁడు దప్పించికొనివెళ్లినా, తనకున్ = రాజునకు, అప్పుడె = విడువఁగానె, కీడు = అనిష్టము, అగుననుఁ = సంభవించునని తోఁచెడు, జనమున్ = మనుష్యులను, పట్టుటకున్ = పట్టుకొనివచ్చుటకు, మునుప = ముందె, శస్త్రము = శస్త్రమె, చాలున్ = పర్యాప్తము.

తా. పట్టుబడిన శత్రువును విడిచిపెట్టిన హానికరంబని తోఁచెనా యప్పుడ హతునింగావింపుమనుట.

క. శూరాలాపములకు నతి, శూరుఁడుఁ దానయ్యు నృపతి ♦ సోకోర్వఁ దగు,
న్వారుబ్బుదు రందున నిజ, శూరత దొరలందుఁ గనుట ♦ సూకార్య మిలన్. ౨౪౫.

టీ. నృపతి = రాజు, అతిశూరుఁడు దానయ్యెన్ = తాను మిగులఁ బరాక్రమవంతుఁడై నప్పటికిని, శూరాలాపములకున్ = వీరుఁడాడెడి శౌర్యవాక్యములకు, ఓర్వఁదగున్ = శూరాలాపప్రపంచజన్యమైన యహంకృతిని సహించి యుండఁదగును, అందునన్ = అట్లోర్చి వినుటవల్లను, వారు = ఆ శూరులు, ఉబ్బుదురు = ఉత్సాహమును వహింతురు, ఇలన్ = భూమియందు, నిజశూరతన్ = స్వీయశౌర్యమును, దొరలందున్ = తనకు సరియైన ప్రభువులందు, కనుట = చూచుట, కార్యము = యుక్తమనుమీ. (అనఁగా దనభటుల శూరాలాపంబుల నోర్వవలయుననుట)

శా. రేవుల్ మావు మతంగజంబులు మణి ♦ శ్రీఖండముక్తాదియున్,
రావా వాణిజ్యము పెంచి యేలఁగ నగు ♦ వర్షంపు టెవ్వల్ రుజల్,
హావళ్లం దిగునన్యభూప్రజలరా ♦ జాయాయిజాత్యోచితిన్,
బ్రోవంగాఁ దగుఁ దోట దొడ్డిగనులా ♦ ప్తుల్ చూడఁ బంపం దగున్. ౨౪౫

టీ. రేవుల్ = ఓడలుదిగునట్టి కరవాకపట్టణములందు, (సప్తమ్యర్థమందుం బ్రథమ) మావు = అశ్వములును, మతంగజంబులు = ఏనుంగులును, మణి = రత్నములును, శ్రీఖండ = చందనము మొదలగు పరిమళద్రవ్యములును, ముక్తాదియున్ = ముత్యములు మొదలగునవియును, రాన్ = వచ్చునట్లుగా, వాణిజ్యము పెంచి = బేరము పెంపుసేసి, ఏలఁగనగున్ = పాలింపవలయును, వర్షంపు టెవ్వల్ = క్షామముచేతను, రుజల్ = రోగములచేతను, హావళ్లన్ = అలసటలచేతను, దిగు = చేరినటువంటి, అన్యభూప్రజలన్ = దేశాంతరపుజనులను, రాజు = ప్రభువు, ఆయాయిజాత్యోచితిన్ = వారివారి కులములకుఁ దగినట్లుగ, ప్రోవంగాఁదగున్ = రక్షింపవలయును, తోట = ఉద్యానవనములు, దొడ్డి = పశువులమందను, గనులు = రత్నములుండు నాకరములును, ఆప్తుల్ = తనకు హితముఁగోరుచున్నవారు, చూడఁబంపందగున్ = పరామర్శచేయుటకై పంపుట యుక్తము.

తా. సముద్రతీరముననుండు పట్టణములకుఁ దురంగగజమణి శ్రీఖండాదులు వచ్చునట్లు వర్తకము వృద్ధిఁజేయించి కూడలలోని సరకులు సులభముగా దిగునట్లుగనవతరణమార్గంబులం గాపాడవలయుననుట.

ఆ, వె. కూడను వచ్చుదాఁక ♦ నపరాధిపై రోష, మూఁగి చెలపవలయు ♦ కూడనువేచి,
లక్ష్యసిద్ధిదాఁక ♦ లాఘవ శరమూఁగి, కాఁడ విడుచువింటి ♦ వాఁడువోలె. ౨౪౬

టీ. కూడనువచ్చుదాఁకన్ = తనకు సమయమువచ్చువఱకును, అపరాధిపైన్ = తప్పుచేసినవానిమీఁదను, రోషమున్ = కోపమును, ఊఁగి = అడంచికొని, కూడను = సమయమును, వేచి = ఎదురుచూచి, లక్ష్యసిద్ధిదాఁక = గురితపకుండ నయ్యెడు పర్యంతము

లావునన్ = తనబలిమిచేతను, శరమూఁగి = బాణమునాకర్షించిపట్టి, కాఁడవిడుచు = బాణమును దిగఁబడునట్లు వదలుచున్న, వింటివాఁడుంబోలెన్ = ధానుష్కునివలెను, చెఱవవలయున్ = నిగ్రహింపవలయును.

తా. సుగమము.

శా. పోవం బోలు లఘుప్రయాణము దినం ♦ బుల్గొన్ని యొండొంట నే,
కావైరిక్షితి కంబువుల్ పిఱుఁద రాఁ ♦ గా నిల్చు జాలుంబలెం,
ద్రోవ న్సైన్యము గూడ వైరిబలసాం ♦ ద్రుం డైనఁ బూజాదులం,
బోవం బోలుఁ జరోక్తిచేత నస దేఁ ♦ బో కావరింపం దగున్. ౨౪౭.

టీ. (రాజు) కావైరిక్షితికిన్ = కుత్సితశత్రునియుక్త భూమికి, లఘుప్రయాణము = కొంచెపుపైనములుగ, దినంబుల్గొన్ని, కొన్నిదినములు, ఒండొంటనే = ఒకటొకటిగా, అంబువుల్ = ఉదకములు, పిఱుఁదరాఁగా = వెంబడిరాఁగా, (వరద రాఁగా ననుపాతమునఁ బ్రవాహమురాఁగా) నిల్చుజాలుంబలెన్ = ముందుపోవుచున్న కొంచెము నీళ్లు వెనుక మెండుగవచ్చునీళ్లు కూడువఱకు నిలుచుచందమున, త్రోవన్ = మార్గమందు, సైన్యముగూడన్ = తనసేనకలిసికొను పర్యంతము, పోవంబోలున్ = వెళ్లఁదగును, వైరి = అశత్రువు, బలసాంద్రుండైనన్ = బలవంతుఁడాయెనా, పూజాదులన్ = వారుసేయునట్టి యుపచారములచే, పోవంబోలున్ = మళ్లికొని వెళ్లవలెను, చరోక్తి చేతన్ = వేగులవారివేగుచేతను, అసదేన్ = వాఁడు స్వల్పుఁడని వినఁబడెనా, పోక = వెనుకకు మళ్లక, ఆవరింపందగున్ = చుట్టుకొనవలయును. (అసదుకొంచెమని యాంధ్రనామసంగ్రహము)

తా. సుగమము.

చ. ద్రవిణము నొవ్వఁ గొంటు నొఱ ♦ ద్రాబలతో నిడుచుంట భూమి గొం,
తవలికి నిచ్చుచుంట ప్రథ ♦ మాస్తతఁ జూడక శంక నుంట లో,
బావయు నృపాళికైత యుభయ ♦ మున్మణిభూషలు గుప్తిఁ బంపి భూఁ,
ధవుఁ డరియం దిడం దగు శ ♦ దం దనయందివి మాన్పకోఁ దగున్. ౨౪౮.

టీ. ద్రవిణము = ధనమును, నొవ్వగొంట = తనరాజ్యమందలి ప్రజలునొచ్చునట్లు పుచ్చుకొనుటయు. (హిరణ్యం ద్రవిణంద్యుమ్నమని యమరము,) ఒఱన్ = ఆలోచనను, ద్రాబలతోన్ = పండెలతోడను, ఇడుచుంట = చేయుచుండుటయును, భూమిగొంత = కొంతదేశమును, అవలికిన్ = వెలుపలికి, ఇచ్చుచుంట = ఒసంగుచుండుటయును, (శత్రువులు బలాత్కరించి తనభూమి నాక్రమింపఁగా మంచిదనియని సమ్మతించియుండుటయనుట) (ఈ మూఁడును ఖరాదోషములను) ప్రథమాస్తతన్ = ముఖ్యముగా నిష్టులై

టను, చూడక = విచారింపక, శంకనుంటన్ = అహితముఁజేయునన్న సంశయముతో నుండుటచేత, లోన్ = లోపలను, పొవయు = పొగరాఁజుచున్నట్టి, నృపాళికై = శత్రువు నొద్దనుండు రాజులకొఱకు, అభయమున్ = అభీతిదానమును, మణి = రత్నములను, భూషలు = ఆభరణములను, గుప్తిన్ = రహస్యముగా, పంపి = అనిపి, భూపవుఁడు = రాజు, భిదన్ = భేదోపాయముచేతను, అరియందిడఁదగున్ = శత్రునందుంచఁ దగును, ఇవి = ఈ చెప్పఁబడిన మూఁడురాజదోషములు = తనయందుమాన్పుకోఁ దగున్ = తనయొద్ద లేకుండఁజేసికొనవలయును.

తా. శత్రురాజు తనకుఁ బరమాప్తులయిన సామంతరాజులయం దపనమ్మకపడఁగా నందుచేత వారులోపల దుఃఖించుచుండు సమయమున వారికభయదానముచేసి మణిభూషాదులిచ్చి భేదపఱచి శత్రురాజతనిరాజ్యమునందలి ప్రజలునొచ్చునట్లు పన్నుపుచ్చుకొనులాగునను దుష్టులతో నాలోచించునట్లును దనభూమిని మఱియొకరాజునకిచ్చు లాగునను జేయుచుఁ దనరాష్ట్రమునందు నివి పుట్టకుండునట్లు విచారించుకొనుచుండ వలయు ననుట.

క. అహితుఁడు వేఁడిన నేలెడు, మహి సగమే నిచ్చి తెగని ♦ మైత్రి గొని విభుం
డహిభయము మాన్పికోఁ దగు, నహిభయ మహిభయముకంటె ♦ నధికము గాదే.

టీ. అహితుఁడు = శత్రువు, వేఁడినన్ = అడిగినట్టాయెనా, ఏలెడుమహిన్ = తాను రాజ్యముఁజేయుచున్నట్టిభూమిని, సగమేనిచ్చి = అర్ధమైననిచ్చి, తెగనిమైత్రిగొని = విడువని స్నేహము సంపాదించి, విభుఁడు = రాజైనవాఁడు, అహిభయమున్ = స్వపక్షభీతిని, మాన్పికోఁదగున్ = నివారించుకొనఁదగును (మహీభుజా మహిభయం స్వపక్షప్రభవంభయ మని యమరము) అహిభయము = స్వచక్రభీతి, అహిభయముకంటెన్ = సర్పభీతికంటెను, అధికముగాదె = అతిశయముకాదా. (అధికమే యనుట.)

తా. రాజులు స్వపక్షమువల్లనే భయమువచ్చునప్పుడు పగవానికైనను బ్రియము చెప్పి యతఁడు సగమురాజ్యము కోరిననిచ్చి స్వపక్షభయమును మానుపుకోవలయునని తాత్పర్యము.

చ. పలుకులు వేయు నేమిటికిఁ ♦ బార్థివుఁ డాత్మభుజాభృతక్షమా
తలమునఁ గుట్టుపేదు బహు ♦ ధా యరయించి యడంచి చంచలా
త్ములగమిలో మెలంగుపురు ♦ షుండును బోలె నశంక నించుచున్
మెలఁగడ యేని రాజ్యఫల ♦ మే యది రాజ్యము దుఃఖలబ్ధికే. ౨౫౧.

టీ. పలుకులు = మాటలు, వేయునేమిటికిన్ = వేయియెందుకు, పార్థివుఁడు = రాజు, ఆత్మభుజా = తనబాహువుచేతను, భృత = వహింపఁబడిన, (దోర్దోషాచభుజ యని

ద్వియూపకోశము) క్ష్మాతలమునన్=భూతలమందు, కుట్టుపేదు=గూఢశత్రువును, (తన రహస్యమును బయలుపఱచువాఁడనుట) (వియోగినీ సముత్కరముల కీడు చూచుటకు దర్పకురేఁపెడు కుట్టుపేడనివారాహప్రయోగము) బహుధా=అనేకప్రకారములచేతను, అరయించి=వెదకించి, (తెలిసియనుట) అడంచి=అడఁచివేసి, చంచలాక్షులగమిలోన్=స్త్రీసంఘములోపలను, మెలంగు=సంచరించుచున్న, పురుషుండునుబోలెన్=నరునిచందంబున, (స్త్రీలసమక్షమునందుఁ బురుషుండేలాగున నిర్భయుండైయుండునో యట్లనుట) అశంకనించుచున్=నిర్భయముఁ జేసికొనుచు, మెలఁగఁడయేని = సంచరింపకపోయెనా, అది=అట్లుంట, రాజ్యఫలమే=దొరతనముఁజెల్లించుటకుఁబ్రయోజనమా, రాజ్యము=దొరతనము, దుఃఖలబ్ధికే=అసుఖప్రాప్తికొఱకా (గనుక లోపల నహిత మాచరించు వారిని మట్టుఁ బెట్టవలయుననుట)

తే,గీ. బెదరి చేరసబలియని ♦ బిగియఁ బట్ట, కతనిపై వడిసేవచ్చి ♦ హత్తఁజేఁత
క్రమము పెనఁగెడుబలుమీను ♦ త్రాటఁజేఁదు, నొడ్డుగాలంపువేటకాఁ ♦ డుపమగాఁడె.

టీ. బెదరి=ఉలికి, చేరనిబలియునిన్=దేశమునకురాకయున్న ప్రబలశత్రువును, బిగియఁబట్టక=శ్రమపడిగ్రహింపక, అతనిపైవడిసేవచ్చి=తనకుఁదానేవచ్చి, హత్తఁజేఁత=తనకుఁబట్టుపడులాగునఁజేయుట, క్రమము=యుక్తము, పెనఁగెడు=లాగులాడుచున్న, బలుమీను=గొప్పమత్స్యమును, త్రాటన్=త్రాటిచేతను, చేఁదు=చేదుచున్నటువంటి, ఒడ్డుగాలంపువేటకాఁడు = గట్టుననున్నట్టి బడిశధారియగు లుబ్ధకుఁడు. (గాలమును మత్స్యముపట్టఁగానే వడితోలాగిన నాసూత్రము తెగును గాన నట్లు గాకుండ లాగుచును వదలుచును మెల్లఁగా జేఁదుకొనుచున్న బడిశధారి యనుట.) ఉపమగాఁడె=దృష్టాంతముగాఁడా.

తా. కావున నెట్టికార్యమునైనను నేర్పుతో సాధింపవలయుననుట.

సీ. దండపారుష్యంబు ♦ కొండెంబున నతర్క । మరిసంధి కెడయీక ♦ మరలఁబడుట
యవలితప్పెన్నిక ♦ స్వవిదేశ్యుఁ జెఱచుట । ప్రతిప్రవర్తకున కే ♦ ర్పడఁగఁ జేఁత
జనులవిశ్వాసంబు ♦ గనుఁగొని మెలఁగుట । విశ్వసనీయుల ♦ వేర్పఱచుట
మోమోట మంత్రంబు♦చో మిక్కిలిడుకొంట । మంత్రభేత్తకునాజ్ఞ ♦ మఱచియుంట
వింత పుట్టినఁగనుగల్గి ♦ చింత సేయ, కుంటమాన్యులపట్టున ♦ నొక్క చూపె
చూడకుంట విహీనులఁ ♦ గూడుకొంట, వ్యసనియైయుంట చలముంట ♦ వలదుపతికి.

టీ. దండపారుష్యంబు=కఠినశిక్షయు, కొండెంబునన్=పైశున్యమందు, అతర్కము=యుక్తిచేఁబరీక్షింపకుండుటయు, అరి=శత్రునితోడను, సంధికి=సమాధానపడుటకు, ఎడయీక=సందీయక, మరలఁబడుట=తిరుగుబాటగుటయు, అవతలితప్పె

న్నికన్న=దేశాంతరమందుండితనకక్కడి స్వామిచేసినయపరాధము నెంచితన్నునమ్మి మాడ వచ్చిన, విదేశ్యుఁ = వైదేశికుని, చెఱచుట=చెడగొట్టుట, ప్రతిపవర్తకునకుఁ = ప్రతికూలుఁడైన ప్రధానికి, ఏర్పడఁగఁ = తేటపడునట్లు, చేత=ఆలోచనసేయుటయు, జనుల విశ్వాసంబు=ప్రజలకుఁగలయప్రీతిని, కనుఁగొని=తెలిసికొని, మెలఁగుట=వారితోఁగూడి యుంటయు, విశ్వసనీయుఁ = నమ్మఁదగినవారలను, వేర్పఱచుట = భేదముగలవారిని యెన్నికొనుటయు, మోమోటఁ = ముఖప్రీతిచేతను, మంత్రింబుచోఁ = ఆలోచించునప్పు డందు, మిక్కిలిడుకొంట = ఆలోచనకుఁదగనివారినిఁజేర్చుకొనుటయును, మంత్రభేదకుఁ = ఆలోచనవెల్లడిచేసినపురుషునకు, ఆజ్ఞ=శిక్షవిధించుటను, మఱచియుంట=విస్మరించియుండుటయు, వింతపుట్టినఁ = ఉత్పాతములుజనింపఁగా, శంకగల్గి = శంకచేత గలవాఁడై, చింతసేయకుంట = వానికిఁబ్రతికారింపనాలోచింపకుండుటయు, మాన్యుల పట్టునఁ = పూజ్యులవిషయమై, ఒక్కచూపె=ఏకరీతిగా, చూడకుంట = పూజసేయ కుండుటయు, హీనులఁ = దుష్టులతోడను, కూడుకొంట = సహవాసముఁజేయుటయు, వ్యసనియైయుంట=స్త్రీద్యూతమృగయాదిచింతలుగలవాఁడైయుండుటయు, చలముంట= పిడివాదముండుటయును, (అనఁగా మాత్సర్యము కలిమియనుట) పతికిఁ = రాజునకు, వలదు=కూడదు.

తా. రాజైనవానికి నీపద్యమునందుఁ జెప్పంబడియున్న దండపారుష్యాది దుర్గుణములు లేకయుండెనేని చిరకాలము రాజ్యసుఖ మనుభవించుచుండు ననుట.

క. త్రివిధోత్పాతము లొదవిన, నవనివిభుఁడు విడువవలయు నధికద్రవ్యం
బవనీసురముఖ సురముఖ, పవనసఖముఖముల భుక్తి బలి హోమవిధిన్. ౨౮౪.

టీ. త్రివిధోత్పాతములు = దివ్యభౌమాంతరిక్షములనియెడు మూఁడు తెఱంగులై తెలియవచ్చునట్టికీళ్ళు, ఒదవినన్ = జనింపఁగా, అవనివిభుఁడు = రాజు, అవనీసురముఖ= బ్రాహ్మణముఖమందును, సురముఖ = దేవతావదనమందును, పవనసఖముఖముల = అగ్ని ముఖమందును, భుక్తి = భోజనములచేతను, బలి = పూజోపహారాదులచేతను, హోమ విధిన్ = వ్రేల్చుటచేతను, అధికద్రవ్యంబు = పెక్కుధనమును, విడువవలయున్ = వినియోగము చేయవలెను. క్రమాలంకారము.

తా. త్రివిధోత్పాతలక్షణము॥ వృద్ధవసిష్ఠుఁడు చెప్పియున్నాఁడు॥ దివిజా యేభుత గ్రహస్తేదివాఖ్యా మహాఫలదాః। పరివేషేంద్రధనురుల్కా గంధర్వ నగరనిర్ఘాతాః॥ గగన వికారజమేతన్మధ్యమఫలదంత థాంతరిక్షంచ। భూమిభవా భౌమాస్స్యుశ్చరస్థిరా వస్తు సంభవాయేచ। ఏతేధమఫలదాస్సు శాంతేమాంశధయామిఫలాసిరూపాణి। ఆబాలవిద్వజ్జన సుప్రసిద్ధాయద్వస్తురూపగ్రాన్యత్వంతో స్యాత్। ఉత్పాతమాహుస్త్రివిధంవదంతి దివ్యాం

తరిక్ష క్షితిజన్యభేదం॥ తదుత్పత్తికారణము వృద్ధవసిష్ఠుఁడు చెప్పియున్నాఁడు॥ అధర్మత స్త్వనత్యాచ్చ నాస్తిక్యాదతిలోభతః । అనాచారాన్నృణాంనిత్య ముపసర్గః ప్రజాయతే । తద్భేదాస్త్రి విధోత్పాతా జాయంతే దుఃఖరోగదాః । దివ్యాంతరిక్ష క్షితిజాః వికారాఘోరరూపిణః ॥ వరాహోక్తి॥ మనుజానామపచారాదపరక్తా దేవతాస్సృజంత్యేతాన్, తత్ప్రతిఘాతాయన్నపశ్శాంతిం రాష్ట్రేప్రయుంజీత. గార్గివచనము॥ అకృత్వాశాంతికంరాజా దుఃఖాంభోధౌ నిమజ్జతి। పురేజనపదేకోశే వాహనేషుపురోహితే। స్త్రీష్వాత్మనిచపుత్రేషుపచ్యతేనైవమష్టసు॥ అనియున్నందున రాజట్టి యుత్పాతంబులుగలుగకుండునట్లు పాలింపవలయు నొకవిధంబున నవి గలిగెనేనియవ్యవహితముగఁ దచ్ఛాంతిన్యైనను జేయవలయుననుట.

ఉ. స్పర్థ పరస్పరంబు దొర ♦ పట్టున యోధులపట్టున న్నృపు,
ల్వర్ధన మొందఁ జేయఁ దగు ♦ వారిహితాహితచర్య లొందవం,
తర్థి మిథోవ్యథావహహి♦త ప్రథమానసమానతాప్రథా,
ధూర్ధర తాదులం దగిలి ♦ ద్రోహపుఁజింత దలంప రేమియున్. ౨౫౫.

టీ. నృపుల్ = రాజులు, దొరలపట్టునన్ = గొప్పయుద్యోగస్థులవిషయమునను, యోధులపట్టునన్ = వారిక్రింద నుండుభటుల విషయమునను, పరస్పరంబు = ఒండొరులకు, స్పర్థ = విరోధము, వర్ధనమొందన్ = వృద్ధిఁబొందునట్లుగ, చేయఁదగున్ = చేయవలయును, (అట్లుకలహముపుట్టించినట్లయినను) వారి = వారలయొక్క, హితాహితచర్యలు = మంచిచెడ్డనడతలు, అంతర్థిన్ = దాఁగుటను, ఒందవు = పొందవు, మిథః = అన్యోన్యము, వ్యథావహ = దుఃఖహేతువగు, హిత = ఇష్టులని, ప్రథమాన = ప్రసిద్ధులై, సమానతా = సములై యుండుటచేతనైన, ప్రథా = ప్రసిద్ధియొక్క, ధూర్ధరతాదులన్ = ధురంధరత్వముమొదలగువానియందు, తగిలి = తగులుకొని, ఏమియున్ = ఇంచుకంతైనను ద్రోహపుఁజింతన్ = చెడుచింతను, తలంపరు = స్మరింపరు, (అందఱును హితాచరణమందాసక్తులైయుందురనుట).

చ. ధరణిపుఁ డెందు నేఁ దగదు ♦ తాఁ జన నూఱట కొక్కనిం దగుం,
దొర నొనరించి పంప నరి ♦ దుర్బలుచేఁ జెడఁ డాతఁ డర్థభూ,
కరితురగర్థి లేక కొఱ ♦ గాఁ డటు సేయ ద్విజాన్యుఁ డల్కకొ,
నైరవు నతండునున్ వలయు ♦ నిండినదుర్గబలోర్వి యీఁ దగున్. ౨౫౬.

టీ. ధరణిపుఁడు = రాజు, ఎందు నేన్ = ఎచ్చటికెచ్చటికేనియును, తాన్ = తాను, చనఁదగదు = చనరాదుకనుక, ఊఱటకున్ = తనకుసహాయముగానుండుటకు, ఒక్కనిన్ = ఒక్కని, దొరన్ = ప్రభువునుగా, ఒనరించి = చేసి, పంపన్ = అంపుట,

తగున్ = యుక్తము, అరి = ప్రబలశత్రువు, దుర్బలుచేన్ = బలహీనునిచేత, చెడఁడు = సాధింపఁబడఁడు, (కావున) ఆతఁడు = ఆయధికారపురుషుఁడు. అర్థ = రొక్కము మొక్కయు, భూ = వలయునట్టి భూమియొక్కయును, కరి = ఏనుంగులయొక్కయు, తురగ = గుఱ్ఱములయొక్కయును; ఋద్ధి = సమృద్ధి, లేక = లేకయుండెనేని, కొలగాఁడు = పనికిరాఁడు, అటు సేయన్ = అట్లు పెంపుఁజేసినదపుటకు, ద్విజాన్యుఁడు = క్షత్రియుఁడులోనగువాఁడు, అల్కక = ఝుళుకులేక, నెరవున్ = తగినవాఁడై నిలుచును, అతండునున్ = ఆబ్రాహ్మణుఁడును, వలయున్ = రాజునకాప్తుఁడై యుండవలయును, నిండిన = నిండారిన, దుర్గబలోర్వి = దుర్గమును గజతురంగబలములును భూములును, ఈఁదగున్ = ఇయ్యందగును.

తా. దుర్గస్థలములు బ్రాహ్మణులకీయక క్షత్త్రియాదులకిచ్చినవారు మళ్లఁబడిపోరుదురనుట.

కం. అడవులు గడిదేశములవి, దడములుగాఁ బెంపు మాత్మ ♦ ధరణీస్థలికి,
న్నడుములవి పొళ్లుపొళ్లుగఁ, బొడిపింపుము దస్యుబాధ ♦ పొందకయుండన్ ౨౫౭.

టీక. గడిదేశములవి = గడిస్థలములయందుఁగల, అడవులు = విపినములను, దడములుగా = బలువిడిగాను, పెంపుము = వృద్ధిఁబొందింపుము, ఆత్మ = తనయొక్క, ధరణీస్థలికిన్ = దేశమునకు, నడుములవి = మధ్యముననుండునట్టి యడవులను, దస్యుబాధ = దొంగలవలనియుపద్రవము. పొందకయుండన్ = కలుగకుండునట్లు, పొళ్లుపొళ్లుగన్ = తునకలుగా, పొడిపింపుము = నఱికింపుము.

తా. నీయేలుబడిదేశమునందు మధ్యముననున్న యడవులను జోరబాధ లేకయుండుటకై పొడిపొడిగాఁగొట్టివేయింపుమనుట.

చ. క్షమఁ గుఱుమన్నెపుంగహన ♦ చారిజనంబెడ దోషదృష్టి కు,
డ్యముఁ గడుగంటఁ బూన్కి దెగ ♦ దల్గిన సర్వము బాస నీగి వ,
శ్యముగ నొనర్పఁ దాడి కగు నాగడి కొల్లలకు న్నతాపరా,
ధమును సహస్రదండము న ♦ తర్క్యము సర్వము నేలువానికిన్. ౨౫౮.

టీ. క్షమన్ = భూమియందు, కుఱుమన్నెపుంగహనచారిజనంబెడన్ = కొంచెపాటిమన్నెతికముగల యాటవికజనులపట్లను, దోషదృష్టి = దోషమెంచుట, కుడ్యమున్ = మంటిగోడను, కడుగంటఁబూన్కి = మన్నులేవకుండఁగడుగుటకు దొరకొన్నచందము, అల్గినన్ = వారిపట్లఁగోపగించినను, సర్వము దెగదు = మొదలంటతెగదు, బాసన్ = సత్యవాక్యము చెప్పుటచేతను, ఈగిన్ = వాహనాదులనిచ్చుటచేతను, వశ్యముగన్ = తనకువారువశవర్తులగునట్లుగా, ఒనర్పన్ = చేసికొన్నట్లయిన, దాడికిన్ = శత్రువుల

మీఁదదండెత్తుటకు, అగుఁ = పనికివచ్చును, గడికోళ్లలకుఁ = గడిదేశములుగొల్లఁ బెట్టుటకును, బోఁ=పనికివచ్చును, సర్వముఁ = సమస్తమును, ఏలువానికిఁ=పరిపాలనముఁజేయురాజునకు, శతాపరాధమును = అనేకులుచేయునట్టి యపరాధమును, సహస్రదండముఁ = అనేకజనులను శిక్షించుటయును, అతర్క్యము = తలంచుటయుక్తము కాదు.

తా. సుగమము.

తే.గీ. సింధురమహాశ్వముఖ్యము ♦ ల్చేరుదౌల, దీవి వణిజుల కూళ్లు స ♦ ద్గృహములుపురిఁ,
గొలువుఁ దేజంబు వెల మేలు ♦ గలుగఁ బ్రాఁత, వారిఁగాఁ జేయు మరి నవి ♦ చేరకుండ.

టీక. సింధుర = ఏనుఁగులును, మహాశ్వ = గొప్పయశ్వములు, ముఖ్యములు = లోనగువానిని, చేర్చు=తెచ్చుచున్నట్టి, దౌల = దూరముననున్న, దీవివణిజులకుఁ= ద్వీపములయందలి వర్తకులకు, ఊళ్లు = గ్రామములు, పురిఁ = నీపట్టణమందు, సద్గృహములు = మంచియిండ్లును, కొలువుఁ = నిత్యమునీసేవయును, తేజము = బహుమానములును, వెలమేలు=వారికొనుమొదలుమీఁద నాదాయమును, కలుగఁ = కలుగునట్లుగా, (చేసియనుపదమధ్యాహార్యము) అవి = అగజాదివస్తువులు, అరిఁ = నీశత్రువును, చేరకుండఁ=చెందకయుండునట్లు, ప్రాఁతవారిఁగాఁ=వారలను నీవారినిగాను, చేయుము= ఒనర్చుకొనుము.

తా. సుగమము.

తే.గీ. గడినృపులరాయబారుల ♦ యెడఁగొలువున, సరసపల్లాపములు రాజు ♦ సలుపవలయుఁ
గార్యఖడ్గము లనుచరు ♦ ల్గానఁ బలుక, వలయు నవి మైత్రిఁ దాఁ దేలఁ బలుకవలయు.

టీక. రాజు=ప్రభువు, గడినృపుల =తనభూమికి సమనంతరదేశాధిపతులయొక్క, రాయబారులయెడఁ = నియోగులపట్లను, కొలువునఁ =తనకచ్చేరియందు, సరసపల్లాపములు = రసయుక్తములగు మంచిమాటలె, సలుపవలయుఁ = ఆడవలెను, కార్యఖడ్గములు = కార్యసమాచారములను ఖడ్గసమాచారములను, అనుచరుల్ = సమీపస్థులు, కానఁ = తెలియునట్లు, పలుకవలయుఁ = వచింపవలయును. అవి = చారులచేతనట్లు చెప్పంబడినమాటలను, తాఁ = రాజు, మైత్రిఁ = స్నేహాభిప్రాయముచేత, తేలఁబలుకవలయుఁ = ఆమాటలు తప్పిదములైనవి కావని తేలఁబలుకవలయును.

తా. సుగమము.

తే. గీ. తానవంబుగ దొరఁజేయు ♦ వానిమంత్ర, మునకు వేగమె లోఁజేయఁ ♦ జనదువాఁడు,
క్రొత్తమన్నన రహిఁ దనుఁ ♦ గులుకుఁ జెప్ప, నయిన నది చెడు మఱివాఁడు ♦ నడఁగుగాన.

టీక. (రాజు) తాఁ = తాను, నవంబుగఁ = క్రొత్తగా, దొరఁజేయువానిఁ = దొరతనమిచ్చి పెంపుఁజేసిననరుని, మంత్రమునకుఁ = ఆలోచనకు, వేగమె = వేగిర

ముగా, లోఁజేయఁజనదు = కూర్చికొనఁగూడదు, (అట్లుచేర్చుకొనినట్లాయెనా) వాఁడు = ఆక్రొత్తయుద్యోగస్థుఁడు, క్రొత్తమన్ననన్ = నూతనపుబహుమానముచేత నుప్పొంగి, రహిన్ = తేజముతో, అనుఁగుఁగున్ = తననెయ్యురకు, చెప్పన్ = చెప్పఁగా, అయినన్ = కొనసాగినను, అది = ఆకార్యము, చెడున్ = కాకపోవును, మఱి = ఇంతియకాక, వాఁడున్ = అట్లు మంత్రమును బైటఁబెట్టినవాఁడును, అడఁగున్ = చెడిపోవును, కానన్ = కావున, ( మంత్రమునకులోఁజేయఁగూడదని యన్వయము )

సీ. హితబహుశ్రుతధర్మ ♦ రతశూరతాస్వపూ। ర్వతల మన్ద్విజుల దు ♦ ర్గముల నిలిపి,
పులిజున్నుమొదలుగాఁ బురుషాయుషావధి। కం దుండ నవరణ ♦ ల్పొందుపఱచి,
చీమంత యైనను ♦ సామంతకోటికి। మితము దప్పక యుండ ♦ క్షితులొసంగి,
యాయాధికవ్యయా ♦ నధికంబునుం బ్రజా। విరుజంబుగాఁగబం ♦ డరువుఁ గూర్చి,
క్షీణరిపుధాత్రిఁ జరదృష్టి ♦ చేతఁ జూచి। బకగతి హఠాద్గ్రహించి తాఁ ♦ బ్రజయునొవ్వ,
కయ పగఱగాత్రములనె చీ ♦ కాకుపఱచు। నృపతి డెందానఁ జేయిడి ♦ నిద్రవోవు.

టీక. హిత = తనకుహితులును, బహుశ్రుత = అనేకశాస్త్రజ్ఞులును, ధర్మరత = ధర్మపరులును, శూరతా = శౌర్యవంతులౌటచేతను, స్వపూర్వతలన్ = తనపూర్వీకులు నౌటచేతను, మన్ = వృద్ధిఁబొందుచున్న, ద్విజులన్ = బ్రాహ్మణులను, దుర్గములన్ = దుర్గస్థలములయందు, నిలిపి = ఉంచి, పులిజున్ను మొదలుగాన్ = పులిజున్నుమొదలైన నిఖిలంబగు నపూర్వవస్తువులును, పురుషాయుషావధికిన్ = నూఱుసంవత్సరములవఱకును, అందుఁడన్ = ఆదుర్గములయందుండునట్లు, నవరణల్ = వస్తువులు, పొందుపఱచి = కలుఁగఁజేసి, సామంతకోటికిన్ = తన్నుఁగొలుచుచుండుమన్నెగాండ్రకు, చీమంత యైనను = కొంచెమైనను, మితమున్ = ఆడుకొన్నరీతిని, తప్పక యుండన్ = తప్పిపోకుండ, క్షితులు = భూములు, ఒసంగి = ఇచ్చి, ఆయాధికవ్యయానధికంబును = ఆదాయమెక్కుడుగాను వ్యయముతక్కువగాను, ప్రజావిరుజంబు గాఁగన్ = తనదేశపుజనులునొవ్వనియట్లుగా, బండరువుఁగూర్చి = బొక్కసముసంచి, క్షీణరిపు = క్షయిష్ణువైనశత్రునియొక్క, ధాత్రిన్ = దేశమును, చరదృష్టిచేతన్ = వేగులవాండ్రచేతను, చూచి = ఎఱిఁగి, బకగతిన్ = కొంగచందమునంబొంచియుండి, హఠాద్గ్రహించి = సమయముతటస్థింపఁగా నొక్కడాఁటునదాక్రమించి, తాన్ = తానును, ప్రజయున్ = తనయొక్క ప్రజలును, నొవ్వకయ = నొప్పిఁజెందకయే, పగఱ = తనశత్రువులయొక్క, గాత్రములనె = దేహములనే, చీకాకుపఱచు = కలఁకపడునట్లుచేయుచున్న, నృపతి = రాజు, డెందానన్ = ఱొమ్మునను, చెయిడి = హస్తమునుంచుకొని, నిద్రవోవున్ = సుఖముగ నిద్రించును.

తా. ఇందుఁజెప్పంబడియున్నవిధముగ రాజు ప్రవర్తించెనేని యెందేనియు భేదమునొందక సుఖంబులననుభవించుచుండుననుట.

కం. ఎచ్చో గజఘోటక్రయ, తచ్చర్వణసుభటజీవి ♦ తద్విజసురపూ,
జోచ్చనిజభోగముల కగు, వెచ్చము వెచ్చంబు గాదు ♦ విత్తంబునకున్. ౨౬౩

టీక. విత్తంబునకున్ = రాజార్జించినధనమునకు ఎచ్చోన్ = ఏకాలమందును, గజ = ఏనుంగులయొక్కయు, ఘోట = అశ్వములయొక్కయు, క్రయ = కొనుటకును, తచ్చర్వణ = వానిమేపునకును. సుభటజీవిత = మంచిరాణువకిచ్చునట్టి జీతములకును, ద్విజ = బ్రాహ్మణులకును, సుర = దేవతలకును, పూజా = పూజలకును, ఉచ్చనిజభోగములకున్ = ఉన్నతములైన తనయనుభవములకును, అగు = అగునటువంటి, వెచ్చము = వ్యయము, వెచ్చంబుకాదు = వ్రయముకాదు.

తా. ఈచెప్పఁబడినవానివిషయమై వ్యయమవశ్యముగఁజేయవలయుఁగాన నిది దుర్వ్యయమని యుపేక్షింపరాదనుట.

ఆ. వె. ప్రతిన వలదు వైరి ♦ పట్టున నృపతికి, దండువెడలఁ దీఱ ♦ కుండుఁ దీఱు,
గాక యుండియుండి ♦ కాలాంతరమున నౌఁ, గార్యకాఁడొ యంక ♦ గాఁడొ నృపుఁడు.

టీ. నృపతికిన్ = రాజునకు, వైరిపట్టునన్ = పగతునిపట్టున, ప్రతిన = ప్రతిజ్ఞ, వలదు = ఎప్పటికిని గూడదు, దండువెడలన్ = యుద్ధయాత్రకుఁబోయినను, తీఱకుండన్ = నిర్ణయించుకొన్న సమయమునకు ముగింపుకాకపోవును, తీఱున్ = ముగింపగును, కాక యుండియుండి = అప్పటికిఁ గాకుండనుండియుండి, కాలాంతరమునన్ = మఱియొక సమయమందు, ఔన్ = అవును, నృపుఁడు = రాజైనవాఁడు, కార్యకాఁడో = కార్యపరుఁడో, అంకగాఁడో = సమరశీలుఁడో (అనఁగాఁ గాకువుచేతఁ గార్యపరుడెయనుట)

క. పోరానిపట్లఁ బొడుచుట, వైరిబలము దిరుగ జయము ♦ స్వర్గము నగు నా,
నారూపయంత్రతత్ప్రా, కారాదులపట్లఁ బ్రజనె ♦ కవియింపఁ దగున్. ౨౬౪

టీ. రాజు, పోరానిపట్లన్ = శత్రువులపైకివెళ్లుటకు వసరులేకయున్న సమయములను, పొడుచుటన్ = పోరునఁ గొట్టుటచేత, వైరిబలము = శత్రుబలము, తిరుగన్ = ఏవంకఁబోవనశక్యమై తెగించి తిరుగుబాటు కాఁగా, జయము = గెలుపైనను, స్వర్గమున్ = వీరస్వర్గమైనను, అగున్ = సిద్ధమౌను, (అనఁగాఁ బ్రోవలేక యిక్కట్టుననున్న శత్రువులబలమును జెనకరాదనుట) నానారూపయంత్ర = పలుతెఱంగులగు నాయుధవిశేషములపట్లను, తత్ = ఆ శత్రురాజులయొక్క, ప్రాకారాదులపట్లన్ = కోటలు మొదలగు వానియందును, ప్రజనె = తనబలమునె, కవియింపందగున్ = కవియునట్లు చేయవలయును గాని తాను బోఁగూడదనుట.

చ. మనమున కొండు రెండు మఱు ♦ మంత్రముల న్సరిపోవఁ జెప్పినం,
జనపతు లాతనిం బిలువ ♦ సాగుదు రాగతి సారెఁ బిల్చిన,
చ్చనువున కే ధనాది గొని ♦ సంగతి గానివి క్రొవ్వి చేయుఁ జె,
ప్పు నృపతి దద్బహిశ్చరిత ♦ ముం జరుచేఁ బరికింపఁగాఁ దగున్. ౨౬౭.

టీ. మనమునకున్ = రాజులయొక్కయుల్లమునకు, ఒండు రెండుమఱు = ఒకటి రెండుమాఱులు, మంత్రములన్ = ఆలోచనలను, సరిపోవన్ = సరిపడునట్లు, చెప్పినన్ = చెప్పినట్టాయెనా, జనపతులు = రాజులు, ఆతనిన్ = అట్లుతమమనంబునకు సరిపడఁ జెప్పియున్నవానిని, పిలువసాగుదురు = పిలువనారంభింతురు, ఆగతిన్ = ఆతీరునను, సారెఁ బిల్చు = మాటిమాటికిఁబిలువనంపినట్టి, అచ్చనువునకే = ఆచొరవకే, ధనాది = రొక్కము మొదలగువానిని, కొని = వానివల్ల సంపాదించికొని, క్రొవ్వి = మదించి, సంగతిగానివి = అసంగతములయిన కొన్నిపనులను, చేయన్ = ఒనర్చుటకై, చెప్పున్ = నిర్ణయించును, (అట్లుగావున) నృపతి = రాజు, తత్ = ఆయాలోచనఁజెప్పువానియొక్క, బహిశ్చరితమున్ = వెలినడవడిని, చరుచేన్ = వేగువానిచేతను, పరికింపఁగాఁదగున్ = తెలిసికొనవలయును.

తా. రాజైనవాఁడు రెండుమూఁడు ఆలోచనలకే బేలుపోయివానినమ్మియుండక వీఁడుపరహితుఁడై యోజనలు చెప్పుచున్నవాఁడో లేక తనకు హితబుద్ధినిఁ జెప్పుచున్నవాఁడో యని వాని వెలినడవడి నితరులచేఁ దెలిసికొనవలయు ననుట.

క. గడివాఁడు చెడు నెయేఁ దగుఁ, జెడఁజేయుట చెడఁడయేని ♦ చెల్మియె తగుఁబై
గడివాఁడేపని కగుఁ దన, గడివాఁ డరియైనఁదనకె ♦ గడి కావఁ బడున్. ౨౬౮.

టీ. గడివాఁడు = తనపగవానిమానిసియై తనగడిసరిహద్దుననుండువాఁడు, చెడు నెయేన్ = చెడునట్లుతోఁచినపక్షమున, చెడఁజేయుట = అట్లుపాడిచిచెఱుపుట, తగున్ = యుక్తము, చెడఁడయేని = చెడఁడనితోఁచినట్లాయెనా, చెల్మియెతగున్ = వానితో మైత్రి యొనర్చుటయెమంచిది, తనగడివాఁడు = తనయొక్కయెల్లయందుఁ గావలియుండువాఁడు, అరియైనన్ = తనకుశత్రువైనట్టాయెనా, పై గడివాఁడు = పరునిసీమయొక్కగడికావు వాఁడు, ఏపనికగున్ = ఏమికార్యమునకు వచ్చును, తనకే = తనకొఱకే, గడి కావఁబడున్ = గడిరక్షింపఁబడును.

తే,గీ. రాష్ట్రమెరియింపు కొనుముదు ♦ ర్గములుతదవ, రోధమగపడ్డఁబుట్టింటి ♦ రూఢినడపు
పరుషములు తద్రిపులరాయ ♦ బారు లెడుటఁ, బల్కుకకుముసంధియొక వేళ ♦ వలసియుండు.

టీ. రాష్ట్రము = నీ శత్రురాష్ట్రమును, దుర్గములు = వారిదుర్గస్థానములను, ఎరియింపుకొనుము = హరింపుము, తదవరోధము = వారిస్త్రీలు, అగపడ్డన్ = దొరికెనేని, పుట్టింటిరూఢిన్ = ఆ స్త్రీలు పుట్టినింటనుండఁగా నేమిమర్యాద నడుచునో యట్టిమ

ర్యాదను, నడపుము = జరగింపుము, తద్రిపుల = ఆ శత్రువులయొక్క, రాయబారుల= సంధిమాటలాడువారియొక్క, ఎదుటన్ = ముందరను, పరుషములు = కఠినవాక్యములు, పలుకకుము = వచింపకుము, ఒకవేళన్ = ఒకసమయమునందు, సంధి= సమాధానము, వలసియుండున్ = కావలసియుండును గనుక పరుషములాడఁగూడదని పూర్వముతో నన్వయము

ఆ. వె. అభిచారఘనగ ♦ రాంబుదూషితరుజ్ని, రంతరాద్రిగహన ♦ దంతురోగ్ర,
కీకటోర్వి మేరు ♦ గిరిసమార్థము వచ్చు, నేని చొరకు మంపు ♦ మిడుము కొనఁగ.

టీ. అభిచార = అభిచారక్రియలు చేయుజనులచేతను, ఘన = నిబిడమైయున్నట్టియు; గరాంబు = విషజలములచేతను, దూషిత = దుష్టమైనట్టియు, రుజ్నిరంతర = వ్యాధిబహుళమైనట్టియు, అద్రి = కొండలచేతను, గహన=కాఱడవులచేతను, దంతుర= ప్రవేశింప నశక్యమైనట్టి, ఉగ్రకీకటోర్వి = ధూర్తులగుమ్లేచ్ఛులయొక్క భూములను, మేరుగిరి = హేమాద్రితో, సమ = తుల్యమైన, అర్థము = ద్రవ్యము, వచ్చునేని=లభించునట్లుండినను, చొరకు = నీవు వెళ్లక, ఇడుముకొనఁగన్ = ఆదేశముల నాక్రమించునట్లు, అంపుము = దళములనుమాత్రము పంపుము.

తా. సుగమము.

క. రాణింపఁ బలికి తనపని, జాణై కొనుచు గొలుచు సంత ♦ నపుఁదటిఁ దొలఁగుం,
ద్రాణ చెడఁ గపటమానిసి, నాణె మెఱుఁగ బచ్చు గాఁగ ♦ నరపతికిఁ దగున్. ౨౭౦

టీ. కపటమానిసి = కుత్సితుఁడైన మనుష్యుఁడు, రాణింపన్ = ఇంపుపుట్టునట్లుగా, పలికి = మాటలాడి, జాణై = చతురుఁడై, తనపనిన్ = స్వప్రయోజనమును, కొనున్ = కాఁజేసికొనును, సంతసపుఁదటిన్ = దొరలుత్సాహవంతులై యున్నసమయంబునను, కొలుచున్ = కొలువుఁజేయును; ద్రాణచెడన్ = దొరకించుక బలిమిదప్పి దిగులొందఁగా, తొలఁగున్ = దాఁటిపోవును, నాణెము = మంచిచెడ్డలను, ఎఱుఁగన్ = తాఁదెలిసికొనుటకు, బచ్చుగాఁగన్ = బచ్చువానివలె నుండుట, నరపతికిన్ = రేనికి—తగున్ = అమరియుండును.

తా. సుగమము.

సీ. తదజ్ఞ మండలిఁ గూర్చి ♦ ధాతువుల్ దెలిసి హే । మాదులఁ గొని ప్రక్క ♦ త్యనుగుణాల్ప,
జీవనాహ్యతులచేఁ జెలఁగి మహాబలో । ద్రేకంబుమర్దన ♦ రిత్తఁజేసి
స్నేహార్ద్రుఁ డగుచు న ♦ శేషంబుఁ బోషించి । నరవర్ణములతప్ప ♦ నరణు లుడిపి
నతతద్విజప్రతి ♦ ష్ఠాశాలియై బలి । యించుపట్టులు బలి ♦ యించి పలుచఁ
జేయుపట్టులు పలుచఁగాఁ ♦ జేసి తేజ, మెసఁగ శోధన మఱవక ♦ యెసఁగ వలయు
సాంగరాజ్యమ్మొ కైత్తుగ ♦ స్వాంగరాజ్య, మొక్కయెత్తుగ నృపతియా ♦ యుష్యపరత.

అ. ఈపద్యమునందు స్వాంగరాజ్యమును బాలించుభంగి సాంగరాజ్యమును రాజైనవాఁడు పరిపాలింపవలయునని రెండర్థములు వచ్చునట్లు చెప్పుచున్నాఁడు.

టీ. తద్జ్ఞమండలిచేన్ =వైద్యులను, అభిజ్ఞులను. కూర్చి=కలయఁజేసి, ధాతువుల్ = సప్తధాతువులను, సువర్ణాదిజనకములైనధాతువులను, తెలిసి = ఎఱింగి, హేమాదులు గొని=సువర్ణభస్మము మొదలగువానిఁబుచ్చుకొని, ఆధాతువులయందుండు సువర్ణరజతాదులను స్వీకరించి, ప్రకృతి=తనశరీరప్రకృతికిని, ప్రజలకును, అనుగుణ = తగునట్లు, అల్పజీవన=మితమైనయన్నోదకములయొక్కయు, మితమైనద్రవ్యములయొక్కయు, అహృతులచేన్ =పుచ్చుకొనుటచేతను, చెలంగి=ఒప్పి, మహాబలోద్రేకంబున్ =వాయువుయొక్క ప్రకోపమును, ప్రబలశత్రువుయొక్క యౌద్ధత్యమును,మర్దనన్ =అంగమర్దనచేతను, దండించుటచేతను, రిత్తఁజేసి=మట్టుపఱచి, స్నేహార్ద్రుఁడగుచున్ = అభ్యంజనమును, ప్రేమయుఁ గలవాఁడై, అశేషంబున్ =సకలావయవములను, సమస్తప్రజలను, పోషించి = పెంపుఁజేసి, పరల్ =పలితమును, వర్ణములతప్పసరణులు=దేహమందాయాస్థానములవన్నెలుమాఱుటను, నరవర్ణముల=మనుష్యులయొక్క బ్రాహ్మణాదివర్ణములయొక్క, తప్పసరణులు= శాస్త్రవిరుద్ధాచారములను, ఉడిపి = తదుచితక్రియలచేతను మాన్పి, సతతద్విజప్రతిష్ఠాశాలియై=ఎల్లప్పుడుఁబలువరుసలకును, బ్రాహ్మణులకును దార్ఢ్యప్రతిష్ఠలను సంపాదించుటచేనొప్పుచున్నవాఁడై, బలియించుపట్టులుబలియించి=పలుచఁజేయుపట్టులు బలుచఁగాఁజేసి, హస్తముష్ట్యాదులను = దుర్గములను బలియఁజేసి యునుదరాదులను, మధ్యదేశమునందలి యడవులనుబలుచఁగాఁజేసి, తేజముసఁగన్ =ఇంద్రియప్రతాపము లభివృద్ధియగునట్లు,శోధనన్ =వస్తిశోధనము, నగరశోధనను, మఱవక = విస్మృతిఁజెందక, నృపతి = రాజు, ఆయుష్యపరతన్ = ఆయుర్వృద్ధియందాసక్తుఁడౌటచేతను, స్వాంగరాజ్యము = తన శరీరము, ఒక్కయెత్తుగన్ =ఒకవంతుగాను, సాంగరాజ్యము = సప్తాంగములతోడి రాజ్యము, ఒక్కయెత్తుగన్ =ఒకవంతుగాను, ఎనఁగవలయున్ = పెంపొందవలయును.

తా. సుగమము.

సీ. సౌఖశాయనికత ♦ పూర్వకము కాల్య । వేళఁ గార్తాంతిక ♦ ద్విజులగోష్ఠి,
జాము పోవ నమాత్య ♦ సామంతపూర్వకం । బర్థార్జనస్థకా ♦ యస్థగోష్ఠి,
దినమధ్యమమున మ ♦ ర్దనమల్లపూర్వకం । బగుసూనసూపకృ ♦ న్మృగయుగోష్ఠి
యపరాహ్ణమున దేవ ♦ తార్చనాపూర్వకం । బార్యధర్మాధికృ ♦ ద్యతులగోష్ఠి,
భుక్తిమీఁద విదూషక ♦ పూర్వకము పు, రాణికవిగోష్ఠి చారపూ ♦ ర్వకము సంజ,
జాము గాయకగోష్ఠి ని ♦ శన్ సుషుప్తి, పూర్వకము ప్రేయసీగోష్ఠి ♦ పొసఁగుఁ బతికి.

టీ. పతికిన్ = రాజునకు, కాల్యవేళన్ = ప్రభాతసమయమునందు, (ప్రత్యూషోహర్ముఖం కల్యమున యమరము) సౌఖశాయనిక = సుఖశయనమాయని యడుగువా

రును, (భృగ్వాదీననుగృహ్ణంతు సాఖశాయనికా స్పృషీనని రఘువంశమునందుఁగవిపుంగ వుఁడైన కాళిదాసునిప్రయోగమున్నది) భిషక్=వైద్యులును, పూర్వకము=మొదలుగా, కార్తాంతికద్విజులగోష్ఠి = జ్యోతిశ్శాస్త్రవిదులైన విప్రులయొక్క సంబంధమును, జాము వోవ=జాముప్రొద్దెక్కిన వెనుకను, అమాత్య=మంత్రులును, సామంత=అమరగాండ్రును, పూర్వకంబు=మొదలుగా=అర్థార్జనష్టద్రవ్యార్జనాధికారమునందుండువారలయొక్కయు, కాయస్థ=కరణాలయొక్కయు. గోష్ఠి=సంబంధమును, దినమధ్యమమునన్=మధ్యాహ్న సమయమునందు, మర్దన=మైమర్దనముఁజేయునట్టి, మల్ల=జెట్టివాండ్రు, పూర్వకంబుగన్ లోనుగా, సూద=వంటకమువండువారియొక్కయు, సూపకృత్=పప్పుకూరలువండు వారలయొక్కయు, మృగయు=వంటవారికి మాంసముదెచ్చియిచ్చునట్టి వేటకాండ్రయొ క్కయు; గోష్ఠి = సాంగత్యమును, అపరాహ్ణమునన్ = పగటితృతీయభాగమునందు, దేవ తార్చనాపూర్వకంబు = దేవపూజ మొదలుగా, ఆర్య =పూజ్యులయొక్కయు, ధర్మాధికృ త్ = ధర్మాధికారులయొక్కయు, యతుల = జ్ఞానముసుపదేశించుచున్న మౌనులయొక్క యు, గోష్ఠి = సభయును, భుక్తిమీఁదన్ =భోజనముఁజేసినపిమ్మటను, విదూషకపూర్వ కము = వికటకవులు మొదలుగా, పురాణ= పౌరాణికులయొక్కయు, కవి=కవీశ్వ రులయొక్కయు, గోష్ఠి=సభయును, సంజజాము = సాయంకాలమునందు, చారపూర్వక ము=వేగులవారు మొదలుగా, గాయకగోష్ఠి = పాఠకులయొక్కగోష్ఠియును, నిశన్ = రాత్రియందు, సుషుప్తిపూర్వకము = నిద్రవోవుట మొదలుగా, ప్రేయసీగోష్ఠి = తనప్రి యురాలిగోష్ఠియును, పొసఁగున్ = ఒప్పును.

తా. సుగమము.

క. హితులు హితాహితులనఁగా, హితులునునై రాజునెడల ♦ నిటు త్రివిధమునన్
క్షితి ననుచరు లుందురుసం, తతముఁ మఱివారిఁ దెల్పెదన్ విను మనఘా. ౨౭౩.

టీ. ఈపద్యార్థము వెనుకటిపద్యమున స్పష్టమగునుగనుక దీనికి టీకవ్రాయలేదు.

చ. హితులు భిషగ్గ్రహజ్ఞబుధ ♦ బృందకవీంద్ర పురోహితుల్ హితా
హితులు ధనార్జనాదినృప ♦ కృత్యనియుక్తులు వెండి కేవలా
హితులు దశావశార్పితస ♦ మృద్ధరమాభరణేచ్ఛు లౌట నా
హితయును నట్లు కాఁ జతుర ♦ వృత్తిఁజరించుట నీతి యోనికిన్. ౨౭౪.

టీ. భిషక్=వైద్యులును, గ్రహజ్ఞ=జ్యోతిషికులును, బుధబృంద = విద్వత్సమూ హమును, కవీంద్ర=కవివరులును, పురోహితుల్ =పురోహితులును, హితులు=ఇష్టులు, ధనార్జనాది = ద్రవ్యముపోగుచేయుట మొదలగు, నృపకృత్య = రాచకార్యములయందు, నియుక్తులు=అధ్యక్షులుగా నియమింపఁబడినవారలు, హితాహితులు = హితులుగానహి

తులుగానుండుదురు, వెండి=మఱలను, దశావశాప్పిత = ఆయాదశావశముచేత నగరింటి కియ్యఁబడినట్టి, సమృగ్ధరమాభరణేచ్ఛలు=సమగ్రమైన తమమైశ్వర్యములను సమయ భేద ములయందు మరలఁబొందవలయునని కాంచియుండువారలు, కేవలాహితులు = కేవల శత్రువులు, కాఁటన్=అట్లగుటవలన, అహితమును=వారివట్లు తాఁజేసినహితమును. అట్ల కాన్=తదనుగుణమగునట్లుగా, చతురవ్యాప్తిన్=నిపుణవ్యాపారముచేతను, చరించుట= నడచుట, జనికిన్=రాజునకు, నీతి=తగినది.

తా. సుగమము.

ఆ, వె. పాత్రభూతు లెస్సఁ ♦ బరికించి యతఁ డడు,
గకయు నొకఁడు సెప్ప♦కయు మునుపుగఁ,
బనసపండ్లు దిగిన ♦ పరిగ స్వప్నము గన్న,
నెఱిగ నొసఁగి వెలుఁగు ♦ పఱచు టొప్పు. ౨౭౫.

టీ. పాత్రభూతున్ = సత్పాత్రమైనవానిని, లెస్సన్ = చక్కఁగా, పరికించి= తెలిసి, అతఁడు = ఆయోగ్యపురుషుఁడు, అడుగకయున్ = అడుగుటయును, ఒకఁడు సెప్పకయు = మఱియొక్కఁడతనికి దానమిమ్మని తనతోఁ జెప్పుటయును, మునుపుగన్= మున్నుగా, పనసపండ్లు దిగినపరిగన్ = ముత్తములుగాఁ బనసపండ్లొకసారిదిగినచంద ముగాను, స్వప్నముగన్న నెఱిగన్ = కలలో సకలవస్తుజాతముల నొక్కపర్యాయము గాఁజూచినరీతిని, ఒసంగి= ఒక్కసారిగానే హిరాళముగానిచ్చి, వెలుఁగుపఱచుట= ఆసత్పాత్రమద్భుతమొందఁజేయుట, ఒప్పన్ = తగును.

తా. సుగమము.

క, పితృదేవక్రియలను విధిఁ, బితృక్రియలె సూక్ష్మ లగుటఁ ♦ బితృభక్తుఁడవై,
శ్రుతిశీలతపశ్శాంతా, చ్యుతభక్తుల కొసఁగి వినుపు ♦ మున్నతగతికిన్. ౨౭౬.

టీ. పితృ= పితృదేవతలయొక్కయు, దేవ = దేవతలయొక్కయు, క్రియలన్= కర్మములయందు, విధిన్ = విధిశాస్త్రముచేతను, పితృక్రియలె = పితృప్రీతికరములైన కర్మములె, సూక్ష్మలగుటన్ = బుద్ధిమంతులచే విచారింపఁదగినయతిశయముగలవి యగు టచేతను, పితృభక్తుఁడవై =నీవును బితృభక్తిగలవాఁడవై, శ్రుతిశీలతపశ్శాంతాచ్యుతభ క్తులకున్ = శాస్త్రాధ్యయనముచేతను మంచినడతలచేతను వయస్సుచేతను శాంతులై య చ్యుతునిభక్తిగల్గియున్న వారలకు, ఒసంగి= అభీష్టవస్తువులనిచ్చి, ఉన్నతగతికిన్ =పితృ లనూర్ధ్వలోకములకు, వినుపుము = అంపుము.

తా. సుగమము.

క. దానము ద్విజరక్షణమును, జ్ఞానము నిజరక్షణముఁగ ♦ శరణముఁ జొరు మెం,
తే నారాయణు రాజ్యాం, తే నరకం ధ్రువ మటంట ♦ దీరునె యొంటన్. ౨౭౭.

టీ. (బ్రాహ్మణసంరక్షణము రాజధర్మమగుటంజేసి) దానము = తాఁజేయునట్టి దానములు, ద్విజరక్షణమును = బ్రాహ్మణసంరక్షణకొఱకనియు, జ్ఞానము = శ్రీపతిసర్వోత్కృష్టుఁడు నీ సమస్తచేతనులు నతనికి దాసభూతులని యెఱుంగుట; నిజరక్షణముగన్ = తనరక్షణార్థమనియును, (తెలిసి) ఎంతేన్ = మిక్కిలి, నారాయణున్ = శ్రీమన్నారాయణుని; శరణముఁజొరుము = లెస్సఁగా శరణు వేడుము, రాజ్యాంతేనరకం ధ్రువమటంట = రాజునకు రాజ్యాంతమునందు నరకము నిశ్చయమను లోకోక్తిగలదు గావుననది, ఒంటన్ = మఱియొకదానివల్ల, తీరునె = తొలఁగునా, (తొలఁగదనుట)

తే, గీ. ఆలు పతిభక్తి స్త్రీపుంస ♦ పాళి వావి, యతి వశిత్వము దిగుజాతు ♦ లగ్రజాతి,
ననుసరించుట హితవృత్తి ♦ నధిపుపనికి, భృత్యుఁ డొదవుట నృపదండ ♦ భీతిఁజుమ్ము.

టీ. ఆలు = భార్య, పతిభక్తి = భర్తృవిషయమైన పూజ్యానురాగమును, స్త్రీపుంస = స్త్రీపురుషులయొక్క, పాళి = పఙ్క్తి, వావి = వరుసలను, యతి = జడదారి, వశిత్వము = ఇంద్రియనిగ్రహమును, దిగుజాతులు = తక్కువజాతివారు, అగ్రజాతిన్ = మొదటిజాతివారిని, అనుసరించుట = భక్తియుక్తులై యనుసరించియుండుటయు, అధిపుపనికిన్ = ఏలెడువానికార్యమునకు, హితవృత్తిన్ = మంచినడతగలవాఁడై, భృత్యుఁడు = బంటు, ఒదవుట = ఉపయోగపడుటయును, నృప = ఓయిరాజా, దండభీతిఁజుమ్ము = దండనభయము చేతఁజుమీ.

తా. ఇట్లుండుటంజేసి రాజులకు యుక్తదండన మవశ్యకర్తవ్యమనుట.

ఆ, వె. చంపి ధార్మికుండు ♦ సతిఁ బొంది మఱిఁ బ్రహ్మ, చారి బొంకి సత్య ♦ శాలి యార
గించి సదుపవాసి ♦ కేడించి శూరుఁడు, చింది ధనియు నగు వి ♦ చిత్రసరణి. ౨౭౮.

టీ. చంపి = దుష్టులనుమచ్చమాపి, ధార్మికుండు = ధర్మాత్ముఁడును, సతిన్ = తన ధర్మపత్నిని, పొంది = ఋతుకాలములయందుఁగలిసి, బ్రహ్మచారియు = బ్రహ్మచర్యము గల్గువాఁడును. బొంకి = పగులను మేలుగలుగునట్లుదబ్బఱలాడి, సత్యశాలి = యథార్థవాది, ఆరగించి. (అవేళయందు భుజింపక) సాయంప్రాతర్ద్విజాతీనామను విధిననుసరించి యనుమాఱుమాత్రము భోజనము చేసి, సదుపవాసి = ఆహారరహితుఁడును, కేడించి = గురుజనాదులతో వాగియనుమతిని సంప్రాప్తమగుయుద్ధమునట్టివిముఖుఁడై చాలించి, శూరుఁడు = వీరుఁడును, చింది = సత్పాత్రమందు పొందుగ వ్యయము జేసి, ధనియున్ = ధనికుడును, విచిత్రసరణిన్ = అద్భుతరీతిని, అగున్ = అగును. (కావున సూక్ష్మధర్మమును దెలిసినడపవలయుననుట)

ఆ, వె. ప్రణిధి స్వపురస్థ హి యు ♦ భాషావిదుఁడు ప్రణి, ధ్యంతరావిదుండు ♦ నగునతండు,
లింగమాత్రకృశుఁడు ♦ లిఖ్యాదిగద్రవ్య, దానధనియుఁ గాక ♦ తలియఁ బోరఁడు. ౨౭౯

టీ. ప్రణిధి=వేగువాఁడు, (ప్రణిధిః ప్రార్థనే చ రే యని యరము) స్వపురగృహియు= తనపట్టణమునందుఁ గాపురముండువాఁడును, భాషావిదుఁడు = నానాభాషలు దెలిసిన వాఁడును, ప్రణిధ్యంతరావిదుండు = దేశాంతరపు వేగరులను దాఁ దెలిసినవాఁడును, లింగమాత్రకృశుఁడు = ఏచిహ్నమును లేనివాఁడును, లిప్సా = తాఁగోరినంతకంటె, అతిగద్రవ్య = అధికద్రవ్యమును, (వాంఛాలిప్సామనోరథయని యమరము) దాన= దొరయిచ్చుటచేత, ధనియు = ధనవంతుఁడును, కాక=కానివాఁడై, తఱియఁజొరఁడు= ఆవృత్తికిఁ బ్రవేశింపఁడు.

తా. సుగమము.

క. తనుభృశదమనజసుకృతము, ధనదత్తినె కొనఁగవలయుఁ ♦ దత్తదృతుకమ,
ర్దనమజ్జనభోజనలే, పనవసనప్రసవవహన ♦ పరతం బలికిన్. ౨౮౧

టీ. తను = శరీరమును, భృశ = మిక్కిలి, దమనజ = ఉపవాసాదులుండి శోషింపఁ జేయుటచేత సంపాదించునట్టి, సుకృతము = పుణ్యము, పలికిన్ = రాజునకు, ధనదత్తినె = ద్రవ్యము నమితముగా నిచ్చుటచేతనే, కొనఁగవలయున్ = గ్రహింపవల యును, తత్తదృతుక = ఆయాకాలములకు ననుకూలములైన, మర్దన = అంగమర్దనము, మజ్జన=స్నానము, భోజన = అభ్యవహారము, లేపన = మైపూఁతయు, వసన=వస్త్రము, ప్రసవ = పుష్పము, వహనపరతన్=వీనియొక్క సేవతో నుండికొనవలయునని పూర్వ పద్యముతో నన్వయము.

క. నానావిధషాడబముల, నానునృపాహార మెపుడు ♦ నపరాహ్ణమునం,
గాని మఱి శుద్ధకోష్ఠువు, గానితమి న్భుక్తి యెపుడుఁ ♦ గడు బథ్య మగున్. ౨౮౨

టీ. నృపాహారము=రాజులుభోజనము చేయువంటకము మొదలగునది, ఎపుడున్= ఏకాలమందును, నానావిధ = పలుతెఱంగులైన, షాడబములన్ = రుచులతోడను, ఆనున్ = కూడియుండును, అపరాహ్ణమునంగాని = అపరాహ్ణమందే కాని, మఱి= అటుగాక, శుద్ధకోష్ఠువు = గర్భగోళశుద్ధి, కానితమిన్ = కాకుండునట్టి త్వరచేత, భుక్తి = భోజనము, ఎపుడు = ఏసమయమందు, కడున్ = మిగులను, పథ్యము= హితము, అగున్ = ఔను.

తా. అనఁగా నపరాహ్ణమునందు భోజనము చేసినట్టాయెనా శరీరమునకు సౌఖ్య కరముగా నుండుననుట.

క. విను వర్గసమత నృపుఁ డు, న్నను ధర్మాంశంబె హెచ్చె ♦ నా పెఱ మడి కె,
త్తిననీరును దెగి యలరా, జనపుమడికి నెక్కినట్లు ♦ చేనుము దమందన్. ౨౮౩

టీ. నృపుఁడు = రాజు, వర్గసమతన్ = ధర్మార్థకామములనియెడు త్రివర్గసంప దయందు సమత్వముతో, ఉన్నన్ = ఉండగా, ధర్మాంశంబె = అందు ధర్మము

త్రము, హెచ్చెనా = అతిశయించెనా, పెఱమడికిన్ = మిగిలినమళ్ళకు, ఎత్తిన = కట్టఁబడిన, నీరును = ఉదకమును, తెగి = గండివేసికొని, రాజనపుమడికిన్ = వరిపైరు కయ్యకు, ఎక్కినట్లు = పాఱినచందముగా, ముదమందన్ = సంతోషించుట, చనున్ = తగును.

తా. సుగమము.

క. వెలయించునట్టియొకమణి, వెలుఁగాశం గొనుము ధరణి ♦ వెండి సువేషో,
జ్జ్వలతకు వలదే వాసర, ములమణుల విభూషణములు ♦ భూపతి దాల్పన్. ౨౮౪.

టీ. వెలయించునట్టి = నిర్దోషమై వెలుఁగునట్టి, ఒకమణిన్ = ఒకరత్నములలో నేరత్నమునైననొక్కటిని, వెలుఁగాశన్ = కాంతియందుఁగల యపేక్షచేతను, కొనుము = విడువక ధరియింపుము, వెండి = ఇంతియేగాక, ధరణిన్ = భూమియందు, భూపతి = రాజు, సువేషోజ్జ్వలతకున్ సువేష = మంచియలంకారముయొక్క, ఉజ్జ్వలతకున్ = ప్రకాశించుటకు, వాసరములన్ = ఏడువారములయందును, దాల్పన్ = ధరియించుకొనుటకు, మణులవిభూషణములు - మణుల = రత్నములచేఁ జెక్కఁబడిన, విభూషణములు = సొమ్ములు, వలదె = వలదా, అవశ్యముగ ధరియింపవలెనని కాకువు (అనఁగా నేజాతియందైనను ఘనమైన మాణిక్యమొకటి ప్రకాశార్థమై నిరంతరము ధరియింపవలయుననియు మఱియు నేడు వారాలలోఁ గ్రమంబుగ రత్నములచేఁ బొదుగఁబడియున్న సొమ్ముల నాయాదినముల యందలంకరించుకొనవలయునని భావము.)

క. చేయునది రాజ్య మఁట యఘ, మే యవధిగ నీఁగువార ♦ మే మనఁ జన దా,
మ్నాయంబు నశక్యాను, ష్ఠేయముఁ జెప్పదు స్వశక్తిఁ ♦ జేయఁగఁ జెప్పన్. ౨౮౫.

టీక. చేయునది = చేయుచుండునది, రాజ్యమఁట = ప్రభుత్వమఁట, అఘము = ఈపాపమును, ఏయవధిగన్ = ఎన్నాళ్లకు, ఏము = మేము, నీఁగువారము = పోఁగొట్టుకొనగలవారము, అనఁజనదు = అనితలంపఁగూడదు, ఆమ్నాయంబును = వేదమును, స్వశక్తిన్ = శక్త్యనుసారముగా, చేయఁగన్ = చేయవలయునని, చెప్పన్ = విధించునుగాని అశక్య = సాధ్యముగాని, అనుష్ఠేయమున్ = కృత్యమును, చెప్పదు = విధింపదు, (అనఁగా శక్త్యనుగుణముగ ధర్మమాచరించి యాధర్మ పరిహారమొనర్చినం బాపంబులంటవనుట)

వ. మనుదండధరాదులు విశేషించి దోషం బెఱింగి దండించిరొ ధర్మపరు లనఁబరఁగిరి ప్రజాపరిపాలనంబు పనిగాఁ బ్రజానాథుండు బహుముఖంబులం బుట్టింపం బుట్టి విరాట్సమ్రాట్ప్రభృతి వేదోదితశబ్దవాచ్యుండై దేవసదృశుం డగుమూర్ధాభిషిక్తుఁడు సోకోర్వియిలకు నగునలజడ్లు తీర్చినంగాక జన్మంబు సఫలం బగునె కేవలేంద్రియ ప్రీతిబంధీకృతపరకళత్రపథికపరిషత్పరిహరణప్రాప్తవిత్తములఁ బాటచ్చరప్రభులకుజర

పరిషత్ = సమూహమును, ప్రహరణ = కొట్టుటచేతను, ప్రాప్త = లభించినటువంటి, విత్త స్ఫూర్తులన్ = ధనములచేతను, పాటచ్చరప్రభులకున్ = దొంగదొరలకును, జరగదె = కాలము గడవలేదా, ఇంతలాంపట్యమేమిపనియని = ఇంతటియాయాసమెందుకని, అవనియెడన్ = భూమిపట్ల, అవన = రక్షించుటయందు, వైముఖ్యంబు = విముఖభావము. చెల్లదు = కూడదు, ఎట్లనినన్ = ఏలాగంటివా, తొల్లి = పూర్వకాలమందు, కృతయుగంబునన్ = కృతయుగమందు, కృత్యవీర్యనందనుండగు = కృతవీర్యునిపుత్రుండైన, సహస్రబాహుండు = సహస్రబాహుఁడనువాఁడు, ఆత్మీయదోస్స్తంభ = తనభుజములచేతను, సంభృతయగు = భరింపఁబడినదైయున్న, ఈవిశ్వంభరన్ = ఈభూమిని, ఏద్వీపంబునన్ = ఏదీవియందు, ఏనాఁటన్ = ఏదినమందు, ఏవీటన్ = ఏపట్టణమందు, ఏత్రోవన్ = ఏమార్గమందును, ఏక్రేవన్ = ఏకార్యమందును, ఏవేళన్ = ఏసమయమందును, ఎవ్వండు = ఎట్టివాఁడు, ఏమిసేయందలంచున్ = ఏమియొనర్చుటకుఁ జింతించుచుండునో, అప్పుడందండు = అప్పుడెవానినంతయు నెఱింగి యక్కడక్కడ, అసిముసలచాపాది = కత్తి, రోకలి, విల్లులోనుగాఁగల, శస్త్రాస్త్రధారియై = శస్త్రాస్త్రములధరించినవాఁడై, తోఁచి = కనఁబడి, ఆజ్ఞయిడున్ = దండించును, అట్లాజ్ఞయిడన్ = ఆలాగుదండించుటకు, అంతిమంబగు = కడపటిదైన, ఈయుగంబునన్ = ఈకలియుగమందు, యాగానుసారంబుగా = యజ్ఞములకుఁదగినట్లు, మితసారంబగు = స్వల్పబలముగల, రాజలోకంబునకున్ = నృపవర్గమునకు, శక్యంబుగాదుగదా, ఒక్కరాజులోకంబునకున్ = ఒకక్షత్రియజనమునకు, అననేల = చెప్పనేమిటికి, ఇక్కాలంబునందలి = ఇప్పుడున్నటువంటి, భూమిదివిజులకున్ = భూసురులకున్, కల = కలిగియున్న. శక్తి = నిగ్రహసామర్థ్యము, ఉన్నదె = కలదా, ఒక్కబాడబుండు = ఒకపుడమిఱేఁడు, కడలినీరు = సముద్రోదకమంతయును, గ్రుక్కఁగొనియెన్ = పుక్కిలియందిమిడ్చెను, ఒక్కవిప్రుండు = విశ్వామిత్రుఁడనునొకద్విజుండు, స్రష్టసృష్టికిన్ = బ్రహ్మసృష్టికి, ప్రతిస్రష్టయయ్యెన్ = మాఱుసృష్టిచేయువాఁడాయెను, ఒక్కబ్రాహ్మణుండు = వసిష్ఠుండనుతికెక్కినయొక మునివర్యుండు, బ్రహ్మదండంబునన్ = బ్రహ్మదండముచేత, బ్రహ్మాస్త్రంబున్ = చతురాననాస్త్రమును, వారించెన్ = మట్టుపఱిచెను, అట్టియనుష్ఠానంబు = అటువంటి తపశ్చర్య, మాకులేదు = మాయందుఁగనఁబడదు, ఎందేమిప్రయోజనంబని = దేనియందేమికార్యమని, వీరికిన్ = ఈద్విజులకు, శక్త్యనుష్ఠానంబు = యథాశక్తినాచరించుట, విడ్వవచ్చునె = త్యజింపఁదగునా, వీరు = ఈబ్రాహ్మణులు, ఇతరులకున్ = క్షత్రియాదులకు ఉపాసనీయులుగాక పోయిరే = పూజ్యులుగాకయున్నారా, కావునన్ = అట్లుండుటచేతను, సావధానుండవై = జాగ్రత్తగలవాఁడవై, శక్తికొలఁది = సామర్థ్యానుగుణముగా, శ్రుత = వినఁబడినవానిని, దృష్టంబులు = చూడబడినవానిని, ఉపేక్షింపక =

అశ్రద్ధచేయక, రక్షణశిక్షణంబులు=శిష్టసంరక్షణదుష్టశిక్షణంబులను, ఆచరించుచున్= చేయుచును, అశక్యంబునకున్ = నీకు నలవిగాని కార్యవిషయమై, ఆర్తశరణాగతరక్షకుండగు = దీనజనసంరక్షణబద్ధదీక్షుండగు, పుండరీకాక్షుమీఁదన్ = శ్రీమన్నారాయణునిమీఁదను, భారంబిడి = బరువుంచి, అనహంకృతిన్ = అహంకారరాహిత్యముచేతను, ప్రవర్తిల్లన్=సంచరింపఁగా, ఎల్లసంసిద్ధులు =సకలకార్యసిద్ధులును, కరస్థంబులగున్ = అఱచేతిలోనుండునవియగును, అదియట్లుండె = అదియాలాగుండెను. అట్లైన=అవిధమైన, పట్టబద్ధుండగు=పట్టముగట్టఁబడిన, రాజు=ప్రభువు, ధర్మంబునందె= ధర్మమునందే, దృష్టియిడి=జ్ఞప్తినుంచి, నడవవలయు = ప్రవర్తింపవలయును, వరుణవైశ్రవణ వాయువైశ్వానరవాసవాదుల = వరుణకుబేరానిలధనంజయేంద్రాదులయొక్క, జన్మంబులును=ఉత్పత్తులును, బహుభవార్జ్య = అనేకజన్మములయందారంభింపఁబడిన, క్రియా=యాగాదిక్రియలచేతను, లబ్ధంబుల = పొందఁబడినవె, భూర్భువస్స్వరాదులగు, ఇజ్జగంబులును = ఈలోకములును, ధర్మప్రతిష్ఠితంబులు కావునన్ = ధర్మమునందెయుండునవిగనుక, తదాచరణచణుండవై = దానినాచరించుటయందు దక్షుండవై, ఋణత్రయంబును=ఋషిదేవపితృఋణములను, నీఁగి=తీర్చి, సమానులంపు=నీతోడివారలలోను, ఉత్తమశ్లోకుఁడవై =కీర్తికరుండవై, రాజ్యపరిపాలనంబు = ప్రజాపరిపాలనంబును, చేయుమని=ఒనర్చుమని, అభిషిక్తుఁజేసెన్ = పట్టాభిషిక్తుఁగావించెను, ఇది= నాచేతఁజెప్పఁబడిన యీసంగతి, మదీయభక్తప్రభావంబని=నాభక్తునిప్రభావమని, అంబుజాలయకున్ = లక్ష్మీదేవికి, ఆనతిచ్చెన్ = తెలియునట్లుసెలవిచ్చెను.

శా. దుగ్ధాంభోధిమహాగృహోత్సుక సుధాంధోబృందచూడామణీ
రుగ్ధారాశబలీకృతాంఘ్రియుగ కారుణ్యాంబుసింధూభవ
ద్దృగ్ధామా ధృతమంథ సింధురవరార్తిక్షేపిదోశ్చక్ర శ్రీ
ముగ్ధాలాపరసాదరా కృతపలాన్యార్థస్వనోద్యద్ధరా. ౨౦౬.

టీ. దుగ్ధాంభోధి = పాలసముద్రమనియెడు, మహాగృహ = గొప్ప మందిరమందు, ఉత్సుక=ఆసక్తుఁడవైనస్వామీ, సుధాంధోబృంద = వేల్పులగుంపులయొక్క, చూడామణి = శిరోరత్నములయొక్క, రుగ్ధారా = కాంతిపరంపరచేతను, శబలీకృత=శబళవర్ణముగాఁ జేయంబడిన, అంఘ్రియుగ=పాదయుగళముగలవాఁడా, కారుణ్యాంబు=దయారసమను నీటికి, సింధూభవత్=సముద్రమగుచున్న, దృక్ =చూపులకు, ధామా = ఉనికిపట్టైనవాఁడా, ధృత=మోయఁబడిన, మంథ=కవ్వపుఁగొండగలవాఁడా, సింధురవర= గజేంద్రునియొక్క, ఆర్తి=ఖేదమును, క్షేపి=పోఁగొట్టుచున్నటువంటి, దోః = భుజమండలి, చక్ర=చక్రాయుధముగలస్వామీ, శ్రీ=లక్ష్మీదేవియొక్క, ముగ్ధాలాప=ముగ్ధవలుకుల

యందును, రస=శృంగారాదిరసములయందును, ఆదరా=ఆదరముగల యోస్వామీ, కృత=చేయఁబడిన, పలాత్=రక్కసులయొక్క, మూర్ఛ=మూర్ఛగల, స్వన=ధ్వనిచేతను, ఉద్యత్=విజృంభించుచున్న, దరా=శంఖముగల యోస్వామీ యని యాశ్వాసాంతమున భగవత్ప్రార్థన.

క. కరధృతదరారివితరణ, పరిపాలితతొండమాన్నృ♦పాలక పునరు
త్తరితనరనప్తృబాలక, శరణాగతసేవధీభు♦జంగాశరథీ. ౨౮౭.

టీ. కరధృత=హస్తముచేత ధరింపఁబడిన. దరారి=శంఖచక్రములయొక్క, వితరణ=ఇచ్చుటచేతను, పరిపాలిత=రక్షింపంబడిన, తొండమాన్నృపాలక = తొండమాన్చక్రవర్తియను రాజుగలవాఁడా, (తొండమాన్ చక్రవర్తికి శంఖచక్రము లిచ్చెననుట ప్రసిద్ధము) పునరుత్తరిత=మరలఁబ్రతికింపంబడ్డ, నర=విజయునికి, నప్తృ = మనుమండైన, బాలక=చిన్నవాఁడుగలవాఁడా, శరణాగత = శరణుఁబొందినవారికి, సేవధి=నిధియైన యోస్వామీ, భుజంగాశ=గరుత్మంతునిచేత, రథీ=రథముగలస్వామీ.

మత్తకోకిల. కుండలిద్విషదుగ్రకేతన♦గోత్రభిద్ద్రుమహారిదో
శ్చండిమోత్పులకీకృతాంగక♦సత్య.దౌత్యకురూక్తవా
క్పండితత్వయశోనిధీకృత♦పాండవేయ కపర్దికో
దండఖండనపాటవాంచదు♦దారదారసమాగమా. ౨౮౮.

టీ. కుండలి=సర్పములకు, ద్విషత్=శత్రువైన గరుత్మంతుఁడే, ఉగ్ర=భయంకరమైన, కేతన=ధ్వజముగాఁగలవాఁడా, గోత్రభిత్=దేవేంద్రునియొక్క, ద్రుమ=వృక్షమును, హారి=హరించినటువంటి, దోః=భుజములయొక్క, చండిమ = అతికోపముచేతను, ఉత్పులకీకృత=పులకాంకురయుక్తముగాఁజేయఁబడిన, అంగక=అవయవములుగల, సత్య=సత్యభామగలవాఁడా, దౌత్య=దూతభావముచేతను, కురు=కౌరవులవిషయమందు, ఉక్త=పలుకఁబడిన, వాక్=మాటలయందు, పండితత్వ=పాండిత్యముచేతను, యశోనిధీకృత=కీర్తిమంతులుగాఁజేయంబడిన, పాండవేయ=పాండుకుమారులుగలస్వామీ, కపర్ది=శివుని యొక్క, కోదండ=వింటియొక్క, ఖండన=విఱుచుటయందు, పాటవ = నేర్పుచేతను, అంచత్=ఒప్పుచున్నటువంటి, ఉదార=గొప్పదియైన, దారసమాగమా = సీతాసంయోగముగల స్వామీ.

శ్లో. ఇది సింహాచలదంభకేసరిపదా♦భీష్టార్చనాపుణ్యల
బ్ధదురుట్టంకణ పొట్టునూరివిజయ♦స్తంభోపలోట్టంకితాం
కద్వృఢేష్టాక్షరకృష్ణరాయనృపసం♦జ్ఞాప్యత్కృతౌ ముక్తమా
ల్యద నాశ్వాసవరంబు నాలవది హృ♦ద్యంబై మహిం బొల్పగున్. ౨౮౯.

టీ. ఇది, సింహాచల=సింహాద్రియందలి, దంభకేసరి = మాయానృసింహుఁడైన స్వామియొక్క, పద=పాదములయొక్క, అభీష్ట=ఇష్టములైన, అర్చనా=పూజలచేతనైనట్టి, పుణ్య=సుకృతముచేతను, లబ్ధ=పొందఁబడినటువంటి, దురుట్టంకణ=ప్రయత్నముచేనాటఁదగినటువంటి, పొట్టునూరి=పొట్నూరియందలి, విజయస్తంభోపల = ఱాతిజయస్తంభమందు, ఉట్టంకిత = వ్రాయఁబడినటువంటియు, అంక = బిరుదైనటువంటియు, దృఢ=శాశ్వతమైనటువంటి, ఇష్టాక్షర=అభిమతవర్ణములుగల్గిన, కృష్ణరాయనృపసంజ్ఞ=కృష్ణరాయధరణీకాంతుండనియెడు సంజ్ఞగల్గిన, అస్మత్=నాచేత, కృత = రచియింపఁబడిన, ఆముక్తమాల్యదన్ = ఆముక్తమాల్యద యను ప్రబంధమందు, నాలవది = నాల్గవదియైన, ఆశ్వాసవరంబు=శ్రేష్ఠమైనయాశ్వాసము, హృద్యంబై=సకలకవిజనమనోహరంబై, మహిన్ = భూమియందు, పొల్పగున్ = ప్రసిద్ధమౌను.

---

గద్యం. ఇది శ్రీదక్షిణామూర్తి మంత్రోపాసనా సమాసాదితాఖండసాహిత్య ధురీ
ణుండు నాత్రేయగోత్ర పవిత్రుండును నావిశ్యవంశపయోరాశి రాకా
సుధాకరుండు నగు రామస్వామి శాస్త్రిచేత ననేక పూర్వ
వ్యాఖ్యానాభిప్రాయంబులఁ బర్యాలోచించి రచియింపఁ
బడిన రుచిసమాఖ్యానం బగు నాముక్తమాల్యద
వ్యాఖ్యానంబునందుఁ జతుర్థాశ్వాసము
ముగిసెను.

శ్రీ

శ్రీ కృష్ణాయ నమః

# ఆముక్తమాల్యద * సవ్యాఖ్యానము.

## పంచమాశ్వాసము.

కం. శ్రీ నీళా జాంబవతీ, మానస తామరస విహరమాణమిళిందా,
భా నద్యుదయ కళిందా, నానాంఘ్రిశిరోక్ష శేష నగ హర్యక్షా. ౧.

టీక. శ్రీ=లక్ష్మీదేవియొక్కయు, నీళా = నీళాదేవియొక్కయు, జాంబవతీ= జాంబవతీదేవియొక్కయు, మానస=మనస్సులనియెడు, తామరస = తామరపూవుల యందు, విహరమాణ=విహరించుచున్న, మిళిందా=భృంగమా, భా = శరీరకాంతియని యెడు, నదీ=యమునానదియొక్క, ఉదయ=ఉత్పత్తికి, కళిందా = కళిందమనుపేరు గల పర్వతమా, (కాళిందీనది కాంతి వంటి శరీరకాంతి గల వాఁడనుట), నానా=అపరిమితములైన, అంఘ్రి=పాదములను, శిరః=శిరములును, అక్ష=కన్నులునుగలవాఁడా, (ఇది పురుషసూక్తప్రశస్తము), శేషనగ=శేషాచలమునందు, హర్యక్షా = సింహమా, అని స్వామికి విశేషణములు.

తాత్పర్యము. సుగమము.

వ. అవధరింపు మవ్విష్ణుచిత్తుండు. ౨.

టీక. అవధరింపుము=చిత్తగింపుము, అవ్విష్ణుచిత్తుండను కర్తృపదము ముందటిపద్యమున కన్వయింపఁగలదు.

మహాస్రగ్ధర. ఒకనాఁ డామ్రాంకురౌఘం బురుకుసుమ కుడుంగోద రక్షోణిఁ దల్ప
ప్రకరం బై కాంతుచే నుస్పతులఁబదరి పైఁ బ్రౌఢి వాటించి నిట్టూ
ర్పొకఁ దొట్టం డస్సి పేరాయిత మఱి మఱి తా రెట్లు మున్నట్టియా నా
యికలం గందర్పుఁ డోటం బెఱిఁగి తఱిమి వీఁపే సెనా నంటు తోఁటన్. ౩.

టీక. ఒకనాఁడు= ఒక్కదినమందు, (ఇచ్చట సప్తమికిఁ బ్రథమ), ఆమ్రాంకు రౌఘంబు, ఆమ్రాంకుర=మామిడిచిగుళ్లయొక్క, ఓఘంబు=సమూహము, ఉరు = గొ

ప్పలగు, కుసుమకుడుంగ = పూఁబొదలయొక్క, ఉదర = అంతఃప్రదేశములయందలి, క్షోణిన్=భూమియందు, తల్పప్రకరంబై, తల్ప = సెజ్జలయొక్క, ప్రకరంబై= పరంపరయై, కాంక్షచేన్ = కోరికచేత, మున్=ప్రథమమందు, పతులన్=తమ నాయకులను, పదరి=రజ్జులాడి, పైఁబ్రౌఢి = ఉపరతిని, పాటించి = ఉపక్రమించి. నిట్టూర్పు = ఉచ్ఛ్వాసము, ఎకఁవోట్టన్ = ఉద్గతముకాఁగా, డస్సి=ఆయాసపడి, నీరాయికమ్ము = ఆయుపరతిని, అఱి=ఉడిగి, మఱి=పిమ్మట, తారు = తాము, (అనాయికలనుట), మున్ను=ఉపరతికిఁబూర్వమందు, ఎట్లు=ఏవిధమో, అట్లయా= ఆవిధముగానే యగు, (మరలఁగ్రిందైరనుట), నాయికలన్ = స్త్రీలను, కందర్పుఁడు=మన్మథుఁడు, ఓటంబు = ఓడిపోవుటను, ఎఱిఁగి = తెలిసి, తఱిమి = వెంబడించి, వీఁపే సెనాన్= వీఁపునఁగొట్టెనో యనఁగా, అంటు = అంటుకొన్న, తోఁటన్ = ఉద్యానమునందు, ఈ పద్యమునందు అమ్రాంకురౌఘంబనునది కర్తృపదము, అంటు అను ధాతువుతోడ నన్వయింపఁదగినది. మఱియు విష్ణుచిత్తుఁడను కర్తృపదముతో నన్వయింపఁదగిన క్రియాపదముపై పద్యమందున్నది.

తా. ఆ విష్ణుచిత్తుఁడొక్కనాఁడు మామిడి చిగుళ్ల శయ్యలయందు స్త్రీపురుషులు చేరి యుపరతమందుఁ బురుషుల నోడించునట్లు నాయికలు పంతగించి తాము పురుషులపైఁ జేరి యుపరతి సల్పుచు నాయాసము వలన రోఁజుచు నుపరతిఁ జాలించి పూర్వము తా మెట్లు క్రిందై యుండిరో యట్లే మరలఁ బురుషులకుఁ గ్రిందైరి. కావున నా సంగతెఱింగి మన్మథుండు స్త్రీలు ఉపరతి సాలించి యోడినందులకుఁ గుఱుతుగా నోడిన వారిని వీఁపునఁ గొట్టుట ప్రసిద్ధ మగుట వలన వారిని వీఁపునఁ గొట్టఁగా నైన గాయములో యనునట్లు మున్ను శయ్యగాఁబఱచికొన్న యాచిగుళ్లే చెమ్మటలుగల స్త్రీల వీఁపున నంటుకొని యుండె నని భావము.

ఉ. వింగడ మైన యొక్క వన • వీథిఁ గనుంగొనె నీడ సున్నపున్,
రంగుటరంగు పచ్చలయ • రంగయి పో వెలిదమ్మి బావికిం,
జెంగట నుల్లసిల్లు తుల • సీ వన సీమ శుభాంగి నొక్క బా,
లం గుసుమించ కందళ దళ • ప్రతిమాంఘ్రికరోదరా ధరన్. ౪.

టీక. వింగడమైన = విశాలమైన, ఒక్కవనవీథిన్ = ఒకశృంగారవనశ్రేణియందు, సున్నపునరంగుటరంగు = సున్నపురంగుగల తెల్లనితిన్నె, నీడన్ = వనచ్ఛాయచేత, పచ్చలయరంగయిపోన్ = మరకతమయ వేదికయగుచుండగా, వెలిదమ్మి బావికిన్ = తెల్లదామరపూవులుగలవాపికి, చెంగటన్ = సమీపమందు, ఉల్లసిల్లు= ప్రకాశించుచున్న, తులసీవనసీమన్ = తులసీవనప్రదేశమందు, శుభాంగిన్, శుభ =

శుభలక్షణయుక్తములగు, అంగిక్ = అవయవములు గలిగినట్టియు, కురువింద=కురువిందమను పేరుగల యొకజాతి కెంపులయొక్క, (సీ. "సలలిత మత్తకోకిల లోచన ద్యుతిఁ దనరారుఁ గురువింద మనెడు కెంపు" అని రత్నశాస్త్రము), కందళ=మొలకలయొక్క, దళ=చెక్కులతోడను, ప్రతిమ=సరియైన, అంఘ్రికరోదర = పాదతలహస్తతలములును, అధరక్=మోవియుఁగల, ఒక్కబాలక్ = ఒకబాలికను, కనుంగొనెక్ = విష్ణుచిత్తుఁడు చూచెను.

తా. విష్ణుచిత్తుఁడు శృంగారవనవీథిలో నీడలు తేటపడు తెల్లని సన్నపు రంగుగల యరఁటి చెట్టుల నీడల చేత మరకత మయమైనట్లు కనఁబడు చుండఁగా దాని సమీపమునందలి తెల్లదామరకొలని చెంగట నొక్క తులసీ వనమందు శుభలక్షణ లక్షితురాలగు నొకస్త్రీ శిశువును జూచెనని భావము.

చ. కనుఁగొని విస్మయంబొదవఁ గాఁ గదియం జని సౌకుమార్యమున్,
తను రుచియు న్సులక్షణవితానముఁ దేజముఁ జెల్వుఁ గొంత సే,
పనిమిష దృష్టిఁ జూచి యహహా యన పత్యున కమ్మకుందుఁ డే,
తనయఁగ నాకు నీశిశువుఁ దా గృపఁ జేసె నటంచు హృష్టుఁడై. ౫౫.

టీ. కనుఁగొని=చూచి, విస్మయంబొదవఁగాక్ = ఆశ్చర్యమంకురింపఁగా, కదియంజని = సమీపించిపోయి, సౌకుమార్యముక్= సుకుమారత్వమును, తనురుచియుక్ = దేహకాంతియును, సులక్షణ = శుభలక్షణములయొక్క, వితానముక్ = సమూహమును, తేజముక్ = తేజస్సును, చెల్వుక్ = సౌందర్యమును, కొంత సేపు= కించిత్కాలము, అనిమిషదృష్టిక్ = తెప్పపాటులేనిచూపుచేత, చూచి = వీక్షించి, అహహా = ఆశ్చర్యము, అమ్మకుందుఁడే = ఆవిష్ణుదేవుఁడే, అనపత్యునకుక్ = సంతానములేనివాఁడనగు నాకు, తనయఁగ = కూఁతునుగా, ఈశిశువుక్ = ఈబిడ్డను, తాక్ = తాను, విష్ణువనుట, కృపచేసెక్ = దయచేసెను, అటంచు = అనుకొని, హృష్టుఁడై = హర్షముగలవాఁడై.

తా. సుగమము.

కం. కొని పోయి ధర్మగేహిని, కనురక్తి నొసంగఁ బొంగి యాయమయును జేఁ,
పు నిజ స్తన్యంబుల చేఁ, బెనిచె న్గో మొప్ప నిట్లు పెరుగఁ గ్రమమునక్. ౫౬.

టీక. కొనిపోయి = ఆ శిశువును దీసికొనిపోయి, ధర్మగేహినికిక్ = తన భార్యకు, అనురక్తిక్ = అనురాగముతో, ఒసంగక్ = ఇయ్యఁగాను, పొంగి=సంతోషించి, ఆయమయును = ఆయమ్మయు, చేఁపు = ఉద్రేకించుచున్న, నిజ స్తన్యంబులచేక్, నిజ=స్వకీయములగు, స్తన్యంబులచేక్ = చన్నుఁబాలచేతను, గోము=గా

రాము, ఒప్పన్=పొందికయగునట్లు, పెనిచెన్=సాకెను, ఇట్లుపెరుగన్=ఈవిధముగ బెరుగుచుండఁగా, క్రమమునన్=క్రమక్రమముగానని ముందటి పద్యమున కన్వయము.

సీ. వాతెఱతొంటికైవడిమాటలాడదు, కుటిలవృత్తివహించెఁ గుంతలంబు,
లక్షులుసిరులురా నఱచూడ్కిఁ గనుఁగొనె, నాడించెబొమగొని యాననంబు,
చనుఁగొమల్నెగయ వక్షము పేక్షఁ గడకొత్తెఁ, బాణిపాదము లెఱ్ఱవాఱఁదొడఁగె,
సారెకుమధ్యంబు దారిద్ర్యములచెప్పె, లోచ్చోర్వకిటులోఁగఁ జొచ్చె మేను,
వట్టిగాంభీర్య మొక్కఁడు వెట్టుకొనియె, నాభినానాఁటికిఁగతిఁ నాటిపొందు,
చవుకయైనట్టి యిచ్చటఁ జనదునిలువ, ననుచుఁబాఱెనకరణి బాల్యంబుజాఱె. ౭.

టీక. వాతెఱ = అధరోష్ఠము, తొంటికైవడిన్=పూర్వమునవలె, మాటలాడదు=సంభాషింపదు, (యౌవన ప్రాదుర్భావము కాఁగానే రాజసము హెచ్చె ననుట), కుంతలంబులు = తలవెండ్రుకలు, కుటిలవృత్తి=కుటిలవ్యాపారమును, వహించెన్=ధరియించెను, (పూర్వమువలె సాధారణముగ నుండక కౌటిల్యమును దాల్చె నని యర్థము, వంకర లాయె నని భావము), అక్షులు=కన్నులు, సిరులురాన్=సంపదలు దమకు రాఁగానే, అఱచూడ్కిన్= సగము చూపు చేత, కనుఁగొనెన్=చూచెను. (చిన్ననాటివలెఁ జూడ దని యర్థము, యౌవనాతిశయముచేత రక్తశ్వేత నీలవర్ణములు గలిగి మెఱుఁగెక్కి విలాసములు గలిగె నని భావము), ఆననంబు=ముఖము, బొమగొని=కనుబొమముడివైచి, ఆడించెన్= కదలించెను. (పరిహాసమునకు బొమ్మలాడించెనని యథార్థాంతరము. మొగము ఓట్లించుకొనెనని యర్థము, జవ్వనమునఁ గనుబొమ్మలకుఁ గాంతియెక్కె నని భావము), చనుఁగొమల్ = స్తనాంకురములు, నెగయన్ = ఎగయఁగా, వక్షము=ఱొమ్ము, ఉపేక్షన్ = ఒప్పరికించుటచేత, కడకొత్తెన్=ఆవల ద్రోఁచెను, (స్తనములనియెడు వస్త్వంతరములుగలుగఁగానే తన్నుపేక్షించి చేరనీయక నూలకుఁ ద్రోచె నని యర్థము. జవ్వనమందుఁ జన్నులు చెన్నుమీఱె నని భావము), పాణిపాదములు = కరపాదములు, ఎఱ్ఱవాఱఁదొడఁగెన్ = కినుకచేత నరుణవర్ణము వహించెననుట. (యౌవనము రాఁగానే కాలు సేతులు మిగులఁ దొగరు జిగియెక్కె నని భావము), సారెకు=మాటిమాటికి, మధ్యంబు=నడుము, దారిద్ర్యములు=తనలేములే, చెప్పెన్=ఉచ్చరించెను. (తన లేమినే తెలుపును గాని పిన్న నాఁటివలెఁ గలిమిఁ దెలుప దని యర్థము, నడుము సన్న మయ్యె నని భావము), మేను=శరీరము, లోచ్చోర్వక=మునుపటివలె మాలిన్యము నోర్వక, ఇటు=ఈప్రకారముగా, లోఁగఁజొచ్చెన్=సంకోచింప నారంభించెను, (సందడి కోర్వదని యర్థము, నాగరికము హెచ్చెనని భావము), నాభి= బొడ్డు, వట్టిగాంభీర్యమొక్కఁడు = ప్రయోజన

ము లేని యొక్క గంభీరతను, పెట్టుకొనియెన్ = ఉంచుకొనెను. (తొల్లింటి యట్లుఁ గాక బెట్టుగా నుండెననియర్థము, మిక్కిలి లోఁతాయెనని భావము), నానాఁటికిన్ = నాఁడునాఁటికి, ఈగతిన్ = ఈవిధముచేత, నాఁటిపొందు = అలనాఁటి స్నేహము, చవుకయైనట్టి = ఎల్లిదమైనట్టి, ఇచ్చోటన్ = ఈయమశరీరమందు, నిలువఁజనదు = ఉండఁగూడదు, అనుచు = ఇట్లని, జాఱినకరణిన్ = వదలిపోయినట్టుగా, బాల్యంబు = పసితనము, జాఱెన్ = తొలఁగిపోయెను.

తా. సుగమము.

శా. హేమాభాంగ విభాఽధరారుణిమ వక్త్రేందుప్రభాశ్రీలఁ ద,
ద్భామారత్నము పొంద దయ్యె మును దత్తద్వర్ణ యుక్తాఖ్యలన్,
శ్యామాత్వం బళి గర్వధూర్వహ కచచ్ఛాయాచ్ఛటం గాంచె నౌఁ,
గా మున్నుర్వి శిరఃప్రధాన మను వాక్యం బెమ్మెయిం దప్పునే. [illegible]

టీక. తద్భామారత్నము = ఆకన్యారత్నము, మును = మొదలును, హేమాభాంగవిభా, హేమ = బంగారుయొక్క, ఆభా = కాంతివంటికాంతిగల, అంగ = నెమ్మేనియొక్క, విభా = పచ్చనికాంతియొక్కయు, అధరారుణిమ, అధర = వాతెఱయొక్క, అరుణిమ = ఎఱ్ఱనికాంతియొక్కయు, వక్త్రేందుప్రభా, వక్త్ర = నెమ్మోగముయొక్క, ఇందుప్రభా = చంద్రకాంతియొక్కయు, శ్రీలన్ = సంపదలచేతను, తత్తద్వర్ణయుక్తాఖ్యలన్, తత్తత్ = ఆయా, వర్ణ = పీతరక్తాదులగు వన్నెలకు, యుక్త = తగినట్టి, ఆఖ్యలన్ = నామధేయములను, పొందదయ్యెన్ = పొందనియది యయ్యెను, అళిగర్వధూర్వహ, అళి = తుమ్మెదలయొక్క, గర్వ = గర్వముయొక్క, ధూః = భారమును, వహ = వహించిన, కచ = క్రొమ్ముడియొక్క, ఛాయా = నీలకాంతులయొక్క, ఛటన్ = సముదాయముచేత, శ్యామాత్వంబు = శ్యామలవర్ణముగ్గలిగినదనుటను,(శ్యామాయౌవన మధ్యస్థా యని యనికెం జేసి యౌవన మధ్యస్థభావమునను నుట), కాంచెన్ = పొందెను, ఔఁగా = యుక్తమేకదా, మున్ను = పూర్వమందు, ఉర్విన్ = భూమియందు, శిరఃప్రధానమను = శిరస్సేప్రధానమనియెడు, వాక్యంబు = మాట, (సర్వస్యగాత్రస్య శిరఃప్రధానమనియెడు వాక్యము), ఎమ్మెయిన్ = ఏరీతిచేనైనను, తప్పునే = తప్పునా, తప్పదనుట.

తా. ఆకన్యక శరీరము బంగారువన్నె గలిగి యున్నదానివలన నాం డె. అధరోష్ఠ మెఱ్ఱఁగానుండినదానివలన నాఁడెు. నెమ్మోము చందురువన్నె గలిగి యుండిన దానివలన నొండెను. దత్తద్వర్ణానుసరణముగా హేమాంగి, బింబోష్ఠి, చంద్రముఖియనియెడు, నిట్టి నామములు వహింపక తేఁటులతో దీటగు నల్లని తలవెంట్రుకల

కాంతి కనుగుణముగ శ్యామయను నామమును వహించె ననియును శ్యామయన యౌవన మధ్యస్థురాలనియును సర్వశరీరమందు శిరమే ప్రధానమగుటచేత నా శిరః కాంతియే ప్రధానముగా నాపేరు వచ్చె నని భావము.

కం. ఆయతభుజైకచక్రుఁ, డా యదుపతి దోర్మిఁ గెలువ నడరు మరుని కా,
లాయసచక్రపరంపర, లో యన నుంగరపుఁగురులు యువతికి నమరున్. ౯.

టీక. ఆయత = నిడుదయగు, భుజ = భుజమందు, ఒక=ఒక్కటైన, చక్రుండు = సుదర్శనచక్రముగల, ఆయదుపతిన్ = అప్రసిద్ధుఁడగు శ్రీకృష్ణుని, దోర్మిన్= క్రమకయ్యముచేతను, గెలువన్ = జయించుటకొఱకు, అడరు = విక్రమించుచున్న, మరుని = స్మరునియొక్క, కాలాయసచక్రపరంపరలో, కాల = నల్లనైన, ఆయస = ఉక్కుతోఁ జేయఁబడిన, చక్ర=చక్రములయొక్క, పరంపరలో = సమూహములో, అనన్=అనునట్లు, ఉంగరపుఁగురులు = కుటిలకుంతలములు, యువతికిన్ = ఆయువిదకు, అమరున్ = ఒప్పును.

తా. ఈ గోదాదేవి శ్రీకృష్ణుని మోహింపఁ గలదియై యున్నది గాఁబట్టి నాకు చక్రము మాత్రము గలిగిన యీ శ్రీకృష్ణుని గెలుచుటకై యుద్యోగించిన మన్మథుని యొక్క చక్రముల గుంపులో యన్నట్లు యువతియొక్క యుంగరములుగాఁ బ్రకాశించుచున్న తలవెంట్రుక లొప్పె నని భావము.

తే. సకల సీమంతినీలోక సమతిశాయి, భాగ్యవర్ణావళులు వ్రాసెఁ బద్మగర్భుఁ,
డనఁగఁ గర్పూరతిలకరజోవదాత, ఫాలమునఁ గుంతలశ్రేణి పడఁతి కమరు. ౧౦.

టీక. పడఁతికిన్ = ఆస్త్రీకి, పద్మగర్భుఁడు=బ్రహ్మదేవుఁడు, సకల=సమస్తమైన, సీమంతిని=స్త్రీలయొక్క, లోక=జనములను, సమతిశాయి = మిక్కిలి యతిశయించుచున్న, భాగ్య = భాగ్యముగల, వర్ణ = అక్షరములయొక్క, ఆవళులు= పఙ్క్తులను, వ్రాసెననఁగన్ = లిఖియించెనోయనునట్లు, కర్పూరతిలక = కప్పురంపుఁదిలకముయొక్క, రజః=పరాగముచేత, అవదాత = ధవళవర్ణముగల, ఫాలమునన్ = నెన్నుదుటియందు, కుంతలశ్రేణి = ముంగురులగుంపు, అమరున్=ప్రకాశించును.

తా. కర్పూర తిలకముయొక్క పరాగము చేతఁ దెల్లనైన లలాటమందు నల్లని ముంగురు లొలయుచుండఁగా నీ యమ యెల్ల పల్లవాధరులకంటె నధిక తమ భాగ్యము గలది యగు నని తమ్మిచూలి వ్రాసిన శుభాక్షరములవలె నుండు నని భావము. వస్త్రూత్ప్రేక్ష.

శా. సైరంధ్రుల్ పఱికెత్తి కజ్జలముఁ బక్ష్మశ్రేణికిన్ దీర్ప వా,
లారుం గన్నుల మీఁదఁ జాఁచు తఱి ఫాలాంచచ్ఛ్రుతుల్ గానిశా,

స్ఫారేందుం గనె వక్త్రి మక్కనుటఁ గా బర్వేందుఁ డాత్మప్రభా-
చోరుం డుండఁగఁ దన్నుఁ దద్గతవిభాచోరం బనున్ లోకముల్. ౧౧.

టీక. వక్త్రిము = ముఖము, సైరంధ్రులు = అలంకరించెడు స్త్రీలు, పయికెత్తి = ముఖమును పైకెగయనెత్తి, కజ్జలమున్ = కాటుకను, పక్ష్మశ్రేణికన్ = తోంగలితెప్పలయందు, తీర్పన్ = దిద్దుచుండఁగా, వాలారుఁగన్నులన్ = నెఱిసోగలగు నేత్రములచేత, మీఁదన్ = ఊర్ధ్వభాగమందు, చూచుతఱిన్ = ఈక్షించునప్పుడు, ఫాల = లలాటమనియెడు, అంచత్ = ఒప్పుచున్న, చతుర్థీనిశా = చవుతినాఁటిరాత్రియందు, స్ఫార = ప్రకాశించుచున్న, ఇందున్ = చందురుని, కనెన్ = చూచెను, అక్కనుటఁగా = అచూచుటచేతనేకదా, పర్వేందుఁడు = పున్నమనాఁటి చందమామ, ఆత్మప్రభాచోరుండు, ఆత్మ=తనయొక్క, (ముఖముయొక్కయనుట), ప్రభా = కాంతులయొక్క, చోరుండు = ద్రుచ్చు, ఉండఁగన్ = కానవచ్చుచుండగా, తన్నున్ = ముఖముననుట, లోకములు = జనములు, తద్గతవిభాచోరంబనున్, తత్ = ఆచంద్రుని, గత=పొందిన, ప్రభా=కాంతియొక్క, చోరంబనున్=దొంగయనును.

తా. సైరంధ్రులు ముఖమును పైకెత్తి ఱెప్పలయందుఁ గాటుక పెట్టుచుండఁగా విశాలము లగు నేత్రముల చేత స్వాభావముగాఁ బైని జూచునప్పుడు లలాటమనియెడు చవుతి నాఁటి చంద్రుఁడు గనఁబడుటం జేసి యా దోషంబున నీ మొగంబుఁ జూచిన వారెల్ల ముఖకాంతి దొంగిలిన పూర్ణచంద్రుఁ డటుండఁగా నీ నెమ్మొగమే చంద్రుని కాంతిని దొంగలించిన దని పచింతు రనియును నిందవలనఁ గాంతిచే ముఖ చంద్రుల కభేద మనియును భావము.

చ. కనుఁగవఁ దన్నుఁ గెల్వఁగ మృగం బల సూడున కిందుఁ రేఁడు నే,
నని రుచిదక్కఁ దత్పరిమళాఢ్యత లేమి నతండు గొంకఁ దా,
నినుపఁ జన న్బగం దనదు నెత్తుటఁ బొట్టిడుకొంటకాక వా,
సనక యన న్మొగం బమరుఁ బామకు ఫాలము పచ్చికస్తురిన్. ౧౨.

టీక. మొగంబు = ముఖము, కనుఁగవన్ = నేత్రద్వయముచేత, తన్నున్ = మృగంబుననుట, గెల్వఁగన్ = జయింపఁగా, మృగంబు=ఇఱ్ఱి, అలసూడునకున్=ఆ విరోధమునకు, నేను=మృగమనుట, ఇందున్ = చంద్రుని, రేఁతున్=ప్రేరేఁపుదును, అని=అనుచు, రుచిదక్కన్ = కాంతిదప్ప, తత్పరిమళాఢ్యత, తత్ = ఆముఖమండలి, పరిమళ = పరిమళమువంటిపరిమళముచేత, ఆఢ్యత = చాలియుండుట, లేమిన్=లేకుండుటచేత, అతండు = ఆచంద్రుఁడు, కొంకన్=సంకోచింపఁగా, తాన్=ఆమృగము, నినుపన్ = నింపుటకు, (నిండించుటకనుట), చనన్ = పోవఁగా, పగన్=పలముచేత,

తనమ = ఆమృగముయొక్క, నెత్తుటన్ = రక్తముచేత, బొట్టిడుకొంటకాక = తిలకము పెట్టుకొనుటే కాని, వాసనక = వాసనకా, అనన్ = అనునట్లుగా, ఫాలముపచ్చికస్తురిన్, ఫాలము=లలాటముయొక్క, పచ్చికస్తురిన్ = ఆర్ద్రకస్తూరిచేత, చామకు = ఆశ్యామకు, అమరున్ = ఒప్పును.

తా. ఆశ్యామయొక్క ముఖము లలాటమందలి కస్తూరి తిలకము చేతఁ బ్రకాశించుచుండఁగా నాముఖము తనయందలి కన్నుదోయి చేత నిఱ్ఱిని జయింపగా నాపగఁ దీర్చికొనుటకుఁ జంద్రునితోఁ గలిసికొని యామొగమును గెల్చుటకు నతనిఁ దోడుదెచ్చినఁగా ముఖమునకువలెఁ దనకుఁ గాంతియున్నదే కాక పరిమళము లేమింజేసి యతఁడు సంశయించుచుండఁగా నా మృగమనఁగాఁ గస్తూరి మృగమగును గావున నది పరిమళమును నతనికొసంగఁ బూనుకొనఁగా నిదియంతయు సహింపక యా మొగము మృగము నెత్తుటిచేతఁ దిలకముంచుకొనెనేకాక వాసన కొఱకుఁ గాదనియును సమస్త పరిమళములు ముఖమందుఁ గలిగి యున్నవని భావము.

తే. కడిఁదివిలు చేఁదిగుఱికిఁ గీలుకఱచి నిలుపు, మరుని కువలయశరముకంపములఁ బోలుఁ,
దార కడకంటికై సారె చేరిచేరి, వేగ మగుడ సలజ్జ దృగ్విభ్రమములు. ౧౩.

టీక॥ తార=కనుగ్రుడ్డు, కడకంటికై = నేత్రాంతమువఱకు, సారె = మాటిమాటికి, చేరిచేరి = ప్రవేశించిప్రవేశించి, వేగమగుడన్=శీఘ్రముగా మరలుచుండఁగా, సలజ్జదృగ్విభ్రమములు, సలజ్జ = సిగ్గుతోఁగూడిన, దృక్ = చూపులయొక్క, విభ్రమములు = విలాసములు, (ఇదికర్తృపదము), కడిఁది = బలునగు, విలు= ధనుస్సును, చేఁది = ఆకర్షించి, గుఱికిన్ = లక్ష్యసిద్ధికొఱకు, (ఇచ్చటఁ చతుర్థి కివష్టి) కీలుకఱచి = పండ్లుబిగియఁబట్టుకొని, నిలుపు = నిల్వఁబట్టిన, మరుని = మన్మథుని యొక్క, కువలయశరము = కలువతూపుయొక్క, కంపములఁబోలున్ = చలనములను బోలును.

తా. ఆనెలఁత మెఱుఁగెక్కిన కడకంటి చూపులు మన్మథుఁడు పెద్దవిల్లు పూని తివిచి గుఱికుదురునంతకు నల్లెత్రాటికి ధనుర్దండమునకు నడుమఁ జలింపించుచున్న కలువ బాణములవలె నుండెనని భావము.

సీ. నవ వయస్స్వీధు మదము చేఁ శ్రవణ కూపము
ములఁ బడెడు శంక నలువ చాపలము లుడుగ,
నిడిన శృంఖల లనఁగాటుకిడిన దీర్ఘ,
పక్ష్మరేఖలఁ గను దోయి పడఁతి కలరు. ౧౪.

టీక. నవ = నూతనమైన, వయః = వయస్సనియెడు, సీధుమదముచేన్ = మద్యమదముచేత, (మైరేయమాసవ సీధువని యమరము), శ్రవణ=చెవులనియెడు, కూపములన్ = నూతులయందు, పడెడుశంకన్ = పడునను సంశయముచేత, నలువన్ = చతుర్ముఖుఁడు, చాపలములుడుగన్ = నేత్రముల చంచలభావములు తగ్గునట్లుగా, ఇడిన=ఉనిచిన, శృంఖలలన్ = సంకెళ్లనునట్లు, కాటుకిడిన = కాటుకపెట్టుకొనిన, దీర్ఘ = నిడుఁదలగు, పక్ష్మ = తెప్పలయొక్క, రేఖలన్=రేఖలచేతన్, కనుదోయి = నేత్రద్వయము, పడఁతికిన్=ఆగోదాదేవికి, అలరున్= ప్రకాశించును. ఈ పద్యమందు సీధు మద మనఁగా గజ మద మని యర్థము చేసిన పక్షమున సీధుకూప పతన శృంఖలాది పదముల వలన గజము నుద్యోత్యమాన మగు చున్నది గాన నది యర్థ్యాహార్యము. ఆపక్షమున సీధు వనఁగా గజనేత్ర మదమునకుఁ బేరైనను వంశకరీరకరికలభాది శబ్దంబుల వలె గ్రహింప వలయును.

తా. ఆ పడఁతియొక్క నిడువాలిక లగుచు వీనుల వఱకు నున్న కాటుక కన్నులు తమయందలి యౌవన మను సారాయి మదము చేతఁ జెవులను నూతులలోఁ బడకుండననియు సీధువనఁగా గజనేత్ర మదమను నర్థమున నేనుఁగులు మదించినప్పుడు నేత్రములలో మదము చేతఁ గన్నెఱుంగక నూతులలోఁ బడినట్లే యీ కన్నులును శ్రవణ కూపములందుఁ బడు నో యను సంశయముచేత వాని చాంచల్యముడుగు నట్లుగా నేనుఁగులకుం బోలెఁ జతుర్ముఖుఁడు సంకెళ్లు వేసె నో యన్నట్లు తఱచు వెంట్రుకలుగల తోంగలి తెప్పలతోఁ గూడి ప్రకాశించు చున్నవని భావము. అలం. రూపకానుప్రాణితోత్ప్రేక్ష. శ్లో. దానం కపోలయో సీధు రక్ష్ణోశ్శ్రుత్యోస్తు సాగరః। కరాగ్రే సీకరస్సిక్తం స్తనాగ్రే మేహనే మదః. హృదయే ఘర్మ సలిలం మేఘస్తు చరణద్వజే। సంజ్ఞయాష్టమదాఖ్యాతే జాయంతే భద్ర దంతినః. అని గజమదవిభేదమెఱుఁగవలయును.

చ. అనయము రాగ మొప్ప సహజానన చంద్ర కటాక్ష పఙ్క్తి ప
ర్విన నఘ శంక గణ్య మను శ్రీమఱు వెట్టుఁ జెలంగి చెందుఁ గా
ట్టి నవనిఁ బడ్డ కమ్మ మగు డెం గొను నంతకు నంసపాళి నం
గన యిడి దాఁచు పేరఁ జెర కర్ణము కమ్మ పయిం దళుక్కనన్ ౧౫.

టీక. అనయము = ఎల్లప్పుడు, రాగము=అనురాగము, ఒప్పన్ = స్ఫుటముగాఁగా, సహజ = తోఁబుట్టువగు, ఆననచంద్ర = ముఖచంద్రునియొక్క, కటాక్ష= క్రేగంటి చూపులయొక్క, పఙ్క్తి = చాలు, పర్విన్ = వ్యాపింపఁగా, అఘశంకన్=పాపమువచ్చునని సందియముచేతను, కణ్యమను = వీనసియెడు, (కణ్యము

శ్రీకారమువలెనున్నది గనుకను శ్రీకారము లక్ష్మీరూపము గనుకను ఇట్లు రూపకము చేసెను), శ్రీన్ = సిరిని, అంగన = ఆ యింతి, చెలంగి=విజృంభించి, చెండుఁగొట్టన్ = కందుకక్రీడసలుపుచుండఁగా, అవనిఁబడ్డ = భూమిపైఁబడిన, కమ్మ = కర్ణభూషణమును, మగుడన్ = మరల, కొనునంతకున్ = గ్రహించువఱకు, అంసపాళిన్, అంస = భుజాగ్రముయొక్క, పాళిన్ = ప్రదేశమందు, ఇడి=ఉనిచి, దాఁచు పేరన్ = గుప్తముచేసెడునెపముచేత, పెఱకర్ణముకమ్మ = రెండవనీనుతాటంకము, పయిన్ = ఉపరిభాగమందు, తళుక్కనన్ = తళుక్కనిమెఱయఁగా, మఱువెట్టన్ = మఱుఁగువెట్టుటను. అపహ్నవముచేత నుత్ప్రేక్షగలిగియున్నది. అది గమ్యకర్ణ శ్రీయన్నదిరూపకాలంకారము.

తా. లోకమందుఁ బుణ్యాంగనయగు సహోదరినట్టి చెవులనుండఁగాఁ బురుషుఁడు చూడఁ గూడదు కావున నీ యంగన శ్రీకారము వంటి తన కర్ణ మనెడు లక్ష్మిని తాను జెండు గొట్టు నప్పుడదరి క్రిందఁబడిన కమ్మను దాను మరలఁ దీసికొనువఱకు నా చెలికి సహోదరుఁ డగు మొగ మనియెడు చంద్రుఁడు సూడకుండ నా చెవిఁ దన భుజాగ్ర మందుంచి దాఁచు చున్న దనియెడు నెపముచేత నా కర్ణమును గనఁబడకుండఁ జేయు ననియును శిరము ప్రక్కకువంచి భుజాగ్రముచే నొకచెవి దాఁచి నప్పుడు రెండవ చెవి కమ్మపైఁ దళుక్కని మెఱయు చున్న దని భావము.

శా. నాసా చంపకత న్సుగంధ మచటన్, రా భృంగముల్ గ్రోల సం,
త్రాసం బందియుఁ బల్కుచో నలము వక్త్రం బేల నా నేల యం,
దే సౌరభ్యము లేదు కుందములుగా, వే దంతము ల్గానినాఁ,
డాసక్తిన్ బ్రతిబింబ దంభమున నేలా ప్రాఁక దజ్జాతికిన్. ౧౬.

టీక. నాసాచంపకతన్, నాసా = నాసికయనియెడు, చంపకతన్ = సంపెఁగపువ్వుగలుగుటచేత, సుగంధము = ఆ సంపఁగవాసన, అచటన్ = ఆముఖమందు, రాన్ = వచ్చుచుండఁగా, భృంగముల్ = తుమ్మెదలు, గ్రోలన్ = ఆస్వాదించుటకు, సంత్రాసంబు = భయమును, అందియున్ = చెందియును, పల్కుచోన్ = ఆయువిద పలుకునప్పుడు, వక్త్రంబు = ముఖమును, అలము నేఁ = ఏటికిముసరుకొనును, నాన్ = అనఁగా, ఏల = ఏటికి, (తుమ్మెదలకు సంపఁగవాసనవిరోధమనుట), అందున్=ఆముఖమందు, ఏసౌరభ్యము = ఏ పరిమళము లేదు, (అన్ని పరిమళములునున్నవనుట), దంతములు = రదనములు, కుందములుగావే = మొల్లమొగ్గలుగావా, కానినాఁడు=కాని యెడల- తజ్జాతికిన్ = ఆభృంగజాతికి, ఆసక్తిన్ = శ్రద్ధచేత, ప్రతిబింబ = ప్రతిఫలన

మనియేమి, దంభమునన్ = నెపముచేతను, వ్రాలన్ = వ్రాలుటకు, ఏలా = ఏమి యక్కఱ.

తా. ఆయువిద నాసిక సంపెఁగ పూవలె నుండు ననియును ముఖమందు నా సంపెఁగ వాసనలకు భయంపడి తుమ్మెదలు ముసర వెఱచియు మరల మాటలాడు నప్పుడు మఱి యొక పరిమళము రాఁగా దాని కొఱకు ముసరుననియును సర్వ పరిమళములు ముఖమందుఁ గల వనియును దంతములు మొల్ల మొగ్గలవలె నుండు ననియును దుమ్మెదలు ముఖము మీఁదఁ దిరుగునప్పు డా దంతముల మీఁదఁ బ్రతిఫలించు ననియు భావము. వ్యాజోక్తి, భ్రాంతి, మదతిశయోక్తి, రూపకాలంకారములు.

తే. శంఖ సామ్యంబు రా మున్న • జలజభవుఁడు,
సరసి రుహ పత్ర నేత్ర కం • ధర యొనర్చె,
జవ్వనము వచ్చి వెండి సా • క్షాత్కరించు,
శంఖమున చేసె నను గంధ • సార చర్చ. ౧౪.

టీక. జలజభవుఁడు = తమ్మిచూలి, మున్న = పూర్వమందు, శంఖసామ్యంబు, శంఖ = శంఖముతోడి, సామ్యంబు = సరియగుట, రాన్ = వచ్చునట్లు, సరసీరుహపత్రనేత్ర = తమ్మితేకులవంటి కన్నులుగల యాపొలఁతియొక్క, కంధర = కంఠమును, ఒనర్చెన్ = నిర్మించెను, జవ్వనము = యౌవనము, వచ్చి = ప్రాదుర్భవించి, వెండి = మరల, సాక్షాత్కరించు = ప్రత్యక్షమైనట్టి, శంఖమున = శంఖమునే, నను = మృదువగు, గంధసారచర్చ, గంధసార = మంచిగంధముయొక్క, చర్చ = పూఁతచేతను, చేసెన్ = ఒనర్చెను.

తా. ఆ సరసిజాక్షి కంఠము శంఖముతో సమ మగు నట్లు బ్రహ్మ మున్నొనర్చె ననియును యౌవనము వచ్చి గంధము పూఁతచేత ధవళవర్ణమును గలుగఁ జేసి ప్రత్యక్ష శంఖమునే చేసెననియును దీని వలన బ్రహ్మకంటె యౌవనమే యధికతర మని భావము. అలం. ఉపమా, గమ్యోత్ప్రేక్షలు.

కం. కమలదళేక్షణ సంగీ • తమున నెగడు మంద్ర మధ్య • తారత్రిస్థా,
నములకుఁ దీర్చిన రేఖల, క్రమ మగు రేఖాత్రయమునఁ • గంఠంబమరున్. ౧౫.

టీక. కమలదళేక్షణ = తామరరేకులవంటికన్నులుగల యాచెలఁతయొక్క, సంగీతమునన్ = గానమందు, నెగడు = ప్రశస్తములగు, మంద్రమధ్యతార, మంద్రము, మధ్యము, తారమనియెడి, త్రి = మూఁటియొక్క, స్థానములకు = ప్రదేశములకు, తీర్చిన = దిద్దినట్టి, రేఖలక్రమమగు = గుఱుతు రేఖలక్రమముగల, రేఖాత్రయమునన్ = వళిత్రయముచేతను, కంఠంబు = కంఠము, అమరున్ = ఒప్పును. (మంద్రస్తు గంభీరే

తారోత్థ్యాస్త్రైచ్చత్రయస్త్రీషు. విలంబితంద్రుతంమధ్యమనియమరము. యస్యాస్త్రిసోత్రిగళే రేఖాదృశ్యంతేసా పతివ్రతా యని సాముద్రికశాస్త్రము).

తా. ఆయమ పాటఁబాడు నప్పుడు మంద్ర మధ్య తారము లనియెడు స్వరములు మూఁడు పుట్టుటకు స్థానములయిన వని గుఱుతు కొఱకు మూఁడు రేఖలున్నవో యను నట్లు కంఠమున మూఁడు వళులు ప్రకాశించు నని భావము. ఉత్ప్రేక్షాలంకారము.

తే. లలన మృదుబాహు బిసయుగ • లతలు గడఁగి,
బిసలతాశ్రీల నెల్లను • వెసహరించె,
మఱి హరింపంగఁ గా యవి • నెఱులు విఱిగి,
సారె దనుయాత్రఁ దంతులఁ • జరపుచుండు. ౧౯

టీక. లలన = ఆస్త్రీయొక్క, మృదు = మెత్తనగు, బాహు = భుజములనియెడు, బిస = తామరతూఁడులయొక్క, యుగ = జంటయొక్క, లతలు = తీఁగెలు, కడఁగి = యత్నపడి, బిసలతాశ్రీలనెల్లను, బిసలతా = లోకమందలితామరతూఁడుల తీఁగెలయొక్క, శ్రీలనెల్లను = సంపదలన్నిటిని, వెసన్ = వేగముగాను, హరించెన్ = కైకొనియెను, మఱి = మరల, హరింపంగఁగా = గ్రహింపఁగానేకదా; అవి = తూఁడులు, నెఱులు = పూర్ణత్వములు, విఱిగి=విరిసిపోయి, సారె = పలుమాఱును, తనుయాత్రన్ = దేహయాత్రను, (శరీరపోషణమునుటు), తంతుల = నూలిపోగులచేతను, జరపుచుండున్ = కడపుచుండును.

తా. ఆయమయొక్క కోమలములగు బాహువు లనియెడు తామరతూఁడులు చెలరేఁగి యెల్లతూఁడుల కాంతి సంపదల నపహరింపఁగా నవి గుంపు చెదరి మఱి యొక విధముచే బ్రతుఁక జాలక నూలి పోఁగు లాడికొని శరీర యాత్రఁ గడపు ననియును దామర తూఁడులు విఱిగినేని వానిలో నూలిపోఁగు లుండు ననియును భావము. అలం. రూపకానుప్రాణితగమ్యోత్ప్రేక్ష.

మ. తళుకొత్తు న్భుజకీర్తి వజ్ర ఘృణి సూత్ర స్యూత హారస్ఫుర,
త్కళికా చిత్ర కుచద్వయోపరిగళాధస్స్వల్పవిస్తారస్రై,
ఘృణిలస త్తిర్యగురస్తటం బను వివాహాంచ న్మనోజాత పా,
టల దంతచ్ఛదబోడబాసికము దండ ల్వోలెఁ గేల్గింతికిన్. ౨౦

టీక. ఇంతికిన్ = ఆస్త్రీకి, కేల్గు = హస్తములు, భుజకీర్తి-వజ్రఘృణి, భుజకీర్తి = బాహుపురులయందలి, వజ్ర = మగఱాలయొక్క, ఘృణి = కాంతులనియెడు, సూత్ర = దారముచేత, స్యూత = కూర్పఁబడిన, హార = పూలపేరులయందు,

స్ఫురత్ = ప్రకాశించుచున్న, కళికా = మొగ్గలచేత, చిత్ర = చిత్రవర్ణములుగలయ ట్టియు, కుచద్వయ = చనుదోయికి, ఉపరి = పైగాను, గళాధః = గళ = కంఠము నకు, అధః = క్రిందుగాను, స్వల్ప = అల్పమైన, విస్తార = వెడల్పుచేతను, దైర్ఘ్య = పొడవుచేత, లసత్ = ఒప్పుచున్నట్టియు, తిర్యక్ = అడ్డముగు, ఉరస్తటంబును = వక్షస్థ్సలమనియెడు, వివాహాంచన్మనోజాతపాటలదంతచ్ఛద, వివాహ = పెండ్లియందు, అంచత్ = ఒప్పుచున్న, మనోజాత = మన్మథునియొక్క, పాటల = దొెట్టినగు, దంతచ్ఛద = వాతెఱగల రతీదేవియొక్క, బాడబాసికము = శిఖరములేనిబాసికముయొక్క, దండల్వోలెన్ = ఇరుగడలఁ బ్రేలుచున్న దండలవలెనె, తళుకొత్తున్ = మెఱయును.

తా. ఆయింతియొక్క కంఠమునకు దిగువగాను గుచముల కెగువగా నున్న ప్రదేశము గొంచెము వెడలుపును బొడవును గలిగియున్న దనియును భుజకీర్తుల యందలి వజ్రకాంతులావక్షః ప్రదేశ మందలి పూ దండలయందుఁ బ్రతిఫలింపఁగా నా మొగ్గలచేత నది విచిత్ర వర్ణములుగలదియై మన్మథుఁడు రతీదేవిని వివాహమై నప్పు డా రతిదేవి ముఖమందుఁ గట్టిన బాసికము వలెనే యుండె ననియును హస్తములు రెండును నా బాసికమునకు రెండు పార్శ్వముల యందు వ్రేలు చున్న దండలో యనునట్లుండె నని భావము.

చ. ఒదవెడు జవ్వనంబు వెలికొత్తఁగఁ బయ్యెద సిగ్గు గూడి బి,
ట్టదుమఁగ లేఁత లొట దిగ నాకకుమీఱనులేక వక్షపుం,
జదుపునఁ బ్రక్కల న్మెఱసి చప్పట లై మఱి లావు గూడఁబైఁ,
బొదలె ననంగఁ బిక్కటిలెఁ బోల్తుక చన్నులు నాఁడు నాఁటికిన్. ౨౧.

టీక. పోల్తుక = ఆ పొలఁతియొక్క, చన్నులు = స్తనములు, (ఇదికర్తృపదము), ఒదవెడు = పుట్టుచున్న, జవ్వనంబు = యౌవనము, వెలికొత్తఁగన్ = బైటఁ ద్రోయఁగా, పయ్యెద = పైఁటచెఱఁగు, సిగ్గుఁగూడి = లజ్జనుగూడికొని, బిట్టు = గట్టిగా, అదుమఁగన్ = లోపలికిఁద్రోయఁగా, లేఁతలొటన్ = తరుణములొటచేత, దిగన్ = దిగివచ్చుటకును, ఆఁకకుమీఱను = ఆజ్ఞకతిక్రమింపను, లేక = చాలక, వక్షపు = వక్షస్థ్సలసంబంధియగు, చదుపునన్ = సమ్మర్దముచేత, ప్రక్కలన్ = పార్శ్వములందు, మెఱసి = ప్రస్ఫుటములై, చప్పటలై = అడఁగినవై, మఱి = పిమ్మట, లావుగూడన్ = బలమురాఁగా, పైఁబొదలెననంగన్ = పైకివ్యాపించినవోయన్నట్లు, నాఁడునాఁటికిన్ = దినక్రమమున, పిక్కటిలెన్ = విస్తరిల్లెను.

తా. ఆ యుగ్మలి కుచములను యౌవనము బయిటఁ ద్రోయుచుండఁగా ను సిగ్గు వచ్చి పైఁట చెఱఁగులోఁ గూడి మరల లోపలికిఁ ద్రోయఁగా నవి లేఁత

వి గావున దిగి వచ్చుటకును బైకెగయుటకును నేరక యురస్స్థలమందె యొత్త
డింబడి పార్శ్వముల కొదిగి యడఁగి చప్పటలై పిమ్మటఁ గ్రమక్రమముగా లేఁతతి
కను వదలఁగానే బలము వచ్చి పైకిఁ బిక్కటిల్లె ననియును యౌవన ప్రాదుర్భావ
ము కాఁగానే చనుదోయి కానఁబడె ననియును లజ్జ పోఁచె ననియును దరువాతఁ
గుదురులు గట్టి యుదరమెల్ల నాక్రమించి క్రిక్కిఱిసి పిక్కటిల్లె నని భావము.

తే. వృత రఘూత్తమ శాప మొక్కింత విడిచి,
విడిచి కడ కేగ నప్పుడప్పుడ కవిసెడు,
చక్ర యుగ మన తొమ్మొయ్య నాక్రమించి,
కొమరౌ చన్నులు పృథు చూచుకముల నమరె. ౨౨.

టీక. వృత = ఆవరించిన, రఘూత్తమ = శ్రీరామునియొక్క, శాపము = శపించుట, (మీరు కవఁబాసియుందురుగాక యను శాపమనుట), ఒక్కింత = ఒక యింత, (కొంచెమనుట), విడిచివిడిచి = వదలివదలి, కడకేగన్ = తొలఁగిపోఁగా, అప్పుడప్పుడ = తత్కాలమందే, కవిసెడు = కూడుకొనియెడు, చక్ర = జక్కవల యొక్క, యుగమనన్ = కవయోయనునట్లు, తొమ్ము = వక్షస్స్థలమును, ఒయ్యన్ = మెల్లఁగా, ఆక్రమించి = వ్యాపించి, కొమరౌ = ఆస్త్రీయొక్క యనికాని, కొమరౌ చన్నులు = ఉదుటుకుచములనికాని, పృథు = కొంచెము పెద్దవియగు, చూచుకముల్ = చనుమొనలచేత, అమరున్ = ఒప్పును, చక్రవాకములకు రాత్రియెల్ల వియోగము గలుగునట్లు శ్రీరాముఁడు సీతాదేవి యోగమనుభవించునప్పుడు శాపమిచ్చుట పురాణప్రసిద్ధము.

తా. చక్రవాకద్వయము తమను సంభవించిన శ్రీరామ శాపము వదలి యప్పటప్పుడే కలియుచుండిన నెట్లుండునో యీ రీతిగానే సక్రమమైన యొంటొంటికిఁ జేరువనైన కుచద్వయము తొమ్ము నాక్రమించె ననియును అపత్తుల ముక్కులవలెనే చనుమొన లున్నవనియును భావము.

కం. తా రెట్లట్లుగఁ దమ్ముం, జేరిన ముత్తెంపు సరులఁ జేడియ చన్నుల్,
లోరెంట లుడిపె ఘన మగు, వారు నిజార్జవముఁ జేరువారికి నీరే. ౨౩.

టీక. చేడియచన్నుల్ = ఆబాలిక స్తనములు, తారెట్లు = తామెట్లో, అట్లుగన్ = ఆరీతిగానే, (అనఁగా రెండు స్తనములు వేఱుగా దూరముననుండి నానాటఁ జేరువకువచ్చి యొరసికొన్నట్లనుట), తమ్ముంజేరిన = తమ్ము నాశ్రయించిన, ముత్తెంపుసరులన్ = ముక్తాహారములను, లోరెంటలు = లోపలిజంటలను, ఉడిపెన్ = పోఁ జేసెను, ఘనమగువారు = ఘనతగలవారు, నిజార్జవము, నిజ = స్వకీయమగు,

ఆర్జవము = నాజూకును, చేరువారికిన్ = తమ్మునాశ్రయించినవారికెని, ఈరే = ఇయ్యరా, (ఇత్తురనుట).

తా. కుచములు తాము మధ్యభాగమున సందు లేక కదిసియున్నవి గావున నందుఁ జేరిన హారములును గుచమధ్య మందు విరళముగ నుండుటకు తావులేక కుచములయం దన్నిపేట లొక్కటఁ గూడి యుండు ననియును ఘనులైన వారు దమ వలెనే యుండుటకుఁ దమ యాశ్రితులకుఁ దమ సుగుణము లిత్తు రనియు భావము. అర్థాంతరన్యాసాలంకారము.

తే. విరహి తతి మీఁది కోపాన మరుఁడు దివియ,
వేగమై పైఁబడి యొఱతోన విసరఁ గుళ్లు,
తునిసి బైటికి నసిధార దోఁచెననఁగఁ,
గనక రుచి మధ్య లత నారు కాంతకలరు. ౭౪.

టీక. కాంతకున్ = ఆయింతికి, ఆరు = నూఁగారు, (ఇది కర్తృపదము), విరహి = వియోగులయొక్క, తతిమీఁది = సమూహముపైనున్న, కోపానన్ = కోపముచేత, మరుఁడు = స్మరుఁడు, తివియన్ = ఒఱలోనుండితీయుటకు, వేగమై = వేగముగలవాఁడై, "సీ. అప్సరోనికురుంబ మాటలుఁబాటలునై వినోదింపంగనమరగణమనియును", క. "కాచికొనివచ్చి తగనా, నేచినయట్లుచటనచట నిలిపితినిమునినా, ధాచేటును భంగంబును, నైచిత్రముశోకమునకు నగ్గంబయ్యెన్" అనియును న్న భారతప్రయోగంబుల కలిమినగు ధాతువునకు కలిమిఅర్థము. పైఁడియొఱతోన = కనకమయమగునాయొఱతోఁగూడనే, విసరన్ = నలుకుటకువిసరఁగా, కుళ్లు = ఆయొఱకుళ్లు, తునిసి = తెగి, బైటికిన్ = బాహ్యప్రదేశమునకు, అసిధార = కత్తివాదర, తోఁచెననఁగ = కానవచ్చెననునట్లుగా, కనకరుచి = బంగరుకాంతిగల, మధ్యలతన్ = కౌఁదీఁగెయందు, అలరున్ = ప్రకాశించును.

తా. మన్మథుఁడు విరహులపైఁ దన కధికమగు కోపము రాఁగా నా కోపాతిశయముచేతఁ గత్తి బైటికిఁ దీయు నంత తడవు లేక వేగము పడి పసిఁడి యొఱతోనే యాఖడ్గమును విసరఁగా నా వేగము వలన నొఱకుఁ గుట్టి యున్న కుళ్లు తెగి యా సందున నా కత్తి వాదరకనఁబడినట్లు బంగారు వన్నెగల కౌఁదీఁగెయందు నల్లని కాంతిగల నూఁగారు ప్రకాశించె నని భావము. అలం. ఉత్ప్రేక్ష.

కం. అండజ గామిని యూరువుఁ, బిండువలపులాననాభీబిలము వెడలి చ,
న్గొండల నడుమను బ్రాఁకెడు, కుండలియో యనఁగ నారు కొమరొప్పారున్.

టీక. అండజగామిని = ఆహంసయానయొక్క, ఊరుపుబిండు = ఉచ్ఛ్వా

సవాయుసమూహముయొక్క, వలపులు = పరిమళములను, ఆనన్ = ఆస్వాదించుటకు, నాభిబిలము = పొక్కిలియను బిలమునుండి, వెడలి = బయలుదేఱి, చన్గొండల నడుమను = కుచగిరులమధ్యమున, ప్రాకెడు = ప్రాఁకుచున్న, కుండలియోయనన్ = త్రాఁచుఁబామోయనునట్లు, అరుకొమరు, అరు = లోమరాజియొక్క, కొమరు = సౌందర్యము, ఒప్పారున్ = తనరును.

తా. మఱియు నా హంసయాన యొక్క నూఁగారు పరిమళముగల యుచ్ఛ్వాస వాయువుల నాస్వాదించుటకై నాభియనియెడు బిలములోనుండి వెలువడి చన్నులనియెడు కొండలనడుమ నెగఁబ్రాకుచున్న కాల సర్పమో యను నట్లున్నదని యును సర్పములు వాయు భక్షణము సల్పు ననియును వాని కున్నత పర్వతములయందుఁ బ్రాఁకుటయందుఁ బ్రయాసము గావున మెల్లగఁ బ్రాఁకు చుండు నని భావము.

కం. అంగన నిలిచిన బాహువు, లుం గౌనును నేఱుపఱుచు• లోకమునకు ర,
త్నాంగద కాంచీభేదము, లుం గెళవుల నడిమియునుకు• లున్నూఁగారున్ ౨౬.

టీక. అంగన = అయింతి, నిలిచినన్ = నిలుచున్నప్పుడు, లోకమునకు = చూచెడుజనమునకు, రత్నాంగదకాంచీభేదములును, రత్న = మణిమయములైన, అంగద = బాహుపురులయొక్కయు, కాంచీ = మొలనూలుయొక్కయు, భేదములు = వేఱుపాటులును, కెళవుల = పార్శ్వములయందలియును, నడిమి = మధ్యప్రదేశమందలియును, ఉనుకులున్ = ఉండుటలును, నూఁగారున్ = రోమావళియును, బాహువులున్ = బాహువులను, కౌనును = నడుమును, ఏఱుపఱుచున్ = వివరించును.

తా. నడుమును గోమలములగు బాహువులును సమ కృశము లై యున్నవి గావునఁ జూచు వారి కా భేద మెఱుక పడకుండఁగా భుజకీర్తులును బార్శ్వద్వయమందు నిలుచుటలును బాహువుల దెలుపుననియును మొల నూలును నడుమునుం డుటయును నూగాఁరు నీనూఁగును ఇగి నడుమని తెలుపుననియును నట్లుగాని యెడలఁ జేతు లెయ్యవియో నడు మెద్దియో తెలియ నేర వని భావము.

కం. తను మధ్య వళీ భంగము, లనుగూర్పఁగ నవియుఁ దత్కు•లములయగుటఁ గం,
తుని యిడిన పత్త్రి తే కనఁ, జను నొడ్డాణమున నడుము• చామకు ననరున్ ౨౭.

టీక. చామకున్ = ఆశ్యామకు, తను = సూక్ష్మమగు, మధ్య = నడుముయొక్క, వళీ = త్రివళులనియెడు, భంగములను = విఱుగులను, కూర్పఁగన్ = అదుకుటకు, అవియున్ = ఆవళులును, తత్కులములయగుటన్ = ఆబంగారుజాతిగలవే యవుటచేత, కంతుని = మన్మథుఁడనియెడు నగసాలెవానియొక్క, ఇడిన = ఉనిచిన పత్త్రితేకనన్ = పత్త్రికట్టునిమిత్తముంచినబంగారుతేకోయనునట్లు, చను = ఒప్పుచున్న,

ఒడ్డాణమునన్ = కాంచీగుణముచేతను, నడుము = మధ్యము, అమరున్ = చెన్నగును.

తా. సూక్ష్మమగు నడుముయొక్క వళు లనియెడు తునుకలకు మన్మథుఁ డతుకు పెట్టఁ దలఁచి బంగారు బంగారుతోనే యతుకుం గావున నావళులు బంగారు తునుక లే యగుట నా మధ్యవళుల నడుమఁ దన పత్తి తేకను బంగారు తేకు వేసి యదికి బిగించెనో యనున ట్లున్న యొడ్డాణముచేత నడుము పొల్పగు నని భావము. అలం. రూపకోత్థాపితోత్ప్రేక్ష.

కం. లేఁ గౌఁదీఁగె నితంబము, వ్రేఁగునఁ ద్రెప్పుటయుఁ గని విరించి బిగింపన్,
లోఁగి ముడి యిడినొ వదలుగ, నాఁ గోకస్తని గభీరనాభి చెలంగున్ ౭౮.

టీక. లేఁగౌఁదీఁగె = లేఁతయగుమధ్యలత, నితంబము = పిఱుఁదయొక్క, వ్రేఁగునన్ = భారముచేతను, త్రెవ్వుటయున్ = తెగిపోఁగా, కని = చూచి, విరించి = బ్రహ్మదేవుఁడు, బిగింపన్ = బిగియించుటకు, లోఁగి = సందేహించి, వదలుగన్ = బిఱ్ఱులేకుండ, ముడియిడియోనాన్ = ముడివేసెనోయనునట్లు, కోకస్తని = ఆచక్రవాకస్తనియొక్క, గభీరనాభి = లోఁతైనపొక్కిలి, (ఇది కర్తృపదము), చెలంగున్ = ప్రకాశించును.

తా. సృష్టికర్తయగు బ్రహ్మదేవుఁడా కోకస్తనియొక్క పిఱుఁదుల భారముచేత లేఁత కౌను దీఁగె లాగఁబడి తెగుటఁ జూచి మరల సంధించుటకు యత్నపడి బిగియించిన మరలఁ దెగునేమో యని సందేహించి వదలు వదలుగా ముడి వేసి మరల సంధించిన ముడియో యన్నట్లు నాభి ప్రకాశించు నని భావము. ఉపమోత్థాపితోత్ప్రేక్షాలంకారము.

కం. వెలఁది కటిపేర నిల నొక, పులినము దిగఁబడియె సింధుపులినపుఁ బఙ్క్తిన్,
నలువ యది పడఁగఁగాదే, తెలియుట కందంచ పదము దిరముగ నిలిపెన్ ౭౯.

టీక. సింధుపులినపుఁబఙ్క్తిన్, సింధు = నదీసముద్రములయొక్క, పులినపు = ఇసుకదిన్నియలయొక్క, పఙ్క్తిన్ = శ్రేణియందు, వెలఁదికటిపేరన్, వెలఁది = ఆస్త్రీయొక్క, కటి = పిఱుఁదనియెడు, పేరన్ = వ్యాజముచేత, ఇలన్ = భూమియందు, ఒకపులినము = ఒక్కయిసుకదిన్నియ, దిగబడియెన్ = తప్పిపోయెను, నలువ = చతుర్ముఖుఁడు, అది = ఆపులినము, పడఁగఁగాదె = తప్పిపోవుటచేతనే కాదా, తెలియుటకు = ఎఱుఁగుటకొఱకు, అందు = ఆసింధుపులినపఙ్క్తియందు, అంచపదమున్ = హంసపాదమును, థిరమున్ = స్థిరముగాను, నిలిపెన్ = ఉనిచెను.

తా. ఆయమ పిఱుఁదు ఇసుక దిన్నియవలె నున్నదనియును మున్ను బ్రహ్మదేవుఁడు సముద్రతీరములయందును నదీతీరములయందును సైకతములు సృజించు

నప్పు డా పఙ్క్తిలో నీయను పిఱుదను నిసుక దిన్నె చేరక దిగఁబడియెను గాన నది యెఱిఁగి యక్షర పఙ్క్తిలో దిగఁబడిన యక్షరమునకు గుఱుతుగా నక్కడ హంసపదము పెట్టుట ప్రసిద్ధము గావున నట్టి విధముగానే యిది దిగఁబడుట దెలియుట కొఱకా పులిన పఙ్క్తియందు సంచరించెడు హంసలయొక్క పదచిహ్నములనియెడు హంసపాదము పెట్టె నని భావము. అలం. వ్యస్తరూపకానుప్రాణిత హేతూత్ప్రేక్ష.

తే. కదళి ఢిలయించె నగ్రాంఘ్రి • కంబు దొడల,
పెనుపు నెట్లన్నఁ బొరల శో • ధన నడంచు,
కొన్న యాఁ దోఁక పాటును • గొప్పు విప్ప,
మెఱయు గోర్కుఱిచ్చులును గెంపు • గుఱులు గావె. ౩౦.

టీక. కదళి = అరఁటిచెట్టు, అగ్రాంఘ్రికంబు = పాదాగ్రముయొక్కయు, తొడల = ఊరువులయొక్కయు, పెనుపున్ = అతిశయమును, ఢిలయించెన్ = లాఁగికొనెను, ఎట్లన్నన్ = అది యేవిధముననఁగా, పొరల = అరఁటిపట్టల పొరలయొక్క, శోధనన్ = శోధించుటచేత, (దొంగ దగ్గఱనుండెడు వస్త్రాదులలోని పొరలపొరలసందుల సోదా చూచుటయనుట), అడంచుకొన్న = దాఁచుకొన్నట్టి, ఆఁ దోఁకపాటును = గోపుచ్ఛాకారమును, (ఇది తొడలపెనుపు), కొప్పువిప్పన్ = అరటి పువ్వువిప్పఁగా, (దొంగ సిగముడివిప్పఁగాననుట), మెఱయు = బయటఁబడునట్టి, గోర్కుఱిచ్చులును = గోళ్లనుదొంగలును, (అరఁటిపువ్వులోని తెల్లనికుసుమలలోఁ గొన్ని గోళ్లవలెనుండును వాని నిచ్చటఁ జౌర్యసాధకనఖాకారాయుధములుగాఁ జెప్పినాఁడు మఱియొకవిధమయిన కుసుమలకు దొంగలని పేరుగలదు), కెంపు=పద్మరాగమును, అరుణకాంతియును, (దొంగ సిగవిప్పినప్పుడు కెంపుగనుపడెననుట), గుఱులు = నిదర్శనములు, కావే = కావా అనుట. (ఈపద్యమునందుఁ గ్రమవ్యత్యయమయినను దోషావహంబుగాదు ప్రయోగములుగలవు).

తా. ఈయమ తొడల సౌందర్యమును పాదాగ్రముల యొప్పిదము నరఁటిచెట్టు ప్రముద్భిలింపఁగా నది యెట్లెఱుంగ నచ్చెననఁగాఁ బొరలు విప్పఁగాఁ దొడలయందలి సౌందర్యమును పువ్వనియెడు కొప్పు విప్పిన నందలి కెంపును గేసరములును పాదతల రక్తకాంతియును నఖాకార శస్త్రములును సాక్షులై యుండఁగా వేఱు నిదర్శనముతో నక్కఱ లే దని భావము.

తే. వసుధలో నెట్టి శ్రీగల • వారి వేని,
కరభములు దాస్యముల చేయు • సరసిజాక్షి,

యూరువుల కెట్లొ టన్నఁ బైఁ * దారు మోచు,
గొడుగులును నల్లకలశముల్ * గుఱులు గావె. ౩౧.

టీక. వసుధలోన్ = భూమిలోను, ఎట్టి శ్రీగలవారికేని = ఏవిధమైనసంపద గలవారికైనను, కరభములు = హస్తభాగవిశేషములు, ఊరువులకు = పెందొడలకు, దాస్యముల = వరువుడువులై, చేయన్ = ఒనర్చును, అటు = ఆవిధము, ఎట్లున్నన్ = ఎట్లునఁగా, పైన్ = తనమీఁద, తారు=తాను, మోచు=వహించెదు, గొడుగులును= ఛత్రములును, అల్లకలశములు = ఆప్రసిద్ధములగు పూర్ణకుంభములును, (దాస్యములు చేసెడువారు తమ హస్తములయందు గొడుగులను జలాహరణమునకుఁ గలశములనుదాల్తురనుట), మఱియు నుత్తమస్త్రీల హస్తములయందు ఛత్రకలశాదిరేఖలుండు ననుట. "శ్లో. అంకుశంకుండలంఛత్రంయస్యాఃపాణితలేభవేత్ । పుత్రంప్రసూయతేనారీసనరఃపృథివీపతిః ॥ యస్యాఃకరతలేపద్మంపూర్ణకుంభంతథైవచ । రాజపత్నిత్వమాప్నోతి పుత్రైశ్చసహమోదతే" అని సాముద్రికశాస్త్రము, గుఱులుగావే=అడియాలములుగావా.

తా. లోకమందలి యెంత సంపదగల స్త్రీల కరభములైన నాయమ యూరువులకు దాస్యము సేయునే కాక యాయూరువులతోడ సామ్యముఁ జెందనేరవనియును అవి దాసులై యుండుటకు గుఱుతు లేవనిన నాహస్తములయందు రేఖాకారములగు ఛత్రములును గలశములు గావాయనియు నట్టి రేఖలుగల భాగ్యవతులు గావున నే యీ యమ్మవారికి దాస్యములు సేయుటకుఁ గలుగుననియును సాధారణస్త్రీలకది దొరకదని భావము. ఉత్తమస్త్రీల చేతులయందుండు ఛత్ర కలశ రేఖలనూరు సేవార్థము ధరించిన ఛత్రకలశములుగా నుత్ప్రేక్షించి నాఁడు గనుక నుత్ప్రేక్షాలంకారము.

కం. వలరాజు కుటుంబము న, గ్గలముగఁ బోషించు కలభగర్భము లయ్యెన్,
బొలఁతుక జంఘ లతిశ్యామల మంజీరస్థ నిబిడ మరకత కాంతిన్. ౩౨.

టీక. పొలఁతుక = ఆపొలఁతియొక్క, జంఘలు = పిక్కలు, అతిశ్యామల = మిక్కిలిశ్యామల వర్ణములుగల, మంజీరస్థ = అందియలయందున్న, నిబిడ = దట్టములగు, మరకత = పచ్చలయొక్క, కాంతిన్ = ప్రకాశముచేత, వలరాజు = మన్మథునియొక్క, కుటుంబమున్ = సంసారమును, అగ్గలముగన్ = అధికముగ, పోషించు = ప్రోచెడు, కలభగర్భములయ్యెన్ = వరిపొట్టలయ్యెను, శ్యామలహరిద్వర్ణములకభేదంబగుటకు "మరకతమణిస్తంభగంభీరబాహుం" అని శ్రీకృష్ణకర్ణామృతమునందును "శుకాంకసీలోపలనిర్మితానా" అనిమాఘ తృతీయసర్గమందును,

“సీ. అభినవ జలధరశ్యామంబు లగుచోటు లాకు జొంపంబులననుకరింప” అని విరాటపర్వంబున నునికిం జేసి మరకతంబులయందు శ్యామల వర్ణము గలుగునట్లు నిచ్చటఁ జెప్పఁబడియె.

తా. ఆ పొలతిఁ పిక్కలతి నిర్మలము లై యుండుటం జేసి పాద కటకముల యందలి దట్టమగు పచ్చలకాంతిచే వ్యాప్తములై వరి పొట్టలవలెఁ బచ్చని వన్నెగ గలిగియున్న వనియును లోకమునందు రాజనపుఁ బొట్ట లెవ్వరి కేని పోషణార్థము పయోగించుఁ గావున నీ వరి పొట్టలు మన్మథుని కుటుంబ పోషణమునకు మిక్కిలి యుపయోగ మగు చున్న వనియు భావము.

తే. ఉవిద నిద్దంపు జంఘల • సవతుఁ గోరి,
కలమ గర్భంబు లడఁచు లోఁ • గంటకములు,
చాతురుల మించి మఱి దిన • సక్రమమున,
నిలువ కవి బాహిరము లైనఁ • దలలు వంచు. ౩౩.

టీక. ఉవిద = ఆయువతియొక్క, నిద్దంపు = స్నిగ్ధములగు, జంఘల = పిక్కల యొక్క, సవతున్ = సాపత్న్యమును, కోరి = అపేక్షించి, కలమగర్భంబులు = రాజనపుఁబొట్టలు, కంటకములు = తనయందలిదోషములు, (వరికి జుంజుఱు ముండ్లు గలిగి యుండుట ప్రసిద్ధము), చాతురుల్ = నేర్పులచేత, మించి = అతిశయించి, లోన్ = తనలోనే, అడఁచున్ = దాఁచుకొనును, మఱి = పిమ్మట, అవి = ఆకంటములు, నిలువక = లోపలనిముడక, దినసక్రమమునన్ = నానాఁట, బాహిరములైనన్ = బయల్పడఁగా, తలలువంచున్ = సిగ్గుచేత శిరములువంచును.

తా. నిద్దములగు నాయువిద పిక్కలతో రాజనపుఁ బొట్టలు సామ్యము రాఁ గోరి తమ యంత దోషములు బయల్పడనీక నేర్పుచే దాఁచె నే కాక మఱికొన్ని దినములలోనే యా కంటక దోషము గనుపడఁగా నా వరి పొట్టలు సిగ్గుచేతఁ దలలువంచుకొనును, అనఁగా నాయమ పిక్కలు మిక్కిలి నునుపు గలిగియున్న వనియును వరి పొట్టలు మొదట సామ్యమునకు వచ్చినను వెనుక వెన్ను తీయఁగానే ముండ్లు బయలఁ బడుటయు భారము చేతఁ దలలు వంచుటయును బ్రసిద్ధ మనియును భావము.

చ. ఇల గలఁ వస్త్ర సంతతుల • కెల్లను గచ్ఛపు మత్స్యభావ పా,
టల మచి యింక వేఱ యొక • హాళి డవచ్చునె లక్కనీట మ,
మ్మలమిన దెంత ముగ్ధ యిది • యంచుఁ బదాబ్జము లంగుళీముఖం,
బుల నగు నట్లు మించు నఖ • ము ల్మెఱయన్ గొను తారు నింతికిన్. ౩౪.

టీక. ఇలన్ = భూమియందు, కల = ఉన్నట్టి, వస్తుసంతతులకెల్లను = సమస్త వస్తుసముదాయములకు, మత్ = నాయొక్క, స్వభావ = ప్రకృతిచేతనే, పాటల = ఎఱ్ఱని, రుచి = కాంతి, గచ్ఛిడున్ = వన్నెఁబెట్టును, ఇంకవేఱ = మఱియితరముగు, ఒకడాలు = ఒకవర్ణమును, ఇడవచ్చునే = మాఁకుబెట్టవచ్చునా, ఇది = ఈయమ, లక్కనీటన్ = లాక్షారసముచేత, మమ్మున్ = మము, అలమినది = పూసినది, ఎంతముగ్ధ = ఎంతతెలియనిది, అంచున్ = అనుచు, పదాబ్జములు = అంజదమ్ములు, (ఇదికర్తృపదము), అంగుళీముఖంబులన్, అంగుళీ = వ్రేళ్లనియెడు, ముఖంబులన్ = మొగములచేత, నగునట్లు = పరిహసించునట్లు, మించు = అతిశయించునట్టి, నఖముల్ = గోళ్లు, మెఱయన్ = ప్రకాశింపఁగా, ఇంతికిన్ = ఆయమకు, కొమరారున్ = ఒప్పును, ముగ్ధయన్నామకు, "శ్లో. ముగ్ధేత్యాద్వాదశం స్త్రీణాం మధ్యేత్యాష్టాదశం స్మృతమ్ । అత ఊర్ధ్వం ప్రగల్భేతి వ్యవస్థాత్రయముచ్యతే" అనియాధారము.

తా. ఆయమ పాదాబ్జములకు మంగళార్థమై లాక్షారసమిడఁగా నవ్వు దా పాదములు లోకమందలి సమస్తవస్తువులకు వన్నెఁ బెట్టెడు మాకు వేఱొక వన్నెఁ బెట్టవచ్చునా యది యెఱుంగక యీ ముగ్ధ మాకు లక్కనీరుపూసె నని వ్రేళ్లనియెడు ముఖములచేతఁ బకపకనవ్వుచున్నవో యన్నట్లు గోళ్లు తెల్లఁగా మెఱయుచుండఁగా నాపాదము లొప్పు నని భావము.

కం. లలనోపరిపద కచ్ఛప, ములు బలిమిమెయిన్ గజప్ర • భూతగతి శ్రీ,
విలసనముఁ గొనఁగఁగాదే, కలిగెన్ గజకచ్ఛపోగ్ర • కలహం బుర్విన్ ౩౫.

టీక. లలనా = ఆయమయొక్క, ఉపరిపద = మీఁగాళ్లనియెడు, కచ్ఛపములు = తాఁబేళ్లు, బలిమిమెయిన్ = బలాత్కారముచేత, గజ = ఏనుఁగులయొక్క, ప్రభూతగతి = ఒయ్యారపునడకయొక్క, శ్రీ = సంపదయొక్క, విలసనమున్ = విలాసమును, కొనఁగఁగాదే = గ్రహింపఁగాఁగదా, ఉర్విన్ = భూమియందు, గజకచ్ఛపోగ్రకలహంబు, గజ = ఏనుఁగుయొక్కయు, కచ్ఛప = తాఁబేటియొక్క, ఉగ్ర = భయంకరమయిన, కలహంబు = పోరాటము, కలిగెన్ = ఉదయించెను.

తా. ఆ లలనయొక్క మీఁగాళ్లు తాఁబేళ్లవలె నున్నవనియును గజ గమనమువంటి గమనముగలిగియున్నవనియును ఆకచ్ఛపములు గజముయొక్క గమన సంపదను హరింపఁగా దాని వలన నాయేనుఁగునకును దాఁబేటికిని గలహము సంభవించెననియు దానిచేతనే భూమియందు గజకచ్ఛప సంవాద మను సామెత పుట్టె నని భావము.

తే. తరుణి తను కాంతి యెదుటనూ • తనహరిద్ర,

తులకు రాలేక యత్యంత • మలిన యయ్యె,
నౌటఁగా రాత్రి యన నిశ • యనఁ దమిస్ర,
యన నిశీథినియన క్షప • యనఁగఁబరగె. ౩౬.

టీక. నూతనహరిద్ర = పచ్చిపసపు, తరుణి = ఆలేమయొక్క, తను = శరీరముయొక్క, కాంతియొకటన్ = ప్రకాశమునుండదలి, తులకురాలేక = సామ్యమునకురాలేక, (త్రాసునకురాలేకయనుట), అత్యంతమలినయయ్యెన్ = మిక్కిలి మాలిన్యమునొందెను. (పచ్చిపసపెండిన పిమ్మటఁ జైన నల్లగానగును), నౌటఁగా = కాఁబట్టియేకాదా, రాత్రియనన్, నిశయనన్, తమిస్రయనన్, నిశీథినియనన్, క్షపయనన్, (ఇవియన్నియు రాత్రికి నామములు), ఈపేళ్లపసుపునకును జెల్లును. (నిశాఖ్యకాంచనీపీతా హరిద్రావరవర్ణినీ అని నిఘంటువు కాన నీపేరుల చేత నా పసుపు). పరఁగెన్ = ఒప్పెను, కరఁగెననుపాఠమునుగలదు, పసుపురాచినఁగరఁగుట ప్రశస్తము.

తా. సుగమము.

సీ. అయ్యిందువదన ధ • రాంగన గావునఁ బ్రాజ్ఞ్మైత్రిఁ బొరుగుల • భాగవతుల,
గృహములందు మరాళి • కైకావళిహరి ణీమనోజ్ఞాస్రగ్వి • ణీసమాఖ్య,
లమర జనించి వ • యస్య లై నాగ కన్యలుపుత్రికావివా • హములయందుఁ,
బాడు పద్మాలయా • పరిణయామేయగే యములనంతక • ల్యాణగుణము,
లద్భుతంబొప్ప విని విని • యతనిఁ గవయు,బుద్ధి ప్రాగ్జన్మ సంస్కారమున జనింప,
ద దవతారానుమేయక • థాసుధాను, కలిత లీలానుకృతుల నా • టిలుచునుండి.

టీక. అయ్యిందువదన = ఆచంద్రముఖి, ధరాంగనగావునన్ = భూదేవియగుటచేత, ప్రాజ్ఞైత్రిన్ = పూర్వజన్మస్నేహముచేత, నాగకన్యలు = భుజంగకన్యలు, పొరుగుల = సమీపములయందలి, భాగవతుల = భగవద్భక్తులయొక్క, గృహములందు = తిరుమాళిగలయందు, మరాళికా, ఏకావళీ, హరిణీ, మనోజ్ఞా, స్రగ్విణీ అనియెడు, సమాఖ్యలమరన్ = నామధేయములొప్పచుండఁగా, జనించి = అవతరించి, వయస్యలై = ఆయమకునెచ్చెలులై, పుత్రికావివాహములయందున్ = బొమ్మలపెండ్లిండ్లయందు, పాడు = గానముచేసెడు, పద్మాలయాపరిణయ = లక్ష్మీకళ్యాణమనియెడు, అమేయ = లెక్కకుమీఱిన, గేయములన్ = పాటలయందు, అనంత కళ్యాణగుణములు, అనంత = విష్ణువుయొక్క, కళ్యాణ = మంగళకరములగు, గుణములు = గొనములు, అద్భుతంబొప్పన్ = అబ్బురముగలుగునట్లు, వినివిని, అతని = ఆ విష్ణుదేవుని, కవయు = కూడెడు, బుద్ధి = మనీష, ప్రాగ్జన్మ సంస్కారమునన్, ప్రాగ్జన్మ = పూర్వజన్మసంబంధియగు, సంస్కారమునన్ = సంస్కారముచేత, (ఇ

చ్చటఁ దృతీయార్థమున సప్తమి), జనింపన్ = పుట్టఁగా, తదవతారానుమేయ కథాసుధానుకలిత లీలానుకృతులన్, తత్ = ఆస్వామియొక్క, అవతార = రామ కృష్ణాద్యవతారములయొక్క, అనుమేయ = ఊహింపఁదగిన, కథాసుధా=అమృతము వంటికథలతోడను, అనుకలిత = కూడికొన్న, లీలా = విలాసములయొక్క, అనుకృతులన్ = అనుకారములచేతను, (ఇచ్చటతదవతారకథాగోష్ఠిఁ దదవతారకలితలీలానుకృతులవతిఁ బలుచు నుండి అనియును పాఠాంతరము గలదు).

తా. సుగమము.

సీ. తమతండ్రి శ్రీశదత్తశ్రీలు గృహమునఁ బ్రబలఁ దండములయ్యెఁ దనదు తొంటి,
స్రగ్వినిర్మాణదాస్యంబనుత్సేకత జరపుచుఁ బ్రజ్ఞ వైష్ణవపురాణ,
సంహితావ్యాఖ్యారచనఁ బ్రొద్దుఁ గడపుచు గట్టెడుకమ్మ చెంగలువ విరుల,
తోమాలె లలకలు దువ్వి కంతునకు నార్ద్రనిబద్ధ ఖేటకంబనఁగ నీల,
వృషకకుద్రేఖ నెడమ కొక్కింత యొలుగ, నిడిన ధమ్మిల్ల వలయంబు నడుగు నందుఁ,
గొంత సేపద్దిఁ గిలించి కూపవారి, నీడ వీక్షించి క్రమ్మఱఁ గూడ ననుచు ౩౭.

టీక. తమతండ్రి = ఆవిష్ణుచిత్తుఁడనుట, గృహమునన్ = తమయింటియందు, శ్రీశదత్తశ్రీలు, శ్రీశ = శ్రియఃపతిచేత, దత్త = ఇయ్యఁబడిన, శ్రీలు = సిరులు, (నిశోభాసంపత్తిపద్మాసులక్ష్మీ శ్రీరితికథ్యతేయనిహలాయుధము), ప్రబలఁ దండములయ్యెన్ = తెఱుఁగకయుండినను, తనదు = తనసంబంధియగు, తొంటి = తొల్లింటి, స్రగ్వినిర్మాణదాస్యంబు, స్రక్ = పుష్పమాలికలయొక్క, వినిర్మాణ = కూర్చుటయనియెడు, దాస్యంబు = కైంకర్యంబు, అనుత్సేకత = గర్వములేమిచేత, జరపుచున్ = చేయుచును, ప్రజ్ఞన్ = జ్ఞానముచేత, వైష్ణవపురాణసంహితా = శ్రీవిష్ణుపురాణ సంహితయొక్క, వ్యాఖ్యారచనన్ = వ్యాఖ్యానముఁ జేయుటచేత, ప్రొద్దుఁగడపుచున్ = కాలక్షేపముఁ జేయుచు, కట్టెడు = కూర్చుచుండెడు, కమ్మ = సుగంధముగల, చెంగలువవిరుల = ఎఱ్ఱగలువపూలయొక్క, తోమాలెలు = దండలు, (ఇచ్చట ద్వితీయార్థమందుఁ బ్రథమ), అలకలు = కురులు, దువ్వి = వ్యాదసించి, కంతునకున్ = మన్మథునకు, ఆర్ద్ర = నెమలితెక్కలచేత, నిబద్ధ = కూర్పఁబడిన, ఖేటకంబనఁగన్ = కేడెమోయనునట్లు (కూర్పరబద్ధయను పాఠమున మోచేతఁగట్టఁబడిన యనియర్థము), నీలవృషకకుద్రేఖన్, నీలవృష = నల్లనియాఁబోతుయొక్క, కకుత్ = మూఁపురము యొక్క, రేఖన్ = ఆకారమువంటియాకారముచేతను, (వృషాంగేకకుదంస్త్రియఃఅనియమరము), ఎడమకు = వామపార్శ్వమునకు, ఒక్కింత = ఇంచుకంత, ఒలుగఁగా ఇడిన = ఉనుచుకొనిన, అనఁగాదిద్దిన, ధమ్మిల్లవలయంబు = వట్రువయగుకొప్పుయొ

క్క, "ధమ్మిల్లస్సంయతాః కచా" అని యమరము, అడుగునందుఁ = అంతభాగ మందు, కొంత సేపు = కతిపయ కాలము, అర్థిఁ =కోర్కి చేత, కీలించి=తుఱుముకొని, కూపవారిఁ = నూతినీటియందు, నీడవీక్షించి = నీడఁజూచుకొని, క్రమ్మఱఁ=మగిడి, కరండకఁ = తమతండ్రియుంచినపుష్పముల పుటికలోను, ఉనుచుఁ = ఉంచును.

తా. ఆచంద్రవదన దనతండ్రియగు విష్ణుచిత్తుండు శ్రియఃపతి కృపవలన నధికతర సంపదలు గలిగినను గర్వింపక పూర్వమువలెనే పుష్పమాలికాకైంకర్యముఁ జేయుచు శ్రీవిష్ణుపురాణవ్యాఖ్యానముచేతఁ గాలక్షేపముఁ జేయుచుఁ గూర్చెడు చెంగలువదండలను దాను గొప్పులోధరించి నూతిలో నీడఁజూచుకొని మరల నవిగూడ బుట్టలోనునుచుననియు నాకొప్పునెడమ ప్రక్క కొఱగి యుండుననియు భావము.

ఉ. ఆ నవలా యలంతి పసు•పాడి దుకూలముఁ దాల్చి గుబ్బచన్,
గోనలఁ దావు లుప్పతిలఁ•గుంకుమ తేటల నిగ్గు దేరఁ గ,
ప్రానన నాభిఁ దీర్చి పితృ•బద్ధ లతాంతము లర్థిఁ గొప్పునం,
బూని యొకింత సే పునిచి•పుచ్చి చెలిం గని వెచ్చ నూర్చుచున్. ౩౯.

టీక. ఆనవలా= ఆయింతి, (అన్యదేశ్యముగుటం జేసిదీర్ఘాంతరము), అలంతి = స్వల్పమగు, పసుపాడి = పసుపుతోడి స్నానముచేసి, (ఆనవలావలంతియనుపాఠమున స్త్రీరత్నమనియర్థము), దుకూలము = ధౌతవస్త్రమును, తాల్చి = ధరించి, గుబ్బచన్గోనలన్ = గుబ్బచనుగోనలయందు, (కోణశబ్దము వలనఁ గోన కొన అను రూపములుగలుగును లేక స్తనములు పర్వత సమములు గనుకఁ దత్ప్రదేశములను గోన లన వచ్చును), తావులు = పరిమళములు, ఉప్పతిలన్ = ఉదయించునట్లు, కుంకుమ తేటల = కుంకుమకాంతులయొక్క, నిగ్గు = నిగారింపు, తేరన్ = కానరాఁగా, కప్రానన = కర్పూరముచేతనే, నాభిన్ = తిరుమణిని, తీర్చి = దిద్ది, పితృబద్ధలతాంతములు, పితృ = తండ్రియగువిష్ణుచిత్తునిచేత, బద్ధ = కట్టఁబడిన, లతాంతములు= పుష్పములను, అర్థిన్ = కోరికచేత, కొప్పునన్ = ధమ్మిల్లమందు, పూని = ధరించి, ఒకింతసేపు = కతిపయకాలము, ఉనిచి = ఉంచుకొని, పుచ్చి = మరలఁదీసి, చెలిన్= చెలికత్తెను, కని = చూచి, వెచ్చన్ = వేఁడిమిగాఁగ, ఊర్చుచున్ = ఉచ్ఛ్వసించుచునని ముందటిపద్యముతో నన్వయము.

తా. సుగమము.

కం. మీ పాడిన హరి చందము, లే పాడిగఁ దలఁప వచ్చు•నితఁ డేసతులం,
గాపాడినవాఁ డనుఁగ్రై, త్రో పాడినఁ దన్ను వలచి తొయ్యలులారా? ౪౦.

టీక. మీపాడిన హరిచందములు = మీయొక్క పాటలలోని స్వామియొక్క

రీతులు, ఏపాడిగ = ఏమర్యాదగాను, తలఁపవచ్చుఁగా = ఊహింపవచ్చును, ఇతఁడు= ఈహరి, తొయ్యలులారా = స్త్రీలారా, తన్నువలచీ = తన్ను మోహించి, త్రోపాడినన్ = వెంబడించినను, అనుఁగై = వారికిఁ బ్రియుఁడై, ఏసతులన్ = ఏ స్త్రీలను, కాపాడినవాఁడు = కాపాడినాఁడు. ఈ ప్రశ్నవలన నాస్వామి మర్యాదలేనివాఁడని యును దన్ను మోహించిన స్త్రీలనైనను దాను స్నేహించి కాపాడ లే దనియును బరిహసించుట.

తా. సుగమము.

తే. తానుసురమౌని నృపతనుల్ ♦ దాల్చి యకట,
కామినీతతి నుడికించు ♦ కంటె నట్టె,
గండఁడయును నల్లదాసరి ♦ గాఁడు కిరియు,
హరియు నై పోవుటయ మంచి ♦ దనుయుగంబు. ౪౧.

టీక. తాను = ఆహరి, సురసూని = వామనపరశురామబుద్ధులయొక్కయు, నృప = శ్రీరామునియొక్కయు, తనుల్ = శరీరములు, తాల్చి = వహించి, అకట= అయ్యయో, కామినీతతిన్ = స్త్రీ సమూహమును, ఉడికించుకంటెన్ = తపింపఁజేయుటకంటెను, అట్టె = ఆప్రకారమే, (మరలనవతారాంతరముఁ బొందకుండునట్లనుట), గండఁడయును = మత్స్యమును, అల్లదాసరిగాఁడును=కూర్మమును, కిరియు= వరాహమును, హరియు = సింహమును, అయి, అనుయుగంబు = ప్రతియుగమందును, పోవుటయ = పోవుటే, మంచిది = మేలు.

తా. ఆ హరి వామన పరశు రామ బుద్ధ రామావతారములయందు స్త్రీలను దపింపఁ జేయుట కంటె మత్స్య కూర్మ వరాహ సింహ రూపములతోనే ప్రతియుగమందు నుండుటయే మే లనియును నిట్లు తిర్యగ్జాతిరూపములతో నుండిన స్త్రీ లెవ్వారును మోహింపరు గావున వారికిఁ దాపము లే దని భావము.

కం. ఆతనువుల లేరుగదా, నాతులు మఱి కాక కలిగి ♦ న న్వగ తిర్య,
గ్జాతికి నీజాతికిఁ గల, యీతిప్రవత గలదె యెఱుఁగ ♦ కి ట్లేలంటిన్. ౪౨.

టీక. ఆతనువులన్ = ఆమత్స్యకూర్మాద్యవతారములయందు, నాతులు= స్త్రీలు, లేరుగదా, మఱికాక = వెండియునటుగాక, కలిగినన్ = స్త్రీలుండినను, (విష్ణోర్దేహానురూపాం వైకరోత్యేషాత్మన స్తనుమనియున్నది గనుకఁ దిర్యగ్జాతి స్త్రీలుండవచ్చుననుట), వగ = ఖేదము, తిర్యగ్జాతికిన్=అమత్స్యకూర్మాదితిర్యక్స్త్రీజాతికని, ఈజాతికిన్ = ఈమనుష్యజాతికిఁగలిగి, ఈతిప్రవత= ఈత్వరపాటుచేత, కలదె=

కలుగునా, అనివరల, ఎఱుఁగక = తెలియక, ఇట్లేలంటి = ఈవిధముగా నేమిటికింటివని ముందటిపద్యముతో నన్వయము.

తా. సుగమము.

తే. "ఆత్మవ త్సర్వభూతాని" యనుటఁ బొంకె,
ముద్దియల కైన వలవంత ♦ ముచ్చటలను,
నాట పాటలఁ గతలఁ గొం ♦ తడఁగుఁ గాని,
నోరు లేని జంతువులకు ♦ నొప్పి ఘనము. ౪౩.

టీక. ఆత్మవత్స ర్వభూతాని, సర్వభూతాని = సమస్తభూతములును, ఆత్మవత్ = తనవలెనే, అనుట = అనిచెప్పుట, బొంకె=అసత్యమా, (సత్యమేయనుట), "మాతృవత్పరదారాణి పరద్రవ్యాణిలోష్టవత్ । ఆత్మవత్సర్వభూతాని యఃపశ్యతిస పశ్యతి" యనిశ్లోకము. ముద్దియలకుఁ = మనుష్యస్త్రీలకు, ఐన = కలిగిన, వలవంత = విరహతాపము, ముచ్చటలను = ఒండొరులకుఁ జెప్పుకొనుటచేతను, ఆటపాటలఁ = నృత్యగానములచేతను, కతలఁ = ఆహారికథలచేతను, కొంతడఁగుఁగాని= కొంతచుట్టుపడునుగాని, నోరులేనిజంతువులకుఁ= మాటాడలేనిజంతువులకు, నొప్పి= ప్రయాసము, ఘనము = అధికము.

తా. లోపలి పద్యమందు నెఱుఁగక యని మరలఁ దెలిసి మనుష్యస్త్రీలకు ముచ్చటలు మొదలయిన వానిచేతఁ గొంత విరహతాప మాఱునుఁ గాని యీ మత్స్య కూర్మాది తిర్యగ్జాతి స్త్రీలకే తాప మధిక మని యెఱిఁగి చెప్పె నని భావము.

మ. ధరపై నీతఁడు పూర్వ కల్పముల స ♦ క్తస్త్రీవిశాలాంబకాం,
బురుహశ్రేణి జలంబు మైఁ బులకలుఁ ♦ బూరించుచుఁ బెంచు మ,
ర్భరకర్మం బలమంగ వచ్చు జలచా ♦ ర స్తబ్ధరోమత్వకే,
సరిత ల్పొం డవతార దంభమున నా ♦ చ్ఛాదించుఁ బోఁ బ్రోఢిమన్. ౪౪.

టీక. ఈతఁడు = ఈహరి, ధరపైన్ = భూమిమీఁద, పూర్వకల్పములన్ = పూర్వయుగములయందు, సక్త = తనయందుమోహముగల, స్త్రీ = స్త్రీలయొక్క, విశాల = వెడఁదలగు, అంబకాంబురుహ = కమలములవంటినేత్రములయొక్క, శ్రేణిన్ = పంక్తియందు, జలంబు = ఉదకమును, మైన్ = శరీరమందు, పులకలున్ = రోమాంచములును, పూరించుచున్ = నిండించుచును, పెంచు = వృద్ధిఁబొందఁ జేసెడు, మర్భర = భరింపరాని, కర్మంబు = సంచితకర్మము, అలమంగన్ = వ్యాపింపఁగా, వచ్చు = సంభవించునట్టి, జలచారస్తబ్ధరోమత్వకేసరితల్ = నీటఁదిరుగుటయు నిట్టవొడిచినరోమములుగలుగుటయు, (మెడమీఁదఁ గొనవెండ్రుకలు గలుగు

టియును, తాన్ = ఆహరి, ప్రౌఢిమన్ = నేర్పుచేతను, పొందు=ఇతరములగు, (ఇది యొండను శబమునకారాదిగానుండుననెట్లన్నను, ఒచ్చెము, పొచ్చెము, ఊను, పూను, ఒనరించు, పొనరించు, ఇత్యాదులవలెనని యెఱుఁగవలయు), అవతారదంభమునన్ = అవతారమనియెడునెపముచేత, ఆచ్ఛాదించున్ = మఱుగుపఱుచును, కైతవాపహ్నవాలంకారము (కైతవాపహ్నుతిర్వ్యక్తౌవ్యాజాద్యైర్నిహ్నుతిఃపదైః అనిదానిలక్షణము.)

తా. ఆ హరి పూర్వయుగములయందు భూమిమీఁదఁ దన్ను మోహించిన స్త్రీలకోరికలు దీర్పక వారిని విరహమందు మునుఁగఁ జేసి దుఃఖపెట్టినాఁడు. కావున నా కర్మపరిపాకము దన కనుభవమునకు రాఁగా "శుభకృచ్ఛుభమాప్నోతి పాపకృత్పాపమశ్నుతే" యన్నట్లాస్త్రీలకుఁ గన్నీరు గలుగఁ జేసిన హేతువు వలన నాకన్నులతో సరియగు మీను మేనుతోఁ దాను నీటిలోఁ దిరుగు నట్లేర్పడఁగా నది మత్స్యావతారముగాను మఱియు నా స్త్రీలశరీరములయందు గగుర్పాటు గలుగఁ జేసిన హేతువు వలనఁ దనకు నట్లనిక్క వాడిచిన రోమములురాఁగా నది వరాహావతారముగాను మఱియు దాని వలననే తనకు మెడమీఁదఁ గొన వెండ్రుకలు గలుగఁగా నది సింహ ముఖము గల యవతారముగాను నేర్పడెను. కావున నది యా కర్మానుభవ మని తెలియరాకుండ మఱుఁగు పెట్టు నని భావము.

కం. అనిమిష ముని మను జాధిప, జననంబుల నీతఁ డెట్లు జలజాక్షులఁ గూ,
ర్చిన వారి నేఁచె దయలే, కనిన వినుఁడు మీదు పాటలంద తెలిపెదన్. ౮౫.

టీక. అనిమిషముని = వామన పరశురాములయొక్కయు, మనుజాధిప = శ్రీరామునియొక్కయు, జననంబులన్ = అవతారములయందు, ఈతఁడు= ఈహరి, కూర్చినవారిన్ = ప్రేమపడినవారైన, జలజాక్షులన్ = స్త్రీలను, దయలేక=కృపమాలి, ఎట్లేఁచె ననినన్ = ఏరీతిచేఖేదపెట్టెననఁగా, మీదుపాటలంద= మీసంబంధులగుపాటలయందే, తెలిపెదన్ = ఎఱిఁగించెదను, వినుఁడు=వినుండు.

తా. సుగమము.

చ. మొదల నుపేంద్రుఁడై యితఁడమోఘహతిం బృగు పత్నిఁ ద్రుంచి యా,
మ్నదసలి గేహినీ విరహమున్ దన యట్లన పొందు మన్న నా,
కదియును దేవకార్యమున కయ్యెడు నంచు వహించి త్రోఁచు లా,
వద వటువయ్యు లచ్చిమది కెన్నఁడుఁ బాయని జాలి నింపఁడే. ౮౬.

టీక. ఇతఁడు= ఈహరి, మొదలన్ = ప్రథమమందు, ఉపేంద్రుఁడై = వామనుఁడై, అమోఘహతిన్ = వీఁటుపోనివ్రేటుచేత, భృగుపత్నిన్ = భృగుమహామునిభా

ర్యను, త్రుంచి = సంహరించి, అమ్ముసలి = ఆవృద్ధుఅయినభృగువు, తనయట్లన = తనవలెనే, గేహినీవిరహామున్ = భార్యావిరహమును, పొందుమన్నన్ = అనుభవింపు మనఁగా, నాకదియును = నాకాభార్యావియోగము, దేవకార్యమునకున్ = దేవతలకార్యముకొఱకే, అయ్యెడునంచున్ = అవునని = వహించి = ఆశాపమును వహించి, త్రోఁచు = కాలమునుగడపునట్టి, ఏపెదన్ = దృఢమయినమనస్సుచేత, వటువయ్యు = తానుబ్రహ్మచారియయ్యును, లచ్చిమదికి = లక్ష్మీదేవిమనస్సునకు, ఎన్నఁడున్ = సంతతమును, పాయని = విడువని, జాలి = విచారమును, నింపఁడే = నిండింపఁడా? వ్యతిరేకప్రశ్న.

తా. భృగుభార్యను దునిమి యా వృద్ధొసఁగిన శాపము దేవతల కార్యము కొఱ కగు నని తాను సమ్మతిగా వహించి వామనుఁడై యవతరించి బ్రహ్మచారియై యుండియును వివాహము చేసికొనక నిత్యానపాయిని యయిన లక్ష్మికి నెడ బాటు వలని వ్యసనమును గలుగఁ జేసె నని భావము.

మ. ప్రళయార్కోగ్ర కుఠార కోణమున నృపత్రైవిధ్యవత్పీఠికా,
ఖ్యలఁ ద్రిస్థానము లేడు మార్లు వరుసన్ ఘట్టించు దోశ్శక్తిఁ గీ,
ర్తిలసద్వల్లకి మ్రోయ రక్తయయి యెంతే వశ్యయౌ భూసతీ,
తిలకంబుం దుదఁ ద్రోవఁ గశ్యపున కార్తిం బిడ్డయై పోవ దే? ౮౭.

టీక. ప్రళయార్క = విలయసూర్యునివలెనే, ఉగ్ర = తీక్ష్ణమగు, కుఠార = గండ్రగొడ్డలియనియెడు, కోణను = వీణవాయించెడుకడ్డిని, (కోణోవీణాదివాదన మనియమరము), నృప = రాజులయొక్క, త్రైవిధ్యవత్ = శత్రుమిత్రోదాసీనభేదములచేత మూఁడువిధములుగల, పీఠికా = సింహాసనములనియెడు, ఆఖ్యలన్ = పేళ్ళచేత, త్రిస్థానములు = మంద్రమధ్యతారకములనియెడు మూఁడుస్థానములను. ఏడుమార్లు = సప్తవారములు, వరుసన్ = షడ్జాదిసప్తస్వరక్రమముగా, ఘట్టించు = కొట్టెడు, వాయించెడు, దోశ్శక్తిన్ = భుజశక్తిచేత, కీర్తిలసద్వల్లకి, కీర్తి = యశమనియెడు, లసత్ = ఒప్పుచున్న, వల్లకి = వీణ, మ్రోయన్ = ధ్వనిసేయఁగా, రక్తయై = అనురక్తిగలిగినదైయును, రాజరక్తముచేతఁ దడుపఁబడి యెఱ్ఱనిదై, ఎంతే = మిక్కిలియు, వశ్యయౌ = స్వాధీనపడిన, భూసతీతిలకంబున్ = భూదేవి యనెడు పతివ్రతారత్నమును, తుదఁద్రోవన్ = కడకుద్రోయఁగా, కశ్యపునకున్ = కశ్యపుఁడనుఋషికి, ఆర్తిన్ = ఆయాసముచేత, బిడ్డయై = పుత్త్రికయై, పోవదే = పోవదా, పోయెననుట. త్రైవిధ్యవత్తనుతావునఁ బూర్వవ్యాఖ్యానముల ననుసరించి శత్రుమి

త్రో దాసీనభేదముచేతనవిత్రాసితిమిగాని శత్రు, శత్రుమిత్ర = మిత్రశత్రుభేదముచేత మూఁడువిధములుచెప్పుట యుక్తమని తోఁచుచున్నది.

తా. పరశురాముఁడు కుఠారమనెడు కడ్డిచేతఁ ద్రివిధ నృప సింహాసనము లనియెడు మంద్రాదిస్థానముల నెడు మూఁటులు ఘట్టింపఁగా మూఁడే ళ్ళిరువది యొక్కమాఱుమ్రోయ నట్లు దోర్బలముచేత వాయించెఁ గావునఁ గీర్తియనెడు వీణె యొక్క మ్రోఁత విని యను రక్తురాలగు భూమిని దా నేలక కశ్యపునకు దారవోసిన నాపె పతివ్రత గనుక నతనిఁ బొందక యతనికి బిడ్డయై కాశ్యపి యని పిలువఁబడె నని భావము.

మ. తన సౌందర్యము చెప్పఁగాఁ గరఁగి ప ద్మాకాంత రప్పించి మో,
హన కంజంబున వైచి తియ్య మిడు నె య్యం బొప్పఁ బైకొన్న మీ,
ఱి నృశంసత్వమునం దొఱంగి చని వె ఱ్ఱిం జేసె గాకుత్స్థుఁ డై,
ననిలింపారివిదారి చందములు డెం దాన న్విచారింపుఁ డా. ౭౭.

టీక. తన=ఆహరియొక్క, సౌందర్యముఁ = చక్కఁదనమును, చెప్పఁగాన్ = జనులుచెప్పఁగా, కరఁగి = ప్రియపడి, పద్మాకాంత = శ్రీదేవి, రప్పించి= రావించి, మోహనకంజంబునన్ = మోహమునుగలుగఁజేసెడుపద్మముచేత, వైచి = విసరివేసి, తియ్యమిడు = మాధుర్యమొసఁగెడు, నెయ్యంబొప్పన్ = ప్రేమమించఁగా, పైకొన్నన్ = కౌఁగిలింపరాఁగా, మీఱి = ఆయమ నతిక్రమించి, నృశంసత్వమునన్ = క్రౌర్యముచేత, తొఱంగి = విసర్జించి, చని=పోయి, వెఱ్ఱిం జేసెన్ = ఉన్మత్తురాలినిజేసెను, కాకుత్స్థుఁడైన = ఆకాకుత్స్థవంశజాతుఁడైన, నిలింపారివిదారి = రాక్షసాంతకునియొక్క, చందములు = చర్యలు, డెందానన్ = మనస్సునందు, విచారింపుఁడా = ఆలోచింపుఁడు.

తా. శ్రీరాముల సౌందర్యమును విని శ్రీదేవి పిలిపించి విలాసముగాఁ దన చేతి కమలముచేత వైచి యతిప్రేమచేఁ గౌఁగిలింప రాఁగా నది తప్పఁజేసి యొప్పక కఠిన చిత్తుఁడై తొలఁగి యా యమను వెఱ్ఱినిగాఁ జేసిన యా రాముని చందము మీరే మదిలో విచారింపుఁ డని భావము.

చం. చెలువముఁ దాల్చి తన్నవయఁ జేరిన రాగిణి రావణస్వస,
న్నలువురు నవ్వ నత్తఱిఁ గొ నర్పక గేలిన వియ్యమై యతం,
డలుగఁడు సీత క్షితి తల పాత్మఁ దలంపక యాయమ న్వృథా,
కలహమునం దనుం దొఱఁగు కాఁకకు నాఁకకు లోను సేయఁ డే ౭౮.

టీక. చెలువము = సౌందర్యమును, తాల్చి = తానువహించి, తన్ = తన్ను,

కవయన్ = కూడుటకు, చేరిన = సమీపించిన, రాగిణిన్ = అనురాగముగల, రావణస్వసన్ = రావణునితోఁ బుట్టువగు శూర్పణఖను, నలువురు = చూచిననలుగురు, అనఁగా సర్వజనులనుట, నవ్వన్ = పరిహసింపఁగా, అత్తైఱఁగు = ఆరీతిని, (ముక్కుచెవులు గోయుటననుట), ఒనర్పక = చేయక, ఏలినన్ = పాలించినను, వియ్యమై = సంబంధియై, (అనఁగా బావమఱఁదియైయనుట), అతఁడు = ఆరావణుఁడు, సీతకున్ = సీతాదేవికి, అలుగఁడు = కోపింపఁడు, ఇట్టితలఁపు = ఈయాలోచనను, ఆత్మన్ = బుద్ధియందు, తలంపక = ఆలోచింపక, ఆయమన్ = ఆమెను, అనఁగా సీతాదేవిని, నృధాకలహమునన్ = రిత్తకయ్యముచేతను, తనున్ = తన్ను, తొలఁగు = ఎడఁబాసెడు, కాఁకకున్ = తాపమునకును, ఆఁకకున్ = రావణునింటినిరోధమునకును, లోనుసేయఁడే = లోఁబడఁజేయలేదా.

తా. ఆశ్రీరాముఁడు దాను సుందరుఁడు గావునఁ దన్నుఁ జూచి మోహించి వచ్చిన శూర్పణఖను నలుగురు నవ్వున ట్లాభంగిఁ జేయక యేలికొనెనేని దానికి సోదరుఁడగు రావణుండు దనకు బావమఱఁదియై సీత నిమిత్తము కోపింపఁడుగదా యీ సంగతి యాలోచింపక వట్టి పోరు పెట్టుకొని సీత దన్నెడఁ బాసి తాపముఁ జెందునట్లును రావణుని నిర్బంధమునకు లోఁబడు నట్లును చేసి నాఁ డని భావము.

శా. ఫీట్కార స్రవదస్రమై పెదవి గం ◆ పింప న్మొఱ ల్గిట్టి ప్రా,
వృట్కాలాంబుద గర్జ గెల్వఁగ వల ◆ చ్ఛ్రీఖండ శాఖాసిత,
త్విట్కుంభీనస రేఖఁ గేలసిలతా ◆ ధృద్బాహు వేష్టింప నుఁన్,
రాట్కుంతీరవమై యొనర్చె వడి సో ◆ ణాలంటు ఘోణాఛిదన్. ౫౦.

టీక. ఫీట్కార = ఫీట్టనుధ్వనితోడ, స్రవదస్రమై, స్రవత్ = కాఱుచున్న, అస్రమై = నెత్తురుగలదై, పెదవి = ఓష్ఠము, కంపింపన్ = వడఁకుచుండఁగా, మొఱల్ = ఆర్తనాదనులు, కిట్టి = సమీపించ, ప్రావృట్కాలాంబుద = వర్షాకాల మేఘముయొక్క, గర్జన్ = ఉరుమును, గెల్వఁగన్ = జయింపఁగా, వలత్ = చుట్టుకొనుచున్న, శ్రీఖండ = చందనవృక్షముయొక్క, శాఖా = కొమ్మయొందలి, అసిత = నల్లనగు, త్విట్ = కాంతిగల, కుంభీనస = త్రాఁచుపాముయొక్క, రేఖన్ = పోలికచేత, కేలు = శూర్పణఖాహస్తము, అసిలతా = లతవంటి ఖడ్గమును, ధృత్ = ధరించుచున్న, బాహున్ = భుజమును, "తే. నేలనాలుగు చెఱఁగుల నృపులకొలువు। లందునేనువర్ణించితి నవనినాథ। యగ్గలించినాయెదుట బాహాస్ఫురించి। కడఁగఁజాలె డుమల్లులంగాననెందు" న్న పద్యమందుఁ దృతీయపాదమున వువర్ణకము లేనియట్లు

సోమయాజ విరాటపర్వంబునం బ్రయోగించెఁ గావున నిచ్చటను దూషణకము లేకయే చెల్లుబడియయ్యె, వేష్టింపన్ = చుట్టుకొనఁగా, మున్ = పూర్వమందు, రాట్కంఠీరవమై = రాజసింహమై, ఘ్రాణాఛిదన్ = నాసికాచ్ఛేదమును, సోణాలంటన్ = నాసామూలమునను౦డు నెముక లంటునట్లు, వడిన్ = వేగముచేత, ఘనర్చెన్ = చేసెను.

తా. మున్ను దాను రాజసింహమై స్త్రీబాధఁ జేయకుండెడు నియమము గల్గియు శూర్పణఖ యొక్క నాసికను శల్యము దగులునట్లు ఛేదింపఁగా నాముక్కు తెగునప్పుడు ఫీట్టుమధ్వనిలోఁగూడ రక్తము గాఱుచుండఁగా దాని పెదవి గడగడ వడఁకుచుండగా మొఱ్ఱోయను నార్తనాదము ముఱిమి నట్లుండగా దాని చేయి దన చేతిని జుట్టుకొనఁగా నతి వేగముగా దాని ముక్కు చెవులు గోసె నని భావము. లక్ష్మణుఁడు గోసిన నయ్యాజ్ఞ తనదిగావునఁ దానేయని తాత్పర్యము.

తే. ఒల్లఁ బొమ్మన్నఁ బోదె? తా • నుల్లసముల,
నేఁప నది రక్కసియయాట • నెగ్గ? వలచి,
స్త్రీలు దలవంపఁ దానవ • చ్చెనదిచాల,
కాఁడు దాని బజీతు సే • యంగనగునె?

(బజారుసేయంగనగునేయని కొందఱ పాఠము.)

టీక. ఒల్లన్ = నేనిష్టపడను, పొమ్మన్నన్ = పొమ్మనిచెప్పఁగా, పోదే=ఆ శూర్పణఖపోదా, తాను = ఆరాముఁడు, ఉల్లసములన్=పరిహాసములచేత, ఏఁపన్ = తపింపఁజేయఁగా, అది = ఆశూర్పణఖ, రక్కసియయాటన్ = రాక్షసియేయాట చేతను, ఎగ్గ = తప్పిదమా, (పొటయెగ్గెయను పాఠమున రాక్షసియాటయె తప్పిద మాయనియర్థము), వలచి = మోహపడి, స్త్రీలు = విన్నకన్న స్త్రీలు, తలవంపన్= శిరములువంచుకొనునట్లు, తానవచ్చెన్ = శూర్పణఖతానేవచ్చెను, అదిచాలక=అట్లు వచ్చుటయేచాలక, ("వనితనంతఁదావలచివచ్చినఁ జుల్కనగాదెయొరికి," నని మనుచరిత్రమునన్నది); ఆఁడుదానిన్ = స్త్రీని, బజీతుసేయంగన్ = రచ్చసేయఁగా, అగునే = వచ్చునా.

తా. శ్రీరాముఁడు శూర్పణఖ మోహించి వచ్చినప్పుడు వలదు పొమ్మని తాను జెప్పెనేని యది పోదా యట్లు సేయక పరిహాసములచేత నపేయాసలు గల్పించి మిగుల వగలం బొగలించె నని మోహము గలిగినది గావున నట్లువచ్చుట దానికిఁ దప్పుగాదు లోకమం దీవార్త స్త్రీలు విని తలలువంచునట్లు దనంతన తాను వచ్చుట చాలక మఱల దాని నిట్టు రచ్చలఁ బెట్టవచ్చునా యని భావము.

మ. తను నంటన్ సతులౌటఁ గోరు మునిబృం • దంబుం దదాపాది ప
ద్వనజక్షోదము గల్గియు న్మఱుజనిం • దా వల్లవస్త్రీలఁగా,
జననం బందఁగఁ జేసి కూడియును సక్త • స్వాంతలం గాందినీ
తనయ ప్రేరణఁ బాసె భోజపుర యా • త్రా దంభ సంరంభియై. ౫౨.

టీక. తనున్ = తన్ను, అంటన్ = కవియుటకు, సతులౌటన్ = స్త్రీలగుటను, కోరు = అభిలషించెడు, మునిబృందంబున్ = మునులసమూహమును, తదాపాది, తత్ = ఆ స్త్రీత్వమును, ఆపాది = కలుగఁజేయునట్టి, పద్వనజ = పాదపద్మముయొక్క, క్షోదము = పరాగము, (పదంఘ్రిశ్చరణొస్త్రియామనియు, చూర్ణేక్షోదస్స ముత్పింజ యనియు, నమరము), కల్గియున్ = తానుగలిగియుండియును, మఱుజనిన్ = మఱియొకజన్మమందు, తాన్ = తాను, వల్లవస్త్రీలఁగాన్ = గోపాంగనలఁగా, (గోధుగాభీరవల్లవాయని యమరము), జననంబందఁగఁజేసి = పుట్టునట్లుచేసి, కూడియును = సంభోగించియు, సక్తస్వాంతలన్, సక్త = తనయందుఁదగిలిన, స్వాంతలన్ = చిత్తములుగలయా స్త్రీలను, కాందినీతనయప్రేరణన్ = అక్రూరునిప్రేరణచేత, (అక్రూరుని తల్లిపేరుకాందిని), భోజపురయాత్రాదంభసంరంభియై, భోజపుర = మధురాపురమునకు, యాత్రా = ప్రయాణమనెడు, దంభ = నెపముచేతను, (కపటోస్త్రీవ్యాజదంభోపధయశ్ఛద్మకైతవేయని యమరము), సంరంభియై = ప్రయత్నముగలవాఁడై, పాసెన్ = విడిచెను.

తా. శ్రీరామావతారమందు రామస్సర్వాంగ సుందరయనినట్లును "రూపౌదార్యగుణైఃపుంసాందృష్టిచిత్తాపహారిణమ్" అనునట్లును గలిగిన తన సౌందర్యమును జూచి మునిజనులుఁ దన్నుఁ గవియుటకై స్త్రీత్వము నపేక్షింపఁగా నప్పుడే వారలను స్త్రీలనుగాఁ జేయుటకు ఱాతిని నాతినిగాఁ జేసినట్టి పాదపద్మపరాగము గలిగి యుండియు నప్పు డట్లు చేయక తా నొక యవతార మెత్తి యా కృష్ణావతారమందు వారిని గోపికలఁగా బుట్టఁ జేసి యప్పుడు వారితోఁ గలసియు సంతతమట్లుండక తన్ను మరిగియున్న స్త్రీలను విడిచి యక్రూర ప్రేరణవలన మధురాపట్టణమునకుఁ బోఁడా? అట్లు పోవుట వలన నా స్త్రీలకు వెత గలిగె నని భావము.

చ. హతల నొనర్చె మోహితల • నల్ల యయోముఖి నా పులస్త్యభూ
సుతను విరూప లౌట నను • చో ముసలి న్వన నిట్టు తాడు వం
టితివ రమించెఁ వా ముసలి • యయ్యురహి న్మఱుగుజ్జ ప్రేష్యయై
ధృతిసెడి యుగ్రసేనునకు • బ్రేష్యత నొందియు దిద్దియేల డే? ౫౩.

టీక. మోహితలన్ = వలచిన, అల్లయయోముఖిన్ = అప్రసిద్ధినొందిన యయో

ముఖియును రాక్షసస్త్రీని, ఆపులస్త్యభూసుతను = పులస్త్య నందనుఁడగు విశ్రవసు నికూఁతురగు శూర్పణఖను, విరూపలౌటన్ = రూపహీనలగుటచేత, హతలనాన ర్చెన్ = భంగపఱిచెను, అనుచోన్ = అనెడుపట్ల, (వారు సౌందర్యము లేనివారు గనుక భంగపఱిచె నందమాయనిననుట), ముసలిన్ = వృద్ధైనదానిని, పెద్ద = పెద్దదియగు, నిట్టితాడువంటి = నిడుతాటిమ్రానివంటి, అతివన్ = రేవతీదేవిని, (ఇచ్చట ఉఁదదాదిగణ పఠితసంధివికల్పము), తాన్ = తానును, ముసలియయ్యున్ = ముసలివాఁడయ్యును, రమించెన్ = భోగించెను, (యుగాంతరమునుండి వృద్ధయినదియుఁ బెద్ద పొడవుగలదియు నైన రేవతీ దేవిని దాను ముసలమను నాయుధము గల బలరాముఁడయ్యును మోహించి రమింపఁడా ? స్వరూపముచేత నాను రూప్యము ను గలుగఁ జేసికొని రమింప లేదా ? అని భావము. తాలాంకో ముసలీహలీ యని యనియమరము), మఱి కుబ్జప్రేష్యకై = కుబ్జయగు పరిచారికకై, ధృతిసెడి = ధైర్యము లేక, ఉగ్రసేనునకున్ = ఉగ్రమైన సేనగలవానికి, (ఉగ్రసేనుఁడను పేరుగల కంస జనకునికనుట), ప్రేష్యతన్ = పరిచారకత్వమును, ఒందియున్ = తానుబొందియు ను, (దానికనుకూలుఁడైయనుట), దిద్ది = దానికుబ్జతను దీర్చి, ఏలఁడే = పరిపాలింపఁడా.

తా. ఓ చెలులారా అయోముఖియు శూర్పణఖయు మోహించి రేనియు వారు లావణ్యవతులు గారు. కావున వారిని చా నేలుకొన లేదని మీరంటిరేని బల రాముఁడు దాను ముసలియయ్యును నిడుపాటితాటిచెట్టువంటి ముసలిది యగు రే వతిని రమింప లేదా ? కృష్ణుఁ డుగ్రసేనునికిఁ బరిచారకుఁడయ్యును మఱి కుబ్జ త్రివక్రను జక్కఁగా దిద్ది యతఁడు రమింపఁడా యనుటచేత నతనికిఁ బక్షపాతమే కాక లావణ్య తారుణ్యాది గుణములతో నక్కఱ లేదని భావము.

తే. తనకు నందఱుఁ గూర్ప బృం • దావనమున,
నొకతె రతిఁ దేల్చి కాక నొం • డొకతెఁ బ్రేల్చి,
యంత రాధకు మేలుఁ వాఁ • డై మురారి,
యెల్ల సతులకు నెదనుడు • కే యుడుండె ? ౫౯.

టీక. తనకున్ = ఆ కృష్ణునకు, అందఱున్ = వల్లవపల్లవాధరులెల్లను, కూర్పన్ = మోహపడియుండఁగా, బృందావనమునన్ = బృందావనమందు, ఒకతెన్ = ఒక్కగోపికను, రతిఁదేల్చి = సురతసుఖమనుభవింపఁజేసి, ఒండొకతెన్ = మఱియొకగొల్లతను, కాకన్ = విరహతాపముచేత, ప్రేల్చి = తపింపఁజేసి, అంతన్ = అనంతరమందు, రాధకు = రాధయనుప్రసిద్ధగోపికకు, మేలువాఁడై = అనుకూలుఁడై, మురారి = ఆశ్రీకృష్ణుఁడు, (ఇదికర్తృపదము), ఎల్లసతులకున్ = సర్వదర్వీకరవేణు

లకును, (రతిఁదేలినట్టియు రతిఁదేలనట్టి వారి కందఱి కనుట), ఎదన్ =హృదయమందు, (జాత్యేకవచనము), ఉడుకే = తాపమునే, ఇడుండే = ఉనుపండా.

తా. సుగమము.

వ. అని యిట్లు త్రపాభరంబునను పాలంభ దంభంబుగాఁ జేయు పునఃపునస్స్మరణంబున నంతఃకరణరాగంబు దేట పడం దెలిసి బోటు లీబోటి కైటభారియెడ నాటుకొన్న కన్నెకూర్మి లజ్జా వశంవదయై వెలి విరియంగానీక పుటపాక నికాశం బగుకాఁకఁ జీకాకుపడి నాఁడు నాఁటికి నగు చున్నట్లు కిటకిట నగుచున్న దింత నియ్యింతి యెరవుమాన్పి యింగితం బెఱుక పఱచుకొని చింతాపనోదంబు సేయకున్నం బ్రమాదం బని నవ్వుచు నర్మగర్భంబుగానిట్లనిరి.

టీక. అనియిట్లు= ఈపూర్వోక్తప్రకారంబుగా, త్రపాభరంబునన్ = సిగ్గుప్రేఁగుచేఁత, ఉపాలంభదంభంబుగాన్ = నిందావ్యాజముగా, చేయు = చేయుచున్న, పునఃపునస్స్మరణంబునన్ = సారెసారెకగుస్మరణము జేత, అంతఃకరణ = మనస్సునందలి, రాగంబు= కృష్ణునివిషయమున ననురాగము, తేటపడన్ = బయల్పడఁగా, తెలిసి = ఎఱిఁగి, బోటులు = చెలులు, ఈబోటి = ఈయువతి, కైటభారియెడన్ = కృష్ణునియందు, నాటుకొన్న = సోఁకుకొనినట్టి, కన్నెకూర్మిన్ = వివాహమునకుముందుగలిగినయనురాగమును, లజ్జావశంవదయై = లజ్జాపరవశురాలై, వెలివిరియంగానీక = బయల్పడనీయక, పుటపాకనికాశంబగు = పుటము వేసినపాకముతో సరియగు, కాఁకన్ = అంతస్తాపముచేత, జీకాకుపడి = చిక్కువడి, నాఁడునాఁటికిన్ = నానాఁటికి, నగుచున్నట్లు = నవ్వుచున్నట్లే, కిటకిటనగుచున్నది = సంకటుపడుచున్నది, ఇంతన్ = ఇంతటు, ఇయ్యింతి = ఈయువతియొక్క, ఎరవుమాన్పి = ఆయాసమునడంచి, ఇంగితంబు = అభిప్రాయమును, "ఇంగితంహృద్గతోభావ" అని యమరశేషము, ఎఱుకపఱచుకొని = ఎఱిఁగింపఁజేసికొని, చింతాపనోదంబు, చింతా = విచారముయొక్క, అపనోదంబు = పరిహారమును, చేయకున్నన్ = చేయకయుంటిమేని, ప్రమాదంబని = మోసమగునని తలంచి, నవ్వుచున్ = హసించుచు, నర్మగర్భంబుగాన్ = విలాసగర్భమగునట్లు, ఇట్లనిరి= ఈవక్ష్యమాణక్రమముగాననిరి.

తా. సుగమము.

ఉ. ఎవ్వరు నట్లుపో నెరసు • లెన్నకమానరు ప్రాణభర్తలం,
దవ్వుల నున్న కాఁకకత • న స్మఱి వారలు వశ్యులై నఁ దా,
రెవ్వరి నొల్ల కొక్కటయి • యింద్రుఁడు చంద్రుఁ డటంచ్రుు బోఁటిదా,
నివ్వలఁదేరకత్తె యగు • నిట్టివి నీతలవే గనే చెలీ. ౫౯

టీక. ప్రాణభర్తలన్ = ప్రాణేశ్వరులను, దవ్వులనున్న = దూరముననున్నట్టి, కాఁకకతనన్ = తాపహేతువుచేత, నెరసులు = తప్పులను, ఎన్నకపూనరు = లెక్కింపకపోవరు, ఎవ్వరున్ = ఎల్లవారును, అట్లుపో = ఆప్రకారమే, మఱి = పిమ్మట, వారలు = ఆప్రాణభర్తలు, వశ్యులైనన్ = స్వాధీనపడిరేని, తారు = స్త్రీలు, ఎవ్వరినొల్లక = ఎవ్వరినైననిచ్ఛగింపక, ఒక్కటియి = సతీపతులేకమై, ఇంద్రుఁడు చంద్రుఁడటంద్రు = ఆభర్తనింద్రుఁడుచంద్రుఁడనియందురు, ఇవ్వలన్ = ఈవలను, బోటి = చెలికత్తె, తాన్ = తాను, తేరకత్తెయగున్ = అన్యురాలవును, ఇట్టివి=ఇట్టి వార్తలు, నీతలవేసనే = నీతలమీఁదనే యుదయించెనా, సర్వత్రకలవనుట = చెలీ యనిసంబోధనము.

తా. దూరమందుఁ బ్రియు లున్నప్పుడు లోకమందలి స్త్రీ లందఱును భర్తల తప్పు లెన్నక పోరు వారు సమీపించి వశపడినప్పుడు వారి నింద్రుఁడు చంద్రుఁడని భూషించుచు నేకమై యుందురు పూర్వము ప్రియుని బిలుచుట మొదలగు పనులయందు నక్కఱ గలిగి యున్న చెలికత్తె యిప్పుడు తేర కత్తెయగు నిట్టి పనులు నీకే కలిగినవా యంతటఁ గలిగి యున్న వని భావము.

కం. అనుటయు నెలనగ వడఁచుచుఁ, గనలించుక తెచ్చి యోడు గఱచుచు నయ్యం,
గనలన్ కందుకనికరముఁ, గొని వ్రేయుచుఁ గేలనుచూచుకొనుచుం బలికెన్ ౯౭

టీక. అనుటయున్ = ఇట్లనిన, ఎలనగవు = లేతనవ్వు, అడఁచుచున్ = బయలుమెఱయనీకమాటుపరచుచు, కనలు = కోపము, ఇంచుక = కొంచెము, తెచ్చి = బయలుపఱిచి, ఓడు గఱచుచు = ఓష్ఠముదంతపఙ్క్తిచే గఱచుకొనుచు, అయ్యంగనలన్ = ఆస్త్రీలను, కందుకనికరమున్ = చెండులపిండును, కొని = గ్రహించి, వ్రేయుచున్ = కొట్టుచును, కేలను = పార్శ్వమును, చూచుకొనుచున్ = ఈక్షించి కొనుచు, పలికెన్ = (ఆయింతి) పలికెను.

తా. సుగమము.

క. విడువక మీ గానము సొగ, సిడుటయు మఱి పాడుఁ డనుట యొగ్గె? పాసెం,
బడిగిన వారే పేదలె? కొడిములు గట్టుకుఁడి యతనిఁ గొని పని యేలా? ౯౮

టీక. విడువక = ఎడతెగక, మీగానము = మీయొక్క పాట, సొగసిడుట యున్ = ఇంపొసంగినను, మఱి = ఇంకను, పాడుఁడనుట = గానము సేయుఁడని చెప్పట, ఎగ్గే = తప్పా, పాసెంబు = పాయసము, అడిగినవారే = వేఁడినవారే, పేదలే = దరిద్రులా, (పాయసము మధురమైయుండిన దానినడిగినవారు దరిద్రులా ఆమాధుర్యముగ్రోలనిచ్ఛగించినవారేయనుట), కొడిములు = లేనిందలు, (ఎవ్వరికొడిమ

గట్టి పెండ్లి కొడుకుం గడియారము మోవఁ జేసిరి అని పిల్లలమఱ్ఱి పినవీరభద్రన్న జైమిని భారతమందుఁ బ్రయోగించియున్నాఁడు), కట్టుకుఁడి = కట్టుకొనుఁడు, అతనిఁగొని = ఆకృష్ణుని గ్రహించి, పనియేలా = యేమియక్కఱ గలదు.

తా. సుగమము.

శా. పోనిం డన్న వయస్య లిట్లని రగుం ♦ బో నిక్క మిం కిప్పుడే,
కాని మ్మింకొక కొంత సేపునకు నే ♦ కానీ సఖీ యెల్లి యే,
కానీ నినుడిఁ దన్మనోజ్ఞ గుణము ♦ ల్గానీ తదన్యాయము,
ల్గానీ డిందినఁ జింత నీ కతనిపైఁ ♦ గా కెవ్వరిం దేల్చె దే? ౫౯.

టీక. పోనిండన్నన్ = ఆయమ పోనిండని చెప్పఁగా, వయస్యలు = చెలులు, ఇట్లనిరి = ఈవక్ష్యమాణక్రమముగా ననిరి, అగుంబో = అవునుబో, నిక్కము = నిశ్చయమే, ఇంకిప్పుడే కానిమ్ము = ఇంక మీఁద నిప్పుడే కాని, ఇంకొక కొంత సేపునకు నే కానీ = ఇంకొక కొంత కాలమున కే కాని, (ఇచ్చట నవధారణార్థకమగు నేకారము షష్ఠీవిభక్త్యంతిమ ప్రుతము మీఁద వచ్చినది), సఖీ = ఓచెలీ, ఎల్లియే కానీ = రేపే కాని, నినుడిన్ = నీవాక్యమందు, తన్మనోజ్ఞగుణముల్ గాని = ఆస్వామియొక్క మనోహరములగు గుణములుగాని, తదన్యాయముల్గానీ, తత్ = ఆస్వామియొక్క, అన్యాయముల్గానీ = నేరములయినఁగాని, డిందినన్ = జాఱిన, (నీనోరవచ్చె నేనియనుట), చింత = విచారము, నీకు, అతనిపైఁగాక = ఆస్వామి మీఁద నే కాని, ఎవ్వరిం దేల్చెదే = మఱిగెవ్వరిని ప్రస్తావింతువు.

తా. ఎక్కడి ప్రసంగము లవి పోనిం డని యాయమ చెప్పఁగాఁ జెలు లగును నీమాట నిక్కమే కాని యింకఁ మీఁద నిప్పుడే కాని మఱికొంత సేపునకే కాని రేపే కాని నీనోట నా శ్రీకృష్ణుని మంచిగుణములే కాని చెడుగుణములే కాని వచ్చెనా యప్పుడు నీ మది యతనియందుఁ దగిలియుండును గాక మఱి యెవ్వరిని దలంతు వని భావము.

సీ. నఖముఖోజ్ఝితప ♦ రాఙ్ముఖముక్తబాష్పాంబు పటిమ దీపపుఁ జిటి ♦ చిటలు దెలుపఁ,
బాహిరహాస్యోత్సృష్ట ♦ పూత్కృతులకృశమధ్యపార్శ్వము హుళిప్రకంపములు దెలుప,
నాదవెడు గాద్గద్య ♦ మదరు పాటునఁ బల్కఁ దింపఁ బుట్టెడు కేక ♦ రింత దెలుప,
వలవంత విసువు కాం ♦ తల వుట్టు దూషించు కారణంబుల తొంటి ♦ కథలు దెలుప,
వలఁతఁ బానుపుపైఁ బొర ♦ లాటు దెలుపఁ, దెగువ లోలోన నేనవ్వు ♦ నగవు దెలుపఁ,
గలఁక మామీఁది పనిలేని ♦ కసరు దెలుపఁ, బొలఁత రేలు నియున్కి యే ♦ పులుగు గాదె.

టీక. మఱియు సఖీవాక్యము, నఖముఖ = కొనగోళ్లచేత, ఉజ్ఝిత = విదలింపఁబడినట్టియు, పరాఙ్ముఖ = ఆవలిమొగమై, ముక్త = విడువఁబడిన, బాష్పాంబు = కన్నీళ

యొక్క, పటిమ = పటుత్వమును, దీపపుఁజిటచిటలు = దీపమువలనఁబుట్టిన చిటచిటధ్వనులు, తెలుపఁగ = ఎఱిఁగింపఁగా, (అయయ యూవలి మొగమై కన్నీరు విడుచుచు నాబాష్పాంబువులు గోనగోళ్ల విదిలింపఁగా నవి దీపముమీఁద బడి చిటచిటయనుచుండఁగా జలసంబంధము లేక దీపమందుఁ జిటచిటధ్వని పుట్టదు గనుక నిది యజ్ఞాపకమయ్యెననుట), పోరి = మిక్కిలియు, రహస్య = రహస్యముగాను, ఉత్సృష్ట = విడువఁబడిన, ఫూత్కృతుల్ = ఫూత్కారములను, కృశ = కృశించిన, మధ్య = నడుముయొక్క, పార్శ్వ = ప్రక్కలయందలి, ముహుఃప్రకంపములు = సారెసారెకుఁగదలుటలు, తెలుపఁగ = తెలియఁజేయఁగా, (ఎవ్వరికినిఁదెలియకుండ రహస్యముగా నాయాసముచేత బుసలువిడువఁగా బ్రక్కలుగదలుననుట), ఒదవెడు = జనించెడు, గాఢద్యమా = డగ్గుత్తుకవడుటను, అదరుపాటునఁ = హఠాత్కారముగా, పల్కరింపఁగ = మేముపల్కరింపఁగా, పుట్టెడు = ఉదయించెడు, కేకరిం(త) = కుత్తుకఁజదుకోనుట, తెలుపఁగ = తెలుపఁగా, (చెలికత్తెలు హఠాత్తుగాఁ బిలిచినఁబలుకఁబోఁగా నాయకుఁగలిగెడు డగ్గుత్తుక యాచెలులకుఁ దెలియకుండఁ గేకరించెడు నెపముచేత మఱుఁగు పఱుచుననుట), వలవంత = విరహతాపమువలననైన, విసువు = వేసటను, కాంతలపుట్టు = స్త్రీలజన్మమును, దూషించు = దూషించెడు, కారణంబుల = హేతువులుగల, తొంటి కథలు = పూర్వకథలు, తెలుపఁగ = తెలియఁజేయఁగా, (స్త్రీలై పుట్టఁగూడదని యనేకపూర్వకథా దృష్టాంతములు చెప్పననుట), అలఁతఁ = ఆయాసమును, పానుపుపైఁ = శయ్యమీఁదను, పొరలాట = పొరలాడుట, తెలుపఁగ = తెలుపఁగా, (విరహాతిశయముచేతఁబడక కుదురక పొరలుననుట), తెగువ = ప్రాణత్యాగమువఱకుసాహసమును, లోలోననేనవ్వు = లోలోపలనేయపహసించెడు, నగవు = హాసము, (నడచు నడకలు పలుకు పలుకులు అను వ్యవహారము ననుసరించి నవ్వు నగవన్న ప్రయోగము), తెలుపఁగ = తెలియఁజేయఁగా, (మరణోత్సుకతకుం భయమునినరీతిగాఁదెంపుఁజేసి లోలోపలనే ప్రచ్ఛన్నముగానవ్వుననుట), కలఁక = కలంగుటయు, మామీఁది = మాపైనిగలిగిన, పనిలేని = కారణముమాలిన, కసరు = గద్దించుట, తెలుపఁగ = తెలియఁజేయఁగా, (మనస్సు తాపాతిశయముచేతఁగలుషించి యుండుటవలనఁ జెలులను గారణములేక కసరివైచు ననుట), పోఁటి = ఓయింతీ, రేలు = రాత్రులయందు, నీయుస్కియే = నీవతఁ నమే, పులుగుగాదే = జ్ఞాపకముగాదా.

తా. సుగమము.

చ. ఎఱుఁగరుగా యొకద్భుతము ♦ నీచెలి దీర్ఘికఁ దీర్థ మాడ నా
యెఱుతఁ దఱిల్చి పోవుఁ దన ♦ హారము వోయిన నేను బోవుదు,

న్మఱవక వెంటఁ బోవ • జల మగ్నత నా నది సున్నమైనఁ దాఁ,
గఱకటఁ బెట్టి సొమ్మడుగుఁ • గాని నిజార్తి యెఱుంగ దేమియున్ ౬౧.

టీక. ఒకసఖి తక్కినసఖులతో ననుమాట, ఒకద్భుతమున్ = ఒకయాశ్చర్యమును, ఎఱుఁగరుగా = తెలియరుగా, ఈచెలి = ఈసఖిఅనఁగాగోదాదేవియనుట, దీర్ఘికన్ = డిగ్గియయందు, తీర్థమాడన్ = స్నానముసేయుటకు, తనహారము= తనముత్తియపుఁజేరు, నాయెఱుతన్ = నాకంఠమందు, తగిల్చి = ఉనిచి, పోవున్ = చనును, పోయినన్ = తానటుపోయిన, నేనుబోవుదున్ = నేనునుబోదును, మఱవక= విస్మృతిలేక, వెంటఁబోవన్ = వెంబడిఁబోఁగా, జలమగ్నతన్= నీటియందుమునుఁగుటచేత, అది = ఆహారము, సున్నము = చూర్ణము, ఔన్ =అవును, ఐనన్ = అట్లుసున్నముగాఁగా, తాన్ = తానను, అనగానీయమ, కఱకటఁబెట్టి = నిక్కచ్చిఁజేసి, సొమ్ము = తనహారమును, అడుగుఁగాని = వేఁడునుగాక, ఏమియున్ = కొంచెమైనను, నిజార్తి = తనప్రయాసమును, ఎఱుంగదు = తెలియనేరదు, ముగ్ధయగుటనని భావము.

తా. ఈ యమ విరహ తాపముచేతఁ గ్రాఁగుడు వలన శరీరమందలి ముక్తాహారములు పెటిలి యుండిన వనియు నవియే చెలికత్తియ యాయమతోడ నీట మునిఁగి నప్పుడు విరిసి సున్నమాయె ననియు నంత తాపమీయమ యనుభవించు చున్నదనియును భావము.

చ. అనిన మరాళి పల్కు విన • వా హరిణీ యొకనాఁడు కస్తురిం,
గొని యిడు బొట్టు నా కనుచుఁ • గూర్మి నొసంగినఁ బెట్టుచుండఁ జు,
య్యనుచు మొగంబు వ్రేసినటు • లా తనయూర్పుల నింకి యింకి పో,
యిన పలు జేంట్లు గోరఁ గొని • యెత్తను పట్టెను మాటిమాటికిన్ ౬౨.

టీక. అనినన్ = ఇట్లనఁగా, మరాళి = మరాళియనియెడిచెలి, పల్కున్ = పలుకును, హరిణీ, వినవా = వినుమనుట, ఒకనాఁడు = ఒకదినమందు, కస్తురింగొని= కస్తూరినిదీసికొని, ఇడుబొట్టునాకనచున్ = నాకుఁ దిలకముఁబెట్టుమని, కూర్మిన్ = ప్రేమచేతను, ఒసంగినన్ = నేనుగస్తూరినిచ్చినను, పెట్టుచుండన్ = తానుబొట్టుపెట్టుచుండఁగా, చుయ్యనుచున్ = చుయ్యుమని, మొగంబువ్రేసినటులా = మొగమడఁచినట్లగునట్టి, తనయూర్పులన్ = తనయుచ్ఛ్వాసవాయువులచేత, ఇంకియింకిపోయిన = మిక్కిలితడియారిన, పలుజేంట్లు = కస్తూరియొక్క పెక్కుబేఁటికలు, మాటిమాటికిన్ = సారెసారెకు, గోరఁగొని = గోటిచేగ్రహించి, ఎత్తన = ఎత్తివేయుటకే, పట్టెను = ప్రొద్దుసరిపోయెను.

తా. మరాళిహరిణితోఁ జెప్పెడు పల్కు:—వినవే చెలీ యీ యమ నొక నాఁడు నాకుఁ గస్తూరీ తిలకముఁ బెట్టుమనఁగా నా మొగ మఱఁచినట్లు దన వేఁడి నిట్టూర్పు లెగయఁగా వాని వేఁడిమి చేత నా నుదుటి తిలకము పెట్టినప్పుడే యినికి యినికి పోఁగా నాపీఁటికలు దన గోటితోఁ దా మాటిమాటి కెత్తనే కాలము సరిపోయె నుగాని బొట్టుపెట్టుటకుఁ గాలము చాలక పోయె నని యీయమ తాపాతిశయముఁ జెప్పె నని భావము.

మ. అనిన న్స్రగ్విణి వల్కెఁ దన్నుఁ జెలులా ♦ రా నే లతాడోలఁ జి,
క్కన నూఁపం దెగి వ్రాల దీని చనుద్రే ♦ కం బే క్రియం దాల్తునో,
యని పట్టం దిన మధ్య మార్క రుచి ఖి ♦ ద్యన్మంజరుల్వోని వా,
డిన పాలిండ్లను జెండు బొమ్మగతి నుం ♦ డె న్సందిటం జుల్కనై. ౬౩.

టీక. అనినన్ = అనఁగా, స్రగ్విణి = స్రగ్విణియనుచెలి, పల్కెన్ = వక్ష్యమాణరీతిచేతఁబలికెను, చెలులారా = సఖులారా, తన్నున్ = ఈయమను, నేన్ = నేను, లతాడోలన్ = తీఁగెయుయ్యెలయందు, చిక్కనన్ = దృఢముగాను, ఊఁపఁగాన్ = ఊఁగింపఁగా, తెగి = అలత ఈయమ శరీరతాపముచేతఁదెగి, వ్రాలన్ = ఈమె దిగువఁబడఁగా, దీని = ఈయమయొక్క, చనుద్రేఁకంబు = స్తనభారము, ఏక్రియన్ = ఏరీతిగా, తాల్తునో = ధరింతునో, అని = అనుకొనిసంశయించుచు, పట్టన్ = ఈయమనుబట్టుకొనఁగా, దినమధ్యమ = పట్టపగటి, అర్క = సూర్యునియొక్క, రుచి = ఎండచేత, ఖిద్యత్ = వాడుచున్న, మంజరుల్వోని = పూలగుత్తులవలెనున్న, వాడిన = మ్లానములగు, పాలిండ్లను = పయోధరములచేత, చెండుబొమ్మగతిన్ = చెండుతోఁ జేసినబొమ్మవలె, సందిటన్ = నాకౌఁగిటియందు, చుల్కనై = లఘువై, ఉండెన్ = నిలిచెను.

తా. ఆ వియోగతాపముచేతఁ గృశించి శరీరము తేలిక యయ్యెనని భావము.

వ. అని తన యవస్థఁ దోఁప నాఁడిన ననాదరయుం బోలె వారల కిట్లనియె. ౬౪.

టీక. తనయవస్థన్ = తనవిరహదశను, తోఁపనాఁడినన్ = బయల్పడఁబలుకఁగా, అనాదరయుంబోలెన్ = ఆదరములేనిదానివలె, కడమ సులభము.

తా. సుగమము.

కం. ఆర్పఁగఁ దీర్పఁగ మిక్కిలి, నేర్పు గల వయస్య లట్లు ♦ నెలఁతలు మీ మీ,
నేర్పునఁ బలికెద రక్కట, యేర్పడ మీ కీ విచార ♦ మేటికిఁ జెపుఁడీ. ౬౫.

టీక. ఆర్పఁగన్ = పోఁబుచ్చుటకును, తీర్పఁగన్ = దిద్దుటకును, మిక్కిలి = అధికముగా, నేర్పుగలవయస్యలట్లు = పోఁడిమి గల చెలుల వలెనే, నెలఁతలు = స్త్రీ

లారా, మీమీనేర్పులన్ = మీమీసామర్థ్యములచేత, పలికెదరు = చెప్పెదరు, అక్క ఱ = ఆవశ్యకము, ఏర్పడన్ = కుదురునట్లు, మీకేవిచారమేటికి = మీకేచింతయేల, చెప్పుఁడీ = చెప్పుఁడు.

తా. ఆర్పఁ దీర్ప నేర్పుగల చెలులవలె నక్కఱ గలిగినట్లు మీమీచాతుర్యము ల కొలఁదిఁ బలికెదరుగాక మీ కీయాలోచన మేల? చెప్పుఁ డని భావము.

వ. అని మేలంబు సేసికొని తేలి పోఁబలికి పుటపాక ప్రకారంబగు వియోగ దవ ఘుమఘుమారంబు బహిఃస్ఫురణము సైరింపఁజాలక నుండలేక నిశాసమయంబుల నొక్కొక్కనాఁటి తనలోన. ౬౬.

టీక. అని = ఇట్లని, మేలంబుసేసికొని = పరిహాసముచేసికొని, తేలిపోఁబలికి = అలక్ష్యముగామాటలాడి, పుటపాకప్రకారంబగు = పుటమువేసినలోపలఁగుములుచున్నట్లగు, వియోగదవఘుమఘుమారంబు = విరహతాపాతిశయమును, అన్యాభూరత్నంబు = ఆబోటిమేటికిని, అణంచికొనియుండియున్ = మఱుఁగుపఱుచుకొనియుండియు, ఉండలేక = నిలువఁజాలక, నిశాసమయంబులన్ = రాత్రులయందు, ఒక్కొకనాఁటు = ఒక్కొక్కమారి, తనలోన = తనంతటనే, ఈ వక్ష్యమాణప్రకార మనుకొనుచుండు నని మీఁది కన్వయము.

తా. సుగమము.

సీ. అభినవ కువలయశ్యామ కోమలమైన వామాంసమున మకర కుండలముఁ దాల్ప,
నిస్తులాస్యశ్రీ వయస్స్తంభ నిక్షిప్త నింబచ్ఛద భ్రుకువాల్పంబు నిక్క,
బహువంపు మంకెనవిరి వంపు నర వంపు వాతెఱ చేంద్రంపుఁబాన గురియ,
నందంపు మెఱుఁగువాలారు కన్గవ చూడ్కి శ్రవణ కుండల కాంతిఁ సవతుగాఁగ,
సప్తభువనాంగనానురంజనకు సప్త విధ పరీవాహముగ గానసుధ వెలార్చు,
మాడ్కి వేణువుపై వ్రేళ్లు మార్చి మార్చి, మరులు గొలిపి తే గోవిందమందసతుల.

టీక. అభినవ = అప్పుడువికసించిన, కువలయ = నల్లగలువవలెనే, శ్యామ = శ్యామనచాయకలిగినదై, కోమల = మృదువైన, వామాంస్ర = ఎడమభుజశిఖరము, మకరకుండలమున్ = వామకర్ణమకరకుండలమును, తాల్పన్ = వహింపఁగా, (వేణు గానము సేయునప్పుడు మెడ యొఱగఁ నిడఁగా నెడమ భుజముమీఁదికిఁ గుండలమువచ్చె ననుట), నిస్తుల = సరిలేని, ఆస్యశ్రీ = ముఖకాంతియొక్క, వయః = వయస్సును, స్తంభ = నిల్పుటకొఱకు, నిక్షిప్త = దృష్టిదోష నివారణకై యుంచఁబడిన, నింబచ్ఛద = వేపాకువంటి, భ్రుకు = కనుబొమ్మ, (ఈశబ్దము హ్రస్వాంతము నగును, "భ్రుకుటిర్భ్రుకుటి స్త్రియామ్" అని అమరము), అల్పంబు = ఇంచుకంత,

నిక్కఁగన్ = నిక్కుచుండఁగా, (సంస్కారవిశేషముచేత వేఁపాకువయస్తంభకరమని ప్రసిద్ధను కనుబొమ్మనెగరవేయుచు గానము సేయునెడల ముఖకాంతి వయస్సతిక్రమింపకుండ దృష్టిదోషము రానియట్లుంచిన వేఁపాకువలె నాకనుబొమ యుండెననుట), పరువంపు = తెస్సవికసించిన, మంకెనవిరి = బంధూకపుష్పమును, వంపు = నమ్రముగాఁ జేయుచున్న, అరవంపు = సగమువంచిన, వాతెఱ = అధరోష్ఠము, చెంద్రంపు = సింధూరసంబంధియగు, వానన్ = వర్షమును, కురియన్ = వర్షింపఁగా, (పెదవిసగము మడిచి పిల్లఁగ్రోవి యూఁదుచున్నాఁడనుట), అందంపు=అందమగు= మెఱుఁగు = నిద్దమగు, వాలారు = నిడుదయగు, కన్గవ = నేత్రద్వయము యొక్క, చూడ్కి = దృష్టి, శ్రవణకుండల = కర్ణకుండలములయొక్క, కాంతి=కాఁతికి, సవతుగాఁగన్ = సమానమగుచుండఁగా, (ఆ గాన మప్పుడట్టి చూడ్కి కర్ణాంతాయతములగు నేత్రముల కొనలను వ్యాపించి యుండె ననుట), సప్తభువన = భూర్భువస్సువరాది సప్తలోకములయందు, అంగనా = స్త్రీలయొక్క, అనురంజనకున్ = అనురక్తిగలిగించుటకు, సప్తవిధపరీవాహముగన్ = ఏడు తెఱఁగులగు ప్రవాహములగునట్లు, “జలోచ్ఛ్వాసాః పరీవాహాః” అనియమరము. గానసుధన్ = గానామృతమును, వెలార్చుమాడ్కిన్ = పైకుబుకఁజేసెడురీతిగా, వేణువుపైన్ = పిల్లఁగ్రోవిమీఁద, వ్రేళ్లు = అంగుళములను, మార్చిమార్చి = పరివృత్తిఁజేసి, గోవిందా = ఓయి శ్రీకృష్ణుఁడా, మందసతులన్ = గోపికాస్త్రీలను, మరులుకొలిపితె = మోహపడఁజేసితివే, శ్రీకృష్ణుని వేణుగానవినోదము ననుసంధించుచున్నదని భావము.

తా. సుగమము.

ఉ. అక్కట రాధ నీకుఁ దగ ♦ వా? మగవారల నత్తమామలన్,
దక్కి ముకుంద వేణుకల ♦ నాదపు టీలకు లేటిమొత్తమై,
త్రొక్కను కాఁకచే నడికి ♦ రేలరుదెంచిన గోపి కావళిన్,
స్రుక్కఁగఁ జేసి తద్రుచిర ♦ భోగము గుత్తగ నీవ కైకొనన్. ౬౫.

టీక. రాధ=ఓరాధికా, మగవారలన్ = భర్తలను, అత్తమామలన్, శ్వశ్రూశ్వశురులను, తక్కి = తిరస్కరించి, ముకుంద = శ్రీకృష్ణునియొక్క, వేణు = పిల్లఁగ్రోవియొక్క, కల=అవ్యక్తమధురమగు, నాదపుటీలకున్ = గానమనునీలకు, (ఈలయనఁగా జారచోరులొండొరులకుఁ దెలుపుకొను సంకేతనాదము), లేటిమొత్తమై = మృగీసమూహమువలెనై, త్రొక్కను=భరింపఁగూడని, కాఁకచేన్ = తాపముచేత, నడికిరేలు = అర్ధరాత్రులయందు, అరుదెంచిన = వచ్చినట్టి, గోపికావళిన్ = గోపికాసమూహమును, స్రుక్కఁగఁ జేసి = పరితపించునట్లొనర్చి, తద్రుచిరభోగమును తత్ =

ఆకృష్ణునియొక్క, రుచిర=ఇంపైన, భోగముఁ = అనుభవనమును, గుత్తగ= గుత్త జేసినట్లు, నీవ=నీవే, కైకొనఁ = గ్రహించుట, నీకుఁ = నీకు, తగవా = మర్యాదయే, అకట = అయ్యో, (ప్రథమపాదమందుఁ బ్రశ్నాకలితదీర్ఘయతి).

తా. తాను దాప ననుభవించుచు రాధ నుద్దేశించి శ్రీకృష్ణ సంభోగము సమస్త గోపికలకు లేకుండఁ జేసి గుత్తఁ జేసి నట్లు నీ వొక్కతెవే యనుభవింపవచ్చునా యని దూఱుచున్న దనుట.

ఉ. అక్కమలాక్షుఁ డొక్కతె ని♦జాంసమునం దిడి కుంజపుంజపుం,
జక్కికిఁ గొంచుఁ బోనఁ జెలి♦చాన లినాత్మజవెంట బ్రేఁగున,
మ్మిక్కిలి డిగ్గు పాదసర♦ణిం జని రోయుదు రట్టె రోసి తా,
రక్కడఁ గాంచు టేమి వల♦దా యభిమాన మొకింత యింతికిన్? ౬౯.

టీక. అక్కమలాక్షుఁడు = ఆకృష్ణుఁడు, ఒక్కతెన్ = ఒకస్త్రీని, నిజాంసమునందున్ = తనమూఁపునందు, ఇడి = ఉనిచికొని, కుంజపుంజక్కికిన్= పొదరిండ్లగుంపుతావునకు, కొంచుఁబోనన్ = తీసికొనిపోవఁగా, చెలిచానలు= ఇతర స్త్రీలు, ఇనాత్మజవెంటన్ = సూర్యతనయయగు యమునానదివెంబడి, బ్రేఁగునన్=భారముచేత, మిక్కిలి = అధికముగా, డిగ్గు = దిగఁబడియున్న, పాదసరణిన్= కాలిజాడను, చని = పోయి, రోయుదురు = వెదకుదురు, అట్టె = ఆప్రకారమే = రోసి= వెదకి, తారు = తాము, అక్కడన్= ఆపొదరిండ్లప్రదేశమందు, కాంచుటేమి = చూచుటయేమున్నది, ఇంతికిన్ = స్త్రీకి, అభిమానము = సిగ్గు, ఒకింత = కొంచెమైనను, వలదా = ఉండవలదా.

తా. శ్రీకృష్ణుఁడు గోపికల వంచించి యొక్క దానిఁ దనభుజము మీఁదఁగూర్చుండఁబెట్టుకొని పొదరిండ్ల చాటునకుఁ బోఁగా నాగోపికలందఱుఁ గృష్ణునిం గానక స్త్రీని మోచికొనిపోవుచున్న భారమువేత నాయన పాదములు యమునా నది సైకతాతలంబుల మిగుల దిగఁబడియుండిన నాజాడను బోయి వెదకెదరుగాక యట్లు వెదకి శ్రీకృష్ణునిఁ జూచుటవలన నా గోపికతోఁగూడి యున్నప్పుడు దమకేమి పనియనియును స్త్రీకిఁ గొంచెమైన నభిమాన ముండవలదా యని దూఱెనని భావము.

చ. ఇలుగలనైన వెల్వడని♦యీలువుఁబోండ్రకుఁ దాఁపికత్తెవై,
ఉలు కెడలించి శౌరి తను♦యోగపు వాచవిఁ జూపి మీఁదఁ జె,
ల్లలమ వియోగ వహ్ని భవ♦దంతర సైకత పఙ్క్తి పొంత వం,
తలఁ బొరలించి తౌవు శివ♦నస్వసయుగ్ర మయూఖ నందనీ? ౭౦.

టీక. ఉగ్రమయూఖనందనీ = తీక్ష్ణకిరణములుగల సూర్యునియొక్కకూఁతుర

త్రైనయో యమునానదీ, ఇలు = గృహమును, కలనైనన్ = స్వప్నమందైనను, వెల్వడని = వెడలిరాని, ఈలువుటాంద్రకన్ = మానవతులగుగోపికలకు, తాఁపికత్తైపై = కుంటెనకత్తెపై, ఉలుకెడలించి = (వారల) భయముదీర్చి, శౌరి = శ్రీకృష్ణునియొక్క, తను = శరీరముయొక్క, యోగవు = సంయోగమనియెడి, వాచవిఁజూపి = వాఁగ్రుచినిఁజూపి, (విటునియొద్దనుండి మధురవస్తువులుకొనివచ్చి స్త్రీలకిచ్చి రుచిఁబుట్టించి యనుకూలపఱచుట దూతికకు యుక్తమేగనుక వాచవియని ప్రయోగించినాఁడు), పిదపన్ = అనంతరమందు, పెల్లు = అధికముగా, అలము = వ్యాపించుచున్న, వియోగవహ్నిన్ = విరహాగ్ని చేత, భవదంతరసైకత, భవత్ = నీయొక్క, అంతర = మధ్యప్రదేశమందలి, సైకత = ఇసుకదిన్నెలయొక్క, పఙ్క్తి = సమూహమునయొక్క, పొంతన్ = సమీపమందు, వంతలన్ = తాపములచేత, పొరలించితి = వారినిఁబొరలునట్లు చేసితివి, శమనస్వసవౌదు = యమునితోఁబుట్టువగుదువు, (యమునా శమనస్వసాయనియమరము),

తా. ఓ యమునానదీ నీవు జగములఁ దపింపఁజేసెడు సూర్యునికిఁ గూతురవై యంతకుండగు యమునికిఁ దోఁబుట్టువైతివి గావున నీ కఠిన గుణమునకుఁ దగినట్లు స్వప్నమందైన నిల్లు వెడలని మానవతులగు గొల్ల సతుల కెడకత్తెపై యిల్లు వెడలించి భయము వాపి మొదల నతనితోఁ గూడు నట్లొనర్చి యా రుచిఁ జూపి పిమ్మట నా కృష్ణుని నెడఁబాపి నీ యిసుక దిన్నియల మీఁద వారలు విరహాగ్నిచేతఁ బొరలాడునట్లు చేసితివి గదే యెంత కఠినాత్మురాల వని దూతె నని భావము.

వ. అని యొంటిపాటునం దనలోనం బలుకు పలుకు లాలించి పొంచి యున్న వయస్యలాస్యంబు లపహాస్యచంద్రికాతుందిలంబులుగాఁ దోఁచి భామ యేమేమి నీ మనం బెఱింగితిమే కదా మును మున్న మానలేవతని మాటలంటివని మూదలింపనం గించి దవన తాననయై నెమ్మొగంబు వెలవెలపాటు లేనగవున నడంచి మఱి మొఱంగ ననువుపడక యందంబుగూర్చుకొనివారికిట్లనియె ౭౧.

టీక. అని = ఈరీతిగా, ఒంటిపాటునన్ = ఏకాంతమందు, తనలోనంబలుకుపలుకులు = తనలోఁదాననియెడుమాటలు, ఆలించి = విని, పొంచియున్న = డాఁగియున్న, వయస్యలు = సఖులు, ఆస్యంబులు = మొగములు, అపహాస్య = మేలంపునవ్వులనియెడు, చంద్రికా = వెన్నెలచేత, తుందిలంబులుగాన్ = శిక్కటిల్లినట్లుగా, తోఁచి = కనఁబడి, భామ = ఓయింతీ, ఏమేమి, ఎఱింగితిమేకదా = తెలిసితిమేకదా, మునుమున్న = ప్రప్రథమమందే, అతనిమాటలు = ఆస్వామివార్తలు, మానలేవంటివని = విడువఁజాలవంటివనుచు, మూదలించినన్ = ప్రస్తావింపఁగా, (తాఁకనాడఁగానను ట), కించిదవనతాననయై = కొంచెముదలవంచుకొన్నదై, నెమ్మొగంబు = ముఖము

యొక్క, వెలవెలపాటు = సిగ్గుచేఁ దెల్లఁబోవుటను, లేనగవునన్ = లేత నగవుచేత, అడఁగి = మట్టుపడి, మఱి = ఇంకను, మొఱఁగన్ = దాఁచఁగా, అనువుపడక = వలనుగాక, అంపచుగూడుకొని = పొందుపఱచుకొని, వారికిట్లనియె = ఆ చెలులకిట్లనియెను.

తా. సుగమము.

తే. నాఁడు మన మున్న నెట్లొ పూ • బోఁడులార,
యనిన వారలు మగుడ నా • యమకు ననిరి,
యింతి నాఁ డుండ కెందుఁ బో • యితివి నీ వ,
టన్న నచ్చెరువడి వారి • కతివ పలికె. ౭౨.

టీక. నాఁడు = ఆగోపికాకృష్ణులక్రీడాకాలమందు, పూఁబోఁడులార = ఓ చెలులారా, మనమున్నన్ = నేనుమీరునుండినను, ఎట్లొ = ఏవిధమగునో, అనినన్ = అనఁగా, వారలు = ఆచెలులు, మగుడన్ = మరల, ఆయమకున్ = ఆమెకు, అనిరి = చెప్పిరి, ఇంతి = ఓ చెలీ, నాఁడునీవుండక = ఆకాలమందునీవుండక, ఎందుఁబోయితివి = ఎక్కడఁబోయితివి, అటన్నన్ = ఆ ప్రకారమనఁగా, అచ్చెరువడి = ఆశ్చర్యపడి, అతివ = ఆయింతి, వారికిఁబలికెన్ = ఆచెలులకనియెను.

తా. సుగమము.

తే. సకియలార త్రైకాలిక • జ్ఞానవంతు,
లైన ఋషులట్ల పలికెద • రంత యెఱుక,
యెదఁ గలిగె నేని యెఱిఁగింపుఁ • డేను మొదల,
నెవ్వతెనటన్న మఱి వార • లిట్టు లనిరి. ౭౩.

టీక. సకియలార = సఖులారా, త్రైకాలిక = భూతభవిష్యద్వర్తమాన కాలత్రయసంబంధియగు, జ్ఞానవంతులైన = జ్ఞానముగల, ఋషులట్ల = మునీశ్వరులవలె, పలికెదరు = మీరువచించెదరు, అంతయెఱుక = తాదృశజ్ఞానము, ఎదన్ = హృదయమందు, కలిగెనేని = ఉండెనేని, ఏను = నేను, మొదలన్ = ప్రథమమందు, (పూర్వజన్మమందనుట), ఎవ్వతెను, ఎఱిఁగింపుఁడటన్నన్ = తెలుపుఁడనఁగా, మఱి = పిమ్మట, వారు = ఆచెలులు, ఇట్టులనిరి.

తా. సులభము.

మ. దివిజద్రుప్రసవంబుఁ గాంచిన సపత్నిం జూచి చూపోపకేం,
తవుజిగ్గింబని యంతసేసి మది నీర్ష్యాక్రోధము ల్పొందఁడిం,
ప విరిం బోక ద్రుమంబుఁ దైకొని పతి స్స్యందన్న మాత్రినెల్లఁ దే,
ననఘేం బెట్టిన సత్య నీ వహహ కావా? భామినీ నావుడున్. ౭౪.

టీక. దివిజద్రు = కల్పవృక్షముయొక్క, ప్రసవంబుకా = పుష్పమును, ని॥ (స్యాదుత్పాదేఫలేపుష్పేప్రసవోగర్భమోచనేయని) కాంచిన = పొందిన, సపత్నికా = సవతాలగురుక్మిణిని, చూచి = కాంచి, చూపక = ఓర్వలేక, ఇంతవుజిల్గులంబని = ఇంతైనచిన్నపనిని, అంతసేసి = అంతఁగాజేసి, మదిక = మనస్సునందు, ఈర్ష్యాక్రోధముల్, ఈర్ష్యా = ఈసును, క్రోధముల్ = కోపమును, సందడింపక = పెనఁగొనఁగా, విరిక = పుష్పముచేత, పోక = చనక, ద్రుమంబునక = వృక్షమును, కైకొని = గ్రహించి, పతిక = భర్తయగుశ్రీకృష్ణుని, మందపక్షకా = సౌపథమనఁగా, ద్రుమానెల్లకా = వృక్షమెల్లను, తేక = తెచ్చునట్లు, అవనింబెట్టిన=శ్రమపెట్టినట్టియు పీఱఁబెట్టినట్టి, సత్యవు = సత్యభామవు, ఈవు = నీవు, కావా, అహహా = ఆశ్చర్యము, (అహహేత్యద్భుతేఖేదెయనియమరము), భామినీ = ఓయింతీయనిసంబోధనము, (కోపనాసైవభామినీయనియున్నది గనుకఁ గోపముగలదానాయనుట), నావుడుకా = అనఁగా.

తా. ఓభామినీ నీసవతియగు రుక్మిణీదేవి శ్రీకృష్ణునిచేతఁ బారిజాత పుష్పము గ్రహింపఁగా నీవు చూచి యోర్వక యీసును జలంబును మెఱయ స్వల్పమగు న క్కార్యంబు నెంతోఁ గొప్పఁ జేసి యలిగి యా పుష్పమునఁబోక స్వర్గమునుండి పారిజాతవృక్షమే తెప్పించి మందనిన ద్రుమానెల్లఁ దెప్పించునట్లు తలంచి యాప్రకారము శ్రీకృష్ణుని శ్రమ పఱిచిన సత్యవు కావా యని రని భావము.

వ. గ్రక్కునం బ్రత్యుత్పన్నవిజ్ఞానయై గృహదీపికారోపణంబునం గృహ గత పదార్థంబు లొక్కమాఱె దృగ్గోచరంబు లగు నట్లు జన్మాంతరంబున నయ్యనంతునితోడి క్రీడాప్రపంచంబు సద్యస్సమనుభూతం బైన తెఱంగునం దోఁచిన.

టీక. గ్రక్కునకా = త్వరగాను, ప్రత్యుత్పన్నవిజ్ఞానయై, ప్రత్యుత్పన్న = ఉదయించిన, విజ్ఞానయై = విశేషజ్ఞానముకలదై, గృహదీపికారోపణంబునకా = నిలయమందుదీపముంచుటచేతను, గృహగతపదార్థంబులు = ఇంటిలోనున్నవస్తువులు, ఒక్కమాఱె = ఒకసారియే, దృగ్గోచరంబులగునట్లు = దృష్టివిషయములయినభంగిని, జన్మాంతరంబునకా = పూర్వజన్మమందు, అయ్యనంతునితోడి = ఆశ్రీకృష్ణస్వామితోడి, క్రీడాప్రపంచంబు = విహారవైపుల్యము, సద్యస్సమనుభూతంబయిన తెఱంగునకా = అప్పుడుతెల్లగాననుభవించినమాడ్కిని, తోఁచినకా = అగపడఁగా.

తా. సుగమము.

ఉ. వాలిక కన్నులం బోడమ • వారి సకజ్జల మాశ్రితశ్రవో,
గోళక మై తదంతికపుఁ • గుంతల వల్లికిఁ దల్లిఁదోడుగా,

మై లవలి న్నన ల్నిగుడు • మైఁ బులక ల్పొడమ న్శ్లథాంగియై,
సోలినఁ జూచి డెందములు • సుట్టిన హా యని బోఁటు లర్మిలిన్. ౭౬.

టీక. వాలిక = నిడుదలగు, కన్నులన్ = నేత్రములయందు, పొడము = ఉదయించెడు, వారి = బాష్పము, సకజ్జలము = కాటుకనీటితోఁగూడినదియై, ఆశ్రిత = ఆశ్రయింపఁబడిన, శ్రవః = చెవులనియెడు, గోళకమై = గోళములుగలదై, తదంతికపు = ఆకర్ణసమీపమునందున్న, కుంతలవల్లికన్ = తలవెండ్రుకలు అనుతీగకు, దోహదగాన్ = తల్లియుఁదోఁబుట్టువుగాఁగా, (కాటుకతో నల్లనై యున్నదిగావునఁ గురులకు సమానమైనదనుట), మైలవలిన్ = శరీరమనియెడి మేలకతీగయందు, (లవలి = వెన్నెలతీఁగయనికొందఱు), ననల్ = పుష్పములు, నిగుడుమై = ప్రబలెడిరీతిచేత, పులకల్ = రోమాంచములు, పొడమన్ = పుట్టఁగా, శ్లథాంగియై = బెండువడినదేహముగలదియై, సోలినన్ = మూర్ఛిల్లఁగా, చూచి = వీక్షించి, బోఁటులు = చెలికత్తియలు, డెందములు = అంతరంగములు, చుట్టఁగన్ = చుఱుక్కుమనఁగా, హాయని = అయ్యో యనియంగలార్చి, అర్మిలిన్ = (ఆయమయందలి ప్రేమచేత నని ముందటి పద్యమున కన్వయము.

తా. ఆయమ కన్నీరు నింపుచుండ నది చెవులునిండి తలవెండ్రుకలు దడుపఁగా నెమ్మేనుగగుర్పొడువఁగా సోలినఁ గాంచి డెందములుంగుందితోడి పూఁబోఁడులు ప్రేమంబున నిట్లని రని భావము.

ఉ. ఎంతకుఁ దెచ్చె నే సరసి • జేక్షణ ? వైదము లింతమీఁద జ,
న్మాంతర వర్తనంబు హృద • యంబున కిత్తఱి నెచ్చరించి గో,
రంతలు గొండలంత లగు • నట్లుగఁ జేసితి మంచుఁ జేటికా,
వాంత నతాళివృంత • మృదువాత హిమాంబు కణాళిఁ దెల్పినన్. ౭౭.

టీక. సరసిజేక్షణ = పద్మాక్షియగు నీయమయొక్క, వైదములు = వ్యాపారములు, ఎంతకుఁదెచ్చె నే = ఎంతవఱకుఁ దెచ్చెను, ఇంతమీఁదన్ = ఇకముందుమీఁద, జన్మాంతరవర్తనంబు = పూర్వజన్మ వ్యాపారమును, హృదయంబునకున్ = ఎదకు, ఇత్తఱిన్ = ఈసమయమందు, ఎచ్చరించి = ఎఱుకపఱచి, గోరంతలు = గోరంతస్వల్పములగుకార్యములు, కొండలంతలగునట్లుగన్ = పర్వతోపమానము లగునట్లుగా, చేసితిమంచున్ = కావించితిమని, చేటికా = పరిచారికల చే, వాంత = వీవఁబడిన, నతాళివృంత = వీవనలతోఁగూడిన, మృదువాత = మందమారుతముగల, హిమాంబు = పన్నీటియొక్క, కణాళిన్ = బిందుపరంపరచేత, తేల్పినన్ = మూర్ఛఁదేల్పఁగా,

(విసనకఱ్ఱలమీఁదఁ బన్నీరు చిలుకరించి చెలికత్తియలు పరిచారికలచేత వీవఁ జేసి సేదఁ దేర్చిరనుట).

తా. సుగమము.

కం. తెలిసి కను దెఱచి వెండియు, జలజేక్షణ తన్ముకుంద • చరణస్మృతిని,
శ్చలతఁ గను మొగిచి మఱియ, శ్రులు తెప్పలఁ దోఁపఁ దెఱచి • చూచి సఖులతోన్.

టీక. తెలిసి = తేఁవాంచి, కనుదెఱచి = నేత్రమువిచ్చి, వెండియున్ = మరలను, జలజేక్షణ = ఆనాయిక, తన్ముకుందచరణస్మృతినిశ్చలతన్, తన్ముకుంద = ఆ శ్రీకృష్ణునియొక్క, చరణస్మృతి = పాదస్మరణమందు, నిశ్చలతన్ = స్థైర్యముచేత, కనుమొగిచి = నేత్రముమూసి, మఱి = పిమ్మట, అశ్రులు = బాష్పజలములు, తెప్పలన్ = పక్ష్మములయందు, తోఁపన్ = కానరాఁగా, తెఱచి = కనుదెఱచి, చూచి = వీక్షించి, సఖులతోన్ = చెలులతోడనని ముందటికన్వయము.

తా. సుగమము.

కం. మీ రెవ్వ రనుటయును శృం, గారిణి మే మురగకన్య • కల మింతకు ను,
ద్ధారుణి కేతెంచితి మన, నారామలఁ గౌఁగిలించి • యార్తిన్ బలికెన్. ౬౯.

టీక. మీ రెవ్వరనుటయును = మీ రెవ్వరనఁగా, శృంగారిణి = ఓసుందరి, మేమురగకన్యలము = మేమునాగకన్యలము, ఇంతకునున్ = ఈజన్మమునకుముందు, ధారుణికేతెంచితిమనన్ = భూలోకమునకువచ్చితిమనఁగానే, ఆరామలన్ = ఆ స్త్రీలను, కౌఁగిలించి = ఆలింగనముఁజేసికొని, ఆర్తిన్ = మనస్తాపముచేత, పలికెన్ = వచించెను.

తా. సుగమము.

ఉ. అట్టి మురారి కప్పు డనుఁ • గై మఱి యీకలివేళఁ గ్రమ్మఱం,
బుట్టి వియోగ వేదననఁ • బొక్కెదు నీ తను వేల తండ్రి దా,
నిట్టుగు నన్ను నింకొకని • కియ్యక తొల్తన యోగశక్తిఁ బోఁ,
బెట్టెద దీని వెండియు • నుపేంద్రపదాంబురుహంబు పట్టెదన్. ౭౦.

టీక. అట్టిమురారికిన్ = అట్టిశ్రీకృష్ణునకు, అప్పుడు = ఆకాలమందు, అనుఁగై = ప్రియురాలనై, (ఇచ్చట అనుఁగునైయని యుండవలసినను అది వైకల్పికవిధిగాన అనుఁగై అనియునుండవచ్చును), ఇట్లు ఆదిపర్వంబున॥ గీ-పా. కౌరవుల కెల్ల గురుఁడైన కారణంబు అనిప్రయోగింపఁబడియున్నది. మఱి = పిమ్మటను, ఈకలివేళన్ = ఈకలియుగకాలమందు, క్రమ్మఱన్ = మరలను, పుట్టి = జనించి, వియోగవేదనన్ = విరహవేదనచేతనే, పొక్కెదు = పరితపించెదను, ఈతనువేల = ఈశరీరమేటికి,

తండ్రి = మా జనకుఁడు, తాను = ఆయన, ఇట్టుగు = ఈరీతిగలిగియున్న, నన్నున్ = నను, ఇంకొకనికి = మఱియొకనికి, ఈయకతొల్తన = ఇయ్యకముందఱనే, దీనిన్ = ఈశరీరమును, యోగశక్తిన్ = యోగబలనుచేత, పోఁబెట్టెదన్ = విసర్జించెదను, వెండియున్ = మగిడి, ఉపేంద్ర = ఆత్రివిక్రమునియొక్క, పదాంబురుహంబు = చరణసరోజమును, పట్టెదన్ = అవలంబించెదను.

తా. అట్టి శ్రీకృష్ణునకుఁ దొల్లి ప్రియురాలనై యుండియు నీకలివేళ మరల జనించి వియోగతాపముచేతఁ గ్రాఁగెడు నీదేహమును మాతండ్రి నన్నొకనికియ్యక మున్నే యోగశక్తిచేత విడిచి మగిడి యాయుపేంద్రు పాదపద్మంబ యవలంబించెద నని భావము.

క. అది యొండె భక్తి యెవ్వతె, యెద విశ్లేషైకభీరు • వృత్తిన్ బ్రియలా,
భదశన్ మెయిఁ దొఱఁగించును, హదనునన దిగాకయున్న • నవి వైశికముల్. ౯౧.

టీక. ఎవ్వతె = ఏస్త్రీయైన, ఎదన్ = హృదయమందు, విశ్లేష = వియోగమువలన, ఏక = ముఖ్యమగు, భీరువృత్తిన్ = భయంపడినవర్తనముచేత, ప్రియలాభదశన్ = ప్రియునియొక్కలాభదశయందే, హదనునన్ = మంచిసమయమందు, మెయిన్ = శరీరమును, తొఱఁగించున్ = జార్చునో, అది = ఆశరీరత్యాగవ్యాపారము, ఒండె = ఒకటే, భక్తి = పతిభక్తి, అదిగాకయున్నన్ = అట్లుగాకుండినను, అవి = మిగులునట్టిభక్తులు, వైశికముల్ = విత్తమాత్రోపాధిక సకలపురుషాభిలాషా సామాన్యాయనునట్లు వేశ్యాభక్తియేకాక నిక్కముగాదనుట.

తా. ఏయింతి తనప్రాణనాథుఁడు దాఁపుననుండినప్పుడే యితనితో వియోగము గలుగునేమో యను భయముచేత మంచిసమయముగనుఁగొని శరీరత్యాగము సేయునో యాపెదే పతిభక్తిగాక యితరములైనవి వేశ్యాభక్తివంటివని భావము.

తే. అనిన వారలు పల్కి రా • యదువతంస,
మెందుఁ జన్నాఁడు వినుము రంగ • మంద నిల్చె,
వేగపాటేల? యతఁడ నీ • విభుఁ డగుటకు,
నర్చనాముల నిప్పటి • హరి భజింపు. ౯౨.

టీక. అనినన్ = ఇట్లుచెప్పఁగా, వారలుపల్కిరి = ఆచెలులువక్ష్యమాణక్రమముగా పలికిరి, ఆయదువతంసము = ఆయాదవరత్నమగుశ్రీకృష్ణుఁడు, ఎందుఁజన్నాఁడు = ఎక్కడకేఁగినాఁడు, వినుము = ఆలకింపుము, రంగమంద = శ్రీరంగక్షేత్రమందే, నిల్చెన్ = నివసించెను, వేగపాటేల = త్వరపడుటయేటికి, అతఁడ = ఆస్వామి

యే, నీవిభుఁడగుటకున్ = నీభర్తయగుటకు, ఇవ్విటిహరిన్ = ఈశ్రీవిల్లిబుత్తూరనునఁ స్వామిని, అర్చనాదులన్ = పూజాదులచేత, భజింపుము = సేవింపుము.

తా. ఆ శ్రీకృష్ణుఁడిప్పుడిచ్చటికిఁబోలేదు శ్రీరంగమందేయున్నాఁడు గావున నతఁడు నీ భర్తయగుటకు నీయూరనున్న వడంబెరుంగోయిలుడయనను స్వామిన్ని బూజనాదులచేతఁ గొల్వు మని భావము.

చం. అలుకకు మన్నఁ దేటి మఱి ♦ యంతటనుండియు వేళవేళ నె,
చ్చెలు లిడు తెల్పుల న్మగుడఁ ♦ జింతల సంతమసంబుల న్సమా,
కలితత మించె సొమ్ములని ♦ కార్శ్యమునన్ హృదయంబున స్సదా,
పలపలగాక నీలముల ♦ బన్నసరం బయి నిర్మలాంగికిన్. ౫౩.

టీక. అలుకకుమన్నన్ = వెఱవకుమనిచెప్పఁగా, తేటి = తెలివొంది, మఱి = అనంతరమందు, అంతటనుండియున్ = అప్పుడు మొదలుకొని, వేళవేళన్ = ప్రతికాలమందు, నెచ్చెలులు = చెలికత్తియలు, ఇడు = ఉనిచెడి, తెల్పులన్ = జ్ఞానములనెడు, భావ్యములతోడను, మగుడన్ = మరల, చింతల = విచారములనియెడు, సంతమసంబులన్ = చీకటులతోడను, సమాకలితత = కూడుకొనుట, (ఇదికర్తృపదము), నిర్మలాంగికిన్ = స్వచ్ఛశరీరముగల యువిదకు, సొమ్ములని = భూషణముధరింపని, కార్శ్యమునన్ = కృశించుటచేత, హృదయంబునన్ = ఎదయందు, సదా = ఎల్లప్పుడును, పలపలగాక = పలచనగాక, నీలములబన్నసరంబయి = నీలములతోడఁ గూర్చిన ముక్తాహారమై, మించెన్ = ఒప్పెను.

తా. ఆయమకుఁ గృశత్వము చేత సొమ్ములిడకుండినను హృదయమందుఁ జెలుల మాటల తెల్పులును మరలఁ గలిగెడు చింతాభరంబులను చీఁకటులు గూడు కొని నీలములతోఁ జేర్చిన ముత్తెపు సరమువలె నుండె ననియును దీనికిఁ జింతాసంతమసంబులు నీలములవలెను చెలుల మాటలవలనఁ గలిగెడు తెలుపులను తెలుపులు ముత్తెములవలె నుండెననియును లో నున్న భావము నిర్మలాంగియగుట బయలఁ దోచె ననియును భావము.

తే. ఎలసి యెప్రొద్దుఁ గనువొంద ♦ నీక మరుఁడు,
కలహమున కంకకాఁ డయి ♦ కాలుద్రవ్వఁ,
జాండుబహుళక్షపాపరం ♦ పరలువెడల,
కింటిలో నేఁడుముల్లయ్యె ♦ నిందుముఖికి. ౫౪.

టీక. ఎలసి = కనుపెట్టుకొని, ఎప్రొద్దున్ = సంతతమును, కనువొందనీక = కన్నుమూయనీక, మరుఁడు = మన్మరుఁడు, కలహమునకున్ = పోరాటమునకు, అంత

కాఁడై = బిరుదుగలవాఁడై, (ఇది విటకాఁడు మొదలగు శబ్దములవంటిది), కాలుద్రవ్వక్ = కాలుద్రవ్వుచుండఁగా, పాండుబహుళపక్షపా = శుక్లపక్ష బహుళపక్ష రాత్రులయొక్క, పరంపరలు = వరుసలు, పెడలక = కడవక, ఇందుముఖికిన్ = ఆ చంద్రముఖికి, ఇంటిలోన్ = గృహమందు, ఏఁదుముల్లయ్యె = ఏఁదుఁబందిముల్లుఁడి నట్లె యాయెను.

తా. మన్మథుఁ డెడతెగక యుప్పుడుఁ గనుపై చి నిద్రఁబట్టనీకుండఁ గచ్చకఁ గాలుద్రవ్వుచుండఁగా శుక్లపక్షరాత్రులును బహుళపక్షరాత్రులు నొక్కఁడుగానే చక్కఁగా జరుగక యేఁదుముల్లింటిలో నుండిన నాయింటి వారికెట్లు క్షేమములేక నిద్దుర పట్టక పోవునో యారీతిగానే యాయమ శ్రమపడునని భావము. శల్యమృగ రోమమింటనున్న నాయింటఁగలహము కలుగుననుట ప్రసిద్ధము. ఇచ్చట శుక్లపక్ష రాత్రులుదెల్లగాను కృష్ణపక్షరాత్రులు నల్లఁగా నుండును గనుక వాని పరంపర యేఁదుఁబందిముల్లుఁగా జెప్పఁబడెను. ఆరోప్యమాణమయిన యేఁదు పంది ముల్లు కలహమును గలుగఁజేయుట కుపయోగించెను గనుక పరిణామాలంకారము.

మ. తలిరుం గైదువు జోదు నానతి వధూ ♦ ధైర్యంపుఁ బెన్గోట గం ।
డళితాహర్ముఖయంత్రకారుఁ డలుక ♦ న్నానాఁటికిం గ్రొళ్లఁ గో,
మల మార్తాండమరీచిదీపకళికో ♦ ష్మం జూఁడి యేయుం దళ,
ద్దళపాథోరుహ లోహనాళ కుహరో ♦ ద్యచ్చంచరీకాశ్మముల్. ౮౫.

టీక. కందళితాహర్ముఖయంత్రకారుఁడు=అంకురించినప్రాతఃకాలమను రెడు పిరంగిరౌతు, తలిరుంగైదువు = చిగురుటాకుబాఁకుగల, జోదు = యోధయగుమన్మ థునియొక్క, ఆనతిన్ = ఆజ్ఞప్తిచేత, వధూ = ఆవనితయొక్క, ధైర్యంపు = ధైర్య మయమగు, పెన్గోట = పెద్దకోట, నానాఁటికిన్= దినక్రమముగా, గ్రొళ్లన్=కూలు టకు, కోమల = మృదువులగు, మార్తాండ = బాలసూర్యునియొక్క, మరీచి = కిరణ ములనియెడు, దీపకళికా = మొగ్గవంటిదీపములయొక్క, ఊష్మన్ = వేఁడిమిచేత, చూఁడి = ముట్టించి, దళత్ = వికసించుచున్న, దళ = ఱేకులుగల, పాథోరుహ = కమలములనియెడు, లోహనాళ= పిరంగులయొక్క, కుహర=బిలములనుండి, ఉద్యత్= వెడలుచున్న, చంచత్ = మదించిన, చంచరీక = తుమ్మెదలనియెడు, అశ్మముల్ = గుండ్లను, అలుకన్ = కోపముచేత, ఏయున్ = ప్రయోగించును.

తా. ప్రాతఃకాల మనెడు పిరంగిరౌతు మన్మథుఁడను యోధవరుని సెల వంది యాయమ ధైర్యమనియెడు కోట నానాఁటికిఁ గ్రింద గూలుటకై బాల సూర్యకిరణములు సోఁకుటవలన వికసించుచున్న కమలములనియెడు పిరంగులలో

నుండి వెడలెడు గండుమమ్మెకలనియెడు గుండ్లను బారు సేయుననియును నప్పుడా కిరణజ్వాలయే జెనకి త్రాటిరంజకపు పేడిమియై యుండె ననియును ఆయమకు రా త్రులు ధైర్యము లే దాయెఁగదా ప్రాతఃకాలమంబును లేదాయెననియును సాయం కాలములందుఁ గమలములు ముకుళించు నప్పుడు తుమ్మెద లా కమలములలోఁ జొ చ్చి యుండి సూర్యోదయముగాఁగా నే వికసిల్లిన వానిలోనుండి వెడలు చుండె నని యును భావము.

తే. పొంత ఘటయంత్ర సరముఁ ద్రి • ప్పుచు జపించు,
మగువ ధృతిదూల మధ్యాహ్న • మంత్రవాది,
సురచిర వితాన దంభ • కౌసుంభ ధారి,
తుహిన ధారా గృహాంగి బిం • దువులు సెదర. ౯౬.

టీక. మధ్యాహ్నమంత్రవాది = మధ్యాహ్నమనియెడిమాంత్రికుఁడు, మగువ= ఆయమయొక్క, ధృతి = ధైర్యము, తూలన్ = చలించుటకై, సురచిర = ప్రకాశిం చుచున్న, వితాన = మేలుకట్టనియెడు, దంభ = వ్యాజముగల, కౌసుంభ = కాషా యవస్త్రమును, ధారి = ధరించినవాఁడును, తుహినధారాగృహ = మంచువంటిధా రలుగల గృహమనియెడు, అంగి= శరీరముగలవాఁడునై, (ఇవిరెండును మధ్యాహ్న మంత్రవాదికివిశేషణములు), బిందువులు = ధారాబిందువులు, (బిందువులనఁగా ధైర్య ముయొక్క ప్రాణములనికొందఱు, బంధువులని మఱియొకపాఠము. అప్పుడును ప్రా ణములనియే యర్థము. "బంధుస్స్యాద్బాంధవే పుష్పే స్యాత్ప్రాణబంధోశ్చభర్తరి" అని విశ్వము), చెదరన్ = పడుచుండఁగా, ఘటయంత్ర = కుంభయంత్రమనియెడు, స రమున్ = జపమాలికను, త్రిప్పుచున్ = పరివృత్తిఁజేయుచు, పొంతన్ = సమీప మున, జపించున్ = జపముసేయును.

తా. తొగరద్దిన చందువలనియెడు కాషాయములను ధరించి మంచువలె ధారలు గురిసెడు గృహమనియెడి శరీరము భస్మ ధూసరితమై నట్లు తెల్లఁగా నుం డఁగా జలము వెదఁజల్లుచుఁ దిరుగుచున్న ఘటయంత్ర మనియెడు జపమాలిక త్రి ప్పుచు మధ్యాహ్న మనియెడు మాంత్రికుఁడు మగువ ధైర్యము చెడి పోవుటకుఁ దన నోటి తుప్పరలు రాలు నట్లు జపముఁ జేయు చుండె నని భావము. దీనివలనఁ దా పోపశమనార్థమై నీటి తుంపురులు నెగయు చున్న ఘటయంత్రములుగల యింటి లో నాయమ యుండఁగా నక్కడను దాప మధిక మాయెనని తోఁచుచున్నది. ఘట యంత్రమనఁగా నొక మోకు వెంటఁ గడవలు గట్టి బావిలోఁ జేఁదుచు రాఁగాఁ గొన్ని మునుఁగునవియు మఱికొన్ని నీరు గ్రుమ్మరించునవియై యుండును.

ఉ. తామరసాప్త తామ్రముఖి ♦ దంష్ట్రిత విస్ఫుట మల్లి హల్లక,
స్తోమరజశ్ఛటాంగక మ ♦ ధుద్యుతితార వియద్ద్రు చంక్రమో,
ద్దామ పితృప్రసూ ప్లవగి ♦ దైన్యరుతోత్థ రథాంగ పోత చిం,
తామయ నిద్రలం బొలసి ♦ తాపము సేయఁ దొడంగె నింతికిన్. ౮౭.

టీక. తామరసాప్త = కమలాప్తుండగుసూర్యుండనియెడు, తామ్ర=ఎఱ్ఱనైన, ముఖి = మొగముగలయట్టియు, దంష్ట్రిత = కోఱలుగాఁ జేయఁబడిన, విస్ఫుట = వికసించిన, మల్లి = మల్లెపువ్వులు గలిగినట్టియు, హల్లక = ఎఱ్ఱగలువలయొక్క, స్తోమ = సమూహముయొక్క, రజః = పుప్పొళ్లయొక్క, ఛటా = ప్రోగనియెడు, అంగక = శరీరముగలయట్టియు, మధు = మకరందమునుయొక్క, ద్యుతి= కాంతివంటి కాంతిగల, తార=నక్షత్రములనెడుకనుగ్రుడ్లుగలట్టియు, (శ్లిష్టరూపకము), వియత్= ఆకసమనియెడు, ద్రు = వృక్షమందు, చంక్రమ = సంచరించుటయందు, ఉద్దామ = అడ్డపాటులేనియదియుననగు, పితృప్రసూ=సాయంసంధ్యయనెడు, ప్లవగి = ఆఁడుకోఁతి "సాయంసంధ్యాపితృప్రసూ" అని యమరము. దైన్యరుత = దీనాలాపముల తోడ, ఉత్థ = లేచినట్టి, రథాంగ = చక్రవాకములనియెడు, పోత = పిల్లలుగలది యై, చింతామయ = చింతావికారములగు, నిద్రలన్ = నిద్దురలయందు, పొలసి = కన్పడి, ఇంతికిన్ = ఆయమకు, తాపముసేయన్ = తాపము గలుగఁ జేయుటకు, తొడంగెన్ = ఉపక్రమించెను.

తా. "స్వప్నేమయాయం వికృతోద్యదృష్టశ్శాఖామృగశ్శాస్త్రగణైర్నిషిద్ధో" అని సుందరకాండమందును, "స్వప్నేవానరమార్జాల భల్లూకాదుఃఖహేతవ" అని గ్రంథాంతరముననున్నట్లు స్వప్నమందు వానర దర్శనము శుభావహముగాదు గావున "కోయంతామ్రముఖఃకపి" అనినట్లు అస్తమింపఁబోయెడు సూర్యుఁడనియెడు నెఱ్ఱని ముఖము గలిగి సాయంకాలమందు వికసిల్లుచున్న మల్లెమొగ్గలనియెడు తెల్లని కోఱలు గలిగి యెఱ్ఱ గలువ పుప్పొడి తిప్ప యనియెడు పచ్చని శరీరము గలిగి (పింగాక్షంపురతస్స్థితం), మన్నట్లాపూల మకరందము వలెఁ బింగళ వర్ణము గల నక్షత్రము లనెడు కను గ్రుడ్లు కలిగి యాకస మనియెడు చెట్టుమీఁదఁ దిరుగుచు నస్తమయ కాలమందు నొండొంటిఁ బాసి దీనాలాపములు సేసెడు జక్కవ లనియెడు పిల్లలలోఁ గూడిన సాయంసంధ్యయనియెడు నాఁడు కోఁతి యాయమకు నిద్రలు లేకున్నను శరీర మెఱుఁగరాని చింతామయ నిద్రలలోఁ దోఁచుచుండుఁ గావున నాయమ మిగుల వగలంబొగిలె నని భావము.

వ. ఇత్తెఱంగున సకల కాలంబుల నారటంబునకు నూఱటఁ గాన కుండియు నప్పం

డరీకాక్షి యందుండు నప్పుండరీకాక్షు నారాధనంబున నా రాధారమణుం గ్రమ్మఱం జెంద డెందంబునం దలంచి. తా

టీక. ఇత్తెఱంగునన్ = ఈ ప్రకారముగాను, సకలకాలంబును = అహో రాత్రములు, అరటంబునకు = పరితాపమునకు, ఊఱటఁగానకుండియు = ఉపశాంతి పొందకుండియు, అప్పుండరీకాక్షి = ఆనాయిక, అందుండు = ఆశ్రీవిల్లిపుత్తూరుననుం డు, పుండరీకాక్షు = విష్ణువుయొక్క, ఆరాధనంబునన్ = పూజచేయుటచేతను, ఆ రాధారమణున్ = ఆ శ్రీకృష్ణస్వామిని, క్రమ్మఱం జెందన్ = తిరిగిపొందుటకు, డెందంబునందలంచి = మనస్సున నెంచుకొని.

తా. సుగమము.

సీ. పద్మాస్య ప్రతిదిన ప్రత్యూషమున మౌన నియతి మేల్కని సఖీచయము మ్రోల,
హేమపాత్రిక హరి ద్రామలక్యాదిక స్నానీయవస్తువ్ర జంబుఁ గొనుచు,
ధౌతాంశుకంబులు తడి యొత్తులును దేర నంతఃపథంబున నరిగి నిజగృ,
హారామదీర్ఘిక ననుసంహితద్రావి డామ్నాయయయ్యె స్నాన మాచరించి,
పర్జనీలేశ పూర్ణ సౌభాగ్య దాంగ, ఘూతి చకచక లీనెండ తోడ సూఱు,
మలయనిడు వెంట్రుకలగుంపు మలచి వైచి, వేగ వెడవెడ దడియె త్రివిధ యుతముగ.

టీక. పద్మాస్య = ఆకమలముఖి, ప్రతిదినప్రత్యూషమునను = ప్రతిదినప్రాతః కాలమందును, మౌననియతిన్ = మౌనవ్రతముచేత, మేల్కని = నిద్దురలేచి, సఖీచ యము = చెలులమొత్తము, మ్రోలన్ = తనముందఱ, హేమపాత్రికన్ = బంగారు పళ్లెరమునందు, హరిద్రా = పసుపును, ఆమలక్యాదిక = ఉసిరికపిండిమొదలగు, స్నా నీయ = స్నానమునకుఁదగిన, వస్తు = ద్రవ్యములయొక్క, వ్రజంబున్ = సమూహ మును, కొనుచున్ = గ్రహించికొనుచు, ధౌతాంశుకంబులు = ఉదికినచీరలును, తడి యొత్తులును = తడిఁదుడుచుకొనువస్త్రములును, తేరన్ = తెచ్చుచుండఁగా, అంతః పథంబునన్ = పెరటిత్రోవను, అరిగి = పోయి, నిజగృహా = తనయింటి సంబంధి యగు, ఆరామ = ఉద్యానమందలి, దీర్ఘికన్ = డిగ్గియయందు, అనుసంహిత= అను సంధానముసేయఁబడిన, ద్రావిడామ్నాయయై = ద్రావిడవేదముగలదియై, "నమా మ్యహంద్రావిడవేదసాగరమ్" అనియు "ద్రవిడోపనిషద్గాథాం పఠితస్యద్విజస్యవై। యోవై పాదోదకంపాతి సపునాతివసుంధరామ్" అనియున్నది గనుక ద్రవిడ వేదా ను సంధానముఁజేసెననుట. స్నానమాచరించి = తీర్థమాడి, పర్జనీలేశ = పసపు పొడికి, పూర్ణ = మెండుకొన్న, సౌభాగ్య = సొబగుఁదనమును, ద=ఇచ్చునట్టి, అంగ=శరీరముయొక్క, ఘూతి = వడఁకుటయొక్క, చకచకలు = చాకచక్యములు,

ఈరెండతోడ = బాలాతపముతోడ, మాఱుమలయన్ = ప్రతిఘటింపఁగా, నిడు = దీర్ఘములగు, పెండ్రుకలగుంపు = కేశములసమూహము, మలఁచివైచి = వెనుకకు వేసికొని, వేగన్ = శీఘ్రముగా, వెడవెడన్ = అసమీచీనముగా, తడియొత్తి = ఒడలు దుడిచి, విధియుతముగన్ = శాస్త్రవిధిప్రకారముగా నని ముందటికన్వయము, "లలాటే కేశవంధ్యాయే" త్తని యూర్ధ్వపుండ్ర ప్రకరణమందున్నది గనుక విధియుతమని ప్రయోగింపఁబడెను.

తా. సుగమము.

ఉ. కుందరదాగ్ర నెన్నొసల • గుమ్మడి గింజ తెఱంగు పాండు మృ,
ద్బిందువుఁ దీర్చి చెందిరము • మేచక శీర్షము పైఁ బలె న్గటిం,
జందురుకావి జీ బమరఁ • జల్లని రేయిటి తట్టుపు న్గళుల్,
విందులఁ దేల నూనె ముడి • వెండ్రుకలందం దడి తావు లీనఁగన్. ౯౦

టీక. కుందరదాగ్ర = మొల్లమొగ్గలవంటిదంతాగ్రములుగల యాయువతి, నెన్నొసలన్ = లలాటమందు, గుమ్మడిగింజతెఱంగు = కూశ్మాండ బీజముయొక్క రీతిగల, పాండుమృత్ = తిరుమణియొక్క, బిందువున్ = తిలకమును, తీర్చి = దిద్ది, చెందిరము = సింధూరము, మేచకశీర్షము పైఁబలెన్ = గజమస్తకముమీఁదవలె, "మేచకః పేచకీతథా" అని ద్విరూపకోశమందును, "సామజః పేచకీ శూర్పశ్రుతిర్వేదండ" అని యమరమున ఉన్నదిగనుకఁ పేచకీ శీర్షమన్న పాఠమును గ్రాహ్యము, చందురుకావి జీబు = చంద్రకావిజిల్గుచీర, కటిన్ = పిఱుఁదున, అమరన్ = ఒప్పఁగా, చల్లని = శీతలమగు, రేయిటి = రాత్రియలఁదిన, తట్టుపున్గు = సాంకవవిశేషము, అళుల్ = తుమ్మెదలు, విందులఁదేలన్ = విందుభోజనములు సేయఁగా, నూనెముడి వెండ్రుకలన్ = నూనెగలిగి ముడివేయఁబడిన కేశపాశమునందు, తడితావులీనఁగన్ = ఆర్ద్రపరిమళములు సృజింపఁగానని ముందటికన్వయము.

తా. తిరుమణితో గుమ్మడిగింజవలె నామముఁ బెట్టుకొని చంద్రకావి చీర ధరించి యుండెననియు, రాత్రి శరీరమందు ధరించిన పున్గు వాసనలకుఁ దుమ్మెదలు గ్రమ్ముకొనుచుండె ననియును మెఱుఁగు రాచియున్న వెండ్రుకలు ముడియిడఁగా నొక వింత పరిమళము వచ్చుచుండె నని భావము.

తే. బోటి గట్టిన చెంగల్వ • పూవుటెత్తుఁ,
దరు పరిణతోరు కదళి మం • జరియుఁ గొనుచుఁ,
బోయి గుడి నంబి విజనంబుఁ • జేయఁ జొచ్చి,
మ్రొక్కి వేదికఁ బలువన్నె • ముగ్గు బెట్టి. ౯౧

టీక. బోటి = చెలికత్తె, కట్టిన = కూర్చిన, చెంగల్వపూవుటెత్తు = ఎఱ్ఱకలువ పూలదండ, తరు = వృక్షమునందే, పరిణత = లెస్సగాఁబండిన, ఉరు = పెద్దదైన, కదళి = అరఁటిపండ్లయొక్క, మంజరియుక్ = గెలయును, కొనుచు = గ్రహించుచు, పోయి = చని, సంబి = అర్చకుఁడు, గుడిక్ = కోవెలను, విజనంబుఁజేయక్ = జనరహితముగునట్లుగాఁవింపఁగా, చొచ్చి = అచ్చటఁబ్రవేశించి, ప్రముకికి = స్వామికి దండము సమర్పించి, వేదికక్ = తిన్నెయందు, పలువన్నె = పెక్కురంగులుగల, ముగ్గుక్ = రంగవల్లిని, పెట్టి = తీర్చి.

తా. సుగమము.

తే. కపిలగవి సర్పిఁ బృథు దీప • కళికఁ దీర్చి,
ద్వయమూలతో వక్షమునఁ గల్వ • దండ సేర్చి,
యగరు ధూపంబు విడి శర్క • రాజ్యయుక్త,
హృద్య కదళీ ఫలాళి నై • వేద్య మిచ్చి. ౯౨.

టీక. కపిలగవి = కపిలధేనువుయొక్క, సర్పిక్ = నేతిచేత, పృథు = పెద్దయగు, దీపకళికక్ = దీపజ్వాలను, తీర్చి = వెలిఁగించి, ద్వయమూలతోక్ = ద్వయమనియెడు మంత్రోచ్చారణముతోడ, వక్షమునక్ = స్వామివక్షస్స్థలమందు, కల్వదండ = చెంగల్వమాలికను, చేర్చి = సమర్పించి, అగరుధూపంబువిడి= అగరుచెక్కపొడితో ధూపములువేసి, శర్కరా = చక్కెరతోడను, ఆజ్య = నేతితోడ, యుక్త = కూడియున్న, హృద్య = మనోహరములగు, కదళీఫల= అరఁటిపండ్లయొక్క, ఆళిక్ = సమూహమును, నైవేద్యము = ఆరగింపును, ఇచ్చి = సమర్పించి.

తా. సుగమము.

కం. ఖండిత పూగీ నాగర, ఖండంబులు ఘన శశాంక • ఖండంబులచే,
మిండితములు గావించియు, ఖండస్థిర భక్తి నొసఁగి•కదలి చెలులతోక్. ౯౩.

టీక. ఖండిత = కత్తిరింపఁబడిన, పూగీ = పోఁకలయొక్కయు, నాగర = సొంఁటియొక్కయు, ఖండంబులు = తునుకలను, ఘన = గొప్పలగు, శశాంకఖండంబులచేక్ = కర్పూరశకలములచేతను, "ఘనసారశ్చంద్రసంజ్ఞ" అని నిఘంటువు, మిండితములుగావించి = కలియఁగూర్చి, అఖండ = కొదవలేని, స్థిర = తిరమయిన, భక్తిక్ = భక్తిచేత, ఒసఁగి = స్వామికిసమర్పించి, కదలి = అచ్చటనుండి వెడలి, చెలులతోక్ = సఖులతోడనని ముందరికన్వయము.

తా. సుగమము.

తే. చెలువ గర్భగృహ ప్రద • క్షిణముఁ జేసి,
వినతుఁడై వ్రాలి శఠకోప • మును ధరించి,
చరణతీర్థముఁ గొని తత్ప్ర • సాదలబ్ధ,
మయిన మాల్యముఁ దాల్చి గే • హమున కరుగు. ౯౪.

టీక. చెలువ = ఆసుందరి, గర్భగృహ = గర్భగృహమునకు, ప్రదక్షిణముఁ జేసి = వలగొని, వినతుఁడై = నమ్రుఁడై, వ్రాలిక = శిరమునందు, శఠకోపమును = శ్రీశఠకోపమును, ధరించి = వహించి, చరణతీర్థమున్ = ఆస్వామివారి శ్రీపాదతీర్థమును, ధరించి = వహించి, కొని = పుచ్చుకొని, తత్ప్రసాద, తత్ = ఆస్వామి యొక్క, ప్రసాద = ప్రసన్నత్వముచేత, లబ్ధమగు నైన = లభించిన, మాల్యమున్ = పూదండను, తాల్చి = ధరించి, గేహమునకున్ = తనయింటికి, అరుగున్ = పోవును.

తా. సుగమము.

కం. ప్రతిదినము నిట్లు చని యచ్యుతు పూజ యొనర్చి వచ్చి • సుదతి వియోగ, చ్యుతధైర్యయగుచు నయ్యదుపతిగుణములు ద్రవిడభాషఁ • బాడుచునుండున్ ౯౫.

టీక. ప్రతిదినమున్ = అనుదినమందును, ఇట్లు = ఈరీతిగా, చని = పోయి, అచ్యుతపూజ = ఆస్వామిపూజనము, ఒనర్చి = చేసి, వచ్చి = మరలనింటికివచ్చి, సుదతి = ఆయమ, వియోగ = విరహముచేత, చ్యుత = జారిన, ధైర్యయగుచున్ = ధైర్యము గలదియై, అయ్యదుపతి = ఆ శ్రీకృష్ణునియొక్క, గుణములు = కల్యాణగుణములను, ద్రవిడభాషన్ = ద్రావిడభాషయందు, పాడుచునుండున్ = గానముచేయుచుండును. ఈయమ తిరుప్పావ యను ద్రవిడప్రబంధము చేసి దానియందు గానము చేసె ననుట.

తా. సుగమము.

## ఉ త్త రా య ణ వ ర్ణ న ము.

తే. మొదల నాముక్తమాల్యద • మదన తాప,
తరణి కెదుపెట్ట వేఁగిన • దక్షిణాశ,
మత్కృతోపమ్లకుఁ దుదముట్ట • మాఁడు ననుచుఁ,
దొలఁగెనన నుత్తరాశకుఁ • దొలఁగెఁ దరణి. ౯౬.

టీక. మొదలన్ = ప్రథమమందు, ఆముక్తమాల్యద, ఆముక్త = ధరించివిడువఁబడిన, మాల్య = పుష్పమాలికలను, ద = స్వామికిచ్చిన చూడికుడుత్తనాచ్చియార నియెడు నాయమ్మయొక్క, మదనతాప, మదన = మన్మథునిచేతనైన, తాప = విరహ

తాపమనియెడు, తరణి = సూర్యునియొక్క, పెనువెట్టన్ = అధికోష్ణముచేత, వేఁగినన్ = పరితపించిన, దక్షిణాశ = దక్షిణదిక్కు, మత్కృత = నాచేతఁ జేయఁబడిన, ఊష్మకున్ = వేడిమికి, తుదముట్టన్ = పరిసమాప్తమగునట్లు, మాఁడుమనుచున్ = మాఁడి పోవునని, తొలఁగెననన్ = తొలఁగెనోయనునట్లు, తరణి = సూర్యుఁడు, ఉత్తరాశకున్ = ఉత్తరదిక్కునకు, తొలఁగెన్ = సంచలించెను, ఉత్తరాయణగతుఁడాయె ననుట.

తా. ఇప్పుడే చూడికుడుత్తనాచ్చెమారుల విరహ తాప మనెడు సూర్య దీప్తిచేత నీ దక్షిణ దిక్కు వేఁగుచున్నది దీనిపై నేనును వేఁడిమిఁ జేసితేని యీ దిక్కు మాఁడి పోవు నని తలంచి సూర్యుఁ డాదిక్కునుండి తొలంగెనో యను నట్లుత్తరాయణప్రవేశ మాయెననియు నాచూడికుడుత్త నాంచ్చారు ధనుర్మాసమం దీ వ్రతముఁ బూని ముప్పది దినములు ముప్పది పాటలుగాఁ దిరుప్పావు పాడెననియును బిమ్మట మకర సంక్రమణము ప్రవేశించె ననియు భావము. రూపకోత్థాపితహేతూత్ప్రేక్ష.

చ. తెలియఁగ వచ్చె నట్టితఱిఁ • దిగ్మకరుండు ధనాధిపాశకై,
తొలఁగిన కారణం బళివ • దుర్వహ దీర్ఘ వియోగవహ్ని పె,
ల్లలమిన తద్దిశం దగిలి • నట్టి తనూష్మ ఘనీభవన్మహా,
జలమయ శంకర శ్వశుర • శైలము కోనల చల్వఁ దీర్పఁగన్. ౯౬.

టీక. అట్టితఱిన్ = ఆసమయమునందు, తిగ్మకరుండు = తీక్ష్ణకిరణుండగు సూర్యుఁడు, ధనాధిపాశకై = కుబేరదిక్కునకై, తొలఁగిన కారణంబు = తొలఁగిపోయిన హేతువు, అళివ = ఆచూడికుడుత్తనాచ్చెమారుయొక్క, దుర్వహ = వహింపఁగూడని, దీర్ఘ = ప్రౌఢమగు, వియోగవహ్ని = విరహాగ్ని, పెల్లు = అధికముగా, అలమిన = వ్యాపించినట్టి, తద్దిశన్ = ఆదక్షిణదిశయందు, తగిలినట్టి = తనకుసోఁకినట్టి, తనూష్మన్ = శరీరతాపమును, ఘనీభవత్ = కరుడుగట్టిన, మహాజలమయ = మహోదకవికారమగు, శంకర = ఈశ్వరునకు, శ్వశుర = మామయగు, శైలము = హిమవత్పర్వతముయొక్క, కోనల = చరులయందలి, చల్వన్ = శైత్యముచేత, తీర్పఁగన్ = పోఁగొట్టుకొనుటకని, తెలియఁగవచ్చెన్ = ఎఱుకపడవచ్చెను.

తా. సూర్యుఁడు దక్షిణ దిక్కునుండి యుత్తరదిక్కునకుఁ జనుటకుఁ గారణ మేమన్నను దక్షిణ దిశయందుఁ జూడికుడుత్తనాచ్చెమారుండెఁ గావున నాయమ తాప మాదిక్కెల్ల వ్యాపింపఁగా సూర్యుఁ డచ్చట నుండఁగా నతనికి నాఁ వేఁడిమి దాఁకుట కతంబున హిమవత్పర్వతము చఱియలలోని శైత్యముచేత నాకాఁక నడఁచు

శానుటకై యూ యుత్తర దిశకుఁ బోయె నని భావము. కావ్యలింగానుప్రాణిత ఫలోత్ప్రేక్ష.

వసంతర్తువర్ణనము.

తే. కినిసి వలఱేఁడు దండెత్తఁ ♦ గేతు వగుట,
మీన మిలఁ దోఁచు టుచితం బ ♦ మేష మేమి,
పని యనఁగ నేల? విరహాఖ్యఁ ♦ బాంథయువతి,
దాహమున కగ్గి రాఁగఁ ద ♦ త్తడియు రాదే? ౯౫.

టీక. కినిసి = కోపించి, వలఱేఁడు = మన్మథుఁడు, దండెత్తన్ = విరహుల మీఁద దండెత్తిరాఁగా, కేతువగుటన్ = టెక్కెమగుటచేతను, మీనము = మత్స్యము, (మీనసంక్రాంతియనుట), "ప్రద్యుమ్నో మీనకేతనః" అని యమరము, ఇలన్ = భూమియందు, తోఁచుట = కనఁబడుట, ఉచితంబ = తగినదియే, మేషము = మేక, (మేషసంక్రాంతియనుట), ఏమిపని యనఁగనేల = ఏమిపనికివచ్చెననుటయేల, విరహాఖ్యన్ = విరహమనెడుపేరిచేత, పాంథ = వియోగవతులగు, యువతి = ఉవిదల యొక్క, దాహమునకున్ = దహించుటకై, అగ్గి = అగ్ని, రాఁగన్ = వచ్చుచుండఁగా, తత్తడియున్ = వాహనమును, రాదే = రాదా.

తా. మన్మథునకు మీనము టెక్కెము గావున నతఁడు దండెత్తి వచ్చినప్పుడది కనఁబడుట సరియేకాక మేషమేల వచ్చె ననఁగా నగ్ని మేషవాహనుఁడు గావున నతఁడు విరహ మను నామము చేతను వియోగినులను దహించుటకై రాఁగా నతనిఁ వాహనము వచ్చెననియును మీన సంక్రాంతి వచ్చి యానెల గడచి మేష సంక్రాంతి వచ్చెనని భావము. శ్లేషము చేత మీనమేషములకు సంతాపకరత్వము చెప్పినాఁడు గనుక నలంకారముచేత వస్తుధ్వని.

చ. ప్రియ పరిరంభణ ప్రథిమ ♦ పెల్లిఁకఁ జైత్రుఁడు వచ్చి చేయఁగా,
వ్యయ మని సీతునంద ♦ చెలువ ల్పెదవు ల్పడపంగ వచ్చెఁ దా,
రయమునఁ జేర్చి యా ఋతువు ♦ రాఁ బిలి విచ్చు గౌఁగిలింగి రయ్యెర,
స్థ యుచిత మే కదా విపది ♦ ధైర్య మనం జను మాటుయుంతకున్. ౯౬.

టీక. ప్రియ = ప్రియులయొక్క, పరిరంభణ = ఆలింగనములయొక్క, ప్రథిమ = దార్ఢ్యముయొక్క, పెల్లు = అధిక్యమును, ఇఁకన్ = భవిష్యత్కాలమందు, చైత్రుఁడు = మధుమాసము, వచ్చి = ఆసన్నుఁడై, వ్యయము సేయఁగా = నాశముఁ జేయునుగదా, అని = అనుకొని, సీతునంద = చలికాలిమంచే, చెలువల్ = సుందరులు, పెదవుల్పడఁపంగన్ = భయముచేతను పెదవులువడుపుకొనుచుండఁగా, (పలి

చేతఁ బగిలిన పెదవులను నాలుకలచేఁ దడుపుచుందురు గనుక దానిని భయమును భావముగాఁ జెప్పినాఁడు), ఆ ఋతువు=ఆవసంతర్తువు, తాన్ = తాను, రయమునన్ = వేగముచేతను, పేర్చి=అతిశయించి, వచ్చెన్ = ప్రవేశించెను, రాన్=అట్లురాఁగా, చలివిచ్చి = చలిదీఱి, (భయము లేకయనుటయును వసంతర్తువురాఁగానే చలిపోవు ననుట), ఆయ్యవస్థ = అట్లుభయపడి పెదవులుదడుపుటయు, చలిచేతఁదడుపుచుండుటయును, తొలంగిరి = విడిచిరి, ఇంతకున్ = ఇంతపనికిని, విపదిధైర్యమనంజను= ఆపదయందు ధైర్యముండవలయుననఁగా నొప్పుచున్న, మాట = వాక్యము, "విపది ధైర్యమథాభ్యుదయే క్షమా" అను వాక్యమనుట, ఉచితమేకదా = తగినదేకదా.

తా. స్త్రీలందఱు తమ ప్రియుల బిగి కౌఁగిలింతలింకఁ జైత్రుఁడు వచ్చి యిప్పటివలెనుండనీక నశింపఁ జేయునని చలి కాలమందే భయపడి పెదవులు దడిపికొనుచుండఁగా నతఁడురానే వచ్చెను అట్లు రాఁగా వారు చలిదీఱి యాయవస్థ విడిచిరి, విపది ధైర్య మనుమాట యీాపని కుచితమే కదా యనియును, చలికాలములో వలెఁ జైత్రమాసములో గాఢాలింగనము లుండవనియును, చలిచేతఁ బెదవులు పగులఁగా నాలుక కొనలచేఁ దడుపుకొందు రనియును, వసంతర్తువు రాఁగానే చలి తగ్గెననియును, వారా పెదవులు దడుపుట మాని రనియును భావము. హేతూత్ప్రేక్షా శ్లేషము.

ఉ. స్పృష్ట బహువ్రణంబయిన • సీతున కల్కి నిజోష్ఠ పల్లవో,
చ్ఛిష్టముఁ గొన్న దిమ్మధుని • సీయన కింతులు మోవిఁ దన్మధూ,
చ్ఛిష్టముఁ గొన్న యొచ్చె మఱఁ • జేసిన వారు కృతం బెఱింగి వి,
స్పష్టముగా నొనర్చిరి వ • సంతున కూఱట దోహదంబులన్. ౧౦౦.

టీక. నిజోష్ఠపల్లవ, నిజ=తమయొక్క, ఓష్ఠపల్లవ= మోవిచిగురులయొక్క, ఉచ్ఛిష్టమున్ = ఎంగిలిని, కొన్నది = గ్రహించినది, ఇమ్మధువు = ఈతేనియ, ఇసీయనక = ఛీయనక, ఇంతులు=స్త్రీలు, స్పృష్ట = సృజింపఁబడిన, బహువ్రణంబైన = పలుగాయములుగల, సీతునకున్ = చలికాలానకు, అల్కి = వెఱచి, మోవిన్ = అధరోష్ఠమునందు, తన్మధూచ్ఛిష్టమున్, తత్ = తమచేతనిరసింపఁబడినట్టి, మధు = తేనియకు, ఉచ్ఛిష్టమున్ = ఎంగిలిదైనమయిననును, "మధూచ్ఛిష్టంతుసిక్థకమ్" అని యమరము. కొన్న = గ్రహించిన, ఒచ్చెము = లోపమును, అఱఁజేసినన్ = పోవునట్లొనర్పఁగా, వారు = ఆస్త్రీలు, కృతంబెఱింగి = ఉపకారమెఱిఁగి, వసంతునకున్= మధుమాసమునకు, దోహదంబులన్ = దశవిధదోహదములచేత, "తరుగుల్మలతాదీనా మకాలే కుశలైః కృతం। పుష్పాద్యుత్పాదకం ద్రవ్యం దోహదంస్యాత్తుత

త్రిస్త్రియా" యని దోహదప్రకారము, ఊటన్ = విశ్రాంతిని, విస్పష్టముగాన్ = ప్రకటమగునట్లు, ఒనర్చిరి = చేసిరి.

తా. స్త్రీలు మున్ను దేనియద్రావుచున్న నదియొక్క పల్లవములయందలి మాధుర్యమును బుచ్చుకొన్నదిగానఁ దమయెంగిలి దిన్నదని తెలిసియు దానికి రోఁతపడక చలికి వెఱచి తమ పెదవులయందున్నట్టి తేనియ కెంగిలియగు మయినమును పెదవులకడ్డముగాఁ బెట్టుకొనియుండి వసంతఋతువు రాఁగా జలభయము గావున వారలా మయినము వదలుట నా చిన్నతనము నీ వసంతుఁడు పోఁగొట్టెనని యుపకారస్మృతి గలిగి యందులకుఁ బ్రత్యుపకారముగా వసంతుని కార్యమగు పుష్పింపఁ జేయుటను దామే దోహదములచేతఁ గనుపఱిచి యతనికి సూఱట గలుగఁ జేసిరని భావము. పరివృత్త్యలంకారము.

మ. మునుపే చంద్రబలంబు గల్గి మలయం ♦ పుం గమ్మ తేఁగాడ్పుఁ దే,
రున నేతెంచు లతాంత బాణునకు సూ ♦ ర్యుండున్ మహిం గ్రొత్తగా,
ననుకూలించెఁ గలంబున న్విరహిణీ ప్రా ♦ ణాపహారంబు సే,
యన యూహించు విధాత కృత్య మది యే ♦ లా మాను నెప్పట్టునన్ ?౧౦౧.

టీక. మునుపే = పూర్వమే, చంద్రబలముగల్గి = గ్రహచార రీతిచేతఁ జంద్రబలంబుగల్గి, (మన్మథునికిఁ జంద్రుఁడు స్నేహితుఁడనుట), మలయంపు = మలయపర్వతసంబంధియైనట్టియు, కమ్మ = పరిమళించునట్టి, తేఁగాడ్పు = మందమారుతమని యొడు, తేరునన్ = రథమందు, ఏతెంచు = వచ్చునట్టి, లతాంతబాణునకున్ = పుష్పాస్త్రుఁడగు మన్మథునికి, సూర్యుండున్ = సూర్యుఁడును, మహిన్ = భూమియందు, క్రొత్తగా = నూతనముగా, అనుకూలించెన్ = చాలివచ్చెను. "సూర్యుఁడు మేషమునఁ బ్రవేశించి వసంతఋతువును తేఁగా నది మన్మథునకు సాహాయ్యమయ్యెననియును చంద్రసూర్యు లనుకూలించి రనుట వలనను మహిననుట వలనను గాలదేశములు మన్మథునికి మేలిమినై యుండెననియును భావము". కలంబునన్ = దీర్ఘక్రోధము చేత, విరహిణీప్రాణాపహారంబు, విరహిణీ = పాంథస్త్రీలయొక్క, ప్రాణ = ప్రాణములయొక్క, అపహారంబు = అపహరణమును, చేయన = చేయుటకే, (అవధారణము), ఊహించు = సంకల్పించెడు, విధాత = బ్రహ్మయొక్క, కృత్యము = కార్యము, అది = ఆ క్రియ, ఎప్పట్టునన్ = ఎచ్చోటనైన, ఏలామానున్ = ఏమిటికివిరమించును, కొనసాగుననుట.

లా. సుగమము. అర్థాంతరన్యాసాలంకారము.

క. మలయ కటకోటజస్థిత, కలశీసుత సేవనిట్లు • గనెనో తదాశా,
నిలుఁడనఁగ నలస వృత్తిన, మెలఁగుచు నాపోశనించెమిహికా జలధిన్ ౧౦౨.

టీక. మలయ = మలయపర్వతముయొక్క, కటక = చఱియందలి, "కటకం వలయేసానౌ రాజధానీనితంబయోః" అని నిఘంటువు. ఉటజ = పర్ణశాలయందు, స్థిత = ఉండిన, కలశీసుత= కలశసంభవుఁడగు నగస్త్యమహామునియొక్క, సేవన్= శుశ్రూషచేత, తదాశానిలుఁడు, తత్ = ఆదక్షిణపుదియగు, ఆశా = దిశయందలి, అనిలుఁడు = వాయువు, ఇట్లు = ఈవక్ష్యమాణక్రమముగా, కనెనోయనఁగన్= పొందెనోయనునట్లు, అలసవృత్తిన, అలస = పాలుమాలిన, వృత్తిన = వర్తనముచేతనే, మెలఁగుచు = సంచరించుచు, మిహికాజలధిన్, మిహికా= మంచనియెడు, "ప్రాలెయంమిహికాచ" అని యమరము. జలధిన్ = సముద్రమును, ఆపోశనించెన్ = ఆపోశనముచేసెను.

తా. సముద్రపానముచేసియున్న యగస్త్యుఁడు నివసించెడు దక్షిణ దిశయందే మలయమారుత ముండును గావున నాయనయొద్ద శుశ్రూషచేసి తానును దన గురువు వలెనే మంచనియెడు కడలిని ద్రావెననియును మీ దెశితనివారణమ్మనియున్నది గావునఁ జైత్రమాసమందు మంచు ఇసికిపోయె ననియును మంద మారుతము వీచె ననియును భావము.

కం. మలయతరు న్యాయమ యిలఁ, గల తరువులకెల్లఁ జేయఁ గా • బొలసెఁజుమీ,
యలరించు నెపంబునఁబరి, మళితములుగ ననఁగనచటిమారుత మొలసెన్ ౧౦౩.

టీక. మలయతరు = మలయపర్వతమందలి చందనవృక్షములయొక్క, న్యాయమ = న్యాయమే, (పరిమళగుణమేయనుట), ఇలన్ = భూమియందు, కలతరువుల కెల్లన్ = ఉన్న సమస్తవృక్షములకును, చేయఁగాన్ = చేయుటకై, అలరించునెపంబునన్ = పుష్పించెడువ్యాజముచేత, పరిమళితములుగన్ = సంజాత పరిమళములగునట్లు, పొలసెఁజుమీ = వీచెనుజుమీ, అనఁగన్ = అనునట్లు, అచటిమారుతము = ఆమలయపర్వతమందలి వాయువు, ఒలసెన్ = పొలసెను.

తా. మలయ పర్వత మందలి చందన వృక్షములకుఁ గల పరిమళగుణమే భూమియందలి యెల్ల చెట్లకుఁ గలుగఁ జేసెడు నిమిత్తము వానిఁ బుష్పింపఁ జేసెడు వ్యాజముచేతఁ బరిమళము గలిగె ననిపించి సంచరించెనో యను నట్లు మలయ మారుతము వీచెను ఎల్ల తరువులు లెస్స పుష్పించి పరిమళించు చున్న వని భావము.

ఉ. కుప్పసము ల్వదల్చి రిటె • గుబ్బల నొత్తిలి హత్తి వేగుజా,
మిప్పలలర్చు గాడ్పుల క • నీశుఁ గ్రమంబున ఘర్మ శంకమై

నుప్పతిలంగ దోమతెర • లుప్పర మెత్తిరి దక్కి రూష్మకము,
ద్దెప్పరమయిన లోహశక • టీ ప్రకటీకరణంబుఁ గామినుల్. ౧౦౪.

టీ. కామినుల్ = వలపుగలయింతులు, కుప్పసములు = కూర్పాసములను, (అవికలననుట), వదల్చిరి = సడలించిరి, ఇఱిగుబ్బలన్ = క్రిక్కిఱిసిన గొప్పచన్నుల చేత. (వలిగుబ్బలనను పాఠమున శీతల స్తనములచేత ననియర్థము. కూష్మోదకం వటచ్ఛాయా తాంబూలం స్తనమండలం। శీతకాలేభవేదుష్ణ ముష్ణకాలేతుశీతల మని యున్నది), అధీశున్ = తమ ప్రియుని, ఒత్తిలి = ఒత్తిగిలి, హత్తి = ఆలింగనము చేసికొని, క్రమంబునన్ = కొంతసేపునకు, మైన్ = శరీరమందు, ఘర్మశంక = చెమ్మటపోసె ననుసందియము, ఉప్పతిలంగన్ = ఉత్పత్తికాఁగా, వేగుజాము = వేకువజామునందు, ఇప్పలలర్చు = ఇప్పచెట్లనుబుష్పింపఁజేసెడు, గాడ్పులకున్ = వాయువులకుఁగా, దోమతెరలు = మశకబాధానివృత్త్యర్థముగా వేసియున్న తెరబట్టలను, ఉప్పరమెత్తిరి = పైకెగయవేసిరి, ఊష్మకముల్ = కాఁకలు, దెప్పరమైనన్ = అతిశయముకాఁగా, లోహశకటీ = ఇనుపకుంపట్లయొక్క, ప్రకటీకరణంబున్ = బయల్పఱుచుటను, తక్కిరి = మానివేసిరి.

తా. కామినులు చలికాలమందువలె అవికలు దొడుగక యవి సడల్చి తామొత్తిగిలి నాథులం గౌఁగిలించుకొని తమ క్రిక్కిఱిసిన గుబ్బలు వారి ఱొమ్ములు దాఁకునట్లునిచికొని కొంతసేపునకు శరీరమందుఁ జెమట వోసె నని సంశయించి ప్రభాత సమయమందు నిప్ప పూల విప్పఁ జేసెడు వాయువులు మెల్లన వీచుచుండఁగా మంచముల దోమతెరలు పైకెగయ నెత్తిరి గాని తొల్లింటి యట్లయిననుప కుంపటులు గదలింప రైరని భావము. స్వభావోక్త్యలంకారము.

మ. అరుణాంశుండు హిమర్తువన్ రజని డీ • లై క్రుంకి పుష్పర్తువా,
సర కల్యోదితుఁ డౌచు నున్న యిటుల • న్న్యాయమాకుచాలేప సం,
కరసాంద్రాగ్ని శిఖారుణప్రభఁ గొనన్ • గాకున్నఁ గాలజ్ఞప,
త్ర రుతం బెట్లు చెలంగు సూనకుపిత • స్త్రీ కర్ణ దంభోళియై. ౧౦౫.

టీక. అరుణాంశుండు = అరుణకిరణుండగు సూర్యుఁడు, హిమర్తువన్ = హేమంత ఋతువనియెడు, రజనిన్ = రాత్రియందు, డీలై = దుర్బలుఁడై, క్రుంకి = అస్తమించి, "శ్లో. ఉపచితేషు పరేష్వసమర్థతాం వ్రజతి కాలవశా ద్బలవా నపి। తపసి మందగభస్తి రభీశుమా న్నహి మహాహి మహానికరోభవత్" అన్నట్లు హేమంతర్తువునందు సూర్యుఁడు బలహీనుండనియును రాత్రియందు బలహీనుండై యస్తమించి యునియును భావము. పుష్పర్తు = వసంతర్తువనెడి, వాసర = దినముయొక్క, కల్య=

ప్రాతఃకాలమందు, "ప్రత్యూషోహర్ముఖంకల్యమ్" అనియమరము, ఉదితుఁడౌచుక్ = ఉదయించుచు, మున్నయిడుటక్ = మునుపునిచియుండుటచేత, శ్యామాకుచాలేప, శ్యామా = చామలయొక్క, కుచ=గుబ్బలయందలి, ఆలేప = కలపముతోడను, సంకర = కూడియున్న, సాంద్ర= దట్టమగు, అగ్ని శిఖ = కుంకుమపువ్వనెడియగ్నిజ్వాలయందలి, అరుణప్రభక్ = ఎఱ్ఱనగుతనకాంతిని, కొనక్ = మరలగ్రహించెను. "కామినీస్తనభర గిరిదుర్గసీమ్ని నిర్భయ నిలీన నిదాఘ ధార" అన్నట్లు స్త్రీల కుచములయందుఁ జలికాలమున నగ్నిదాఁగుట ప్రసిద్ధము. సూర్యుడస్తమించు నప్పుడు దన తేజ మగ్నిలోనునుచు. "దినాంతే నిహితం తేజ స్సవిత్రే వహుతాశన" అన్నట్లు ప్రసిద్ధము. మఱియు "కంకుమేగ్నిశిఖంమతమ్" అను నిఘంటువుచేత నగ్నిశిఖ యను నామముగల కుంకుమ పువ్వు స్త్రీలు కుచములయందు హేమంత సమయమం దలఁది కొని యుండిరి గనుక నా కుంకుమ పువ్వు నందలి యరుణ కాంతి యనుట. హిమర్తు వను రాత్రి చని వసంతర్తు వను మఱునాఁటి ప్రభాతము వచ్చెననుట. కాకున్నక్ = అట్టురాకున్న, కాలజ్ఞపత్త్రి = కుక్కుటములయొక్క, రుతంబు = నాదము, మానకుపితస్త్రీ = నాథునితప్పునఁ గోపించియున్న స్త్రీలయొక్క, కర్ణ=చెవులకు, దంభోళియై = వజ్రాయుధమువలెఁ గఠోరమై, ఎట్లుచెలంగుక్ = ఏభంగి విజృంభించును, కాలజ్ఞపత్త్రయనఁగాఁ గాలం వసంత కాలం జానాతి వేత్తీతికాలజ్ఞ అను వ్యుత్పత్తిచేతఁగోకిలము. "కాలజ్ఞాపికకుక్కుటౌ" అని శాశ్వత నిఘంటువు నున్నది గనుక "వసంతకాలేసంప్రాప్తేకాకఃకాకఃపికఃపికః" అని యన్నట్లు కోయిలలు గూసె నను టయుఁ దెల్లవాఱు జామునఁ గోడికూసినఁ బోల యలుకఁ బూనియున్న పొలఁతులకు భయ మగుననుటయును వసంతర్తువునందుఁ గోయిల కూయఁగానే మానకుపితురాలగు స్త్రీకి విరహము గలుగుననుట.

తా. సూర్యుఁడు చలికాలము వదలి వసంతకాలమందు లెస్స ప్రకాశించెఁ గావున నా హేమంతర్తు వతనికి రాత్రిప్రాయ మై యుండె ననియు నప్పు డతని కరుణ కాంతి హిమప్రచ్ఛన్నమై యుండు ననియు వసంతర్తువు ప్రాంతఃకాలము వలె నుండె ననియు నప్పుడు స్త్రీలు స్తనములయందుఁ గుంకుమ పువ్వులుదుకొనుట మానిరి గావున నది సూర్యసంబంధియగు నరుణకాంతియై యుండి యా స్త్రీల స్తనములయందలి యగ్నికి నొప్పగింపఁబడి మరల గ్రహియింపఁబడి నట్లుండెననియును నా వసంతర్తువు సూర్యోదయకాలము గానపట్ల కాలజ్ఞములగు కోయిలలను కోళ్లకూఁతలేల వినవచ్చు ననియు నవి విని మానకుపితలగు యువతులు భయంపడుటకుఁ గతంబేమి యనియు ను భావము. అనుమ నానుప్రాణిత రూపకాలంకారము.

తే. మృగమదాలేపమును మాని ♦ యగరుకలనఁ,
జన్నుఁగవ మీఁదికొప్పిరి ♦ బన్నసరము,
లొంటి కురువేరు పోఁచకుఁ ♦ గంటగింప,
రైరి తుటిమెడు సరపువ్వు ♦ లం దతివలు. ౧౦౬.

టీక. అతివలు = స్త్రీలు, మృగమదాలేపమును = కస్తూరి యలఁదుకొనుటను, అగరుకలనన్ = అగరుగంధమలందుకొనుటను, మానిరి = విసర్జించిరి, చన్నుఁగవమీఁదికిన్ = కుచద్వయోపరిభాగమునకు, బన్నసరములు = ముత్యాలహారములు, ఒప్పిరి=సమ్మతించిరి, తుటిమెడు = తమకురులయందుఁజెక్కెడు, సరపువ్వులందున్= దండలుగట్టిన పుష్పములయందు, ఒంటికురువేరు పోఁచకున్ = ఒక్కఁడైనలామజ్జకలేశమునకు, కంటగింపరైరి=ఏవగింపరైరి, ఏవగింపక ధరించిరనుట ఇవి యన్నియు సమశీతోష్ణములగు నుపచారములు.

తా. సుగమము. స్వభావోక్త్యలంకారము.

చ. చిలువసుధారసాధరల ♦ చెల్వపుఁ బుక్కిటితావిఁ దీయనై,
వలపులనంపు తత్ప్రియుల ♦ వక్త్రవిషజ్వలనోష్మ నొట్రనై,
వెలువడి తద్గుణద్వితయ ♦ వేధఁ జమీ యన భ్రామను పట్టుటల్,
తలిరులు పుట్టుటల్ గలుగఁ ♦ దార్కొనెఁ జందన శైలవాతముల్ ౧౦౭.

టీక. చందనశైలవాతముల్=మలయమారుతములు, చిలువసుధారసాధరల= అమృతమురసమువంటి యధరోష్ఠములుగల నాగకన్యకలయొక్క, చెల్వపు= సుందరమగు, పుక్కిటితావిన్ = పుక్కిళ్లపరిమళముచేత, తీయనై=మధురమై, వలపులనంపు= ప్రేమవశ్యలయిన, తత్ప్రియుల = ఆయాఁడుపాములమగలగుమగపాములయొక్క, వక్త్రవిష = పుక్కిళ్లవిషమనియెడు, జ్వలన = అగ్నియొక్క, ఊష్మన్ = వేఁడిమిచేత, ఒట్రనై = తీక్ష్ణమై, వెలువడి = బయలుదేరి, తత్ = ఆ, గుణ = మాధుర్యతీక్ష్ణత్వగుణములయొక్క, ద్వితయ = ద్వంద్వమువలననయిన, వేధన్ = వేధచేత, చమీ= చమూర్చ, అనన్ = అనఁగా, భ్రామనుపట్టుటల్ = ఆవాయువులుసోఁకుటవలనశరీరములు నిశ్చేష్టితములగుటయు, ఆకులురాలి భ్రమఁకులుమాత్రమగపడుచుండుటయు, (ఇదివిషాగ్నిగుణము), తలిరులుపుట్టుటల్ = చెట్లయందుఁజిగుళ్లుదయించుటయును, (ఇది యధర మాధుర్య గుణము), కలుగన్=కలుగునట్లుగా, తార్కొనెన్=విసరెను.

తా. మలయమారుతము వచ్చునప్పు డాఁడుఁ బాములు మగ పాములు పర్వతము మీఁద నీ వాయువును భక్షించుటచేత రెండు గుణములు గలిగి యాఁడుఁ బాముల పానముచేతఁ జిగుళ్లుపుట్టుటయును మగ పాముల పానముచేత భ్రమాన్వేట్టుట

ద్యాను గలుగు నని భావము. (ఈ పద్యము నందు వ్యుత్క్రమము దోషావహంబు గాదు "ఊర్ధ్వపుండ్రం త్రిపుండంవా మధ్యచ్ఛిద్రంతు ధారయేత్ । శ్రుణు షణ్ముఖ తన్మధ్యే ఉమయాహం శ్రియాహరిః" అని యున్నది.

మ. మదనస్యందనతా స్వవృత్తిఁ దెలిపెం • బాటీర భూభృద్వల,
న్మృదువాతం బతిపక్వ పాదప లతా • వృంతావళీ మూలరం,
ధ్రదళ త్పంకజ కర్ణికాగణ హరి • ద్రా భంగభాభాసుర,
చ్ఛదన చ్ఛద్మ వివర్తికాంచన కన • చ్చక్రచ్ఛటాచ్ఛీత్కృతిన్. ౧౦౭.

టీక. పాటీరభూభృత్ = మలయపర్వతమందు, వలత్ = సుడియుచున్న, మృదు వాతంబు = మందమారుతము, అతిపక్వ = మిగులఁబండిన, పాదప = వృక్షముల యొక్కయు, లతా = తీఁగెలయొక్కయు, వృంత = పూఁదొడిమలయొక్క, (వృంతం ప్రసవబంధనమని యమరము), ఆవళీ = పఙ్క్తులయొక్క, మూలరంధ్ర = మొదళ్ల గండ్లనుండి, దళత్ = విరియఁబడుచున్న, పంకజకర్ణికా = తామరమిద్దెలయొక్క, గణ = సమూహముయొక్కయు, హరిద్రాభంగ = పసపుఁజిందరలయొక్కయు, భా = కాంతివంటికాంతిచేత, భాసుర = ప్రకాశించుచున్న, ఛదన = ఆకులనెడు, ఛద్మ = వ్యాజ్యముచేత, వివర్తి = గిఱగిఱగిఱిగొనుచున్న, కాంచన = బంగారుచేత, కనత్ = ప్రకాశించుచున్న, చక్ర = బండికండ్లయొక్క, ఛటా = గుంపుయొక్క, శీత్కృతిన్ = శీత్కారముచేత, మదన = మన్మథునికి, స్యందనతా = రథమగుటయందు, స్వవృత్తిన్ = తనవ్యాపారమును, తెలిపెన్ = ఎఱుకపఱిచెను.

తా. చెట్లమీఁదనుండియుఁ దీఁగెలమీఁదనుండియుఁ బండుటాకులు దొడిమ లూడి తామర మిద్దెలవలెను బసపుఁజిందరలవలెను బచ్చనై కొంచెము ధ్వనితో గిఱ గిఱఁదిరుగుచుండెననియు నవి యట్లగుట వాయువు మన్మథునికి రథమగుటకు గుఱుతుగా నాబండి బంగారు చక్రములు దిరుగుచున్నవో యన్నట్లుండె నని భావము. "మందానిలస్యందనః" అనిదక్షిణవాయువునకు మన్మథరథత్వముప్రసిద్ధము. కైతవాపహ్నవాలంకారము.

వ. తదనంతరంబు. ౧౦౮.

సీ. ప్రాక్పవశా రక్తరాం • కవ మరణ్యానిమ ధూది తారుణిమ వ • ల్యురగ రసని,
కోద్గతి తరు గరుత్మ • ద్గరుద్గణ ముద్భ వాహోగ్యజీమూత • రోహితంబు,
నవ మిళింద ప్రాహ • ణికనిమంత్రణ శోభ నాక్షత ప్రతతివా • యస విభక్త,
పరభృతౌఘప్రాంత • ప్రత్త్రిక మాలతీ త్రాసామయావహా గ్రక్షతజము,

గరుడ పక్షుల తెక్కలలో యనునట్లును, పొదలనియెడు కల్పిత మేఘములకుఁ గొఱ వములను పగిదిని, తుమ్మెదలను నభ్యాగతులనుఁ గ్రొత్తగఁ బిలుచుట కై యునిచిన శోభనాక్షతముల చందంబునను, కాకులఁతోడఁ గూడియుండి యస్పష్టపు వెలుపడ బోయెడు కోకిలముల కోదవిన విభాగ పత్రికల యందంబునను, జాజిచెట్లకు భయ రోగమును గల్పించు క్రొత్తనెత్తుటి భంగిని క్రీడోద్యాన వనదేవతలు నెమ్మొనఁ బూసికొన్న కుంకుమంపు మైపూఁత భాతిని, మలయ మారుతం బను సానతో నొఱ యంబడి రాలిన యాకులచేతఁ గానఁబడిన మెండగు దీప్తి గలిగిన గొప్ప రత్నశలా కలజోకం దగి చిగురాకు మొనసి కనఁబడియె నని భావము.

తే. శరనిధుల మాఘ్యములు దీఱె • మరున కట్టి,
యదరున జయింతు మని కదా • యద్దినాళిఁ,
గ్రూరతిథిఁ గృష్ణరజనిఁ ద • ద్వైరిఁ గనియుఁ,
బెద్ద లివురాకుఁ బట్టైన • పెట్టువడిరి. ౧౧౩

టీక. మరునకున్ = స్మరునికి, శరనిధులన్ = అంపదొనలయందు, మాఘ్య ములు = మొల్లపువ్వులనియెడు బాణములు, దీఱెన్ = సమసిపోయెను, (వసంతర్తువు లో మొల్లలుపూయవనుట), అట్టియదరునన్=ఆసంకటమునందు, (బాణములేనివేళ యనుట), పెద్దలు = వృద్ధులు, (యోగులనుట), జయింతుము = మన్మథునిఁ గెల్తుము, అనికదా = అనియేకాదా, అద్దినాళిన్ = ఆమాఘదినపరంపరయందు, క్రూరతిథిన్ = క్రూరతిథియైన, కృష్ణరజనిన్ = బహుళపక్ష చతుర్దశి రాత్రియందు, (శివరాత్రినాఁడ నుట), తద్వైరిన్ = ఆమన్మథ వైరియగుశివుని, కనియున్ = చూచియు, (సేవించి యనుట), ఇవురాకుఁబట్టైన = చిగురాకనియెడు పట్టాకత్తిచేతనే, పెట్టువడిరి = దెబ్బఁదినిరి.

తా. పెద్దలగువారు మన్మథునికి మొల్లములుకులు లేని తఱి వేచి యాయిఱు కటమున నతని గెల్తుమని తలంచి యతని విరోధియగు శివునిఁ గ్రూరతిథియగు చీఁకటి రాత్రియందుఁ జూచియుఁ బ్రయోజనము లేక పోవుటయేకాక యీ మన్మథుఁడు తనకు బాణములు లేకుండినను జిగురాకనియెడు పట్టాకత్తిచేత నే వసంతర్తు ప్రా రంభ కాలమునందు వారలఁ బ్రహరించి జయము గొనె నని భావము.

తే. అవని నపుడు సమోదితుం • డైన యట్టి,
మరునకున్ గుసుమర్తు వ • న్మంత్రసాని,
బొడ్డుగోసిన కొడవలిఁ • బోలె విరహి,
మారకం బయ్యెఁ గింశుక • కోరకంబు. ౧౧౪

టీక. అవనిన్ = భూమియందు, అపుడు= తత్కాలమందు, నవోదితుండైన= నూతనముగానుదయించిన, (అభ్యుదయ మొందినయనుట), అట్టి= ఆప్రసిద్ధుండగు, మరునకున్ = స్మరునకు, కుసుమర్తునన్ = వసంతర్తువనియెడు, మంత్రసాని= సుఖప్రసవము చేయించునట్టి స్త్రీ, బొడ్డుగోసిన = నాభినాళచ్ఛేదముం జేసిన, కోతవలెం బోలెన్ = లవిత్రమువలెనే, కింశుకకోరకంబు = మోదుగుమొగ్గ, విరహి = వియోగులకు, దారకంబయ్యె = ఛేదకమాయెను.

తా. వసంతర్తువునందు మోదుగులు పుష్పింపఁగా నామొగ్గ వంకరగా నెఱ్ఱనై యుండుట వలన నప్పుడు పుట్టిన మన్మథుని బొడ్డు గోసిన నెత్తురుతోడి కొడవటి లిక్కి వలె నుండెననియు నది విరహులకు ఛేదం జేయునదిగానె యుండె నని భావము.

చ. కుసుమములెల్లఁ గామినుల ♦ కొప్పుల నుండ నటుండ లేమి సి,
గ్గెసఁగఁగ వంగి నట్లు జని ♦ యించె ననల్ మఱి వంగి జీవితే,
శ సమితి గొమ్మలం గరఁచి ♦ చల్లఁ గుచ క్షణి కాంగరాగ పూ,
టసదె యటంచు రాగిలిన ♦ యట్టులు రాగిలి విచ్చె గింశుకిన్. ౧౧౩.

టీక. కుసుమములెల్లన్ = సమస్తపుష్పములును, కామినుల = యువతుల యొక్క, కొప్పులన్= ధమ్మిల్లములయందు, ఉండన్=ధరింపఁబడియుండఁగా, అటుండ లేమిన్ = తామట్లుండలేకపోవుట చేత, (నిర్గంధనులగుటచేతననుట), సిగ్గెసఁగఁగన్ = లజ్జయతిశయింపఁగా, వంగినట్లు = నమ్రములైనటువలె, ననల్=మొగ్గలు, జనియించెన్ = పుట్టెను, మఱి=పిమ్మట, వంగి = అట్లేవంగియుండి, జీవితేశసమితి, జీవితేశ = ఆ స్త్రీలప్రాణనాథులయొక్క, సమితి = సమూహము, కరఁచి = రసము దీసి, కొమ్మలన్ = చిమ్మనగ్రోవులచేత, చల్లన్ = చిమ్ముచుండఁగా, (మోదుగు పూమొగ్గల రసముదీసి వసంతములాడుమరనుట), కుచ= స్తనములయందు, క్షణిక= క్షణమాత్రముండెడు, అంగరాగపూట = మైఁపూఁతయగుట, అసదె = స్వల్పమా, (అన్ని పుష్పములవలెఁ గొప్పులయందుండుటకంటెఁ జన్నులపైఁ జేరుట సామాన్యము గాదనుట), అటంచున్ = అనుకొని, రాగిలినయట్టులు = రంజిల్లినభంగి, రాగిలి = రక్తిగలిగి, కింశుకిన్=మోదుగుచెట్టునందు, విచ్చెన్=వికసించెను, ఎఱ్ఱనై మోదుగఁ బువ్వులు వికసిల్లెననుట.

తా. సుగమము.

ఉ. పైపుణిఁ జందనాద్రి గహ ♦ నద్రుమ సౌరభ నీడఁ దాద్రుప,
గ్లిపరిలబ్ధ మౌక్తికమ ♦ ణి ప్రకరంబులు దోఁచ దక్షిణా,

శాపవనుండు చల్లు వెదఁ • జల్ల జనించెన కాక వీనికే,
లా పొడమంగ నప్పొలప • మప్పుడు నా వనిఁ దోఁచెఁ గ్రొన్ననల్. ౧౧౮.

టీక. దక్షిణాశాపవనుండు = దక్షిణదిగ్వాయువు, నైపుణిఁ = నేర్పుచేత, తామ్రపర్ణి = తామ్రపర్ణినదియందు, పరిలబ్ధ = గ్రహింపఁబడిన, మౌక్తికమణి = ముక్తామణులయొక్క, ప్రకరంబులు = సమూహములును, చందనాద్రి = మలయపర్వతముయొక్క, గహన = అరణ్యమందలి, ద్రుమ = చందనవృక్షములయొక్క, సౌరభ = పరిమళముయొక్క, వీచిఁ = తరంగమందు, తోఁచి = తోఁగఁజేసి, (తడిపియనుట), చల్లువెదఁ = చల్లెడు విధమున, (లోకమందు గొర్రు చేతఁ జల్లు వెదయని రెండువిధములు వానిలో వరుసగా నేర్పడియుండునది గొఱ్ఱెవెదయును అంతట వ్యాపించియుండునది చల్లువెదయును గనుక చల్లువెదయన్నాఁడు), చల్లఁ = విత్తనము వేయఁగా, జనించెనకాక = మొలిచెనేకాని, అప్పుడు = ఆవసంతకాలమందు, వీనికిఁ = ఈమొగ్గలకు, అప్పొలపము = ఆపోలుపు, (ముత్తెములవంటి రూపమును బరిమళమనుట), పొడమంగఁ = పుట్టుటకు, ఏలా = ఏమిపని, నాఁ = అనునట్లు, క్రొన్ననల్ = క్రొత్తమొగ్గలు, వనిఁ = వనములయందు, (జాత్యేకవచనము), తోఁచెఁ = కనుపడెను.

తా. వనములయందు ముత్తెములవంటి రూపము గలిగి పరిమళముతోడ మొగ్గలు పుట్టఁగా మలయమారుతము తామ్రపర్ణీనదిలోని ముత్తెములేరి యవి మలయవృక్ష పరిమళ లహరీతరంగములో నేర్పుగా ముంచి యవియే వెదఁజెట్టి చల్లిన కారణముచేత మొలకలెత్తినవేకాని లేనియెడ నీచెట్లమీఁది మొగ్గల కా శృంగార మేల వచ్చునని భావము. ఇట్లు చెప్పుటచేత మలయమారుత మొకకర్షకుఁడని ధ్వనించుచున్నది.

కం. వీరుద్ద్రుమిథున మేళన, కై రతిపతి యేయ దుస్సి • హరితద్యుతిఁ బై,
నారెగయఁ బొటమరించిన, నారసముల మొనలనంగ • ననలవిమించెఁ ౧౧౯.

టీక. వీరుత్ = లతలయొక్కయు, ద్రు = వృక్షములయొక్కయు, మిథున = ద్వంద్వముయొక్క, మేళనకై = సంపర్కముకొఱకు, రతిపతి = మన్మథుఁడు, ఏయఁ = బాణమునేయఁగా, దుస్సి = నాటియావలనుండియావలికిఁబోయి, హరితద్యుతిఁ = పచ్చనికాంతిచేత, పైఁ = ఉపరిభాగమందు, నారెగయఁ = నారయెగసిపోవునట్లు, పొటమరించిన = అంకురించిన, నారసముల = నారాచములనియెడు బాణములయొక్క, మొనలనంగఁ = అగ్రములోయనునట్లు, ననలవి = ఆమొగ్గలు, (వ్యస్తవిశేషణము), మించెఁ = అతిశయించెను.

తా. లతావృక్షసంపర్కమునకై మన్మథుఁడా లతలను వృక్షములను దన నా

రసములచే నేయఁగా నవి యాలతావృక్షశరీలములలోఁ దూఱి వెన్నులయందు మొనలఁ జూపుచున్నవో యన్నట్లు మొగ్గలు బలిసె నని భావము.

చ. తనయుదరంబునం బొడమి ♦ తామ్రరుచిచ్ఛట లుల్లసిల్లఁ గో,
ల్కొను ధరణీజ సంతతికిఁ ♦ గోరక దంతము లించుకంత ని,
క్కినయది యాదిగాఁగఁ జెల ♦ గెన్ వనలక్ష్మి గడుం జెలంగఁగాఁ,
జనుఁ బ్రియుఁడైన మాధవుని ♦ సంగతి మీఁదటఁ జాలఁ గల్గుటన్ ॥౧౧౬॥

టీక. తనయుదరంబునన్ = తనగర్భమందు, పొడమి = పుట్టి, తామ్రరుచి = అరుణకాంతులయొక్క, ఛటలు = సమూహములు, ఉల్లసిల్లన్ = ప్రకాశింపఁగా, కోల్కొను = వృద్ధిఁబొందుచున్న, (శిశువులుపుట్టినప్పుడెఱ్ఱగానుండుటయు నానాఁటికి వృద్ధియగుటయుఁబ్రసిద్ధము), ధరణీజ = వృక్షములనియెడు, సంతతికిన్ = సంతానమునకు, కోరక = మొగ్గలనియెడు, దంతములు = పల్లులు, ఇంచుకంత = కొంచెము, నిక్కినయది = అంకురించినది, ఆదిగాఁగన్ = మొదలుకొని, వనలక్ష్మి=వనలక్ష్మియనియెడు పొలఁతి, కడున్ = మిక్కిలియు, చెలఁగెన్ = సంతోషించెన్, ప్రియుఁడైన = ఇష్టుఁడైన, మాధవుని = వైశాఖమాసమనియెడు పురుషునియొక్క, సంగతి = సాంగత్యమనియెడుసంపర్కము, మీఁదటన్=భావికాలమందు, చాలన్= చాలునట్లు, కల్గుటన్ = కల్గునను హేతువుచేతను, చెలంగఁగాఁజనన్ = సంతోషింపఁదగును.

తా. లోకమందలి స్త్రీలు దమ సంతానమునకుఁ బండ్లు మొలిచేదనుక బాలింతలై పురుషసాంగత్యము లేకుండి పండ్లు మొలవఁగానే పురుషులు దమతో సంభోగింతురని సంతోషపడినట్లుగానే వనలక్ష్మియు వృక్షములు చిగిర్చి వృద్ధియై మొగ్గలు పొడమిన కారణంబున నావృక్షములు బిడ్డలనియును మొగ్గలు వారిపండ్లనియును వైశాఖమాసము తన పురుషుఁడనియును ప్రకాశము సంతోషమనియును నన్నట్లు చెలువయ్యెనని భావము. వనలక్ష్మియనియు మాధవుని సంగతియనియుఁ జెప్పుట వలన లక్ష్మికి మాధవ సాంగత్యము యుక్తమే యని భావము. బాలింతలకు బిడ్డలకు దంతములు మొలచునంత వఱకుఁ బురుష సంపర్కము గూడదని స్మృతులయందుఁ బ్రసిద్ధము.

సీ. మును నన ల్దమిఁ బట్టి♦ముంగాళ్ల ముక్కు జో డనలఁ జీలిచి పస్పు♦రొక్కనినవిడిచి,
పరువంపు విరి గొంపు♦లరసి చాలై త్రోవఁ బెట్టి యీఝారము లీఁగు♦పిండుఁదగిలి,
క్రొవ్విరి దోలుతనొ♦క్కఁడు గని యది ప్రాలు తటె దాని నిలఁబడఁ♦దాఁకి గ్రోలి,
యాకు రాలుపు గండ్ల♦నానెడు నాస నిం తడుగూడి బం కంటి యంగలార్చి,

యెట్టకేలకు నొకఁడబ్బఁ • బొట్టనిండ, గ్రోలియదిగాలిఁగదలినఁ, గూలునగుచు,
బ్రమదవనపాలికలువేడ్క • బట్టనగుచు, మధుదినాదిక్షుధాభ్రమ • న్మధుపచయము.

టీక. మధుదినాది = వసంతర్తుప్రథమదినమందు, క్షుధా = ఆఁకలిచేత, భ్రమత్ = క్రుమ్మరుచున్న, మధుపచయము = తేఁటిగుంపు, మును = మొదలను, ననల్ = మొగ్గలను, తమిన్ = మోహముచేత, ముంగాళ్లన్ = అగ్రాంఘ్రులచేత, పట్టి = అవలంబించి, ముక్కుజోడనలన్ = నాసికాబిలద్వయములచేతను, పిలిచి = దూఁటికొని, పసర్పోనినన్ = పసరువాసనరాఁగా, విడిచి = వానివిసర్జించి, పరువంపు = పక్వములగు, విరి = పూలుగల, గొంచులు = మూలమూలలు, అరసి = వెదకి, చాలై = గుంపుగొని, త్రోవఁబెట్టి = పోవుటకు మార్గముఁబెట్టి, ఈరనుల్ఁగు = పొదలుదూతేదు, పిండున్ = సమూహమును, తగిలి = వెనుముట్టి, తొలుతన్ = ప్రథమమందు, క్రొవ్విరిన్ = క్రొత్తపువ్వును, ఒక్కఁడు = ఒకభృంగము, కని = చూచి, అదివ్రాలుతఱిన్ = అదిముసరికొనునప్పుడు, దానిన్ = ఆభృంగమును, ఇలఁబడన్ = భూమియందుఁబడునట్లు, తాఁకి = తగిలి, క్రోలి = కరండముఁబానముసేసి, ఆకురాలుపుగండ్లన్ = ఆకులురాలిన తొడిమలమొదళ్లయందు, ఆనెడునాసన్ = పానముసేసెడునాశచేత, ఇంత = కొంచెము, అడుగూఁది = పాదమునిలిపి, బంక = ఆవృంతమూలనిర్యాసము, అంటి = స్పృశించికొని, అంగలార్చి = కాలువెలుపలికిరాక ఖేదపడి, ఎట్టకేలకున్ = కొంతసేపునకు, ఒకఁడబ్బన్ = ఒకపుష్పముదొరకఁగా, పొట్టనిండన్ = కడుపునిండునట్లు, క్రోలి = మకరందపానముసేసి, అది = ఆపుష్పము, గాలిన్ = వాయువుచేత, కదలినన్ = చలింపఁగా, నగుచున్ = నవ్వుచును, ప్రమదవనపాలికలు = శృంగారవనములనుబరిపాలించెడు పొలఁతులు, పట్టన్ = పట్టుకొనుటకు, అగుచున్ = దుర్బలమై వశపడుచు, కూలున్ = క్రిందఁబడును.

తా. సుగమము.

సీ. మరుదూఢ మలయాహి • గరధూమ్యలనుగళ న్మనసిజ రథపదాఁ • జన కళికలు,
త్రాస భావచ్ఛిశిర • త్యక్త బాష్పను ల్పిక పంచమస్వరో • ద్భేద వీణ,
లధ్వాగ మస్మరం • దాసార జంబువు ల్లిందోళ సాంద్రాస్ను • కుందరోచు,
లభిసార కాంశుకో • ద్వ్యన్న్లిల గుళికలు జాత్య సుల్లసనాత్త • శాపతతులు,
చైత్ర సంజీవ నౌషధ • జాతచేత, నాత్మజని హేతు తరుపున • ర్యౌవతి,
కరవిఘాతహసంతికేం • గాలచయము, లలుల పద్మ్యాలు వనులన • ర్తాడఁదొడఁగె.

టీక. మరుదూఢ, మరుత్ = వాయువుచేత, ఊఢ = వహింపఁబడిన, మలయ = మలయపర్వతమందలి, అహి = సర్పముయొక్క, గర = విషముయొక్క, ధూమ

లు= ధూమసమూహములైనట్టియు, (వాయువశముచేతనే పొగలెగయుననియు విష ధూమములు మిగుల నల్లనై యుండుననియు భావము), అనుగళత్ = విడువకజాఱు చున్న, (ఇది యంజనకళికలకు విశేషణము), మనసిజ = మన్మథునియొక్క, రథపద= బండిచక్రములయందలి, అంజనకళికలు = కందెనముద్దలయినట్టియు, (వసంతర్తువు నందుఁ గ్రొత్తగా మరుఁడు వెడలెఁ గావునఁ దేరుచక్రముల కప్పుడు కందెనవేయఁ గా నాచక్రములు దిరుగునప్పు డా కందెనముద్దలు జాఱుననుట), త్రాస=భయము చేత, ధావత్ = పాఱిపోవుచున్న, శిశిర = శిశిరర్తువు చేత, త్యక్త = విడువఁబడిన, బాష్పముల్ = కన్నీళ్లైనట్టియు, (శిశిరర్తువు వెడలినప్పుడు దుఃఖించెననుట), పిక = కోయిలలయొక్క, పంచమస్వర = పంచమ స్వరముయొక్క, ఉద్భేద = పుట్టుటకు, వీణలు= కచ్ఛపివీణలైనట్టియు, "పికఃకూజతిపంచమ" అని నిఘంటువు. వీణయందు బంచమస్వరముండుటకు "శ్రుతిభ్యస్స్యుః స్వరాష్షడ్జ ఋషభ గాంధార మధ్యమాః। పంచమో ధైవతశ్చాథ నిషాద ఇతిసప్తధా। తేషాం సంజ్ఞా స్సరిగమ పధనీత్యపరా మతాః" అని సంగీతశాస్త్రము. అబ్ధాగమత్ = వర్షాకాలమువలె నాచరించుచు నున్న, మరంద = మకరందముయొక్క, ఆసార=ధారాసంపాతమునకు, జంబువుల్ = నేరేడుపండ్లైనట్టియు, (వర్షాకాలమందు నేరేళ్లుఫలించుననుట, అబ్దాగమమనఁ గా సంవత్సరాగమము, అబ్దాగమమే యబ్దాగమమని శ్లిష్టరూపకము), హిందోళ= ఆకాలమందుఁ బాడఁదగిన విష్ణుప్రియమైనహిందోళగానమునకు, సాక్షాత్=ప్రత్యక్ష మయిన, ముకుంద = కఱివేల్పుయొక్క, రోచులు = శరీరకాంతులయినట్టియు, "శిశి రస్య వసంతస్య సంజ్ఞా హిందోళరాగక" అని సంగీతశాస్త్ర ప్రసిద్ధము. గావున నప్పుడా రాగమునకు సంతోషించి ప్రసన్నుఁడైవచ్చెఁ గోవిందుఁ డని శరీరకాంతులవలె నుండెననుట, అభిసారికా ప్రియులకొఱకు సంకేత స్థానములను గూర్చి పోవుచుం డెడు స్త్రీలయొక్క, "కాంతార్థినీతుయాయాతి సంకేతం సాభిసారికా" అని యమరము. అంశుక = వస్త్రములకు, ఉద్యన్నీలగుళికలు = నవ్యోన్నైల్య సంపాదక ఘుటికా విశేషములు, (అభిసారికలు తమగోపనార్థమైనీలవస్త్రములుధరింతురనుట), జాతి=జాజులవలన, అనుల్లసన = ప్రకాశములేకుండుటఁబట్టి, ఆప్త= పొందఁబడిన, శాప = తిట్లయొక్క, తతులు = సమూహములైనట్టియు, వసంతర్తువందు జాజులు వికసిల్లవు గావున నవి వసంతునిఁ దిట్టఁగా నా శాపముచే ఘుట్లు వచ్చె ననుట, చైత్ర = చైత్రమాసమనియెడు, సంజీవనౌషధీ = సంజీవ నౌషధముచేత, జాత = ఉదయించిన, చేతన = చైతన్యముగల, ఆత్మ = తనయొక్క, జని = జన్మమునకు, హేతు = కారణములగు, తరు = వృక్షములనుగూర్చి, పునర్వ్యయ=మగిడిపోవుచున్న,

యువతి = ఉవిదలయొక్క, కర = హస్తములచేత, విధూత=పాఱఁజల్లఁబడిన, హసం తికా = కుంపట్లయందలి, ఇంగాల = బొగ్గులయొక్క, చయములు = సమూహము లైనట్టియు, "నిధూతామాంగారభరితహసంతికాయంత్రస్యచ" అనిభోజరాజన్నట్లు చలికాలమందు స్త్రీలు కుంపట్లెత్తియుండి వసంతర్తువు రాఁగానే చలిదీఱేఁ గావున నాకుంపట్లు పాఱఁ జల్లఁగా నందలి నల్లబొగ్గులకు వసంతర్తువనెడు సంజీవనౌష ధము దగిలి ప్రాణములువచ్చి తమ జన్మములకు హేతువులగు వృక్షములను గూర్చి మరలఁ బోవు చున్నట్లుండెననుట, అళికులపఙ్క్తులు= తుమ్మెదలగుంపులు, వనులన్ = వనములయందు, అట్టాడన్ = సంచరించుటకు, తొడఁగెన్ = ఉపక్రమించెను.

తా. సుగమము.

తే. ద్విజతఁ గాంచియు మధు సేవ ♦ విడువలేక,
జాతిఁ బాసిన తేంట్లని ♦ స్వనముఁ గూడు,
కొనుట నోయనఁ గోకిల ♦ స్వనము సెలఁగెఁ,
దనకు మఱి పంచమత్వంబు ♦ దప్పకుండ. ౧౧౯.

టీక. ద్విజతఁగాంచియు = విప్రత్వమును బొందియును, "దంతవిప్రాండజా ద్విజాః" అని నిఘంటువున్నదిగానఁ దుమ్మెదలు నండజము లగుటచేతఁ బక్షులయ్యె ననుట. మధుసేవన్ = మద్యపానమును, విడువలేక = విసర్జింపలేక, (మకరందపాన మనుటయు నిది కోకిలపర్యాయమైనప్పుడు ద్విజత్వమును వసంతర్తుసేవయనుట), జాతిన్ = తమద్విజజాతిని, పాసిన = విడిచిన, తేంట్లు = తుమ్మెదలయొక్క, నిస్వన మున్ = నాదమును, కూడుకొనుటనో = సంయోగించుటచేతనో, (తుమ్మెదలు మధుసేవవలనఁ గులభ్రష్టములయినవనియును, (జాతినిడిచెననుట), అనన్ = అను నట్లు, కోకిలస్వనము = పికస్వరము, తనకు, మఱి = పిమ్మట, పంచమత్వంబు= పంచ మస్వరత్వమును, ఐదవ మహాపాతకుఁడగుటయును, "పికఃకూజతిపంచమమ్" అన్న ట్లు పంచమస్వరత్వమనుటయుఁ "దత్సంయోగీచ పంచమః" యను నట్లయిదవవాఁడ గుటయు ననుట, తప్పకుండన్=తప్పిపోకుండునట్లు, చెలఁగెన్=ఒప్పెను, (కోకిలము లకుఁ బంచమస్వరము స్ఫుటముగావచ్చెననుట).

తా. సుగమము.

ఉ. పూచిన మావులం దవిలి ♦ పూవిలుఁబోదున కమ్మ మాధవుం,
డేచినశంక నాతఁ డవి ♦ యే కొని యే పథికావళీజయ,
శ్రీచణుఁ డయ్యె నట్టిద య ♦ కృత్యముచే నగు నట్టి పీడయుం,
గోచర మౌనె దైవ మను ♦ కూలము నై పరు మేలు దీఱినన్. ౧౨౦.

టీక. మాధవుండు=వసంతుఁడు, పూచిన = శరీరముపూచిన, మావులన్ = గుఱ్ఱములను, తవిలి = అంటి, ఏచిన = అతిశయించిన, శంకన్ = అనర్థశంకచేత, పూవిలుజోదునకున్ = కుసుమకార్ముకునకు, అమ్మెన్ = విక్రయించెను, "గుఱ్ఱములకు శరీరములు పూచెనేని యవి కీడుసేయుట యశ్వశాస్త్రప్రసిద్ధ మనుటయుఁ బూచిన మామిళ్లనుటయును", అవియేకానిమె = ఆ పూచిన మావులనేకొనియే, అతనుఁడు = ఆమన్మథుఁడు, పథికావళీ = విరహిసమూహముయొక్క, జయశ్రీ=జయసంపదయందు, చణుఁడయ్యెన్ = సమర్థుఁడయ్యెను, అట్టిద = అట్టిదేకదా, ఆ కృత్యముదేన్ = మహాకార్యముచేత, అగునట్టి = కలుగునట్టి, పీడయున్ = ఆర్తియును, దైవమనుకూలమైన = దైవమనుకూలించియుండినయెడ, పరు=శత్రువుయొక్క, మేలు=మంచికాలము, తీఱినన్ = సమాప్తికాఁగా, గోచరమౌనె = తనకుఁ గనుపడునా, (మావులనమ్మినవాఁడు మాధవుఁడుగనుక దైవమనుకూలమైయనిచెప్పెను, దైవానుకూల్యమున్నప్పుడు జయమెవ్విధముననైనఁ గలుగుననుట.)

తా. వసంతర్తువునందు మామిడిచెట్లు లెస్సగాఁ బూచెననియును మన్మథుఁడా పువ్వులచేతఁ బథికులను జయించె నని భావము. కీడు చేయవలసిన పూచిన మావులు జయప్రదము లయినట్లు చెప్పుట వలన వ్యాఘాతాలంకారము, "స్యాద్వ్యాఘాతోऽన్యథాకారి తథాకారి క్రియేత చేత్", అని దానిలక్షణము. ఆవ్యాఘాతాలంకారము మావు లను తావున శ్లేషమూలకాభేదాతిశయోక్తిచేత ననుప్రాణితము గనుక నారెంటికిని సంకరము దీని కథాంతరన్యాసాలంకారముతో సంసృష్టి.

మ. ఉరుశక్తి న్మధుమాస దోగ్ధ పిదుకన్ • జ్యోత్స్నాగవీచంద్రమ,
స్స్ఫురదూధః ప్రతిముక్తమైన నిబిడ • జ్యోత్స్నాపయఃపూరము,
న్విరియం బాఱిన గొజ్జఁగ ల్గురియ ము • న్నీరైన యక్కమ్మనీ,
రు రహిం గూడిన నేర్పరించు గము లై • రోలంబ కాదంబముల్. ౧౨౧.

టీక. మధుమాసదోగ్ధ, మధుమాస = వసంతఋతు వనెడు, దోగ్ధ = పాలు పిదుకువాఁడు, ఉరుశక్తిన్ = మహాబలముచేత, పిదుకన్ = పిండఁగా, జ్యోత్స్నా = వెన్నెలరాత్రియనెడు, గవి = గోవుయొక్క, చంద్రమః = చందమామయనెడు, స్ఫురత్ = గొప్పదైన, ఊధః = పొదుఁగువలన, ప్రతిముక్తమైన = కురిసిన, నిబిడ=దట్టమైన, జ్యోత్స్నా = వెన్నెలయనెడి, పయః = పాలయొక్క, పూరమున్ = సమూహమును, విరియంబాఱిన = వికసించిన, గొజ్జఁగల్ = గొజ్జంగిపూలు, కురియన్ = వర్షింపఁగా, మున్నీరైన = సముద్రప్రాయమయిన, అక్కమ్మనీరు = ఆ మకరందమును, రహిన్ = సొంపుగాను, కూడినన్ = కలిసికొనఁగా, రోలంబకా

దంబముల్, రోలంబ = తుమ్మెదలనిగారుడు, కాదంబములు=కలహంసలు, గముల్తై= గుంపులై, ఏర్పరించుక్ = ప్రత్యేకపఱచును. "వెన్నెలయందు గొజ్జఁగపూఁదేనె తుమ్మెదలు గ్రోలెననుటయు, హంసలు పాలు నీరు వేఱు పఱచుట ప్రసిద్ధమనుట".

తా. సుగమము. రూపకాలంకారము.

ఉ. దిగ్గియ నంచ తూఁడు గొని ♦ తీర వనేక్షువు వంకమీఁదుగా,
నగ్గడ ఫుల్ల కేసరము ♦ నందు వసింపఁగ నెక్క నూలి ను,
న్ప్రగ్గమునం దనారత మ ♦ రంద సరస్యరవింద గోష్ఠికి,
న్వెగ్గల మాడు తేంట్లు మరు ♦ వింటికిఁ బూనె గుణద్వయత్వముఁ. ౧౨౨.

టీక. దిగ్గియన్=దీర్ఘికయందు, (ఇదిడిగ్గియయనియునుంగలదు), అంచ = హంస, తూఁడు = కమలనాళమును, కొని = గ్రహించి, తీర = దరియందలి, వన = వనముయొక్క, ఇక్షువు = చెఱకుయొక్క, వంకమీఁదుగాన్ = వంపుమీఁదుగా, అగ్గడన్ = ఆప్రాంతమందు, ఫుల్ల = పుష్పించిన, కేసరమునందు=పొన్నచెట్టునందు, "పున్నాగఃపురుషస్తుంగః కేసరోదేవవల్లభః" అని నిఘంటువు. వసింపఁగ= వ్రాలఁగా, ఎక్క = ఆచెఱకునకెక్కినట్టి, నూలి = ఆబిసనాళ తంతు సంబంధియగు, నున్ = నునుపైన, ప్రగ్గమున్ = సూత్రంబును, అందు=ఆపొన్నచెట్టున, అనారత = ఎడతెగని, మరంద = మకరందముయొక్కయు, సరసీ=ఆడిగ్గియయందలి, అరవింద= కమలములయొక్క, గోష్ఠికిన్=సమాజనమునకును, వెగ్గలము = అధికముగా, ఆడు= సంచరించుచున్న, తేంట్లు = తుమ్మెదలును, మరువింటికిన్ = మన్మథునిధనువునకు, గుణద్వయత్వమున్, గుణ= గొనయములయొక్క, ద్వయత్వమున్ = జంటతనమును, పూనెన్ = వహించెను.

తా. ఒక సరస్సులోనుండి హంస తామరతూఁడు గ్రుంచుకొని దాని దరినున్న చెఱకు వంకమీఁదుగాఁ బొన్నచెట్టుమీఁద వ్రాలఁగా నాబిసనాళతంతువు లా చెఱకునకుఁ దగుల్కొని యది యొక యల్లెత్రాడుగాను మఱియు నా పొన్న పూల మకరందము కొఱకు నా సరస్సునందలి కమలముల మకరందము కొఱకు నెడతెగక చాలుగట్టి యాచెఱకువంకమీఁదుగానే తిరుగుచున్న తుమ్మెద లొక్క యల్లెత్రాడుగా నీరెండును రెండల్లెత్రాళ్లుగాను మన్మథునికి ధనుస్సయిన యా చెఱకున కమరెననియును బాంథ విజయమునకై యా మన్మథుఁడు దన వింటికి బటువుగా రెండల్లెత్రాళ్లు వేసికొనె నని భావము.

చ. నిడుద మధూళికల్లడుము ♦ నే కొని తీఁగెలు సాఁగఁ జుట్టుకొం,
చడవిఁ గదార కాచకట ♦ కాకృతి నుళ్ల మలంగె గాడుపు,

ల్జడగతి నధ్వనీన పరి • షత్పటునిశ్వసితానలం బెదు,
ర్పడ మటి సార్చులై సుఱసుఱం దుద సుళ్లుగ సుర్రిక్కనో యనన్ ౧౨౩.

టీక. నిడుద=పొడవులగు, మధూళికల్ = మకరందధారలను, నడుమనే = భూమినిబడకుండమధ్యభాగముననే, కొని=గ్రహించి, తీఁగెలుసాఁగన్=మకరందము జిగటగావునఁ దీఁగెలు సాఁగునట్లు, చుట్టుకొంచున్ = వలయితములౌచు, గాడ్పు ఫుల్ = వాయువులు, అధ్వనీన = పథికులయొక్క, పరిషత్ = సమూహముయొక్క, పటునిశ్వసిత = నిట్టూర్పులయొక్క, అనలంబు = అగ్ని, ఎదుర్పడన్ = తనకెదురు గాఁగా, మటి = పిమ్మట, సార్చులై = మంటలతోఁగూడినవై, సుఱసుఱన్ = సుఱ సుఱయనఁగా, తుదన్ = అగ్రమందు, సుళ్లుగ = ఆవర్తములుగలుగఁగా, సుర్రిక్క నోయనన్ = శోషించెయనునట్లు, అడవిన్= అరణ్యమందు, (అడవియనియుంబాఠము గలదు), కడార= కపిలవర్ణముగల, "కడారఃకపిలఃపింగ" అని నిఘంటువు. కాచ కటక = గాఁజు వలయములయొక్క, ఆకృతి = ఆకారమునంటి యాకారముగల, సుళ్లన్ = ఆవర్తములచేత, జడగతిన్ = మందగమనముచేత, మెలఁగెన్ = సంచ రించెను.

తా. పుష్పములనుండి జాఱెడు మకరంద ధారలు క్రిందఁబడకుండ నడుమనే గ్రహించి తీఁగెలు సాఁగునట్లు వలయితములై గాజులవలెఁ గపిల వర్ణము గలిగి యడవులయందు వాయువులు సంచరింపఁగా విరహులయొక్క నిట్టూర్పు చిచ్చెదుఱు పడఁగా మంటచు నగ్రముల సుళ్లవలె ముడుఁచుకొని సుఱసుఱ సుర్రిక్కనో యన్న ట్లుండెనని భావము.

చ. కురిసిన క్రిందిపుప్పొడులఁ • గొంచు నగంబుల మీఁదికై పిశం,
గరుచులఁ గొన్ని పెల్లెగసె • గాడ్పుల సుళ్లతి మాధవుండు రా,
నెరవుగఁ బూవు సొమ్ము లిడి వ • నేందిర భూమికి వెండిమెట్ట దా,
మరరవణంబు రాఁ గొన భ్రి • మత్తులై మలుచుట్టులో యనన్ ౧౨౪.

టీక. కురిసిన = పుష్పములనుండి రాలినట్టి, క్రింది = వృక్షములక్రిందనున్న, పుప్పొడులన్ = పుష్పరజములను, కొంచున్ = గ్రహించుచు, అగంబులమీఁదికై= వృక్షములపైకిఁగాను, పిశంగరుచులన్ = పచ్చనికాంతులచేత, కొన్ని = కతిపయము లగు, గాడ్పులసుళ్లు = వాయువులయొక్కయావర్తములు, (సుడిగాడ్పులనుట, ఇది కర్తృపదము), పతి = భర్తయగు, మాధవుండు = వసంతుఁడు, (వైశాఖమాసమ ననుట), రాన్ = రాఁగా, వనేందిర = వనలక్ష్మి, పూవుసొమ్ము = పుష్పములని యెడుభూషణమును, భూమికిన్=నేలకు, ఎరవుగనిడి = ఎరవుగానిట్టి, వెండి=మఱియు,

మెట్టదామర = స్థలకమలమనీయెడిపు, రవణంబు = భూషణము, రాక = రాఁగా, కొనక = తీసికొనఁగా, భ్రమద్గతులౌ, భ్రమత్ = తిరుగుచున్న, గతులౌ = గమనములుగల, మలుచుట్టులో యనక = చీలలో యనునట్లు, వెల్లు = అధికముగా, ఎగసెక = ఉద్గమించెను. నుల్లనుకర్తృపదమునకు "సలోల్లోశ్చ" అను సూత్రముచేత నుల్లోపమై యూరూపమువచ్చెను.

తా. భూమికిని దనకును భర్తయగు మాధవుఁడు రాగా వనలక్ష్మి తనకుఁగల పూవుసొమ్మును భూమికెరవుగాఁబెట్టి భూమికిఁగల మెట్టదామరయను వేలాకవింతసొమ్ము తాను బెట్టుకొనఁగా మరలు దిరుగుచున్న మరచట్టులో యనునట్లు చెట్లక్రింద రాలిన పుష్పాదులు రేఁపికొని పచ్చని వన్నెగలిగి కొన్ని సుఢిగాడ్పులు చెట్లపై కెగసె నని భావము.

చ. తరుణు లదోనిదాన మధు • ధార నన ల్వకుళాళి నింపఁగాఁ,
దరుణులమేము గామె యని • తద్గతలై వనదేవత ల్సురం,
ధర వకుళౌఘ మెల్లను న • నల్లనఁ గ్రాయఁగ నించు బుగ్గలం,
దొరసె మధుప్రపూర్ణత మ•ధూకనులం బృథు పాండు పుష్పముల్ ౧౬౫.

టీక. తరుణులు = యువతులు, అదోనిదాన, అదః = ఈపుష్పములకు, నిదాన = ఆదికారణమయిన, మధుధారక = మద్యధారచేత, వకుళాళిక = పొగడచెట్లపఙ్క్తియందు, ననల్ = పుష్పములను, నింపఁగాక = నిండింపఁగా, "వకుళో ముఖసీధునా", అన్నట్లనుట, ఏము = మేము, తరుణులముగామె = యువతులముగామా, అని = అనుచు, తద్గతలై, తత్ = ఆ వనమును, గతలై = పొందినవై, వనదేవతల్ = వనదేవతలు, సురక = మద్యముచేత, (మకరందముచేతననుట), ధరక = భూమియందు, వకుళౌఘము = పొగడలగుంపు, ఎల్లను = సమస్తమును, ననల్లనక = మొగ్గలుచేయునట్లు, క్రాయఁగక = ఉమియుటకై, నించు = నిండించియున్న, బుగ్గలక = పుక్కిళ్లను, మధూకములక = ఇప్పచెట్లయందు, పృథు = పెద్దవియగు, పాండు = తెల్లనగు, పుష్పములు = పువ్వులు, మధుప్రపూర్ణతక, మధు = మకరందముచేత, ప్రపూర్ణతక = మిక్కిలి నిండియుండుటచేత, దొరసెక = పోలెను.

తా. ఇప్పపువ్వులు మిగులఁ దెల్లనై మకరంద భరితములై యుండఁగా దశవిధదోహదములలో నొకఁడైన ముఖసీధువుచేతఁ దరుణులు పొగడచెట్లను బుష్పింపఁ జేయఁగాఁ జూచిన వనదేవతలు తాము నుు దరుణులగుట నారీతిగానే సమస్త వకుళవృక్షములను బుష్పింపఁ జేయుటకై యత్నపడి యుమియుటకై తెల్లని మద్యముఁ బుక్కిళ్లఁ బట్టియుండఁగా నా బుగ్గలవలెనుండె నని భావము.

చ. తరుణుల కౌఁగిటన్ ననుచు ♦ తమ్ముఁ వృథావిరులెత్తి చేసె మోఁ
పరులుగఁ జైత్రుఁ డంచుఁ దద ♦ భావమనోభవవహ్ని వెచ్చి ని
ర్భర మధుపాళి ధూమము పరాగపు నీఱును దేనె గట్టిచాఁ
దరుదుగఁ దాల్పఁగాఁ గొఱవులై యొఱఁగంబడెఁ గొన్ని భూజముల్ ౧౨౬.

టీక. తరుణుల = ఉవిదలయొక్క, కౌఁగిటన్ = ఆలింగనముచేత, ననుచు= పుష్పించునట్టి, తమ్మున్=తమునుఅనఁగాగోరింటలను, "ఆలింగనాత్కురవక" అన్నట్లనుట, వృథా = వ్యర్థముగా, విరులెత్తి = పుష్పములెత్తి, చైత్రుఁడు= వసంతర్తువు, మోఁపరులుగన్ = బరువుమోసెడువారిఁగా, చేసెన్=ఒనర్చెను, అంచున్ = అనుచు, తదభావ, తత్= ఆయువతుల్యాలింగనముయొక్క, అభావ=లేమిచేత, మనోభవ= మన్మథసంబంధియయిన, వహ్నిన్ = అగ్నిచేత, వెచ్చి = దగ్ధములై, నిర్భర = నిబ్బరములైన, మధుప = తుమ్మెదలయొక్క, ఆళి = పఙ్క్తియనెడు, ధూమము = పొగయును, పరాగపు = పుష్పరజోమయమగు, నీఱును=భస్మమును, తేనెకట్టిచాఁడు= మకరందమనియెడు కట్టెచాదును, (పచ్చికట్టె కాలునప్పుడు లోపలినీరు పైకుబికి చాఁదుగట్టుననుట), అరుదుగన్ = వింతగా, తాల్పఁగాన్ = ధరింపఁగా, కొన్ని భూజముల్ = కొన్నిచెట్లు, కొఱవులై = అలాతములై, (కొఱవులనఁగా గురువకములు), ఒఱఁగంబడెన్ = నేలవ్రాలెను. (తాపభరముచేననుటయుఁ బుష్పభరముచే ననుటయు.)

తా. కురవక శబ్దభవములై కొఱవు లని చెప్పఁబడియెడు గోరింటలు స్త్రీల యాలింగనములచేతనే మేము పూయుదుమే యట్టి మమ్ము నీ చైత్రుఁడు బరువు చేటుగాఁ దాను వృథా పుష్పింపఁజేసెనని యా స్త్రీల యాలింగనము లేకుండుటవలని మదనాగ్నిచేతఁ దపింపఁ బడినందులకుఁ జిహ్నముగాఁ దుమ్మెదలు పొగ లెగసినట్లును బుప్పొడి బూదిరాలినట్లును మకరందము దానిలోని నీరుపేరి నల్లఁబడి చాఁదుగట్టినట్లుండగాఁ నొఱగఁబడి తమపేరు సార్థక మగునట్లు కొఱవుల వలెనుండెననియును నాకులు మొదలగునవి కనుపడకుండు నట్లు లెస్స పూచి యుండె నని భావము. అలం. గమ్యోత్ప్రేక్ష.

ఆ. ఫలశలాటు లురుల ♦ నళులకై తమకూడు,
చెలుప మావు లంటి ♦ చెలువ పిండు,
మగుడ ననలు నింప ♦ మొగము గన్నులు నెట్టఁ,
బాఱె మిగుల శోక ♦ పైకములకు. ౧౨౭.

టీక. చెలువపిండు = సుందరీసమూహము, ఫలశలాటులు=పండ్లుగాయలు,

ఉరులన్ = రాలిపోవునట్లు, అళులకై = తేఁటులకొఱకు, తమకూడు = తమ యాహారము, చెఱుపన్ = చెఱుచుటకై, మావులు = మామిడిచెట్లును, అంటి = స్పృశించి, (కరస్పర్శేణమాకందయనునట్లనుట), మగుడన్ = మరల, ననలు = పుష్పములను, నింపన్ = నిండింపఁగా, శౌకకైకములకున్ = శుకసమూహపికసమూహములకు, మొగము = ముఖమును, కన్నులు = నేత్రములును, మిగులన్ = అధికముగా, ఎఱ్ఱఁబాఱెన్ = కోపముచేత నెఱ్ఱనయ్యె, (చిలుకలకు ముఖమును గోయిలలకుఁ గన్నులును వసంతర్తువునందు మిక్కిలి యెఱ్ఱనై యుండుట ప్రసిద్ధమనుట).

తా. సుగమము. అలం. హేతూత్ప్రేక్షగమ్య.

మ. అతులప్రేమరసార్ద్ర యోర్తు ప్రియ • హాస్యక్రీడ సంకేత వం,
చితయై తత్క్షణ జాంగజజ్వరమిళ • చ్చిత్తభ్రమం బూని నా,
పతి నోవృక్షమ కానవే యన సపు • ష్పం బయ్యెఁ గోఁ గంతలోఁ,
నతఁడు న్దోఁచిన నవ్వెడు న్విరిసెఁ • బ్రాంతాంచన్నమేరుద్రుమన్ ౧౨౮.

టీక. అతుల = సమానములేని, ప్రేమరస = ప్రేముడిచేత, ఆర్ద్ర = సరసమైన, ఓతున్ = ఒక్కనాతి, ప్రియ = తననాథునియొక్క, హాస్యక్రీడన్ = పరిహాసక్రీడయందు, (దాఁగిలిమూఁతయనుట), సంకేత = సంకేతస్థానమందు, వంచితయై = మోసపోయినదై, తత్క్షణ = ఆక్షణమందు, జ = పుట్టిన, అంగజజ్వర = విరహజ్వరముతోడను, మిళత్ = కూడికొన్న, చిత్తభ్రమంబు = మనశ్చాంచల్యమును, ఊని = ధరించి, ఓవృక్షమ = ఓచెట్టా, నాపతిన్ = నానాథుని, కానవే = చూడవా, అనన్ = అని పల్కఁగా, గోఁగు = కర్ణికారము, సపుష్పంబయ్యెన్ = పుష్పములతోఁ గూడినదయ్యెను, "సల్లాపతః కర్ణికారః" అన్నట్లనుట, అంతలోన్ = ఆపల్కరించునంతలో, అతఁడున్ = ఆ ప్రియుఁడును, తోఁచినన్ = కానవచ్చినను, నవ్వెడున్ = నవ్వఁగానే, (ఆస్త్రీయనుట), ప్రాంతాంచన్నమేరుద్రుమన్, ప్రాంత = చేరువను, అంచత్ = ఒప్పుచున్న, నమేరుద్రుమన్ = సురపొన్నచెట్టును, విరిసెన్ = పుష్పించెను, "నమేరుర్హాసితేనచ" అనునట్లనుట.

తా. ఒకస్త్రీ తన నాథునిఁ గనుమఱచి వెదకుచు నొక కొండగోఁగును బలుకరింపఁగా నదియును, తననాథుడు గనిపించిన నాయింతి నవ్వఁగానే యాచేరువనున్న సురపొన్నచెట్టును బుష్పించె నని భావము.

తే. స్థాణు వొక్కఁడు మగవాఁడు • దలక కమియ,
ఫలము సంగ నట్టె కేనియక • పద్మవదన,

వదన సురఁ గూర్మి నొసఁగ నీ • వలదె పువ్వు,
మైన ననుమాడ్కి నుమిసిన • ననిచెఁ బొగడ. ౧౨౯.

టీక. స్థాణువు = మొద్దును, శివుఁడును, ఒక్కండనుమగవాఁడు = ఒక్కపురుషుఁడు, తలఁకక = సంకోచింపక, ఉమియన్ = ఉమ్మివేయఁగా, కినియక = కోపింపక, ఫలమొసఁగెన్ = పండిచ్చెను, (కోరికనిచ్చెను), "స్థాణూ రుద్రఉమాపతి" అని నిఘంటువున్నది స్థాణువుపై బోయ కన్నప్పయనువాఁడు పూజార్థము పుక్కిటి సురనుమియఁగాఁ గోపగింపక కామిత ఫలమిచ్చెనఁట. ఇది శ్రీకాళహస్తిమాహాత్మ్యప్రసిద్ధము. అట్లె = ఆప్రకారమే, పద్మవదన = తమ్మివంటి మొగముగల యువిద, వదన సురన్ = తననోటియందలిమద్యమును, కూర్మిన్ = ప్రేమచేత, ఒసఁగన్ = ఇయ్యఁగా, పువ్వమైననీవలదే = పూవేనియునీవలదా, అనుమాడ్కిన్ = అనియెడురీతిచేత, ఉమిసినన్ = ఉమివేయఁగా, పొగడ=వకుళవృక్షము, ననిచెన్=పుష్పించెను. "వకుళో ముఖసీధునా" యనినట్లనుట.

తా. మున్నొక్క మగవాఁడు స్థాణువు పైనుమిసిన నతనికి ఫలమొసఁగియుండఁగాఁ దామరవంటి మోముగల యువతి పుక్కిటి సురయొసఁగఁగా బువ్వైన నియ్యవలదా యన్నట్లు పొగడపై నొక మగువ యుమియఁగా నది పూచెననిభావము.

తే. మధువుఁ గాంతల పుక్కిటి • మధువుఁ బేళ్ల,
యీర్ష్యఁ బస సూపఁ బొగడపై • నెలయ దాన,
విరిసెఁ దొల్లిటి దళములు • విరులు జడిసె,
దీన నగ్గల్పునకు నుబ్బి • తేఁటు లార్చె. ౧౩౦.

టీక. మధువున్ = వసంతమాసమును, కాంతల = స్త్రీలయొక్క, పుక్కిటిన్= బుగ్గలయందలి, మధువున్ = మద్యమును, పేళ్ల=సమాననామములచేతనైన, ఈర్ష్యన్= ఈసుచేత, పస = తమతమహెచ్చులను, చూపన్ = కనుపఱుచుటకై, పొగడపైన్= వకుళవృక్షముమీఁద, ఎలయన్= వ్యాపింపఁగా, దానన్=ఆవ్యాపించుటచేత, తొల్లిటి దళములు = మున్నున్నసైన్యములు, (ఆకులనుట), "దళంశస్త్రీభిదేఛదే అని" నిఘంటువు. విరిసెన్ = విచ్చెను, (రాలెననుట), విరులు = తొల్లింటిపువ్వులు, జడిసెన్= భయపడెను, (క్రొత్తపువ్వులు జడిగొనెననుట), దీనన్= ఈహేతువుచేత, అగ్గల్పునకున్ = ఆవసంతవిజయమునకు, ఉబ్బి = సంతసించి, తేఁటులు = తనపక్షమునమున్న తుమ్మెదలు, ఆర్చెన్ = సింహనాదముచేసెను. (ధ్వనిచేసెననుట).

తా. మధువను నామము వసంతఋతువునకును మద్యమునకుఁ జెల్లునుగావున నానామైక్య వైరముచేతఁ దమతమ పస పొగడచెట్టుపైఁ గనుపింపఁగా నువిదల

పుక్కిళ్ల మధుపుష్పేం జిగిరించి పుష్పించియున్న యాకులను బువ్వులను రాలిచి వసంతతుణావు పొగడను మరలం బుష్పింపం జేసెననియును మరలం జూచిన పూల కలరి తుమ్మెదలు మ్రోసెనని భావము.

ఉ. మేకొని తాంచినన్ భృగువు • మెచ్చిన వానికి మర్త్యజా భార్యయా,
శ్రీకి నివాస మై చెలిమి • సేయుట నిట్టిప్రశాంతి గద్దనో,
కాకన నాతి దన్నినవి • కాసము నొంది వనస్థలస్థితా,
శోకము సేసె మెచ్చునం బ్ర • సూనరజః కనకాభిషేకమున్. ౧౩౧.

టీక. తాంచినన్ = తన్నినను, మేకొని = అంగీకరించి, భృగువున్ = భృగుమహామునిని, మెచ్చిన = మెచ్చుకొన్న, వానికిన్ = ఆపెన్నునకు, మర్త్యజా = మనుష్యుండైన రామావతారమందలి, భార్యయా = గృహిణియైన, శ్రీకిన్ = శ్రీదేవియగు సీతకు, నివాసమై = ఉనికిపట్టై, చెలిమిసేయుటన్ = స్నేహముచేయుటచేతను, ఇట్టి = ఈ విధమయిన, ప్రశాంతి = అధికశాంతి, కద్దెనో కాక = కలిగినదో కాక, అనన్ = అనునట్లు, నాతి = ఒకయింతి, తన్నినన్ = తన్నంగా, వికాసమునొంది = వికసిల్లి, "అశోకశ్చరణాహత్యా" యన్నట్లనుట, వనస్థల = వనప్రదేశమందు, స్థిత = ఉన్నట్టి, అశోకము = అశోకవృక్షము, మెచ్చునన్ = సంతుష్టిచేత, ప్రసూనరజః = పుష్పొడి యనియెడు, కనకాభిషేకమున్, చేసెన్ = ఒనర్చెను.

తా. తొల్లి భృగుమహాముని తన్నంగాం గోపింపక మెచ్చుకొన్న విష్ణుదేవునికి రామావతారమందు భార్యయైన సీతాదేవికి లంకయందు నివాసస్థానమై చెలిమి చేసి యా సంబంధముచేతం దనకు నట్టి శాంతగుణము గలిగెనో యను నట్లశోకవృక్షము దన్నొక నాతిం దన్నంగా బుష్పించి పచ్చని పుప్పొడిచేత నాయింతికిం గనకాభిషేకముం జేసి నట్లుండెనని భావము.

మ. అళు లేతద్వదనేందు రాగమిళనా • ప్రాదుర్భవతోర్కరకం,
బులతేనె ల్సుధ లంచు రా నొకతెనె • మ్మోమె త్రం జైత్రంపుం బు,
వ్వులలోం బద్మము లయ్యె గంధఫలిం బు • వ్వులెట్టి పోంబోలెనో,
చ్చెల చేదై తలి చెందుం దల్లిబడికో • ల ట్టపుటయో నా మహిన్. ౧౩౨.

టీక. ఒకతె = ఒక్కనాతి, నెమ్మోమె త్తన్ = ముఖమెత్తంగా, అళులు = తుమ్మెదలు, ఏతద్వదనేందు, ఏతత్ = ఈనాతియొక్క, వదన = ముఖమనియెడు, ఇందు = చంద్రునియొక్క, రాగ = రక్తితోడ, మిళన = కూడుటచేత, ప్రాదుర్భవత్ = పుట్టుచున్న, కోరకంబులు = మొగ్గలయొక్క, తేనెల్ = మకరందములు, సుధలంచున్ = అమృతములని, (అమృతమైయుండుననియనుట), "ముఖరాగేణచంపక" అనునట్లనుట.

చైత్రంపుబువ్వులలోన్ = చైత్రమాసమువికసింపఁజేసిన పుష్పములలో, తద్గుణులయ్యెన్= ఆ కాంతాముఖగుణములే కలపియయ్యెనాయనికాకువు, (కాలేదనుట), గంధఫలిన్= సంపెఁగయందు, పువ్వుల్పుట్టి=పుష్పములుపుట్టియుండి, చేఁదై=తిక్తమై, పోవోలెన్ = వెడలఁగొట్టెను, ఒచ్చెల = ఇదిఖేదోక్తి, ఎందున్ = ఎచ్చటనైనను, మహిన్=భూమియందు, తఱచు = బహుళముగా, తల్లిబడికోలట్టుపుటయేకా = తల్లివలె నగుటయేకదా, (ఈ పద్యము ప్రథమపాదమందాబుపశ్లేషముచేత యతినిర్వహింపవలయును).

తా. ఒకస్త్రీ మొగమెత్తఁగా దాని ముఖచంద్రసంయోగమువలనఁ బుట్టిన సంపెంగ మొగ్గలలోని మకరందము చంద్రసుధవలెనే తియ్యఁగా నుండునని తుమ్మెదలు రాఁగాఁ జెట్టునఁ బుట్టుటచేఁ బూర్వపుగుణము కలిగి సంపెంగ పువ్వులు తుమ్మెదలకు మిక్కిలి చేఁదై చేరకుండఁ బాఱవోలెను బిడ్డలకుఁ దల్లి గుణమే యుండునని భావము.

చ. అలరెఁ బ్రియాళువోర్తు ప్రియ • మాట వసంతముఁ బాడ నప్పుడ,
వ్వెలఁది సపత్ని భక్తికిని • వేల్పులు మెత్తురు గాన రాగమ,
చ్ఛలమునఁ దన్నుఁ బాడఁగ వ • సంతుఁడు దా దయచేసెఁ గాక యా,
యెలె నిజశక్తి నా యనుచు • నీపసకుం గొదవెట్టె నీసునన్. ౧౩౬.

టీక. ఓర్తు = ఒక్కతె, ప్రియమాటన్ = తనకిష్టమాటవలన, వసంతమున్= వసంతరాగమును, పాడన్ = గానముసేయఁగా, ప్రియాళువు = ప్రేంకణపుఁజెట్టు, అలరెన్ = పుష్పించెను, "వసంతస్య సహాయస్తు వసంతతౌ ప్రగీయతే" అను సంగీత శాస్త్రము సంప్రదాయమునఁ బాడఁగా, "గీత్యా ప్రియాళుర్నితరా" అన్నట్లు పుష్పించెననుట. అప్పుడు=ఆకాలమందు, అవ్వెలఁది = ఆపాడినచేడియొక్క, సపత్ని= సవతి, వేల్పులు = దేవతలు, భక్తికిని, మెత్తురుగాన = మెచ్చుకొందురుగావున, రాగమున్ = వసంతరాగమనియెడు, ఛలమునన్ = నెపముచేత, తన్నున్ = ఆవసంతుని, పాడఁగన్ = గానముసేయఁగా, వసంతుఁడు, తాన్ = తాను, దయచేసెఁ గాక = కృపచేసెనుగాని, ఈప్రియాళువును బుష్పింపఁజేసెనుగానియనుట, నిజ = ఈ బిడయొక్క, శక్తినా = సామర్థ్యముచేతనా, ఆయెలె = అప్పుడేయాయెనే, ఇది నిస్సారార్థకము, అనుచున్ = అనిపల్కుచు, ఈ పసకున్ = ఈ పాటఁబాడి పుష్పింపఁజేసిన సారస్యమునకు, ఈసునన్ = సవతియందలి యీర్ష్యచేత, కొదవెట్టెన్ = కొఱఁతను ఆరోపించెను.

తా. ఓర్తు వసంతరాగముఁ బాడఁగాఁ బ్రేంకణము పూచెను దానికి నాస్త్రీ యొక్క సవతి మెచ్చుకొనక యీసుచేత వేల్పులు భక్తికి మెత్తురు గావున వసంత

మునియెడ తనపేరుగల రాగముచేతఁ దన్నుఁ బాడఁగా నావసంత దైవతమే యీ చెట్టును బుష్పింపఁ జేసెనుగాక యీయామె కింత సామర్థ్యం మా యని నిరసించె నని భావము.

తే. అధరసుధఁ బ్రాణి జితఁబ్రాణి • యగుచు మౌక్తి,
కాండమాలిక నిడెను నా • సాగ్రమౌక్తి,
కంబయనఁబాలు ననలిచ్చె • గతజరత్సు,
మంపు వావిలి మొగ నూర్పు • నింప నోర్తు. ౧౩౮.

టీక. ఓర్తు=ఒక్కతె, మొగము = ముఖమండలి, ఊర్పు = ఉచ్ఛ్వాసమును= నింపన్ = నిండింపఁగా, "సింధువారోముఖానిలాత్" అనునట్లనుట, అధరసుధన్= అధరమందలి యమృతస్పర్శముచేతను, ప్రాణిజితన్ = ప్రాణముగల ముత్తెపుఁ జిప్ప వలనఁ బుట్టినదగుటచేత, ప్రాణియగుచు = తానును ప్రాణముగలదియౌచు, నాసాగ్రమౌక్తికంబు, నాసా = ఆపోలఁతిముక్కుయొక్క, అగ్ర=కొనయందలి, మౌక్తికంబు = ముక్తాభూషణమే, మౌక్తికాండ=ముత్తెపుగ్రుడ్లయొక్క, మాలికన్=పఙ్క్తిని, ఇడెను = పెట్టెను, అనన్=అనునట్లు, గతజరత్సుమంపు, గత=రాలిపోయిన, జరత్= ముదురువైన, సుమంపు=పువ్వులుగల, వావిలి = నిర్గుండీవృక్షము, చాలుననలిచ్చెన్= శ్రేణిగానుండు మొగ్గలనిచ్చెను.

తా. ఒక్క మగువ నిట్టూర్పునింపఁగా దాని వలనఁ బువ్వులు రాలిపోయిన వావిలి చెట్టునందుఁ గ్రొత్తగా శ్రేణిగట్టి మొగ్గలు గనిపించె ననియు నవి యాస్త్రీ యొక్క యధరమందలి యమృత స్పర్శముచేతను ప్రాణముగల ముత్తెపుఁ జిప్పలో దాను బుట్టియున్న కతఁబునను దానును ప్రాణముగలదై యానెలఁత నాసాభూషణ మగు మౌక్తికము చాలుగా ముత్తెపు గ్రుడ్లు పెట్టి నట్లుండె నని భావము.

చ. ఘనమగు నాకురాలి తిల • కం బతిరిక్తత నున్న నోతుక లోఁ,
గనికరమూని కన్నుఁగవఁ • గాయజుఁ డిల్లడ యిడ్డ తూపులే,
యనువుగ నించెఁగాక మఱి • యంటక ముట్టక యొక్క చేష్టలే,
కసెగఁడెఁ బూఁచిక్క నంట యిదిగ • ల్లనఁగా నలరించెఁ బూపులన్ ౧౩౯.

టీక. ఓతుక = ఒకయింతి, ఘనమగు = దట్టమైన, ఆకురాలి, తిలకంబు = బొట్టుగుచెట్టు, అతిరిక్తతన్ = మిక్కిలిదారిద్ర్యముచేత, ఉన్నన్=ఉండఁగా, లోన్= మనస్సులోను, కనికరము = కారుణ్యమును, ఊని = వహించి, కన్నుఁగవన్ = తన నేత్రద్వయమునందు, కాయజుఁడు = ప్రద్యుమ్నుఁడు, ఇల్లడయిడ్డ=దాఁచియుంచిన, తూఁపులే = బాణములే, అనువుగన్ = సొగసుగా, నించెఁగాక = తా నింపించెఁగాని.

మఱి = లేనిమోడు, అంటకముట్టక = తగలకతాఁకకయే, (ఇదిజాత్యుక్తి), ఒక్కచేష్ట లేక = ఒకవ్యాపారములేక, చూడ్కిన్ = చూపుచేత, నెగడెనంట = వృద్ధియయ్యెననుట, ఇది = ఈపల్కు, కల్లనగా = అసత్యమనునట్లుగా, చూపులన్ = వీక్షణములచేత, అలరించెన్ = పుష్పింపఁజేసెను, "తిలకో వీక్షణేనచ" యన్నట్లనుట.

తా. ఒక బొట్టుగు చెట్టున నాకులురాలి వీడగిలి యుండఁగా నోరుకరంబు గనికరంబున దానిఁ జూడఁగా నప్పుడే తప్పక విప్పగల గొప్పపువ్వులుప్పతిల్లె నది మదనుని యంపగుములు దాఁచియున్న యాచకోరలోచన లోచనంబులందలి యీ ములుకులు మరల వెడలించి యీ తిలకంబుపై నెలయించెఁ గాక లేకున్న నిర్జీవ సంటకముట్టకయే చిట్టలుం జెట్టుక యియ్యట్టిపట్టెట్టు లిట్టి పుష్పాలు పుట్టుట కల్లయని యెల్లరను నట్లొప్పియుండె నని భావము.

తే. సాంద్ర మకరంద వృష్టి ర • సాతలంబుఁ,
దొరఁగు పువ్వుల భువియుఁ బూ • ధూళి నభము,
నీక్రమత్రయి మాధవుఁ డా • క్రమించె,
నురువిరోచన జనిత మ • హోష్మ మడఁగ. ౧౩౬.

టీక. సాంద్ర = తఱచైన, మకరంద = పూఁదేనియలయొక్క, వృష్టి = వానచేత, రసాతలంబున్ = పాతాళమును, తొరఁగు = రాలుచున్న, పువ్వులన్ = పుష్పములచేత, భువియున్ = భూమిని, పూధూళిన్ = పుష్పరజముచేత, (ఇదిమిశ్రసమాసము), నభమున్ = ఆకాశమును, ఈక్రమత్రయిన్, ఈ = ఈచెప్పఁబడినమకరందపుష్పరజములనియెడు, క్రమ = పాదవిక్షేపములయొక్క, త్రయిన్ = మూఁటిచేత, మాధవుఁడు = వసంతుఁడనియెడు త్రివిక్రముఁడు, ఉరు = విస్తారమైన, విరోచన = సూర్యునిచేత, జనిత = పుట్టింపఁబడిన, మహోష్మము = మహాతాపము, విరోచనజనిత = విరోచనసుతుఁడగు బలిచక్రవర్తియొక్క, మహోష్మము = మహాప్రతాపము, అడఁగన్ = శాంతిఁబొందునట్లు, ఆక్రమించెన్ = త్రిలోకములనాక్రమించెను.

తా. మాధవుండని విష్ణునకుఁ దగిన పేరుగల వసంతుఁడు సూర్యప్రతాపము బలిప్రతాపమువలె నడఁగునట్లు పాతాళమర్త్య స్వర్గలోకములను వరుసగా మకరందపుష్ప రజములచేత మూఁడడుగులచేత నాత్రివిక్రమునివలె నాక్రమించెననియును వసంతర్తువునందు సూర్యుఁడంతవిస్తారముగా వేఁడిమిఁ జూపఁడనియును భావము. ప్రకృతవసంతవర్ణనముచేత నప్రస్తుత త్రివిక్రమ పరిస్ఫూర్తి గలుగుట వలన సమాసోక్త్యలంకారము.

కం. ఊసుకొనఁబసు మధూళిక, యోడికలకుఁ గ్రిందఁ గ్రమ్మి ♦ యుండెడు తేంట్లన్
నీడలు దిరిగియుఁ దిరుగని, జాడఁ దరు ల్పొలిచె నవ్వ ♦ సంతపువేళన్. ౧౩౭.

టీక. ఊసుకొనన్ = భూమియూటఁబట్టునట్లు, పసు = స్రవించుచున్న, మధూళిక = మకరందధారలయొక్క, ఓడికలకున్ = ప్రవాహములకు, క్రిందన్ = అధోభాగమందు, క్రమ్మియుండెడు = ముసరుకొన్న, తేంట్లన్ = తుమ్మెదలచేత, నీడలు దిరిగియు = ఛాయలు ప్రొద్దువెంబడి మఱియొకదిక్కునకుఁ దిరిగియును, తిరుగని జాడన్ = తిరుగనిరీతిగానే, తరుల్ = వృక్షములు, అవ్వసంతపువేళన్ = ఆవసంత కాలమందు, పొలిచెన్ = ఒప్పెను,

తా. ఆ వసంతఋతువునందు మకరంద మధికమై స్రవింపఁగా నావాసనకుఁ జెట్లక్రింది భూమిమీఁదఁ దుమ్మెదలు గ్రమ్ముకొని లేవక నల్లనై యుండెఁ గావునఁ బ్రొద్దు వెంట నీడలు దిరిగినను దిరుగనియట్లే యాచోట్లు నీడలవలె నుండె నని భావము.

చ. శతదళమంజరీ ధవళ ♦ చైత్ర నిశామల చంద్రికౌఘము,
ల్వృత వియదంత కేళివన ♦ వృక్ష లతాంతరజశ్ఛట గ్గలం,
కితఁ గని కామినీ కమన ♦ కేళియుఁ బోఁ జెడవా నగాటవీ,
కతక పరాగ మొక్కదెసఁ ♦ గ్రమ్మి యనచ్ఛత మాన్పకుండినన్. ౧౩౮.

టీక. శతదళ = తెల్లదామరపువ్వులయొక్క, మంజరీ=గుత్తులవలెనే, ధవళ= తెల్లనైన, చైత్ర = చైత్రమాససంబంధినులగు, నిశా = రాత్రులయందలి, అమల = స్వచ్ఛమైన, చంద్రికా = వెన్నెలయనెడు, ఓఘముల్ =జలప్రవాహములు, "ఓఘోవితానవేణ్యాంచ" అని నిఘంటువు. వృత = ఆవరింపఁబడిన, వియదంత = ఆకాశ ప్రదేశముగల, కేళివన = ఉద్యానవనములయందలి, వృక్ష = చెట్లయొక్క, లతాంత= పుష్పములయొక్క, రజః = పరాగములయొక్క, ఛటన్ = సమూహముచేత, కలంకితన్ = బురదగలుగుటను, కని = పొంది, నగాటవీ, నగ = పర్వతములయందలి, అటవీ = అడవులయందలి, కతక = చిల్లచెట్లయొక్క, పరాగము = రజము, ఒక్క దెసన్ = ఒకదిక్కునందు, క్రమ్మి = వ్యాపించి, అనచ్ఛతన్ = స్వచ్ఛముగాకుండు టను, మాన్పకుండినన్ = పోఁగొట్టకుండుటచేతను, కామినీకమన=విటీవిటులయొక్క, కేళియున్ = క్రీడయును, పోన్=పోవునట్లుగా, చెడవా=చెడిపోవా, (పోవుననుట).

తా. తెల్లనైన చైత్రమాస రాత్రులయందలి వెన్నెల లనియెడు నిర్మలోదక ప్రవాహము లుద్యానవనములలోని పుష్పాదుల తిప్పలచేతఁ గలఁగినవై యుండఁగా, నవి తేటుట కొఱమూఁను గొండ, యడవులలోని చిల్ల చెట్ల పుష్పాదులు వ్యాపించు

యా కలఁక దీర్చి యా నీరు దేర్చిన తెన్నె యుండునే కాక యట్లు చేయకుండిన నా ప్రవాహములు వితీనితుల క్రీడల కుపయోగింపక తామూం జెడిపోవునని భావము. (బురదనీటిలోఁ జిల్లపొడి రాల్చిన నీరు తేరుట ప్రసిద్ధము).

సీ. శైత్యపాండిమలు తుషారాంతమునఁ జేరె సిరులు కాఁ ద్రాక్షపందిరుల విరుల,
వలయగానములు యుక్తలకార్శ్యమునఁ జేరె మలయపుఁ గమ్మతెమ్మెరల నలుల,
సౌరభోల్లాసముల్ జాతి గ్రుంగఁగఁ జేరె నలరారు కొండగోఁగులను నెలను,
స్ఫుటజటామస్కరంబులు వ్రతిచ్యుతిఁ జేరె నందనవ్రతతిసంతతుల వృతుల,
స్వాహృత పరభృత వినుతరసాలపరిష, దహరహఃక్లప్తబహుసురహః ప్రహారవిహార,
హూణ మానవతీ పరిమ్లానిమాని, నారి వారిజ ఘనగంధవాహ మొలసె. ౧౩౯.

టీక. తుషారాంతమునన్, తుషార = మంచుయొక్క, అంతమునన్ = నాశకాలమందు, (శిశిరర్తువు గడచఁగాననుట), శైత్యపాండిమలు = చల్లఁదనమును దెల్లఁదనమును, (ఇవి మంచిగుణములు), ఇరులు కాన్ = చీకట్లు గ్రమ్ముచున్న, ద్రాక్షపందిరులన్ = ద్రాక్షకాయ మానములయందును, విరుల్ = పుష్పములయందు, చేరెన్ = ప్రవేశించెను. (ద్రాక్షపందిళ్లు బలసియల్లికొనెఁ గావున సన్నపుఁ జల్లదనమును పుష్పములు వికసిల్లఁగా నందు దెల్లఁదనమును జేరెననుట), అయుక్తల = ప్రియులతోఁ గూడికొనని విరహముగల స్త్రీలయొక్క, కార్శ్యమునన్ = కృశించుటయందు, వలయగానములు = వారియొక్క కంకణములును సంగీతములును, మలయంపు = మలయపర్వతసంబంధులగు, కమ్మ = పరిమళించుచున్న, తెమ్మెరలన్ = వాయువులయందును, అలులన్ = తుమ్మెదలయందును, చేరెన్ = ప్రవేశించెను, (విరహముచేత స్త్రీలు కృశింపఁగా వారి కంకణములు జారి పోయెననియుఁ జింతచేత గానములు మానిరనియు నా చిహ్నములు వరుసగా సుడిగాడ్పులయందుఁ గంకణత్వమును దుమ్మెదలయందు గానమును జేరెననుట), జాతి = జాజి, (జాత్యేకవచనము), గ్రుంగఁగన్ = అడఁగిపోఁగా, సౌరభోల్లాసముల్ = వానియొక్క పరిమళ ప్రకాశములు, అలరారు = పుష్పించుచున్న, కొండగోఁగులను = గున్నలయిన క్రోవిచెట్లయందును, (పరిమళమనుట), నెలను = చంద్రునియందును, (ప్రకాశమనుట), చేరెన్ = ప్రవేశించెను, వ్రతిచ్యుతిన్, వ్రతి = సన్యాసులయొక్క, చ్యుతిన్ = జాఱుటచేత, (వసంతఋతువురాఁగానే సన్యాసులవ్రతమును గాపాడుకొనఁజాలక పోయిరనుట), స్ఫుట = స్పష్టములగు, జటా = వారియొక్క జడలును, మస్కరంబులు = [illegible], నందన = ఉద్యానవనములోని, వ్రతతి = తీగెలయొక్క, సంతతులన్ = సమూహములయందును, (జటాస్వరూపములుగ [illegible] వృతుల్ = [illegible]ములయందును, (వెదు

గులవెదుళ్లుగానవచ్చెననుట), "వేణుమస్కరతేజనా" అనియును, "ప్రాచీనంప్రాంతతోవృత్తి" అనియు నిఘంటువులు. చేరెన్ = ప్రవేశించెను, స్వభృత= తనచేతఁ బోషింపఁబడిన, పరభృత = కోయిలలచేతను, పనుత = శ్లాఘింపఁబడిన, రసాల = తియ్యమామిళ్లయొక్క, పరిషత్ = గోష్ఠులయందు, అహరహః=దినదినమును, క్లిష్ట= చేయఁబడిన, బహు = అనంతములగు, రహః = ఏకాంతములందలి, ప్రహార=జాముల యందు, విహరమాణ = విహరించుచున్న, మానవతీ = ఈలువుటింద్రయొక్క, పరిమ్లానిను = హెచ్చైనబడలికను, అనివార = మిక్కిలినివారించుచున్న, వారిజవనగంధవాహము = కమల వనములమీఁదుగా వీచెడు వాయువు, ఒలసెన్ = విసరెను.

తా. మామిడితోటయందుఁ గోయిలలు చిగుళ్లకొఱకు గుంపులు గూడి కూయుచుండఁగా నవియనిమెడు గడియారములచేతఁ బ్రొద్దులు గడపుచు స్త్రీలుండఁగా వారి బడలికలు వాయువులు దీర్చెనని భావము. కడమసుగమము పర్యాయాలంకారము "పర్యాయోయదిపర్యాయేణైకస్యానేకవర్ణన" మని దానిలక్షణము.

ఉ. సారెకుఁ గీరము ల్ఫలర ◆ సాలము శాఖలలోనఁ ద్రిమ్మరం
గా రహిఁ దన్మధూళికకుఁ ◆ గా నళిపఙ్క్తులు వెంటఁ గ్రుమ్మరం
గా రొదమించె నందుఁ జిలు ◆ కల్వనలక్ష్మియుఁ దద్వచస్సుధాం
ధోరుచులానఁగా సరప ◆ ణు ల్జనుల ట్లిడి పెంపఁగా బలెన్. ౧౮౦.

టీక. సారెకున్ = మాటిమాటికి, కీరముల్ = చిలుకలు, ఫల = పండియున్న, రసాలము = తియ్యమామిడియొక్క, శాఖలలోనన్ = కొమ్మలలోపల, త్రిమ్మరంగాన్ = సంచరించుచుండఁగా, రహిన్ = శృంగారమును, తన్మధూళికకుఁగాన్, తత్ = ఆఫలములయొక్క, మధూళికకుఁగాన్ = రసధారకుఁగాను, అళిపఙ్క్తులు = తేఁటిబారులు, క్రుమ్మరంగా = తిరుగఁగా, అందున్=ఆవనమందు, వనలక్ష్మియున్= తద్వచస్సుధాంధోరుచులు, తత్ = ఆచిలుకలయొక్క, వచః=పలుకులనెడు, సుధాంధః = అమృతరూపమగునన్నముయొక్క, రుచులు = చవులను, ఆనఁగాన్= ఆస్వాదించుటకై, జనులట్ల = భూప్రజలవలెనే, సరపణుల్ = గొలుసులను, ఇడి = ఉనిచి, చిలుకల్ = చిలుకలను, పెంపఁగాబలెన్=పెనుచుచున్నట్లు, రొద=ధ్వని, మించెన్= అతిశయించెను.

తా. పండిన తియ్యమామిడి కొమ్మలలోఁ దిరుగుచున్న చిలుకల వెంబడి తుమ్మెదలు మెదలఁగా నవి సరపణులవలె నుండఁ గావున వనలక్ష్మియుఁ జిలుకల పలుకులు విని యలరుటకై మనుష్యులవలెనే చిలుకలకు గొలుసులు వేసి పెనుచుచున్నట్లుండఁగాఁ జిలుకలు రొదసేసె నని భావము.

సేంచిన, అశోక = అశోక పుష్పమనియెడు, శరముక్ = బాణమునకు, కూర్చెను = సంధించెను, మంచుపాండురాంగుండు, మంచు = శిశిరర్తువనియెడు, పాండురాంగుండు = తెల్లనిశరీరముగల శివుఁడు, తద్రతికిఁగాఁగన్ = అట్టిరతిదేవికొఱకు, చలి కాలన్ = చలియనుపాదముచేత, తన్ని = తాఁచి, విడిచి = ఇతనినంతటవిసర్జించి, పోన్ = పోఁగా, బ్రదికె = జీవించు, కూర్చెననుదానితోనన్వయము. చలికాలమని యెడు శివుఁ డీ మన్మథునిం దుదముట్టఁ జంపక కాలఁ దన్ని రతీదేవియందుఁ గరు ణించి యామెకై వీని విడిచెఁ గావునఁ బైఁ జెప్పినట్లు బ్రదికె యిట్లాయె ననుట.

తా. సుగమము.

చ. చిగురుఁ బికాళికి న్ఫలముఁ ♦ జిల్కల గుంపునకు న్మధూళిఁ దేఁ,
టిగమికిఁ దావి గాలికివి ♦ టీవిటకోటికిఁ బువ్వులుం దలం,
బుగఁ గృపనీనియు న్సురభి ♦ పుంస్త్వముఁ బాంథుల చోటఁ బూనె న,
ట్లగుఁ బ్రజ కోర్కులిచ్చు తన ♦ కాత్మఁ దలంచిన దబ్బదే యనన్. ౧౮౨.

టీక. సురభి = వసంతఋతువు, (కామధేనువు నని తోఁచుచున్నది), పికాళికిన్ = కోయిలచాలునకు, చిగురున్ = పల్లవమును, చిల్కలగుంపునకున్ = శుక సమూహమునకు, ఫలమున్ = పండును, తేఁటిగమికిన్ = భృంగచయమునకు, మధూళిన్ = మధుధారను, గాలికిన్ = మలయమారుతమునకు, తావిన్ = పరిమళమును, విటీ విటకోటికిన్ = కామినీకమనసముదాయమునకు, పువ్వులున్ = పుష్పములును, దలంబుగన్ = దట్టముగాను, కృపన్ = దయచేతను, ఈనియున్ = ఇచ్చియును, (ఈనుట స్త్రీధర్మముగనుక నది గలిగియుననిపుంస్త్వవిరోధము), అట్లగున్ = ఆరీతియగును, ప్రజ = జనముయొక్క, కోర్కులు = కామితములను, ఇచ్చు = ఒసఁగునట్టి, తనకు, ఆత్మన్ = బుద్ధియందు, తలంచినది = ఊహించినది, అబ్బదే = లభింపదా, అనన్ = అనునట్లు, పాంథులచోటన్ = విరహులవిషయమున, పుంస్త్వమున్ = మగతనమును, పూనెన్ = వహించెను, (విరహులనుమాత్రము బాధించెననుట).

తా. సురభి యనఁగా వసంతఋతువును గామధేనువునుగాన నది స్త్రీవ్యక్తి యైన నందఱకుఁ గోరిక లిచ్చునట్టి సామర్థ్యము గలిగి యుండి తన కామగతనము గోరిన రాదా యను నట్లు పుంస్త్వము దాల్చె నని భావము. కడమ సుగమము.

సీ. సహకార ఫలరస♦సౌరభ్యములఁ గూడి మాధ్వీ మోవులఁ గదం♦బముగ వలవ,
మలయజోదరత జం♦భాల ఫలత్వగ్గత శ్రీ మించు చెవులఁ గొ జ్జెఁగలు మెఱయ,
శశి కదళీదర♦చ్ఛదపుఁ బావడలూరు చకచకఁ బట్టి ఫా♦లికిఁ బెనంగ,
ద్రాక్షా తేంట్లకుఁగాఁక♦లెక్కింపఁ జెరివిన గంధఫలీ పజ్క్తిఁ♦గబరు లలరఁ,

కేలఁగలవంటకపుఁదావికినిఁబులిమిన, ఘుసృణములుమించ ననలచేఁ బేరెసఁగెడు వన,
ములు నమేరురజోవృష్టిఁ బూదిఁజఱవ, నింతులెనసిరి పూఁబొదరిండ్లఁ బతుల౯ ౩.

టీక. సహకారఫల = తియ్యమామిడిపండ్లయొక్క, రస = రసముయొక్క, సౌరస్యముల౯ = పరిమళములను, కూడి = కలిసికొని, మాధ్వి = తేనె, మోవుల౯ = వాతెఱలయందు, కదంబముగ౯ = కలపముగా, వలవ౯ = పరిమళింపఁగా, (మామిడిపండ్లరసమును మద్యమును స్త్రీలు గ్రోలుదురనుట), మలయజ = చందనము, ఉదరత౯ = లోపలఁగల్గియుండుటచేత, జంభలఫల = దూదినిమ్మపండ్లయొక్క, త్వక్ = చెక్కలను, గత = పొందిన, శ్రీ = కాంతివంటికాంతిచేత, మించు = అతిశయించుచున్న, చెవుల౯ = శ్రోత్రములయందు, గొజ్జెఁగలు = గొజ్జెఁగపూలు, మెఱయ౯ = ప్రకాశింపఁగా, (స్త్రీలు గొజ్జెఁగపూలను గణ్ణభూషణములుగా నునిచికొనిరనుట), శశికదళీ = కర్పూరపుటరఁటిచెట్టుయొక్క, ఉదర = గర్భమందలి, ఛదపు = మోవువంటి, పావడలు = అంగదట్టములు, ప్రావారములు, ఊరు = తొడలయందలి, చకచక౯ = మెఱసెడుకాంతిని, పట్టి = అవలంబించి, పాలికిఁబెనంగ౯ = భాగమునకుఁ బెనగులాడఁగా, (లేఁత యరఁటి మోవుల వంటి పావడలు గట్టుకొనిరనుట), త్రొక్కు = (వాసనలకై తమతలలు), త్రొక్కుచున్న, తేఁట్లకు౯ = తుమ్మెదలకు, కాఁకలు = తాపములను, ఎక్కింప౯ = అతిశయింపఁజేయుటకు, చెరివిన = తుఱిమినట్టి, గంధఫలీపఙ్క్తి౯ = సంపెఁగపూలచాలుచేత, కబరులు = క్రొమ్ముడులు, అలర౯ = ప్రకాశింపఁగా, (తమ తలలమీఁద వ్రాలుచున్న తేఁటులకోటుపడి వానికి భయముకాఱకు సంపెఁగపూలు దుఱిమిరనుట), కేల౯ = హస్తమందు, కలవంటకపు = చిత్రాన్నములయొక్క, తావికి౯ = పరిమళముపోవుటకుగాను, పులిమిన = పూసికొనియున్న, ఘుసృణములు = కుంకుమపూఁబూఁతలు, మించ౯ = అతిశయింపఁగా, (కేసరీబాతు మొదలగు కలవంటకములభుజింపఁగా నావాసన తెలియకుండుటకుఁ జేతులయందుఁ గుంకుమపూఁవుఁ జేర్చుట ప్రసిద్ధము), ననల౯ = పుష్పములచేత, పేరెసఁగెడు = మిక్కిలియొప్పుచున్న, వనములు = తోఁటలు, నమేరు = సురపొన్నలయొక్క, రజః = పుప్పొడులయొక్క, వృష్టి౯ = కురియుటచేత, బూది౯ = భూతిని, (దుమ్మనుట), చఱవ౯ = పూయుచుండఁగా, (స్త్రీలమీఁదఁ బుప్పొడులు వాలుచుండు ననుట), ఇంతులు = యువతులు, పూఁబొదరిండ్ల౯ = పూచిననికుంజములయందు, పతుల౯ = తమనాథులను, ఎనసిరి = పొందిరి.

తా. స్త్రీలు లెస్సగా నలంకరించుకొని నికుంజగృహములయందు దమ నాథులతోఁ గ్రీడించిరని భావము.

వ. అట్టి వసంత సమయంబున.　　　౧౪౪.

ఉ. కామిని మేఘరంజిమధు ♦ గర్వ మడంతు నటంచులో నిజ,
క్షేమముఁ గోరి పాడి మణి ♦ చిత్ర మరుత్తృణ తా చిరద్యుతి,
స్తోమ వలాహకా వలులు ♦ దోఁచి ప్రఫుల్ల కదంబ కేతకో,
ద్దామ సమీరణాహతులఁ ♦ దాపము నీ నొఱగు న్విచేష్టతన్.　　　౧౪౫.

టీక. కామిని = చూడికుడుత్తనాచ్చియారు, మధుగర్వము, మధు= వసంతర్తువుయొక్క, గర్వము = క్రొవ్వును, అడంతునటంచున్ = అడఁచెదనని, లోన్=అంతరంగమందు, నిజక్షేమమున్ = తనసేమమును, కోరి = అపేక్షించి, మేఘరంజిన్ = మేఘరంజియనియెడురాగమును, పాడి = గానముచేసి, మణి=మణిమయమైనట్టియు, చిత్ర = నానావర్ణములుగల, మరుత్తృణత = దేవధనువనఁగా నింద్రచాపమును, అచిరద్యుతి = మెఱుములయొక్క, స్తోమ= సమూహమునుగల, వలాహక=మేఘముల యొక్కయు, బెగ్గురుపులుఁగులయొక్కయు, ఆవలులు = పఙ్క్తులు, తోఁచి = కనుపడి, ప్రఫుల్ల = వికసిల్లిన, కదంబ = కడిమిపూవులయొక్కయు, కేతకి = గేదంగుల యొక్కయు, ఉద్దామ=అధికమగు, సమీరణ = వాయువుయొక్క, ఆహతుల్=వీచుటలచేత, తాపమున్ = సంతాపమును, ఈన్=కలుగఁజేయఁగా, విచేష్టతన్ = చేష్టలుడుగుటచేత, ఒఱగున్ = సోలును, (ఇచట మూర్ఛారూపమయిన మన్మథావస్థ చెప్పఁబడ్డది.)

తా. వసంతఋతువు హెచ్చి యుండుటచేత దాని మదమడంతునని తనక్షేమముఁ గోరి మేఘరంజిరాగము నా చూడికుడుత్తనాచ్చియారు లాలాపముఁ జేయఁగా నంతట మేఘోదయమై వెంటనే యాచిహ్నము లన్నియుఁ గల్గి యావర్షర్తువంబుఁ బుష్పించెడు కడిమి గేదఁగి పూలమీదుఁగా వాయువులు విసరుటవలన మిక్కిలి తాప మొదవఁగా నాయమ చేష్టలు దక్కి మూర్ఛ మునిఁగె నని భావము.

తే. అతివ పూర్ణేందు భీతిఁద ♦ దశ్మశాలఁ,
దెండి యతఁడందు నినుమడి ♦ తీండ్రఁ దోఁప,
మింటి పయినుంట గా దని ♦ యిఁటిపైకిఁ,
దెచ్చు కొంటి నటంచుఁ జెన్ ♦ దెచ్చ వెడలు.　　　౧౪౬.

టీక. అతివ = ఆయింతి, పూర్ణేందు = నిండుచందురునివలన, భీతిన్ = భయముచేత, తదశ్మశాలన్ = అచంద్రకాంతశాలయందు, తెఁడి=తెన్నండి, (శయనించియనుట), అతఁడు = ఆచంద్రుఁడు, అందు= ఆచంద్రకాంతశాలయందు, ఇనుమడి= ద్విగుణమయిన, తీండ్రన్=తీండ్రముగా, తోఁపన్ = కనఁబడఁగా, మింటిపైన్ = ఆక

సమమీఁదను, ఉంటు = ఉండుట, కాదనీ = కూడదని, ఇంటిపైకిన్ = గృహముమీఁదికి, తెచ్చుకొంటగన్, (ప్రతిబింబరూపముగాననుట), అటంచున్=అని, పెటిచ్చన్=మిక్కిలిచీఁదఱచేత, వెడలున్ = ఆచంద్రకాంతశాలనుండి వెడలును.

తా. సుగమము.

తే. భ్రమర గీతిక మాయ వి ♦ పంచి మీటు,
దాన శ్రుతిఁగూడి మిగులఁ ద ♦ ద్రక్తి హెచ్చ,
వే నివారించి లేచి దై ♦ వికము నెమటు,
యుక్తులు ఫలింప వనుచు ని ♦ ట్టూర్చి నవ్వు. ౧౮౭.

టీక. భ్రమర = తేఁటులయొక్క, గీతిక = పాట, మాయన్=మాయుటకు, (వినరాకుండుటకనుట), విపంచిన్ = వీణను, మీటన్ = వాయింపఁగాను, దానన్ = ఆమీటుటచేత, శ్రుతిన్ = సుతియందు, కూడి = కలసికొని, మిగులన్ = అధికముగా, తద్రక్తి = భృంగగానురక్తి, హెచ్చన్ = అతిశయింపఁగా, వే=వేగముగాను, నివారించి = చాలించి, లేచి, దైవికము నెమటన్ = దైవయత్నమునుండదని, యుక్తులు=మనయుక్తులు, ఫలింపవనుచున్ = తుదముట్టవని, నిట్టూర్చి = నిట్టూర్పువిడిచి, నవ్వున్ = హాసించును, పూర్వపద్యముననున్న యతిపయను కర్తృపదమున కనువృత్తి చేసికోవలయును.

తా. సుగమము.

తే. వెలఁగి కతితాపదంబయ్యె ♦ విరుల పాన్పు,
మును దదంఘ్రిహతాది భ ♦ ర్త్సనలు గన్న,
తరులఁ బొడమిన పూ-ఊఱట ♦ దన కొసఁగునె,
పొంచి తఱివేచి మిగుల నొ ♦ ప్పించుఁగాక. ౧౮౮.

టీక. వెలఁదికి=ఆయింతికి, విరులపాన్పు=పుష్పశయ్య, అతితాపదంబయ్యెన్=మిక్కిలితాపముచేసెను, మును=పూర్వము, తదంఘ్రిహతాది, తత్=ఆయువతియొక్క, అంఘ్రిహత = కాలితన్నులే, ఆది=మొదలగు, భర్త్సనలు=తిరస్కారములను, కన్న=పొందిన, తరులన్=వృక్షములయందు, పొడమినవి = పుట్టినయాపుష్పములు, పొంచి=వంచించి, తఱివేచి = సమయముఁగనిపెట్టి, మిగులన్ = అధికముగా, నొప్పించుఁగాక = నొప్పిగలుగఁజేయునేకాక, తనకున్, ఊఱట = సుఖమును, ఒసఁగునె=ఇచ్చునా, (ఇయ్యవనుట), దోహదములయందు, "అశోకశ్చరణాహత్యా వకుళో ముఖసీధునా" అన్నట్లు పాదతాడనాదులగు తిరస్కారములఁ బొందినవి యశోక వృక్షము మొదలనగునవి యనుట.

తా. సుగమము.

శా. పూజా దంభమునన్ బరాకుమెయి ము ♦ న్బ్రాఁబోఁడి సేర్పూదిచే,
తోజాతానల మార్ప శాస్త్ర సరణి ♦ న్దూలి న్హరి న్వ్రాసి ల,
జ్జాజాడ్యాకులదృష్టిఁ బ్రత్యవయవే ♦ క్షం జేయఁ జోఁ వెండి వ,
క్షోజాగ్రద్రమఁ గాంచి తల్లడిలునీ ♦ సుస్తాపముం మీఱఁగన్. ౧౬౯.

టీక. ప్రాఁబోఁడి = ఆకుసుమకోమలి, పూజాదంభమునన్ = పూజయనెడు వ్యాజముచేత, పరాకుమెయి = హెచ్చరికలేనియట్లు, మున్ = మొదలను, సేర్పు = సామర్థ్యమును, ఊఁది = అవలంబించి, తేతోజాతానలము = మన్మథాగ్నిని, ఆర్పన్ = మాన్పుటకు, శాస్త్రసరణిన్ = శాస్త్రమార్గముచేత, తూలిన్ = తూలికచేత, హరిన్ = శ్రీయఃపతిని, వ్రాసి = లిఖించి, లజ్జా = సిగ్గుచేతనయిన, జాడ్య = జడభావముచేత, ఆకుల = వ్యాకులమగు, దృష్టిన్ = చూడ్కిచేత, ప్రత్యవయవ = అవయవములన్నింటి యొక్క, ఈక్షన్ = చూచుటను, చేయఁ జోన్ = ఒనర్చునెడ, వెండి = మరల, వక్షః = ఆస్వామివక్షస్స్థలమందు, జాగ్రత్ = విలసిల్లుచున్న, రమన్ = శ్రీదేవిని, కాంచి = చూచి, ఈసున్ = (సపత్నీభావమువనగు) ఈర్ష్యయును, (ఇది యీర్ష్యాశబ్దభవము), తాపమున్ = సంతాపమును, మీఱఁగన్ = అతిశయింపఁగా, తల్లడిలున్ = పరితపించును.

తా. ఆ కుసుమకోమలి తన విరహమార్పం దలంచి శాస్త్రోక్తమార్గముగా వక్షస్స్థలమందు శ్రీదేవి గలుగునట్లు స్వామియొక్క రూపమును బూజావ్యాజముచేతఁ బరాకుగా జిత్తరువునందుఁ గలములో వ్రాసి పిమ్మట లజ్జనొంది యాస్వామియొక్క ప్రత్యవయవసౌష్ఠవమును జూచుచున్నప్పుడు వక్షస్స్థలమందుఁ దాను వ్రాసిన లక్ష్మీదేవిని చూచి తన సవతియగుట నీసును దాపమున నతిశయింపఁ దల్లడిల్లుచుండు నని భావము.

చ. కుముదసరస్తట స్ఫటిక ♦ కూల వనోత్పలశయ్య వ్రాలి పూ,
ర్ణిమలఁ బికాళిఁ గుట్టుసుఱు ♦ క్రిక్కఁగ ధర్మపుదార వట్టు శే,
షము రెయి మల్లికాళి మతి ♦ సక్కఁగఁ జేయకయుండ నిల్పు నా,
యమ మఱునాటికిం గలుగ ♦ సాంత్వగళచ్ఛ్రితి గుంభితాశ్రువుల్. ౧౭౦.

టీక. కుముదసరః = వెలిగలువడిగ్గియయొక్క, తట = దరియందలి, స్ఫటిక = స్ఫటికమణివికారమగు, కూల = తీరమందలి, వన = ఉద్యానమందు, ఉత్పలశయ్యన్ = కలువపూలపాన్పునందు, వ్రాలి = సోరఁగి, పూర్ణిమలన్ = పున్నమలయందు, పికాళిన్ = కోయిలగుంపుచేత, గుట్టు = మర్మము, మానవునుట = కుట్టుసఁ అనుపక్షమున, (కొంచెము ప్రాణము), ఉసుఱు = ప్రాణమును, క్రిక్కఁగన్ = మిగులునట్లు, ధర్మపు

దార = ఘర్మోదకధారను, పట్టు = గ్రహించునట్టి, శేషము = మిక్కిలియున్నదాని, రేయి = రాత్రియందు, మల్లికా = మల్లెపూలయందలి, అళి = తుమ్మెదలయొక్క, రుతి = ధ్వని, చక్కఁగఁ జేయకయుండక = కడతేర్పకుండునట్లు, ఆయమ = ఆమె, మఱునాఁటికిన్ = మఱుసటిదినమునకు, కలుగన్ = ఉండుటకు, సాంత = మిక్కిలియు, గళత్ = జాఱుచున్న, శ్రుతి = చెవులయందు, గుంఫిత = నింపఁబడిన, అశ్రువుల్ = కన్నీళ్లు, నిల్పున్ = నిలుచునట్లుసేయును.

తా. ఆమె పున్నమలయందుఁ దేలి కలువ డిగ్గియ దరులయందు స్ఫటికమయ తీరములయందుఁ గలువ పూసెజ్జయందు మేనువయిచి యుండఁగాఁ బగలు కోయిల గుంపులు ప్రాణమానములను క్షీణింపఁజేయుచుండఁగా వాని యాచించి ఘర్మోదకధారం బట్టి కొంచెము మిగులఁ జేసికొనఁగా నా మిగిలిన దానిని రాత్రియందు మల్లెపూలపైఁ దిరిగెడు తేఁటుల మ్రోఁత నిరవశేషముఁ జేయకుండ రెండవనాఁటికుండుటకై చెవుల నిండఁ గన్నీరు నించును అనఁగా నా మ్రోఁత వినకుండ నా నీ రడ్డపడు ననియు దుఃఖించుచున్నప్పుడు నేత్రకోణములనుండి జాఱిన యశ్రువులు వీనులు నిండె నని భావము. ఇచట నామెకు సాత్త్వికభావము చెప్పఁబడెను. (తేసత్త్వమనమనోవృత్తి తజ్జంబులైన భావములు సాత్త్వికములనఁబడుచున్నవి. "స్తంభరోమాంచ బాష్పవైస్వర్యకంప నలయవైవర్ణ్యఘర్మసంజ్ఞలఁ దనర్చి" అని దానిలక్షణము.)

తే. నెలఁతఁ గుచ కుంభ యుగళముం ♦ డియు వియోగ,
జలధి యీఁదింప లేదయ్యె ♦ సఖులు వంచు,
చున్న పన్నీటి వెల్లి లోఁ ♦ గొన్నకతన,
ముంప కది లాఘవమునఁ దే ♦ లింపగలదె. ౧౫౧.

టీక. కుచకుంభయుగళము, కుచ = పాలిండ్లనెడు, కుంభ = కుంభములయొక్క, యుగళము = ద్వంద్వము, ఉండియున్ = కలిగియు, నెలతన్ = ఆ కోమలిని, వియోగజలధిన్ = విరహసముద్రమున, ఈఁదింపలేదయ్యెన్ = ఈఁదజేయలేకపోయెను, సఖులు = ఆమెచెలులు, వంచుచున్న = కుమ్మరించుచున్న, పన్నీటివెల్లిన్ = పన్నీటి ప్రవాహమును, లోఁగొన్నకతన = ముంచినహేతువుచేత, అది = ఆకుంభయుగము, ముంపక = మునుఁగఁజేయక, లాఘవమునన్ = తేలికగాను, తేలింపఁగలదే = తేలఁజేయఁగలదా.

తా. ఆమెకుఁ దాపోపశమనమునకై చెలులు పన్నీ రమితముగా వంచుచున్నారనియును దానిచేతనైనను దాపము దీఱక యది యొక సముద్రప్రాయమైయున్నదని భావము.

ఉ. చంచలనేత్రదాల్చు జల • జాతమృణాల సరంబు వేగ స,
ళ్లించినఁ బాఱుతెంచి కబ • ళించి తదూష్మకు నంగ లార్చు రా,
యంచకు చేష్టఁ గాంచి యిఁక • నైనను గంటు మొ యంచు మోమె వీ,
క్షించినఁ దోఁచు లే నగవు • సేరుచు బోంట్లకొకింత ప్రాణముల్ ౧౪౨.

టీక. చంచలనేత్ర = ఆచంచలాక్షి, తాల్చు = ధరించిన, జలజాతమృణాల= తామరతూఁడులయొక్క, సరంబుల్ = మాలికను, వేగల్=తెల్లవాఱఁగానే, సళ్ళించినల్=సడలించియీవలవేయగా, పాఱుతెంచి=పరువెత్తివచ్చి, కబళించి = మ్రింగి, తదూష్మకుల్, తత్ = ఆబిసనాళసంబంధియగు, ఊష్మకుల్ = (శరీరస్పర్శచేతనైన) వేఁడిమికి, అంగలార్చు=వగరించుచున్న, రాయంచ=రాజహంసయొక్క, కుచేష్టల్= వెఱ్ఱిచేష్టను, కాంచి = చూచి, ఇఁకనేనియు, కంటుమొయంచుల్ = నవ్వునుజాతు మేమోయని, మోమె=ఆమెముఖమునె, వీక్షించినల్ = తాముచూడఁగా, తోఁచు= అగపడిన, లేనగవు = ఆమెయొక్క చిఱునగవు, బోంట్లకుల్ = చెలులకు, ఒకింత = ఇంచుకంత, ప్రాణముల్, చేరుచుల్ = ఒడఁగూర్చును.

తా. ఆమె తాపోపశమనార్థమై తామరతూఁడుల సరములు ధరించి యుండి మఱునాఁటు దెల్లవాఱినవెనుక నవి వీడఁదీసి పాఱవైచిన నచ్చటి పెంపుడు హంస వచ్చి యామృణాళమును గబళించి వెంటనే (యవి యామె విరహతాపముచేత వేఁడిమియెక్కియున్నవి గావున నాహంసకు గొంతులోఁ గనలెత్తఁగానే), ఉమియుచు, నంగలార్చుచుండెఁ గావున నావింతఁ జూచియైన నీయమ నవ్వునాయని యామె మోమే చూచుచుండఁగా నామె నవ్వెను ఆచిఱునగవు వలనఁ జెలులకుఁ బ్రాణము వచ్చి ధైర్యము గలిగియుండెకనిభావము. ప్రాణసంశయము గలిగినప్పుడు నవ్వువచ్చె నేని బ్రదుకుట ప్రసిద్ధము.

ఉ. శ్రీపతి మీఁది గీతముల • ప్రేమ విపంచిక నంటఁ బాణి సం,
తాపము సోఁకి మెట్లమయి • నంబు గరం గిన డించి పాడు నా,
లాపినిఁ దాల్చి పెన్నైమటఁ • ల న్నఱి తంత్రులు జజ్జ్వగాఁ గలా,
లాపిని దాన పాడను గ • ళంబును గద్గదమయిన మ్రాన్పడల్ ౧౪౩.

టీక. కలాలాపిని, కల = అవ్యక్తమధురములగు, ఆలాపిని=ఆలాపములుగల యామంజుభాషిణి, శ్రీపతిమీఁది = శ్రియఃపతిమీఁది, గీతముల = గీతములయందలి, ప్రేమల్ = ప్రేముడిచేత, విపంచికల్ = వీణను, అంటల్ = స్పృశింపఁగానే, పాణి సంతాపము = విరహముచేతనైన చేతులవేఁడిమి, సోఁకి = తగిలి, మెట్లమయినంబు = వీణమెట్లకువేసియున్న మైనము, కరంగినల్ = కరఁగిపోఁగా, డించి = ఆవీణనుదించి,

లాపినిన్ = తంబురానును, దాల్చి = ధరించి, పాడుచున్ = గానము సేయుచును, మఱి = పిమ్మటను, పెన్నెమటలన్ = ఆయాసమువలనఁగలిగిన యెక్కుడుచెమ్మటలచేతను, తంత్రులు = తంబురాతంతులు, జజ్జరగాన్ = నానిజజ్జరపడఁగా, తాన = తానే, పాడును = గాత్రమునఁబాడును, గళంబును = కంఠమును, గద్గదమైనన్ = డగ్గుత్తుక పడఁగా, మాన్పడున్ = చేష్టయుడుగును, (నానాఁటికి విరహమధికమాయెననుట).

తా. సుగమము. ఇవియు సాత్త్విక భావములే.

తే. ప్రతి కుసుమతల్పమునఁ జాఁటి • పడిన తప్త,
వలయ మలినాంకయుగము వ • ర్తులతఁ బొలిచెఁ,
జూఁడ నిఁక మాన ధైర్యము • లున్న లనుచు,
సుదతి బోంట్లకుఁ ద్రపఁ [illegible]వ్రాసి • చూపె ననఁగ. ౧౫౪.

టీక. సుదతి = మంచిపలువరుసగలయాయువిద, చూడన్ = ఆలోచింపఁగా, ఇఁకన్ = భావికాలమందు, మానధైర్యముల్ = మానమునుదాలిమియు, సున్నలనుచు = శూన్యములని, (లేవనుట) త్రపన్ = సిగ్గుచేత, బోంట్లకున్ = చెలులకు, వ్రాసిచూపె ననఁగన్ = లిఖించి కనుపఱిచె ననునట్లు, ప్రతికుసుమతల్పమునన్ = అన్నిపూలపాన్పులందును, జాఁటిపడిన = కృశత్వముచేత వీడిపడిన, తప్త = శరీరతాపముచేతఁ దపింపబడిన, వలయ = కంకణములయొక్క, మలిన = నల్లబడిన, అంక = చిహ్నములయొక్క, యుగము = ద్వంద్వము, వర్తులతన్ = వట్రువగుటచేత, పొలిచెన్ = ఒప్పెను.

తా. పూలపాన్పులు శరీర తాపముచేత వాడిపోవుచుండఁగా వేఱువేఱ మరలఁబఱచుచుండఁగా నట్టి ప్రతి పాన్పునందును జాఁటి పడిన కంకణములయొక్క మలినములగు గుండ్రని గుఱుతులు సుదతి తన కిఁకమీఁద మాన ధైర్యములు రెండును లేవని తాను సిగ్గుచేతఁ జెప్పలేక చెలులకుఁ దెలియునట్లు సున్నలు వ్రాసి చూపెనో యను నట్లు గనిపించె నని భావము.

ఉ. ఆ వనజాక్షి కాఁకఁ బొర • లాడ నలంగిన సొమ్ముఁ జీరలు,
న్వేవిన నూడ్చియూడ్చి మఱి • వేఱ వహించుట వారకల్పము,
గా వనమాలి సేవ యెడ • కాంక్ష నొదుంగక కల్ల తెల్విఁతో,
నే వలవంత డాఁగఁ జరి • యించిన డాఁగమిఁ జూచి నవ్వఁగన్. ౧౫౫.

టీక. ఆవనజాక్షి = ఆపద్మాక్షి, కాఁకన్ = విరహతాపముచేత, పొరలాడన్ = పొరలఁగా, నలంగిన = క్షుణ్ణములైనట్టి, సొమ్ము = భూషణములును, చీరలున్ = వస్త్రములును, వేవినన్ = తెల్లవాఱఁగానే, ఊడ్చియూడ్చి = పరిహరించిపరిహరించి, (అతిశయంబునద్విరుక్తి), మఱి = ఆవల, వేఱ = ప్రత్యేకమయినవాని, వహించుట = ధరిం

చుటయే, వారక్లిష్టములగాన్ = అనవసరనిర్ణీతములగునట్లుగా, వనమాలిసేవయెడన్ = భగవత్సేవపట్టున, కాంక్షన్ = ఆసక్తిచేత, ఒదుంగక = వెనుదీయక, కల్లతెల్వితోనే = లేనితెలివితోడనే, వలవంత = విరహతాపము, దాఁగన్ = ప్రచ్ఛన్నమగునట్లు, చరియించినన్ = సంచరించినను, డాఁగమిన్ = దాఁగకుండుటచేత, చూచి = వీక్షించి, (దీనికి వెనుకటిపద్యముననున్న విష్ణుచిత్తుఁడన్నది కర్తృపదము), నెవ్వగన్ = ఖేదముచేతను, (ముందటిపద్యముతో నన్వయము.)

తా. ఆమె విరహాతిశయముచేతఁ బొరలి పొరలి నలఁగిన సొమ్ములును వలువలును వదలివదలి మరల ధరించుచు నాధరించుటలు శృంగారము కొఱకనునట్లు గనుపఱిచి భగవత్సేవయందుఁ గాంక్షమానక లేని తెలివిని దెచ్చుకొని తన తాపము దెలియకుండునట్లు సంచరించిన నా విరహము దాఁగక బయల్పడఁగా జూచి విష్ణుచిత్తుఁడు ఖేదపడు నని భావము.

కం. పుత్త్రియుఁ దాఁ గామిని గాక, పుత్త్రియు నట్లుండుటకు న బుద్ధేక్షుధనుః,
పత్త్రియగు విష్ణుచిత్తుఁడ, పత్రపలే కదియు నేత పంబో యనుచున్. ౧౪౬.

టీక. తాన్ = ఆవిష్ణుచిత్తుఁడనుట, పుత్త్రియున్ = పుత్త్రవంతుఁడును, కామిని = కాకుండుటచేతను, ఒకపుత్త్రియున్ = తనయొక్క కూఁతురును, అట్లుండుటకున్ = ఆరీతినుండుటకును, అబుద్ధేక్షుధనుఃపత్త్రియగు, అబుద్ధ = ఎఱుఁగఁబడని, ఇక్షుధనుః = చెఱకువిల్తునియొక్క, పత్త్రియగు = ములుకులుగలవాఁడైన, విష్ణుచిత్తుఁడు = ఆ పెరియాళువారు, అపత్రపలేక = లజ్జలేక, అదియున్, ఏతపంబో = ఏమితపస్సో, అనుచున్ = అనయెంచుచు.

తా. ఆ విష్ణుచిత్తుఁ డెన్నఁడును మదన శరప్రహార మెఱుఁగనివాఁడు గావున నాయమకుఁ గల్గినది విరహమని యెఱుఁగక యామె యట్లుండుట యేమోతపమని తలఁచెనని భావము.

వ. తల పోసి దినదిన ప్రవర్తమాన తనయాతనుగ్లాని కత్యంత దుఃఖితుండై తత్కారణం బెఱుంగక వల దని మాధుర్యంబున వారించి చూచి యంత కంత కగ్గలం బగుడు గుడికిం జని పూజాంతిమ నమస్కరణానంతరంబునఁ దన మనో నిర్వేదనం బన్నగరి వెన్నునకు విన్నపంబున నమస్కృతిఁ జేసి దేవా దేవర దాసి యగు మదీయ పుత్త్రి యేమి గుఱించియో విచిత్రంబగు వ్రతచర్యం గాత్రశోషంబు సేయుచున్నది వలదన్న విన దపుత్రకుండనగు నాకుఁ బుత్త్రియైనను బుత్త్రకుండైనను దాన యే నేమి సేయుదు మఱి తన తపశ్చర్య తెఱంగు మా తపశ్చర్య తెఱంగు గాదు నేను భవద్దినస భవజ్జనిదినస రాత్రులం దక్క గణరాత్ర జాగరంబు లెఱుంగ మేము విసబీజాక్షు వలయంబులు దక్క బిసవలయంబు లెఱుంగ మేము ప్రసాదకుసుమంబుఁ జెవిఁ జెరువుటఁ దక్క నవి గప్పకొన నంచు శయనింప నెఱుంగ మేము చెంబుల భవత్తీర్థంబు గ్రోలినఁ దానంగంబులు దడిపి కొను నేము చాంద్రాయణంబులఁ జంద్రవృద్ధి బడిఁగడి యెక్కించినఁ జూపించు నేము నక్షత్రధ్యాస నిశ్వాస నిరోధంబు సేసినం దాఁదద్ధ్యాదశ వెలికె నిగడించు నేము

చిన్ముద్రకై హృదయంబునం జేలు సేర్చినం దాఁ గపోలంబునం జేర్చు నల్కాలోత్త
రీయంబు లేమ వహించినం దాఁ గిసలయోత్తరీయంబులు వహించు నేమ సితపక్ష
నూత్నేందుఁ గీక్షించినం దాఁ బూర్ణేందు నుపాలంభించు నిట్లుగాఁ బ్రవర్తిల్లు
చున్నయది యిది యేటికితపం బున్మాదంబుగా నోపు నెంత భవదీయ భక్తిగలిగిన
మానవులకుఁ బ్రకృతి సంబంధంబు విడువ దంతర్యామివి నీ వెఱుంగని యది లేదు
దీని నెఱింగి తెలింగింప వే యనవుడు ననుకంపాతిశయంబునఁ బచ్చాందసంబునకు
మందస్మితంబు సేసి మందర ధరుం డిట్లనియె. (౧౫౭.

టీక. తలపోసి = మైఁ జెప్పినట్లాలోచించి, దినదిన ప్రవర్ధమాన = నానాఁటికి వృద్ధియగుచున్న, తనయాతనుగ్లానికిన్ = కూఁతురియొక్క శరీర కృశత్వమునకు, అత్యంతదుఃఖితుండై = మిక్కిలి దుఃఖించినవాఁడై, తత్కారణంబు = ఆ విరహహేతువును, ఎఱుంగక = తెలియక, వలదని = వలదని, మౌగ్ధ్యంబునన్ = మూఢభావనుచేత, వారింప = నివారింపఁ, చూచి, అంతకంతకున్ = అప్పటప్పటికి, అగ్గలంబగుడున్ = విరహము మస్పహముగాఁగా, గుడికేఁ జని = స్వామికోవెలకేగి, ప్రాఞ్జాంతివ = ప్రాఞ్జాంత్యము గు, నమస్కరణానంతరంబునన్ = నమస్కారము పిమ్మట, తనమనోనిర్వేదనంబు = తనమనఃఖేదమును, అన్నగరివెన్ననకున్ = ఆశ్రీవిల్లిబుత్తూరిలోని మన్నారుస్వామికి, విన్నవింపన్ = విజ్ఞాపనముఁ జేయుటకు, పునర్నమస్కృతి జేసి = మరల నెఱఁగి, దేవా = ఓస్వామీ, దేవరదాసియగు = దేవరవారిదాసురాలగు, మదీయపుత్రి = నాదు కూఁతురు, ఏమిగుఱించియో = ఏఫలమునుగూర్చియో, (విరించిగుఱించి తపంబుసేసెనని భారతప్రయోగము కలిమింజేసి యిది కర్మప్రవచనీయార్థకమగు దేశ్యపదము), విచిత్రంబగు = వింతయైన, వ్రతచర్యన్ = నియమాచరణముచేత, గాత్రశోషంబు = శరీరశోషణమును, చేయుచున్నది = కావించుచున్నది, వలదన్న వినదు, అపుత్రికుఁడనగు నాకు = పుత్రులులేనినాకు, పుత్రియైనను = పుత్రకుండైనను దాన, కూఁతు రైనియుఁ గొడుకైనియుఁ దానే, ఏనేమిసేయుదున్ = నేనేమియాచరింతును, మఱి = ఇంకను, తనతపశ్చర్యవెఱంగు = తానుదపముచేసెడురీతి మాతపశ్చర్య వెఱంగుగాదు, (విలక్షణతపమనుట), ఏము = మేము, భవద్దివస = దేవరవారి దినముయొక్క, (హరివాసరమనుట), భవజ్జనిదివస = దేవరనారలవతరించిన జయంతుల దినములయొక్క, రాత్రులందకన్ = రాత్రులయందే కాక, గణరాత్ర = పెక్కురాత్రులయందు, జాగరంబులు = నిద్రలేకుండుటలు, ఎఱుంగము, (విరహాతిశయమున నామెకు రాత్రులయందు నిద్రలేదనుట, ఈ రీతిగానే ముందఱను తెలియఁదగును), ఏముబిసబీజాక్షవలయంబులు దక్కన్ = మేము తామరపూసలమాలికలు దక్క, (ఇదిభాగవతలక్షణము. "యేకంఠలగ్నతులసీనలినాక్షమాలా యే బాహుమూలపరిచిహ్నితశంఖచక్రాః । యేవాలలాటఫలకేల సదూర్ధ్వపుండ్రాస్తేవైష్ణవా భువనమాశుపవిత్రయంతి" యనియున్నది). బిసవలయంబు లెఱుంగము = తామరతూఁడుల మాలిక లెఱుఁగము, (తాపోపశమనమున కామెధరించెననుట), ఏము ప్రసాదకుసుమంబుఁ జెవిఁ జెరువుటఁ దక్క = మేము ప్రసాదలబ్ధమగుపూవుఁ గర్ణమునందుఁ జెక్కుకొనుటే కాక, అవిగప్పకొన నందు శయ

నింప నెఱుంగము = పూలు మేనఁగప్పుకొనుటను బూలపైఁబవ్వళించుటనెఱుంగము. (ఆమె యట్లు సేసెననుట), ఏము చెంబులన్ భవత్తీర్థంబు గ్రోలినన్ = మేము పానపాత్రములచేత దేవరవారియభిషేకతీర్థంబు పానము సేసినను, తానంగంబులు డిపికొనన్ = తాను శరీరముం దడుపుకొనును, (తాపశాంతికనుట), ఏము = మేము, చాంద్రాయణంబులన్ = చాంద్రాయణములనియెడు వ్రతములయందు, చంద్రవృద్ధిఁబడిన్ = చందురుని వృద్ధివెంటను, కడియెక్కించినన్ = అన్నకబళము వృద్ధిఁజేసిన, తఁడించున్ = తాను దగ్గించును, (విరహాతిశయము చేననుట), ఏము = మేము, నిధిధ్యాసనిశ్వాసనిరోధము సేసినన్ = బ్రహ్మధ్యానమందు నిశ్వాసములనిల్పినను, తాన్ = తాను, తద్ధ్యానదశన్ = ఆ బ్రహ్మధ్యానదశయందు, వెలికినిగుడించున్ = బహిర్గతముఁ జేయును, (తాపమోపలేక నిట్టూర్పునిగుడించుననుట,) ఏము = మేము, చిన్ముద్రకై, హృదయంబునన్ = ఎదయందు, కేలు = హస్తమును, చేర్చినన్ = ఉంచినను, తాన్ = తాను, కపోలంబునన్ = చెక్కిటియందు, చేర్చున్ = ఉంచును, (చింతచేతననుట), ఏము, వల్కలోత్తరీయంబులు = నారచీరలు, వహించినన్ = తాల్చినను, తాన్, కిసలయోత్తరీయంబులు = తలిరాకుఁజీరలు, వహించున్ = ధరించును, (తాపశాంతికనుట), ఏము, సితపక్షనూత్నేందు = శుక్లపక్షంబునందలి క్రొన్నెలను, కీర్తించినన్ = కొనియాడిన, తాన్, పూర్ణేందున్ = నిండుచందురుని, ఉపాలభించున్ = దూషించును, (ఉద్దీపకుఁడగుటచేత ననుట), ఇట్లుగాన్ = ఈరీతిగాను, ప్రవర్తిల్లుచున్నయది, ఇదియొటితపంబు, ఉన్మాదంబుగానోపున్ = వెఱ్ఱియైయుండవచ్చును, ఎంతభవదీయభక్తిగలిగినన్ = మీఁదగు భక్తియెంతయుండినను, మాదృశులకున్ = మావంటివారికి, ప్రకృతిసంబంధంబు = మాయాసంబంధము, (తనయుండిముకారణమనుట), విడువదు = వదలదు, అంతర్యామివి నీ వెఱుంగని యదిలేదు = సర్వాంతర్యామివగు నీకుఁ దెలియనిదిలేదు, దీని తెఱంగు = ఈపడుచునడవడి, ఎఱింగింపవే = తెలియఁజేయవే, అనవుఁడున్ = అనినను, అనుకంపాతిశయంబునన్ = దయాతిశయముచేత, తచ్ఛంసనంబునకున్ = ఆవిష్ణుచిత్తుని వైదికమునకు, మందస్మితంబు సేసి = చిఱునగపునవ్వి, మందరధరుండు = గిట్టువాల్పువేల్పు, ఇట్లనియెన్ = ఈవక్ష్యమాణక్రమముగాఁ బలికెను. తా. సుగమము.

ఉ. కంధరనీలవర్ణ మధు • కైటభ నాగ సుపర్ణ యోగిహృ,
ద్గ్రంధిభిదోత్థభోగివని • తాస్వనవచ్ఛ్వసనప్రవచ్ఛిర,
స్సంధివసన్నిశాపతిర • సప్రసృతిదుగ్ధపయోధివీచికా,
మంథరకేళికాదరస • మాశ్రితపఙ్క్తిశిరోధిసోదరా. ౧౫౮

టీక. కంధర = జలధరమువలె, నీల = నల్లనైన, వర్ణ = మైవన్నెగలవాఁడా, మధుకైటభ = మధుకైటభరాక్షసులకును, నాగ = పాములకు, సుపర్ణ = గరుత్మంతుఁడగువాఁడా, యోగి = అష్టాంగయోగములుగల మునులయొక్క, హృద్గ్రంధి = హృదయగ్రంధియొక్క, భిదా = భేదించుటచేత, ఉత్థ = ఎగసినట్టి, భోగివనితా = ఆఁడుపాముయొక్క, (కుండలినీశక్తి శక్తిః కుండలినీ నామ విసతంతునిభా శుభా యని వామకేశ్వర మహాతంత్రము), స్వనవత్ = ధ్వనిగల్గిన, శ్వసన = నిట్టూర్పు

చేత, స్రవత్=స్రవించుచున్న, శిరస్సంధి=కపాలమందు, వసత్=వసించుచున్న,నిశాపతిరస= అమృతమునుయొక్క, స్రుతి= స్రావమనెడు, దుగ్ధపయోధి= పాలకడలియొక్క, వీచికా=అలలయొక్క, మంథర= మెల్లనైన, కేళికా= క్రీడయందు,ఆదర=ఆదరణముగలవాఁడా, సమాశ్రిత=ఆశ్రయించిన, పఙ్క్తిశిరోధి= పఙ్క్తికంఠుఁడగు రావణునియొక్క, ప్రోద్భరా= తోఁబుట్టువగు విభీషణుఁడు గలవాఁడా. తా. సుగమము.

కం. కరధృతధరారి వితరణ ... ... ... ... ... ... ✻

(ఇది పూర్వాశ్వాసాంతమున వచ్చినపద్యము గనుకనిక్కడవ్రాయకపోవడమైనది.)

తోటకవృత్తము. ద్రుహిణాండకరండక • ధూర్వహగ, ర్భహరార్భక • దుర్భర • పక్వతపః, కుహనార్భకవార్భృత • కోసరిహా, రిహిరణ్మయహర్మ్యచ • రిష్ణుపదా.

టీక. ద్రుహిణాండకరండక = బ్రహ్మాండకటాహములయొక్క, ధూర్వహ= భారమువహించిన, గర్భ = కడుపుగలవాఁడా, హరార్భక = కుమారస్వామియొక్క, దుర్భర = భరింపఁగూడని, పక్వ = పరిపక్వమైన, తపః = తపముచేత, కుహనార్భక = కపటబాలుఁడవై యవతరించినవాఁడా, వార్భృతకోసరి, వాః = ఉదకములచేత, భృత = నిండిన, కోసరి = స్వామి పుష్కరిణియందు, హారి = ఒప్పుచున్న, హిరణ్మయహర్మ్య = స్వర్ణమయ మంటపమందు, చరిష్ణు = సంచరించెడు, పదా = పాదములుగలవాఁడా. తా. సుగమము.

మ. ఇదియంధ్రోక్తియథార్థనామయవనా • సృక్పూర్ణ కెంబావివా,
రిదపద్ధత్య వరోధివప్రవలయ • శ్రేణీవిఘాతక్రియా,
స్పదసేనాగ్రగ కృష్ణరాయ మహిభృ • త్సంజ్ఞాస్మ దాముక్తమా,
ల్యద నాశ్వాసము పంచమంబగుహృ • ద్యంబైన పద్యంబులన్. ౧౬౦

టీక. ఇది= ఈగ్రంథము, అంధ్రోక్తి= ఆంధ్రభాషచేత, యథార్థనామ = అన్వర్థనామముగల, యవనాసృక్ = మ్లేచ్ఛరక్తముచేత, పూర్ణ = నింపఁబడిన, కెంబావి = కెంబావియను పట్టణముయొక్క, (దీనికేయాంధ్రోక్తి యథార్థనామము), వారిదపద్ధతి = మేఘమార్గమును, అవరోధి = అడ్డగించుచున్న, వప్రవలయ = వలయములవంటి కోటలయొక్క, శ్రేణి = పఙ్క్తులయొక్క, విఘాత = పడఁగొట్టుటయొక్క, క్రియా= కార్యమునకు, ఆస్పద= కారణమగు, సేనా= దండునకు, అగ్రగ = అగ్రేసరుఁడైన, కృష్ణరాయమహిభృత్సంజ్ఞ = కృష్ణరాయ భూపాలుఁడను పేరుగల, అస్మత్ = నాయొక్క, ఆముక్తమాల్యదన్ = ఆముక్తమాల్యదయను ప్రబంధమునందు, హృద్యంబైన = మనోహరములగునట్టి, పద్యంబులన్ = పద్యములచేతను, పంచమంబు= ఐదవదియగు, ఆశ్వాసము, అమరున్= ఒప్పును. తా. సుగమము.

గద్య. ఇది శ్రీదక్షిణామూర్తి మంత్రోపాసనా సమాసాదితాఖండ సాహితీ ధురీణుండును నాత్రేయ గోత్ర పవిత్రుండును వావిళ్లవంశపయోరాశి రాకాసుధాకరుండును నగు రామస్వామిశాస్త్రిచేత ననేక పూర్వవ్యాఖ్యానాభిప్రాయంబులఁ బర్యాలోచించి రచియింపఁబడిన రుచిరసమాఖ్యానంబగు నాముక్తమాల్యదా వ్యాఖ్యానంబునందుఁ బంచమాశ్వాసము సంపూర్ణము.

శ్రీరస్తు.

---

# ఆముక్తమాల్యద - సవ్యాఖ్యానము.

## షష్ఠాశ్వాసము.



క. శ్రీకారి కృపార్ద్రేక్షణ, వైకుంఠయకుంఠభక్త ♦ వరద పదాబ్జా,
స్తోకమరందాయుత గం, గా కాకోదరనగోద ♦ యస్థపతంగా. ౧.

టీక. శ్రీకారి=లక్ష్మీకరమగు, కృపా=దయచేత, ఆర్ద్ర=చల్లనైన, ఈక్షణ=దృష్టిగలవాఁడా, వైకుంఠ, అకుంఠ=భంగములేనియట్లు, భక్త=భక్తులకొఱకు, వరద=వరములొసంగెడువాఁడా, పదాబ్జ=పాదకమలమునకు, అస్తోక=సమృద్ధమైన, మరందాయుత=మకరందమువలెనుండెడు, గంగా=గంగానదిగలవాఁడా, కాకోదరనగ=శేషశైలమనిరోడు, ఉదయ=ఉదయపర్వతమందు, స్థ=ఉన్నట్టి, పతంగా=సూర్యుండైనవాఁడా. తా. సుగమము.

వ. అవధరింపు మనంతర వృత్తాంతంబు. టీక. తా. సుగమము. ౨.

చ. కలఁ డొకరుండు పేరుకొనఁ ♦ గాని కులంబు మదీయభక్తుఁ డి,
య్యల మును వాఁడు వామనత ♦ నే వసియించిన పుణ్యభూమి యం,
దుల కొకయోజనత్రయపు ♦ దూరపుటూర వసించి బ్రాహ్మవే,
ళలఁ జనుదెంచి పాడు మము ♦ లాలన మంగళనామ కైశికిన్. 3.

టీక. పేరుకొనఁగాని=చెప్పరాని, కులంబు=కులమందలి, మదీయ=నాదగు, భక్తుఁడు, ఒకరుండు=ఒక్కఁడు, కలఁడు=కలిగియుండెను, వాఁడు=అతఁడు, మును=తొల్లి, వామనతన్=వామనావతారముచేత, ఏన్=నేను, వసించిన=నివసించినట్టి, పుణ్యభూమియందులకు=దివ్యదేశప్రాంతమునకు, (ఆ దివ్యదేశము తిరుక్కురుంగుడి యనుట.) ఒకయోజనత్రయపుదూరపుటూరన్=ఒక మూఁడుయోజనములుదూరముగల యూరియందు, వసించి=నివసించి, బ్రాహ్మవేళలన్=బ్రాహ్మముహూర్తములయందు, (తెల్ల

వాఱు నాల్గు గడియలు గలదనఁగా ననుట) చనుదెంచి=వచ్చి, మంగళనామకైశికిన్=మంగళనామకైశికి యనురాగముచేతను, లాలనన్=ఆదరముచేతను, మమున్=మమ్ము, పాడున్=గానముసేయును.

తా. చెప్పరానికులమందుఁ బుట్టిన మా భక్తుఁడొక్కఁడు గలఁ డతండు తొల్లి నేను వామనావతారముచేత వసించిన దివ్యదేశమనదగు మాఁ డామడ దూరమం దొక గ్రామమందు వసించి ప్రభాతసమయములయందు మంగళనామకైశికిచేత మమ్ము గానము సేయుచుండు నని భావము.

వ. అహారహంబు నమ్మహాత్ముండు. టీక. తా. సుగమము. ౮.

క. జాత్యుచితచరిత్ర మ మ, త్ప్రీత్యర్థం బూఁది తనదు ♦ హృదయము శుచితా,
నిత్యంబుగఁ దత్తనుసాం, గత్యము మసిపాఁతి మాని ♦ కంబై యొదుఁగఁగన్. ౯.

టీక. జాత్యుచిత = తనజాతికిఁ దగినట్టి, చరిత్రము = నడవడియే, మత్ప్రీత్యర్థంబు=మాసంతోషముకొఱకు, ఊఁది=వహించి, "శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్" అను గీతావాక్యమునను సరించియనుట. తనదు హృదయము=తన సంబధియగు నంతరంగము, శుచితా=పరిశుద్ధత్వముచేత, నిత్యంబుగ=స్థిరమగుచుండఁగా, తత్తను = ఆచండాల శరీరముయొక్క, సాంగత్యము = సంగమము, మసిపాఁతి=మసిగుడ్డయందలి, మానికంబై=మాణిక్యమై, ఒదుఁగఁగన్=ఒదిఁగి యుండుచుండఁగా.

తా. అతఁడు మద్భక్తుఁడైనను మాదు వర్ణాశ్రమాచారములఁదుంగుఁ బ్రీతి గావున నది యెఱింగి తా నొక యాధిక్యమునకుఁ బోక తన కులోచితాచారమందు నిలిచి తన హృదయము నిత్యపరిశుద్ధమై యా శరీర సాంగత్యము మసిగుడ్డను గట్టిన మాణిక్యము వలె నుండఁగా. అని ముందటిపద్యముతోడ నన్వయము.

సీ. చనువైన తోల్కఁబు ♦ సంబు కొంకయును నిత్తడ శంఖ చక్ర కుం ♦ డలము లమర,
దివదారికొమ్మ దో ♦ లిత్తియు జోడమ్ము మెడమూఁది ముగిలాను ♦ గొడుగువినర,
మత్పాదరక్షయు ♦ మావు వెన్నెఱక గుట్టిన యోటి తిపిరిదం ♦ డెయును మెఱయఁ
జిటితాళములు సంక ♦ పుటిక నొక్కొక్కమాటు గతిరయంబునఁ దాఁకి ♦ కలసి మొరయ,

తే. వలుద సనమాలకంబెయు♦మలిన తనువు, బట్టెతిరుమన్ను జెవరుఁగెం♦బుట్టుఁ జూపుఁ,
బసపుఁ బొడితోలు వల్లంబు♦నెసక మెసఁగ, వచ్చు సేవింప సుకియాళు♦వైష్ణవుండు. ౧౦.

టీక. చమురైన = చమురంటిన, తోల్కుబుసంబు=చర్మకూర్పాసము, (తోలు చొక్కాయనుట) టెంకియు=కుల్లాయియును, ఇత్తడి=ఆరకూటమయములగు, శంఖచక్ర కుండలములు=శంఖ చక్రముల చెవులపోఁగులు, అమరన్=ఒప్పుచుండఁగా, దివెదారి కొమ్ము=గరుడగంబమును, "దివెదారకొమ్ము" అనుపాఠమున దీపమునకుం బోయు నేతి చేత నించిన పసరపు కొమ్మని యర్థము. తోల్తిత్తియున్=చర్మపుదిత్తియును, జోడమ్ము= ధనుస్సునఁజేర్పకపోడిచెడుబాణమును, "చాపానపేక్షిత శర మొప్పు జోడమ్మని దేశ్య నామార్థకోశము" జోడమ్మని యనేకపుస్తకపాఠము. అప్పుడు ములుకులేని బోడి బాణమని ౬ యర్థము. మెడమీఁది=అంసముమీఁద నున్న, మొగలాకుగొడుగు=కేతకీపత్రములఁగూర్చిన ఛత్రమును, తనరన్=ప్రకాశింపఁగా, (మొగలాకనునెడఁ మొగలి+ఆకు పరిమిత్యర్థకము పర మగు నపుడు వలె నాకారాదులు పరమగు నపుడును నిత్యసంధి) మత్పాదరక్షయు =, మాపాదుకయును, మావు = గుఱ్ఱముయొక్క, వెన్నెఱకన్ = మెడమీఁది వెండ్రుకలచేత కుట్టిన = కూర్చినట్టి, ఓటి=ఓడువాసిన, తిపిరిదండెయును = సొరకాయదండెయు, మెఱయన్=ప్రకాశించుచుండఁగా, చిట్టితాళములు=చిఱుతాళములు, చంకపుటికన్= చంకనున్న భవనాశినిన్, ఒక్కొకమాటు=ఒక్కొక్కతూరి, గతిరయంబునన్=గమనవే గముచేత, తాఁకి=తగిలి, కలసి=ఏకమై, మొరయన్=ధ్వనిచేయఁగా, వలుద=వట్రువ యగు, వనమాలకంటెయున్=తులసిపూసలపేరును, (కుతికంటనుట) మలినతనువున్= మాసిన శరీరమును, (దేహాభిమానిగాఁడనుట) పట్టెతిరుమన్ను=పట్టెలుగా స్ఫుటమైన శ్రీ మృత్తికయును, బెదరుఁ గెంబుట్టుఁ జూపున్=బెదరుచు నెఱ్ఱనై పుట్టు చున్న చూ డ్కియు, (ఎఱ్ఱనిబెదురుఁజూపులనుట) పసపుఁబొటితోలువల్లంబున్=పసపుఁ బట్టించిన కుఱుచయగు చర్మపు జన్నిదమును, (పసపు బొడితోడి.వలువయు నని యొక పాఠము) ఎసకమెసఁగన్=ఒప్పుచుండఁగా, సురియాళు వైష్ణవుండు=ఆమాలదాసరి, సేవింప వచ్చున్ = సేవార్థమైవచ్చుచుండును. (ఉరియాళినియుం బాఠముకలదు. ఆపక్షమున నవలంబించిన యని యర్థము).

తా. సుగమము.

శా. గండాభోగముల న్మదశ్రుతులహారు ♦ ల్గప్పు న్నుతు ల్పాడి యా,
దండ న్వ్రేగులు డించి భక్తి జనితో ♦ ద్యత్తాండవంబాడు నా,
చండాలేతరశీలుఁ డుత్పులకియై ♦ చాండాలిక న్మీఁటుచున్,
గుండు ల్కీరుగ నెండ గాలి పసి తాఁ ♦ గుం జూడ కాప్రాహ్ణమున్. ౭

టీక. ఆచండాలేతరశీలుఁడు=చండాలురకంటె నితరులగు సజ్జనులయొక్క శీలము వంటి శీలము గల యతఁడు, (శ్వపచోపి మహీపాల విష్ణుభక్తో ద్విజాధికః, విష్ణుభక్తివిహీనస్తు ద్విజోపిశ్వపచాధమః అన్నట్లనుట) గండాభోగములన్ ... గణ్డ=చెక్కిళులయొక్క, ఆభోగములన్ = పరిపూర్ణత్వములయందు, "ఆభోగః పరిపూర్ణతా. అని నిఘంటువు. అనఁగా అంతటననుట) ముదశ్రు=ఆనందబాష్పములయొక్క, లహరుల్=ప్రవాహములు, కప్పన్=ఆచ్ఛాదించుచుండఁగా, నుతుల్పాడి=కీర్తనలుపాడి, ఆదండన్=అసమీపమందు, వ్రేగులు=తనబరువులు, డించి=దించి, ఉత్పులకితుఁడై=గగుర్పాటుగలవాఁడై గుండుల్=పాషాణములు, నీరుగన్=గానరక్తిచేతఁగరఁగినీరగునట్లు, చాండాలికన్=తన వీణను, "చాండాలికాతుకండోల వీణాచండాలవల్లకీ" అనినిఘంటువు. మీటుచున్=వాయించుచును, ఎండ=ఆతపముయొక్కయు, గాలి=వాయువుయొక్కయు, పసి=ఆఁకలియొక్కయు, తాఁకున్=వేగను, చూడక=లక్ష్యముసేయక, ఆప్రాహ్ణమున్=అపరాహ్ణమగుదనుక, భక్తిజనిత=భక్తిచేతఁబొడమిన, ఉద్యత్=లేచినట్టియైన, తాండవంబాడున్=నాట్యమాడును. ఆ ప్రాహ్ణమనుచోటఁ బ్రాహ్ణమనఁగా నహస్సులోమూఁడవ భాగమని అనఁగా పదిగడియలప్రొద్దెక్కు వఱకని కొందఱందురు.

తా. సుగమము.

తే. అట్లు దడవుగఁ గొల్చి సా ♦ ష్టాంగమెఱఁగి, గర్భమంటపిఁ గడిగిన ♦ కలఁకజలము,
లోని జాతొట్టినిండికా ♦ లువగఁ జాఁగి, గుడి వెడలి వచ్చు నది శూద్రుఁ♦డిడఁగ గ్రోలి.

టీక. అట్లు=ఆప్రకారము, తడవుగన్=ఆలస్యముగ, కొల్చి=సేవసేసి, సాష్టాంగము=కర చరణ వక్షో లలాట భుజములతోఁ గూడునట్లు, ఎఱఁగి=నమస్కరించి, గర్భమంటపిన్=గర్భగృహమును, కడిగిన=క్షాళనము జేసిన, కలఁకజలము=కలుషోదకము, లోని=లోపలనున్న, జాతొట్టి=జాతితొట్టి, నిండి=పూర్ణమై, కాలువగన్=కుల్యగాను, చాఁగి=ప్రవహించి, గుడి=కోవెలను, వెడలివచ్చు=వెలుపడివచ్చిన, అది=ఆయుదకము, శూద్రుఁడు=నాలవజాతివాఁడు, ఇడఁగన్=ఒసఁగఁగా, గ్రోలి=పానముఁజేసి.

తా. ఇట్లు తడవుగా సేవించి నమస్కరించి గర్భగృహముఁ గడిగిన సంమార్జనోదకము లోపలి తొట్టి వెలువడి బైటికిరాఁగాఁ దాను పంచముకులీనుఁడుగావున నాయుదకమంటక శూద్రుని నొక్కని యాచించి యతనిచేతఁ దెప్పించుకొని పానము జేసి యని ముందటి కన్వయించు నని భావము.

ఉ. ఆతఁడు ముఖ్యజాతిఁ గని ♦ నంతన పాయుచు నెండ గాలి నెం,
తో తడవుం బ్రసాద విని ♦ యోగము వార్చి వసించుచుం ద్రివ,
ర్ణేతరజాతి మెచ్చి దయ ♦ నిడ్డ ప్రసాదము దండెసాఁచి శ్ర,
ద్ధాతిశయంబున న్వినతి ♦ నందిభుజించు గొనుం దదంబువున్. ౯.

టీక. ఆతఁడు = ఆదాసుఁడు, ముఖ్యజాతిన్ = శ్రేష్ఠజాతిగలవానిని, (బ్రాహ్మణాదులననుట) కనినంతన = చూచినమాత్రనే, పాయుచున్ = తొలఁగుచును, ఎండన్ = ఆతపమందును, గాలిన్ = వాయువునందును, ఎంతోతడవున్ = ఎంతోసేపు, (చిరకాలమనుట) ప్రసాదవినియోగము = ప్రసాద ... ప్రసాదముయొక్క, వినియోగము = పంచిపెట్టుటను, వార్చి = నిరీక్షించి, (ఉ. ఇంతన నేల యేను భుజగేశ్వరు రాకయ వార్చినాఁడ నా, కంతవు నంతకుం గుడువ నాఁకలి నీళులు ద్రావఁ దృష్ణయు క్కింతయు లేదనియును; తే. అనిన నీరాక వార్చి మహాశతోడ, నున్న విప్రుని కోర్కి నీ వొక్కభంగి ననియును; అనఘ నారాక వార్చి నీ వధికనిష్ఠ, నిట్టులున్కికిఁ గారణంబేమి కోర్కి యనియును; ఇత్యాది శాంతిపర్వ ప్రయోగములుండుట నిచ్చట గొందఱపేక్షార్థకమని చెప్పుదురు.) వసించుచున్ = నివసించుచును, త్రివర్ణేతరజాతిః ... త్రివర్ణ = బ్రహ్మ క్షత్త్రియ వైశ్యులకంటె, ఇతర = అన్యుఁడైన, జాతి = శూద్రజాతిగలవాఁడు, మెచ్చి = హర్షించి, దయన్ = తనయందలికృపచేత, ఇడ్డ = ఒసఁగిన, ప్రసాదమున్, దండెసాఁచి = చేతనున్న దండెసాఁచి, శ్రద్ధాతిశయంబునన్ = అత్యాసక్తిచేత, వినతిన్ = వినయముచేత, అంది = అందుకొని, భుజించున్ = సాపడును, తదంబువున్ = వానిచే నియ్యఁబడినతీర్థమును, కొనున్ = గ్రహించును.

తా. ఆతఁడు గర్వ మించుకేని లేనివాఁడును బ్రసాదాదులయం దత్యంత శ్రద్ధగలవాఁడు ననియును భావము.

వ. ఇట్లు దన దివాకీర్తిజని నగు పరమార్తి నైచ్యంబు సకలజనశోచ్యంబుగా గుడి లాఁపఱా తూఁపరాణి కడ నిలిచి కొలిచి బహిరావరణప్రదక్షిణంబ కావించి ప్రాదెక్కనిజపక్కణంబునకుం బోవు చుండు నిట్లుండి యొక్కనాఁడు. ౧౦.

టీక. ఇట్లు = ఈరీతిగా, తన = తనయొక్క, దివాకీర్తిజనిన్ = నికృష్టమగుపంచమజన్మముచేత, (చండాలప్లవమాతంగ దివాకీర్తిజనంగమాః అనియమరము) అగు = కల్గినట్టి, పరమార్తి = అధికమగునార్తివల్లనైన, నైచ్యంబు = నీచభావము, (జాత్యుచి

తవిన(మభావమనుట) సకలజన=ఎల్లవారలకు, శోచ్యంబుగా=క్లేశార్హముగాఁగను, (ఇతనిఁ జూచి యందఱు జాలింబడి కనికరింతు రనుట) గుడి=కోవెలయొక్క, లాపణా=చదరముగుపలకఱాలుగల, తూపరాణికడ=జలదారిదాపున, నిలిచి=నిలుచుండి కొలిచి=సేవించి, బహిరావరణప్రదక్షిణంబు కావించి=బహిఃప్రాకారమునకావల వలగొని, (తాను పంచముఁడగుటచేత గుడిలోపలికిఁ జనఁడనుట) ప్రాగ్దిక్కున్=ప్రాగ్దిశఁపోఁగా, నిజ=స్వకీయమగు, పక్కణంబునకు=పల్లెకు, "పక్కణశ్శబరాలయః." అని నిఘంటువు. పోవుచుండున్=చనుచుండును, ఇట్లుండి=ఈరీతి వచ్చుచుం బోవు చుండి, ఒక్కనాఁడు=ఒక్కదివసంబున.

తా. సుగమము.

క. అద్దమరే యద్దాసరి, యద్దండ బిడాలగాహి ♦ తాలయ కృకవా,
కూద్దండ రవము విని చను, ప్రొద్దాయె నటంచుఁ బాడఁ ♦ బోవుచుఁ ద్రోవన్. ౧౧.

టీక. అద్దమరేయి=అర్ధరాత్రమునందు, (అద్దమరేయి+అద్దాసరి. ఇత్వసంధి) అద్దాసరి=ఆదాసుఁడు, అద్దండన్=ఆసమీపమందు, బిడాల=పిల్లిచేతను "ఓతుర్బిడాలో మార్జాల" అనినిఘంటువు. గాహిత=ప్రవేశింపఁబడిన, ఆలయ=ఇంటియందలి, (కోళ్లగుడిసెయనుట.) కృకవాకు=కోళ్లయొక్క, ఉద్దండ=అధికమైన, రవము=రవళిని, విని=ఆకర్ణించి, చనుప్రొద్దు=తాను నిత్యముం బోయెడు సమయము, ఆయె నటంచున్=అయ్యెననుకొని, పాడఁబోవుచున్=గానము సేయ నేఁగుచును, త్రోవన్=మార్గమందు.

తా. అర్ధరాత్రసమయమందుఁ గుక్కుటాలయములోనికిఁ బిల్లిచేరఁగా నవి వెఱచి కూఁత లిడిన దాను విని వేఁకువ కోడికూఁత లని తలంచి తాను నిత్యముగాఁ బాడ నేఁగెడు సమయ మాయె నని బయలుదేరి పోవుచు మార్గమందు. ఇది ముందటి కన్వయ మగును.

ఆ. మరులుదీఁగె మెట్టి ♦ యిరు లన్న నో యని, యెడు తమిస్రఁ గాడు ♦ పడి పొలంబు,
లెల్లఁ దిరిగి తూర్పు ♦ దెల్లనౌతటి నొక్క, శూన్యగహనవాటిఁ ♦ జొచ్చి చనుచు. ౧౨.

టీక. మరులుదీఁగె=వెఱ్ఱితీఁగెను, మెట్టి=ఆదాసరి త్రొక్కి, ఇరులన్నన్=చీఁకటులనిపిలువఁగానే, ఓయనియెడు=ఓయని పలికెడునట్టి, (కటికిచీఁకటియనుట) తమిస్రన్=చీఁకటి రాత్రియందు, (తమిస్రా తామసీరాత్రిః అని యమరము) కాడుపడి=త్రోవదప్పికలువరపోయి, పొలంబులెల్లన్=ఎల్లపొలములును, తిరిగి=దిమ్మదిరిగి, తూర్పు=

ప్రాగ్దిశ, తెల్లనౌతతిక్ = తెల్లఁబడుసమయమందు, (ప్రభాతసమయమనుట) ఒక్కశూన్య గహనవాటిక్ = ఒకపాడైనయూరుగలయడవియందు, చొచ్చి = ప్రవేశించి, చనుచుక్ = పోవుచు.

తా. సుగమము.

సీ. ఇడిసిన యిడుపుల ♦ యెడలఁ బ్రాఁచే నుత్తరేను గసెంద కో ♦ రింద పొదలఁ,
గెడసిన గరిసెల ♦ క్రింద లాగలఁ గ్రుస్సి యదనకాపురముండు ♦ నాఖుతతుల,
సగముదుమ్మునఁ బూడి ♦ చిగిరింత వామూయఁ బెరిగిన నూతిపాఁ ♦ తర బొంతియలఁ,
జీమలుప్రాలీడ్వఁ ♦ జివికినవెలుగుపట్టునఁ బండి యెండి క్రుం ♦ గిన గునుకులఁ,
గీ. బెంటదొగ్గళ్లలోఁ గడు ♦ పంటి శ్మశ్రు, చలనములఁ గ్రుక్కు జీర్ణోతు ♦ వులఁ బొలంబు,
దుండఁగల మళ్ల యౌరులఁ ♦ దూలి రాడు, చిక్కు నేతాల పాడరి ♦ సీమఁ జనుచు.

టీక. ఇడిసిన = విరిగిన, ఇడుపుల యెడలక్ = వాకిళ్ల యుభయ పార్శ్వముల యందు, ప్రాఁచేను = చిటిరేఁగుచెట్లయొక్కయు, ఉత్తరేను = అపామార్గములయొక్కయు, కసెంద = కాసమర్దములయొక్కయు, కోరింద = కోరిందచెట్లయొక్క, పొదలక్ = పొదరుల చేత, కెడసిన = క్రిందికొఱగినట్టి, గరిసెలక్రిందక్ = గాదెబొట్టలక్రిందను, లాగలక్ = బొక్కలయందు, క్రుస్సి = కృశించి, అదనకాపురముండు = కొనగాపురమున్నట్టి, ఆఖుతతులక్ = మూషకములగుంపుల చేత, సగము = అర్ధభాగము, దుమ్మునక్ = గాలిదుమ్ముచేత, పూడి = పూడ్పఁబడి, చిగిరింత = చిగిరింతగడ్డి, వామూయక్ = మొగము మూయ, పెరిగిన = ఎదిగినట్టి నూతి = చేదుబావులయొక్కయు, పాఁతెర = పాఁతరలయొక్కయు, బొంతియలక్ = బొందలచేతను,(నూతి పాఁతరల గుంటలు సగముపూడి యదిమొదలు గడనుచిగిరింత బలసియున్న దనుట) చీమలు = పిపీలికలు, ప్రాలు = బియ్యమును, ఈడ్వక్ = ఆకర్షించు కొనిపోఁగా, చివికిన = జీర్ణమయినట్టి, వెలుగుపట్టునక్ = దొడ్డికంపలపట్టున, పండి = పచ్చఁబారి, ఎండి = శుష్కించి, క్రుంగిన = అడఁగిపోయిన,గునుకులక్ = గునుకుఁగసవుచేతను, పెంటదొగ్గళ్లలోక్ = పెంటలమీఁదిదొగ్గలిచెట్లయందు, కడుపంటి = కడుపు వెన్నునంటుకొని, (అశనములేక నకనకలాడుననుట) శ్మశ్రు = మీసములయొక్క, చలనములక్ = కదలుటలచేత, క్రుక్కు = అడఁగియున్న, జీర్ణోతువులక్ = ముసలిపిల్లులచేతను, (తద్భవేదేశ్మశ్రుపుంముఖే, ఓతు ర్బిడాలోమార్జాల అనియు నిఘంటువు) పొలంబు = పొలముయొక్క, దుండుగల = దుండిగపుఁజెట్లచేతను, మళ్ల = వరిమళ్లయొక్క, ఔరులక్ = ఔరుగసవు గంటలచేతను(కృషిలేక యుండుటచేతఁ బొలములందు దుండిగములును వరిమళ్లయందు వీరణపుగంటలును మొలిచిన వనుట) తూలి = నేలకు వ్రాలి, రాడుచిక్కు = నిట్రాడుమాత్రముమిగులునట్లున్న, ఏతాల =

పీతములుగల, పాడరిసీమన్=పాడడచిన భూమియందు, (కూచము మాత్రము గనుపడుచు జలయంత్రములు దుమ్మునఁ బూడిబోయిన పాడుభూమి యనుట)చనుచున్=పోవుచును.

తా. సుగమము.

క. అపమార్గత నరుగుచు మా, ర్గపు ధామార్గనపుఁ గంట ♦ కంబులఁ గాళ్ళన్,
విపరీతత నూడ్చుచు నే, రుపున నపల్లేరు లీడ్చి ♦ త్రోయుచుఁ జనుచున్. ౧౪.

టీక. అపమార్గతన్ = త్రోవదప్పుటచేత, అరుగుచున్ = పోవుచు, మార్గపు=తానుబోయెడిమార్గమందలి, ధామార్గనపు = ఉత్తరేనిచెట్లసంబంధులగు, (అపామార్గశ్శైఖరికో ధామార్గనమయూరకా యనినిఘంటువు) కంటకంబులన్=ముండ్లను, కాళ్లన్= పాదములయందు, విపరీతతన్=ఎదురుతెగుట చేతను, ఊడ్చుచున్=పొరాల్చుచును. నేరుపునన్=ఉపాయముచేతను, పల్లేరులు=పల్లేరుఁగాయలు, ఈడ్చి = నేలమీఁదఁగాళ్లీడ్చి, త్రోయుచున్=త్రోయుచును, చనుచున్=పోవుచును.

తా. సుగమము.

శా. కాంచెన్ వైష్ణవుఁ డర్ధగోజన జటా ♦ ఘాటోత్థశాఖోపశా,
ఖాంచద్ఝాటచరన్మరుద్రయదవీ ♦ యః ప్రేషితోద్యచ్ఛదో,
దంచత్కీటకృత వ్రణచ్ఛలన లి ♦ ప్యాపాదితా ధ్వన్యని,
స్సంచారాప్తమహాఫలోపమఫల ♦ స్ఫాయద్వటక్ష్మాజమున్. ౧౫.

టీ. వైష్ణవుఁడు=ఆభాగవతుఁడు, అర్ధయోజన = రెండుపరుగులదూరమునఁబఱుకఁగల, జటా=ఊడలయొక్క, ఘాటీ=సమూహమందు, ఉత్థ=మొలిచినట్టి, శాఖా=కొమ్మలయొక్కయు, ఉపశాఖా=ప్రక్కకొమ్మలయొక్కయు, అంచత్=ఒప్పుచున్న, ఝాట=గుంపులయందు, చరత్=సంచరించుచున్న, మరుత్=వాయువుయొక్క, రయ=వేగముచేత, దవీయః=దవ్వుగాను, ప్రేషిత=చిమ్మఁబడినట్టియు, ఉద్యత్=ఎగురుచున్నట్టి, ఛద=ఆకులయందు, ఉదంచత్=స్ఫుటములగుచున్న, కీట=పురుగులచేత, కృత=చేయఁబడిన, వ్రణ=బొందలనియెడు, ఛలన=వ్యాజముగల, లిపిన్=అక్షరములచేత, ఆపాదిత= సంపాదింపఁబడిన, అధ్వన్య=మార్గస్థులయొక్క, నిస్సంచార = సంచారాభావముచేత, ఆప్త=పొందఁబడిన, మహాఫల... మహత్=శ్రేష్ఠమైన, ఫల=పుణ్యఫలముతోడ, ఉపమ =సామ్యముగల, ఫల=పండ్లచేతను, స్ఫాయత్=వృద్ధిఁబొందుచున్న, వటక్ష్మాజమున్= మఱ్ఱిచెట్టును, కాంచెన్=చూచెను.

తా. ఆభాగవతుఁడామార్గమందు రెండుకోసుల వెడలుపున నూడలుదిగి యూడలయందే యనేక శాఖోపశాఖలు గలిగి యాశాఖలయందలి యాకులమీఁద బురుగులు దొలిచిన బొందలతోఁ గూడ నవి వీడి వాయువశముచేత దూరదూరముగాఁ గొట్టుకొనివచ్చి యెగురుచుండఁగా నావృక్ష మచ్చట బ్రహ్మరక్షస్సున్న దీత్రోవను రావలదని మార్గస్థులకుఁ దెలియుటకు నాయాకులనెడు జాబులమీఁదఁ బురుగులచేఁ దొలువఁబడిన గీఁత లనియెడు నక్షరములు వ్రాసి పంపుచున్నదో యన్నట్లును దానివలన మార్గస్థు లా మార్గమున సంచరింపకుండుటంజేసి మహాపుణ్యఫలముచేఁ గలిగె ననుటకు సమానముగా గొప్పలగు పండ్లచేత నొప్పుచున్న యొక్క పెద్దమఱ్ఱిచెట్టును జూచె నని భావము.

ఆ. కాంచి యాతఁ డొక్క ♦ కాలిత్రోవయు నంత. గాంచి యందుఁ దెరువుఁ ♦ గాంచినదియు,
పరమలబ్ధిగాన ♦ త్వరితంపుగతి నవ్వ, టావనీజ మంత ♦ నంతఁ గదిసి. ౧౬.

టీ. కాంచి=ఆవృక్షమునట్లుచూచి, ఆతఁడు = ఆభక్తుఁడు, ఒక్కకాలిత్రోవయున్ =ఒకకాలిమార్గమును, అంతఁగాంచి=అంతటఁజూచి, అందున్ = ఆపొడచూపినసీమయందు, తెరువుఁగాంచినదియు=మార్గముఁజూచుటయే, పరమలబ్ధిగాఁగన్ =పరమలాభముగా, త్వరితంపుగతిన్ =శీఘ్రగమనము చేత, అవ్వటావనీజమును=ఆమఱ్ఱిచెట్టును, అంతనంతన్ = అంతటంతటను, కదిసి=చేరవచ్చి.

తా. సుగమము.

సీ. ఎలనీటి బొండలం ♦ బులఁ బోలె మెదడెల్ల జుఱ్ఱి వైచిన దొల్లు ♦ పుఱ్ఱె గములు,
నెఱచి గీఱిన జీఱ ♦ లేర్పడఁ దుదముట్టఁ జీకిన నులిపచ్చి ♦ కీకసములు,
దొనదొనయను నీఁగె ♦ తుట్టెల రూపేరు పడక క్రంపలను వ్రే ♦ లెడు కరుసులు,
ధూళ్లి మక్కెక్కి మం ♦ గళ్లతిప్పలు రేఁగు వడువున గాలినా ♦ డెడు నెఱికలు
తే. దునిసిన నరాంగకముల బొ ♦ త్తులను గమిచి, పోక యొండొంటితోఁ బిఱు ♦ పీఁకులాడు,
శ్వాపదంబులు బెదహుతి ♦ ప్రస్సి వలుచు, వరుగు దఱచ గుమురుత్రోవ ♦ నరిగి యెదుట.

టీక. ఎలనీటి=లేఁతనీరుగల, బొండలంబులఁబోలె= టెంకాయబొండ్లములవలెనే, మెదడెల్లన్ =మస్తిష్కమంతయు, జుఱ్ఱి=ఊటుకొని, వైచినన్ =పరిహరింపఁగా, దొల్లు=దొరలాడుచున్న, పుఱ్ఱెగములున్ =నరకపాలసమూహములును, (ఎళనీరు ద్రావి పారవైచిన టెంకాయ బొండ్లములవలెనే తలకాయల మెదడు జుఱ్ఱి వేయఁగా నాపుఱ్ఱెలు దొల్లుచున్న వనుట) ఎఱచిగీఱినజీఱలు=మాంసముగీచుకొన్న గీఱలు, ఏర్పడన్ =కనుపడునట్లు, తుదముట్టన్ =కడవెడలునట్లు, చీకిన=చప్పరించిన, నులిపచ్చి = కొంచెముపచ్చి

కల, కీకసములు=ఎముకలునుగల "కీకసంకుల్యమస్థి చ" అని నిఘంటువు. దొనదొనయను= దొనదొన యనియెడు ముసరికొను చప్పుడుగల, ఈఁగెతుట్టెలన్=మక్షికారాసులచేత, రూపేరుపడక=రూపము దెలియరాక, క్రంపలను=క్రంపవెలుగులయందు, వ్రేలెడు= వ్రేలాడుచున్న, కరుసులు=పచ్చిచర్మములును, ధూళ్ళ=దుమ్ములచేతను, మక్కెక్కి= ముక్కుడువారి, మంగళ్లన్=క్షౌరకులయొక్క, తిప్పలు=పెంటలు, రేఁగుపడువునన్=రేగి నట్లు, గాలిన్,=వాయువుచేత, ఆడెడు=చలించుచున్న, ఎఱకలు=వెంద్రుకలును, తునిసిన=ఖండింపఁబడిన, నర=మానవులయొక్క, అంగకములన్=అవయవములను, పొత్తులను =కూడ, కమిచి=కబళించి, పోక=అనలజరగక, ఒండొంటితోన్=పరస్పరమును, పీఱు పీఁకులాడు=లాదులాడుచున్న, శ్వాపదంబులున్=దుష్టమృగ విశేషంబులును, పద హతిన్=కాలితన్ను చేత, వ్రస్సి=వ్రయ్యలై, వలచు=కంపుగొట్టుచున్న, వరుగు=మాంసపువరుగును, (వరుగనఁగా గృధ్రవిశేషములనియుఁ జెప్పవచ్చును) తఱచగు=దట్టముగాఁ గలిగిన, మురుత్రోవన్=మాంసములుమురిగియున్న మార్గమున, అరిగి=పోయి, ఎదుటన్ =ముందఱ.

తా. ఆబ్రహ్మరక్షస్సనేకులను బట్టి చంపుచుండుం గాన నాప్రదేశమందు మెదడు జుట్టివైచిన కపాలములును శల్యములు మాంసముతోడ నోటఁగఱచి పండ్లగిజితిని పారవేసిన యవియును శరీరములు చర్మములొలిచి క్రంపల మీఁద వేయగా నీఁగెలు మూఁగిరూపు గానరాకుండుననియును బహుకాలముగా ననేకులఁ జంపుటచేత వారి తలలవెంద్రుకలు కుప్పలైపడియుండి ధూళిచేతఁ గొంత బ్రుంగుడువడి గాలిచేత మంగళ్లపెంటలు రేఁగినట్లు రేఁగుచుండు ననియును దునిగిపోయిన మానవావయవముల నవ్వల నివ్వలఁ గబళించి దుష్టమృగములు పీఁకులాడుచుండుననియును గాళ్లఁదన్ని బ్రద్దలుచేసి యెండవేసిన వరుగులును గలిగి యిట్టి భీభత్సరసాస్పదంబైన యా మురుమార్గమున నతఁ డరుగు చుండె నని భావము.

సీ. ముంగాళ్లఁ జాఁగిపై ♦ముచ్చుఁజూపులు పర్వ♦బొమికలెత్తుచుఁ బాతి♦పోవు శునులఁ,
జిలలతోరణములు♦వట్టి బిట్టెగయశా ♦ ఖాధూతి నెగయు కం♦కముల రొదల,
వడ్డంబు దిరిగి త♦లాహతిఁ బడి రొండి ♦హస్తంబు లిడి యంగ ♦ లార్చుకపుల,
డబ్బాటుసై నొక్కె♦డలునూపి యవిమాయ♦నడఁగ వేఱెడఁ జూపు♦వ్యాపృతులను,
తే. నెవ్వఁడొయొక్కఁడున్న వాఁ♦డిందు వాఁడు♦నరుఁడు గాఁడింధనాదికా♦హరణమునకు
వేళయును గాదు హాలగాలి♦ఫిచోఁ దెరువు♦నెడ పనుచు జాలిగొని సంశ♦యించువేళ,

టీక. ముంగాళ్లన్ = ముందటికాళ్ల చేత, వ్రాఁగి = వ్రాఁగిలిపడి, పైన్ = ఉపరిప్రదేశమున, ముచ్చుఁ జూపులు = దొంగచూపులు, పర్వన్ = వ్యాపింపఁగా, భామికలు = శల్యములను, ఎత్తుచు = ఎత్తుకొనుచు, పాఱిపోవు = పరుగులిడుచున్న, శునులన్ = కుక్కలచేతను, పలలతోరణములు = మాంసపుఁదోరణములను, పట్టి = కఱచుకొని, బిట్టు = పెల్లుగా, ఎగయ = ఎగసిపోవఁగా, శాఖాధూతిన్ = కొమ్మలు గదలుట చేత, నెగయు = పుట్టుచున్న, కంకముల = రాబులుగులయొక్క, "లోహపృష్ఠస్తుకంకస్స్యాత్" అని నిఘంటువు. రొదలన్ = శబ్దములచేతను, అడ్డంబుదిరిగి = అబ్రహ్మరక్షస్సునకడ్డాలువచ్చి, తలాహతిన్ = అఱచేతిప్రేటును, పడి = పొంది, (దెబ్బఁదినియనుట) రొండిన్ = కటిప్రదేశమందు, హస్తంబులిడి = చేతులిడుకొని, అంగలార్చు = మిడుకుచున్న, కపులన్ = కోతులచేతను, డబ్బాటుమైన్ = హఠాత్కారముగా, ఒక్కెడలుసూపి = ఒక్కదిక్కుగానుపించి, అవి = ఆప్రదేశములు, మాయన్ = టక్కుచేతను, అడఁగన్ = కనుపడకపోఁగా, వేఱెడన్ = మఱియొక్కదిక్కును, చూపు = కనఁబఱుచుచున్న, వ్యాపృతులను = వ్యాపారములచేతను, ఇందు = ఈప్రదేశమందు, ఎవ్వఁడో యొక్కఁడున్నవాఁడు, వాఁడు, నరుఁడుగాఁడు = మానవుఁడుగాడు, ఇంధన = శుష్కములు, ఆదిక = మొదలుగాఁగలనన్యవస్తువులయొక్క, ఆహరణమునకు = తెచ్చుటకును, వేళగాదు = సమయంబునుగాదు, పొలగాలి = మాంసపుగాలి, వీచెన్ = విసరెను, తెరువున్ = మార్గంబును, ఎడపు = ఎడారి, అనుచున్ = అనితలఁచుచు, జాలిగొని = దిగులొంది, సంశయించు వేళ = సందియపడు నవసరంబున.

తా. సుగమము.

సీ. మృతమర్త్యు రెంటాన ♦ నిడ్డఁ జాలక నెత్తు ♦ రంజిల్లు పెనుపొట్ట ♦ ముంజివానిఁ,
బల్లచీమల వ్రక్క ♦ భల్లాతకియుబోలె నెల్లిదుప్పటినొప్పు ♦ కన్నువాని,
న్యత్యస్తహస్తిమ ♦ స్తాభఁ బాయగు గడ్డ ♦ మునుదంష్ట్రికలుఁ బొల్చు ♦ మొగమువానిఁ,
గడుదుర్గ నిడుతుట్టె ♦ గతిఁ జోఁగలోఁ బాండురతమించు కపిలకూ ♦ ర్చంబువాని,
తే. నెఱుకుఁదఱువరిఁ గన శాఖ ♦ లెక్కఁ జాఱు, ప్రేవుజందెంబుఁ గసరి పైఁ ♦ బెట్టువాని,
ప్రేలుడగు బొజ్జగల బూర ♦ గాలివానిఁ, జెంబుతలవాని నవటుక ♦ చంబువాని. ౧౫౫

టీక. మృతమర్త్యున్ = చచ్చినమానవుని, రెంటానన్ = మడచి, ఇడ్డన్ = ఉంచుకొన, జాలక = పాడవుసాలక, నెత్తురంజిల్లు = రక్తమంటియున్న, పెనుపొట్ట = పెద్దకడుపునందలి, ముంజివానిన్ = కటిసూత్రముగలవానిన్, (శవమును గాపీనముగాఁ బెట్టుకొన్నవాడి పాడవుసాలక యీడ్చియీడ్చి నేలత్రాటిలో దోపుకొనఁగా దాని నెత్తురు పొట్టకంటెనసనుట)

పల్లచీమలన్ = బాపనచీమలచేత, వక్రభల్లాతకియుంబోలెన్ = వంకరజీడిచెట్టువలె,ఎఱ్ఱదుప్పటిన్= రక్తవర్ణముగల దుప్పటిచేతను, ఒప్పు=ఒప్పుచున్న, కట్టైవానిన్=నల్లనిమేనుగలవాని, వ్యత్యస్త=క్రిందుమీఁదయిన, హస్తి=ఏనుంగుయొక్క, మస్త=తలయొక్క,అభన్=రీతివంటి రీతిచేతను,పాయగు=పాయయైనగడ్డమును,దంష్ట్రికలున్=కోరలును,పోల్చు=మెఱయుచున్న, మొగమువానిన్=ముఖముగలవాని, (కుంభికుంభస్థలము తలక్రిందుజేసిననాకుంభస్థలమువలెఁ బాయవడ్డ గడ్డమును నాదంతి దంతములవంటి కోఱలును గలిగి యున్నవనుట) కడుదులన్=కణుఁదురీఁగెల యొక్క, నిడు=నిడుదయైన, తుట్టెఁగతిన్=పెఱవలె, చోఁగలో=గుంతలోను, (చొంగలోననుట) పాండురతన్ = తెల్లఁదనముచేత, మించు=అతిశయించుచున్న, కపిలకూర్చంబువానిన్... కపిల = కడారవర్ణముగల, కూర్చంబువానిన్ = భ్రూమధ్యదేశముగలవాని, "కూర్చమ స్త్రీభ్రువోర్మధ్యమ్" అని నిఘంటువు. ఎఱుకుదెఱువరిన్=ఎఱకువాఁడగుమార్గస్థుని, కనన్=చూచుటకొఱకు, శాఖలెక్కన్=కొమ్మలనెక్కఁగా, జాఱు=జాఱిపోవుచున్న, ప్రేవుజందెంబున్=ప్రేగులజన్నిదమును, కసరి=గద్దించుకొని, పైబెట్టువానిన్=భుజముమీఁదికిఁద్రోచికొనువానిని, వ్రేలుడగు=వ్రేలాడుచున్న, బొజ్జగల = బొజ్జగలిగిన, బూరగాలివానిన్=ఊఁచకాళ్లవాని, చెంబుతలవానిన్= చెంబువలె నున్ననై బట్టగట్టిన శిరముగలవానిని, అవటుకచంబువానిన్...అవటు = ముచ్చెనగుంటయందు, "అవటుఃఘాటాకృకాటికా" అనినిఘంటువు. కచంబువానిన్=జుట్టుగలవానిని, (కర్తృపదక్రియాపదము లీపద్యమందు లేవుగావునఁ గుళకము, "క్వచి త్కులకసంఖ్యాదానత్రనాహిత కృద్భవేత్" అని యథర్వణోక్తి). తా. సుగమము.

తే. కండకన్నులవాని నాఁ♦కటను బండ, తిట్లు బేతాళికల సారెఁ♦ దిట్టువాని,
నగగరిమవాని నన్వర్థ♦నాముఁ గుంభ,జాను ననునొక్క ద్విజనిశా♦చరునిఁగనియె.

టీక. కండకన్నులవానిన్=కండపెరిగిన కన్నులుగలవానిని, ఆఁకటను=ఆఁకటిచేతను,"ఔపవిభక్తికనామ్నాంఋత్వంస్యాత్సప్తమీతృతీయార్థే" అనుసూత్రముచేతనత్వము. బండతిట్లన్=బూతుదిట్టులచేత, బేతాళికలన్=ఆఁడుదయ్యాలను, సారెన్=పల్మఱును, తిట్టువానిన్=తిట్టుచుండెడువానిని, నగగరిమవానిన్ ...నగ=పర్వతముయొక్క, గరిమవానిన్=గురుత్వమువంటి గురుత్వముగలవానిని, (కొండంతవాఁడనుట) అన్వర్థనామున్=సార్థకనామధేయముగలవాని, కుంభజానువన్=కుంభజానువనుపేరుగల, (కుంభజానువనఁ గుండలవంటి మోకాళ్లు గలవాఁడనుట) ఒక్క=ఒక్కఁడైన, ద్విజనిశాచరునిన్=బ్రహ్మరాక్షసుని, కనియెన్=చూచెను, తా. సుగమము.

ఉ. వాఁడును గంటిఁ బోకు మని ♦ వ్రాలె మహి న్విటపాళి నుగ్గుగా,
వీఁడును మున్ను రే పగటిఁ ♦ వేళకు మానిసియాటఁ బోరిలో,
వాఁడిమిఁ గొంతకాల మిల ♦ వ్రాలుట లావరియాట నిల్చి యా,
వాఁడిశరంబుచే నడువ ♦ వాఁ డది ద్రుంపుడు వీఁడు నుద్ధతిన్. ౨౧

టీక. వాఁడును=ఆబ్రహ్మరాక్షసుఁడును, కంటిన్=చూచితిని, పోకుమని=పోవకుమని,విటపాళి=చెట్టుకొమ్మలగుంపు,నుగ్గుగాన్=చూర్ణమగునట్లు,మహిన్=భూమియందు, వ్రాలెన్=దుమికెను,వీఁడును=ఈదాసరియును,మున్ను=పూర్వమందు, రేపగటివేళకు=రాత్రియొక్క,పగటియొక్క సమయమునకు, మానిసియాటన్=తగినమనుష్యుఁడౌటచేత, పోరిలోన్=యుద్ధమునందు, వాఁడిమిన్=పరాక్రమముచేత, కొంతకాలము=కొన్నాళ్లు, ఇల వ్రాలుటన్ = భూమియందుఁదిరుగుటచేతను, లావరియాటన్=బలముగలవాఁడౌటచేతను, నిల్చి=ఎదిరించి, ఆవాఁడిశరంబుచేన్=ఆమున్నుదానుదెచ్చినజోడమ్మునియెడు, వాఁడి=తీక్ష్ణమగు, శరంబుచేన్=బాణముచేత, ("సంస్కృతపదేన పరిమితమాంధ్రపదం కర్మధారయోభవతి" అను సూత్రముచేతను, మఱియు నాంధ్రం షడ్వర్ణపర్యంతం సంస్కృతేన సమస్యతే; అను నథర్వణోక్తిచేతను "వాఁడిమయూఖముల్గలుగువాఁడపరాంబుధిఁజేరి నేటికిన్రాఁడుకచుండు" అనువాగనుశాసనప్రయోగముచేతను సాధువు.)అడువన్=కొట్టఁ, వాఁడు=ఆరక్కసుఁడు,అది=ఆబాణమును, "ఇతరత్రచ ద్వితీయా తస్యాః ప్రథమాచజడపు దానాంస్యాత్తనుసూత్రముచేతద్వితీయకుఁబ్రథమ" ద్రుంపుడున్=విఱిచివేయఁగా,వీఁడును=ఈదాసరియును, ఉద్ధతిన్=రభసముచేతను. తా. సుగమము.

సీ. తిగిచిన నడుగులు ♦ దెమలక ఱొమ్మప్పళించి యవ్వలి కిఁ జం ♦ డించి దాఁటి,
చఱచిన వంచించి ♦ చరమ భాగమునకై తిరిగి తత్క్రియ కగు ♦ దృష్టి నిలిపి,
పైఁబడ్డఁ జనుమర ♦ పట్లు కొడ్డుకయుండు పిడికిళ్ల బలిమి లోఁ ♦ బడక నిలిచి,
చోరఁజూడ గ్రుంగి ము ♦ ష్టులబిగి కోటగాఁ జొరవీక తిరిగెడు ♦ చోన తిరిగి,

గీ. యసుర వధసాధనము రోయు ♦ నపుడు గ్రుద్ది, తాఁచి తిరిగినఁ గృతముష్టి ♦ దండనిలిచి,
యెడకొలఁది వెనుక నడు మొయ్య ♦ నడఁచియడిచి, మత్ప్రదస్మృతి యాత్మనే ♦ మఱక
యతఁడు. ౨౨

టీక. తిగిచినన్=ఆరాక్షసుఁడుదన్నుఁబడలాగినను, అడుగులుదెమలక=తనయడుగులుగదలక, ఱొమ్ము=వక్షఃస్థలము,అప్పళించి=ఆస్ఫాలించి,అవ్వలికిన్=ఆవలికి,చండించి=

ఎగసి, దాఁటి=లంఘించి, చఱచినన్=ఆరాక్షసుఁడఱచేత వ్రేసినను, వంచించి=కికురించి, చరమగమునకై=వెనుకదిక్కునకై, తిరిగి=మరలి, తత్క్రియకగు=మఱలఁజరచుటకైన, దృష్టి=చూపు, నిలిపి, పైఁబడ్డన్=ఆయసురతనపైఁబడిరాఁగా, చనుమరపట్టుతున్=ఱొమ్ము మీఁదికి, ఒడ్డుకయుండు=ఒడ్డుకొనియుండెడు, పిడికిళ్లబలిమిన్=ముష్టిబలము చేత, లోఁబడక=లోఁకువగాక, నిలిచి, చొరజూఁడన్=ఆయసురచొచ్చి రాఁబోఁగా, క్రుంగి=తానువంగి, ముష్టులబిగి=పిడికిళ్లబిగువే, కోటగాన్=వప్రముగా, చొరవీక=చొరనియ్యక, తిరిగెడుచోన=ఆయసురతిరిగెడుచోటనే, తిరిగి, అసుర=ఆరక్కసుఁడు, వధసాధనము=తన్నుఁజంపెడునుపాయమును, రోయునపుడు=వెదకునప్పుడు, గ్రుద్ది=పిడికిటఁబొడిచి, తాచి=తన్ని, తిరిగినన్=వాఁడుదిరుగఁగానే, కృత=అమర్పఁబడిన, ముష్టి=పిడికిటియొక్క, దండన్=ప్రాపున, నిలిచి, ఎడకొలఁది=సందుచిక్కినకొలఁదియు, వెనుక=వానివీపును, నడుము=మధ్యదేశమును, ఒయ్యన్=క్రమముగా, అడచియడచి=కొట్టికొట్టి, "వెనుకనడుగొయ్యనడచినడచి" అనియును పాఠాంతరముగలదు. అప్పుడు వెనుకకుఁబోయియనుట, మత్పదస్మృతి=మాపాదానుచింతనమును, ఆత్మన్=బుద్ధియందు, ఏమఱక=మఱచిపోక, అతఁడు=ఆదాసరి, (ఇదికర్తృపదము) అసురయనుచోట "స్త్రీత్వ బహుత్వేసురాదేరసమాసే" అను సూత్రముచేత నిది సురాదిగణపఠితమైన నేకవచనమందు స్త్రీత్వము. (కం. చంపునొకోయక్కట కా, రింపం దలఁచునొకో లఘుచ♦రిత్రంబులకుం, బంపఁ గడంగునొకో శం, కింపం డీక కలుకుటసుర ♦ గీడొనరింపన్. అనిసర్వవనోత్తరరామాయణప్రయోగము )

తా. సుగమము.

తే. త్రాచి పోఁజూడఁ దన రాక్ష ♦ సీచయంబు, నెల్లఁ జీరిన డిగ్గవా ♦ రేఁగుదేరఁ,
బోయె నదె వాఁడు రార రా ♦ రేయటంచుఁ, బారి వారును దానును ♦ బట్టికొనుఁడు.

టీ. త్రాచిపోఁజూడన్=ఆదాసరిత్రట్టివైచిపోవనుద్యోగింపఁగా, తనరాక్షసీచయంబు నెల్లన్=తనరాక్షసస్త్రీలనందఱను, చీరినన్=పిలువఁగా, డిగ్గి=చెట్టుదిగి, వారేఁగుదేరన్=వారు రాఁగా, వాఁడు=ఆమనుష్యుఁడు, పోయెనదె=అదిగోపోయెను, రారరారేయటంచున్=రండురండనుచు, "ఏదోత్వేవ్యతిరేకాదపిసంప్రార్థనపరాత్క్రియాణాం స్త" అనుసూత్రముచేత వ్యతిరేకరూపము; మీఁది యేకారముసంప్రార్థనపరము. పారి=ఉఱికి, వారును=ఆయాడురక్కసులును, తానును=కుంభజానుఁడును, పట్టికొనుఁడు=ఆదాసరిని బట్టుకోఁగానే.

తా. సుగమము.

క. పెంబో తద్దా సరి య, ప్డుం బదహతులను గపోణి ♦ పోటుల నిరుమే,
నం బొడుచుచుఁ బెనఁగుచుఁ బో, వం బట్టి వటంబుఁ జేర్చి ♦ వాఁ డిట్లనియెన్. ౨౪.

టీ. పెంబోతు=పెనుబోతగు, (బలసినవాఁడనుట; బంబోతనికొందఱందురు) అద్దాసరి=ఆదాసుఁడు, అప్డున్=అప్పుడును, "పోశ్చతదాద్యర్థవాచకేష్వాత" అను సూత్రముచేతఁ బునర్ణోపరివిద్యమానమగు నుత్వమునకు లోపంబును "తద్ద్రుతంచ బిందుస్స్యాత్" అనిచెప్పఁబడినసూత్రముచేత ప్రథమాసమశబ్దముమీఁదసముచ్చయార్థకమగు ద్రుతంబునకుఁ బూర్ణబిందువును వచ్చినది. పదహతులను=కాలితన్నులచేతను, కపోణిపోటులన్=మోకాలిపోటులచేతను, ఇరుమేనన్=రెండుప్రక్కలయందు, (ఇది యిరువంక యిరుదెస యిరుగెడ యిరువాఁగు ద్విగు వేకవచనాంత మగుచుఁ దనరు, అన్నట్లు ద్విగు సమాసము) పొడుచుచున్=పెనఁగుచున్, పోవన్=పోవఁగా, పట్టి=ఆదాసరినిబట్టుకొని, వటంబుఁజేర్చి=మఱ్ఱిచెట్టుచాపునఁజేరిచి, వాఁడు=ఆయసుర, ఇట్లనియెన్. తా. సుగమము.

శా. సారాస్వాదనఁ బ్రాణపంచకము తృ ♦ ష్ణంబాసి సంతర్పణ,
న్మూరింబో నసిఁ ద్రుంచి పొంగెడు భవ ♦ న్ముండంబు ధారోష్మ మిం,
పారం గ్రోలి పిశాచి నీదు కఱకు ♦ ట్లందీ నదస్త్రాలకాం,
తారాంత ర్న్యక్కపాల కుందవిగళ ♦ త్సైరేయముం గ్రోలెదన్. ౨౫.

టీ. సారాస్వాదనన్=నీక్రొవ్వుఁజనిచూచుటచేతను, ప్రాణపంచకము=నాపంచప్రాణములును, తృష్ణన్=దప్పిని, పాసి=విడచి, సంతర్పణన్=తృప్తిచేత, మూరింబోన్=సంతోషింపఁగా, (కం. మదిలోన నన్నుఁదలఁచుచు, బదరీఫలమాత్ర హవ్య భాగము నలునం, దొదవించి తేనియును నభ్యుదయము నేనొంది మూరిఁ బోవనె చెపుమా. అనియును; గీ. గాడ్పుమురిపెంపు నెందునుగల్గియెల్ల, వారిమనసులు వేడ్కలమూరిఁబోయెననియును, హరివంశమునందెఱ్ఱాప్రగడగారిప్రయోగము.) అసిన్=కత్తిచేత, త్రుంచి=ఖండించి, పొంగెడు=పొంగుచున్న, భవన్ముండంబు=నీబోడితలయొక్క, ధారోష్మము=వెచ్చనిరక్తధారను, ఇంపారన్=ఇష్టముదీఱునట్లు, గ్రోలి=పానముఁజేసి, పిశాచి=ఈయాఁడుపిశాచము, నీదు=నీసంబంధియగు, కఱకుట్లు=కడ్డితోఁగుట్టికాల్చినమాంసఖండములను, అందీన్=అందియియ్యఁగా,

క. నమ్ముము కైదువ మోఁపగు, జమ్మి వెసం బ్రాఁకి విడిచి ♦ చాపము సా కం,
దిమ్మనుడు సేయునది లే, కమ్ముగ్గుం డమ్మహీజమలసత నెక్కెన్. అని విరాటపర్వము.

క. ఇతఁడు మదీయ పురోహితుఁ, డితనికిఁ దగ నెల్ల పనులు నెఱిఁగిం చిపుడే,
ధృతరాష్ట్రు కడకుఁ బనుపుడు, చతుర వచవరచన గఱపి సంప్రీతి మెయిన్.

అని యుద్యోగపర్వమందు సోమయాజిగారును ప్రయోగించినారుగాన నీక్త్వార్థక యిత్వసంధిసాధువు) అదః=ఈ, తాలకాంతార=తాటితోపుయొక్క, అంతః=లోపల నున్న, నృ=నరులయొక్క, కపాల=మజియలనియెడు, కుండ=కుండలనుండి, విగళత్=జాఱుచున్న, మైరేయముఁ=మద్యమును, క్రోలెద=త్రాగెదను. తా. సుగమము.

క. నన్నింతలయించిన ఖలు, నిన్ను న్ఋజువిధి నధింతు ♦ నే యని యార్పుల్,
మిన్నందఁగ బుస గొట్టుచు, నన్నీచుఁడు పొగరు వెడలు ♦ నవ్యక్తోక్తిన్. ౨౮.

టీక. నన్ను=నను, ఇంతలయించిన=ఇంతకష్టపెట్టిన, ఖలున్=దుష్టుఁడైన, నిన్నున్=నిను, ఋజువిధిన్ = మృదువైనరీతిచేత, నధింతునే = చంపుదునా, (చంపననుట) అని=అనుచు, ఆర్పుల్=పెడబొబ్బరింతలు, మిన్నందగన్=ఆకసమంటఁగా, బుసగొట్టుచున్=నిట్టూర్పువిడుచుచు, అన్నీచుఁడు=ఆ రాక్షసుడు, పొగరు వెడలు=మదముబయల్పడునట్టి, అవ్యక్తోక్తిన్=ఉన్మత్తభాషణముచేతను. తా. సుగమము.

తే. అసియుఁ బాత్రియుఁ దేఁ బంచి ♦ యాంత్రవల్లిఁ, గోలుగొక్కరఁ ద్రోయన ♦ కక్క
జముతోడ, నొరగి రక్కసుతో దైన్య ♦ విరహితముగ, ధర్మ మెఱిఁగించు సూక్తి
నా ♦ తండు పలికె. ౨౯.

టీక. అసియున్ = ఖడ్గమును, పాత్రియున్ = రక్తముఁబట్టుటకుఁబాత్రమును, తేన్=తెచ్చుటకై, పంచి=ఆజ్ఞాపించి, ఆంత్రవల్లిన్ = తీఁగెవంటిప్రేగుచేత, కోలుగొక్కరన్=మాటకట్టుగా, (పసరమును బడదీసెడునట్లనుట) ద్రోయన్=పడద్రొబ్బఁగా, అక్కజముతోడన్=ఆమత్తిచేష్టతో, ఒరగి, రక్కసుతో=రాక్షసునితో, దైన్యవిరహితముగ=విన్నఁబాటులేనివిధమున, ధర్మ మెఱిఁగించు=ధర్మపద్ధతిని దెలిపెడు, సూక్తిన్=మంచి మాటచేత, ఆతండు=ఆహరిదాసుఁడు, పలికెన్=వచించెను. తా. సుగమము.

చ. విను మొక మాట రాత్రిచర ♦ వేగిర మేటికి నిన్జయిన్తురే,
యనిమిషులైన భోజనగ ♦ తాన్నము నే నిఁక నెందుఁ బోయెద,
న్పైనఁగ కప్రాణ రక్షణము ♦ పేక్ష యొనర్చుట పాప మిందుకై,
కనలకు నాకు మేనియెడఁ ♦ గాంక్షయు లే దిదివోవు చే యురున్. ౩౦.

టీక. రాత్రిచర=ఓరక్కసుఁడా, ఒకమాటవినుము = ఒకవచనమాకర్ణింపుము, వేగిరమేటికి=వేగమేలను, అనిమిషులైనన్=దేవతలేని, నిన్జయింతురే=నిన్ను జయింపఁగలరా, (గెల్వలేరనుట) భోజనగత=కంచములోనికివచ్చిన, అన్నము=అశనమగు, నేనిఁకన్=నేనింక

మీఁద, ఎందుఁబోయెదన్=ఎచ్చటికిఁ బోఁగలను (భావిక్రియ) పెనఁగులాడక, ప్రాణరక్షణము=స్వజీవసంరక్షణము, ఉపేక్షయొనర్చుట=ఒప్పరికించుట, పాపము, (హంతుమభ్యాగతంశత్రుంయశ్శక్త్యానవివారయేత్, సఆత్మఘ్న ఇతిఖ్యాతో ఘోరంనరకంవ్రజేత్. అనియున్నది) ఇందుకై=ఈపనికై, (ఇందనునది యేతదర్థకమగు దేశ్యపదముగావున దీనిమీఁద, చతుర్థీవిభక్త్యర్థకమగు కైవర్ణకమువచ్చెను కావుననే యిందుమీఁద నిందుచేత మొదలగునవి గలుగును) కనలకు = అలుగకు, నాకు, మేనియెడన్ = శరీరముపట్ల, కాంక్షయున్= అపేక్షయు, లేదు, ఇది=ఈమేను, పోవుటే = నశించుటే, ఊరన్ = మేలగును.

తా. సుగమము.

ఆ. హీనజన్మ మఱుట ♦ రెవ్వఁడే నొక ప్రాణి, సంతసిలుట ముక్తి ♦ పొంత గనుట,
మేలెకాదె శిబియ ♦ మేల్బంతిగాఁడె న, శ్వరపు దేహ మమ్మి ♦ పరముగొనుట.

టీ. హీనజన్మము=చండాలజన్మము, అఱుట=పోవుటయును, ఎవ్వఁడేని=ఎవ్వఁడైనను, ఒకప్రాణి=ఒకపురుషుఁడు, (ఏనిశబ్దమునకికారలోపము) సంతసిలుట=సంతోషించుటయు, ముక్తిపొంత=మోక్షసమీపమును, కనుట=పొందుటయు, మేలెగాదె=మంచిదే కాదా, నశ్వరపు=శాశ్వతముగాని, దేహము=తనశరీరమును, అమ్మి=వెలపుచ్చి, పరముగొనుట=మోక్షముగ్రహించుటయందు, శిబియ = శిబిచక్రవర్తియే, మేల్బంతిగాఁడె = మార్గప్రదర్శకుఁడుగాఁడా, (అగుననుట). తా. సుగమము.

చ. తెవు లయినం గ్రహం బయినఁ ♦ దే లయినం గర మైన నాత్మ పెం,
దెవు లయిన జ్జలం బయినఁ ♦ దెక్కలియైన మృగాగ్ను లైన మే
ల్తవు లయిన న్వ్రణం బయినఁ ♦ ద్రాఁ చయిన న్పిడుఁ గైనఁ దీర్చు భే,
లవు తను వూర కే చెడకి ♦ లన్గృశు నొక్కనిఁ బ్రోచు టొప్ప దే. 30.

టీ. తెవులయినన్=వ్యాధియేనియు, గ్రహంబయినన్=పిశాచమేనియు, తేలయినన్=వృశ్చికమేనియు, గరమయినన్=విషమేనియు, ఆత్మపెందెవులయినన్=పెద్దమనోవ్యాధియేనియు, జలంబయినన్=ఉదకమేనియు, తెక్కలియైనన్=చోరుఁడేనియు, మృగాగ్నులైనన్=మృగములేనియు నగ్నియేనియు, మేల్తవులయినన్=స్త్రీఘనవ్యాసంగమైనను, వ్రణంబయినన్=పుండేనియు, త్రాఁచయినన్=సర్పమేనియు, పిడుఁగైనన్ = అశనియేనియును, భేలవు=బేలయగు, (నిష్ప్రయోజకమనుట) తనువు=శరీరమును, తీర్చున్=నశింపఁ

జేయును, ఊరకే=అప్లున్నార్థముగానే, చెడక=చెడిపోక, ఇలన్=భూమియందు, కృశున్= ఆకొన్న, ఒక్కనిన్=ఒకపురుషుని, ప్రోచుట=పోషించుట, ఒప్పదే = తగదా, (ఒప్పు ననుట).

తా. రోగాదులచేత నీతనువు నశింపకయుండ నాఁకలి గొన్నయొక్కనికిఁ దృప్తిగా నిచ్చుట మంచి దనిభావము.

వ. అది యట్లుండె నింకొక్క హితంబు సెప్పెద నదియును బ్రాణ భయంబున నాడు కార్యవశంపు మాటగాఁ దెలియక మాధ్యస్థంబుగాఁ దెలిసి వినుము వినవున్న భూత హితంబుఁ గోరి యుచ్చరించుమాట కీశ్వరుండైన మెచ్చుఁగదా వ్యాఘ్ర సింహ వరాహ వృక జంబుకాది శరారువుల యం దొక్క తిర్యక్కవుగావు దేవయోనివి నీకును మాకుం బలెఁ గర చరణముఖాపఘనంబులు గలవు మాటలను మాయట్ల యకర్తవ్యకర్తవ్యతా విచారంబులు సమానంబ హో మఱచి యంటి స్థావరంబులకంటెఁ గీటాదులకు వానికంటె మఱి మృగాదులకు వానికంటె మఱి పశు పతంగాదులకు వాని కంటెను మాకును మాకంటెను మీకును గరణ కళేబరాది పాటవంబెక్కుడు విజ్ఞానంబును ఘనం బిట్టి నీ కేకాంత కుత్సాసహంబగు బీభత్స వధ్యావధ్య భక్ష్యాభక్ష్య పేయాపేయవివేకంబులు లేకునికి యుక్తమే రుచిగాదు శుచిగాదు దురాహారం బదియు సకల దురితావతంసయగు హింస నొనగూడునది హింసపరలోకంబునంగదా బాధకంబు పరలోకంబు ప్రాణాంతంబునంగదా చిరస్థిరప్రాణులమగు మాకేల హింసాభయం బనవలదు ప్రాణభయంబు మనుష్యుల మగు మాకు నేఁడైన మీకు మరునాఁడైన నవలి నాఁడైనఁ గుడ యుగాంతంబునందైన నిడుపు గుఱుచల నెప్పుడుఁ దప్ప దంతవత్త్వంబునకుఁ దారతమ్యంబేమి మున్నిటవైనను ముసంగుట సరియగుటఁ బర్వతంబునకుం బరమాణువునకు నేమి యంతరంబు మీఁదు విచారింప వలువదే తపోలబ్ధవరాదులం బూర్వంబునం గీర్వాణుల మదం బడంచి హెచ్చిన హిరణ్యకశిపు దశముఖాదులు శతసహస్ర సంఖ్యాక సంవత్సరంబులు జీవించియుం బంచత్వంబుఁ బొంది తారు మున్ను జయించిన జముచేతనే చిక్కరే యిక్కడికి మీరు ప్రబలులగైన నక్కడికి వాఁడు ప్రబలుండు సకలభూత తారతమ్యంబును నిజ నిజస్థానవిశేషంబునన వచ్చు నచ్చండాంశు సుతుని వీట మేర దప్పిన మాకుం దప్పనియట్ల బాధ మీకుం దప్పదు మీరు నాహోరి ముఖ బర్హిర్ముఖులు జాతి దలపోయ భ్రాతలట్లయ్యుం బరంబున మీరు వారు బాధ్య బాధకతలనొందుచున్నా రీతైజసం బగు తారతమ్యంబునకుం దమస్సత్త్వంబులు హేతువులు వాని కాహృతులు హేతువులు వ్యాసస్మృతులం గ్రతువుల చరుపురోడాశాహుతుల

భుక్తులం బవిత్రులై యమర్త్యత మీకంటె నతి దీర్ఘకాలంబు వారు జీవించెద రప్పావన
నత చూచికదా సదా చతుర్ముఖాంశజుం డగు సుధాంశుండు గఱంగి సకల రసముల కవధి
యగు సుధారసంబున నాప్యాయనం బొనరించుచున్నవాఁ డేతదర్థంబు మా కుచ్చరింప
రాదుగాని వేదంబు ప్రథమకళ యనలుండు త్రావు నని చెప్పు మఱియు నాయాకళ
లాయా వేల్పులకుం గ్రమంబునం జెప్పు నింత విచారించి రచించినట్టి నమువు మనినఁ
గహకహనవ్వి యద్దాసుఁకి సురద్రోహి యిట్లనియె. 3౭.

టీ.క అదియట్లుండెఁ=ఆనీతియారీతినుండెను, ఇఁకొక్కహితంబుసెప్పెద=మఱి యొకహితమువచించెదను, అదియును=ఆమాటయును, ప్రాణభయంబునఁ=ప్రాణభీతిచేత, ఆడు=వచించెదు, కార్యవశంపు=పనిగడవుకొనుటకైన, మాటనగాఁదెలియక=పలుకుగాగ్రహింపక, మాధ్యస్థంబకాఁదెలిసి = మధ్యస్థపుమాటగానెతెలిసి, వినుము=ఆలకింపుము, వినకున్నఁ=నీవువినకుండినను, భూతహితంబుఁగోరి = లోకోపకారమపేక్షించి, ఉచ్చరించు మాటకు=వచించెడుపలుకునకు, ఈశ్వరుండైనఁ=పరమాత్ముఁడైనను, మెచ్చుఁగదా=హర్షించునుగదా, వ్యాఘ్రసింహవరాహవృకజంబుకాది=పులి సింగము పంది తోఁడేలు నక్క మొదలగు, శరారువులయందు=ఘాతుకజంతువులయందు, ఒక్కతిర్యక్కవుగావు=ఒకతిర్యగ్జంతువవుగావు, దేవయోనివి = దేవతలలో నొక భేదమైనవాఁడవు, “విద్యాధరోప్సరోయక్షరక్షోగంధర్వకింనరాః పిశాచోగుహ్యకస్సిద్ధో భూతోమీదేవయోనయః” అని యమరము. అనఁగా, రక్షః పిశాచములును దేవయోనులేయనుట. నీకునుమాకుంబలెఁ = నీకును మాకునలెనే, కరచరణముఖ = కాలుసేతులుమొదలగు, అఘనంబులు = అవయవములు, “అంగంప్రతీకోవయవో ఽపఘనోఽథకళేబరే” అనియమరము. కలవు = ఉన్నవి, మాటలునుమాయట్ల=సంభాషణములునుమావలెనే, అకర్తవ్యకర్తవ్యతా = చేయరాని చేయవచ్చిన పనులగుటయొక్క, విచారంబులు = ఆలోచనములు, సమానంబ=సమమే, హా=అహహా, మఱచియంటి = మఱచిపోయి యిట్లు పలికితిని, స్థావరంబులకంటెఁ = వృక్షాదిస్థావరంబులకంటెఁ, కీటాదులకుఁ =పురువులు మొదలగువానికిని, వానికంటెఁ=ఆకీటకాదులకంటె, మఱి=అధికముగా, మృగాదులకుఁ=మృగములు మొదలగువానికిని, వానికంటెఁ= అమృగాదులకంటె, మఱి, పశుపతంగాదులకు=పశుపక్ష్యాదులకును, వానికంటెను=ఆపశ్వాదులకంటెను, మాకును, మాకంటెమీకును, కరణకళేబరాదిపాటవంబు=ఇంద్రియశరీరాది పటుత్వము, ఎక్కుడు=అధికము, విజ్ఞానంబు=విన్నాణంబు, ఘనంబు=అధికము, ఇట్టినీకు, ఏకాంత=ముఖ్యముగ, కుత్స=నిందకు, ఆవహంబగు=సంపాదకమైన, “కుత్సానిందాచ

గర్హణే" అనియమరము. భీభత్స=రోఁతయైన, పథ్యాపథ్య = హితాహితములయొక్కయు, (పథ్యావథ్యయను పాఠమునఁ జంపఁదగిన చంపఁదగని యనియర్థము) భక్ష్యాభక్ష్య=తినఁదగినవియు, తినరానివియును అయినట్టి వాని యొక్కయు, పేయాపేయ=త్రాఁగఁదగిన త్రాఁగరానివానియొక్కయు, వివేకంబులు=జ్ఞానములు, లేకునికి=లేకుండుట, యుక్తమే=తగునా, (తగదనుట) ఈదురాహారంబు = ఈదుర్భోజనము, రుచిగాదు=చవిగాదు, శుచిగాదు=పవిత్రముగాదు, ఇదియు=ఈదురాహారమును, సకలదురితావతంసయగు=సమస్తపాపశేఖరమైన, హింసన్=హింసించుటచేత, ఒనగూడునది=సంభవించునట్టిది, హింస=అట్టిహింసించుట పరలోకంబునఁగదా = లోకాంతరంబునం గదా, బాధకంబు=బాధకము, పరలోకము=అట్టిలోకాంతరము, ప్రాణాంతంబునం గదా = ప్రాణావసానమైనప్పుడుగదా, చిర=బహుకాలము, స్థిర = తిరముగానుండునట్టి, ప్రాణులమగు = ప్రాణములుగలమాకు, ఏలహింసాభయంబననలదు = హింసవలనవచ్చెడు వెఱపేలయనఁగూడదు, ప్రాణభయమ్ము=ప్రాణభీతి మనుష్యులమగుమాకు, నేఁడైనన్ = నేఁడుగలిగిన, మాకు, మఱునాఁడైనన్, ఆవలినాఁడైనన్=అమఱునాఁడైనను, తుదన్=చివరను, యుగాంతంబునందైనన్=యుగప్రళయమప్పుడేనియును, నిడుపుగుఱుచలన్=దీర్ఘహ్రస్వకాలముగా, ఎప్పుడుఁదప్పదు, అంతవత్త్వంబునకున్ = చావుగలుగుటకు, తారతమ్యంబేమి = కాలముయొక్క హెచ్చుతగ్గువేమి, మున్నీటనైనన్ = సముద్రమందైనను, "మున్వన్నె ము ప్రొద్దు ♦ మున్నీరు ముక్కొఁక ముచ్చిచ్చునఁగఁ గబ్బ ♦ ములను మఱియు, నిరువంక యిరుదెస యిరుగెడ యిరువాఁగు ద్విగువేకవచనాంత మగుచుఁదనరు. అన్నట్టిదియేకవచనాంతద్విగుసమాసము" మునుంగుటసరియగుటన్=మునిఁగిపోవుట సమానముగావున, పర్వతంబునకున్=కొండకును, పరమాణువునకున్=దృగ్గోచరముకానినలుసునకు, ఏమియన్తరంబు=ఏమిభేదము, "కోమజ్జతోరణుకులాచలయోర్విశేషః" అన్నట్లు సముద్రమందుఁబర్వతమేనియుఁబరమాణువేనియుమునుఁగుననుట) మీఁదు=ముందఱఁగలుగునది విచారింపవలువదే=ఆలోచింపవలదా, తపోలబ్ధవరాదులన్...తపః=తపములచేత, లబ్ధ=పొందబడిన, వరాదులన్=వరములు మొదలగువానిచేత, పూర్వంబునన్=తొల్లిటికాలమందు, గీర్వాణుల=దేవతలయొక్క, మదంబడంచి=పొగరడఁచి, హెచ్చిన=అతిశయించిన, హిరణ్యకశిపు, దశముఖ=రావణాసురుఁడు, ఆదులు=మొదలగువారు, శతసహస్రసంఖ్యాక=నూఱువేలులెక్కగల, వత్సరంబులు=ఏండ్లు, జీవించియున్=బ్రదికియుండియును, పంచత్వంబుఁబొంది=మృతినొంది, తారుమున్నుజయించిన=తాముపూర్వముజయిం

చినట్టి, జముచేతనేచిక్కరే=యమునిచేతనేపట్టఁబడరా, "ఈజముఁడను నదిసంస్కృతభవ ప్రాకృత తత్సమము. జడావోముఖస మాడయోః ప్రాకృత తత్సమా యనియును; సీ. జడయను జముఁడను శబ్దము సంస్కృత ప్రాకృత సమప్రశస్తిఁగాంచు నన్నట్లనుట" ఇక్కడకిన్=ఈలోకమునకు, మీరు, ప్రబలులరైనన్=బలవంతులరైనను, అక్కడికిన్=ఆలోకమునకు, వాఁడు=ఆయముఁడు, ప్రబలుఁడు=బలవంతుఁడు, కలభూత=సమస్తభూతములయొక్క, తారతమ్యంబును=ఎక్కువతక్కువయును, నిజనిజ=తమతమ, స్థానవిశేషంబునన=స్థానబలముచేతనే, వచ్చున్=వచ్చును, అచ్చణ్డాంశుసుతుని=ఆయుష్ణకరునికుమారుఁడగుయమునియొక్క, వీటన్=పట్టణమందు, మేరదప్పినన్=దురాచారముఁజేసిన, మాకుందప్పనియట్ల=మనుష్యులమగుమాకును దప్పనట్లుగానే, బాధ=నరకయాతన, మీకుందప్పదు=మీకునుదప్పదు, (పాపఫల మందఱకునొక్కటేయనుట) మీరున్=రాక్షసులైనమీరును, ఆసారిముఖబర్హిర్ముఖులు=ఆయముఁడు మొదలగు దేవతలు, జాతిఁదలపోయన్=జాతినివిచారింపఁగా, భ్రాతలు=అన్నదమ్ములు, అట్లయ్యున్, పరంబునన్=పరలోకమునందు, మీరువారును, బాధ్యబాధకతలన్=బాధ్యబాధకభావములను, ఒందుచున్నారు, (మీరుబాధింపఁబడువారును వారుబాధించెడువారుననుట) ఈ తైజసంబగు=ఈ తేజస్సంబంధియగు, తారతమ్యంబునకున్=తగ్గుహెచ్చులకు, తమస్సత్త్వంబులు=తమస్సత్త్వగుణములు, హేతువులు=వరుసగాఁగారణములు, వానికి=అట్టితమస్సత్త్వగుణంబులకు, ఆహృతులు=ఆహారములు, హేతువులు=కారణములు, వ్యాహృతులన్=భూర్భువరాదిమంత్రముచేత, క్రతువులన్=యజ్ఞములయందు, చరు=అన్నముయొక్కయు, పురోడాశ=హవిస్సుయొక్క, ఆహుతుల=హవనములయొక్క, భుక్తులన్=భుజించుటలచేత, పవిత్రులై=పావనులై, అమర్త్యతన్=చావులేకుండుటచేత, మీకంటెన్, అతిదీర్ఘకాలంబు=మిక్కిలినిడుపైనకాలము, వారు=ఆదేవతలు జీవించెదరు=బ్రదుకుదురు, అప్పావనత=ఆపవిత్రత్వమును, చూచికదా=ఈక్షించియేకదా, సదా=నిరంతరమును, చతుర్ముఖాంశజుండగు=బ్రహ్మాంశసంభూతుఁడైన, సుధాంశుఁడు=అమృతకరుండగుచంద్రుఁడు, కఱంగి=తానుగఱఁగి, సకలరసములకు=సకలమాధుర్యములకు, అవధియగు=పరమావధియగు, సుధారసంబునన్=తనయమృతరసముచేత, ఆప్యాయనంబు=తృప్తిని, ఒనరించుచున్నవాఁడు=చేయుచున్నాఁడు, ఏతదర్థంబు=ఈయర్థము, మాకుచ్చరింపరాదుగాని=మాకుఁజెప్పఁగూడదుగాని, వేదంబు=శ్రుతి, ప్రథమకళ=చంద్రుని

చును, మఱియుఁ=ఇంకను, ఆయాకళలు, అయావేల్పులకుఁ = ఆయా దేవతలకు, క్రమంబునఁ=వరుసగాను, చెప్పి, ఇంత= నేఁజెప్పినయీయావదర్థమును, విచారించి= ఆలోచించి, రచించినట్లు = నీకింపగునట్లు, నడువు మనినఁ = వర్తిల్లు మనఁగా, కహకహ, నవ్వి = హసించి, (ఇది యనుకరణశబ్దము) అద్విజాసకికి, సురద్రోహి = బ్రహ్మరాక్షసుఁడు, ఇట్లనియె.

తా. సుగమము.

కం. చంపకు చదువుల మేము ప, ఠింపనిశాస్త్రములె? మాప ♦ ఠింపని శ్రుతులే?
యింప వవి నమ్మవేఁ "ప్రథ, మాంపిబ తేఽహిన్నా" యనెడు ♦ మాటవుఁ గాదే. ౩౨.

టీక. చదువులఁ = చదువులచేత, చంపకుము = బాధింపకుము, మేముపఠింపని= మేముచదువని, "భవతిక్రియాపదానాం త్రివిధా నామించు గాగమ" అనుసూత్రముచేతఁ బఠించుచు నని రాఁగా వ్యతిరేకాదౌ భావినిచాత్స్వేన సూత్రముచేత నాదు వర్ణాగమున కత్వము వచ్చి యాచవర్ణమునకు వ్యతిరేకాదికేచచోఽపపస్యేన సూత్రముచేతఁ బత్వము దానిపైఁ బ్రతిషేధవాచినాంని యను సూత్రముచేత నివర్ణాకమును వచ్చెను" శాస్త్రములె=చదువులా, (అన్నియు మేముచదివితిమనుట) మా=మాయొక్క, పఠింపని శ్రుతులే= చదువని వేదములా (ప్రథమార్థమందుషష్ఠి. సీ. తెల్లంబు గాదె మీ ♦ కల్ల సుయోధను జేసిన కుటిల విచేష్టితములు; అనియుద్యోగ పర్వము) అవి=ఆ వేదశాస్త్రములు, ఇంపవు=మాకు రుచింపవు, (ఇంపు అనుటకు మధురమగు నని యర్థము. దీనికి; ఆ. జుంవ్వ మరలఁ బడఁగఁ ♦ జిలుకల కన్నిశ, పించె సురలు చెవుల ♦ కించునట్టి, పలుకు వానికొసఁగి అని యానుశాసనికపర్వప్రయోగము. కావున నే యించువిల్కాఁ డని తియ్యవిల్తునకుఁ జెప్పదురు; దీనికి వ్యతిరేకార్థమందు నాపత్వమువచ్చెను) నమ్మవేఁ=నమ్మవేని, ప్రథమాంపిబతేఽహిన్నా=ప్రథమాంపిబ తేఽహిన్నా ద్వితీయాంపిబతేరవి ఇత్యాదివచనము, "లోపోనమ ఆదికే విసర్గస్య" అనుసూత్రము చేత విసర్గలోపము, అనెడు=అనునట్టి, (ఇది=అనుకృతేస్తివాక్యంతు ఇను సూత్రానుసరణముగా ననుకరణము, మాటవుఁ, కాదె=అటు గాదా.

తా. సుగమము.

మ. నిలు మోహాలోమము వారి భ్రాంత లనుమ ♦ న్నీ వంటి వారల్పుధా,
కులపూతాసులు గా రటంటివ్రతిప ♦ త్వోస్నయం మము. న్యోగులు ము,

జ్వలనుం డం టిఁక నొండు నిన్నడిగెద♦న్సర్వాశిగాఁడా? యతం,
డిలఁ దన్న్యాయ మ చాలు మాకు నఘ మే? వృ♦ద్ధానుచారం బిఁకన్.  33.

టీక. నిలుము=నిలువుము, (కం. నిలువుము పిలువుము కొలువుము, గెలువుము విడువు మనఁగాఁ ద♦గినబహుశబ్దం, బులకుం దృతీయ వర్ణము, దొలఁగిన దోషంబు లేదు♦తుహినాంశుధరా" అని యడిదము సూరయ కవిసంశయవిచ్ఛేదంబునం జెప్పి వీనికి నుదాహరణంబులఁ జెప్పినాఁడు, ఓహో=పరిహాసార్థకము, మమున్=మమ్మును, వారిన్ ఖ్యాతలనుచున్=ఆదేవతల తోఁబుట్టువులనుచును, నీవంటి=నీవుచెప్పితివి, వారల్= ఆదేవతలు, సుధాశులు=అమృతాశనులు, అపూతాశులుకారు=అపవిత్రాహారులుగారు, అటంటి=అలాగంటివి, ప్రతిపత్=పాడ్యమినాఁటి, సోమాంశమున్=చంద్రకళను, జ్వలనుండు=అగ్ని, మున్=మున్నుగాను, క్రోలునంటి=పానముఁజేయునంటివి, ఇఁకన్=ఇంకను, (నిత్యమను త్తరపురుష క్రియాస్వితయనుసూత్రము చేత నిత్యసంధి) ఒండు=ఒకసంగతి, నిన్నడిగెదన్, అతండు=ఆయగ్నిహోత్రుఁడు, సర్వాశిగాఁడా=అన్నిటితిండికాఁడు గాఁడా, ఇలన్=భూమియందు, తన్న్యాయమే=ఆన్యాయమే, మాకు, చాలు=ఆచారము (పర్యాప్తమనియును జెప్పవచ్చును) ఇఁకన్=ఇంకను, వృద్ధానుచారంబు=పెద్దలవలె, నడుచుట, అఘమే=పాపమా, (కాదనుట).

తా. సుగమము.

తే. హరికి సఖుఁడును రథమును♦నగుగరుడుఁడు, దొరకి నమృతంబు సురలకు♦మరల నిచ్చి
యహులు గూడుగ వరమున♦నడిగికొనఁడె? యమృత మైననుజవుల జా♦త్యన్న సమమె?

టీక. హరికిన్=విష్ణునకు, సఖుఁడును=చెలికాఁడును, రథమును=వాహనమును, "నాగాంతకో విష్ణురథః" అనియమరము. అగు=అయినట్టి, గరుడుఁడు=గరుత్మానుఁడు, దొరకిన=తనకులబ్ధమైన, అమృతంబు=సుధను, సురలకు=దేవతలకు, మరలనిచ్చి=క్రమ్మఱనొసంగి, అహులు = సర్పములు, కూడుగ=తనకాహారముగ, వరమునన్=వరముచేత, అడిగి=యాచించి, కొనఁడె = గ్రహింపఁడా, అమృతమైనను = సుధయేనియు, చవులన్=రుచుల చేత, జాత్యన్న=తమ తమ జాత్యుచితాహారమునకు, సమమె=సరియగునా. (కాదనుట).  తా. సుగమము.

చ. నిదురయుఁ గూడుఁ బోఁ జదివి♦నే నిటఁ గన్నదియేమి యెవ్వఁడే,
నదువుల యర్థవాదపు వృ♦ష ల్విని చెల్పుడు, నీవు మాయెడ్డం,

జదువుల మాటలాడి కనఁ◆జాల వొకానొక మెచ్చు నొక్కఁ డీ,
చదివిన కూర వింతచవి◆చాలఁగఁదెమ్మను మెచ్చు దక్కఁగన్. ౩౫.

టీక. నిదురయున్ = నిద్రయును, కూడున్ = అన్నమును, పోన్ = పోవునట్లు, చదివి = పఠించి, నేను, ఇటన్ = ఇచ్చటను, కన్నది = పొందినది, ఏమి = ఏమిగలదు, ఎవ్వఁడు = ఏపురుషుఁడు, ఈచదువుల = ఈశాస్త్రముల యొక్క, అర్థవాదపు = అర్థవాదసంబంధులగు, వృగల్ = కల్లమాటలు, విని = ఆకర్ణించి, బేల్పడున్ = బేలుపోవును, (ఎవ్వఁడును బేలుపోఁడనుట) ఈవు = నీవు, మాయెడన్ = మాపట్లను, చదువులమాటలాడి = శాస్త్రార్థప్రసంగము జేసి, ఒక్కఁడు = ఒక్కటి, ఈచదివిన, పఠించిన, (చదివినయన్న పాఠమున నెనిచినయనియర్థము) కూర = శాకము, వింతచవి = క్రొత్తరుచిగలది, చాలఁగఁదమ్ము = చాలునంతతే, అను = ఇట్లనియెడు, మెచ్చు = శ్లాఘ, తక్కఁగన్ = వినా, ఒకానొక మెచ్చున్ = ఒకానొక్కఁడైనశ్లాఘను, కనఁజాలవు = పొందఁజాలవు.

తా. ఈ శాస్త్రప్రసంగముల వలన నేమి ప్రయోజనము లేదు. దీనికి బేలుపోవువాఁడెవ్వఁడును లేఁడు. ఇది చదివిన కూర క్రొత్త రుచి గలది యా కూర మఱియు నింత పెట్టుమందును. నీకీ చదువుల చేత నావలన నంతకంటె నే మేలును గలుగ దనియును నీవెన్ని చదివినను నిన్ను వధింపక విడువ నని భావము.

వ. అని గీష్పతి మతం బవలంబించి నిజాలాపహేళనపరుండైన రక్కసు తర్కోక్తులకుం గృష్ణస్మరణంబు సేసి యిందులఁ బొందుపడు ప్రత్యుత్తరంబుల వీనిఁ గెలఁకిన బుద్ధిక్షోభంబుగా నింతకంటె నేమి యబద్ధంబులు వినంబడునో మీఁదఁ గార్యంబు గల మాకు దీనిఁ గాదనం బనిలేదని యంతరంబుఁ గూడుకొని ఛందోనువర్తనపరుండై నీచసంస్కృతిక రోసి తన్ముఖోల్లాసంబునకు శబ్దచ్ఛలంబున నంతర్గతంబున సుగతు నిడుకొని నీవు సర్వజ్ఞుండవు నేను నరుండ హీనకులుండ ననభ్యస్తశాస్త్రుండ నీకు స్తోత్రం బశక్తుండ నే మద్వచనస్ఖాలిత్యంబులు సహించి దయచేసి నమ్మి మత్ప్రార్థనంబు గావింపుము. ౩౬.

టీక. అని = ఇట్లని, గీష్పతి = బృహస్పతియొక్క, మతంబు = మతమును అవలంబించి, నిజ = స్వకీయములగు, ఆలాప = పల్కులయొక్క, హేళన = పరిహసించుటయందు, పరుండైన = ఆసక్తుఁడైన, రక్కసు = రాక్షసునియొక్క, కుతర్క = కుశంకలయొక్క, ఉక్తులకున్ = మాటలకు, కృష్ణస్మరణంబు సేసి = కృష్ణకృష్ణ యనుకొని, ఇందులకున్ = ఈ నీ తర్కములకు, పొందుపడు = సమాధానకరములగు, ప్రత్యుత్తరంబులన్ = బదులు

మాటలచేత, వీనిఁగెలఁకినన్ = వీనిఁగెరలించినను, బుద్ధిక్షోభంబుగాన్ = మనఃక్లేశమగునట్లు, ఇంతకంటె = విన్నదానికంటెను, ఏమియబద్ధంబులు = ఏమివినరానివి, వినఁబడునో, మీఁదన్ = తరువాతను, కార్యంబుగలమాకు = భగవత్సేవయనుపనిగలిగినమాకు, దీనిన్ = వీఁడు సెప్పినయీమాటను, కాదనం బనిలేదని = కాదనుట కక్కఱ లేదని, అందంబుఁగూడుకొని = ఉల్లాసముఁదెచ్చుకొని, ఛందోనువర్తనపరుండై... ఛందః = వానియిష్టముయొక్క, అనువర్తన = అనుసరించివర్తించుటయందు, పరుండై = ఆసక్తుఁడై, నీచసంస్మృతికిన్ = హీనస్మరణమునకు, రోసి = ఏవగించి, తన్ముఖోల్లాసంబునకున్ = వానిముఖప్రీతికొఱకు, శబ్దఛలంబునన్ = శబ్దవ్యాజముచేత, అంతర్గతంబునన్ = మనస్సునందు, సుగతునిడుకొని = బుద్ధదేవునినిచికొని, నీవుసర్వజ్ఞుండవు = నీవన్నియు నెఱింగినవాఁడవు, "సర్వజ్ఞస్సుగతో బుద్ధః" అని నిఘంటువు. సర్వజ్ఞశబ్దమున కర్థాంతరము బుద్ధుఁడనుట. ఏను = నేను, నరుండ = మనుష్యుఁడను, హీనకులుండన్ = నీఁచజాతివాఁడను, అనభ్యస్త = అభ్యసింపఁబడని, శాస్త్రుండన్ = శాస్త్రములు గలవాఁడను, నీకుత్తరంబీశక్తుండనే = నీకుఁబ్రత్యుత్తరమిచ్చుటకుసమర్థుఁడనా, (కాననుట) మతి = నాయొక్క, వచః = పలుకులయందలి, స్ఖాలిత్యంబులు = తప్పులను, సహించి = సైరించి, దయసేసి = కృపయునిచ్చి, నమ్మి = విశ్వసించి, మత్ప్రార్థనంబు = నా వేఁడుకోలును, కావింపుము = చేయుము.

తా. సుగమము.

శా. ప్రఖ్యాతుండవు దైత్యులందు మునుపా పై నొక్క నీకా యశో,
భిఖ్యన్నేనును జేర్తు మే యొసఁగఁ ద ప్పింపన్వ్రతం బొక్కఁడే,
ముఖ్యంబై యొనరింతు దాని సఫలం బున్జేయఁగా లేవ గా,
"సఖ్యంసాప్తపదీనమ" న్మన మిథ స్సాజన్య మూహించుచున్. ౩౭.

టీక. మునుపు = మొదలనే, దైత్యులందున్ = రక్కసులయందు, ప్రఖ్యాతుండవు = ప్రసిద్ధుఁడవు, ఆపైన్ = అందుమీఁద, ఒక్కఁడైన, యశోభిఖ్యన్ = కీర్తికాంతిని, "అభిఖ్యానామశోభయోః" అనియమరము. నేనును, చేర్తున్ = సంపాదింతును, మేయొసఁగన్ = నాశరీరమునీకిచ్చుటకు, తప్పింపన్ = తప్పఁజేయను, వ్రతంబొక్కఁడే = ఒక్కవ్రతమే, ముఖ్యమై = ముఖ్యముగాఁగలిగి, "అప్సరోనికురుంబమాటలుపాటలు నైవినోదింపంగనమరగణము" అనియును; ద్వాదశదినములాతఁడుగారవింపంగవర్తించిపంద్రెండువత్సరముల ప్రాయమైరాజ్యసంప్రాప్తికినేతెంచియుక్కనియుదయంబునస్తమయము, వగచొల్లఁ పాలిమేరలైన, అను నీ మొదలు గాశాంతిపర్వప్రయోగములును; కఁ. కాచికొని సచ్చితగనా, నే

*.4

చిన యట్లచట నచట ♦ నిలిపితి మునినా, ధా చేటును భంగంబును, నై చిత్తముశోకము నకు♦నగ్గంబయ్యె౯. అనిపహాసలపర్వప్రయోగంబునుగలిమింజేసిఅగుధాతువునకుకలిమిఅర్థము గాఁజెప్పవలయును) ఒనరింతు౯ = చేయుదును, దాని౯ = ఆవ్రతమును, సఖ్యంసాప్తపదీన మను = సఖ్యంసాప్తపదీనంస్యాత్తనువాక్యప్రకారమగు, (ఏడడుగులు తోడనడచినస్నేహము గలుగుననుట) మన = మనయొక్క, మిథస్సాంగిత్యము = ఒండొరులచెలిమిని, ఊహించు చు౯ = తలంచుచును, సఫలంబు౯ = ఫలముతోఁగూడినదానిఁగా, చేయఁగాలేవు గా = చేయలేవా. అనిప్రార్థన.

తా. మనమిరువురము చెలికాండ్ర మగుట వలన నావ్రతమును సఫలముఁ జేయు మని భావము.

వ. అదియెద్దియంటేని. 3౭.

టీక. ఆవ్రతమేదియనియడిగితివేని. తా. సుగమము.

కం. ఈకుఱుఁగటి యీ కుఱుంగుడి, వైకుంఠునిఁ బాడి వత్తు ♦ వ్రతముగఁ దత్సే,
వాకృతి కడపట నశనము, నీ కౌదు న్ముఖ్య మిదియ ♦ నేఁ జేసెద నిఁకన్. 3౮

టీక. ఈ కుఱుఁగటి = ఈ సమీపమందలి, ఈకుఱుంగుడి = ఈ తిరుక్కుఱుంగుడి యొక్క, వైకుంఠుని౯ = వెన్నుని, వ్రతముగ౯ = నియమముగా, పాడివత్తు౯ = గానము సేసివచ్చుచుందును, తత్సేవా = ఆకొలువనియెడు, కృతి = కార్యముయొక్క, కడపట౯ = అంతమునందు, అశనము నీకౌను౯ = నీకాహారమగుదును, నేఁజేసెదనిఁక౯ = నేఁటినుం డకు, ఇదియ = ఇట్లగుటయే, ముఖ్యము = శ్రేష్ఠము, వ్రతముగ, కడపటనగునశనము, నీ కౌదునని పాఠాంతరముగల దట్లేని, తత్సేవే = అభిగమనము సేయుటవే, కడపట౯ = అంత్య మందు, అగు౯ = అగును.

తా. సుగమము.

ఉ. అంచు నతండు పల్కఁ దర ♦ హాసతఁ జెక్కిలిఁ గొట్టి తెస్స పం,
డించితి వోయి దాసర న ♦ నిం దెరవాటులు గొట్టి గొట్టి నే,
ర్పెంచి విరక్తి దాసరవి ♦ నిన్నఁగదా యయినాఁడ వీతుము,
గ్గొంచెముఁ జేసి బ్రాహ్మణిక ♦ కోఁ దల పోనను మెచ్చితి న్నిను౯. ౪౦.

టీక. అంచు౯ = ఇట్లనుచు, అతండు = ఆదాసుఁడు, పల్క౯ = చెప్పఁగా, దరహాసత౯ = చిఱునగవుగలుగుటచేతను, చెక్కిలిఁగొట్టి = చెంపఁగొట్టి (చిఱునగవునఁజెం పమీఁదమెల్లనఁగొట్టి యనుట) ఓయిదాసర, తెస్సపండించితివి = నిక్కముగాఁబాంకముఁజేసితివి,

వనిన్=అడవియందు, తెరవాటులుగొట్టికొట్టి=త్రోవదొంగతనములు గొట్టికొట్టి, మే న్వెంచి=శరీరముఁబెంచుకొని, విరక్తిన్=వైరాగ్యము చేతను, నిన్నఁగదా=నిన్నటి దినమున నేకదా, దాసరివయినాఁడవు, ఈమమున్=ఇట్టిమమ్ము‌ను, కొంచెముఁజేసి=తగ్గుపఱచి, త్రాఁటోటికిన్=ఉచ్చుగొలుకుకొనుటకు, (తప్పించుకొనిపోవుటకనుట) (త్రాఁడనుపదంబున డువర్ణముసకు లోపమువచ్చినది) తలపోసెదు = ఆలోచించెదవు, నినున్=నిన్ను, మెచ్చితిన్ = మెచ్చుకొంటిని, (ఇట్లుపరిహాసించెననుట).

తా. సుగమము.

శా. ఏరాజ్యంబు నరుండు నోరి కడివో ♦ నీ బోధమాలించు నిం,
కేరా జ్యంబు నరుండు బాసకయి మే ♦ నీఁ దాన యేతెంచుఁ డీ,
పార న్నేఁజననీమియు న్మగిడి నీ ♦ వా రామియుం దెల్ల మే,
లా రంతు ల్పలుపల్కు లంత్యకుల యే ♦ లా చింత లేలా వగల్. ౪౧.

టీక. ఏరాజ్యంబు=ఏదేశమందలి, నరుండు=ప్రాణి, నోరికడివోన్=నోటికందిన కబళముపోవునట్లు, ఈబోధము=ఈయుపదేశమును, ఆలించున్=వినును, (ఎవ్వఁడు వినఁడనుట) ఇంకన్=మఱియును, ఏ రాజ్యంబునరుండు=ఏసీమపురుషుఁడు, బాసకయి=ప్రమాణమునకై, మేను=శరీరమును, ఈన్ =ఇచ్చుటకు, తాన=తనకుఁదానే, ఏతెంచున్ =వచ్చును, (ప్రమాణముఁజేసితినేయని యెవ్వఁడునురాఁడనుట)తీపారన్= రుచి మీఱఁగాను, (ప్రీతిచేతననుట) నేన్ =నేను, చననీమియున్=పోనియ్యకుండుటయును, మగిడి =తిరిగి, నీవు, ఆ రామియున్=ఆ రాకుండుటయును, తెల్లము=స్పష్టము, అంత్యకుల=చండాలుఁడా, ఏలారంతుల్=రచ్చలేమిటికి, పలుపల్కులు=పెక్కుమాటలు, ఏలాచింతలు=విచారములేల, ఏలావగల్=దుఃఖములేల.

తా. ఏదేశమందైనను దన నోటి కందిన యాహారమును విడిచెడు వాఁడును లేఁడు, బాసయిచ్చి వచ్చితి నని తన శరీర మొక్కనికాహారముగా నొసఁగిన వాఁడును లేఁడు, కావున నిన్ను విడుచుటయు లేదు, నీవు మరల వచ్చుటయును లేదు, చండాలుఁడా, నీ మాట నమ్మెదనా, యింక నీ యఱపులతోడను విచారములతోడ నధికప్రసంగములతోడను దక్కులతోడను బ్రయోజనము లే దనిభావము.

తే. అని నఁ జెవిమూసి నారాయ ♦ ణా యటంచు,
నతఁడు నను నమ్మ వే.పెశి ♦ తాశి యొక్క,
శపథమున నమ్మ మని వాఁడు ♦ సమ్మతింప,
వేనవే ల్సత్యములు పల్కి ♦ వినకయున్న. ౪౨.

టీక. అనినన్=ఇట్లనఁగా, చెవిన్=కర్ణమును, మూసి=ఆచ్ఛాదించుకొని, నారాయణాయటంచున్, అతఁడు=ఆదాసుఁడు, పిశితాశి=ఓరాక్షసుఁడా, ననునమ్మవే=నన్నునమ్మవా, ఒక్కశపథమునన్=ఒకప్రమాణముచేతను, నమ్ముమని=విశ్వసింపుమని, వాఁడు, సమ్మతింపన్=ఒప్పికొనునట్లు, వేనవేల్సత్యములు=వేనవేలుసత్యములు, పల్కి=వచించి, వినకయున్నన్=వాఁడంగీకరింపకుండినను.

తా. సుగమము.

ఉ. ఎవ్వనిచూడ్కిఁ జేసి జని ♦ యించు జగంబు వసించు నిజ్జగం,
బెవ్వనియందు డిందు మఱి ♦ యెవ్వనియం దిది యట్టి విష్ణుతోఁ,
నివ్వల నొక్క వేల్పు గణి ♦ యించిన పాతకినౌదు నేఁడ నే,
నెవ్విధినైన ని న్గదియ ♦ నేనియన న్విని బంధ మూడ్చినన్. ౮౩.

టీక. ఎవ్వనిచూడ్కిఁజేసి=ఏపురుషునివీక్షణముచేత, జగంబు=జగత్తు (అంత్యహల్లోపమైజగంబనియయ్యె), జనియించున్=కల్గునో, ఎవ్వనియందున్=ఏపురుషుని యందు, ఇజ్జగంబు=ఈజగము, వసించున్=నిలుచునో, ఇది=ఈజగము, మఱి=పిమ్మటను, ఎవ్వనియందున్=ఏపురుషునియందు, డిందున్=లీనమగునో, అట్టి=తాదృశుఁడైన, విష్ణుతోన్=వాసుదేవునితో, ఇవ్వలన్=ఈవలను, ఒక్కవేల్పున్=మఱియొక దేవతను, గణియించిన=సరిగాలెక్కఁబెట్టిన, పాతకినౌదున్=పాపముగలవాఁడనౌదును, (విష్ణునితో మఱియొక దైవము సమాన మని చెప్పుటకంటె నధికమగు పాపములేదనుట) నేఁడ=నేఁటిదినమే, నేన్=ఏను, ఎవ్విధినైనన్=ఏచొప్పుననైనను, నిన్గదియనేని=నిన్నుఁజేరరాకపోతినా, (ఇదిపూర్వముతోనన్వయము) అనన్=ఇట్లనఁగా, విని=ఆలకించి, బంధమూడ్చినన్=కట్టువిప్పఁగానే.

తా. నేఁటిదినమే నిన్ను నే నేప్రకారముగానైనఁ జేర రాకపోతినేని విష్ణుని తోడ సరియగు నొక దేవుఁడున్నాఁ డని చెప్పెడు వాని పాపమునఁ బోఁగలవాఁడనని యాదాసుఁడు ప్రమాణముఁ జేయఁగా నా రక్కసుఁడు మాఱు పల్కక కట్టు విడిచెనని భావము.

చ. అతఁడు తదల్పపాపఫల ♦ మంగుట సుంకము దీర్చి పోయి త,
చ్ఛతదళపత్త్రనేత్రునకుఁ ♦ జాఁగిలి మ్రొక్కి రణద్విపంచిస్తు,
స్తుతికలితప్రబంధములఁ ♦ జొక్కఁగఁ బాడి యసత్యభీధర,
ద్రుతగతి వచ్చి రాత్రిచరు ♦ తోఁ వ్రతపూర్తి గతార్తి నిట్లనున్. ౮౪.

టీ. ఆతఁడు=ఆదాసుఁడు, తదల్ప=ఆకొంచెమైన, పాప=పాపముయొక్క, ఫలమందుట=ఫలమునుబొందుటయనెడు, సుంకము=అభ్యంతరము, (బంధింపఁబడినఫలమనుట) తీర్చి=చెల్లించుకొని పోయి, తచ్ఛతదళపత్త్రనేత్రునకున్=ఆకమలదళనయనుఁడగు తిరుక్కుఱుంగుడిస్వామికి, చాఁగిలిమ్రొక్కి=దండవత్ప్రణామముఁజేసి, రణద్విపంచికైసై...రణత్=మ్రోయుచున్న, విపంచికైసై=వీణగలవాఁడై, స్తుతి=నుతులతోడను, కలిత=కూడుకొన్న, ప్రబంధములన్=గ్రంథములచే, చొక్కఁగన్=స్వామిసంతోషించునట్లు, పాడి=గానముఁజేసి, అసత్యభీభర=అప్రమాణ భయాతిశయముచేత, ద్రుత=వేగముగల, "లఘుక్షిప్రమరంద్రుతమ్" అనియమరము. గతిన్=గమనముచేత, వచ్చి, రాత్రిచరుతోన్=ఆరక్కసునితో, వ్రతపూర్తి=వ్రతపూరణముచేత, గత=పోయిన, ఆర్తిన్=పీడచేత, ఇట్లనున్=ఈ ప్రకారమనును.

తా. వ్రతపూర్తిచేత మనఃఖేదము లేక శీఘ్రముగా వచ్చెనని భావము.

ఉ. నీ చెఱఁ బాసి పోయి రజ ♦ నీచర చక్రి భజింప ముక్తి పొం,
దే చెర యే చెఱం దవుల ♦ నే నిఁక నుండఁగఁ జూడు పంచుచో,
నే చరణంబు లేయుదర ♦ మేయుర మేశిర మేకరంబు లీ,
వాచరణంబు లాయుదర ♦ మా యుర మాశిర మాకరంబులున్. ౭౫.

టీ. రజనీచర=ఓయిరేద్రిమ్మరి, నీచెఱన్=నీనిర్బంధమును, పాసి=విడిచి, పోయి=చని, చక్రిన్=స్వామిని, భజింపన్=సేవింపఁగా, ముక్తి=మోక్షముయొక్క, పొందు=స్నేహము, ఏచెర=హెచ్చెనురా, ఏన్=నేను, ఇఁకన్=ఇఁకమీఁద, ఏచెఱన్=ఏనిర్బంధమందును, తవులన్=చిక్కుపడను, పంచుచోన్=నన్నుఁబనుపునప్పుడు, ఏచరణంబులు=ఏపాదములో, ఏయుదరము=ఏకడుపో, ఏయురమో=ఏవక్షఃస్థలమో, ఏశిరము=ఏశిరస్సో, ఏకరంబులు=ఏహస్తములో, ఆచరణంబులు, ఆయుదరము, ఆయురము, ఆశిరము, ఆకరంబులున్, ఈవు=నీవు, ఉండఁగఁజూడు=ఉండఁజూచికొనుము.

తా. నీ చెఱ వదలి పోయి స్వామి సేవఁ జేసి యెల్ల బంధములు వదలి వచ్చినాఁడను, నీవు నన్నుఁ బంపు నప్పుడేకా ళ్లేకడుపు లేవక్ష మేశిర మేహస్తములు గలిగి యుంటినో యాకాళ్లు మొదలగునవి యిప్పుడుండఁ జూచుకొమ్మని చెప్పె నని భావము.

తే. అనినఁ దత్సత్యమునకు నే♦త్రాంబు లురులఁ,
బ్రమద పులకితగాత్రుఁ డై♦ పాలు టసుర,
యినుని మధ్యందినపు టెండ♦ దనదు పెద్ద,
బట్టతల మించఁ బ్లవు జేరఁ♦ బాలు తెంచి. ౮౯.

టీ. అనినన్=ఇట్లనఁగా, తత్సత్యమునకున్ ... తత్=ఆదాసరియొక్క, సత్యమునకున్ = నిక్కమునకు, నేత్రాంబులు = ఆనందబాష్పములు, ఉరులన్=స్రవింపఁగా, ప్రమద = సంతోషముచేత, పులకిత = గగుఱుపారిన, గాత్రుఁడై=శరీరముగలవాఁడై, పాలుటసుర=బ్రహ్మరాక్షసుఁడు, (తే. పాలుఁడల్లుఁడుదమ్ముఁడ♦ న్నదము లోలి, దగు సమాసములైన డు♦ త్వములు వాయు, నల్లువాం డ్రనఁ బాలువాం♦ డ్రనఁగఁదమ్ముఁ, గుఱ్ఱలనఁ దెగ్గు పదములు గొన్ని యిట్లు. అని యడిదమునూరయగారు కవిసంశయవిచ్ఛేదంబునఁ జెప్పిరిగావున నిది సంగతమయ్యె) ఇనుని=సూర్యునియొక్క, మధ్యందినపు టెండ= మధ్యాహ్న సంబంధియైనయెండ, తనదు=తనసంబంధియగు, పెద్ద బట్టతలన్=బట్టతలయందు, మించన్ = తళతళ మెఱయుచుండఁగా, ప్లవున్ = ఆసురియాళుని, "చండాలప్లవమాతంగ దివాకీర్తిజనంగమాః" అని యమరము. చేరన్=సమీపించునట్లు, పాలుతెంచి=పఱువెత్తి. తా. సుగమము.

ఉ. కొండయుఁబోలె భక్తి వల♦ గొంచు నె వాఁడు నిజద్రుమభ్రమీ,
హిండన వ్రాలుపాకలపు♦ టేనుఁగుఁబోలె నొసల్ త దంఘ్రులం,
దుండ రొద న్మహాగిరులు♦ హోరనఁ బ్రస్తుతి వ్రాలి దండ్రి కా,
దండము లెత్తి పట్టిన వ♦ దం బొకఁ డొక్కఁడ నెత్తిజేర్చుచున్. ౯౦.

టీక. కొండయుఁబోలెన్=పర్వతమువలె, భక్తిన్=భక్తిచేత, వలఁగొంచునె= ప్రదక్షిణము సేయుచునె, వాఁడు=ఆరాక్షసుఁడు, నిజ=తన్నుఁగట్టిన, ద్రుమ=వృక్షముయొక్క, భ్రమీ=చుట్టు తిరుగుటయొక్క, హిండనన్=ఆవృత్తిచేతను, వ్రాలు= పడునట్టి, పాకలపు=పాకలమనురోగముగల, (ఆరోగమువచ్చి నప్పుడుమదముచేతశిరస్సు వగులు నందురు. "గజరోగస్తు పాకల" యని నిఘంటువు. ఏనుఁగుఁబోలె=గజమువలెనే, నొసల్ = ఆరాక్షసునిలలాటము, తదంఘ్రులందున్ = ఆదాసుని పాదములయందు, ఉండన్=తగిలియుండునట్లు, రొదన్= తనకంఠధ్వనిచేత, మహాగిరులు=పెద్దకొండలు, హోరనన్=ప్రతిధ్వనియియ్యఁగా, ప్రస్తుతి=స్తోత్రముచేతను, వ్రాలి=ప్రణామముఁజేసి, దండ్రి కా దండములు=దండములవంటినిడుకోలలు,ఎత్తి=మీఁదికెత్తి, పట్టిన=తానుబట్టు

కొన్న,పదంబు=ఆదాసరిపాదమును, ఒకఁడొక్కఁడ=ఏకైకముగా, నెత్తిన్=తనశిరము నందు, చేర్చుచున్=ఉంచుకొనుచు.

తా. కొండవంటి శరీరముగల యా రక్కసుండు హరిదాసునకుఁ బ్రదక్షిణము సేయుచుఁ దనప్రమోదముచేత నద్రులు మాఱ్మ్రోయఁగాఁ బ్రస్తుతిసేయుచు నా దాసరి పాదముల వ్రాలఁగా నేనుఁగు దనకట్టు కంబముచుట్టు తిరిగి బృంహితధ్వనితో నేల వ్రాలినట్లుండెననియును, మఱియు నా బ్రహ్మరాక్షసుఁ డాసురియాళు వైష్ణవుని పాద మొక్కఁడొక్కఁడే మెల్లన నెత్తి నెత్తిమీఁద భక్తిచేత బెట్టుకొనె ననియు భావము.

శా. ఈసర్వంసహా దేవదానవమహీ ♦ భృన్మౌనివాచాతప,
శ్శ్రీసర్వస్వము నేత దన్యకృతులం ♦ జెప్పంబడు న్ఘోర మా,
నీసత్యం బురరీకృతాంత మిల ♦ నెంతే వృద్ధనై మంటి నే,
నాసత్యం బిఁక నిన్నుబోలెఁ గృతసం ♦ ధా ధూర్వహుల్లేమికిన్. ౮౫.

టీక. ఈసర్వంసహన్=ఈభూమియందు, దేవ=వేల్పులయొక్కయు, దానవ=రక్కసుల యొక్కయు, మహీభృత్ = పుడమిఱేండ్ల యొక్కయు, మౌని=జడదారులయొక్కయు, వాచాతపః=వచనరూప తపస్సులయొక్కయు, శ్రీ=సంపదయొక్క, సర్వస్వమున్=అంతయును, ఏతత్=ఈశరీరదానవాఙ్నియముకంటె, అన్య = ఇతరములైన, కృతులన్=కార్యములయందు, చెప్పంబడున్ = వచింపఁబడును, (దేవాదులందఱి తెరవిషయములయందు సత్యములు చెల్లించుకొనిరేకాక యిట్లు మేనువిడుచుటకై నెఱవేర్చుకొనరనుట) ఘోరమా =భయంకరమైన, (ఘోరంభీమంభయానక మని యమరము) నీసత్యము=నీబుుతము, ఉరరీకృతాంతము, ఉరరీకృత = అంగీకృతమగు, అంతము = అవధిగలది, (రాద్ధాంత మనుట) ఇలన్=భూమియందు, నేను, ఎంతే=మిక్కిలియు, వృద్ధనై=పెద్దవాఁడనై, (తే. ఉత్తమజ్ఞాన వృద్ధనా ♦ నుండెనేని, బాలుడయ్యును బూజ్యుండు♦ బ్రాహ్మణుండు అని సభాపర్వంబునను; తే. దుష్టబుద్ధి నీచు♦దుర్యోధనుండు నీ, మాటవినెను దురభి♦ మానఘనుఁడని యుద్యోగపర్వంబునను. చ. అవినయబుద్ధివై హరికి నర్ఘ్య మయోగ్యమ యంటినీవు మూర్ఖవు శిశుపాల యింక బలుక న్వలసె న్సభలోన ననిసభాపర్వంబునను. ఉ. ఆదిఁదొడంగి మూఁడుకృతు లాంధ్రకవిత్వ విశారదుండు వి, ద్యావయితుండొనర్చె మహితాత్ముఁడు నన్నయభట్టు దక్షతన్. అని విరాటపర్వంబునను బ్రయోగంబులుండుటంజేసి వృద్ధుసాధువయ్యె) మంటిని=బ్రతికితిని, ఇఁకన్ = ఇంతటినుండి, నిన్నుబోలెన్=నీవలెను, కృత=చేయఁబడిన, సంధా=ప్రమాణముయొక్క,

పఁబడినవాఁడును, దివ్యాంగరాగ=దివ్యచందనము చేత, భూషితుండును = అలఁదఁబడిన వాఁడును, పీతాంబరసంవీతుండును = బంగరుపట్టుపుట్టంబుఁ గట్టుకొన్న వాఁడును, తులసీ=తిరుత్తుళాయి యొక్కయు, కల్పతరుప్రసన=కల్పవృక్షపుష్పముల యొక్కయు, (స్యాదుత్పత్తౌ ఫలేపుష్పే ప్రసవో గర్భమోచనే. అనినిఘంటువు) స్రక్=మాలికలచేత, ఆశ్రిత=పొందఁబడిన, ఉరస్కుండునై=వక్షముగలవాఁడై, ఉండునంతన్=ఉండునంతట, అక్కడ=ఆయమ్మవారియొద్ద, అటకుమునుప=అంతకుమునుపే, గృహప్రవేశంబుసేసి= తమయిల్లు సేరి, సంభ్రమాయత్తుండగు=ప్రేమాధీనుఁడగుచున్న, విష్ణుచిత్తు=పెరియాళ్వారు యొక్క, ప్రయత్నంబున. తా. సుగమము.

క. శర్వాణీ వాణీ ముఖ, గీర్వాణీకోటి జాన ♦ కీరఘుకులరా,
ట్పూర్వాచరిత వివాహా, ఖర్వ సుగీతములు పాఁడ ♦ గా విభవమునన్. ౧౨౪.

టీ. శర్వాణీ=పార్వతియు, "శర్వాణీ సర్వమంగళా అనియమరము" వాణీ= సరస్వతియు, ముఖ=మొదలగు, గీర్వాణీ=దేవతాస్త్రీలయొక్క, కోటి=సమూహము, జానకీరఘుకులరాట్ = సీతారాములయొక్క, పూర్వాచరిత=తొల్లిఁజేయఁబడిన, వివాహ=కల్యాణమందలి, అఖర్వ=అతిశయములయిన, సుగీతములు=పాటలు, పాడఁగాన్= గానముసేయఁగా, విభవమునన్. తా. సుగమము.

తే. నెమ్మి నేకావళియు స్రగ్వి ♦ ణియును జామ, రంబులిరుగెడ నిడ హరి ♦ ద్రాద్రవమునఁ,
బెట్టిరి నలంగు లక్కన్యఁ ♦ బెండ్లికూఁతుఁ, జేయు ఋషిపత్నులర్థినా ♦ శీర్యుతముగ.

టీ. నెమ్మిన్ = మైత్రిచేతను, ఏకావళియు = మున్ను చెప్పఁబడినచెలికత్తియయైన యేకావళియును, స్రగ్విణియున్, ఇరుగెడన్=ఉభయపార్శ్వములయందు, (ఇది యేక వచనాంత ద్విగుసమాసము) చామరంబులు=వీచోఁపులు, ఇడన్ = సమర్పింపఁగా, హరిద్రాద్రవమునన్ = పసుపునీటిచేత, అర్థిన్=ఆసక్తిచేత, అక్కన్యన్=ఆయాముక్త మాల్యదాకన్యకను, పెండ్లికూఁతుఁజేయు, ఋషిపత్నులు=ఋషిభార్యలు, ఆశీర్యుతము గాన్=దీవనలతోడను, నలంగులు పెట్టిరి=ఉద్వర్తనము లాచరించిరి.

తా. సుగమము.

తే. అట్లు వైవాహికపు ♦ దీక్ష యమరఁ గమ్మ, నూనెఁ దలయంటి నెఱులు గం ♦ దానఁబులుమ,
స్వర్ణమణికుంభహిమవారి ♦ జలక మాడి, నట్టిజగదీశ్వరికి వేల్పు ♦ టబలమోర్తు. ౧౨౬.

టీ. అట్లు=ఆప్రకారము, వైవాహికపుదీక్ష=వివాహసంబంధదీక్ష, అమరన్= ఒప్పునట్లు, కమ్మనూనెన్=సుగంధతైలముచేత, తలయంటి=శిరోభ్యంగముఁజేసి, నెఱులు=

కురులు, గంధానన్ = శ్రీ చందనముచేత, పులుమన్ = పులుమఁగా, స్వర్ణమణి = బంగరు రతనాల వికారములగు, కుంభ = కలశములయందలి, హిమవారిన్ = పన్నీటిచేత, జలకమాడి నట్టి = మంగళస్నానమొనర్చినట్టి, జగదీశ్వరికిన్ = ఆయమ్మకు, వేల్పుటబలయోర్తు = ఒక్క దేవతాస్త్రీ యని ముందటి కన్వయము.

క. తడి యొత్తి సన్నవలిపం, బిడి మణిపీఠస్థయైన ♦ యింతి మెఱుఁగు పె,
న్నిడుదకురు లార్చి ధూపం, బిడెఁ దుఱుము ఘటించె నొకమృ♦గేక్షణ నెమ్మిన్.

టీ. తడియొత్తి = తడిఁదుడిచి, సన్నవలిపంబిడి = సన్నచీరఁగట్టించి, మణిపీఠస్థయైన = రత్నపీఠమందుఁ గూరుచున్న, ఇంతి = ఆముక్తమాల్యదయొక్క, మెఱుఁగు = మెఱుఁగారుచున్న, పెన్నిడుదకురులు = మిక్కిలి వాలికలగుకురులు, ఆర్చి = తేమార్చి, ధూపం బిడెన్ = ధూపమువేసెను, ఒక మృగేక్షణ = మఱియొక్క కురంగలోచన, నెమ్మిన్ = మైత్రిచేత, తుఱుముఘటించెన్ = కొప్పుఁబెట్టెను. తా. సుగమము.

సీ. యావకద్రవమున ♦ నరుణాంఘ్రినఖపఙ్క్తు లభ్యక్తములు సేసె ♦ నతివయోర్తు,
నయకల వ్రేళ్ల ♦ మట్టియలుఁ బిల్లాండ్లిడి పాయవట్టముఁ బెట్టెఁ ♦ బైనొకర్తు,
సెటికవట్టి పసిండి ♦ నీటివ్రాతచెఱంగు వెలిపట్టు రహిఁ గట్టె ♦ వెలఁదియోర్తు,
కటిసీమఁ గనకమే ♦ ఖలఁ జేర్చి తారహా, రములు గీలించెఁ గం ♦ఠమున నోర్తు,

గీ. కటకములు హస్తసరము లం ♦ గదము లంగు, ళీయకములును బాహువల్లి ♦ కల వ్రేళ్ల,
నిలిపి తాటంకనాసామ ♦ ణుల నమర్చి, చొనిపె సీమంతవీథిఁ జే ♦ర్చుక్కయోర్తు. ౧౭౭.

టీ. అతివయోర్తు = మఱియొక దేవకన్యక, యావకద్రవమునన్ = లత్తుకనీటిచేత, అరుణ = మునుపే యెఱ్ఱనైయున్న, నఖపఙ్క్తులు = గోళ్లచాళ్లు, అభ్యక్తములుసేసెన్ = తడిపెను, ఒకర్తు = మఱియొకయంగన, నయకల = నాణెముగల, వ్రేళ్లన్ = పాదాంగుళుల యందు, మట్టియలును, పిల్లాండ్లు, ఇడి, పైన్ = మీఁదను, పాయవట్టము = పాదభూషణ విశేషమును, (పావడములనవచ్చును) పెట్టెన్ = ఉనిచెను, సెటికవట్టి = కుచ్చిళ్లుపట్టి, పసిండినీటివ్రాఁతచెఱంగు = బంగారు సరిగచేతఁ జిత్రించియున్న చెఱఁగుగల, వెలిపట్టు = తెల్లపట్టుచీర, రహిన్ = పొలుపుగాను, వెలఁదియోర్తు = మఱియొక్క కాంత, కట్టె, ఓర్తు = మఱియొక్క పొలఁతుక, కటిసీమన్ = పిఱుందుమీఁద, కనకమేఖలన్ = బంగారుగంటల యొడ్డాణమును, చేర్చి = అలంకరించి, కంఠమునన్, తారహారములు = ముత్తెపుఁబేరులు, కీలించెన్ = ఉనిచెను, ఓర్తు = మఱియొక్కతె, కటకములు = కంకణములు, హస్తసరములు =

చేసరములు, అంగదములు=భుజకీర్తులును, అంగుళీయకంబులు=ఉంగరములును, బాహానాళికల వ్రేళ్లన్ = వరుసగా బాహులతలయందును, వ్రేళ్లయందును, నిలిపి, తాటంకనాసామణులన్=కమ్మలు ముక్కరము త్తెమును, అమర్చి=పొసగించి, సీమంతవీథిన్ = పాపటత్రోవయందు, చేర్చుక్క=ముక్తాభూషణమును, చొనిపెన్=ఉనిచెను.

తా. సుగమము.

క. కలికి తెలిగన్నుఁగవఁ గ, జ్జలరేఖలు దీర్చి మేన•సారంగమదం,
బలఁది లలామక మిడి చెం, గలువలు క్రొవ్వెదకు వేత్రో•కర్త ఘటించెన్.౧౩౯.

టీ. కలికి=ఆ పెండ్లికూఁతుయొక్క, తెలిగన్నుఁగవన్ = ధవళాక్షిద్వంద్వమందు, కజ్జలరేఖలు = కాటుకరేఖలు, తీర్చి=దిద్ది, మేనన్=శరీరమందు, సారంగమదంబు = కస్తూరి, అలఁది = పూసి, లలామకము = చేర్చుక్క,(బొట్టుమీఁద శిరముననుంచుకొనెడు భూషణమైనదాని, "ప్రభ్రష్టకంశిఖాలంబి పురోన్యస్తంలలామకమ్" అనియమరము.)ఇడి= ఉంచి, వేత్రోకర్త= మతెయొక నాతి, క్రొవ్వెదకున్ = క్రొమ్ముడికి, చెంగలువలు= ఎఱ్ఱగలువపువ్వులు, ఘటించెన్ = కూర్చెను.

తా. సుగమము.

వ. ఇట్లలంకృతయైయుండ లగ్నం బాసన్నంబయ్యె నని విన్నవించుటయుఁ బన్నగశయనుండు మార్తండ మండలంబులు పంక్తిగొండును దివియలై వెలుంగఁ దారకలగుంపు జగజంపుగా శతపత్త్రశత్రుం డాతపత్త్రతయంగీకరింప సింధుపతి సౌగంధికదళోపహారసహితంబుగా విపణిఁ గలయంపిఁ జిలికింపఁ బ్రకృతికాంత క్రంత సురకాంతలం గూడుకొని సంతరింప హుతవహుం డగరుధూపంబు లేపఁ బర్జన్యుం డుల్లెడయిడఁ బ్రాచీనపాఠంబులు పాఠకాఘంబు లయి బిరుదప్రబంధంబులు పఠియింప విధినందన సనందనాదులు సంగీత మాంగల్యంబున నంతరంగంబున కింపొసంగ విహంగపుంగవుండు మత్తమాతంగంబై ఖచితమణికల్యాణంబగు పల్యాణంబంగీకరింప నప్రాకృతవైభవంబునం జని పరమసంభ్రమంబున భాగవతవతంసంబు భక్తికలితబహుప్రణామపూర్వకంబుగా నెదుర్కొన నెక్కిరింత డిగ్గి విష్వక్సేను కరం బవలంబించి కక్ష్యాంతరంబులం జంచలాక్షులు గడుగు నడుగుల జలంబులకుం బయిపయింబడి గీర్వాణ సిద్ధసంఘంబు లహంపూర్వికనుర్విని ద్వారిగా నూర్చికొని ప్రాశింపఁ బ్రవేశించి తదీయ నిర్దిష్టం బగు జాంబూనదపీఠంబున నుపవిష్టుండై యతండు వెండియు బంగారు భృంగారుకంబులఁ గనకభాజన నిక్షిప్తంబులగు కుశేశయ పేశల

ఫలకిసలయంబులుగడిగి షోడశోపచారసహితంబును సపరిష్క్రియంబునగు మధుపర్కంబు నాసంగంబు గొని యయ్యాళ్వారు దేవేరియుం దానును ధారవోయ నాకన్యకారత్నంబుం బరిగ్రహించె ననంతరంబ. ౧౩౦.

టీ. ఇట్లు = ఈప్రకారము, అలంకృతయైయుండఁగ = అలంకరింపఁబడినదై యుండఁగా, లగ్నంబు=వివాహముహూర్తము, ఆసన్నంబయ్యెనని=సమీపించెనని, విన్న వించుటయుఁ = విన్నపము సేయఁగానే, పన్నగశయనుండు=శేషశాయియగు రంగనాథుఁడు, మార్తండమండలంబులుపండ్రెండును = ద్వాదశాదిత్యమండలంబులు, దివియలై వెలుంగఁ=దివ్వటీలయి వెలుఁగఁగా, తారకలగుంపు=నక్షత్రసమూహము, జగజంపుగాఁ=కుచ్చులుకాఁగా (గొడుగుచుట్టునుండునవి) శతపత్త్రశత్రుండు = కమలవైరియైన చంద్రుఁడు, ఆతపత్త్రతయంగీకరింపఁ=ఛత్రముగాఁగా, సింధుపతి=సముద్రుండు, సౌగంధికదళోపహారసహితంబుగాఁ=ఎఱ్ఱగలువ రేకుల కానుకతోఁగూడ, విపణిఁ=అంగడివీథియందు, కలయంపిఁ=కళ్లాపిని, చిలికింపఁ=చల్లింపఁగా, ప్రకృతికాంత=మాయయనునాతి, సురకాంతలంగూడుకొని=దేవతాస్త్రీలంగలిసికొని, క్రంత=సమీపప్రదేశము, సంతరింపఁ = సవరణపఱుపఁగా, హుతవహుండు=అగ్నిదేవుఁడు, అగరుధూపంబు, రేఁపఁ=ఎగయింపఁగా, పర్జన్యుండు=వర్షదేవుఁడు, ఉల్లడయిడఁ=ఉల్లాభముఁబట్టఁగా, ప్రాచీనపాఠంబులు=ప్రాఁజదువులు, (వేదములనుట) పాఠకౌఘంబులై = వందిమాగధసంఘములై, బిరుదప్రబంధంబులు=బిరుదుఁగైవారములు, పఠింపఁ=చదువనగా, విధినందన=నారదుండు, సనందన=సనందునుండు, ఆదులు=మొదలగువారు, సంగీత మాంగల్యంబునఁ=సంగీతమంగళత్వముచేత, అంతరంగంబునకుఁ = మనస్సునకు, ఇంపొసంగఁ=మాధుర్యమొనర్పఁగా, విహంగపుంగవుండు=గరుత్మంతుఁడు, మత్తమాతంగంబై=మదపుటేనుఁగై, ఖచిత=కూర్పఁబడిన, మణి=రత్నములును, కల్యాణంబగు=బంగారుగలిగినట్టి, (వసుచంద్రందాహ్లవంచకల్యాణంభూరిహైరిక మని నిఘంటువు) పల్యాణంబు=పల్లమును, (చౌడోలనుట) అంగీకరింపఁ=వహింపగా, అప్రాకృత=లోకవిలక్షణమైన, వైభవంబునఁ=సంపదచేత, చని=వేంచేసి, పరమసంభ్రమంబునఁ = పరమానందముచేత, భాగవతవతంసంబు = భాగవతోత్తముఁడగు భట్టనాథుఁడు, భక్తి=భక్తితోడ, కలిత=కూడుకొన్న, బహుప్రణామపూర్వకంబుగాఁ=అనేకనమస్కారపూర్వముగా, ఎదుర్కొనఁ = ఎదురుకొలునకు రాఁగా, ఎక్కిరింతడిగ్గి=వాహనమును దిగి, విష్వక్సేనుకరంబవలంబించి = విష్వక్సేనుని కైదండగ్రహించి, కక్ష్యాంతరంబులఁ=ద్వారాంతరాళములయందు, చంచలాక్షులు=సువాసినులు, కడుగు=ప్రక్షాళనము చేయు, అడుగుల=శ్రీపాదములరొమ్ముక్క, జలంబులకుఁ =

తీర్థములకు, పయిపయింబడి = మీఁదమీఁదఁబడి, గీర్వాణ=వేల్పులయొక్క, సంఘంబులు=గుంపులు, అహంపూర్వికన్=ఓహోరి సాహోరిచేత, ఉర్వి=భూమి, నిర్వారిగాన్=నిర్జలమగునట్టుగా, ఊర్చికొని = దూఁటుకొని, ప్రాశింపన్=పానముసేయఁగా, ప్రవేశించి = చొచ్చి, తదీయ=ఆభట్టనాథసంబంధులచేత, నిర్దిష్టంబగు = నిర్ణయింపఁబడిన, జాంబూనదపీఠంబునన్=బంగరుపీఁటయందు, ఉపవిష్టుండై=కూరుచున్నవాఁడై, అతండు, వెండియున్=మరల, బంగారుభృంగారకంబులన్=బంగరుగిండ్లచేత, కనకభాజన=పసిఁడిపళ్లెరంబునందు, నిక్షిప్తంబులగు=ఉనుపఁబడిన, కుశేశయ=తామరపూవులవలెనే, పేశల=మృదువులైన, పదకిసలయంబులు=అడుగుఁజిగురులు, కడిగి=ప్రక్షాళనముఁజేసి, షోడశోపచారసహితంబును=ఆవాహనాసనపాద్యార్ఘ్యాచమనీయ స్నానవస్త్రయజ్ఞోపవీతగంధపుష్పధూపదీప నైవేద్య తాంబూలోత్తరనీరాజన మంత్రపుష్పాత్మకములగు షోడశోపచారములతోఁ గూడినట్టియు, సపరిష్క్రియంబునగు=అలంకారసహితమైనట్టి, మధుపర్కంబున్ =గుడయుక్తదధిని, ఒసంగన్ = సమర్పింపఁగా, కొని=గ్రహియించి, అయ్యార్యవర్యుఁడు=ఆభట్టనాథుఁడు, దేవేరియున్=ధర్మపత్నియు, తానును, ధారవోయన్=ధారాదత్తముసేయఁగా, ఆకన్యకారత్నంబున్=ఆకన్యారత్నమగు నాముక్తమాల్యదను, పరిగ్రహించెన్ = పాణిగ్రహణముసేసెను, అనంతరంబ=పదపడి.

తా. సుగమము.

మ. కలధౌతద్రవ చిత్రముల్మెఱయ ము ♦ క్తాస్యూత మా మేచకాం,
చలపుం బెందెఱ వారి లగ్నము సమా ♦ సన్నంబుగా వేల్పుబె,
ద్దలు వంపన్ గుడ జీరకంబులు సము ♦ ద్యత్ప్రేమ నన్యోన్య మం,
జులహస్తంబుల నుంచి రర్థిఁ గనుమిం ♦ చుల్చిట్లుము ట్టాడఁగన్. ౧౩౧.

టీ. కలధౌతద్రవ = బంగారునీటిచేతనైన, "కలధౌతంరౌప్యహేమ్నో" అని నిఘంటువు. చిత్రముల్=వింతపనులు, మెఱయన్=ప్రకాశింపఁగా, ముక్తా=ముత్తెములతోడ, స్యూతమా=కూర్పఁబడిన, మేచక=నల్లనగు, అంచలపు=అంచులుగల, పెందెఱ=పెద్దతెఱదుప్పటి, వారి=పట్టి, లగ్నము=ముహూర్తము, సమాసన్నంబుగాన్=మిగులడగ్గఱఁగా, వేల్పుఁబెద్దలు=బ్రహ్మాదిసురశ్రేష్ఠులు, వంపన్=క్రిందికొనవంచియుండఁగా, గుడజీరకంబులు=జీలకఱ్ఱబెల్లములు, సముద్యత్ప్రేమన్ = అగ్గలంపుఁబ్రేముడిచేత, అర్థిన్=ఆసక్తిచేత, కనుమించుల్=నేత్రతాళతళ్యములు, చిట్లుముట్టాడఁగన్ = సందడింపఁగా, అన్యోన్య=ఒండొరులయొక్క, మంజుల=సుందరములగు, హస్తంబులన్=కరములయందు, ఉంచిరి=ఉనిచిరి.

తా. సుగమము.

చ. మఱి వనమాలి చూడమున ♦ మానిని ముత్తెపుఁ బ్రాలు వోయుచో,
మెఱయుఁ దదంగుళీకిసల ♦ మేళనఁ జక్రి చెమర్చ రాలి పై,
నఱిమిఱి ఘర్మబిందువులు ♦ నమ్మణులు న్మొగులందు నుండి డా,
ల్గిఱిగొన జాలు ధారలబ ♦ లెన్వడగండ్లబలెన్ గనుంగొనన్, ౧౩౨.

టీ. మఱి=పిమ్మట, మానిని=ఆపెండ్లికూఁతురు, వనమాలిచూడమునన్=స్వామి శిరమందు, ముత్తెపుఁబ్రాలువోయుచోన్=ముత్తెములతలఁబ్రాలువోయునప్పుడు, తదంగుళీకిసల... తత్=ఆయమయొక్క, అంగుళీకిసల=చిగుళ్లవంటి వ్రేళ్లయొక్క, మేళనన్=కూడుకొనుటచేత, చక్రి=స్వామి, చెమర్పన్=చెమరింపఁగా, రాలి=స్రవించి, పైన్=స్వామి శరీరమందు, అఱిమిఱి=లెస్సైన, ఘర్మబిందువులున్=చెమ్మటబిందువులును, అమ్మణులున్=ఆముత్తెములును, మొగులందునుండి=మేఘములలోనుండి, డాల్గిఱిగొనన్=కాంతి వ్యాపించుచుండఁగా, జాలు=స్రవించుచున్న, ధారలబలెన్=వర్షధారలవలెను, వడగండ్లబలెన్=కరకములవలెను, కనుంగొనన్=చూడఁగా, మెఱయున్=ప్రకాశించును.

తా. స్వామి శరీరము నీలమేఘమువలె నున్నదనియును చెమర్చి చెమటబిందువులు రాలఁగా నవి వానచినుకులవలెను తలఁబ్రాలముత్తెములు వడగండ్లవలె నున్నవని యును భావము.

తే. ఇంతి దోయిట సేసఁబ్రా ♦ లెత్తుచోట, గుబ్బపాలిండ్లఁ గ్రేఁగ న్గ్ర ♦ క్కున మురారి,
కన్నువేయుటఁ గని లజ్జ ♦ గదుర బాహు, లెత్తక కరాగ్రములనె పై ♦ కెగఁజల్లె. ౧౩౩.

టీ. ఇంతి=వనిత, దోయిటన్=అంజలిచే, సేసఁబ్రాలు=తలఁబ్రాలు, ఎత్తుచోటన్=ఎత్తునప్పుడు, మురారి=రంగనాథుఁడు, గుబ్బపాలిండ్లక్రేఁగన్=ఉన్నతములగు స్తనములదిక్కున, గ్రక్కునన్=శీఘ్రముగా, కన్నువేయుటన్=కన్నువేసి చూచుటను, కని=తానుజూచి, లజ్జగదురన్=సిగ్గొలయఁగా, బాహులెత్తక=చేతులు పైకెత్తక, కరాగ్రములనె=కొనచేతులనే, పైకిన్=స్వామిపైకి, ఎగఁజల్లెన్. తా. సుగమము.

క. గళమునఁ గట్టెను హరి మం, గళసూత్రము పులకలతివ ♦ గాత్రముఁ బొదువన్,
వెలఁతయుఁ బతియును గరముల, నలఁతిచిరి కంకణంబు ♦ లన్యోన్యంబున్, ౧౩౪.

టీ. హరి, అతివగాత్రమున్=ఆయింతియొక్కమేనిని, పులకలు=రోమాంచములు, పొదువన్=వ్యాపింపఁగా, గళమునన్=కంఠమందు, మంగళసూత్రముఁగట్టెను, వెలఁతయున్=పతియును, అన్యోన్యంబున్=ఒండొరులకు, కంకణంబులు=ప్రతిసరములు, కరములన్=హస్తములయందు, అలఁతిచిరి=అమర్చిరి. తా. సుగమము.

సీ. లలనచే నిష్ఠతో లాజలు వేల్పించి శార్ఙ్గి మెట్టించెను ♦ సప్తపదులు,
తెలియఁగూడి యరుంధ ♦ తీ దర్శనముఁ జేసె బ్రహ్మరుద్రాది గీ ♦ ర్వాణకోటి,
యర్పించు నుడుగర ♦ లనుకంపఁ గైకొని యనిచెఁ బ్రసాదభా ♦ జనులఁ జేసె,
యాత్మపట్టణమున ♦ కతిపఁ దోడ్కొని విజయంబుసేసెను మహా ♦ హర్ష మెప్ప,

గీ. సహ్యకన్యాతటోద్యాన ♦ చందనద్రు, కుంజముల నీలకుంతలఁ ♦ గుస్తరించి,
కంతుసామ్రాజ్య మేలించి♦కరుణఁ జిత్త, మొలయ జగములఁ బాలించు ♦చున్నవాఁడు.

టీ. లలనచేక్=అయింతిచేత, నిష్ఠతోక్, లాజలువేల్పించి = లాజహోమమును, జేయించి, శార్ఙ్గి=స్వామి, సప్తపదులు, మెట్టించెను=త్రొక్కించెను, తెలియక్, కూడి, అరుంధతీదర్శనముఁజేసె, బ్రహ్మరుద్రాదిగీర్వాణకోటి, అర్పించు=సమర్పించునట్టి, ఉడుగిరలు=బహుమానములను, అనుకంపక్=కృపచేత, కైకొని, ప్రసాదభాజనులఁజేసి=అనుగ్రహపాత్రులనుజేసి, అనిచెక్=పంపెను, ఆత్మపట్టణమునకుక్=శ్రీరంగమునకు, అతిపఁదోడ్కొని=చూడికుడుత్త నాచ్చియారునుదోడుకొని, మహాహర్షమెప్పక్, విజయంబుసేసెను=వేంచేసెను, (ఇచ్చటనతివైభవంబుననాత్మపట్టణమునకతిపఁదోడ్కొనివిజయంబుసేసి యని పాఠాంతరముంగలదు) సహ్యకన్యా = కావేరీనదియొక్క, తట = దరులయందలి, ఉద్యాన=శృంగారవనములందలి,చందనద్రు=శ్రీగంధవృక్షములయొక్క,కుంజములక్=పొదరిండ్లయందు, నీలకుంతలక్=ఆముక్తమాల్యదను, గుస్తరించి=లాలించి, కంతుసామ్రాజ్యము=రతిపతిసామ్రాజ్యమును, ఏలించి=పరిపాలింపఁజేసి, (సురతక్రీడకుఁబ్రవేశింపఁజేసినాఁడనుట) చిత్తము,కరుణక్=దయచేతను, ఒలయక్=నిండఁగా,జగములక్=లోకములను,పాలించుచున్నవాఁడు=ఏలుచున్నవాఁడు. తా. సుగమము.



ఉ. స్కందసరస్తటీరమణ ♦ కందర చందన కుందవాటికా,
మందసమీరలోల వన ♦ మాలిక నిర్మలదివ్యవిగ్రహా,
స్పందివిభావరీకృత న ♦ భస్స్ఫటికాళిక వల్లవాంగనా,
బృందమనోభిమాన ధృతి ♦ భేదన పేశలవంశవాదనా. ౧౩౭.

టీ. స్కందసరః=స్వామిపుష్కరిణియొక్క, తటీ=దరియందలి, రమణ=మనోహరములగు, కందర=గుహలయందలియు, "దరీతుకందరోవాస్త్రీ" అని యమరము. చందన=హరిచందనవృక్షములయొక్క, కుంద=మొల్లలయొక్క, వాటికా=శ్రేణులయందలియు, మందసమీర=మందమారుతముచేత, లోల=కదలుచున్న, వనమాలిక=తులసీవనమాలగలిగిన

వాఁడా, నిర్మల=స్వచ్ఛమైన, విగ్రహ=శరీరముయొక్క, అస్పంది=చలింపని, విభా=కాంతి చేత, అధరీకృత=క్రిందుచేయఁబడిన, నభః=ఆకాశముయొక్క, స్ఫుట=వ్యక్తమైన, కాళిక=నలుపుగలవాఁడా, వల్లవాంగనా=గోపికలయొక్క, బృంద=గుంపుయొక్క, మనః=మనస్సులయందలి, అభిమాన=ఈలువులను, ధృతి=ధైర్యములను, భేదన=భేదించెడివాఁడా, పేశల=మృదువైన, వంశ=పిల్లఁగ్రోవియొక్క, వాదనా=వాయించుటగలవాఁడా. (ఈ పద్యమునందు స్కందపదము మొదలుగాఁ గాళికపదమునకుఁ దొక్క సమాసముగాను, వివిధ వల్లవాంగనాశబ్దము మొదలుగాఁ దుదవఱకు నొక్క సమాసముగాను కొందఱు చెప్పుదురు).

తా. సుగమము.

క. అరిధారాఖండిత మరు, దరిసంఘ విహంగవాహ ♦ నా యుదరమహాం,
బురుహ పుటభరిత మధుశం, బర భర జలమానుపాయ ♦ మానగ్రహిణా. ౧౩౪.

టీ. అరి=చక్రముయొక్క, ధారా=అంచులచేత, ఖండిత=త్రుంపఁబడిన, మరుదరిసంఘ=రాక్షససమూహముగలవాఁడా, విహంగవాహనా=గరుడవాహనా, ఉదర=నాభియందలి, మహాంబురుహ=పెందామరయొక్క, పుట=దొప్పయందు, భరిత=నిండింపఁబడిన, మధు=మకరందమునిరెడు, శంబర=ఉదకముయొక్క, భర=అతిశయమందు, జలమానుపాయమాన=నీరుపాపనలైనున్న, గ్రహిణా=బొజ్జగలవాఁడా.

స్రగ్విణి. వాలినిర్భేదనా ♦ వారిజాతేక్షణా, శైలకన్యాస్తుతా ♦ శార్ఙ్గసంధానస్ఫుటా,
ఫాలదృక్పద్మభూ ♦ పాకభేదిస్ఫుర, న్మౌళిమాణిక్యరు ♦ గ్ఖండితాంఘ్రిద్వయా.

టీ. సులభము.

మ. ఇది సింహాచలదంభకేసరిపదా ♦ భీష్టార్చనా పుణ్యల
బ్ధ దురుట్టంకణపొట్టునూరివిజయ ♦ స్తంభోపలోట్టంకితాం
క దృఢాష్టాక్షరకృష్ణరాయ ధరణీ ♦ కాంతాస్యనాముక్తమా
ల్యద నాశ్వాసపరంబు నాఱవది హృ ♦ ద్యంబై మహిం బొల్పుగన్. ౧౩౫

టీ. ఇది, సింహాచల=సింహాచలమందలి, దంభకేసరి=నృసింహస్వామియొక్క, పదాభీష్టార్చనా=ఇష్టమైనపాదపూజలయొక్క, పుణ్య=పుణ్యముచేత, లబ్ధ=పొందఁబడిన, దురుట్టంకణ=ఉట్టంకింపశక్యముగాని, (ఎన్నరానిదనుట) పొట్టునూరి, విజయస్తంభ=విజయస్తంభముయొక్క, ఉపల=శిలయందు, ఉట్టంకిత=చెక్కఁబడినట్టి, అంక=గుఱుతుచేత, దృఢ=దిట్టమైన, అష్టాక్షర=ఎనిమిదియక్కరములుగల, కృష్ణరా

యధరణీకాంత= కృష్ణరాయధరణీకాంతుఁడను, అస్మదాముక్తమాల్యదన్ = నాయాముక్తమాల్యదయందు, ఆశ్వాసవరంబున్, ఆఱిఁటియు, హృద్యంబై, మహిన్ = భూమియందు, పొల్పగున్ = ప్రకాశించును.

కొన్నిపుస్తకములలో దాసరియడుగఁగా నతనితో బ్రహ్మరాక్షసుఁడు తనవృత్తాంతము చెప్పఁదొడంగునంతవఱకు నాఱవయాశ్వాసము సమాప్తముగాను దక్కినపద్యము లేడవయాశ్వాసముగా నున్నది. అయినను బూర్వవ్యాఖ్యాతలెవరు నాయాశ్వాసాంతపద్యముల కర్థము వ్రాయమింబట్టి యీగ్రంథ మాఱాశ్వాసములే యని స్పష్టముగాఁ దెలియవచ్చుచున్నది. కనుక నారీతినే ముద్రింపఁబడియె.

గద్య. ఇది శ్రీదక్షిణామూర్తిమంత్రోపాసనా సమాసాదితాఖండ సాహితీధురీణుండును నాత్రేయగోత్రపవిత్రుండును వావిళ్లవంశపయోరాశిరాకాసుధాకరుండు నగు రామస్వామిశాస్త్రిచేత ననేక పూర్వవ్యాఖ్యానాభిప్రాయంబుల బర్యాలోచించి రచియింపఁబడిన రుచి సమాఖ్యానంబగు నాముక్తమాల్యదావ్యాఖ్యానంబునందు

షష్ఠాశ్వాసము.



సమాప్తము.